# బాలవ్యాకరణం

పరవస్తు చిన్నయసూరి

దిగ్దర్శినీవ్యాఖ్య

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

# బాలవ్యాకరణదిగ్దర్శిని

## ప్రణయనం 2001

Book is available for free download at
www.archive.org

You can reach the author at:

bhushanam54@yahoo.co.in

డాక్టర్ అంబడిపూడి నాగభూషణం

డాక్టర్ కొలచల వేంకటకృష్ణమూర్తి సంస్కృతకళాశాల

3-3 అరండల్ పేట, గుంటూరు-2

# నివేదనము

జననీజనకులు ఆదిలక్ష్మీప్రసాదులకు –
లక్షణాక్షరభిక్షఁ బెనిచి యాదరముతో నన్నివిషయములఁ బ్రోత్సహించు
మాపూజ్యగురువర్యులు డాక్టర్ బేతవోలు రామబ్రహ్మం గారికి –
పాదాభివందనములు.

ఈగ్రంథము కూర్పునకుఁ దోడ్పడినగ్రంథములకును,
తత్తద్గ్రంథకర్తలకును కృతజ్ఞతలు.

వివాదములు, చర్చలు మొద లైనవానికి ప్రసక్తి లేకుండ
విద్యార్థుల ఉపయోగము మాత్రమే ఉద్దేశించి
విద్యాలయపరీక్షలను దృష్టియం దుంచుకొని
అందుకు కావలసినఅంశములతో
దిక్ప్రదర్శనముగ ఈగ్రంథము కూర్పబడినది.

వ్యాకరణశాస్త్రముపై నభిమానము గలిగినవారికి,
అవసరము గలిగినవారికి,
ఇది ఏకొంచె మైన ఉపయోగించిన
ఈప్రయత్నము సార్థకమైన దని తృప్తిచెందుదు.

**అంబడిపూడి నాగభూషణం**

మానితపునడకపేరిమి
మానసమున కింపుc బెంప మనునంచలకున్
బో నిడి నీరసనీరము
జానుగ క్షీరంబు గొనుట సహజము కాదే.

- శ్రీ పరవస్తు చిన్నయసూరి.

# విషయానుక్రమణిక

# అకారాదిసూత్రానుక్రమణిక

(క్రియ. 92) ఇచ్చునకు సర్వంబున కీ యగు.

(కృత్. 2) ఇటం గృత్యగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు.

(క్రియ. 85) ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయిత్వంబున కుత్వం బగు.

(అచ్చి. 23) ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు.

(అచ్చి. 29) ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగా నగు.

(కారక. 11) ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు.

(తత్సమ. 48) ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు.

(క్రియ. 117)ఉన్న కల న వర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు.

(క్రియ. 30) ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు.

(తత్సమ. 73) ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు.

(ప్రకీ. 15) ఏతాదులకు మువర్ణకంబు పరం బగునపుడు దీర్ఘంబు విభాష నగు.

(అచ్చి. 17) ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు.

(కారక. 27) ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు.

(అచ్చి. 38) ఔపవిభక్తికములతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.

(తత్సమ. 51) కద్రువ నాగమాత.

(సంధి. 28) కర్మధారయంబునం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు.

(సంధి. 32) కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు.

(సమాస. 26) కర్మాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణములు కర్తతోడం బలె వానితోడ సమసించు.

(తద్ధిత. 11)కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు.

(తద్ధిత. 14) కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.

(కృత్. 1) కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.

(సంధి. 5) క్త్వార్థం బయినయిత్తునకు సంధి లేదు.

(క్రియ. 52) క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు.

(తత్సమ. 18) క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు.

(క్రియ. 20) జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు.

(క్రియ. 50) గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.

(తత్సమ. 58) చరిత్రాదులమువర్ణంబునకు లోపంబు బహుళంబుగా నగు.

(క్రియ. 108) చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు.

(కారక. 23) జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.

(ప్రకీ. 9) జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.

(తద్ధిత. 1) తనవర్ణకంబు త్వార్థంబునం దగు.

(తద్ధిత. 19)తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు.

(క్రియ. 25) తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టులబహువచనంబున కేకవచనం బగు.

(సమాస. 14) త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.

(సంజ్ఞ. 7) దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు.

(సంజ్ఞ. 15) దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

(సంజ్ఞ. 13) ద్రుతప్రకృతులు గానిశబ్దములు కళ లనంబడు.

(సంజ్ఞ. 12) ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు.

(సమాస. 24) ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు.

(సంధి. 15) ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలు బహుళంబుగా నగు.

(సమాస. 18) ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁ గాదు.

(సమాస. 13)ద్విరుక్తం బగుహల్లు పరంబగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు.

(సమాస. 20) నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

(క్రియ. 65) నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు.

(కారక. 16) నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు.

(ప్రకీ. 16) పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.

(ప్రకీ. 1) పదాద్యంబులు ఋ(లు) వర్ణంబులు రల తుల్యంబులు.

(తత్సమ. 22) పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు.

(క్రియ. 84) ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు.

(ఆచ్ఛి. 3) బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.

(ఆచ్ఛి. 14) బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకారలకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు.

(సమాస. 23) బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁదిమేనునకు బోఁడి యగు.

(కారక. 28) భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు.

(క్రియ. 113) భూతంబున లజికి లిడంతం బగునగుధాతు వనుప్రయుక్తం బగు.

(తత్సమ. 86) మహతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు.

(ఆచ్ఛి. 4) మహత్తు లగుమగాదులకుం గయిరాదులకును డు జగు, నుత్వంబు గాదు.

(తత్సమ. 78) మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు.

(సంధి. 36) సమాసంబునం బ్రాంతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.

(సమాస. 25) సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు.

(క్రియ. 66) సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు.

(ఆచ్ఛి. 26)సర్వనామక్రియాపదంబులబహువచనంబు మహత్తునకుం బోలె మహతికగు.

(లమాల. 6) స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు.

(తత్సమ. 85) స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు.

(తత్సమ. 59) స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁబడు.

(సంజ్ఞ. 14) హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును.

# అకారాదివివరణవాక్యానుక్రమణిక

తత్స. 78 అమహత్త్వంబునందు .. రాజము... వృక్షరాజము.

ఆచ్ఛి. 29 అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు.

ఆచ్ఛి. 29 అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు.

సమా. 3 అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదప్రధానంబు లయియుండు.

ప్రకీ. 1 ఆబుషి – ఇట యడాగమము లేదు.

క్రియ. 76 ఆఁగుప్రభృతు లుభయగణంబులు.

సంధి. 2 ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.

సంధి. 4 ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడి.

కార. 13 ఆపంచమికిం గంటెవర్ణకం బగు నని యర్థము.

తద్ధి. 23 ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు.

క్రియ. 6 ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకం బగు.

క్రియ. 1 ఇంక నెయ్యది యుపక్రమింపఁబడు నయ్యది ధాతువున కగు నని యెఱుంగునది.

సంధి. 41 ఇంచుక నాఁ డిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షర లోపంబు నగు.

క్రియ. 50 ఇంచుగ్వ్యవధానంబునంజేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది.

సంజ్ఞ. 1 ఇం దకారాదు లచ్చులు.

సంధి. 30 ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది.

క్రియ. 8 ఇందు ఇకారంబు ప్రత్యాహారార్థంబు.

ప్రకీ. 16 ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు.

కృత్. 3 ఇకకపులు పరంబు లగునపుడు కనునకు దీర్ఘం బగు.

క్రియ. 18 ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తుల యనుసూత్రముచే రుఙ్ఞ్న కిత్వంబు.

కార. 34 ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు ననుసూత్రముచేత వునుల కిత్వం బగు.

తత్స. 44 ఇకారాంతములకు గ్లౌరైశబ్దములకు మఱి యుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపం బగు.

తత్స. 64 ఇగ్లౌసూత్రముచేతం బ్రథమైకవచనంబునకు లోపంబు.

సంజ్ఞ. 10 ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లే వని తాత్పర్యము.
క్రియ. 46 ఈకార్యము కర్తృవాచిమువర్ణమునకుఁ గలుగదు.
సంధి. 13 ఈకార్యముకళ లగుక్రియాపదములమీఁద సహితము కానంబడియెడి.
సంధి. 51 ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి.
క్రియ. 65 ఈజ్ఞాపకంబుచేతనె నామంబులకుం గొన్నింటికి ధాతుత్వవివక్షయం దించుగాగమం బగు నని యెఱుంగునది.
సమా. 5 ఈనియమముచే బల్లిదుఁడు మల్లుఁడు, కావలుఁడు రావణుఁడు ఇత్యాదుల సమాసంబు లేదు.
కార. 9 ఈపంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు.
తద్ధి. 15 ఈప్రత్యయాంతంబు మగాదిగణంబు.
సంజ్ఞ. 22 ఈభాష ప్రయోగంబున కనర్హంబు.
క్రియ. 92 ఈయ యనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి.
సంధి. 9 ఈయవి యిఁకాదు లని యెఱుంగునది.
సంధి. 25 ఈయాగమం బొకానొకచోట స్థిరంబు పరం బగుచోఁ గానంబడియెడి.
క్రియ. 71 ఈయాదేశయోగంబున భిదాదు లకర్మకంబు లగు.
సంధి. 20. ఈలోపంబు పద్యాంతంబులయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయియుండు.
ఆచ్ఛి. 21 ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు.
కార. 1 ఈవాక్యమందు నాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచకం బగురావణశబ్దంబునకుం బ్రథమ యయ్యెను.
కార. 1 ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచకం బగురామశబ్దంబునకుం బ్రథమ యయ్యె నని యెఱుంగునది.
తత్స. 76 ఈశబ్దము చతుర్ముఖబుత్విగ్విప్రులకు వాచకంబు.
సంధి. 40 ఈసూత్రమునకు భృశార్థంబునందు ద్విరుక్తి విషయం బని యెఱుంగునది.
తద్ధి. 15 ఉక్కివంబునకు వలోపంబు నగు.
తత్స. 68 ఉగాగమంబు లేమింజేసి యిట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచనలోపంబు లేదు.
తత్స. 68 ఉగాగమాంతంబుల కిగ్లొసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు.
క్రియ. 13 ఉదంతం బయినధాతువునకు లిట్టు పరం బగునపుడు ఉన్న అనుశబ్దం బనుప్రయుక్తం బగు.
సంధి. 45 ఉదంతంబు లగుతద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లే దనియు నిదంతంబు లగుతద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యం బనియు

బహుళగ్రహణముచే నెఱుంగునది.

క్రియ. 45 ఉన్నవర్ణకంబు వర్తమానార్థకశత్రర్థంబునం దగు.

సంజ్ఞ. 10 ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము.

సమా. 3 ఉపమానోత్తరపదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులు లే వని యెఱుంగునది.

తత్స. 78 ఉపసర్జనత్వంబునందు హతరాజుఁడు పరశురాముఁడు.

తత్స. 46 ఉపోత్తమేత్త్వంబున కనుటంజేసి జిగి, నిసి ఇత్యాదులం దుత్వంబు లేదు.

సమా. 2 ఉభయంబులు గూడినది మిశ్రం బనంబడు.

అచ్చి. 16. ఉల్లోపంబు.

తత్స. 73 ఋత్విగాదికం బాకృతిగణంబు.

తత్స. 79 ఋత్విగాది యగుటంజేసి యింద్రజితుం డనియు వాడంబడు.

క్రియ. 66 ఋస్థానికం బగుగుణంబు రపరం బయియుండు.

సంజ్ఞ. 2 ఎఏఒఓలు వక్రము లని ఐఔలు వక్రతమము లని ప్రాచీనులు వ్యవహరింతురు.

సంధి. 44 ఎందుశబ్దమున కలిగాగమంబు కొందఱు లే దండ్రు.

కార. 13 ఎచట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు గలిగియుండు నచటం బంచమి యగు.

క్రియ. 47 ఎడి ప్రభృతివర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు.

క్రియ. 105 ఎడియెడులకు లోపం బిట నిత్యంబు.

సంధి. 10 ఏఁగి యేఁగి యనుచో క్త్వార్థం బగుట సంధి లేదు.

క్రియ. 99 ఏఁచునకు వైభాషికంబు.

అచ్చి. 15 ఏండ్లు కాం డ్లిత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి.

తత్స. 11 ఏకత్వసంఖ్యను బోధించుప్రత్యయం బేకవచనంబు.

క్రియ. 50 ఏకస్వరధాతుద్విస్వరధాతువులమీఁదియుంచుగ్వర్ణంబుల కియుడాగమంబు విభాష నగు.

సంధి. 30 ఏకాంతమునందు నున్నజవరాండ్ర నని ప్రయోగము.

క్రియ. 38 ఏకాశ్రయంబు లగుక్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచి యగుధాతువున కివర్ణకం బగు.

కార. 37 ఏనిప్రభృతిశబ్దంబులు గొన్ని నియమసాపేక్షంబు లయియుండు.

సంజ్ఞ. 18 ఏళులు పాళులు త్రాళు లని బహుత్వమందు రలడల కాదేశ మయినళకార మలఘువు.

సంధి. 17 పక్షంబున స్వత్వం బగు.
క్రియ. 90 పత్వంబు రానిపక్షమున వక్ష్యమాణతాదేశంబు.
క్రియ. 87 పత్వంబు హెచ్చునకుం గలుగదు.
సంధి. 38 పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వం బగు.
కార. 2 పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మం బయ్యె నని యెఱుంగునది.
ప్రకీ. 20 పూనుపాదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.
సంధి. 1 పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.
కార. 37 పూర్వ మిది పర మిది యనునియమ మపేక్షింపక వాక్యమం దెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపఁదగును.
తత్స. 34 పూర్వసూత్రముచేత దీర్ఘంబు.
తత్స. 42 పూర్వసూత్రముచేత ముగాగమంబున కీకార్యంబు.
సమా. 1 పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యంబు.
సమా. 1 పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబున కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము.
తద్ధి. 28 పెండ్లిశబ్దమునకు మతుబర్థంబునం దముప్రత్యయంబు.
సంజ్ఞ. 23 పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపఁదగు నని తాత్పర్యము.
సంజ్ఞ. 18 పెరు కరు గిత్యాదులందు రేఫంబు లఘువు.
క్రియ. 123 పొందు మొద లయినవి గత్యర్థకంబులు.
తద్ధి. 1 ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు.
తత్స. 10 ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.
సంధి. 9 ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.
క్రియ. 121 ప్రాదు లిరువదిరెండు నుపసర్గంబులు నాఁబడు.
కార. 6 ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.
సమా. 3 ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబు దొడరనిసమాసంబుం గల దని సూచింపంబడియె.
కార. 4 ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు.
తత్స. 12 బహుత్వసంఖ్యను బోధించుప్రత్యయంబు బహువచనంబు.
క్రియ. 60 బహుళం బనుటచే దీనికి నొకానొకచో నతిచారం బని యెఱుంగునది.
క్రియ. 53 బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు.

సమా. 7 మగఁడును బిడ్డలును, పల్లమును గళ్లెమును ఇత్యాదులు సమసింప వని యీనియమంబున నెఱుంగునది.

తద్ధి. 28 మతుబర్థంబునం దప్రత్యయంబు.

అచ్చి. 16 మద్యనిమ్నార్థకంబు లయిన కల్లు, పల్లు, శబ్దంబులును ఱెల్లు ప్రభృతి శబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.

సంజ్ఞ. 10 మఱియు రాజు శబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి.

తత్స. 71 మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు, గుణవంతురాలు, విద్వాంసురా లనియుఁ బ్రయోగింపఁదగు.

అచ్చి. 3 మహత్త్వంబున వీని కుత్త్వడుజాదులు నమహత్త్వంబున ముర్ణకాదులును స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుం గలుగు నని యెఱుంగునది.

తత్స. 13 మిగిలినప్రత్యయము లేకత్వబహుత్వబోధకము లని యర్థము.

సమా. 15 ముచ్చోటులు–ముచ్చొటులు–ముచ్చటులు–అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

అచ్చి. 23 ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి.

తత్స. 41 ముర్ణకంబునకు విధించులోపాదేశాదికార్యములు ముగాగమమునకు సహితము వచ్చు నని యర్థము.

క్రియ. 87 మెచ్చునకు విభాష నగు.

అచ్చి. 16 రోఁకలిప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది.

తద్ధి. 7 ఱికాదులు రానిపక్షమునఁ దనప్రత్యం బన్నింటి కగు.

క్రియ. 8 లడాదిలకారంబులం దొక్కొక్కటికి డుజాదు లాదేశంబు లగు.

క్రియ. 123 లాఁతిచో సహిత మిక్కార్యంబు గానంబడియెడి.

క్రియ. 72 లాదేశంబున కపవాదంబు.

క్రియ. 16 లిడాదేశం బగుడుజునకు ఎను అనునదియు లాడాదేశం బగుడుజునకు ను అనునదియు నాదేశంబు లగు.

క్రియ. 19 లృట్టు పరం బగునపుడు ధాతువునకు కలజి అనునది యనుప్రయుక్తంబగు.

క్రియ. 101 లేచునకు ముజు పరం బగునపుడు చులోపం బగు.

కృత్. 9 వండుడకారంబు టకారం బగు.

క్రియ. 94,100 వక్ష్యమాణంబు ద్విత్వంబు.

క్రియ. 73 వక్ష్యమాణంబు పుగాగమంబు.

ప్రకీ. 4 వక్ష్యమాణంబు యద్విత్వంబు.

క్రియ. 99 వక్ష్యమాణం బైత్వంబు.

క్రియ. 24 వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో
సకర్మకంబునకుం బంద్రెండు, నకర్మకంబునకుం దొమ్మిదియు
భేదంబు లని యూహించునది.

సంధి. 4 వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకంబుచేతనె యని యూహించునది.

తత్స. 82 వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా
సలోపస్త్రీవద్భావములు దీచే నిపతింపఁబడియె.

సంజ్ఞ. 17 వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము
వువూవో వర్ణాదు లగుశబ్దములు లే వని యెఱుంగునది.

కృత్. 22 వ్యతిరేకంబున లేవడి.

క్రియ. 37 వ్యతిరేకవిశిష్టక్రియావృత్తి యగుధాతువునకు లజివర్ణకం బగు.

క్రియ. 37 వ్యతిరేకవిశిష్టక్రియాభిధాయిధాతువునకు మిజి యగు.

సంధి. 37 వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకుసంశ్లేషంబు లేదు.

సంజ్ఞ. 18 శకటరేఫము తత్సమతద్భవములందు లేదు.

తత్స. 67 శ్వశబ్దంబు దప్ప నకారాంతము లెల్లం బ్రథమైకవచనతుల్యంబులే
యని యెఱుంగునది.

సంధి. 17 సంశ్లేషం బనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట.

క్రియ. 63 సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమం బగు.

క్రియ. 66 సంస్కృతధాతూపధలగు ఇ–ఉ–ఋ అనువానికి సొరిదిని
ఏ–ఓ–అర్ అనునవి యించుక్కు పరం బగునపు డగు నని యెఱుంగునది.

తత్స. 34 సంస్కృతనామం బనుటంజేసి ఓతమ్ముఁడ, ఓబల్లిదుఁడ ఇత్యాదులందు
లోపంబు లేదు.

సమా. 2 సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు నాఁబడు.

సంధి. 2 సంస్కృతీయంబునకు సంధి యగు నని యథర్వణాచార్యులు చెప్పిరి
గాని దానికిఁ బూర్వకావ్యములందుఁ బ్రయోగంబు మృగ్యంబు.

క్రియ. 124 సకర్మకంబునకు స్వార్థప్రేరణార్థబులు రెండును గొను పద్వనుబంధంబులం
దొక్కొక్కటితోడం గూడుచో నగునవి యాఱుం గూడ రూపంబులెనిమి దయ్యె.

క్రియ. 48 సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు.

క్రియ. 33 సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటంజేసి
చైత్రునితోడ మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధం బయ్యె.

క్రియ. 33 సమానాశ్రయంబు లగుక్రియయలోపల నెయ్యది పూర్వకాలికం బగుం
0దద్వాచి యగుధాతువున కిత్వం బగు.

తత్స. 87 సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబు లగు.

తత్స. 83 సలోపం బయ్యె నేని – మనము.

సంధి. 25 సరళంబులు పరంబు లగునపుడు
లోపసంశ్లేషబిందువులచేత మూఁడురూపంబులు.

తత్స. 33 సర్వత్ర యనుట నగాగమబాధనార్థము.

సంధి. 24 సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ద్రుతాంతం బయినయవ్యయంబు.

సమా. 2 సాంస్కృతికం బని యాచ్ఛికం బని మిశ్రం బని సమాసంబు త్రివిధంబు.

సమా. 3 సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు.

క్రియ. 45 సుబంతవాచ్యంబు సత్త్వంబు నాఁబడు.

తత్స. 75 స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్త్వడుజులు లే వని యెఱుంగునది.

ఆచ్ఛి. 2 స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును
గ్లీబసమత్వాతిదేశంబుచే ముువర్ణకంబు నగు నని యెఱుంగునది.

సంధి. 17 స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము.

తత్స. 59 స్వర్గివాచి యనుటచే భూదేవులు భూసురుఁ డనుప్రయోగంబులు రక్షితంబు
లయ్యె.

సంజ్ఞ. 18 హరి యతఁడు ఇత్యాదులం దాగమయకారము లఘువు.

సంజ్ఞ. 17 హరి యతఁడు, నిద్ర వోయె నిట్టిచోట్ల సంధివశంబున
వచ్చినయకారవకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావు.

గ్లీబసమత్వాతిదేశంబుచే ముువర్ణకంబు నగు నని యెఱుంగునది.

సంధి. 17 స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము.

తత్స. 59 స్వర్గివాచి యనుటచే భూదేవులు భూసురుఁ డనుప్రయోగంబులు రక్షితంబు
లయ్యె.

సంజ్ఞ. 18 హరి యతఁడు ఇత్యాదులం దాగమయకారము లఘువు.

సంజ్ఞ. 17 హరి యతఁడు, నిద్ర వోయె నిట్టిచోట్ల సంధివశంబున
వచ్చినయకారవకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావు.

# బాలవ్యాకరణం

## సూత్రవ్యాఖ్యానం - సంజ్ఞాపరిచ్ఛేదం

**1. దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు : (7)**

దంతములందు పుట్టినది. అంటే నాలుక దంతా (మూలం) లను స్పృశించడంవల్ల పుట్టే ధ్వనిని తెలిపేవర్ణం దంత్యం. అలాగే తాలువునందు పుట్టినది, అంటే నాలుక తాలువును స్పృశించడంవల్ల ఏర్పడేవర్ణం తాలవ్యం. తాలువు అంటే నోటిలోపల పైభాగంలో ముందరిదంతాలకు లోపలివైపున కొంచెం పైన ఉండేప్రదేశం. అచ్చతెలుగులో చజలు దంత్యా లనీ తాలవ్యా లనీ రెండు విధాలు. చజలు ఇ ఈ ఎ ఏ అనేఅచ్చులతో కలిసినపుడు తాలవ్యాలు. అ – ఆ – ఉ – ఊ – ఓ – ఓ – ఔ అనేఅచ్చులతో కలిసినపుడు దంత్యాలు. ఏఅచ్చుతో కూడినా చజలు సంస్కృతంలో (సంస్కృతసమాల్లోనూ) తాలవ్యాలే అవుతాయి. సవర్ణాలు అంటే సమాన మైన (ఒకే) వర్ణాలు. దంతాలూ, తాలువూ అనేవిధంగా ఈవర్ణాలకు ఉత్పత్తిస్థానం భిన్నం గావడంవల్ల అచ్చతెలుగువర్ణమాలలో దంత్యచజలూ, తాలవ్యచజలూ వేరుగా పరిగణింపబడ్డాయి. అయినా దంత్యతాలవ్యా లైనఈచజలు సవర్ణా లని యీసూత్రం చెపుతున్నది.

సవర్ణాలుగా చెప్పడంవల్ల శాస్త్రంలో తాలవ్యచకారం ఉచ్చరింపబడినచోట ఆతాలవ్యచకారం దంత్యచకారాన్ని గూడ గ్రహిస్తుంది. అలానే సూత్రంలో ఉచ్చరింపబడిన తాలవ్యజకారం దంత్యజకారాన్ని గ్రహిస్తుంది. అంటే తాలవ్యచజలకు విధించినకార్యాలు దంత్యచజలకు కూడా వస్తాయి.

'కచటతపలు పరుషంబులు' ఈసూత్రంలో ఉన్నతాలవ్యచకారం ప్రస్తుత సవర్ణతవల్ల దంత్యచకారాన్ని గూడ బోధిస్తుంది. అందువల్ల ఈసూత్రంచేత తాలవ్య చకారానికి విధింపబడిన పరుషం అనేసంజ్ఞ దంత్యచకారాని క్కూడా సిద్ధించి, అదీ పరుషమే అవుతుంది. (కాబట్టి స్థిరం కాదు.) అలాగే 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత యథాసంఖ్యంగా తాలవ్యచకారానికి వచ్చే

సకారాదేశం దంత్య చకారాని క్కూడా వస్తుంది. అపుడు + చనియె = అపుడు సనియె.

అలాగే దంత్యతాలవ్యజకారాల సవర్ణతవల్ల 'గజడదబలు సరళంబులు' అనే సూత్రంలోని తాలవ్యజకారం దంత్యజకారాన్ని బోధిస్తుంది. అందువల్ల ఈసూత్రంచేత తాలవ్యజకారానికి విధింపబడిన 'సరళం' అనేసంజ్ఞ దంత్యజకారానికి గూడా సిద్ధించి అది గూడా సరళమే అవుతుంది. (కాబట్టి స్థిరం కాదు.)

**2. ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు. (12)**

చూ. ద్రుతప్రకృతికములు. వ్యాసప్రశ్న.

**3. ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు.** (13)

చూ. కళలు –వ్యాసప్రశ్న.

**4. హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగ నగును.** (14)

ఒకమాత్ర (సెకనులో ఐదోవంతు) సమయంలో ఉచ్చరింపబడేఅచ్చు హ్రస్వం. అ. ఇ. మొ. ఖండబిందువు అంటే అరసున్న. పూర్ణబిందువు అంటే నిండుసున్న. విధింపబడినకార్యం రావడం, రాకపోవడం అనే రెండుస్థితులు కలిగిఉండడం వైకల్పికం. హ్రస్వం, దీర్ఘం అనేభేదం అచ్చులకి మాత్రమె. 'ఖండబిందువునకు' అనేచోటిషష్ఠీవిభక్తిచేత 'షష్ఠీ స్థానే యోగా' అనేసంస్కృతపరిభాష ననుసరించి ఖండబిందువుస్థానంలో (ఆదేశంగా) అనేఅర్థం వస్తుంది.

హ్రస్వ మయినఅచ్చుకు తరువాత ఉన్నఅరసున్న స్థానంలో వికల్పంగా నిండుసున్న వస్తుం దని సూత్రానికి అర్థం.

'అడఁకువ' ఇక్కడి అరసున్న స్థానంలో ప్రస్తుతసూత్రంచేత నిండుసున్న వచ్చినపక్షంలో అడంకువ అని అవుతుంది.

'హ్రస్వముమీఁది' అనడంచేత దీర్ఘంమీఁద అరసున్నకు నిండుసున్న రాదు. చీఁకటి.

'ఖండబిందువునకు' అనడంచేత హ్రస్వంమీద ఉన్నపూర్ణబిందువుకు మార్పు లేదు. బంతి.

'ఖండబిందువు' అని సామాన్యంగా చెప్పడంవల్ల అడఁకువ ఇత్యాదుల్లోని సిద్ధ ఖండానికే కాక, సాధ్యఖండానికి కూడా పూర్ణబిందువు వస్తుంది. వీఁటిఁడి. ఇక్కడ 'ఇఁడి' ప్రత్యయం శాస్త్రం సాధించింది. కాబట్టి అందులో అరసున్న సాధ్యం. దీనికీ ఈసూత్రంచేత నిండుసున్న వచ్చి వీటిండి అవుతుంది. ఇలాగే మూఁడెఁడు, మూఁడెండు.

'వైకల్పికముగా' అనడంవల్ల ఒకపక్షంలో పూర్ణబిందువు రాదు. అపుడు అరసున్న అలాగే ఉండి, అడఁకువ అనేరీతిరూపాలు పాక్షికంగా ఉంటాయి.

**5. దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.** (15)

రెండు (అంతకంటె ఎక్కువ) మాత్రలకాలంలో ఉచ్చరింపబడేఅచ్చు దీర్ఘం. పూర్ణము అంటే నిండుసున్న. సాధ్యము అంటే వ్యాకరణంచేత సాధింపబడినది. దీర్ఘ మైనఅచ్చుకు పైన, వ్యాకరణంప్రకారం (సాధింపబడే) రావలసినపూర్ణబిందువు రాదు. అని సూత్రానికి అర్థం.

రేఁగులు. రేను అనేప్రాతిపదిక ప్రథమాబహువచనంలో లువర్ణకం వచ్చి రేను +లు అని ఉండగా, 'అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గు జగు' అనేసూత్రంచేత రేనులోని నువర్ణం స్థానంలో 'గుజ్' వస్తుంది. గుజులో జ కారం ఇత్తు. కాబట్టి 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత గువర్ణానికి పూర్వంలో అరసున్న వస్తే రేఁగులు. బిందు వని సామాన్యంగా చెప్పడంచేత నిండుసున్న కూడా రావాలి. లక్షణసాధ్యం కావడంవల్ల అది సాధ్యపూర్ణం. పూర్ణబిందువు వస్తే 'రేంగులు' అనే విధంగా 'రే' అనేదీర్ఘం మీద ఉండాల్సివస్తుంది. ప్రస్తుతసూత్రం దీర్ఘ మ్మీద సాధ్య మైనపూర్ణం ఉండ దని నిషేధిస్తున్నది. కాబట్టి నిండుసున్న రాదు. రేంగులు అని కాదు.

'దీర్ఘముమీఁద' అనడంచేత హ్రస్వంమీద సాధ్యపూర్ణబిందువు ఉండవచ్చు. రామచంద్రుండు – పూచెం గలువలు మొ.

సాధ్య (పూర్ణము) అనడంచేత దీర్ఘంమీద నైనా సిద్ధపూర్ణబిందువు ఉండవచ్చు. కాంచు – వాంచు. మొ.

(సాధ్య) పూర్ణము అనడంచేత దీర్ఘ మ్మీద సాధ్య మైనఖండబిందువు ఉండవచ్చు. వాఁడు – రేఁగులు.

ఈవిధానంవల్ల దీర్ఘంమీద సిద్ధ (సాధ్య) ఖండబిందువూ, హ్రస్వంమీద సిద్ధమూ, సాధ్యమూ అయిన ఖండపూర్ణబిందువులు ఉండడంలో బాధ లేదు. చీఁకటి.

అరఁటి – రాముఁడు – బంతి – అరంటి మొ.

**6. యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు.** (17)

'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దంబులయందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది' అనేపూర్వసూత్రంనుంచి 'సంస్కృతసమేతరంబు

లయిన' అనేపదం ప్రస్తుతసూత్రంలోకి వచ్చి అన్వయిస్తుంది. 'వువూవొవో' అంటే ఉఊఒఓలతో గూడిన'వ'ఏకారం.

సంస్కృతసమంకంటే వే రైనఅచ్చతెలుగుశబ్దాలలో పదం మొదట, (ఏఅచ్చుతో గూడి ఐనా) యకారమూ, ఉఊఒఓ అనేఅచ్చులలో గూడినవకారమూ ఉండవు. అని సూత్రానికి అర్థం.

ఉచ్చారణంలోనిదోషాన్ని సవరించడానికి ఈసూత్రం ప్రారంభింపబడింది. తెలుగులో పదం మొదటఉన్న ఇ,ఈ,ఎ,ఏ, అనేఅచ్చులు యి,యీ,యె,యే అనేవిధంగా ముందర యకారంతో కలిసి ఉచ్చరింపబడుతున్నాయి, యితడు, యీమె, యెవరు యేమి. మొ. మిగిలినచోట్ల (అంటే ఇఈఎఏలకంటె వే రయినఅచ్చుతో గూడిన) యకారం అచ్చతెలుగుపదాలమొదట ఎప్పుడూ ఉండదు. అందుకే వువూవోలలాగా యియీయెయేలు లే వనకుండా యకారం లే దని సామాన్యంగా చెప్పబడింది. ఇఈఏఏలు కలచోట్ల వాటికి ముందు యకారం ఉచ్చరించటం తప్పు. కాబట్టి ఇ,ఈ,ఎ,ఏ అనేఅచ్చులే ఉండాలి.

అలాగే పదంమొదట ఉన్న 'ఉఊఒఓ' అనేఅచ్చులు వు,వూ,వొ,వో అనేవిధంగా ముందు వకారంతో కలిసి ఉచ్చరింపబడుతున్నాయి. ఆఉచ్చారణం గూడా తప్పే. వుండ, వూరు, వొకడు, వోడ, అనేవిధంగా వువూవొవోలు పలికేచోట్ల – ఉండ, ఊరు, ఒకడు, ఓడ అనేవిధంగా కేవలం అచ్చులు మాత్రమే ఉండాలి.

'యకారంబును' అనడంచేత ఏఅచ్చుతో కలిసి అయినా తెలుగుపదం మొదట యకారం ఉండదు. అతడు – ఇతడు మొ.

'వువూవొవోలును' అనడంచేత ఉ, ఊ, ఒ, ఓ అనేవాటికంటె వే రయినఅచ్చులతో గూడినవకారం పదంమొదట ఉండవచ్చు. వంకర, వీడు, వేయి మొ.

'తెలుఁగుమాటలు' అంటే సంస్కృతసమేతరా లయినతెలుగుమాటలు. కాబట్టి సంస్కృత సమా లయినతెలుగుమాటలలో పదంమొదట యకారం ఉండవచ్చును. యముడు, ఇష్టము, ఉదకము, మొద లైన సంస్కృతసమాల్లోనూ అయిష్టం, వుదకం అనేవిధంగా యియీయీయే, వువూవోలు ఉచ్చరించడం జరుగుతున్నది. ఇది తప్పు అనేవిషయం (ఈసూత్రాన్నిబట్టి కాక) సంస్కృతా న్ననుసరించి గ్రహించాలి. అనిష్టము, ఉదకము మొ.

సంస్కృతంలో 'వుకః – వోలికా' ఇత్యాదిగా ఉన్నపదాలు తెలుగులో ప్రవేశింపవు. కాబట్టి సంస్కృతసమాల్లో కూడా పదంమొదట 'వువూవో'లు ఉండవు.

మాటలకు' అనడంచేత పదాలు కానిప్రత్యయాదు లైనశబ్దాల్లో మొదట ఇవి ఉండవచ్చు. యొక్క (షష్ఠి) వు (ప్రథమావిభక్తి) మొ. రామునియొక్క, తరువు.

**7. యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు.** (18)

చూ. లఘ్వలఘుయరలవలు– వ్యాసం.

**8. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు.** (23)

ఆర్యులు అంటే పెద్దలు. నన్నయ మొ. మహాకవులు పెద్దలు. వ్యవహారము అంటే కావ్యంలో వ్యవహారం – మహాకవిప్రయోగం. లక్షణబద్ధ మైనపదం ఎవరు ప్రయోగించినా గ్రాహ్యమే. కాబట్టి పెద్దలగురించి చెప్పినయీవిశేషం లక్షణబద్ధం గాకున్నా, అంటే గ్రామ్యం అయినా గ్రహించా లని. 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అనేపూర్వసూత్రంనుంచి 'గ్రామ్యంబు' అనేపదం ఈసూత్రంలో అన్వయిస్తుంది. సూరి 'పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపఁ దగు' నని సూత్రతాత్పర్యాన్ని స్పష్టం చేశాడు.

మహాకవులకావ్యాలలోనిప్రయోగాలలో కనబడినపదం లక్షణానికి విరుద్ధం – గ్రామ్యం అయినప్పటికీ గ్రహింపదగినదే అని సూత్రానికి అర్థం.

'కఱకంఠుడు' కఱ అయినకంఠము కలిగినవాడు అనేఅర్థంలో 'కఱ' అనేఆచ్ఛిక శబ్దానికి 'కంఠం' అనేసంస్కృతసమశబ్దానికీ బహువ్రీహిసమాసం ఏర్పడింది. 'స్త్రీ సమఘటితంబ యొకానొకండు బహువ్రీహి...' అనేలక్షణాన్నిబట్టి స్త్రీసమా లయిన అచ్చతెలుగుశబ్దాలకు మాత్రమే బహువ్రీహి చేయవచ్చు. కాగా సంస్కృతసమంతో మిశ్ర బహువ్రీహి వ్యాకరణానికి విరుద్ధం. కాబట్టి గ్రామ్యం. కాబట్టి (కావ్యాలలో) ప్రయోగించటానికి అర్హం కాదు. అంటే గ్రహింపగూడదు. కాని ఈశబ్దం నన్నయ ప్రయోగంగా కనబడుతున్నది. కాబట్టి గ్రామ్య మైనా, నన్నయ ప్రయోగించిన కారణంగా గ్రాహ్యమె. కావ్యంలో ప్రయోగించుకోవచ్చు నని తాత్పర్యం.

ఇలాగే కపిలకన్నులు, కపిలగడ్డము, కపిలజడలు, అనేవాటిల్లో కపిల అనే కేవలసంస్కృతశబ్దానికి కన్నులు మొద లైన వికృతి(ఆచ్ఛిక)శబ్దంతో సమాసం లక్షణవిరుద్ధ మై, గ్రామ్యం కాగా, నన్నయ ప్రయోగించడంవల్ల గ్రాహ్యం. ప్రాణగొడ్డము అనేతిక్కన ప్రయోగం, జీవగఱ్ఱ అనేకవిసార్వభౌమునిప్రయోగం ఇలాంటివె.

మహాకవిప్రయుక్తాలు గ్రాహ్యాలు. కాబట్టి ఇవి గ్రాహ్యగ్రామ్యాలు అనవచ్చు. వీటినె అనింద్యగ్రామ్యాలు అంటారు.

'ఆర్యవ్యవహారంబుల' అనడంచేత మహాకవిప్రయోగం మాత్రమె గ్రహించాలి. ఆర్య – అనార్య నిర్ణయం కష్టమే. ఐనా కావ్యాలు వ్రాసినవా ళ్లంతా నన్నయాదులంతటివా ళ్లనలేం కదా. కాబట్టి సాధారణులప్రయోగాల్లోనిగ్రామ్యాలు గ్రాహ్యాలు గావు.

'దృష్టంబు' అనటంచేత కావ్యాలలో స్వయంగా చూచినపుడే గ్రహించాలి. కేవలం వినికిడినిబట్టి కాదు. అంటే గ్రామ్యాన్ని గ్రహించేసమయంలో చాల జాగరూకత వహించా లని తాత్పర్యం.

'గ్రాహ్యంబు' అనడంవల్ల మహాకవిప్రయోగాల్లో కనిపించినశబ్దాన్ని మాత్రమే గ్రహించాలి. ఆపద్ధతిలో స్వతంత్రంగా కల్పించగూడదు. కపిలకన్నులు ఇత్యాదిమార్గంలో అనేకమాఱులు, అల్పదండు అనేవిధంగా కల్పించుకొని స్వతంత్రంగా ప్రయోగించగూడదు.

# ౨ సంధిపరిచ్ఛేదం

**1. సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు.** (3)

పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి. స్వరం అంటే అచ్చు. యట్ + ఆగమ అనేచోట 'ట' కారం ఇత్తు, టకారం ఇత్తుగా గలిగింది, కాబట్టి 'య' అనేది టిత్తు. 'ఆద్యంతౌ టకితౌ' అనేసంస్కృతపరిభాష ననుసరించి టిత్తు అయిన 'య' అనే ఆగమం విధించినదానికి అంటే పరస్వరానికి ముందుగా వచ్చిచేరుతుంది. ఇత్తు గావడంచేత టకారం లోపిస్తుంది. మిగిలిన 'య'లోని అకారం ఉచ్చారణసౌకర్యానికి చేర్చబడింది. అందుచేత అకారం గూడా లోపిస్తుంది. కాగా మిగిలిన 'యకారంపొల్లు' మాత్రమే ఆగమం అవుతుంది. ఆగమం అంటే అదనంగా వచ్చిచేరడం.

సంధి లేనిస్థలాల్లో మొదటిశబ్దం చివరిఅచ్చుకు పరంగా ఉన్నతర్వాతిశబ్దం మొదటిఅచ్చుకు ముందుగా యకారపుపొల్లు ఆగమంగా వచ్చి చేరుతుంది అని సూత్రార్థం.

మా + అమ్మ అని ఉండగా ఇక్కడ ఏలక్షణం ప్రకారం గూడా సంధి రాదు. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత పరస్వరానికి ముందు యకారంపొల్లు చేరి, మా + య్ అమ్మ = మా యమ్మ అని యేర్పడుతుంది.

'సంధి లేనిచోట' అనడంచేత 'రాముఁ డతడు' అనేవిధ మైనసంధి ఉన్నస్థలాల్లో యడాగమం రాదు.

'స్వరంబుకంటెన్' అని ప్రత్యేకంగా చెప్పడంవల్ల హల్లుకంటె పరంగా ఉన్నస్వరానికి యడాగమం రాదు. నన్నున్ + అడిగె = నన్ను నడిగె. ద్రుతప్రకృతికాలమీద ఎపుడూ యడాగమం రాదు.

'పరం బయినస్వరంబునకు' అనడంచేత పరంగా అచ్చు లేకపోతే యడాగమం రాదు. రాముడు రక్షించును.

'అగు' అనడంచేత ఈఆగమం నిత్యం. 'మాఅమ్మ' అనేవిధంగా యడాగమం చేయకుండా ఉండడానికి వీలు లేదు.

'యగాగమ' మని కిత్తుగా పూర్వస్వరానికి అంత్యావయవంగా చెప్పకుండా, యడాగమం అని టిత్తుగా పరస్వరానికి ఆద్యవయవంగా చెప్పడంవల్ల 'అయ్యశ్వము'

ఇత్యాదుల్లో యకారానికి ద్విత్వం రావడంలో ఔచిత్యం ఉన్న దంటారు.

**2. అత్తునకు సంధి బహుళముగా నగు.** (4)

అత్తు – అత్ అని హ్రస్వ మైనఅకారానికి పరంగా తకారం చేర్చడం (తపకరణం) వల్ల 'తపర స్తత్కాలస్య' అనేసంస్కృతపరిభాష ననుసరించి అత్తు అంటే హ్రస్వ మైనఅకారం. ('క్వచిత్ ప్రవృత్తిః, క్వచి దప్రవృత్తిః, క్వచిద్ విభాషా, క్వచి దన్య దేవ విధే ర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి'.) ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగు విధాలుగా వర్తించడం బహుళం.

'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంనుంచి 'అచ్చు పరం బగునపుడు' అనేపదం 'సంధి లేనిచోట' అనేపూర్వసూత్రాన్ని తప్పించి మండూకప్లుతితో ఈసూత్రంలోకి వచ్చి అన్వయిస్తుంది.

హ్రస్వ మైనఅకారానికి అచ్చు పర మైనపుడు సంధి బహుళంగా వస్తుంది అని సూత్రానికి అర్థం.

**1. ప్రవృత్తి.** విధింపబడినకార్యం నిత్యంగా ప్రవర్తించడం. కొన్నిచోట్ల హ్రస్వ మైనఅకారానికి సంధి నిత్యంగా వస్తుంది. వచ్చుచున్న + వాడు. ఇక్కడ తచ్ఛబ్దవకారం లోపించి వచ్చుచున్న + ఆఁడు అని కాగా అత్తుకు సంధి నిత్యంగా వస్తుంది. వచ్చుచున్నాఁడు. 'వచ్చుచున్నయాఁడు' అనేవిధంగా సంధి రానిరూపం ఉండదు. ఇలాగే రాఁగలాఁడు (రాగలఁడు) వచ్చినాఁడు (వచ్చినవాఁడు) మొద లయినవి.

**2. అప్రవృత్తి :** విధింపబడినకార్యం అసలు ప్రవర్తింపకపోవడం అప్రవృత్తి. వెల + ఆలు మొద లైనచోట్ల అకారానికి సంధి ఎప్పుడూ రాదు. వెలయాలు, 'వెలాలు' అని సంధి జరిగినరూపం ఉండదు. స్త్రీవాచకాల్లోనూ, సంస్కృత సమాల్లోనూ, ఉన్నఅత్తుకూ, అలాగే సంబోధనం మొద లైనఅర్థవిశేషాల్లో వచ్చినఅత్తుకూ సంధి అసలు రాదు. అమ్మ యిచ్చెను, దూత యితడు మొద లయినవి.

**3. విభాష :** విధింపబడినకార్యం లక్ష్యంలో ఒకపర్యాయం ప్రవర్తించడం, మరొక పర్యాయం ప్రవర్తించకపోవడం.

మేన + అల్లుడు అనేచోట ఈసూత్రంచేత సంధి వచ్చినపక్షంలో మేనల్లుడు. సంధి రానిపక్షంలో 'సంధి లేనిచోట' అనేసూత్రంచేత యడాగమం వచ్చి – మేనయల్లుడు.

**4. అన్యకార్యం :** విధింపబడినకార్యంకంటే వేరైనకార్యం రావడం. తామర + ఆకు అనేచోట (సంధికంటె భిన్న మైన) పకారం ఆగమంగా వచ్చి, తామరపాకు.

బొమ్మ + ఇల్లు అనేచోట రేఫ ఆగమ మై, బొమ్మరిల్లు, మొద లయినవి ఇలా సాధించుకోవచ్చు.

'అత్తునకు' అనేతపరకరణంవల్ల దీర్ఘ మైనఆకారానికి సంధి రాదు. 'మా+అమ్మ' యడాగమం వచ్చి మాయమ్మ.

ఈసంధి 'అచ్చు పర మగునపుడు' కాబట్టి హల్లు పర మైతే రాదు. మేనకోడలు మెట్టినచోటు మొ.

**3. క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు. (5)**

'క్త్వా' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం క్త్వార్థం. ఆఅర్థంలో తెలుగులో 'ఇ' అనే ప్రత్యయం వస్తుంది. (భుక్త్వా = భుజించి) కాబట్టి ఇది క్త్వార్థం బైనయిత్తు. 'ఇత్' అనేచోటి తపరకరణంవల్ల ఇత్తు అంటే హ్రస్వ మైనఇకారం. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనే మొదటిసూత్రంనుంచి క్రమంగా 'అచ్చు పరం బగునపుడు' అనేభాగం ఈసూత్రంలో అన్వయిస్తుంది.

క్త్వాప్రత్యయంయొక్క అర్థంలో వచ్చినహ్రస్వ మయిన 'ఇ' కారానికి, (అచ్చు పర మైనపుడు) సంధి రాదు అని సూత్రాని కర్థం.

'ప్రాప్తిపూర్వకో హి నిషేధః' అనేసంస్కృతపరిభాష ననుసరించి దేని నైన నిషేధించాలీ అంటే అంతకు ముందు ఆకార్యం ప్రాప్తించాలి. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంచేత ఆమ్రేడితం పర మైనపుడు మాత్రమే క్త్వార్థకఇకారానికి సంధిప్రాప్తి ఉన్నది. కాబట్టి ఆమ్రేడితం పర మైనపుడు ప్రాప్త మయినఆసంధిని వారించడానికే ఈనిషేధం ప్రారంభింపబడింది. ఏఁగి + ఏఁగి = ఆమ్రేడితపరకస్వరసంధి రాక, యడాగమం వచ్చి, ఏఁగియేఁగి.

ఆమ్రేడితం కాకుండా ఇంక ఏది పర మైన, క్త్వార్థం బైనయిత్తునకు సంధి ప్రాప్తియే లేదు. 'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః' అనేన్యాయాన్ని అనుసరించి (అవసర మైనచోటితోపాటు అవసరం లేనిచోట గూడా మేఘం వర్షించేవిధంగా) అవసరం లేకపోయినా ఆమ్రేడితేతరస్థలాల్లో కూడ ఈనిషేధం వర్తిస్తుంది.

వచ్చి + ఇచ్చెను అని ఉండగా ప్రస్తుతసూత్రం నిషేధించడంవల్ల సంధి లేదు. కాబట్టి సంధి లేనిచోట – అనే సూత్రంచేత యడాగమం వచ్చి, వచ్చి యిచ్చెను అని అవుతుంది.

'క్త్వార్థం బైనయిత్తునకు' అనటంచేత క్త్వార్థం కాని యిత్తుకు ఈసూత్రంచేత సంధినిషేధం రాదు. వచ్చిరి+అప్పుడు=వచ్చి రప్పుడు. మొ.

**4. ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు. (9)**

'ఇఁక' అనేశబ్దం ఆదిలో కల్గినవి – అంటే ఇఁక మొద లైనవి ఇఁకాదులు. ఇఁక – ఇఁగ – ఎట్టకేలకు – ఎట్టకేని – అనేవి నాలుగు ఇఁకాదులు. ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికములు. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు' అనేసూత్రం నుంచి 'అచ్చు పరం బగునపుడు' అనేభాగం ఈసూత్రంలోకి వచ్చి అన్వయిస్తుంది. పూర్వపరస్వరంబులకుం బరస్వరంబేకాదేశం బగుట సంధి.

ద్రుతప్రకృతికాలలో ఇఁక మొద లైనవాటికి తప్ప మిగిలినద్రుతప్రకృతులకు అచ్చు పరంగా ఉండగా సంధి రా దని సూత్రాని కర్థం.

'ప్రాప్తిపూర్వకో హి నిషేధః' అనేసంస్కృతపరిభాషను అనుసరించి ద్రుత ప్రకృతికాలలోని ఉత్వ, అత్వ, ఇత్వాలకు సంధి ప్రాప్తిస్తుండగా ఈసూత్రం నిషేధిస్తున్నది. 'పర్జన్యవ ల్లక్షణప్రవృత్తిః' అనేన్యాయాన్ని అనుసరించి, సంధిప్రాప్తి లేని ఎత్వం మొద లైనఅచ్చులకు గూడా ఈనిషేధం వర్తిస్తుంది.

'వచ్చున్ + ఇపుడు' అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి ప్రాప్తిస్తుండగా ప్రస్తుతసూత్రంచేత నిషేధింపబడి సంధి రాదు. కాబట్టి ద్రుతం మీదిఅచ్చుతో కలిసి 'వచ్చు నిపుడు' అని అవుతుంది.

అలాగే చూడన్ + అయితి అని ఉన్నపుడు 'అత్తునకు సంధి' అనే సూత్రంచేతా, ఉండెడిన్ + అతడు అన్నపుడు 'క్రియాపదంబులం దిత్తునకు' అనేసూత్రంచేతా సంధి ప్రాప్తిస్తుండగా ఈసూత్రం నిషేధించింది.

చిన్నయసూరి ఉత్వ, అత్వ, ఇత్వాలకు సంధి చెప్పినక్రమంలోనే ఈనిషేధానికి చూపినఉదాహరణలు కూడ (వచ్చున్, చూడన్, ఉండెడిన్) ఉత్వ – అత్వ – ఇత్వాలనే క్రమంగా చూపించి ఈనిషేధం ప్రాప్తిపూర్వకం అని సూచిస్తున్నాడు.

ఇలాగే వచ్చెన్ + ఎవఁడు – మొద లైన ఇతరస్వరస్థలాల్లో గూడా యీనిషేధం వచ్చి – వచ్చె నెవడు ఇత్యాదులు సిద్ధిస్తాయి.

'ఇఁకాదులకుఁ దప్ప' అనడంచేత ఇఁకాదులకు ఈనిషేధం లేదు. ఇఁకన్, ఇఁగన్ అనేవాటిల్లో అత్వానికి 'అత్తునకు సంధి' అనేసూత్రంచేత సంధి వికల్పం. ఇఁకన్+ఏమి= ఇఁ కేమి, ఇఁక నేమి. ఎట్టకున్, ఏలకున్ అనేవాటిల్లో ప్రథమేతరవిభక్తి సూత్రంచేత సంధి వికల్పం. ఉదా. ఎట్ట కేని, ఎట్టకు నేని, ఎట్టకేల కతడు, ఎట్ట కేలకు నతఁడు.

ద్రుతప్రకృతికములకు' అనడంచేత కళలకు ఈనిషేధం లేదు. రాముఁ డతడు.

'సంధి' అంటే పరరూపం మాత్రమె ఉండదు. 'వచ్చు నిపుడు' అనేవిధంగా నకారం మీదిఅచ్చుతో కూడిఉండవలసిందే. అంతే కాని, వచ్చున్ ఇపు డని (ప్రకృతిభావం లాగా) ఉండదు.

**5. అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు.** (11)

అందు + అవక్ + ఆగమ. అంద్వవగాగమ. అందు అనేది సప్తమీవిభక్తి ప్రత్యయం. సంఖ్యకు పూరణార్థంలో వచ్చేఆగమం అవక్. పదం కానిది అపదం, ప్రత్యయాలు, ఆగమాలు - మొద లైనవి అపదాలు.

అందు అనేప్రత్యయమూ, అవక్ అనేఆగమమూ, అనేవి తప్ప మిగిలినప్రత్యయాలు మొద లైనఅపదాలయొక్క మొదటిఅచ్చు పరంగా ఉన్నపుడు ముందరిశబ్దం చివర ఉన్న అన్నిరకాలఅచ్చులకు సంధి నిత్యంగా వస్తుంది.

'మూర+ఎఁడు' అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నబహుళసంధిని బాధించి యీసూత్రంచేత సంధి నిత్యంగా వచ్చి 'మూరెఁడు' అని అవుతుంది.

'అంద్వవగాగమంబులం దప్ప' అనడంచేత అందు - అవక్ అనేవి పరంగా ఉన్నపుడు ఈసూత్రంచేత నిత్యసంధి రాదు. ఇంక ఉత్త్వ, అత్త్వాది, సంధులు పూర్వం చెప్పిన సామాన్యశాస్త్రాలకు అనుగుణంగా జరుగుతాయి.

ఉత్తుకు సంధి నిత్యం. తనువు + అందు (నుగాగమం రానపుడు) తనువందు. నాలుగు + అవ = నాలుగవ.

అత్తుకు సంధి బహుళం. రాములందు - రాములయందు.

ఇత్తుకు ఏమ్యాదుల్లో చేర్తే సంధి వికల్పం. ఎనిమిదవ, ఎనిమిదియవ మొ. ఏమ్యాదుల్లో చేరకపోతే సంధి రాదు. తల్లియందు మొ.

మిగిలినఅచ్చులకు సంధి లేదు, వదినె+అందు=వదినెయందు. వే+అవ= వేయవ మొ.

'అపద' అనడంచేత పదం మొదటిఅచ్చు పర మైనపుడు ఈసూత్రంచేత సంధి రాదు. మూర+అంత. 'అత్తునకు సంధి' అనేసూత్రంచేత సంధి వచ్చి మూరంత. సంధి రాకపోతే మూరయంత.

'ఆదిస్వరంబు పరం బగునపుడు' అనడంవల్ల అపదాది 'హల్లు' పర మైతే సంధి ప్రసక్తే లేదు. రాముకొఱకు, రామునిచేత మొ.

'అచ్చున కామ్రేడితంబు పరం బగునపు' డన్నట్లుగానే యిక్కడ గూడా 'అంద్వవ గాగమంబులం దప్ప అపదంబు పరం బగునపుడు' అని చెప్పినా చాలు. అచ్చు పర మైనపుడు అనే అర్థం. 'ఆదిస్వరంబు' అనడం స్పష్టత కనవచ్చు. పరిశీలించాలి.

'అచ్చునకు' అని సామాన్యంగా చెప్పడంచేత మొదటిశబ్దం చివర ఏఅచ్చు ఉన్నా సంధి వస్తుంది. అర్థ + ఇంచు. ఇక్కడ సంస్కృతీయాచ్చుకు సంధి. అర్థించు. వీసె + ఎఁడు = వీసెఁడు మొ.

భుజ్ + ఇంచు, అనేవిధంగా పూర్వశబ్దాంతంలో హ ల్లుంటే (పరరూప) సంధి ప్రసక్తే లేదు.

'అగు' అనడంచేత సంధి నిత్యం. మూరెఁడు. మూరయెఁడు అనేవిధ మైన సంధి రానిరూపా లుండవు.

**6. ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు.** (15)

ఉభయపదార్థప్రధాన మైనసమాసం ద్వంద్వం. తెలుగులో సాధారణంగా స్త్రీసమ మైనఆచ్ఛికశబ్దానికి ఆచ్ఛికశబ్దంతో ద్వంద్వసమాసం ఏర్పడుతుంది. 'కచటతపలు పరుషంబులు' అనేసూత్రంప్రకారం క చ చ ట త ప అనేవాటికి పరుషా లని పేరు. 'పరుషములకు' అన్నచోటిషష్ఠీవిభక్తిచేత పరుషాల 'స్థానంలో' అని అర్థం వస్తుంది.

ద్వంద్వసమాసంలో మొదటిపదానికి తరువాత ఉన్నరెండవపదం మొదటి కచ(చ)టతప అనేపరుషాలస్థానంలో యథాసంఖ్యంగా గస(స)డదవ అనేవర్ణాలు ఆదేశంగా వస్తాయి. 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనేసూత్రం ప్రకారం ఇక్కడ తాలవ్యచకారానికి వచ్చేసకారమే దంత్యచకారంస్థానంలోనూ వస్తుంది.

'కూర + కాయ' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత నిత్యంగా గకారాదేశం రాగా 'కూరగాయ' అని అవుతుంది. సమాస మైనఈప్రాతిపదికమీద ప్రథమావిభక్తిలో బహుత్వార్థాన్నిబట్టి బహువచనం వచ్చి, 'కూరగాయలు'.

'ద్వంద్వంబున' అనడంచేత ద్వంద్వంకంటె వే రైనసమాసాల్లో ఈఆదేశం రాదు. నల్లనికలువ, రామునితమ్ముడు మొ.

'పదంబుపయి–' అనడంచేత పూర్వపదంలోనిపరుషాలకు ఈఆదేశం రాదు. కూరగాయలు. 'గూరగాయలు' కాదు.

'పయి' అనడంచేత పూర్వపదానికి పరంగా ఉన్నరెండవపదంమొదటిపరుషానికి మాత్రమే ఆదేశం. ఆతరువాతిపరుషాలకు రాదు. టక్కుడెక్కు లన్నపుడు టెక్కులో కకారానికి ఆదేశం లేదు. (టక్కుడెగ్గులు కాదు.)

'అగు' అనడంచేత ఈఆదేశం నిత్యం. కాబట్టి 'కూరకాయలు' ఇత్యాదిగా ఆదేశం రానిరూపం ఉండదు.

తెలుగులో చేసినద్వంద్వసమాసాలలోనే యీకార్యం. సిద్ధద్వంద్వంలో రాదు. మాతాపితలు. మొ.

**7. అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు.** (20)

'విరామః అవసానమ్.' అవసాన మంటే తరువాత వర్ణాలు లేకపోవడం. చివర అని అర్థం. ద్రుతానికి సంబంధించినఅచ్చు ద్రుతస్వరం. ద్రుతం నువర్ణం కాబట్టి ఉత్వమూ, ఇకారాదులపై 'ని' అని అవుతుంది గాబట్టి ఇత్వమూ, ద్రుతంలో రెండు అచ్చులు ఉంటాయి. బహుళం అంటే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగువిధాలుగా సూత్రం విధించినకార్యం ప్రవర్తిస్తుంది.

వాక్యం (లేదా పద్యం) చివర ఉన్నద్రుతంలోని ఉ-లేదా-ఇ అనేఅచ్చులకు గానీ, లేదా (అచ్చుతో గూడ) ద్రుతం (ను-ని) మొత్తానికి గానీ బహుళంగా లోపం వస్తుం దని సూత్రాని కర్థం. బహుళం అంటే ప్రవృత్తి మొదలుగా అనేకవిధాలుగా కార్యాలు అవుతాయి.

**ప్రవృత్తి :** 'అతిశయంబుగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్'. ఇటువంటిచోట్ల (గుర్వవసాయిపద్యంలో పూర్వంలో లఘు వున్నద్రుతంలో స్వరలోపం నిత్యం. 'పందె మొడ్డఁ జూచి పడఁతి నవ్వె'. ఇటువంటిచోట్ల (చివర లఘువు ఉండవలసినపద్యంలో చిట్టచివరిలఘువుతర్వాత ఉన్న)ద్రుతానికి లోపం నిత్యం. అంటే అక్కడ ఈకార్యానికి ప్రవృత్తి. అని చిన్నయసూరి భావించినట్లు తోస్తుంది.

**విభాష :** వాడు వచ్చెను ఈసూత్రంచేత చివర ఉన్న 'ను' ద్రుతంలో అచ్చు లోపిస్తే 'వచ్చెన్' అని అవుతుంది. బహుళం గాబట్టి ద్రుతస్వరం లోపించకపోతే ద్రుతం మొత్తం లోపించి 'వచ్చె' అవుతుంది. ద్రుతలోపం గూడా బహుళమె. కాబట్టి అది గూడా రాని పక్షంలో ద్రుతం అలాగే ఉంటుంది. వచ్చెను.

**అప్రవృత్తి :** 'వచ్చుచున్నాను' మొ.చోట్ల ద్రుతస్వరలోపం గానీ, ద్రుతలోపం గానీ రావు. కాబట్టి అప్రవృత్తి. పద్యంమధ్యలో వాక్యావసాన మైనా ద్రుతాని

కీసూత్రంప్రకారం లోపాదికం రాదు. తరువాతిపదం మొదటివర్ణాన్ని అనుసరించి ఆయాకార్యాలు జరుగుతాయి. కాబట్టి అక్కడ ఈలక్షణానికి అప్రవృత్తి.

'వైజయంతీనవాంశుకవ్యాజమునను' ఇటువంటిచోట్ల (చివర లఘువు ఉండవలసినపద్యంలో చిట్టచివరిలఘువు అయిన)ద్రుతంలో స్వరానికి గానీ, లేదా ద్రుతం మొత్తానికి గానీ లోపం అసలు రాదు. అంటే ఇక్కడ అప్రవృత్తి. అని కొందఱు లాక్షణికులు భావించినట్లు కనబడుతుంది.

**అన్యకార్యం :** ద్రుతానికి అచ్చు పర మైనపుడు – అంటే అవసానం కాకపోయినా ద్రుతంలోనిఅచ్చు దాదాపు నియతంగా లోపిస్తుంది. నన్నును – అడిగె = నన్నున్ – అడిగె. మొ. ఇది అన్యకార్యం. అంటిని నిందఱకు అనేరీతిగా ద్రుతంమీద నకారం వచ్చేఅరుదైనస్థలాల్లో స్వరలోపం రాకపోవడమూ ఉంది.

'వాక్యావసానంబున' (సంధి. 55) అని కాక 'అవసానంబున' అని సామాన్యంగా చెప్పడంచేత వాక్యావసానం కాకపోయినా పద్యావసానంలో ఈలక్షణం ప్రవర్తిస్తుంది. తానొకపండు చెచ్చెరన్ – (కొని వ్రచ్చుడు) ఇక్కడ ప్రస్తుతసూత్రంచేతనే ద్రుతంవో స్వరం లోపించింది.

'అవసానంబున' అనడంచేత వాక్యమధ్యంలో ద్రుతానికి ఈసూత్రంచేత లోపం రాదు. పూచెం గలువలు మొ.

'ద్రుతస్వరంబునకు' అనడంచేత ద్రుతం కానిదానిలో స్వరలోపం రాదు. వేసెను కన్ను. వారు వచ్చిరి. మొ.

ఏని అనేశబ్దాలచేత ద్రుతస్వరం లోపింపనిపక్షంలోనే ద్రుతలోపం. ముందు ద్రుతంలో అచ్చు లోపింపజేసి తర్వాత నకారంపొల్లుకు లోపం చేయడానికి వీలు లేదు. అలాగే నకారం హల్లు మాత్రమె లోపించి ద్రుతంలోని స్వరం నిలిచి ఉండడం కూడా జరగదు.

**8. కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు.** (28)

విశేషణానికి విశేష్యంతో ఏర్పడినసమాసం కర్మధారయం. ఉత్ అనేచోటి తపరకరణంవల్ల ఉత్తు అంటే హ్రస్వ మైనఉకారం. 'టుక్ + ఆగమ' అనేచోట కకారం ఇత్తు. కాబట్టి అది లోపిస్తుంది. కకారం ఇత్తుగా, కలిగినది కాబట్టి టువర్ణం కిత్తు. 'ఆద్యంతౌ టకితౌ' అనే సంస్కృతపరిభాషను అనుసరించి కిత్తయిన యీ'టు' ఆగమం – విధించినఉత్తుకు చివరగా వచ్చిచేరుతుంది. 'టు'వర్ణంలో ఉకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చబడింది. ఆప్రయోజనం సిద్ధించడంతో ఉకారం

కూడా లోపించిపోతుంది. టకారంపొల్లు మాత్రమే ఆగమంగా వస్తుంది. ఆగమం అంటే (వర్ణం) అధికంగా వచ్చిచేరటం.

కర్మధారయసమాసంలో రెండవపదం మొదటిఅచ్చు పరంగా ఉండగా మొదటిపదం చివరి హ్రస్వ మైనఉకారానికి తర్వాత టకారపు పొల్లు ఆగమంగా వస్తుంది అని సూత్రానికి అర్థం.

'కఱకు + అమ్ము' అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నసంధిని బాధించి యీవిశేషవిధానంచేత టుగాగమం రాగా కఱకుట్ + అమ్ము = కఱకుటమ్ము అని అవుతుంది. (ఈసమాసప్రాతిపదిక స్త్రీసమం గాబట్టి దీనిపై ప్రథమైకవచనం లోపిస్తుంది.)

'కర్మధారయంబులందు' అన్నప్పటిబహువచనస్వారస్యంచేత కర్మధారయేతర సమాసాల్లో కూడా ఈఆగమం అరుదుగా వస్తుంది, వేలుపుయొక్క ఆవు. వేలుపుటావు.

'కర్మధారయంబులందు' అనడంచేత ఇతరస్థలాల్లో ఈఆగమం రాదు. కఱ కయినయమ్ము మొ.

'ఉత్తునకు' అనడంచేత ఉత్తుకంటె వే రయినఅచ్చుకు టుగాగమం రాదు. ఎల్లయర్థములు. దుక్కిటెడ్లు, పల్లెటూరు ఇత్యాదిగా ఆధునికవ్యవహారంలో ఇతరస్వరాలపై ఆగమం వినిపిస్తున్నది.

'అచ్చు పరం బగునపుడు' అనడంచేత హల్లు పర మైతే టుగాగమం లేదు. సరసపుమాట. మొ.

'అగు' అనడంచేత టుగాగమం రాకుండడానికి అవకాశం లేదు, 'కఱకమ్ము' అని ఉండదు. కాని 'కాఱు + అడవి = కాఱడవి, పాడిల్లు ఇత్యాదుల్లో టుగాగమం అసలు లేదు. 'ఆగమశాస్త్ర మనిత్యమ్' అంటారు.

**9. కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు.** (32)

విశేషణానికి విశేష్యంతో అయినసమాసం కర్మధారయం. వర్ణకం అంటే ప్రత్యయం. 'ముద్వర్ణకంబునకు' అనేచోటిషష్ఠీవిభక్తిచేత 'షష్ఠీ స్థానే యోగా' అనేపరిభాష ననుసరించి ముద్వర్ణకం స్థానంలో అని అర్థం. ప్రకరణాన్నిబట్టి పూర్వపదంలో అని గ్రహించాలి. పుంపులను కేవలపువర్ణం (పు), పూర్ణబిందుపూర్వకపువర్ణం (ంపు) అని రెండుగా గ్రహించాలి.

కర్మధారయసమాసంలో పూర్వపదంచివరి 'ము' అనే(ప్రథమావిభక్తి)ప్రత్యయం

స్థానంలో కేవల'పు'వర్ణం లేదా నిండుసున్న ముం దున్నపువర్ణం వస్తాయి అని సూత్రాని కర్థం.

సమాసం కావడంచేత ఇందులో మువిభక్తికి 'సమాసవిభక్తికి లోపం బగు లట్టునకుఁ గాదు' అనేసూత్రంచేత లోపం రావాలి. అలా మువర్ణకం లోపిస్తే ఈపుంపులు రావడానికి అవకాశం ఉండదు. అపుడు ఈవిధానం వ్యర్థం అవుతుంది. కాబట్టి విధానసామర్థ్యంచేత సామాసికవిభక్తిలోపం పూర్వపదంలోనిమువర్ణకానికి మాత్రం రాదు. (ఉత్తరపదంలో మువిభక్తి లోపిస్తుంది).

పు–ంపు అనేవి రెండూ మువర్ణకం స్థానంలోనే రావాలి. కాబట్టి 'పు' వర్ణం ఒకపక్షంలో రా దనీ, అపుడు అక్కడ ఉన్నమువర్ణానికి 'ంపు' వస్తుం దనీ గుర్తించాలి.

'సరస మైనమాట' అనేవిగ్రహంచొప్పున సరసము+మాట అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత మువర్ణకం (లోపించక) స్థానంలో 'పు' ఆదేశ మైతే సరసపు మాట. 'పు' రాని పక్షంలో సరసము + మాట అని ఉండగా మువర్ణకం స్థానంలో 'ంపు' వచ్చి సరసంపుమాట.

'కర్మధారయంబులందు' అనేచోటిబహువచనస్వారస్యంచేత వ్యధికరణసమాసం లోనూ పుంపులు అరుదుగా రావచ్చు. సింగముయొక్క కొదమ – సింగపుఁగొదమ. నువర్ణకంబు నుత్వంబునకు (తత్స. 25) ఇక్కడ పుంపులు రాలేదు. ముగాగమానికి లోపం గూడ రాకుండుటం విశేషం. గుణములప్రోక.

'మువర్ణకంబునకు' అనడంచేత ప్రత్యయం (ఆగమమూ) కానిమువర్ణానికి పుంపులు రావు. వాముపొడి.

'అగు' అనడంచేత పుంపులలో ఏదో ఒకటి తప్పకుండా రావలసిందే. ఏదీ రాకుండా సరసముమాట అని మువర్ణకం ఉండదు. పుంపులు రాకపోతే సమాసంలో మువిభక్తి లోపించవలసిఉంటుంది. సరసమాట అని కాదు.

**10. సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు.** (36)

ప్రాఁత –మొద లైనశబ్దాలు ప్రాఁతాదులు. 'అదర్శనం లోపః' అని వర్ణం కనబడకుండా పోవడం – తొలగిపోవడం లోపం. బహుళ మంటే ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యాలుగా నాలుగు విధాలుగా రావడం. సమాసంలో పూర్వపదంగా ఉన్న ప్రాఁత మొద లైనశబ్దాలలోని మొదటిఅచ్చుకు తరువాత ఉన్నవర్ణాలు అన్నీ బహుళంగా లోపిస్తాయి.

**1. ప్రవృత్తి :** ప్రాఁతాదులలోనిశబ్దాలలో కొన్నిలక్ష్యాలలో ఈలోపం నిత్యంగా వస్తుంది. మీఁదు + కడ = మీఁగడ. ఇక్కడ లోపం రాని మీఁదుగడ వంటిరూపాలు ఉండవు.

**2. అప్రవృత్తి :** కొన్నిచోట్ల ఈలోపం అసలు రాదు. క్రొత్త + కుండలు = క్రొత్తకుండలు.

**3. విభాష :** కొన్నిచోట్ల లోపం వికల్పంగా వస్తుంది. ప్రాఁత+ఇల్లు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నసంధిని బాధించి ప్రస్తుతసూత్రంచేత తొలియచ్చుమీదివర్ణాలు లోపించగా ప్రా(ఁత) + ఇల్లు, అని కాగా, సంధి లేదు గాబట్టి 'సంధి లేనిచోట' అనేసూత్రంప్రకారం యడాగమం వచ్చి ప్రాయిల్లు అవుతుంది. లోపం రానపుడు సంధి రాక యడాగమం వచ్చి ప్రాఁతయిల్లు అని అవుతుంది.

**4. అన్యకార్యం :** లోపం కంటె వేరేకార్యం రావడం కొన్నిచోట్ల కనబడుతుంది. క్రిందు + కాలు అని ఉండగా తొలియచ్చుమీదివర్ణాలు లోపించి, క్రి + కాలు అని కాగా, అన్యకార్యంగా ఇక్కడ లుప్తశేషానికి దీర్ఘం వచ్చి, క్రీ + కాలు - నుగాగమద్రుతకార్యాలతో క్రీఁగాలు అవుతుంది.

'సమాసంబున' అనడంచేత సమాసం కాకపోతే ఈకార్యం రాదు. పూవు తెల్లనిది. సమాస మైనా, పూవుటమ్ము అన్నపుడు టుగాగమం, పూవునంద మన్నపుడు నుగాగమం విశేషవిధులు గాబట్టి దీన్ని బాధించి ప్రవర్తిస్తాయి.

'ప్రాఁతాదుల' అనడంచేత ప్రాఁతాదులో లేనిశబ్దానికి ఈకార్యం రాదు. ఎల్ల కలుషములు.

'తొలియచ్చుమీఁదివర్ణంబులకు' అనడంచేత ప్రాతాదుల్లో మొదటిఅచ్చువర కున్నభాగం లోపించదు. (ప్రాఁత + ఇల్లు) ప్రా(ఇల్లు)

'ఎల్లన్' అనడం తొలి అచ్చుపైన ఎన్ని వర్ణా లుంటే మొత్త మన్నీ లోపిస్తాయి, అని స్పష్టంగా చెప్పడానికి.

**11. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి.** (39)

అన్యము లంటే చెప్పినవానికంటె వే రైనవి. పూర్వం చెప్పినప్రాఁతాదులలో లేని ఇతరశబ్దాలు అని అర్థం. 'ఇక్కార్యంబులు' అంటే ప్రాఁతాదులకు చెప్పబడిన కార్యాలు. అవి 1. తొలిఅచ్చుమీఁదివర్ణాలు లోపించడం 2. పరుషాలు పరంగా ఉన్నపుడు లుప్తశేషానికి నుగాగమం రావడం. 3. లుప్తశేషం మీది(పరుష, పరుషేతర

మైన)హల్లుకు ద్విత్వం రావడం– అనేవి మూడు.

1.ప్రాంతాదులలో చేరనిఆయాశబ్దాలకు ఆయాశబ్దాలు పర మైతే (పూర్వపదంలో) తొలియచ్చుమీదివర్ణాలు లోపించి (పరుషం పరంగా ఉంటే) నుగాగమం వస్తుంది.

పది + తొమ్మిది అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత లోపమూ (ప+తొమ్మిది), నుగాగమమూ, (పను+తొమ్మిది) వచ్చి, ద్రుతకార్యాలతో పందొమ్మిది అని అవుతుంది.

2. ప్రాంతాదుల్లో చేరనిఆయాశబ్దాలకు ఆయాశబ్దాలు పర మైనపుడు పూర్వపదంలో తొలియచ్చు మీదివర్ణాలు లోపించి లుప్తశేషంపై హల్లుకు ద్విత్వం వస్తుంది.

నెఱ + నడుము అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత లోపమూ (నె + నడుము), మీదిహల్లుకు ద్విత్వమూ రాగా, నెన్నడుము అని అవుతుంది.

'అన్యంబులకు' అనడంవల్ల ప్రాంతాదుల కీసూత్రంచేత లోపాదికార్యాలు రావు.

'సహితము' అనడం ప్రాతాదుల్లో లేనివాటికి కూడా ప్రాతాదులతో సమానంగా కార్యాలు కావడంలోని సామ్యాన్ని స్పష్టం చేస్తున్నది.

'కొండొకచో' అనడంచేత ప్రాతాదుల్లో చేరనిశబ్దాలకు ఈకార్యాలు అన్నిచోట్లా రావు. పది + తొమ్మిది = పందొమ్మిది అవుతుంది. పదికి తొమ్మిదికంటె వేరైన శబ్దం పర మైతే యీకార్యం రాదు. పది + మూడు, పది + నాలుగు ఇత్యాదుల్లో పమ్మూడు, పన్నాలుగు ఇత్యాదు లుండవు.

'కానంబడియెడి' అనడంచేత ప్రాతాదుల్లో చేరనిశబ్దాలకు ఈకార్యాలు రావడం కవిప్రయోగాల్లో ఉన్నచోట్లనే గ్రహించాలి. కాని స్వతంత్రంగా కల్పించగూడదు.

**12. ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.** (41)

ఒకేశబ్దం రెండుసార్లు ఉచ్చరించినపుడు వానిలో రెండవది ఆమ్రేడితం. అది పరంగా ఉండగా, దానికి పూర్వంలో ఉన్నశబ్దం చివరివిభక్తికి బహుళంగా లోపం వస్తుం దని సూత్రాని కర్థం. బహుళం అనడం చేత ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష. అన్యకార్యం అని నాలుగు విధాలుగా ఈకార్యం ప్రవర్తింపవచ్చు.

**విభాష :** కొన్నిలక్ష్యాలలో ఈకార్యం వికల్పంగా వర్తిస్తుంది. అప్పటికిన్ + అప్పటికిన్ అని ఉండగా 'ఏమ్యాదులయిత్తునకు' అనేసూత్రంచేత రావలసినసంధిని బాధించి ప్రస్తుతసూత్రంచేత 'కిన్' అనే విభక్తి లోపింపగా అప్పటి + అప్పటికిన్. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపు' డనేసూత్రంచేత సంధి జరిగి, అప్పటప్పటికిన్

అని అవుతుంది. బహుళం గాబట్టి విభక్తిలోపం రాకపోతే అప్పటికిన్ + అప్పటికిన్ అనేచోట (ఆమ్రేడితసంధిసూత్రాన్ని బాధించి) ఏమ్యాదులకు – అనేసూత్రంచేత వైకల్పికసంధి. సంధి జరిగితే – అప్పటి కప్పటికిన్, సంధి రాకపోతే–అప్పటికి నప్పటికిన్ అని అవుతుంది.

**అన్యకార్యం :** ఇంచుక, నాఁడు ఇత్యాదుల్లో విభక్తి కాకపోయినా చివరిఅక్షరం వికల్పంగా లోపిస్తుంది. ఇది అన్యకార్యం. 'ఇంచుక + ఇంచుక' అనేచోట మొదటి శబ్దంలో చివరి 'క'వర్ణం లోపించి ఇంచు + ఇంచుక. (ఉత్త్వసంధిని బాధించి) 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అనేసూత్రంచేత సంధి జరిగి ఇంచించుక. లోపం రాకపోతే ఆమ్రేడితసంధి జరిగి 'ఇంచు కించుక (ఇంచుక యించుక)' అని కూడా ఉంటుంది.

**అప్రవృత్తి :** కొన్నిలక్ష్యాల్లో విభక్తికి లోపం అసలు రాదు. సున్నము + సున్నము. సున్నసున్నము అని 'ము'వర్ణం విభక్తి అయినా లోపించదు. ఇది అప్రవృత్తి.

'ఆమ్రేడితంబు' పరం బగునపుడు అనడంచేత ఇతరస్థలాల్లో ఈకార్యం రాదు. అప్పటికిన్ + అప్పుడు – అప్పటి కప్పుడు. అప్ప టప్పుడు అని కాదు.

ఆమ్రేడితంబు 'పరం బగునపుడు' అనటంచేత ఆమ్రేడితంలో ఈకార్యం లేదు. అప్పటికిన్ + అప్పటికిన్ = 'అప్పటి కప్పటి' అని కాదు.

'విభక్తిలోపంబు' అనడంచేత విభక్తి కానిదానికి లోపం రాదు. 'విభక్తి' అనే సామాన్యనిర్దేశంచేత క్రియావిభక్తికి గూడా ఈసూత్రంచేత లోపం ప్రాప్తిస్తున్నది. అయితే 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు' అనేసూత్రం క్రియావిభక్తులు కొన్నింటికి లోపం చెప్పడంచేత ఈసూత్రంచేత క్రియావిభక్తికి లోపం రాదు. అందురు + అందురు = అందు రందురు.

### 13. అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు. (44)

'అందు + ఆది' = అంద్వాది. అందు మొద లైనవి అంద్వాదులు. అలిక్ + ఆగమ అనేచోట కకారం ఇత్తు. కకారం ఇత్తుగా కలిగింది కాబట్టి 'అలి' అనేది కిత్తు. 'ఆద్యన్తౌ టకితౌ' అనేపరిభాషచేత అంద్వాదులకు చివర వచ్చి చేరుతుంది.

సమాసంలో పూర్వపదం చివరి 'అందు' మొద లైనవాటికి చివర 'అలి' అనేది ఆగమంగా వస్తుం దని సూత్రాని కర్థం.

'అందు ఇందు ఎందు' అనేవి మూడే అంద్వాదులు. ఇందులో 'అందు' అనేది ఒకటి సప్తమీవిభక్తి, మరొకటి అవ్యయ మైనపదం, ఇందు, ఎందు, అనేవి కూడా

అవ్యయపదాలు. సమాసం కావడంవల్ల విభక్తి అయిన అందు 'సమాసవిభక్తికి లోపం బగు–' అనేసూత్రంచేత లోపించాలి. కాని అలిగాగమవిధానంవల్ల లోపించదు. కాబట్టి ఇది అలుక్ (విభక్తి లోపించని) సమాసం.

'నాయందును + కరుణ' అని ఉండగా (అందు లోపింపక) 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్రుతం లోపించి, నాయందు + కరుణ. ప్రస్తుతసూత్రంచే అందుకు చివర 'అలి' చేరి నాయందు + అలి + కరుణ (ఉత్వసంధిని బాధించి) 'అంద్వవగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి నాయందలికరుణ అని అవుతుంది.

'అంద్వాదులకు' అనడంచేత అందు మొద లైనవాటిలో లేనిశబ్దానికి ఈకార్యం రాదు. కువలయంబునవారు. మొ.

'సమాసంబునందు' అనడంచేత సమాసం కానపు డీకార్యం రాదు. నాయందుఁ గరుణ గలుగుము.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి అలిగాగమం రాకుండా 'నాయందు కరుణ' అని ఉండదు.

**14. అదియవిశబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు.** (45)

వృత్తి రేకార్థీభావః. వృత్తి అంటే ఏకార్థీభావం. తెలుగులో సమాస, తద్ధిత, కృద్ వృత్తులు మూ డున్నాయి. (సంస్కృతంలోని ఏకశేష సనాద్యంతవృత్తులు తెలుగులో లేవు) సమాసం మొద లైనవృత్తులలో పూర్వపదానికి తరువాతగా ఉన్న అది – అవి అనేశబ్దాలలోని హ్రస్వ మైనఅకారానికి బహుళంగా లోపం వస్తుం దని సూత్రాని కర్థం. బహుళం అనడంచేత ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అనేనాల్గింటికి అవకాశం ఉంది.

**ప్రవృత్తి :** (కృద్ వృత్తిలో) ఎడి అనేప్రత్యయం చివర గలిగిన ఇదంతతద్ధర్మార్థక విశేషణం మీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం అనుప్రయుక్తం కాగా అమహత్త్వంలో పరంగా ఉన్న అది, అవి – లలో అత్వం నిత్యంగా లోపిస్తుంది. వచ్చెడి + అది – వచ్చెడిది, చూచెడి + అవి – చూచెడివి. లోపం నిత్యం గాబట్టి వచ్చెడియది అనేవిధంగా లోపం రానిరూపా లుండవు.

**అప్రవృత్తి :** ఆ(కృద్వృత్తిలో) ఉదంతా లైనతద్ధర్మార్థకవిశేషణాలమీద ప్రథమావిభక్తిలో పరంగా ఉన్న అది, అవి అనేవాటిల్లో అకారానికి అసలు లోపం రాదు. వచ్చు + అది. 'అ'త్వానికి లోపం రాదు. కాబట్టి ఉత్త్వసంధిని బాధించి

'ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణంబున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం వచ్చి- వచ్చునది. అలాగే చూచెడు + అవి - చూచెడు నవి. మొ. లోపం లేదు కాబట్టి వచ్చెడుది, చూచువి అనేవిధంగా లోపం వచ్చినరూపా లుండవు.

**విభాష :** నాయొక్క + అది అనేసమాసంలో విభక్తి లోపించి నా + అది అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత అత్త్వం లోపించి నాది. లోపం రానిపక్షంలో నా + అది అనేచోట సంధి లేదు గాబట్టి సంధి లేనిచోట - అనేసూత్రంచేత యడాగమం వచ్చి నాయది అని అవుతుంది. ఇలాగే రాని + అది - రానిది, రానియది. మొ.

'అది అవి శబ్దంబుల' అనడంచేత ఇతరశబ్దాల్లో అత్తుకు లోపం రాదు. వచ్చెడి + అతడు - వచ్చెడియతడు.

'అత్తునకు' అనడంచేత 'ది-వి' లోపింపవు. నాది, నావి.

'వృత్తిని' అనడంచేత ఏవృత్తీ కాకపోతే ఈకార్యం రాదు. వానిని జూచి అది నవ్వెను.

**15. ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు.** (49)

ద్విరుక్తంయొక్క రెండవరూపం ఆమ్రేడితం. యుష్మదర్థం (నీవు - మీరు) కర్తగా కలిగినక్రియ మధ్యమ(పురుష)క్రియ.

ఆమ్రేడితం పరంగా ఉన్నపుడు దానికి పూర్వంలో ఉన్నమధ్యమపురుష ఏకవచన మైన ముప్రత్యయానికీ, బహువచన మైనడుజ్‌ప్రత్యయానికీ లోపం వికల్పంగా వస్తుంది. ఆమ్రేడితం అని సామాన్యంగా చెప్పడంవల్ల ఆమ్రేడితం మొదట అ చ్చున్నా, హ ల్లున్నా, ఈలోపం వస్తుంది.

ఉండుము + ఉండుము అని ఉండగా (ఉత్త్వసంధిని బాధించి) ఆమ్రేడితపరకసంధి వస్తుండగా దాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత మొదటిశబ్దం చివరిమువర్ణకం లోపించి ఉండు + ఉండుము. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు' అనేసూత్రంచేత సంధి జరిగి ఉం డుండుము. విభాష కాబట్టి లోపం రాకపోతే (ఉండుము ఉండుము) 'అచ్చున కామ్రేడితంబు-' అనేసూత్రంచేత సంధి జరిగి 'ఉండు ముండుము'.

'ఆమ్రేడితంబు' అనడంచేత ఆమ్రేడితం కానిది పరంగా ఉంటే ఈకార్యం రాదు. ఉండుము + అనెను - ఉండు మనెను.

(ఆమ్రేడితంబు) పరం బగునపుడు – అనడంచేత, ఆమ్రేడితానికి పూర్వంలో ఉన్న ముడుజులకే యీలోపం. ఆమ్రేడితంలో లోపించవు. కొట్టుఁడు కొట్టు – అని కాదు.

'మధ్యమ' అనడంచేత 'చదువుదుము చదువుదుము, చదువఁగలడు చదువఁ గలఁడు, ఇత్యాదిగా ఇతర (ఉత్తమ – ప్రథమపురుష) క్రియలలోని ముడుజులకు లోపం రాదు.

'ముడుజులకు' అనడంచేత మధ్యమపురుషప్రత్యయాలే అయినా 'వు – రు' అనేవాటికి లోపం రాదు.(నీవు) ఉందు వుందువు. (మీరు) కొట్టుదురు కొట్టుదురు.

'డుజు' అని జీత్తుగా చెప్పడంవల్ల 'జీత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంప్రకారం ముందరిబిందువుతో సహా 'డు' వర్ణం లోపిస్తుంది. కొట్టు కొట్టుఁడు.

'మధ్యమముడుజులకు' అనడంచేత ఇతరక్రియావిభక్తులకు లోపం లేదు. ముడుజులు (క్రియా) విభక్తులు. కాబట్టి 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అనే సూత్రంచేతనే లోపం సిద్ధిస్తుంది. అయినా మళ్లీ యీవిధానం ఆరంభించడంవల్ల 'సిద్ధే స త్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి' అనేన్యాయా న్ననుసరించి క్రియావిభక్తులలో ముడుజులకే కాని యితరక్రియావిభక్తులకు ఆసూత్రంప్రకారం గూడా లోపం రా దని ఈసూత్రం నియమిస్తున్నది. చదువుచున్నాఁడు చదువుచున్నాఁడు మొ.

**16. వాక్యావసానంబున సంధి లేమి దోషంబు గా దని యార్యు లండ్రు.** (55)

'విరామః అవసానమ్.' తర్వాత వర్ణాలు లేకపోవడం అవసానం. అంటే చివర అని అర్థం. ఈసూత్రంలోనిసంధిపదానికి సంధిపరిచ్ఛేదంలో చెప్పినకార్యం అని అర్థం.

సంధి అధ్యాయంలో చెప్పినకార్యం వాక్యం చివర లేకపోవడం తప్పు గా దని పెద్ద లంటా రని సూత్రాని కర్థం. అలా అన్న పెద్దలు అథర్వణాచార్యులు. 'న స్యా ద్వాక్యవిరామే తు సంధ్యభావో ఽపి దోషకృత్' అని అథర్వణవాక్యం.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో – ఇక్కడ మొదటివాక్యం చివర హ్రస్వ మైనఉకారం ఉంది. 'అది' అని తరువాతివాక్యం మొదట అచ్చు ఉన్నది. (ఈఉత్తు తర్వాత వర్ణాలు లేవు కాబట్టి అది అవసానం)'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత రావలసినఉత్వసంధి రాలేదు. అలా సంధి చేయకపోవడం ప్రస్తుతసూత్రా న్ననుసరించి తప్పు లేదు గాబట్టి సాధువె.

ఈసూత్రంలో సంధి అంటే పరరూపం ఒక్కటె గాదు. ఈపరిచ్ఛేదంలో చెప్పబడిన కార్యా లన్నీ. కాబట్టి పైన సంధి రానపుడు 'సంధి లేనిచోట' అనేసూత్రంచేత యడాగమం గూడా రాదు. అదీ సంధికార్యమె. (చేయదలిస్తే సంధే వస్తుంది).

'వాక్య అవసానంబున' అనడంచేత వాక్యమధ్యంలో సంధి లేమి దోషమె. 'రాముఁ డు ఆంజనేయునకు ప్రసన్నుఁడు అయ్యెను' అని కావ్యవ్యవహారంలో ఉండగూడదు, 'రాముఁ డాంజనేయునకుఁ బ్రసన్నుఁ డయ్యె' నని సంధులు చేయవలసిందే.

'దోషంబు గాదు' అనడంచేత వాక్యావసానంలో గూడా సంధి ఉండడమె ఇష్టం. సత్యము సర్వశ్రేయ మది లేనిచో – అనే ఉండాలి. కావ్యాలలో వాక్యావసానంలో సామాన్యంగా సంధి ఉంటుంది. ఒక వేళ మానినా తప్పు లే దనడమె తాత్పర్యం.

'ఆర్యు లంద్రు' అనడం అధర్వణాచార్యులవంటి పెద్దలపై గౌరవాన్ని సూచిస్తుంది. 'అని ఆర్యు లంద్రు' పెద్దలు చెప్పడంవల్ల ఇలా చెప్పవలసివచ్చిం దని సూచిస్తూ వాక్యావసానంలో సంధి ఉండడం మాత్రమే ఉచితం అనేది తనఅభిప్రాయంగా చెప్పిన ట్లవుతున్నది. సంధ్యభావానికి మహాకవులకావ్యాలలో లక్ష్యాలు వెదకాలి.

పద్యకావ్యాల్లో వచనాల్లో వాక్యావసానంలో సంధి తప్పకుండా ఉన్నది. 'రాముఁడు లంకకుం జనియె రావణుఁ జంపెను దెచ్చె జానకిన్' అనేవిధంగా వాక్యావసానంలో గూడా పద్య (పాద) మధ్యంలో సంధి తప్పకుండా ఉంటుంది.

ఇలా లే దనో, మిక్కిలి అరు దనో చెప్పవలసి రావడంవల్లనే సూరి 'అని యార్యు లంద్రు' అని పెద్దలనిర్ణయంగా ఆమోదించిఉంటాడు.

## 3. తత్సమపరిచ్ఛేదం

**1. క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు.** (18)

క్లీబము లంటే నపుంసకలింగాలు. మిత్ర–మొద లైనశబ్దాలు మిత్రాదులు. మిత్ర, శరణ, ప్రధాన మొద లైనవి, స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులు. అంటే స్థూలంగా పురుషుణ్ణి బోధించేశబ్దం, దానివిశేషణం మహద్వాచకం. పుంలింగతుల్యం అంటే పుంలింగంతో సమాన మైన(కార్యం పొందే)ది.

సంస్కృతా న్ననుసరించి నపుంసకలింగా లయిన మిత్ర, శరణ మొద లైనశబ్దాలు (పురుషుణ్ణి బోధిస్తూ) మహద్వాచకా లైనపుడు వికల్పంగా పుంలింగంతో తుల్య మవుతాయి అని సూత్రాని కర్థం. పుంలింగతుల్యత్వాన్ని అతిదేశించడంవల్ల వీటికి పుంలింగశబ్దాలకువలె ఉత్వడుజాదిపుంలింగకార్యాలు వస్తాయి.

'స్నేహితుడు' అనే అర్థంలో తెలుగులో మహద్వాచకమైన మిత్రశబ్దం సంస్కృతా న్ననుసరించి నపుంసకలింగం. ప్రస్తుతసూత్రంచేత దానికి పుంలింగతుల్యత్వం రాగా, 'పుంలింగం బయి మహద్వాచకం బయిన' అనేసూత్రంచేత ఉత్త్వమూ (మిత్రు) 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో డుజూ వచ్చి మిత్రుఁడు అవుతుంది. ఇలాగే మిత్రునిన్ మొ.

'విభాష' అనడంచేత పుంలింగతుల్యత్వం రానిపక్షంలో ఈశబ్దం నపుంసకలింగం కాబట్టి మహద్వాచక మైనా (పుంలింగం కాదు కాబట్టి) నపుంసకలింగకార్యం అంటే 'అమహన్నపుంసకములకు –' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి మిత్రము అని అవుతుంది. రాముఁడు సుగ్రీవుని మిత్రము.

'క్లీబంబులు' అనడంచేత నపుంసకలింగం కానిశబ్దాలకు ఈకార్యం లేదు. సూర్యుడు అనేఅర్థంలో పుంలింగ మైనమిత్రశబ్దానికి మిత్రుఁడు అనేరూపం సాధారణంగానే నిత్యంగా ఏర్పడుతుంది.

'మిత్రాదులు' అనడంచేత మిత్ర మొద లైనవాటిల్లో చేరనిశబ్దానికి ఈకార్యం లేదు. దైవము.

'మహద్వాచకంబులు' అనడంచేత మిత్రాదులు అమహత్తు లైనపుడు ఈకార్యం రాదు. (చెప్పినా ప్రయోజనం ఉండదు. పుంలింగతుల్య మైనా మహత్తు గాకపోవడంవల్ల ఉత్వడుజాది పుంలింగ(మహత్)కార్యాలు రావు.) ఇంక

అమహత్త్వాన్నిబట్టి 'అమహన్నపుంసకములకు –' అనేసూత్రంచేత మువర్ణకం మాత్రమె వస్తుంది. వృషభము సింగమునకు మిత్రము.

**2. జిత్తు బిందుపూర్వం బగు.** (19)

ఈసూత్రం అర్థాన్ని సూరే వివరించాడు. 'జకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము'.

ఏ దైనా ప్రయోజనంకోసం ప్రత్యయాలు ఆగమాలు మొద లైనవాటికి చివర చేర్చి ప్రయోగించగా, ఆప్రయోజనం సిద్ధింపజేసి, ప్రయోగించేటపుడు విడిచిపెట్టబడే వర్ణాన్ని ఇత్తు అంటారు. జిత్తు అంటే జకారం ఇత్తుగా గలిగినది. అంటే దేనికి చివర జకారం ఇత్తుగా చేర్పబడిందో అది జిత్తు. జిత్తు అయినవర్ణానికి పూర్వంలో బిందువు వస్తుం దని సూత్రానికి అర్థం. బిందువు అని సామాన్యంగా చెప్పటంచేత అరసున్న, నిండుసున్న అనేరెండువిధా లయినసున్నలు వస్తాయి.

రామ శబ్దంమీద ప్రథమైకవచనవివక్షలో (ఉత్వం వచ్చి, రాము) 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనేసూత్రంచేత డుజ్ ప్రత్యయం వస్తుంది. డుజ్ అనేప్రత్యయంలో జకారం ఇత్తు. జకారం ఇత్తుగా కలిగినది కావటంచేత దానికి ముందు ఉన్న 'డు' అనేవర్ణం జిత్తు. డువర్ణం జిత్తు కావటంచేత ప్రస్తుతసూత్రం ప్రకారం ఆ'డు'వర్ణానికి పూర్వంలో అరసున్న వస్తే రాముఁడు. నిండుసున్న వస్తే రాముండు.

'మూఁడుశబ్దము డుజ్వర్ణంబునకు లోపంబును' అనేవిధంగా లోపం చెప్పిన స్థలంలో ఇలాగే జిత్తుగా చెప్పినచోట ఆవర్ణం ముం దున్నబిందువుతో సహా లోపించిపోతుంది. మూఁడు+జగములు=ముజ్జగములు. మొ.

'జిత్తు' అనటంచేత జిత్తు గానిదానికి ముందు బిందువు రాదు. వనము, ధేనువు.

'అగు' అనటంచేత బిందువు రావటం నిత్యం గాబట్టి బిందువు లేకుండా రాముడు ఇత్యాదిగా ఉండటానికి వీలు లేదు.

**3. పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు.** (22)

స్త్రీతిర్యగ్జడభిన్నం అంటే పురుషుణ్ణి బోధించేశబ్దం మహద్వాచకం. 'డుజ్' అన్నచోట జకారం ఇత్తు. కాబట్టి అది లోపించిపోతుంది. 'డుమువులు ప్రథమ' అనేసూత్రాన్ని అనుసరించి యీ'డు'వర్ణం ప్రథమావిభక్తి. 'డుమువున లేకవచనంబులు' అనేసూత్రంప్రకారం ఏకవచనం. ఇది ప్రత్యయం కాబట్టి పరంగా వస్తుంది.

సంస్కృతాన్నిబట్టి పుంలింగమూ, తెలుగువ్యాకరణాన్నిబట్టి మహద్వాచకమూ అయినప్రాతిపదికకు పరంగా, ప్రథమావిభక్తి ఏకవచనంలో డుఙ్ అనేప్రత్యయం వస్తుం దని సూత్రానికి అర్థం.

రామ. ఈప్రాతిపదికం పుంలింగం, మహద్వాచకం. దీనిపై ప్రథమాఏకవచనాన్ని వివక్షిస్తే 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి రాము. దీనిమీద ప్రస్తుతసూత్రంచేత ప్రథమైకవచనంగా డుఙ్ప్రత్యయం వచ్చి రాము + డుఙ్. 'ఙిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత డువర్ణానికి ముందు అరసున్న వచ్చి, తర్వాత ఇ త్తయిన ఙకారం లోపించగా రాముఁడు. నిండుసున్న వస్తే రాముండు.

'పుంలింగ మగు మహద్వాచకము' అని సామాన్యంగా చెప్పడంచేత మహద్వాచక మయినప్రాతిపదిక మెటువంటి దయినా, (అదంతేతరాలకు గూడా) డుఙ్ వస్తుంది. విశ్వపుఁడు, శంభుఁడు, విధాతృఁడు.

'పుంలింగ మగు' అనడంచేత మహద్వాచక మయినా పుంలింగం కాకపోతే డుఙు రాదు. దైవము మిత్రము.

'మహద్వాచకమునకు' అనడంచేత పుంలింగ మైనా మహద్వాచకం కాకపోతే డుఙు రాదు. వృక్షము. ఋక్షము - మొ.

పుంలింగమూ, మహద్వాచకమూ రెండూ కాకపోతే ఎలాగూ డుఙు రాదు. కళత్రము.

'అగు' అనడంవల్ల డుఙు నిత్యం. కాబట్టి రాము ఇత్యాదిగా డుఙు రానిరూపా లుండవు.

**3. అనుదంత మగుతెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును.** (24)

ఉత్ + అంత = ఉదంతము. హ్రస్వ మైనఉకారం చివర గలిగినశబ్దం ఉదంతం. అనుదంతం అంటే ఉదంతం గానిది. చివర హ్రస్వ మైనఉకారం లేనిది. తెనుగు అంటే అచ్చతెనుగు. ప్రథమావిభక్తి ఏకవచనంలో డుఙ్ ప్రత్యయం చేరేప్రాతిపదికకు డుమంతం అని సంజ్ఞ. 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు' అనేపూర్వ సూత్రంనుండి 'ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు' అనేభాగం ఈసూత్రంలోకి వచ్చి అన్వయిస్తుంది. నిక్ + ఆగమ - అన్నప్పుడు కకారం ఇత్తు. కిత్తు అయిన 'ని' డుమంతానికి చివర చేరుతుంది.

ద్వితీయ మొద లయినవిభక్తులలో ఏకవచనం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న ఉదంతం కానిఅచ్చతెలుగుడుమంతప్రాతిపదికకు చివర 'ని' అనేఆగమం నిత్యంగా వస్తుం దని సూత్రాని కర్థం.

'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' అనేసూత్రంచేత వికల్పంగా ప్రాప్తిస్తున్నఆగమాన్ని యీసూత్రం నిత్యంగా చెపుతున్నది.

'మగ' అనేప్రాతిపదికపై ద్వితీయ ఏకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అనేసూత్రం చేత నువర్ణం వచ్చి, మగ + ను అని ఉండగా 'డుమంతంబునకు' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత నిగాగమం నిత్యంగా రాగా, మగని + ను. ఇకారంబుమీది – అనే సూత్రంచేత ఇత్వం వచ్చి మగనిని. ఇలాగే మగనిచేత మగనియందు మొ.

నిత్యం గాబట్టి నిగాగమం రాని 'మగచేత'వంటిరూపా లుండవు. ఇలాగే అందగానిచేత, అటమటీనియందు మొ.

'అనుదంత' అనడంచేత ఉదంతాలకు నిగాగమం నిత్యం గాదు. 'డుమంతంబునకు' అనేపూర్వసూత్రంచేత విభాషగా వస్తుంది. తమ్మునిని – తమ్ముని. తమ్మునిచేత – తమ్ముచేత మొ.

'తెనుఁగు' అనడంచేత అనుదంత మైనా, సంస్కృతడుమంతానికి నిగాగమం నిత్యం గాదు. పూర్వసూత్రంచేత వికల్పమె. విధాతృనియొక్క విధాతృయొక్క ఆనతి – విధాతృనానతి. మొ.

'డుమంతంబునకు' అనడంచేత డుమంతం కానిశబ్దాలకు నిగాగమం రాదు. అన్నను, అన్నచేత ఇత్యాది.

'ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు' అనటంచేత ఇతరవిభక్తిస్థలాల్లో నిగాగమం రాదు. మగఁడు, మగలను ఇత్యాది.

'నిత్యముగా నగు' అనడంచేత నిగాగమం రానిరూపా లుండవు. మగని, మగచేత ఇత్యాదిగా ఉండవు.

**4. మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు.** (41)

వర్ణకం అంటే ప్రత్యయం. మువర్ణకం అంటే ముప్రత్యయం. ప్రథమావిభక్తి ఏకవచనం అని ప్రకరణాన్నిబట్టి ఇక్కడ అర్థం. ముగాగమం అంటే ప్రథమైకవచనం

కంటే వేరైన విభక్తి పరంగా ఉండగా అదంతా లయిన అమహన్నపుంసకశబ్దాలకు ఆగమంగా వచ్చిన ము అనేవర్ణం. కార్యం అంటే లోపం, ఆగమం, ఆదేశం మొదలైనమార్పులు.

ప్రథమావిభక్తి ఏకవచనప్రత్యయం ఐనమువర్ణకానికి విధింపబడిన లోపం, ఆగమం, ఆదేశం మొద లైనఆయాకార్యాలు ముగాగమానికి కూడా వస్తా యని అర్థం.

'చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత మువర్ణకానికి ప్రథమైకవచనంలో విధించినలోపం ప్రథమైకవచనేతరస్థలాలలో ఉన్న ముగాగమానికి కూడా వస్తుంది. చరిత్ర–చరిత్రము లాగే చరిత్రలు–చరిత్రములు. మొ.

'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' అని మువర్ణకానికి విధించిన పు, ంపు అనేఆదేశం ముగాగమానికి కూడా వస్తుంది. సరసము+మాట=సరసపుమాట. ఇలాగే విరసము(లు)+వచనములు=విరసపువచనములు.

'మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు' అనేసూత్రంచేత విధింపబడిన మాముడి ముగాగమానికి కూడా వస్తుంది. వనమ్ము లాగా వనమ్ములు. (ఇలాగే వనంబు, వనంబులు) మొ.

'మువర్ణకంబునకు' అనటంచేత ప్రత్యయ మైనమువర్ణానికి విధించినకార్యమే ముగాగమానికి వస్తుంది. ముగాగమానికి చెప్పినకార్యం మువర్ణకానికి రాదు. 'లులనలు పరంబు లగునపుడు ముగాగమంబునకు లోపంబును...' అని చెప్పిన ముగాగమలోపం మువర్ణకానికి లేదు. వజ్రాలు లాగా ప్రథమైకవచనంలో 'వజ్రా' అని కాదు.

'ముగాగమంబునకు' అనటంచేత ఆగమం కాని మువర్ణానికి రాదు. పాముయొక్క కాటు – పాముకాటు. పాపుకాటు అనేవిధంగా పుంపులు మొ.కార్యాలు రావు.

**5. అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుమీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు.** (38)

అదంత (అత్ + అంత) మంటే హ్రస్వ మయినఅకారం చివర గలిగినశబ్దం. ఉపధ అంటే శబ్దంలో చివరినుంచి రెండవవర్ణం. విభక్తికి సంబంధించినలకారం విభక్తిలకారం. 'లువర్ణంబు బహువచనంబు' అని చెప్పిన ప్రథమాబహువచన

మైనలువర్ణం, బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు ఆగమంగా వచ్చిన (లడాగమ) లవర్ణం. అనే రెండిటిలోని లకారం విభక్తిలకారం. 'లకారంబునకు' అన్నచోటిషష్ఠికి లకారం 'స్థానంలో' అని అర్థం. పురుషుణ్ణి బోధించేశబ్దం మహత్తు.

1. మహద్వాచకమూ, 2. హ్రస్వ మైనఅకారం చివర గలిగినదీ, 3. ఆ 'అ' కారానికి పూర్వంలో అంటే ఉపధగా లకారం కలిగినదీ, 4. ఆలకారానికి పూర్వంలో దీర్ఘం ఉన్నదీ, అయిన ప్రాతిపదికకు పరంగా ఉన్న 'లు–ల' అనే ప్రథమాది బహువచనం ఐన లకారంస్థానంలో రేఫం అంటే 'ర్' అనేది ఆదేశంగా వస్తుంది. అని సూత్రార్థం.

'బాల' ప్రాతిపదిక. 'పుంలింగం బయి మహద్వాచకం బయిన –' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి బాలు. ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత 'లు' ప్రత్యయం వచ్చి బాలు+లు అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత బహువచనలకారానికి రేఫం ఆదేశమై – బాలురు.

'అదంతం బయి' అనడంచేత అదంతాలు కానివాటికి ఈకార్యం రాదు. ధీశాలి+ లు = ధీశాలులు. 'దయాళు' అనే ఉదంతంమీద మాత్రం విశేషంగా రేఫ వస్తున్నది. దయాళురు. ఈసందర్భంలో ఆకారాంతశబ్దాలు లేవు. కాఁబట్టి అదంత అని తపరకరణానికి స్పష్టతే ప్రయోజనం.

'దీర్ఘపూర్వ' అనడంచేత లోపధం హ్రస్వపూర్వమైతే ఈకార్యం రాదు. నల – నలులు.

'లోపధంబు' అనడంచేత లకారం కాక వేరొకటి ఉపధ అయితే యీకార్యం రాదు. రామ – రాములు.

'మహత్తు' అనడంచేత అమహత్తులకు ఈకార్యం లేదు. 'ఆడుపిల్ల' అనేఅర్థంలో ఉన్నబాలశబ్దం అమహత్తు. దీనిపై రేఫ రాదు. బాలలు.

'విభక్తి' అనడంచేత విభక్తి గానిలకారానికి రేఫం రాదు. నృపాలులాభము.

'లకారంబునకు' అనడంచేత ఇతరహల్లుల కీకార్యం లేదు. బాలుని మొ.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి బాలులు, బాలులను ఇత్యాదిగా రేఫ రానిరూపా లుండవు.

**6. అమహన్నపుంసకముల కదంతములకు ముఁవర్ణకం బగు.** (40)

అమహత్తులూ, నపుంసకాలూ, అమహన్నపుంసకాలు. ఇది ద్వంద్వసమాసం.

స్త్రీ తిర్యగ్జడాలూ వానివిశేషణాలూ, అమహత్తులు. అదంత (అత్ + అంత) అంటే హ్రస్వ మైనఅకారం చివర గలిగినశబ్దం. 'డుమువులు ప్రథమ' అనేసూత్రాన్నిబట్టి 'ము' అనేది ప్రథమావిభక్తి. 'డుమువున లేకవచనంబులు' అనేసూత్రాన్నిబట్టి ఏకవచనం. వర్ణకం అంటే ప్రత్యయం. ప్రత్యయం కాబట్టి (ప్రాతిపదికకు) పరంగా వస్తుంది.

హ్రస్వ మైనఅకారం చివర గలిగిన 1. అమహత్తు లైనప్రాతిపదికలకూ, అలాగే 2. అదంతా లయిన, సంస్కృతంప్రకారం నపుంసకలింగాలు అయిన ప్రాతిపదికలకూ పరంగా ప్రథమావిభక్తి ఏకవచనంలో 'ము' అనేప్రత్యయం వస్తుంది, అని సూత్రార్థం.

'వృక్ష' – ప్రాతిపదిక. ఇది పుంలింగం – కాని జడవాచకం కావడవల్ల అమహత్తు. అదంతం ఐంది. కాబట్టి దీనిపై ప్రథమైకవచనంలో ప్రస్తుతసూత్రంచేత మువర్ణకం వచ్చి, వృక్షము.

'దైవ' ప్రాతిపదిక. ఇది మహద్వాచకం. అయినా సంస్కృతా న్ననుసరించి నపుంసకలింగం. అదంతం ఐంది. కాబట్టి ప్రథమైకవచనంలో ప్రస్తుతసూత్రంచేత మువర్ణకం వచ్చి – దైవము. ఇలాగే మిత్రము మొ.

అమహత్తు లైనశబ్దాలు నపుంసకలింగాలు కాకపోయినా మువర్ణకం వస్తుంది. వృక్షము. (పుంలింగం) విశేషవిధానంవల్ల స్త్రీలింగాలకు మాత్రం మువర్ణకం రాకుండ ప్రథమైకవచనలోపం వస్తుంది. వనిత, విద్య. మొ.

అలాగే నపుంసకలింగాలు అమహత్తులు కాకపోయినా మువర్ణకం వస్తుంది. దైవము – కళత్రము. మొ.

'అమహన్నపుంసకములకు' అనడంచేత అమహత్తు గానీ, నపుంసకం గానీ ఏదీ కానిశబ్దానికి ఈకార్యం రాదు. రాముఁడు, మగఁడు. మొ.

'అదంతములకు' అనడంచేత అదంతాలు కానివాటికి మువర్ణకం రాదు. అందుచేత పాము, మినుము మొద లైనవాటిల్లో మువర్ణం ప్రత్యయం కా దనీ, అది ప్రాతిపదికలో భాగమే అనీ గ్రహించవచ్చు.

**7. ఇగ్గౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు.** (44)

హ్రస్వం (ఇ) దీర్ఘం (ఈ) అయిన ఇకారం చివర ఉన్నశబ్దాలు ఇకారాంతాలు. రై + ఉగంత = రాయుగంత. రై అనేశబ్దం. 'ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమం వచ్చిన(హలంత)ప్రాతిపదికలు ఉగంతాలు. 'అదర్శనం లోపః' అని తొలగిపోవడం లోపం.

1. హ్రస్వం, లేదా దీర్ఘం అయినఇకారం చివర గలిగినశబ్దాలకూ, 2. గ్లౌ, (గ్లో) రై (రో) అనేశబ్దాలకూ, 3. ఉగాగగమం చివర గలిగిన (హలంత) శబ్దాలకూ, పరంగా ఉన్నప్రథమావిభక్తి ఏకవచనానికి లోపం వస్తుం దని సూత్రాని కర్థం.

గిరి, శ్రీ, గ్లౌ, రై మొద లైనశబ్దాలపై ప్రథమైకవచనంలో తెలుగులో ఏప్రత్యయమూ రాదు. కాబట్టి (హరి – మరుత్తు మొ. సహా) ఈశబ్దా లన్నింటిపైన సంస్కృతంలో ప్రథమాఏకవచన మైన 'సు'విభక్తి చేసుకొని దానికి లోపం చేసుకోవడం సంప్రదాయం.

'హరి' అనేప్రాతిపదికంమీద ప్రథమావిభక్తి ఏకవచనంలో 'సు'ప్రత్యయం వచ్చి 'హరి + సు'. ఇది (హరి) ఇకారాంతం కాబట్టి ప్రస్తుతసూత్రంచేత ఆ 'సు' ప్రత్యయం లోపించి 'హరి' అనే ప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

'ఇ' అని తపరకరణం లేకుండా నిర్దేశించడంచేత ఈకారాంతాలపై గూడా ఈలోపం వస్తుంది. శ్రీ. ధీ.

అలాగే లింగనిర్దేశం లేకపోవడంచేత అన్నిలింగాలకూ ఈసూత్రంచేత 'సు' లోపం వస్తుంది. స్త్రీలింగాలకు గూడా ఇకారాంతాలకు 'స్త్రీలింగంబుల ప్రథమైక వచనంబునకు' అనేసూత్రాన్ని బాధించి ఈవిశేషవిధిచేతనే లోపం వస్తుంది.

'గ్లౌ, రై' అనే నిర్దేశంవల్ల వీటికి ఓత్వం వచ్చిన – గ్లో, రో అనే రూపాలపైన గూడా ఈసూత్రంచేత సులోపం వస్తుంది. రో, గ్లౌ.

'ఇగ్లౌరాయుగంతంబుల' అనడంచేత వీటిలో చేరనిశబ్దానికి ఈకార్యం రాదు. రాముఁడు.

'ప్రథమ' అనడంచేత ఇతరవిభక్తులకు లోపం రాదు. హరిని.

'ఏకవచనంబునకు' అనడంచేత (ప్రథమా)బహువచనానికి లోపం రాదు. హరులు.

'అగు' అనడంచేత లోపం నిత్యం. కాబట్టి లోపం రానిరూపం ఉండదు.

'హరి' ఇత్యాదులు ప్రాతిపదికలు, విభక్త్యంతం కానియీశబ్దం పదం కాదు. అపదాలు ప్రయోగార్హాలు కావు, వీటికి (ప్రయోగార్హతకై) పదత్వం సిద్ధించడానికి ఈవిధంగా ప్రథమైకవచనలోపం చెప్పబడింది.

**8. ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు.** (48)

ఉకారం అంతంలో గలిగినశబ్దం ఉకారాంతం. ఉకారం అంటే ఉ,ఊ, అనే హ్రస్వదీర్ఘాలు రెండూ గ్రహింపబడతాయి. సంసృతంలోని ఓకారాంతశబ్దాలలో గోశబ్దం ఒకటే తెలుగులో ప్రవేశిస్తున్నది. అంతట అనడంచేత అన్ని విధా

లయిన(స్త్రీలింగ)శబ్దాలకూ ఈకార్యం వస్తుంది. 'డుమువులు ప్రథమ' అనేసూత్రంచేత 'వు' ప్రథమావిభక్తి. 'డుమువున లేకవచనంబులు' అని యిది ఏకవచనం. వర్ణకం అంటే ప్రత్యయం. కాబట్టి (ప్రాతిపదికకు) పరంగా వస్తుంది. ఉకారాంతా లని సామాన్యంగా చెప్పడంవల్ల మహత్తు లయినా అమహత్తు లయినా, ఏలింగంలో ఉన్నా యీప్రత్యయం వస్తుంది.('ఉకారాంతం బగుమహత్తునకు' అనేసూత్రం మహద్వాచకాలకు విశేషవిధి ప్రారంభించడంవల్ల ఈసూత్రంచేత అమహత్తులకే వువర్ణకం నిలుస్తుంది.)

ఉకారం చివర గలిగినఅన్నివిధ మైన (అమహత్) ప్రాతిపదికలకూ, గో అనే ప్రాతిపదికకూ పరంగా ప్రథమావిభక్తిఏకవచనంలో 'వు' అనేప్రత్యయం వస్తుంది.

'తరు' అనే (పుంలింగ – అమహత్) శబ్దంమీద ప్రథమాఏకవచనవివక్షలో ఈసూత్రంచేత వుప్రత్యయం వచ్చి 'తరువు' అని అవుతుంది. ఇలాగే ధేనువు (స్త్రీలింగం). మధువు (నపుంసకలింగం).

'ఉకారాంత' అని తపరకరణం లేకుండా చెప్పడంవల్ల ఊకారాంతం మీద గూడ వుప్రత్యయం వస్తుంది. భ్రూవు.

'ఉకారాంత గోశబ్దంబులకు' అనడంచేత ఇతరశబ్దాలకు ఈకార్యం రాదు. రాముఁడు.

'అంతట' అనడంవల్ల స్త్రీలింగశబ్దాలకు రావలసిన ప్రథమైకవచనలోపాన్ని బాధించి అక్కడ గూడా వుప్రత్యయం వస్తుంది. ధేనువు.

ఆచ్ఛికశబ్దాలలో ఉకారాంతా లన్నీ స్త్రీసమాలు. స్త్రీసమత్వఅతిదేశంవల్ల వాటిమీద ప్రథమైకవచనలోపమే వస్తుంది. ఊరు, పేరు. చెఱువు, కరువు, మురువు. ఇత్యాదుల్లో కనబడే వు ప్రథమైకవచనం కాదు. ప్రాతిపదికలో భాగం.

కాబట్టి ఈసూత్రంచేత అమహత్తు లైనసంస్కృతప్రాతిపదికలకే వువర్ణకం వస్తుంది.

'అగు' అనడంచేత వుప్రత్యయం నిత్యం. కాబట్టి 'వు' లేకుండా, ధేను ఇత్యాది రూపా లుండవు.

**9. కద్రువ నాగమాత.** (51)

కద్రూ అనేసంస్కృతశబ్దం పాములకు తల్లి అనేఅర్థంలో తెలుగులో 'కద్రువ' అని అవుతుం దని సూత్రాని కర్థం.

ఇది నిపాతసూత్రం. శాస్త్రంచేత ఒకవిధంగా (కద్రువు) ఏర్పడుతున్నరూపాన్ని

ప్రయోగానుసారంగా వేరొక విధంగా (కద్రువ) ఉంటుం దని నియమించడాన్ని నిపాత అంటారు.

'కద్రూ' ప్రాతిపదిక. 'నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత హ్రస్వం వచ్చి 'కద్రు'. ఈ స్త్రీలింగశబ్దం మీది ప్రథమావిభక్తి ఏకవచనానికి 'స్త్రీ లింగంబుల – అనేసూత్రంచేత రావలసినలోపాన్ని బాధించి 'ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంచేత వువర్ణకం వచ్చి 'కద్రువు' అని అవుతుంది. అలాగే మిగిలినవిభక్తులలో కద్రువును, కద్రువులు ఇత్యాదిగా రూపా లవుతాయి.

ప్రస్తుతసూత్రం 1. కద్రూ శబ్దం దీర్ఘానికి హ్రస్వాన్నీ, 2. దానిపైన 'వ' వర్ణం ఆగమం కావడాన్నీ నియమిస్తున్నది.

'కద్రూ' అనేప్రాతిపదికానికి, హ్రస్వం, వువర్ణకం వస్తుండగా వాటిని బాధించి ప్రస్తుతసూత్రంచే హ్రస్వం (కద్రు), పైన 'వ' వర్ణాగమం వచ్చి 'కద్రువ' అని ప్రాతిపదిక ఏర్పడుతుంది. ఇది స్త్రీలింగం కాబట్టి 'స్త్రీలింగంబుల –' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి కద్రువ అవుతుంది. ఇతరవిభక్తిస్థలాల్లో గూడా హ్రస్వం, వవర్ణాగమం వచ్చి కద్రువలు, కద్రువను మొదలైన విధంగా రూపా లేర్పడుతాయి.

'కద్రువ' అనడంచేత 'నాగమాత' అనేఅర్థంలో 'కద్రువు' అనే సాధారణరూపం ఎపుడూ ఉండదు.

'నాగమాత' అనడంచేత పాములతల్లి అనేదానికంటే వే రైనఅర్థంలో 'కద్రువ' అనేరూపం కాదు. సామాన్యశాస్త్రానుగుణంగా కద్రువు, కద్రువులు అనేవిధంగా ఏర్పడుతుంది. గోరోజనవర్ణం అని దీనికి అర్థం.

**10. చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు.** (58)

చరిత్ర మొద లయినవి చరిత్రాదులు. మువర్ణకం ప్రథమావిభక్తి ఏకవచనం. 'ముర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' అనేసూత్రంప్రకారం ఇతరవిభక్తులు పర మైనపుడు ఆగమంగా వచ్చినమువర్ణానికి కూడా ఈలోపం వస్తుంది.

చరిత్ర మొద లయినశబ్దాలపైన ప్రథమావిభక్తి ఏకవచనంగా వచ్చిన 'ము' ప్రత్యయానికి, మిగిలినవిభక్తులు పర మైనపుడు వచ్చిన 'ము' ఆగమానికీ బహుళంగా లోపం వస్తుంది అని సూత్రతాత్పర్యం. బహుళం అంటే ప్రవృత్తి మొదలుగా అనేకవిధాలుగా ఈకార్యాలు జరుగుతాయి.

**విభాష :** చరిత్ర అనేప్రాతిపదికపై ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో 'అమహ

న్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ము ప్రత్యయం వచ్చి చరిత్ర + ము అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత ఆమువర్ణం లోపించి చరిత్ర అని అవుతుంది. బహుళం గాబట్టి లోపం రాకపోతే చరిత్రము. ఇలాగే ఇతరవిభక్తుల్లో ముగాగమం లోపించి, చరిత్రలు మొ.

**ప్రవృత్తి :** దర్భ మొద లయినశబ్దాలమీద మువర్ణకం నిత్యంగా లోపిస్తుంది. దర్భ, పనస మొద లయినవి. లోపం నిత్యం కాబట్టి మువర్ణకంతో దర్భము అనేవిధ మైన రూపా లుండవు.

'చరిత్రాదుల' అనడంచేత చరిత్ర మొదలైన వాటిల్లో చేరనిశబ్దానికి ఈలోపం రాదు. వృక్షము, మిత్రము మొ. లోపం రానిశబ్దం చరిత్రాదుల్లో చేరదు. చరిత్రాదుల్లో లేకపోతే లోపం రాదు. కాబట్టి యిటువంటి (గణానికి చెప్పిన) విధానాల్లో అప్రవృత్తి ఉండదు.

'మువర్ణకంబునకు' అనడంచేత మువర్ణకంకంటె ఇతరవర్ణాలకు లోపం రాదు. చరిత్ర(ము)లు – చరిత్ర(ము)చేత – మొద లగునవి.

**11. స్వర్గివాచి దేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు. (59)**

స్వర్గివాచి అంటే స్వర్గంలో ఉన్నవారిని తెలిపేది. ఏకత్వం అంటే ఏకత్వాన్ని బోధించే ఏకవచనంతోనూ, అలాగే బహుత్వం అంటే బహువచనంతోనూ – ఉంటుం దని అర్థం. యథాసంఖ్యంగా అన్వయం (దేవ – ఏకత్వ, సుర – బహుత్వ).

స్వర్గంలో ఉన్నవారిని తెలిపే 'దేవ' అనేసంస్కృతశబ్దం తెలుగులో ఏవిభక్తిలో నైనా ఏకవచనంతో మాత్రమే ప్రయోగింపబడుతుంది.

'దేవ' అనేప్రాతిపదికం పుంలింగమూ, మహద్వాచకమూ కాబట్టి 'పుంలింగం బయి మహద్వాచకం బయిన' అనేసూత్రంచేత ఉత్వమూ, 'పుంలింగ మగు – అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో డుజూ వచ్చి దేవుఁడు అవుతుంది.

అలాగే మిగిలినవిభక్తుల్లో గూడా దేవుని, దేవునిచేత ఇత్యాదిగా ఏకవచనాంత రూపాలే ఉంటాయి.

స్వర్గంలో ఉన్నవారిని తెలిపే 'సుర' అనేసంస్కృతశబ్దం తెలుగులో అన్నివిభక్తుల్లోనూ బహువచనంతో మాత్రమే ప్రయోగింపబడుతుంది.

'సుర' అనేపుంలింగప్రాతిపదికకు 'సురశబ్దంబు నిత్యంబుగా – స్త్రీతుల్యంబు లగు' అనేసూత్రంచేత స్త్రీలింగతుల్యత్వం రాగా, (మహత్) పుంలింగకార్య మైన ఉత్వం (మొ.) రాదు. ప్రస్తుతసూత్రంచేత బహువచనమే వస్తుంది. ప్రథమావిభక్తిలో

లువర్ణం వచ్చి సురలు అవుతుంది. ఇలాగే మిగిలినవిభక్తులలో సురలను – సురలచేత మొద లగునవి.

'స్వర్గివాచి' అనడంచేత స్వర్గంలో ఉన్నవారిని కాకుండా ఇతరులను బోధించే పక్షంలో ఈనియమం లేదు. అంటే దేవశబ్దం (ఏక) బహువచనంలోనూ, సురశబ్దం ఏక (బహు) వచనంలోనూ ప్రయోగించవచ్చు. (భూదేవుఁడు) భూదేవులు – భూసురుఁడు (భూసురులు). (భూలోకంలోని దేవతలు – బ్రాహ్మణులు)

'దేవసురశబ్దంబు' లనటంచేత ఇతరశబ్దాలకు ఈనియమం లేదు. దేవతలు అసురుఁడు మొ.

'ఏకత్వ' అనడంచేత దేవశబ్దాన్ని బహుత్వంలో అంటే బహువచనంతో ప్రయోగించ రాదు. దేవీశబ్దంనుండి దేవులు ఉంటుంది. దేవశబ్దంనుంచి దేవులు, దేవులను అని కాదు. బహుత్వార్థం కావలసివస్తే 'దేవ' శబ్దం కాకుండా వేరేశబ్దం ప్రయోగించు కోవలసిందే. దేవతలు – సురలను మొద లగునవి.

'బహుత్వ' అనడంచేత సురశబ్దం ఏకత్వార్థంలో అంటే ఏకవచనంలో ప్రయోగించ రాదు. సుర, సురను ఇత్యాది ఏకవచనాంతరూపా లుండవు. ఏకత్వార్థంలో సురశబ్దం కాకుండా వేరేశబ్దం ప్రయోగించుకోవలసిందే. దేవుఁడు, దేవత మొ.

**12. ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు.** (73)

ఋత్విక్ – మొద లైనవి ఋత్విగాదులు. ద్వితీయావిభక్తి ఏకవచనం చివర గలిగినసంస్కృతపదంతో సమాన మైనరూపం ద్వితీయైకవచనాంత – తుల్యం.

'ఋత్విజ్' మొద లైనశబ్దాలకు సంస్కృతంలో వాటిద్వితీయైకవచనాంతంతో తుల్య మైనరూపం తెలుగులో వికల్పంగా ప్రాతిపదిక మవుతుం దని సూత్రార్థం.

ఈఋత్విగాదులు మతుబాదుల్లోవి కాదు. కాగా 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనాంతతుల్యరూపం ప్రాతిపదిక మవుతుంటే దాన్ని బాధించి, యీసూత్రంచేత ద్వితీయైకవచనాంతతుల్య రూపం ప్రాతిపదిక అవుతుంది.

ఋత్విజ్ అనేజకారాంతసంస్కృతశబ్దానికి 'హలంతంబు' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత ద్వితీయైకవచనాంత తుల్య మైన 'ఋత్విజమ్' అనేది ప్రాతిపదిక. 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అని చివరిమకారం లోపిస్తుంది. ఇది పుంలింగమూ మహద్వాచకమూ కాబట్టి ఉత్వడుజులు వచ్చి ఋత్విజుఁడు.

'విభాష' అనడంచేత ద్వితీయైకవచనాంతతుల్యరూపం కానిపక్షంలో 'హలంతంబు'

అనేసూత్రంచేత ప్రథమైకవచనాంతతుల్య మైన 'ఋత్విక్' అనేది ప్రాతిపదిక అయి 'ఉగాగమంబును ద్విత్వంబును' – వచ్చి 'ఇగ్లొరాయుగంతంబులకు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి ఋత్విక్కు అవుతుంది.

'ఋత్విగాదులు' అనడంచేత ఋత్విగాదుల్లో లేనిశబ్దానికి ఈకార్యం లేదు. రుక్కు.

'ద్వితీయ' అనడంచేత ప్రాతిపదిక (ప్రథమ) తృతీయాద్యంతతుల్యం గాదు. ఋత్విజేన ఇత్యాదిగా ఉండదు.

'ఏకవచన' అనడంచేత ద్వితీయలో బహువచనాంతతుల్యం గాదు. ఋత్విజాన్ ఇత్యాదిగా ఉండదు.

'విభాష' అనడంచేత ఋత్విగాదులకు ద్వితీయైకవచనాంతతుల్యరూపం (ఋత్విజుడు)తోనూ ప్రథమైకవచనాంతతుల్యరూపం (ఋత్విక్కు)తోనూ రెండు రూపా లుంటాయి.

**13. విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు.** (75)

విశ్వకర్మ మొద లైనవి విశ్వకర్మాదులు. ఇవి నకారాంతాలు. పుంలింగశబ్దాలు. మహత్తులు. స్త్రీత్వం అంటే స్త్రీలింగధర్మం. విశ్వకర్మన్ మొద లైన నకారాంతశబ్దాలకు నిత్యంగా స్త్రీలింగత్వం వస్తుం దని సూత్రార్థం. పుంలింగా లైన ఈశబ్దాలకు (మహత్) పుంలింగకార్యా లైన ఉత్వమూ, డుజూ, నిగాగమం మొద లైనవి రాకుండా, అతిదేశించిన స్త్రీలింగధర్మంవల్ల ప్రథమైకవచనలోపం మొద లైనస్త్రీలింగకార్యాలు వస్తాయి.

విశ్వకర్మన్ అనేసంస్కృతశబ్దానికి 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత విశ్వకర్మా ప్రాతిపదిక. 'నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి 'విశ్వకర్మ'. ప్రస్తుతసూత్రంచేత దీనికి స్త్రీత్వం రాగా 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం (సువిభక్తి) లోపించి. 'విశ్వకర్మ' అనేప్రథమైక వచనాంతపదం ఏర్పడుతుంది. మిగిలినవిభక్తుల్లో విశ్వకర్మలు – విశ్వకర్మను – మొద లగునవి.

'విశ్వకర్మాదులకు' అనడంచేత విశ్వకర్మాదుల్లో లేనిశబ్దానికి ఈకార్యం రాదు. సుత్రాముఁడు, సుధన్వుఁడు మొ.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి స్త్రీత్వం లేనిరూపం ఉండదు. (మహత్)

పుంలింగకార్యాలతో 'విశ్వకర్ముఁడు' అనేవిధమైన రూపా లుండవు.

**14. మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు.** (78)

స్వ +అర్థ – పరము. అంటే తనయొక్క అర్థాన్ని ప్రధానంగా తెలిపేది. పురుషణ్ణి బోధించేది మహత్తు. 'రాజన్' అని ఈశబ్దం నకారాంతం. సంస్కృతసమాసంలో చివర ఉన్నపుడు (టచ్ అనే) సమాసాంతప్రత్యయంతో ఖగరాజ ఇత్యాదిగా ఇది అకారాంతం అవుతుంది. 'రాజశబ్దం' అంటే ఈరెండు విధా లయినదీ గ్రహింప బడుతుంది. ఇది నిపాతవిధి.

తనఅర్థాన్నే ప్రధానంగా బోధించే రాజన్‌శబ్దం తెలుగులో 'రాజు' అనేరూపం పొందుతుం దని సూత్రాని కర్థం.

రాజన్ శబ్దం. 'హలంతంబు ప్రథమైక –' అనేసూత్రం ప్రకారం 'రాజా' అని ప్రాతిపదిక అయి, తుదిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, మహత్పుంలింగం కాబట్టి ఉత్వ డుజులతో రాజుఁడు అని కావాలి. ఇలాగే సమాసాంత మైన 'రాజ' అనేఅకారాంత శబ్దం గూడా మహ త్తయితే ధర్మరాజుఁడు, ఖగరాజము (మహత్తుగా వివక్షించడంచేత మహ త్తయిన అమహత్తు) అనేవిధంగా మాత్రమే కావాలి. ఇది 'రాజు' అని అవుతుం దని యీసూత్రం నియమిస్తున్నది.

ఈసూత్రం చేత 1. రాజన్ శబ్దానికి నకారలోపం, 2. (సమాసాంతంలోనూ) చివరిఅత్వానికి ఉత్త్వమూ, 3. స్త్రీవద్భావమూ, నిపతింపబడ్డాయి. 4. 'రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తము' అనేసూరివచనాన్నిబట్టి ఈసూత్రంచేతనే రాజులో జకారానికి దంత్యత కూడ నిపతింపబడినట్లు గ్రహించాలి.

'రాజన్' శబ్దానికి 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత నకారలోపం (రాజ), ఉత్వం (రాజు), స్త్రీవద్భావమూ కలుగుతాయి. స్త్రీవద్భావంవల్ల ఉదంత మైనా ఈశబ్దంమీద (వువర్ణకం రాకుండా) 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు–' అనేసూత్రంచేత సువిభక్తి లోపించి, రాజు అనేపదం ఏర్పడుతుంది. ఇతరవిభక్తుల్లో రాజులు, రాజును మొ.

సమాసం చివరి 'రాజ' శబ్దం గూడా ఇలాగే. 'ఖగరాజు, అశ్వరాజు. (ఇవి తిర్యక్కులు గాబట్టి అమహత్తులే అయినా, శ్రేష్ఠతాదులనుబట్టి మహత్తుగా వివక్షించడంచేత మహత్తు లయినా యని గ్రహించాలి)

'మహత్త్వంబున' అనడంచేత అమహత్తు అయితే రాజు అని కాదు. అమహత్త్వాన్నిబట్టి మువర్ణకం వచ్చి – వృక్షరాజము, ఖగరాజము, అశ్వరాజము.మొ.

'స్వార్థపరంబు' అనుటచే రాజశబ్దం అర్థం అప్రధానం (ఉపసర్జనం) అయితే రాజు అని ఉండదు. హతరాజుఁడు (పరశురాముఁడు).

'రాజు నాఁబడు' అని యీవిధి నిత్యం. కాబట్టి రాజు అనేఅర్థంలో రాజుఁడు అనేరూపాంతరం ఎప్పుడూ ఉండదు.

**15. వేధ పురోధ పురోధసుఁడు.** (82)

వేధస్ అనే శబ్దానికి 'వేధ' అనీ, పురోధస్ అనేశబ్దానికి పురోధ, పురోధసుఁడు అనీ రూపాలు ఈసూత్రంచేత నిపతింపబడ్డాయి.

వేధస్, పురోధస్ అనేయీరెండు సకారాంతశబ్దాలు, పుంలింగాలు, మహద్వాచకాలు. కాబట్టి 'మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీయైకవచనాంతతుల్యత్వం బే నగు' అనేసూత్రంచేత సకారం లోపించినపక్షంలో ఉత్వడుజులు వచ్చి వేధుఁడు, పురోధుఁడు అని కావాలి. సకారం లోపించనిపక్షంలో ద్వితీయైకవచనాంతతుల్యరూపం – వేధసమ్, పురోధసమ్ ప్రాతిపదిక ఐ, దాని అంతిమమకారం లోపించి ఉత్వడుజులతో వేధసుఁడు – పురోధసుఁడు అని కావాలి.

శాస్త్రంప్రకారం పైవిధంగా సిద్ధిస్తున్నరూపాలను వారిస్తూ ప్రయోగానుసారంగా వేరేవిధంగా ప్రస్తుతసూత్రం రూపాలను నియమిస్తున్నది.

'వేధస్' శబ్దానికి 1. సకారం లోపించడమూ 2. స్త్రీవద్భావమూ – నిత్యంగా వస్తాయి. సకారం లోపించి వేధ అని కాగా స్త్రీవద్భావంవల్ల 'స్త్రీలింగంబుల – అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'వేధ' అవుతుంది. మిగిలినవిభక్తుల్లో వేధను, వేధచేత మొ. సలోప స్త్రీవద్భావాలు నిత్యం. కాబట్టి పుంలింగకార్యాలతో వేధుడు లేదా వేధసుఁడు అనేవిధ మైన డుమంతరూపం ఉండదు.

'పురోధస్' అనేశబ్దానికి సలోపస్త్రీవద్భావాలు వికల్పంగా వస్తాయి. సలోపం వచ్చినపక్షంలో 'పురోధ'. అపుడు స్త్రీవద్భావం కూడా వచ్చి 'స్త్రీలింగంబుల –' అని ప్రథమైకవచనం లోపించి పురోధ. ఇతరవిభక్తుల్లో పురోధలు – పురోధను మొ.

వికల్పం గావడంచేత సలోపమూ, స్త్రీవద్భావమూ రాకపోతే ద్వితీయైకవచనాంత తుల్యరూపం 'పురోధసమ్' ప్రాతిపదిక మై మకారం లోపించి ఉత్వడుజులు వచ్చి పురోధసుఁడు అని అవుతుంది.

సలోపం,స్త్రీవద్భావం, రెండూ కలిసే వస్తాయి. రాకపోతే రెండూ రావు. కాబట్టి సలోపం మాత్రమే వచ్చి పురోధుఁడు అని గానీ, లేదా స్త్రీవద్భావం మాత్రమే వచ్చి 'పురోధస' అని కానీ కావు.

**16.స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు.** (85)

స్త్రీలింగంలో ఆయాశబ్దాలకు సంస్కృతవ్యాకరణంలో ఆయాస్త్రీప్రత్యయాలు విధింపబడ్డాయి. అజంతాలు గానీ, హలంతాలు గానీ సంస్కృతంలోనిస్త్రీలింగశబ్దాలు అన్నీ అక్కడ ఆయాశబ్దాలకు విధింపబడిన ఆయాస్త్రీప్రత్యయాలతో కలిసి, తెలుగులోకి ప్రాతిపదికగా వస్తాయి అని సూత్రార్థం.

పుంలింగాలు, నపుంసకలింగాలు అయిన, అజంతశబ్దాలు సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో అవే తెలుగులోకి ప్రాతిపదికలుగా వస్తాయి. హలంతా లయితే ప్రథమైకవచనతుల్యరూపాలో, ద్వితీయైకవచనతుల్యరూపాలో ప్రాతిపదిక లవుతున్నాయి. స్త్రీలింగతుల్యాలు అలా కాకుండా స్త్రీప్రత్యయాలతో కలిసి రావడం విశేషంగా ఈలక్షణం చెప్తున్నది.

'కర్తృ' శబ్దం. ఇది స్త్రీలింగంలో 'ఋన్నేభ్యో జీప్' అని 'జీప్' అనేప్రత్యయంతో కలిసి, 'కర్త్రీ' అని అవుతుంది సంస్కృతంలో. తెలుగులో కర్తృ అనేది కాకుండా స్త్రీప్రత్యయం చివర గలిగిన 'కర్త్రీ' అనేశబ్దం ప్రాతిపదికగా వస్తుంది. 'నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం' బయి, 'ఇగ్లౌరాయుగంతంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'కర్త్రి' అవుతుంది. ఇతరవిభక్తుల్లో కర్త్రిని, కర్త్రులు మొ.

ఇలాగే నకారాంత మైన 'బుద్ధిశాలిన్' అనేశబ్దం జీ అనే స్త్రీప్రత్యయంలో కలిసి బుద్ధిశాలినీ అని సంస్కృతంలో ఏర్పడుతుంది. అది తెలుగులో ప్రాతిపది కవుతుంది. హ్రస్వమూ, సులోపమూ వచ్చి, బుద్ధిశాలిని.

'ఎల్లన్' అనడంచేత అజంతాలూ, హలంతాలూ అన్నీ గ్రహింపబడతాయి.

'స్త్రీప్రత్యయంబులం గూడి' అనడంవల్ల పుంలింగాదుల్లోవలె స్త్రీలింగంలో 'కర్తృ' మొద లైనవి ప్రాతిపదికలు కావు.

**17. మహతీతరంబు లగుస్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు.** (86)

మహత్ అంటే పురుషవాచకం. 'మహత్' అనేశబ్దం స్త్రీప్రత్యయాంతం కాగా ఏర్పడిన 'మహతి' అంటే స్త్రీవాచకం. మహతికంటె భిన్న మయినది అంటే స్త్రీవాచకం కానిశబ్దం మహతీతరం. క్లీబం అంటే నపుంసకలింగం.

స్త్రీవాచకాలు కానటువంటి, స్త్రీలింగా లైన (విశేష్య) శబ్దాలయొక్క విశేషణాలకు

వికల్పంగా నపుసంకలింగత్వం వస్తుం దని సూత్రాని కర్థం.

'విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రా న్ననుసరించి విశేష్యం స్త్రీలింగంలో ఉన్నపుడు దానివిశేషణం గూడా స్త్రీలింగంలోనే ఉంటుంది. అయితే స్త్రీలింగ మైనవిశేష్యం స్త్రీని బోధించేది కాకపోతే మాత్రం దానివిశేషణం నపుంసకలింగంలోనూ, స్త్రీలింగంలోనూ రెండు విధాలుగా ఉంటుంది.

హృద్య అగు విద్య. ఇక్కడ విద్య అనేది విశేష్యం. స్త్రీలింగం. కాని స్త్రీని బోధించేది కాదు. మహతీతరస్త్రీలింగం. కాబట్టి 'విశేష్యంబునకుం బోలె' అనేసూత్రాన్ని బాధించి ప్రస్తుతసూత్రంచేత – విశేషణ మైన 'హృద్య'శబ్దానికి క్లీబత్వం వస్తుంది. క్లీబత్వంవల్ల 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత ముపర్ణకం వచ్చి 'హృద్యము అగు విద్య' అని అవుతుంది.

'విభాష' అనడంచేత క్లీబత్వం రానిపక్షంలో 'విశేష్యంబునకుం బోలె' అనేసూత్రం ప్రకారం స్త్రీలింగత్వం వచ్చి, 'హృద్య'శబ్దంపై 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'హృద్య అగు విద్య' అని అవుతుంది.

'మహతీతరంబు' అనడంచేత విశేష్యం మహతి అయితే విశేషణానికి క్లీబత్వం రాదు. స్త్రీలింగంలో మాత్రమే ఉంటుంది. హృద్య అగువనిత.

'స్త్రీలింగంబుల' అనడంచేత విశేష్యం పుంలింగ మయితే విశేషణానికి క్లీబత్వం రాదు. మనోహరుఁ డగు రాముఁడు.

'విశేషణంబులకు' అనడంచేత విశేష్యానికి క్లీబత్వం రాదు. హృద్య అగు విద్యము అని కాదు.

## 4. ఆచ్ఛికపరిచ్ఛేదం

**1. ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుఁ గ్లీబసమంబులు నయియుండు.** (2)

సంస్కృతసమంకంటే వే రయినభాష ఆచ్ఛికం. ప్రాకృతసమ, తద్భవ, దేశ్యశబ్దాలు ఆచ్ఛికాలు. స్త్రీలింగంతో సమాన మైనది స్త్రీసమం. క్లీబసమం అంటే నపుంసకలింగంతో సమాన మైనది.

అచ్చతెలుగుశబ్దాలు తఱుచుగా స్త్రీ సమాలూ, క్లీబసమాలూ అయిఉంటాయి అని సూత్రార్థం.

సంస్కృతంలో లాగా తెలుగుశబ్దాలకు లింగం (అనుశాసనం) లేదు. ఏలింగమూ గానిఅచ్చతెలుగుశబ్దాలకు ఈసూత్రం ఆయాలింగంతో సమత్వాన్ని అతిదేశిస్తున్నది. సంస్కృతశబ్దాలకు ఆయాలింగంవల్ల ఏయేకార్యాలు వస్తున్నాయో అవి అచ్చతెనుగు శబ్దాలకు కూడా ఈలింగసమత్వాతిదేశంవల్ల సిద్ధిస్తాయి.

అన్న – ప్రస్తుతసూత్రంచేత ఇది స్త్రీసమం. మహద్వాచక మైనా, పుంలింగ(తుల్య)ం కాదు గాబట్టి దీనికి ఉత్వడుజాదులు రావు. స్త్రీసమత్వంవల్ల 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపిస్తుంది. అన్న – ప్రథమైకవచనాంతపదం అయింది. ఇలాగే, తల్లి, ఊరు, మొ.

బియ్య– ఇది ఈసూత్రంచేత క్లీబసమం. దీనివల్ల 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత ప్రథమైకవచనవివక్షలో మువర్ణకం వచ్చి బియ్యము. ఇది అమహద్వాచకం. అయినా క్లీబసమత్వంవల్లనే మువర్ణకం అవుతుంది. కాగా ఆచ్ఛికశబ్దాలకు అమహత్త్వంవల్ల మువర్ణకం రా దని గ్రహించవచ్చు. దయ్యము (దైవము – మహత్తు).

'తఱుచుగా' అనడంచేత మహత్తు లయినఅచ్చతెనుగుశబ్దాలు కొన్ని పుంలింగ తుల్యాలు గూడా ఉన్నాయి. స్త్రీసమ, క్లీబసమశబ్దాలు అధికసంఖ్యలో ఉండగా పుంలింగతుల్యాలు అరుదు. పుంలింగతుల్యత్వంవల్ల (ఇవి మహత్తులే కాబట్టి) ఉత్వడుజాదులు వస్తాయి. చందుర – చందురుఁడు మొ.

కాగా, అచ్చతెనుగుశబ్దాలకు ప్రథమైకవచనంలో 'వు' ప్రత్యయం రాదు. పరువు, మురువు ఇత్యాదుల్లో చివరి 'వు' ప్రాతిపదికావయవమే కాని ప్రథమైకవచనం కాదు.

'ఆచ్ఛికశబ్దంబులు' అనడంచేత సంస్కృతసమాల కీకార్యం లేదు. అందుచేత సంస్కృత(సమ)శబ్దాలను స్త్రీసమ, క్లీబసమాలుగా పేర్కొనడం ప్రమాదం.

'ఎల్లన్' అనడంచేత ఆచ్ఛికశబ్దా లన్నీ స్త్రీసమమో, క్లీబసమమో, పుంలింగతుల్యమో ఏదో ఒకటి కావలసిందే. తప్ప ఏదీ కాకుండా ఉండడానికి వీల్లేదు.

1. 'తఱుచుగా' అనడంవల్ల పుంలింగతుల్యా లున్నా యన్నాడు సూరి. స్త్రీసమ క్లీబసమాల్లాగా వీటిని గూడా పుంలింగసమా లనదగు ననిపిస్తుంది. (మిత్రాదులు సంస్కృతశబ్దాలు పుంలింగతుల్యా లున్నాయి)

'తఱుచుగ స్త్రీసమంబులును – క్లీబసమంబులును' అనేపదప్రయోగక్రమంలో ఆచ్ఛికశబ్దాలు తఱుచుగా స్త్రీసమాలు అని, క్లీబసమాలు కూడా అరుదుగా ఉన్నా యనీ విశేషార్థం చెప్తారు.

**2. బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు.** (3)

బల్లిద మొద లైనవి బల్లిదాదులు. ఈశబ్దా లన్నీ ఆచ్ఛికాలు. బల్లిద మొద లైన ఆచ్ఛికవిశేషణశబ్దాలు సంస్కృత(విశేషణ)శబ్దాలతో సమానంగా ఉంటా యని సూత్రార్థం.

సంస్కృతంతో తుల్యత్వం చెప్పడంవల్ల ప్రయోజనాన్ని చిన్నయసూరే వివరించాడు. విశేష్యంతో సమాన మైనలింగాన్ని కలిగిఉండడం దీనికి ప్రయోజనం. ఇలాంటివాటిని విశేష్యనిఘ్నా లంటారు. తెలుగులోని బల్లిదాదివిశేషణాలు సంస్కృతంలోని విశేష్యనిఘ్నా లైనవిశేషణాలవలె విశేష్యంతో సమాన మైన లింగ(సమత్వ)ం, పొందుతాయి. అంటే యితరఆచ్ఛికశబ్దాలకువలె నియతంగా స్త్రీసమమో, క్లీబసమమో లేక పుంలింగతుల్యమో – ఏదో ఒకటి మాత్రమే అయిఉండక విశేష్యా న్ననుసరించి వేరువేరుగా ఉంటా యని తాత్పర్యం.

మహద్వాచక మయితే దానికి విశేషణం అయిన బల్లిదాదుల్లోనిశబ్దం మహత్తు కావడంతోపాటు పుంలింగతుల్యం కూడా అవుతుంది. దీనివల్ల ఉత్వడుజాది పుంలింగకార్యాలు వస్తాయి. బల్లిదాదులు మహత్తు లయినపు డెల్ల పుంలింగతుల్యాలు గూడా అవుతాయి.

రాముఁడు బల్లిదుఁడు. రాముఁడు – విశేష్యం. ఇది మహత్తు (పుంలింగం) కాబట్టి 'బల్లిద' అనే విశేషణం గూడ (మహత్తు) పుంలింగతుల్యం అయి ఉత్వడుజులు వచ్చి బల్లిదుఁడు అని అయింది.

ఇలాగే 'అన్న బల్లిదుఁడు' మొ. అన్న స్త్రీసమం. అయినా మహత్తు. కాబట్టి

విశేషణం (మహత్తు) పుంలింగతుల్యం అయింది. అందుచేతనే ఉత్వదుజులు వచ్చాయి.

బల్లిదుఁ డగుమిత్రము. మిత్రశబ్దం నపుంసకలింగం. అయినా మహత్తు. కాబట్టి దీనికి విశేషణ మైన బల్లిదశబ్దం (మహత్తు) పుంలింగతుల్యం అయింది.

విశేష్యం అమహత్తు అయితే ఏలింగంలో ఉన్నా దానికి విశేషణ మైన బల్లిదాదులు గూడా అమహత్తులు కావడంతోపాటు క్లీబసమాలు అవుతాయి. ఇవి అమహ త్తయినపు డెల్ల క్లీబసమాలే.

వానివంశము బల్లిదము. ఇక్కడ వంశశబ్దం పుంలింగం. అయినా అమహత్తు. కాబట్టి దానికి విశేషణం అయిన బల్లిదశబ్దం, (అమహత్తే) క్లీబసమం అయింది. కాబట్టి మువర్ణకం వచ్చి 'బల్లిదము' అయింది. ఇలాగే – విద్య బెట్టిదము, గోడ బల్లిదము మొద లగునవి.

విశేష్యం మహతి – (స్త్రీవాచకం) అయితే విశేషణ మైనబల్లిదాదులు స్త్రీసమాలు. ఆలు శబ్దంతో సమాసం పొందుతాయి. సంస్కృతంలోలాగా తెలుగులో స్త్రీప్రత్యయాలు లేవు. స్త్రీత్వం తెలియజేయాలంటే 'స్త్రీ' అనేఅర్థాన్ని ఇచ్చే ఆలుశబ్దంతో సమాసం పొందడం ఒక్కటే మార్గం.

సీత బల్లిదురాలు, అక్క బల్లిదురాలు మొద లగునవి. ఇవి సంస్కృతతుల్యాలు గావడంచేత 'కర్మధారయంబునం దత్సమంబుల కాలు –' అని రుగాగమంతోపాటు ఉత్వం గూడా వస్తుంది.

'బల్లిదాదులు' అనడంచేత ఈబల్లిదాదుల్లో లేనిశబ్దాని కీసంస్కృతతుల్యత్వం రాదు. అంద మైనరాముఁడు, అంద మైనసీత, అంద మైనలేడి మొద లగునవి.

'సంస్కృతతుల్యంబులు' అనడంచేత పేదరాలు లాగా బల్లిదరాలు ఇత్యాదిగా ఉండదు. (రుగాగమంతోపాటు అత్వానికి ఉత్వం గూడా వస్తుంది.)

**3. మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు దు జగు, నుత్వంబు గాదు. (4)**

మహత్తులు అంటే పురుషవాచకాలు. మగ మొద లైనవి మగాదులు. కయిర – మొద లైనవి కయిరాదులు. డుజు ప్రథమైకవచనం. ప్రత్యయం కాబట్టి పరంగా వస్తుంది.

మహద్వాచకా లయిన మగ, మొద లయినశబ్దాలకూ, అమహత్తు లయిన కయిర మొద లైనశబ్దాలకూ పరంగా ప్రథమావిభక్తి ఏకవచనంలో 'డుజ్' అనేప్రత్యయం వస్తుంది. అన్ని విభక్తుల్లో గూడ ప్రాతిపదికచివరిఅత్వానికి ఉత్వం

మాత్రం రాదు. అని సూత్రానికి అర్థం.

'మగ' – ఇది మహత్తు. 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం పుంలింగ తుల్యం. కాబట్టి 'పుంలింగం బయి–' అనేసూత్రంచేత ఉత్వమూ, 'పుంలింగ మగు– అనేసూత్రంచేత డుజూ, వచ్చి మగుఁడు అని కావలసిఉండగా ప్రస్తుతసూత్రంచేత ఉత్వం రాకుండా డుజ్ మాత్రమె వచ్చి – మగ + డుజ్. 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత ముందు అరసున్న వస్తే మగఁడు, లేదా నిండుసున్న వస్తే మగండు. ఇతరవిభక్తుల్లో – మగని, మగనిచేత మొద లగునవి.

కయిర – అమహత్తు, ఈసూత్రంచేత ప్రథమైకవచనంలో డుజు వచ్చి ఉత్వం రాకుండగా కయిరఁడు.

'మహత్తు లగు' అనడంచేత మహత్తులు కానపుడు ఈకార్యం లేదు. మనుమరాలు. పాప మొద లగునవి.

'మగాదులకు' అనడంచేత మగాదుల్లో చేరని(మహత్)శబ్దాని కీకార్యం లేదు. చందురుఁడు.

'కయిరాదులకు' అనడంచేత కయిరాదుల్లో చేరనిఅమహత్తులకూ ఈకార్యం లేదు. గుఱ్ఱము, ఏనుగు మొ.

మహత్తులూ పుంలింగతుల్యాలు ఐనమగాదులకు ఉత్వడుజులు వస్తాయి. కాబట్టి అనవసర మైనఉత్వాన్ని నిషేధించడం, అవసరమే. వస్తున్న డుజును మళ్లీ విధించడం అనవసరం. అలాగే అమహత్తు లయినకయిరాదులు (క్లీబసమాలు) ఉత్వడుజులు రెండూ రావు. కాబట్టి అవసర మైనడుజ్విధానం చెప్పాలి. కాని రానిఉత్వం నిషేధించడం ఎందుకు? 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు నుత్వంబు గాదు, డు జగు' అని చెప్పవచ్చు గదా అని సందేహం.

**4. తే్ప్రభృతులబహువచనమునకు ముందు డు జగు.** (8)

'తే' మొద లైనవి తే ప్రభృతులు. బహుత్వసంఖ్యను బోధించేప్రత్యయం బహువచనం. 'లు' మొద లైనవి ప్రథమాదివిభక్తులలోనిబహువచనాలు. 'డుజ్'లో జకారం ఇత్తు, కాబట్టి డువర్ణం జిత్తు. అందుచేత దానికి ముందు బిందువు వస్తుంది. ఇది ప్రథమైకవచనం అయిన డుజ్ కంటె (రాముఁడు) వేరు.

'తే' మొద లయినప్రాతిపదికలకంటె పరంగా ఉన్నప్రథమ మొదలు అన్ని విభక్తులలోనూ బహువచనానికి (లు–ల) పూర్వంలో 'డుజ్' వస్తుంది అని సూత్రార్థం.

'తే' అనేప్రాతిపదికపై ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణం వచ్చి తే+లు అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'లు' అనేబహువచనానికి ముందు 'డుక్' వచ్చి, తే + డుక్ + లు. 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత 'డు'కు ముందు అరసున్న వచ్చి, జకారం లోపించి తేఁడులు అని అవుతుంది. బిందువు అని సామాన్యంగా చెప్పడంచేత నిండుసున్న, గూడా రావాలి. కాని 'తే' దీర్ఘం. కాబట్టి 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేసూత్రంప్రకారం నిండుసున్న రాదు. తేండులు అని కాదు.

'తే ప్రభృతులు' అనడంచేత తే మొదలైనవాటిల్లో లేనిశబ్దానికి ఈకార్యం లేదు. వ్రేలు (గొల్లలు). వ్రేఁడులు అని కాదు.

'ప్రభృతి' శబ్దంచేత గ్రహించవలసినఇతరశబ్దాలనుగూర్చి పరిశోధించాలి.

'బహువచనమునకు' అనడంచేత ఏకవచనంలో ఈకార్యం రాదు. తేఁడు, తేనిని, తేనిచేత మొ.

'ముందు' అనడంచేత బహువచనం అలాగే ఉండి దానికి పూర్వంలో డుజు వస్తుంది. కాబట్టి తే+లు=తేఁడు - ఇత్యాదిగా కాదు.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి డుజు రాకుండా 'తేలు' అనేవిధ మైనరూపా లుండవు.

**5. ఆల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును, ముందటిలువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు.** (11)

ఆలు + ఆది = ఆలు మొద లైనశబ్దాలు ఆల్వాదులు. ఇవి అయిదు. ఆలు, చెలియలు, చెల్లెలు, కోడలు, మఱదలు, ఇవే ఆల్వాదులు. వీటిలో ఇంకోశబ్దం చేర్చే అవకాశం లేదు. కాబట్టి యిది నియతగణం.

ప్రథమాబహువచనం ఐన లువర్ణం, ద్వితీయాదుల్లో విభక్తుల కాగమ మైన లడాగమం. ఈ 'లు – ల' అనేవాటిల్లో లకారం బహువచనలకారం. 'లువర్ణంబునకు' అనేచోటిషష్ఠివలన లువర్ణం 'స్థానంలో' అని అర్థం.

ఆలు మొద లైనశబ్దాలకు పరంగా ఉన్న 'లు–ల' అనేబహువచనాల్లోనిలకారం స్థానంలో రేఫం ఆదేశంగా వస్తుంది. ఆలు మొద లయినవాటిలో చివరి'లు'వర్ణంస్థానంలో పూర్వంలో సున్న కలిగిన డకారం (ండ్) ఆదేశంగా వస్తుంది.

ఆలుశబ్దంమీద ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు'

అనేసూత్రం చేత లువర్ణం వచ్చి, ఆలు + లు. ప్రస్తుతసూత్రంచేత బహువచన లకారానికి రేఫమూ,(ఆలు+రు) ముందరిలువర్ణానికి 'ండ్' ఆదేశం, కాగా ఆండ్+రు= ఆండ్రు అని అవుతుంది. ఇలాగే మిగిలినవిభక్తుల్లో ఆలు+లను = ఆండ్రను మొ.

'ఆల్వాదుల' అనడంచేత ఆల్వాదులలో లేనిశబ్దానికి ఈకార్యం లేదు. కాలు – (కాళ్లు) కాండ్రు అని కాదు.

'రేఫంబును, డకారంబును' అనేచోట సముచ్చయంచేత ఈకార్యాలు రెండూ కలిసే వస్తాయి. కాబట్టి రేఫం మాత్రమే వచ్చి ఆలురు అని కానీ, బిందుపూర్వకడకారం మాత్రమే వచ్చి – ఆండ్లు అని కానీ ఉండదు.

'బిందుపూర్వక' అని బిందువును సామాన్యంగా చెప్పడంవల్ల అరసున్నతో 'ఁడ్' కూడా రావచ్చు. (ఆఁడ్రు) 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండ బిందునకుం బూర్ణం బగు' అని అరసున్నకు నిండుసున్న వచ్చి అపుడు కూడా ఆండ్రు అనే అవుతుంది.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ఇది రాకుండా ఆలులు = ఆళ్లు ఇత్యాది రూపా లుండవు.

**6. బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకారలకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు.** (14)

ప్రథమావిభక్తిలో – లు, ద్వితీయాదిబహువచనవిభక్తులకు ముందు వచ్చే ల(డాగమం), అనే (లు–ల) బహువచనాలతో కలిసినది బహువచనశ్లిష్టం. ద్విరుక్తం కానిది, ద్విత్వం లేనిది– అద్విరుక్తం. డకారలకారంబులకు అనేచోటిషష్ఠిచేత డకారలకారాల'స్థానంలో' అని అర్థం. అఘులకారం అంటే ళ (ళ్).

ప్రాతిపదికచివర ఉన్నడకారం, లకారం (మీదిఉత్వం లోపించి) పైన ఉన్న లు – ల అనేబహువచనలకారంతో కూడిఉన్నపుడు, ఆ డకార,లకారాలస్థానంలో అలఘు వయిన 'ళ'కారం (ళ్) అనేది నిత్యంగా ఆదేశంగా వస్తుంది.

త్రాడు శబ్దంపై ప్రథమాబహువచనంలో 'లువర్ణకంబు బహువచనంబు' అని 'లు' వర్ణం వచ్చి త్రాడు + లు. 'బహువచనంబు పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి 'త్రాడ్+లు'. ప్రస్తుతసూత్రంచేత దకారపుపొల్లుకు 'ళ్' ఆదేశం అయి, త్రాళ్లు = త్రాళ్లు అని అవుతుంది. ఇలాగే మొగిలు+లు = మొగిళ్లు మొద లగునవి.

'బహువచన' అనడంచేత వేరేదానితో శ్లిష్ట మైతే యీకార్యం కాదు. త్రాడ్గొటికి, వ్రేల్మిడిచి – మొ.(ఏకవచనంతో శ్లిష్టత ఉండదు. కాలిని, మొ.)

'శ్లిష్టంబు లయి' అనడంచేత ఉత్వలోపం రాక బహువచనంతో కలియనపుడు ఈసూత్రం వర్తించదు. కాని 'బహువచనంబు పరం బగునపు డసంయుక్తంబు లయి –' అనేవేరే సూత్రంచేత 'ళ'కారం బహుళంగా రావచ్చు. త్రాళులు – త్రాడులు మొద లగునవి.

'అద్విరుక్తంబు లయిన' అనడంచేత ద్విరుక్తాలకు ఈకార్యం కాదు. గ్రుడ్డు+లు= గ్రుడ్లు, గ్రుళ్లు కాదు. ఏండ్లు, కాండ్లు ఇత్యాదిగా బిందుపూర్వక మైనపుడు గూడా ఈకార్యం సమ్మతం కాదు.

'డకారలకారంబులకు' అనడంచేత ఇతరహల్లుల కీకార్యం లేదు. పోటులు, పోట్లు, ఊరులు – ఊర్లు . ఊళులు అనేరూపంలో ఉత్వం లోపిస్తే ఊళ్లు అనేరూపం అవుతుంది. అయితే రేఫవిషయంలో ఊర్లు, పేర్లు అనేవైకల్పికరూపా లుంటాయి. కాబట్టి ళకారం నిత్యంగా వచ్చేఈసందర్భంలో (డకార,లకారాలతో) 'రేఫ' చెప్పలేదు. ఊళ్లు, గోళ్లు అనేరీతిరూపాలు సూరిసమ్మతాలే.

డకారలకారాలకు మాత్రమె 'ళ'కారం చెప్పడంవల్ల బహువచనలకారానికి మా ర్పుండదు. త్రాళ్ళు, మొగిళ్లు. త్రాళ్ళు, మొగిళ్ళు, అనేవిధంగా బహువచనలకారానికి ళకారం రావటం (త్రాళ్+ళు=త్రాళ్ళు) ఈలక్షణానికి విరుద్ధం.

'నిత్యంబుగ' అనడంచేత ళకారం రాని 'త్రాడ్లు, మొగిల్లు' అనేవిధ మైనరూపా లుండవు.

**7. సమానపదంబునందు సంయోగము పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు.** (15)

సమానం అంటే ఏకం. ఒక్కటె అయినపదం సమానపదం. సంయోగం అంటే ఒకటికంటె ఎక్కువ హల్లులు కూడడం. ఖండబిందువు అంటే అరసున్న. పూర్ణ మంటే నిండుసున్న.

ఒకేపదంలో సంయుక్తాక్షరం పరంగా ఉన్నపుడు ఆసంయుక్తాక్షరానికి పూర్వంలో ఉన్నఅరసున్నకు అన్నిచోట్ల నిండుసున్న నిత్యంగా వస్తుంది అని సూత్రార్థం.

అనఁటి అనేశబ్దంమీద ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, అనఁటి + లు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు

డుత్వం బగు' అనఁటు+లు. 'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబు నకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించి అనఁట్లు అని అవుతుంది. 'హ్రస్వము మీఁదిఖండబిందువునకు–' అనేసూత్రంప్రకారం నిండుసున్న వికల్పంగా రావలసిఉండగా దాన్ని బాధించి ఈవిశేషవిధిచేత అరసున్నకు నిండుసున్న నిత్యంగా వచ్చి, 'అనంట్లు' అవుతుంది.

'సమానపదంబునందు' అనడంచేత భిన్నపదాల్లో అంటే వేరేపదం మొదటి సంయుక్తాక్షరం పరంగా ఉండగా ముందరిపదంచివరిఅరసున్నకు ఈసూత్రంచేత నిండుసున్న కాదు. నాతోఁ బ్రారంభము. 'నాతోం బ్రారంభము' కాదు.

'సంయోగము పరం బగునపుడు' అనడంచేత సంయోగం కానిది పరంగా ఉంటే ఈకార్యం రాదు. అనఁటులు.

'ఎల్లచో' అనడంచేత అన్నిచోట్లా వస్తుంది. తేఁటి +లు=తేఁటు+లు=తేఁట్లు అనేచోట 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేసూత్రంచేత నిండుసున్న రావడానికి వీలులేదు. 'ఎల్లచో' అనేపదం 'దీర్ఘముమీద' అనేసూత్రాన్ని బాధించి దీర్ఘంమీద గూడ పూర్ణబిందువును సాధిస్తుంది. తేంట్లు, ఏండ్లు మొ. అంటే 'ఎల్లచో' అనేదళం లేకపోతే తేంట్లు ఇత్యాదిగా దీర్ఘంమీద పూర్ణబిందువుతోడిప్రయోగాలు సాధువు లయ్యేవి కావు.

మాఁడు+చు=మాడ్చు లాంటికొన్నిచోట్ల నిండుసున్న కాకపోవడం, అరసున్న లోపించడం కనబడుతున్నది.

'ఖండబిందునకు' అనడంచేత నిండుసున్నకు ఏమార్పు ఉండదు. గుండులు – గుండ్లు మొద లగునవి.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి నిండుసున్న రాని అనఁట్లు, తేఁట్లు అనేవిధ మైనరూపాలు ఉండవు.

**8. ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు.** (17)

నామం అంటే ప్రాతిపదికం. 'లు' అనే ప్రథమాబహువచనంతో సంయోగం చెందిన చివరిభాగం కల్గినశబ్దం సంశ్లిష్టబహువచనాంతం. దానితో సమాన మైన ఆకారం కలిగింది సంశ్లిష్టబహువచనాంతతుల్యం. బహుత్వార్థాన్ని బోధించే 'లు' మొద లైనవిభక్తులు బహువచనాలు.

కొన్ని అచ్చతెనుగుప్రాతిపదికలు, (కొడవలి) వాటిలో చివరిహల్లు 'లు' అనే ప్రథమాబహువచనంతో కూడిన (కొడవళ్లు) దానితో సమాన మైనరూపాన్ని పొంది, మీద అన్నివిభక్తులలో బహువచనప్రత్యయాలను పొందుతున్నాయి అని సూత్రార్థం.

కొడవలి–ప్రాతిపదిక. ఇందులో చివరిహల్లు ప్రథమావిభక్తి బహువచనంతో సంయోగం చెందితే 'కొడవళ్లు' లేదా కొడవండ్లు (ఇది పదం). దీనితో సమాన మైనరూపం కూడా అలాగే ఉంటుంది. (కాని అది పదం కాదు) 'కొడవలి' అనేప్రాతిపదిక ఈసూత్రంచేత (సంశ్లిష్టబహువచనాంతతుల్య మైన) కొడవండ్లు అనేరూపం పొందుతుంది. ఈప్రాతిపదికమీద ప్రథమావిభక్తిని వివక్షిస్తే ప్రస్తుతసూత్రం ప్రకారం బహువచనం వచ్చి లువర్ణకంతో కొడవండ్లులు అవుతుంది.

ప్రాతిపదిక కొడవళ్లు అనేరూపం పొందితే, కొడవళ్లులు. ద్వితీయాదివిభక్తుల్లో కొడవండ్లులను, కొడవళ్లులచేత, మొద లగువి.

'సంశ్లిష్ట' అనడంచేత ప్రాతిపదిక బహువచనంతో సంయుక్తం కాని 'కొడవందులు' అనేవిధ మైనరూపం పొందదు. కాబట్టి కొడవందులులు, కొడవళులులను అనేరీతి రూపా లుండవు.

'బహువచన' అనడంచేత బహువచనం కానిదానితో సంయుక్త మైనరూపం రాదు.

'అంత' అనడంచేత ప్రథమాబహువచన మైనలువర్ణంతో సంయుక్తమైనది మాత్రమే అవుతుంది. ద్వితీయాదుల్లో అయితే 'కొడవండ్లను' 'కొడవండ్లచేత' ఇత్యాదిగా అంతం - చివరిభాగం సంయుక్త మైఉండదు. కాబట్టి ద్వితీయాద్యంతతుల్యరూపం ప్రాతిపదిక కావడం జరగదు. అందుచేత 'కొడవండ్లనులు' కొడవండ్లచేతలను ఇత్యాదిరూపాలు కావు.

'తుల్యంబు' అనడంచేత బహువచనాంతం మీద, ఈకార్యం ఉండదు. బహువచనాంత మైన 'కొడవండ్లు' అనేది పదం. పదమ్మీద విభక్తులు చేరడానికి వీలు లేదు. తుల్యం అనడంవల్ల 'కొడవండ్లు' అనేరూపం ప్రథమాంతం కాదు, కాబట్టి పదం కాదు. విభక్తులు చేరడానికి యోగ్య మైనప్రకృతే.

'బహువచనంబు' అనడంచేత సంశ్లిష్టబహువచనాంతతుల్యప్రాతిపదిక మీ్మద ఎపుడూ ఏకవచనం రాదు. 'కొడవండ్లు', కొడవండ్లును ఇత్యాదిగా ఏకవచనాంతరూపా లుండవు.

**9. అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గు జగు.** (19)

అట్లు అనేశబ్దం పూర్వం చెప్పినదానిని పరామర్శిస్తుంది. 'కలన్వాదులనువర్ణంబు కు జగు, బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు' అనేపూర్వసూత్రాన్నిబట్టి బహువచనంలో నిత్యంగా, ఏకవచనంలో అనిత్యంగా అంటే వికల్పంగా వస్తుం దనే అర్థం సిద్ధిస్తున్నది. గుజ్ – లో జకారం ఇత్తు, కాబట్టి జి త్తయిన గువర్ణానికి పూర్వంలో బిందువు వస్తుంది.

బహువచనం పరంగా ఉన్నపుడు అన్ని (బహువచన)విభక్తులలోనూ రేను – గోను అనేరెండుశబ్దాలలోనినువర్ణంస్థానంలో గుజ్ అనేది (నిత్యంగా)ఆదేశంగా వస్తుంది. అన్ని విభక్తులలోనూ ఏకవచనం పరంగా ఉన్నపుడు నువర్ణానికి గుజ్ వికల్పంగా వస్తుంది. అని సూత్రార్థం.

'రేను' ప్రాతిపదిక. ఇది 'అచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. దీనిపై ప్రథమా – ఏకవచనవివక్షలో ఈసూత్రంచేత నువర్ణం స్థానంలో గుజ్ వచ్చి రే + గుజ్. 'జిత్తు బిందుపూర్వం బగు' అని ముందు అరసున్న వచ్చి, తర్వాత ఇ త్తయినజకారం లోపించగా, రేఁగు. స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల–' అనేసూత్రంచేత ప్రథమైకవచనం (సు) లోపించి రేఁగు. దీర్ఘం మీఁద వ్యాకరణంచేత సాధింపబడే మైనపూర్ణబిందువు లేదు గాబట్టి నిండుసున్న రాదు. రేంగులు– అని కాదు. ఏకవచనంలో వికల్పం. కాబట్టి గుజ్ రాకపోతే రేను.

'అట్లు' అనడంచేత బహువచనంలో గుజ్ నిత్యం. కాబట్టి రేఁగులు. రేఁగులను. గుజు రాని రేనులు, గోనులను అనేరీతిరూపా లుండవు. ఏకవచనంలో వికల్పం. కాబట్టి రేఁగు – రేను అని రెండు రూపా లుంటాయి.

'రేను గోనుశబ్దంబులు' అనడంచేత ఈరెంటికంటె వే రయినశబ్దాని కీకార్యం లేదు. పేను – కౌనులు మొ.

'నువర్ణంబు' అనడంచేత రేను – గోనుశబ్దాల్లోని ఇతరవర్ణానికి ఎటువంటిమార్పు రాదు. రేఁగు. గోఁగులు మొద లగునవి.

**10. ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు.** (23)

నామం అంటే ప్రాతిపదికం. అచ్చతెనుగుప్రాతిపదికలలో చివర ఉన్న 'ఇయ' అనేభాగానికి బదులుగా అంటే 'ఇయ' అనే రెండక్షరాలస్థానంలో బహుళంగా హ్రస్వ మైన 'ఎ'కారం ఆదేశంగా వస్తుం దని సూత్రార్థం. బహుళం అంటే నాలుగు విధాలుగా కార్యం ప్రవర్తిస్తుంది.

**ప్రవృత్తి :** కొన్ని శబ్దాలలో ఇయకు ఎత్వం రావడం నిత్యం. బల్లెము. ఇక్కడ 'బల్లియము' అనేఇయాంతరూపం కానరావడం లేదు. (బల్లెంబు - బల్లెపుఁగోల - 'ము' ప్రత్యయం) పొచ్చెము మొద లగునవి.

**అప్రవృత్తి :** సందియము, కాటియ మొదలైనశబ్దాల్లో ఇయకు ఎత్వం అసలు రాదు. 'సందెము' వంటి ఎత్వ మైనరూపాలు లేవు.

**విభాష :** 'కన్నియ' అనేశబ్దంలో ఇయకు ఎత్వం రాగా కన్నె. రాకపోతే కన్నియ. ఇటువంటిచోట్ల వికల్పం.

**అన్యకార్యం :** ఇయలో 'ఇ' త్వానికి లోపం రావడం అన్యకార్యంగా కనిపిస్తున్నది. ముత్తియము - (ముత్తెము) ఇయలో ఇత్వం లోపించి ముత్‌్యము - ఒకతకారం లోపించి ముత్యము. (పళ్ళియము - పళ్యము మొ.)

'ఇయకు' అనడంచేత ఇతరశబ్దాలకు ఈకార్యం రాదు. పెండిలి.

'మాఱుగా' అనడంచేత 'ఇయ' మొత్తానికి ఎత్వం వస్తుంది. లేకపోతే 'ఎత్వం' ఏక అల్లు (ఒకేవర్ణం) కాబట్టి 'అలో ऽన్త్యస్య' అనేపాణినీయపరిభాష ననుసరించి చివరివర్ణాని కొక్కదానికే ఆదేశ మై (కన్నియ) కన్నియె ఇత్యాదిగా అపరూపాలు ఏర్పడవలసివస్తుంది.

'నామ' అనడంచేత క్రియలు మొద లైనవాటిల్లో ఈకార్యం రాదు. కదియన్ - కదెన్ అని కాదు.

'అంతంబునకు' అనడంచేత ప్రాతిపదికలో గూడా నడుమనో మొదటనో (చివర కాక) ఉన్న ఇయకు ఎత్వం రాదు. చెలియలు - చెలెలు కాదు. (చెల్లెలు ఉంది, కాని చెల్లియలు లేదు. సూరి ఆల్వాదులలో చెలియలు - చెల్లెలు వేర్వేరుగా చూపడం గమనించవచ్చు)

ఈకార్యం అచ్చతెలుగుశబ్దాల్లోనే. కాబట్టి సంస్కృతసమాల్లో ఇయకు ఎత్వం రాదు. క్రియ. (క్ర్ ఇయ - క్రె అని కాదు.)

**11. సర్వనామక్రియాపదంబులబహువచనంబు మహత్తునకుం బోలె మహతి కగు.** (26)

'అన్ని ప్రభృతులు సర్వనామంబులు.' క్రియావిభక్తులు (డుఌ, రు మొ.) చివర గలిగినశబ్దాలు క్రియాపదాలు. మహత్తు అంటే పురుషుణ్ణి బోధించేశబ్దం. మహతి అంటే స్త్రీవాచకం. బహుత్వసంఖ్యను బోధించేప్రత్యయం బహువచనం.

స్త్రీవాచకా లైనసర్వనామాలు, స్త్రీలు కర్తగా కలిగినక్రియాపదాలు బహువచనంలో మహద్వాచకాలతో సమాన మైనరూపం పొందుతా యని సూత్రార్థం.

'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును' అనేసూత్రంచేత స్త్రీవాచకాలు తిర్యగ్జడాలకువలె అమహత్తులు. కాబట్టి తిర్యగ్జడాలతో సమానంగా స్త్రీవాచకాలకు కూడా అమహత్ కార్యాలతో అమహద్రూపమె ఉండవలసి వస్తుంటే ఈలక్షణం దాన్ని వారించి మహత్కార్యాలను చెపుతున్నది.

వా రిద్దఱు రుక్మిణీసత్యభామలు. ఇక్కడ రుక్మిణీసత్యభామలు స్త్రీవాచకం. దానికి విశేషణ మైన, ఆ, రెండు – అనేసర్వనామాలు గూడా స్త్రీవాచకా లై, అమహత్తు లయినాయి. కాబట్టి అమహత్కార్యంతో (అవి రెండు హంసలు అన్నట్లుగా) అవి రెండు (రుక్మిణీసత్యభామలు) అనేరూపంతో ఉండవలసిఉండగా ప్రస్తుతసూత్రంచేత మహత్తులకువలె కార్యాలు వస్తాయి. (వారు ఇద్దఱు రామకృష్ణులు అన్నట్లుగా) వారు ఇద్దఱు– అనే మహద్రూపం కలుగుతుంది.

రుక్మిణీ సత్యభామలు మెచ్చుచున్నారు. ఇట రుక్మిణీసత్యభామ లనేస్త్రీలు కర్తలు గావడంవల్ల మెచ్చుధాతువు స్త్రీఅర్థంలో ఉన్నది. బహుత్వంలో ఉంది. (హంసలు ఎగురుచున్నవి అన్నట్లుగా) 'అమహత్కార్యంతో' – 'మెచ్చుచున్నవి' అని కావలసివస్తుంటే ప్రస్తుతసూత్రంచేత మహత్కార్యం వచ్చి (రామకృష్ణులు మెచ్చుచున్నారు అన్నట్లుగా) మెచ్చుచున్నారు అనే మహద్రూపం సిద్ధించింది.

'సర్వనామక్రియాపదంబులు' అనడంచేత ఇతరశబ్దాలకు ఈకార్యం రాదు. 'రుక్మిణీ సత్యభామలు' అనేచోట 'రుక్మిణీసత్యభాములు' అనేవిధంగా మహద్రూపం రాదు.

'బహువచనంబు' అనడంచేత ఏకవచనం అమహత్కార్యంతోనే ఉంటుంది. అది సీత, సీత రక్షించుచున్నది. ఇక్కడ అతఁడు సీత, సీత రక్షించుచున్నాఁడు అని మహత్తుకువలె కార్యం రాదు.

'మహత్తునకుంబోలె' అనడంచేత అమహత్కార్యం వారింపబడింది. రుక్మిణీసత్య భామలు రెండు మెచ్చుచున్నవి. అనే రీతి రూపా లుండవు.

'మహతికి' అనడంచేత (స్త్రీవాచకం కాని) తిర్యగ్జడాలకు మహద్రూపం కల్గదు. రెండు ఏనుగులు వచ్చుచున్నవి. ఇక్కడ 'ఇద్దఱు ఏనుఁగులు వచ్చుచున్నారు' అని కాదు.

**12. అపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాష నగు.** (27)

పద – ఆద్యం అంటే పదం మొదట ఉన్నది. పదాద్యం కానిది అపదాద్యం. అసంయుక్తం అంటే ఇంకో హల్లుతో కలియక ప్రత్యేకంగా ఉన్నది. 'గకారంబునకు' అంటే గకారంస్థానంలో అని అర్థం.

అచ్చతెనుగుపదాల్లో మొదట కాక ఇతరస్థలాల్లో ఉన్నదీ, ఇంకో హల్లుతో కూడనిదీ అయిన గకారం స్థానంలో వికల్పంగా వకారం వస్తుంది. అని సూత్రార్థం.

'పలుగురు' అనేశబ్దంలో గకారానికి ప్రస్తుతసూత్రంచేత వకారం రాగా పలువురు. విభాష అనడంచేత వకారం రాకపోతే గకారం అలాగే ఉండి – పలుగురు.

'అపదాద్యంబు' అనడంచేత పదం మొదటిగకారానికి వకారం రాదు. గాలి – గిత్త మొద లగునవి. వాలి, విత్త ఇత్యాదిగా ఉండదు.

'అసంయుక్తం బయి' అనడంచేత ఇంకొక 'హల్లుతో గూడినగకారానికి వకారం రాదు. లగ్గు – లవ్వు కాదు. మొగ్గరము మొద లగునవి.

'గకారంబునకు' అనడంచేత ఇతరవర్ణానికి ఈకార్యం రాదు. మెకము మొ.

అపదాద్యమూ, అసంయుక్తమూ అయినా కొన్నిచోట్ల గకారానికి వకారం లేదు. కొన్నియెడల వకారం లేకపోవడాన్ని విభాషాపదానికి వ్యవస్థ చేసికోవాలి, పొగ – తగరము. మొద లగునవి.

నిండుసున్నమీద గకారం వకారం కాదు. బంగారము. రంగు మొద లగునవి.

అరసున్నమీద కొన్ని చోట్ల అవుతుంది. తీఁగ – తీవ. నాఁగేలు, వీఁగెను మొద లైనకొన్నిచోట్ల కాదు.

పుట్టువు – పుట్టుగు, పవడము – పగడము ఇలా కొన్నిచోట్ల వకారానికి గకారం వస్తున్నట్లు పేర్కొంటారు.

**13. ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు.** (29)

ఇవి అంటే పూర్వసూత్రంలో చెప్పబడిన 'ఇటితివర్ణంబులు' ప్రాయిక మంటే తఱుచుగా నని అర్థం. నామం బనగా ప్రాతిపదికం.

ఔపవిభక్తికా లయిన ఇ, టి, తి అనేవర్ణాలు, ద్వితీయ మొద లైనవిభక్తులలో ఏకవచనం పరంగా ఉండగా అచ్చతెనుగుప్రాతిపదికలు కొన్నింటికి తఱుచుగా వస్తా యని సూత్రాని కర్థం.

కాలు – కాలిని. ఇక్కడ ద్వితీయైకవచనం పరంగా ఉండగా 'ఇ' వచ్చింది.

నాఁగలి – నాఁగటిచే. ఇక్కడ తృతీయైకవచనం పరంగా ఉండగా 'టి' వచ్చింది.

నేయి – నేతియందు. ఇక్కడ సప్తమ్యేకవచనం పరంగా ఉండగా 'తి' వచ్చింది.

'ద్వితీయాది' అనడంచేత ప్రథమైకవచనం పరంగా ఉంటే ఔపవిభక్తికాలు రావు. ఊరు – నాగలి – నేయి.

'ఏకవచనంబులు' అనడంచేత ఇవి బహువచనంలో రావు. ఊళ్లను – నాఁగళ్ల చేత మొ. విశేషవిధానంచేత 'తి' మాత్రం కొన్నిటికి (ప్రథమాది) బహువచనాల్లో వస్తుంది. నేతులు మొ.

'నామంబులకు' అనడం స్పష్టతకే. (ద్వితీయాద్యేకవచనాలు ధాత్వాదులకు పరంగా ఉండవు గదా.)

కొన్నింటికి – అనడంచేత ఆచ్ఛికప్రాతిపదికలకు కూడా అన్నింటికీ ఔపవిభక్తికాలు రావు. దంత మనే అర్థంలో 'పల్లు'కు ఔపవిభక్తికం వస్తుంది. పంటికి. పల్లము అనే అర్థంలో 'పల్లు' శబ్దానికే రాదు. పల్లునకు.

ఇవి సాధారణంగా అప్రాణివాచక స్త్రీసమనామాలపై వస్తాయి. కుందేటికొమ్ము, లేటిగుంపు ఇత్యాదిగా ప్రాణివాచకాలపై అరుదు.

'ప్రాయికంబుగ' అనడంచేత కొన్నిచోట్ల ఇవి వికల్పంగా వస్తాయి. కొడవటిని, కొడవలిని.

కొన్నిచోట్ల పర్యాయంగా వేరు వేరు వర్ణాలు వస్తాయి. నోరిని, నోటిని.

సప్తమీ ఏకవచన మైననవర్ణకం పర మైనపుడు అసలు రావు. ఊరునన్ మొ.

**14. విభక్తి పరం బగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు తివర్ణం బగు. (35)**

గోయి మొద లైనవి గోయిప్రభృతులు. ఈశబ్దా లన్నీ 'యి' వర్ణాంతాలుగానే కన్పిస్తున్నాయి.

విభక్తి పరంగా ఉండగా 'గోయి మొద లైనశబ్దాల్లోని చివరిఅక్షరం (యి) స్థానంలో 'తి' అనేవర్ణం ఆదేశంగా వస్తుం దని సూత్రార్థం. తి, అనేకాల్లు (త్ – ఇ) కాబట్టి 'యి' మొత్తానికి ఆదేశ మవుతుంది.

ఈ'తి'వర్ణం ఔపవిభక్తికం. 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు' అనేసూత్రంప్రకారం ఔపవిభక్తికాలు ద్వితీయాద్యేకవచనాలు పరంగా ఉంటే వస్తా యనేఅంశం చెప్పడం జరిగింది. ఈసూత్రంలో మళ్లీ ప్రత్యేకంగా 'విభక్తి పరం బగునపుడు' అనడంచేత ద్వితీయాద్యేకవచనాలే గాక ఏవిభక్తి పరంగా ఉన్నా,

గోయిప్రభృతులకు తివర్ణం వస్తుం దని అర్థం అవుతున్నది.

గోయిశబ్దంపై ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత లువర్ణకం వచ్చి గోయి + లు అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'యి' వర్ణస్థానంలో 'తి' ఆదేశ మై, గోతి + లు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు – డనేసూత్రంచేత ఉత్వం వచ్చి – గోతులు. ఇతరవిభక్తుల్లో గోతిని – గోతులందు మొద లగునవి.

'విభక్తి పరం బగునపుడు' అనడంచేత విభక్తి పరంగా లేకపోతే ఈకార్యం రాదు. గోయిప్రభృతు లన్నీ స్త్రీసమాలు. కాబట్టి వీటిప్రథమైకవచనం 'స్త్రీలింగంబుల –' అనేసూత్రంచేత లోపించిపోతుంది. ప్రథమైకవచనంలో విభక్తి పర మవడం ఉండదు. కాబట్టి అక్కడ తివర్ణం రాదు. గోయి. కాగా ప్రథమాబహువచనంనుంచి సప్తమీబహువచనంవరకు అన్ని విభక్తుల్లో 'తి' వస్తుంది.

'గోయిప్రభృతులు' అనడంచేత వీటిలో లేనిశబ్దానికి ఈకార్యం రాదు. వేయిని, వేయియందు మొద లగునవి.

'తుదియక్షరంబు' అనడంచేత అక్షరాలకు ఆదేశం కాదు. 'తి' ఒకటికంటె ఎక్కువ వర్ణాలు (త్,ఇ) కలిగింది గాబట్టి ప్రాతిపదికమొత్తానికి ఆదేశం కావచ్చు.

'తుదియక్షరంబు' అనడంవల్ల చివరిఅక్షరానికి ఒక్కదానికి మాత్రమె వస్తుంది. గోతిని మొద లగునవి.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి గోయులు, గోయిని అనేవిధంగా తివర్ణం రాని రూపా లుండవు.

**15. ఔపవిభక్తికంబులతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు.** (38)

(విభక్తి పరంగా ఉండగా వచ్చే) ఇ,టి,తి అనేవర్ణాలకు ఔపవిభక్తికా లని పేరు. ఇవి చేరేప్రాతిపదికలకు కూడా ఔపవిభక్తికాలు అని వ్యవహారం. 'తృతీయా సప్తములకు' అన్నప్పటి షష్ఠిచేత ఆవిభక్తుల 'స్థానంలో' అని అర్థం.

ఔపవిభక్తికా లైనప్రాతిపదికలకు పరంగా ఉన్నతృతీయావిభక్తి (చేత,తోడ) స్థానంలోనూ, సప్తమీవిభక్తి (అందు,న) స్థానంలోనూ బహుళంగా హ్రస్వ మయినఅకారం ఆదేశంగా వస్తుం దని సూత్రార్థం.

గోరుశబ్దంమీద తృతీయావిభక్తివివక్షలో 'చేత' వచ్చి గోరు + చేత. ఈసూత్రంచే

చేత విభక్తికి 'అ'త్వం రాగా గోరు + అ. 'తృతీయాదులకు నుగాగమం బగు' అని నుగాగమం వచ్చి, గోరు + అను. 'ఊరు మొదలగువాని కిత్వం బగు.' గోరి + అను. 'అంద్వగాగమంబు లం దప్ప –' అని సంధి జరిగి – గోరను. బహుళం కాబట్టి అత్వం రాకపోతే. గోరిచేతను.

ఇలాగే ఇల్లు + అందు. ఇల్లు + అ, ఇల్లు + అను, ఇంటి + అను = ఇంటను. అత్వం రాకపోతే ఇంటియందును.

'ఔపవిభక్తికముల' అనడంచేత ఔపవిభక్తికాలు కానివాటిపై ఈకార్యం లేదు. ఔల్లుచేత, ఔల్లునందు మొద లగునవి.

'తృతీయాసప్తములకు' అనడంవల్ల, ఇతరవిభక్తులకు ఈకార్యం లేదు. గోరిని, ఇంటికి మొద లగునవి.

'తృతీయాసప్తము' లని సామాన్యంగా చెప్పడంచేత, చేత, తోడ, అనేతృతీయా విభక్తులు రెంటికీ, అందు, న – అనే సప్తమీవిభక్తులు రెంటికీ ఈకార్యం వస్తుంది. గోరను – గోరిచేతను, గోరితోడను. ఊరను – ఊరియందును, ఊరునను.

'ఆదేశంబు' అని ప్రత్యేకంగా చెప్పటంవల్ల ఒకేవర్ణ మయిన'అ'త్వం తృతీయాసప్తమీ విభక్తులు అనేకవర్ణా లయినా సర్వాదేశంగా వస్తుంది.

'బహుళం' అనడంచేత కొన్నిచోట్ల అప్రవృత్తి. గోతియందు మొద లయిన అర్థంలో 'గోతన్' అనేరూపం కనబడదు.

## కారకపరిచ్ఛేదం

**1. ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు.** (11)

అనుప్రయుక్తంగా వచ్చిన ఉండి అనేశబ్దం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న 'వలన' అనేపంచమివిభక్తిస్థానంలో ద్వితీయావిభక్తి లేదా సప్తమీవిభక్తి తఱుచుగా ఆదేశంగా వస్తాయి.

'వన'శబ్దంపై అపాయార్థంలో "అపాయభయ –' అనేసూత్రంచేత 'వలన' అనే ప్రత్యయం వచ్చి 'వనము వలనన్'. 'ఉండిపదం బొకానొకచో–' అనేసూత్రంచేత వలనపై ఉండి చేరి– వనమువలనన్ + ఉండి. ఇపుడు ప్రస్తుతసూత్రంచేత వలనకు ద్వితీయ (ను) రాగా వనమును + ఉండి– వనమునుండి, అవుతుంది. ప్రాయికం అనడంచేత ద్వితీయ రాకపోతే 'వనమువలనన్ ఉండి' అని ఉండగా ఈసూత్రంచేతనె సప్తమి వస్తుంది 'అందు–న' అని సప్తమిలో రెండు ప్రత్యయా లున్నాయి. 'అందు' వస్తే వనమునందునుండి అని అవుతుంది. ఉదంతం ఐంది కాబట్టి నవర్ణకం వస్తే వనముననుండి అవుతుంది.

'ఉండిశబ్దం' అంటే పూర్వసూత్రా న్ననుసరించి వలన కనుప్రయుక్త మైన 'ఉండి' పదం. కాబట్టి 'అతడు కోరుటవలన నుండిపోయెను' అనేవిధ మైనఇతరస్థలాల్లో ఈకార్యం రాదు.

'పరం బగునపుడు' అనడంచేత ఉండిశబ్దం అనుప్రయుక్తం కానిపక్షంలో ఈకార్యం కాదు. వనమును వచ్చెను. వనమందు వచ్చెను ఇత్యాదిగా ఉండదు. వాహనమును దిగెను. ఇలాగే అదితిగర్భమున్ విచ్చేయుము ఇత్యాదులు కొన్ని ఉన్నాయి. ఇక్కడ 'ఒకానొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అనేసూత్రంచేత పంచమికి బదులుగా ద్వితీయ (సప్తమి) అయినట్లు గుర్తించడం లాఘవం.

'ద్వితీయాసప్తములు' అనడంచేత ఇతరవిభక్తులు రావు.

'ప్రాయికంబుగ' అనడంచేత ద్వితీయ లేదా సప్తమి రావడం తఱుచుగా జరుగుతుంది. కాబట్టి 'వనమువలననుండి వచ్చె' అనేవిధంగా 'వలన'తో రూపాలు అరుదుగా ఉంటాయి.

**2. నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు.** (16)

సముదాయం (గుంపు)నుంచి ఆసముదాయంలోని ఒకభాగాన్ని, జాతి, గుణం,

క్రియ, సంజ్ఞ, అనేవాటినిబట్టి వేరుచేయడం నిర్ధారణం. దేని (సముదాయం) నుండి నిర్ధారణం (వేరుచేయడం) జరుగుతుందో దానికి అంటే సముదాయాన్ని తెలిపేశబ్దానికి షష్ఠీవిభక్తి వస్తుంది. ఆషష్ఠికి తెలుగులో 'లోపల' అనేషష్ఠీప్రత్యయం వస్తుంది.

'మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు.' మనుష్యులసమూహంనుంచి ఆమనుష్యసముదాయంలోని క్షత్రియులు అనేఒకభాగాన్ని జాతినిబట్టి వేరుచేయడం జరిగింది. నిర్ధారణం 'మనుష్యుల' నుంచి – కాబట్టి ఆశబ్దానికి లోపల అనేషష్ఠీవిభక్తి వచ్చి 'మనుష్యులలోపల' అని అయింది.

ఇక్కడ లోపలషష్ఠికి బదులుగా సప్తమీవిభక్తి కూడా ఒకపక్షంలో కనిపిస్తుంది. 'మనుష్యులందు క్షత్రియుడు' – మొద లయినవి.

గోవులలోపల కపిల –

గోవులసముదాయంనుంచి 'కపిల'ను నలుపు అనేగుణాన్నిబట్టీ,

అధ్వగులలోపల పారువాడు –

అధ్వగులసముదాయంనుంచి పారువాడిని పరుగెత్తడం అనేక్రియనుబట్టీ,

ఛాత్రులలోపల మైత్రుండు –

ఛాత్రులసముదాయంనుంచి మైత్రుడిని మైత్రు డనేసంజ్ఞనుబట్టీ నిర్ధారించడంవల్ల సముదాయవాచిశబ్దాలకు లోపల షష్ఠి వచ్చింది.

'నిర్ధారణ' అనడంవల్ల ఇతరార్థాలలోనిషష్ఠికి లోపల రాదు. రామునియొక్క మిత్రుడు.

'షష్ఠికి' అనడంచేత నిర్ధారణంలో వచ్చేయితరవిభక్తికి లోపల రాదు. జానపదులకంటె నాగరులు వివేకులు.

'లోపలవర్ణకంబు' అనడంచేత, ఇతర మైనషష్ఠీవిభక్తులు రావు. మనుష్యులకు, లేదా మనుష్యులయొక్క క్షత్రియుండు ఇత్యాదిగా కాదు.

'అగు' అనడంచేత షష్ఠికి లోపల రావడం నిత్యం.

**3. విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు.** (19)

జాతి, గుణం మొద లైనవిశేషం కలిగినది విశేష్యం. విశేష్యంలోనిజాత్యాది విశేషాలను తెలిపేది విశేషణం.

విశేష్యం ఏలింగం, ఏవిభక్తి, ఏవచనంలో ఉన్నదో దానివిశేషణానికి గూడా అదే లింగం, విభక్తి, వచనం వస్తాయి అని సూత్రాని కర్థం.

'భువనవంద్యుండు కృష్ణుండు పుడమిఁ బుట్టె' – ఇక్కడ కృష్ణుడు అనేది విశేష్యం. అది పుంలింగం, ప్రథమావిభక్తి, ఏకవచనంలో ఉంది. కాబట్టి దానికి విశేషణ మైన 'భువనవంద్య' శబ్దంగూడా అదేవిధంగా పుంలింగ మై, ప్రథమావిభక్తి – ఏకవచనంలో భువనవంద్యుడు అని అవుతుంది.

భువనవంద్య రుక్మిణి – ఇక్కడ విశేష్య మైన రుక్మిణి స్త్రీలింగం.

విశేషణం గూడా స్త్రీలింగంలో ఉండి 'భువనవంద్య' అని అయింది.

భువనవంద్యను రుక్మిణిని –

విశేష్యం ద్వితీయలో ఉండడంవల్ల విశేషణం గూడా ద్వితీయలో ఉంది.

భువనవంద్యుల రుక్మిణీకృష్ణుల – ఇక్కడ విశేష్యం బహువచనంలో ఉంది గాబట్టి విశేషణం గూడా బహువచనంలో ఉన్నది.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి పక్షాంతరం (వేరేరూపం) ఉండదు.

'విశేష్యంబునకుం బోలె' అనడంచేత విశేష్యానికి భిన్న మైనలింగవిభక్తివచనాలు విశేషణానికి రావు. భువనవంద్యను రామకృష్ణులు – అనేవిధంగా ఉండదు.

'విశేషణంబునకు' అనడంచేత ఆవిశేష్యానికి సంబంధించినవిశేషణం కానిశబ్దానికి ఈకార్యం రాదు. భక్తులను సీత రక్షించుచున్నది.

**4. జడంబు తృతీయా సప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు.** (23)

జడం అంటే అచేతనం. ప్రాణం, జ్ఞానం లేనివస్తువును బోధించేశబ్దం జడం. జడవాచకశబ్దాలకు పై నున్నతృతీయావిభక్తిస్థానంలోనూ, సప్తమీవిభక్తిస్థానంలోనూ బహుళంగా ద్వితీయావిభక్తి వస్తుం దని సూత్రార్థం.

**విభాష** : కోలతోడ కూలనేసె. కూలనేయుటకు సాధన మై, కరణ మైన కోల శబ్దానికి తోడ విభక్తి వచ్చి కోలతోడన్ అని ఉండగా, కోల అనేజడానికి పై నున్నతృతీయకు ప్రస్తుతసూత్రంచేత ద్వితీయ (ను) వచ్చి కోలను + కూలనేసె – కోలం గూలనేసె. అని అవుతుంది. బహుళం గాబట్టి ద్వితీయ రాకపోతే తృతీయ అలాగే ఉండి 'కోలతోడఁ గూలనేసె' నని ఉంటుంది.

ఇలాగే 'లంకయందు' అన్నపుడు సప్తమికి ద్వితీయ వచ్చి' లంకన్'.

ద్వితీయ రాకుంటే లంకయందు. ఇలా ద్వితీయ రావడం సాధారణంగా వికల్పం.

**అప్రవృత్తి** : ఉదంతా లయినశబ్దాలకు పైన తృతీయాసప్తములకు ఏకత్వంలో ఈకార్యం రాదు. బాణముచేత గొట్టెను. జలమునం దుండును. ఇక్కడ బాణమును

గొట్టెను, జలము నుండెను అని ద్వితీయ లేదు. బహువచనంలో ద్వితీయ వస్తుంది. బాణములఁ గొట్టెను, జలముల నుండెను. మొ.

**అన్యకార్యం** : కొన్నిచోట్ల జడం కానిశబ్దాలమీద గూడ తృతీయాసప్తముల కీకార్యం కనబడుతున్నది. 'చక్రవాకములతోడ అలరు – చక్రవాకములన్ అలరు,(తృతీయకు ద్వితీయ)

మనుజులయందు విప్రుడు – మనుజుల విప్రుడు (సప్తమికి ద్వితీయ) మొ.

'జడంబు' అనడంచేత అజడవాచకాలమీద ఈకార్యం రాదు. రాజులచేత కప్పంబు గొనె. సింహమునందు బలము. మొ.

'తృతీయాసప్తములకు' అనడంచేత ఇతరవిభక్తులకు ఈకార్యం రాదు.

కోల వాడి యయినది – మొద లయినవి.

**5. ఒకానొకచో విశేషణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు.** (27)

జాతి, గుణం, మొద లైనవిశేషాలను తెలిపేశబ్దం విశేషణం. విశేషణశబ్దం మీది షష్ఠీవిభక్తికి వికల్పంగా ప్రథమావిభక్తి వస్తుం దని సూత్రాని కర్థం. విశేష్యం షష్ఠీవిభక్తిలో ఉన్నపుడు విశేష్యంబునకుం బోలె – అనేసూత్రంచేత విశేషణానికి కూడా షష్ఠీవిభక్తి వస్తుంది. ఆషష్ఠికి ప్రస్తుతసూత్రంచేత ప్రథమ వస్తుంది.

సుగుణాభిరాముడు రామునకు – ఇచట 'రామునకు' అనేవిశేష్యం షష్ఠిలో ఉన్నది. కాబట్టి విశేషణ మైనసుగుణాభిరామశబ్దానికి 'విశేష్యంబునకుం బోలె' అనేసూత్రంచేత 'కు' అనేషష్ఠీవిభక్తి రాగా (సుగుణాభిరామునకు) ఆషష్ఠికి ప్రస్తుత సూత్రంచేత ప్రథమ వచ్చి, 'సుగుణాభిరాముడు' రామునకు– అని అవుతుంది. పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతు (యొక్క పనుపు)

'విభాష' అనడంవల్ల ప్రథమ రాకపోతే విశేష్యానుసారంగా షష్ఠీవిభక్తితో సుగుణాభిరామునకు – రామునకు అని ఉంటుంది.

'ఒకానొకచో' అనడంచేత ఈకార్యం రావడం తక్కువ స్థలాల్లో జరుగుతుంది. విశేషణం షష్ఠితో ఉండడమె తఱుచు.

'విశేషణంబుల' అనడంచేత విశేష్యషష్ఠికి ప్రథమ రాదు. (సుగుణాభిరాముడు) రామునకు.

**6. భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు.** (28)

భవతి + అర్థ – భవతి అంటే (ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే) భూధాతువు అని అర్థం.

'అగు' మొద లైనవి 'భూ' అనేసంస్కృతధాతువుయొక్క అర్థం గలిగినవి. వ్యవహిత మంటే వ్యవధానం(ఎడం) కలిగినది. విశేషణంబులకు అని సామాన్యంగా చెప్పడంచేత ద్వితీయాదివిభక్తు లన్నింటికీ అని గ్రహించాలి.

నడుమ ఉన్న అగు మొద లైనశబ్దాలవల్ల విశేష్యంతో ఎడ మైనవిశేషణాలకు సంబంధించిన అన్నివిభక్తులకూ ప్రథమావిభక్తి వస్తుంది. అని సూత్రాని కర్థం.

'విద్యాశాలి యగుపురుషుని' - ఇక్కడ 'పురుషుని' అనేది విశేష్యం. ద్వితీయా విభక్తిలో ఉంది. కాబట్టి దానికి విశేషణ మైన 'విద్యాశాలి' అనేవిశేషణానికి 'విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి వచ్చి 'విద్యాశాలిని అగుపురుషుని' - అని ఉంటుంది. అయితే విద్యాశాలిని అనేవిశేషణానికి, పురుషునికి అనేవిశేష్యానికి మధ్యలోని 'అగు' అనేభవత్యర్థక(ధాతుజవిశేషణ)ంతో వ్యవధానం ఉంది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత విశేషణం ద్వితీయకు ప్రథమ వచ్చి - విద్యాశాలి యగుపురుషుని.

'భవత్యర్థ' అనడంచేత ఇతరపదంతో వ్యవహిత మైనపుడు ప్రథమ రాదు. విద్యాశాలిని గాంచి పురుషుని - మొద లయినవి.

'వ్యవహితంబు' అనడంచేత భవత్యర్థంతో వ్యవహితం కానపుడు ప్రథమ రాదు. విద్యాశాలిని పురుషునిన్.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి భవత్యర్థవ్యవహిత మైనపుడు ప్రథమ రానిరూపం ఉండదు. 'విద్యాశాలిని నగు పురుషుని' అని ఉండదు.

**7. అదిశబ్దంబునకు వునులు పరంబు లగునపుడును సంబోధనంబునందును దాన యనునాదేశం బగు.** (35)

ప్రథమాంతము లైనయుష్మదస్మద్విశేషణశబ్దాలకు చివర ఉన్న 'అది' అనేశబ్దానికి 'వు-ను' అనేఆగమాలు పరంగా ఉన్నపుడు 'అది' శబ్దం స్థానంలో 'దాన' అనేశబ్దం ఆదేశంగా వస్తుంది. అలాగే సంబోధనంలోనూ 'దాన' ఆదేశ మవుతుంది.

(నీవు) చిన్నది. ఇది యుష్మద్విశేషణ మైనపుడు 'ప్రథమాంతంబు లగు' అనేసూత్రంచేత చివర్లో 'వు' ఆగమంగా వచ్చి 'చిన్న + అది + వు' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత అది స్థానంలో 'దాన' ఆదేశ మై, చిన్నదానవు అని అవుతుంది.

ఇలాగే (నేను) చిన్నది అని అస్మద్విశేషణ మైనపుడు (చిన్న + అది + ను) చిన్నదానను. సంబోధనలో - ఓ (చిన్న+అది) చిన్నదాన.

'అది' శబ్దం ఏకవచనాంతం గాబట్టి ఏకత్వార్థంలో వచ్చే 'వును'లే పరంగా

ఉంటాయి. బహుత్వంలో 'అది' ఉండదు, వునులూ రావు. చిన్నవారు, రుము ఆగమాలతో (మీరు) చిన్నవారరు (మేము) చిన్నవారము. చిన్నవారలారా! మొ.

'అగు' అనడంచేత ఈఆదేశం నిత్యం, కాబట్టి చిన్నదివి, చిన్నదిని, ఓ చిన్నదీ – ఇత్యాదిగా 'దాన' రానిరూపా లుండవు.

మహతి – మహతీతరం అని భేదం ప్రస్తావింపకపోవడంచేత 'అది' ఉన్నచోట అమహత్త్వంలో తిర్యగాదులవిషయంలోనూ 'దాన' వస్తుంది.

**8. అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు.** (38)

యుష్మద్ (నీ) అస్మద్ (నా) అర్థాలకంటె వే రయినది అన్యం. యుష్మదర్థాన్ని ఆశ్రయించి రావలసినప్రత్యయాదికం యుష్మత్కార్యం. ఇలాగే అస్మదర్థాన్ని ఆశ్రయించి వచ్చేది అస్మత్కార్యం. మిగిలింది అన్యకార్యం.

1. అన్యార్థం, 2. యుష్మదర్థం 3. అస్మదర్థం అనేవాటిలో ఏ రెండైన, మూడైన కలిసిఉండి – దాన్ని అనుసరించిన ప్రత్యయాదికార్యం ఒకేస్థలంలో ప్రవర్తింప వలసివస్తే పై మూడుకార్యాలలో ముందరిదానికంటె తరువాతిది బలీయ మై వర్తిస్తుం దని సూత్రాని కర్థం.

'వారును మీరును ధన్యులరు.' ఇక్కడ ధన్యులు అనేది మీరు అనేయుష్మదర్థానికి మాత్రమే కాక 'వారు' అనేఅన్యార్థానికి కూడా విశేషణ మైంది. ప్రస్తుతసూత్రంచే అన్యయుష్మత్కార్యాలలో(తరువాతిది) యుష్మత్కార్యం, బలీయం కాబట్టి యుష్మద్విశేషణత్వాన్ని బట్టి 'ప్రథమాంతంబు లగు' అనేసూత్రంచేత రువర్ణం ఆగమ మై, ధన్యులరు అని అవుతుంది.

1.ఇలాగే అన్యఅస్మత్కార్యాలలో, 2. యుష్మదస్మత్కార్యాలలోను, 3. అన్యయుష్మదస్మ త్కార్యాలలోను అస్మత్కార్యం బలీయ మై వర్తిస్తుంది.

2. మీరును మేమును – ధన్యులము. ఇక్కడ ధన్యులు అనేది, మీరు అనే యుష్మదర్థానికి మేము అనేఅస్మదర్థానికి రెంటికీ విశేషణమే ఐనా, రు,ము అనే రెండుకార్యాలలో అస్మత్కార్యమైన 'ము' వచ్చి ధన్యులము.

1. 'వాఁడును నేనును ధన్యులము' – అన్నచో అన్య,అస్మత్కార్యాలలో అస్మత్కార్యం వచ్చింది. ఇలాగే 3. వారును, మీరును, మేమును ధన్యులము.

ఇలాగే క్రియల్లోను 'వాడును నీవును వచ్చితిరి, నీవును, మేమును వచ్చితిమి, వారును, మేమును వచ్చితిమి, వాఁడు, నీవు, నేను వచ్చితిమి' అనేవిధంగా గ్రహించాలి.

# సమాసపరిచ్ఛేదం

**1. స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు.** (6)

అన్యపద – అర్థం అంటే సమాసంలోనిపదాలఅర్థంకంటే వే రయినఅర్థం ప్రధానం (క్రియతో అన్వయించడం) ఐనసమాసం బహువ్రీహి. స్త్రీలింగంతో సమాన మైన అచ్చతెనుగుశబ్దం స్త్రీసమం. ప్రథమైకవచనం లోపించే ఆచ్ఛికశబ్దం స్త్రీసమ మని స్థూలంగా గ్రహించవచ్చు.

తెలుగులో స్త్రీసమా లయిన (ఆచ్ఛిక)శబ్దాలతో ఏర్పడిందిగానే బహువ్రీహి సమాసం కవిప్రయోగాలలో కనబడుతున్నది అని సూత్రార్థం. తెలుగులో బహువ్రీహిసమాసంలో పూర్వోత్తరపదాలు రెండూ స్త్రీసమాలే అయిఉంటాయి. అంటే స్త్రీసమా (లైనఆచ్ఛికశబ్దా)లకు మాత్రమే బహువ్రీహిసమాసం చేయాలి అని తాత్పర్యం.

మూఁడు కన్నులు గలిగినవాఁడు అనేవిగ్రహంచొప్పున మూఁడు, కన్ను అనేస్త్రీ సమశబ్దాలకు ప్రస్తుతసూత్రంచేత బహువ్రీహి సమాస మేర్పడి, మూఁడు + కన్ను అని ఉండగా 'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁ డుశబ్దము డుజ్వర్ణంబు నకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంచేత డుజ్ (ఁడు) లోపించి పైహల్లుకు ద్విత్వం రాగా మూ+క్కన్ను. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి 'ముక్కన్ను'. 'బహువ్రీహిని సమాసాంతకార్యంబులు చూపట్టెడి' అనేసూత్రంచేత చివరిఅక్షరానికి 'ంటి' ఆదేశ మై (స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనలోపంతో) ముక్కంటి అవుతుంది.

'స్త్రీసమఘటితంబు–అ' అన్నచోటి అవధారణం(అ)చేత స్త్రీసమం కానిశబ్దంతో బహువ్రీహి ఉండదు, అంద మైనముక్కు కలది. కఱ ఐనకంఠము గలవాడు – మొద లైనచోట్ల బహువ్రీహి సమాసం కుదరదు. మచ్చెమువంటి కన్ను (లు) గలది – మచ్చెకంటి. అని క్లీబసమానికీ, స్త్రీసమానికీ అయినబహువ్రీహిసమాసం ఒకటి కన్పిస్తుంది.

'ఒకానొకండు' అనడంచేత ఆచ్ఛికాల్లో బహువ్రీహి సమాసం అరుదు.

'చూపట్టెడి' అనడంచేత ఇటువంటిసమాసాలను వ్యవహారంలో అంటే కవిప్రయోగాల్లో కన్పించినవాటిని మాత్రమె గ్రహించాలి. స్వతంత్రంగా కల్పించరాదు.

**2. ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు.** (7)

సంస్కృతసమంకంటే వే రయినతెలుగుశబ్దం ఆచ్ఛికం. ప్రథమావిభక్తి ఏకవచనం లోపించే (స్త్రీలింగంతో సమాన మైన) ఆచ్ఛికశబ్దం స్త్రీసమం. 'స్త్రీసమంబు' అని ప్రథమావిభక్తిలో నిర్దేశించడంచేత స్త్రీసమానికి ఉపసర్జనం అనేసంజ్ఞ కలుగుతుంది. ఉపసర్జనం అయినది సమాసంలో పూర్వ (మొదటి) పదంగా ఉంటుంది.

తెలుగులో తఱుచుగా, స్త్రీసమ మైనశబ్దానికి అచ్చతెలుగుశబ్దంతో ద్వంద్వసమాసం ఏర్పడుతుంది అని సూత్రాని కర్థం.

అన్నయును తమ్ముడును, అనేఅర్థంలో, అన్న అనేస్త్రీసమశబ్దానికి 'తమ్ముఁడు' అనే (పుంలింగతుల్య మైన) ఆచ్ఛికశబ్దంతో ప్రస్తుతసూత్రంచేత ద్వంద్వసమాస మేర్పడి అన్న + తమ్ముఁడు. సమాసవిభక్తి లోపించి, గసడదవాదేశం వచ్చి, అన్నదమ్ము. దీనిపై ప్రథమావిభక్తిలో బహుత్వంలో లువర్ణం చేరి అన్నదమ్ములు అవుతుంది.

'ఆచ్ఛికశబ్దంబుతోడ' అనడంచేత ద్వంద్వసమాసంలో ఉత్తరపదం సంస్కృతసమం కాదు. ఆలును భర్తయును – ఆలుభర్త లని గాదు.

'ఆచ్ఛిక' మని సామాన్యంగా చెప్పడంవల్ల ఉత్తరపదం స్త్రీసమం గాని, (తల్లి + తండ్రి –తల్లిదండ్రులు) క్లీబసమం గాని, లేదా పుంలింగతుల్యం గాని, (అన్న + తమ్ముఁడు = అన్నదమ్ములు) కావచ్చు.

'స్త్రీసమంబు' అనడంచేత పూర్వపదం స్త్రీసమం కానిపక్షంలో ద్వంద్వసమాసం కుదరదు. మగఁడును బిడ్డలును– అన్నపుడు మొదటిపదం పుంలింగతుల్యం, పల్లమును కళ్లెమును– అన్నపుడు మొదటిపదం క్లీబసమం. కాబట్టి యిక్కడ మగబిడ్డలు, పల్లగళ్లెములు అని (ద్వంద్వ) సమాసాలు కావు.

'ప్రాయికంబుగ' – అనుటచేత అంద(ము) చందములు అని వెచ్చ(ము) సచ్చములు – అని అరుదుగా క్లీబసమానికి ఆచ్ఛికంతో ద్వంద్వసమాసం ఏర్పడడం గుర్తించవచ్చు.

**3. గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు.** (12)

గుణాన్ని తెలియజేసేవి గుణవచనాలు. నల్ల మొద లైనవి నల్లాదులు. 'నలుపు' మొద లైనగుణాలను తెలియజేసేవి కావడంవల్ల నల్లాదులు గుణవచనాలు. విశేషణానికి విశేష్యంతో చేసినసమాసం కర్మధారయం. 'నిక్' ఆగమ అన్నపుడు కకారం ఇత్తు, కి త్తయిన 'ని'వర్ణం నల్లాదిశబ్దాలకు చివర ఆగమంగా చేరుతుంది.

కర్మధారయసమాసంలో గుణాన్ని బోధించే నల్ల మొద లైన (గుణ)విశేషణాలకు చివర 'ని' అనేవర్ణం బహుళంగా ఆగమంగా వస్తుంది. బహుళం అనడంచేత ఈకార్యం నాల్గువిధాలుగా ప్రవర్తిస్తుంది.

**ప్రవృత్తి**: చక్క మొద లైనశబ్దాలకు నిగాగమం నిత్యం. చక్కనిఆవు. చిక్కనిపాలు. చక్కావు, చిక్కపాలు అని నిగాగమం లేనిరూపం ఉండదు.

**(అప్రవృత్తి)** నల్లాదులలో చేరనిశబ్దానికి ఈకార్యం రాదు. కాబట్టి ఇటువంటిచోట్ల అప్రవృత్తి ఉండదు.

**విభాష** : నల్లని దైనగుఱ్ఱము అనేవిగ్రహంచొప్పున కర్మధారయసమాసం ఏర్పడి నల్ల + గుఱ్ఱ అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'నల్ల' చివర నివర్ణం ఆగమ మై, నల్లనిగుఱ్ఱ. ఈసమాసప్రాతిపదిక క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి నల్లనిగుఱ్ఱము. నిగాగమం రానిపక్షంలో నల్లగుఱ్ఱము. ఇటువంటిచోట్ల విభాష.

**అన్యకార్యం**: 'కమ్మ + తేనె' అనేచోట నిగాగమం వచ్చి కమ్మనితేనె అని కావడంతోపాటు అన్యకార్యంగా నుగాగమం వచ్చి, (ద్రుతకార్యాలతో) కమ్మందేనె, మొ. రూపా లవుతాయి.

'గుణవచనంబులు' అనడంచేత నల్లాదులు గుణంకంటె వేరేఅర్థాన్ని తెలిపేపక్షంలో నిగాగమం రాదు. నల్ల (అయిన) యేరు (నెత్తురుటేరు).

'నల్లాదులు' అనడంచేత గుణవచనా లయినా నల్లాదులలో చేరనివాటికి నిగాగమం రాదు. పెద్దబుద్ధి మొ.

'కర్మధారయంబునందు' అనడంచేత కర్మధారయం కాకపోతే నిగాగమం రాదు. నల్ల (నలుపు) చూచి.

**4. ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు.** (13)

ద్విః ఉక్త - ద్విరుక్తం. అంటే రెండుసార్లు ఉచ్చరింపబడినది. సంస్కృతసమం కాని తెలుగుభాష ఆచ్ఛికం.

ద్విత్వంతో గూడినహల్లు పరంగా ఉన్నపుడు, దానికి పూర్వంలో ఉన్న అచ్చతెలుగు దీర్ఘానికి హ్రస్వం వస్తుం దని సూత్రార్థం.

ఆ + కన్య అనేచోట 'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు' అని ద్విత్వం వచ్చి

'ఆ+క్కన్య' అని కాగా ప్రస్తుతంసూత్రంచేత ద్విత్వానికి ముం దున్నదీర్ఘం స్థానంలో హ్రస్వం వచ్చి అక్కన్య అని అవుతుంది. ఇలాగే ఊయెల – ఉయ్యేల మొ.

'ద్విరుక్తం బగుహల్లు' అనడంచేత ద్విత్వం లేనిహల్లు పరమైతే హ్రస్వం రాదు. ఆకన్య – ఊయెల మొ.

'పరం బగునపుడు' అనడంచేత ద్విరుక్తానికి పరంగా ఉన్నదీర్ఘానికి హ్రస్వం రాదు. అక్కాలము– అక్కలము లేదా ఆక్కలము ఇత్యాదిగా గాదు.

'అచ్ఛికంబు' అనడంచేత సంస్కృత(సమ) మైనదీర్ఘానికి హ్రస్వం రాదు. వాక్కు, రాట్టు ఈసంస్కృతసమాలు వక్కు, రట్టు అనేతీరుగా కావు.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి ద్విత్వం వచ్చినపుడు హ్రస్వం రానిరూపం ఉండదు. ఆక్కన్య, ఊయ్యేల అని దీర్ఘం ఉండదు.

**5. త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.** (14)

'ఆ ఈ ఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁబడు.' సర్వనామా లైన ఆ ,ఈ, ఏ అనేమూడింటికి త్రికం అని పేరు. వే రొకహల్లుతో కూడకుండా ప్రత్యేకంగా ఉన్నహల్లు – అసంయుక్తహల్లు.

ఆ–ఈ–ఏ–అనేసర్వనామాలకు పరంగా ఉన్న సంయుక్తం గానిహల్లుకు బహుళంగా ద్విత్వం వస్తుం దని సూత్రాని కర్థం. ద్విత్వం అనడంవల్ల – మళ్లీ అదే హల్లు ఇం కొకటి వచ్చి చేరుతుంది.

**విభాష:** 'ఆ + కన్య' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత మీదిహల్లుకు ద్విత్వం వచ్చి ఆ+క్కన్య అని కాగా 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి అక్కన్య అని అవుతుంది. బహుళం అనడంచేత ద్విత్వం రానిపక్షంలో (హ్రస్వం గూడా రాదు కాబట్టి) ఆకన్య అని ఉంటుంది. ఇటువంటిచోట్ల వికల్పం.

**అప్రవృత్తి:** త్రికంమీద ఉన్న ర,శ,ష,స,హ అనేహల్లులకు ద్విత్వం రాదు. ఆరూపము, ఈహయము. ఇక్కడ అప్రవృత్తి.

**అన్యకార్యం:** నీవిప్ప్రయోగము–(నీ–విప్రయోగము) నీవు – ఈ + ప్రయోగము అన్నచోట సంయుక్తానికి ద్విత్వం రావడం శ్లేషస్థలంలో విశేషం. అయినా ఈసూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా సాధించుకోవచ్చు.

'త్రికంబుమీఁది' అనడంచేత ఇతరమ్మీద ఈద్విత్వం రాదు. మాయమ్మ,

మీఁయిల్లు మొ.

'అసంయుక్త హల్లునకు' అనడంచేత సంయుక్త మైనహల్లుకు ద్విత్వం రాదు. ఆవ్యాధుఁడు, ఈక్షత్రియుఁడు. మొద లగునవి.

**6. ఉత్తరపదం బగుచోటశబ్దముటాక్షరమునకు లోపంబు విభాష నగు.** (16)

సమాసంలో చివరిపదానికి ఉత్తరపదం అని సంజ్ఞ. చోటు అనేశబ్దం ఔపవిభక్తికం. కాబట్టి దీనికి పైన ఉన్న సప్తమీవిభక్తికి (చోటునన్, చోటియందున్) (చోటుశబ్దంమీద తృతీయార్థం కుదరదు కాబట్టి తృతీయావిభక్తి ఉండదు.) 'ఔపవిభక్తికంబుల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత అత్వం వచ్చి, చోటన్ అని అవుతుంది. సమాసంలో చివరిపదంగా ఉన్న చోటన్ అనేశబ్దం లోని 'ట' అనేఅక్షరానికి వికల్పంగా లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

అచ్చోటన్ అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత 'ట'వర్ణం లోపించగా అచ్చోన్ అని అవుతుంది. విభాష అనటంచేత టవర్ణం లోపించనిపక్షంలో అచ్చోటన్ అనే ఉంటుంది. ఇలాగే ఒకచోన్, ఒకచోటన్ మొ.

'ఉత్తరపదంబు' అనటంచేత 'చోటన్' అని వ్యస్తంగా (సమాసం కాకుండా) ఉన్నపుడు టవర్ణానికి లోపం రాదు. 'చోన్' అని ప్రత్యేకంగా ఉండదు.

'చోటశబ్దము'అనటంచేత అప్పాటన్, ఇమ్మోటన్ మొదలుగా చోట కంటె వేరైనశబ్దాలలోని టవర్ణానికి లోపం రాదు.

'టాక్షరమునకు' అనటంచేత 'చోటన్' అనేదానిలో అకారంతో కూడా టకారం (ట) మొత్తం లోపిస్తుంది. ఇంకా, అచ్చోటు, అచ్చోటికి, మొద లైనవిధంగా టు,టి ఇత్యాదిగా ఉన్నస్థలాలలో లోపం ప్రసక్తి లేదు.

**7. సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దము దుజ్వర్ణమునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.** (15)

పూర్వ - ఉత్తరపదాలు రెంటికి సమానంగా ఒకే అధికరణం (ఆధారం) అయిఉండడం సమానాధికరణం. ఉత్తరపదం అంటే సమాసంలోని చివరిపదం. 'డుజ్'లో జకారం ఇత్తు. కాబట్టి 'జిత్తు బిందుపూర్వం బగు' అని పూర్వంలో సున్న గలిగినది గ్రహించాలి.

పూర్వపదం అయిన మూఁడుశబ్దంతో, సమాన మైనఅధికరణం కలిగినఉత్తరపదం పరంగా ఉండగా మూఁడులోని అరసున్నతో గూడ డువర్ణం లోపిస్తుంది. అపుడు

దానికి పైన ఉన్నహల్లుకు ద్విత్వం గూడా వస్తుంది అని సూత్రార్థం.

మూఁడు అయిన జగములు అనేఅర్థంలో సమానాధికరణసమాసం అయి, మూఁడు + జగములు. విభక్తి లోపించి, మూఁడు + జగ అని ఉండగా ప్రస్తుతసూత్రం చేత 'ఁడు' వర్ణం లోపించి,(మూ+జగ) మీఁదిహల్లుకు ద్విత్వం వచ్చి, 'ముజ్జగ' – అని అవుతుంది. ఈసమాసప్రాతిపదికమీద ప్రథమావిభక్తి వివక్షించగా బహువచనంలో 'లు'వర్ణకం, ముందు ముగాగమమూ వచ్చి 'ముజ్జగములు' అవుతుంది.

సమానాధికరణసమాసం లేదా కర్మధారయసమాస మిత్యాదిగా చెప్పకుండ 'సమానాధికరణంబు' అనడంచేత కర్మధారయసమాసం కాకపోయినా సమానాధికరణం ఉంటే ఈకార్యం కల్గుతుంది. మూడు కన్నులు గలవాడు. ముక్కంటి. (బహువ్రీహి)

సమానాధికరణం లేనపుడు 'ఁడు' వర్ణం కూడా ఉండదు. మూటియొక్క లెక్క మూటిలెక్క. మూఁడు రెండ్లు ఇత్యాదులు సమాసాలే కాదు.

'ఉత్తరపదంబు' అనడంచేత సమాసం కానపుడు ఈకార్యాలు రావు. లోకములు మూఁడు నిండెను.

'మూఁడుశబ్దము' అనడంచేత ఇతరశబ్దంలో డుబు లోపించదు.(రెండు తెఱగులు)

'డుజ్వర్ణంబునకు' అనడంచేత 'మూఁడు'లో 'ఁడు' మాత్రమే లోపిస్తుంది. 'మూ' నిలిచే ఉంటుంది.

'డుజ్వర్ణంబునకు' అని జిత్తుగా చెప్పడంవల్ల ముందరి అరసున్న కూడా లోపిస్తుంది. ముఁజ్జగములు ఇత్యాదిగా అరసున్న ఉండదు.

'లోపంబును – ద్విత్వంబును' అనేచోట్ల సముచ్చయార్థకనుశబ్దంచేత లోపద్విత్వాలు రెండూ కలిసే వస్తాయి. కాబట్టి ద్విత్వం రాకుండా లోపం మాత్రమె వచ్చి 'మూజగములు' అని గానీ, లోపం రాకుండా ద్విత్వం మాత్రమె వచ్చి 'మూజ్జగములు' అని కానీ ఉండదు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. మూఁడుకంటి (ముక్కంటి) అని ఉండదు.

సూరి 'మూఁడు జగములు' అనేరీతిగా ఈకార్యం లేకుండా చూపినఉదాహరణలు సమాసాలు గా వని గ్రహించాలి. సమాస మయితే, ముజ్జగములు– ముయ్యేడు ఇత్యాదిగా ఈకార్యం నిత్యమె.

**8. ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగా నగు, మిశ్రంబునకుఁ గాదు.**(18)

విశేషణానికి విశేష్యంతో జరిగినసమాసం కర్మధారయం. ఈకర్మధారయసమాసం లో పూర్వపద మైనవిశేషణం సంఖ్యావాచకం అయితే తెలుగులో ద్విగువు అంటారు. ఆచ్ఛికశబ్దానికీ, సంస్కృతసమశబ్దానికీ ఐనసమాసం మిశ్రం.

ఆచ్ఛికశబ్దాలకు ఏర్పడిన ద్విగుసమాసంపై బహుత్వార్థాన్నిబట్టి బహువచనం రాగా దానికి తఱుచుగా ఏకవచనం వస్తుంది. మిశ్ర మైనద్విగుసమాసానికి (బహుత్వార్థంలో) ఏకవచనం రాదు అని సూత్రాని కర్థం.

'మూఁ డైన చిచ్చులు' అనే అర్థంలో మూఁడు + చిచ్చు అని ఉండగా 'సమానాధికరణం బగు-' అనేసూత్రంచేత డుఙు లోపించి, మీదిహల్లుకు ద్విత్వం వచ్చి 'ముచ్చిచ్చు' అని కాగా, బహుత్వార్థాన్నిబట్టి దీనిపై బహువచనం రాగా ప్రస్తుతసూత్రంచేత ఆబహువచనానికి ఏకవచనం వస్తుంది. స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల -' అనేసూత్రంచేత ప్రథమైకవచనం (ను) లోపించగా 'ముచ్చిచ్చు' అని అవుతుంది.

మూఁడు + విధ = ముప్విధ. ఇది మిశ్రద్విగువు (మూడు - ఆచ్ఛికం, విధం - తత్సమం) కాబట్టి ప్రస్తుతసూత్రంచేత ఏకవచనం రాదు. బహువచనంతో 'ముప్విధములు' అనే అవుతుంది. నల్దిక్కు, ముమ్ముహూర్తము ఇత్యాదిగా మిశ్రద్విగువుకు గూడా ఏకవచనం అరుదుగా కనబడుతున్నది.

'ద్విగువునకు' అనడంచేత ద్విగువు కానిదానికి ఏకవచనం రాదు. తెల్లగుఱ్ఱములు మొద లగునవి. కూడుచీర, కూరగాయ, ఇత్యాదిగా ద్వంద్వసమాసంలో కొన్నిచోట్ల ఈకార్యం కనిపిస్తుంది.

'ఏకవచనంబు' అని సామాన్యంగా చెప్పడంవల్ల అన్ని విభక్తుల్లోనూ ఏకవచనం వస్తుంది. ముచ్చిచ్చును, ముచ్చిచ్చునందు మొద లగునవి. ఇంక బహువచనంతో ముచ్చిచ్చులు ఇత్యాదిగా ఉండదు.

'ప్రాయికంబు' అనడంచేత ఈకార్యం కొన్నిచోట్ల వైకల్పికంగా వస్తుంది. నల్గడ, నల్గడలు మొ.

'మిశ్రంబునకు' అనడంచేత ఈసూత్రంలో పూర్వవాక్యంచేత చెప్పబడినకార్యం (ఏకవచనం) ఆచ్ఛికద్విగువులలో మాత్రమే అని తెలియవచ్చు.

**9. నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు.** (20)

నిక్కల మొద లైన (నిక్కలాదులు) సమాసాలు కవిప్రయోగాలలో ఏరూపంతో ఉంటే ఆరూపంతో గ్రహించాలి. అని సూత్రాని కర్థం.

నిక్కల మొద లైనవి ఆచ్ఛికసమాసాలు. ఉన్నవర్ణాలు లోపించడం, లేనివర్ణాలు ఆగమం కావడం, ఆదేశంగా రావడం, మొద లైనమార్పులు ఒక్కొక్కసమాసరూపంలో అనేకప్రకారాలుగా ఉండడంచేత వాటిని లక్షణబద్ధం చేయడం గౌరవం. లక్షణం విశ్వతోముఖం గాదు. అందు కని ప్రయోగానుసారంగా గ్రహించా లని యీసూత్రం చెప్తున్నది. ఇలా చెప్పటం సంస్కృతవ్యాకరణసంప్రదాయం.

'నిక్క మైన కల' అనేఅర్థంలో విశేషణవిశేష్యాలకు కర్మధారయసమాస మయి, నిక్కము + కల (పుంప్వాదేశకార్యాన్ని బాధించి) ప్రస్తుతసూత్రంచేత నిక్కములో 'కము' లోపించి నిక్ + కల నిక్కల అవుతుంది.

కవ + వడి అన్నపుడు బహుబ్రీహిసమాసంలో పూర్వపదం చివరి అత్త్వం లోపించి 'కవ్వడి' ఇలాగే 'పువ్విలుకాఁడు' మొదలైన రూపాలను ప్రయోగానుసారంగా గ్రహించి వాటిలో ఆయావర్ణాలమార్పును గుర్తించాలి.

నిక్కల-ఆదు లన్నప్పటి ఆదిశబ్దంచేత ప్రయోగాలలో ఉన్న ఆయాఆచ్ఛికసమాస రూపాలను ఇక్కడ గ్రహించాలి. అంత + దాక అందాక మొ. (ప్రౌఢ. ఆచ్ఛి. 36)

'యథాప్రయోగంబుగ' అనడంచేత కవిప్రయోగాల్లో లేనిదానిని లోక వ్యవహారాదులనుబట్టి గ్రహించగూడదు.

**10. బహుబ్రీహిని సమాసాంతకార్యంబులు గానంబడియెడి.** (22)

సమాసంలో ఉన్నవాటికంటె అన్య మైనపదంయొక్క అర్థం ప్రధానం (క్రియతో అన్వయించేది) అయినది బహుబ్రీహి సమాసం. సమాసం చివరలో కలిగే ఆగమాదేశాదిరూప మైనవర్ణవికారం సమాసాంతకార్యం.

ఆచ్ఛిక మైనబహుబ్రీహిసమాసంలో చివర లోపం, ఆగమం, ఆదేశం మొద లైనవర్ణవికారాలు కవిప్రయోగాల్లో కనబడుతున్నా యని సూత్రానికి అర్థం.

'మూఁడు కన్నులు గలవాఁడు' అనేఅర్థంతో మూఁడు+కన్ను అనేశబ్దాలకు 'స్త్రీసమఘటితంబ' అనేసూత్రంచేత బహుబ్రీహిసమాస మై, 'సమానాధికరణం బగు-' అనేసూత్రంచేత డుజ్లోపమూ, మీదిహల్లుకు ద్విత్వమూ వచ్చి 'ద్విరుక్తం బగు-' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం రాగా, 'ముక్కన్ను' అని అవుతుంది.

ఇక్కడ ప్రస్తుతసూత్రంచేత అంత్యాక్షరం 'న్ను' స్థానంలో 'ంటి' అనేది సమాసాంతకార్యంగా ఆదేశ మై, ముక్కంటి అని అవుతుంది.

నాలుగు + వాయి = నలువాయి. అన్నపుడు 'యి'లోపం, ముందరిదీర్ఘానికి హ్రస్వం సమాసాంతకార్యాలు, 'గట్టువిలుతుఁడు' అన్నచోట (విల్లులో లకారలోపం) తువర్ణ ఆగమం సమాసాంతకార్యం.

'బహుప్రీహిని' అనడంచేత ఇతరసమాసాల్లో సమాసాంతకార్యా లుండవు. నల్లనిగుఱ్ఱము - తల్లిదండ్రులు మొద లగునవి.

'సమాసాంతకార్యంబులు' అని సామాన్యంగా చెప్పడంచేత కవిప్రయోగాను గుణంగా బహుప్రీహిసమాసంచివర కనిపించే ఆయావర్ణవికారాలు అన్నీ సమాసాంత కార్యాలుగా ఈసూత్రంచేత సంగ్రహించుకోవాలి.

'అంతకార్యం' కార్యం గాబట్టి సమాసం ఆదిమధ్యాల్లో ఈసూత్రంచేత ఎటువంటి మార్పులూ రావు.

'కానంబడియెడి' అనడంచేత కవిప్రయోగాల్లో ఉన్నమార్పులే గ్రహించాలి. స్వతంత్రంగా కల్పించగూడదు.

**11. బహుప్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁదిమేనునకు బోఁడి యగు.** (23)

అన్యపదార్థప్రధాన మైనసమాసం బహుప్రీహి. స్త్రీ వాచ్యం బగుట అంటే స్త్రీవ్యక్తిని తెలియజేయడం. మేనునకు అనేచోటిషష్ఠీవిభక్తిచేత 'మేను'శబ్దం'స్థానంలో' అని అర్థం.

స్త్రీని బోధించేబహుప్రీహిసమాసంలో ఉపమానాన్ని తెలిపేపూర్వపదానికి పైనున్న ఉపమేయ మైన మేను అనేశబ్దంయొక్క స్థానంలో 'బోఁడి' అనేశబ్దం ఆదేశంగా వస్తుంది అని సూత్రార్థం.

అలరువంటి మేను కలది (స్త్రీ) అనేఅర్థంలో అలరు, మేను అనే స్త్రీసమశబ్దాలకు 'స్త్రీసమఘటితంబ' అనేసూత్రంచేత బహుప్రీహిసమాస మై, విభక్తి లోపించి, అలరు+ మేను అని కాగా, ప్రస్తుతసూత్రంచేత 'మేను' స్థానంలో బోఁడి ఆదేశమై అలరుబోఁ డి అని అవుతుంది.

'బహుప్రీహిని' అనడంచేత ఇతరసమాసంలో ఈకార్యం రాదు. 'అలరువంటి మేను' అనేఅర్థంలో (ఉపమానపూర్వపద) కర్మధారయసమాసం కాగా 'అలరుమేను' అనే ఉంటుంది.

'స్త్రీ వాచ్యం బగుచో' అనడంచేత స్త్రీభిన్నం వాచ్య మయ్యేచోట ఈకార్యం ఉండదు. రాముఁడు అలరుబోఁడి, చిలుక చిగురుబోఁడి – ఇత్యాదిగా గాదు, రాము డలరుమేనివాడు, చిలుక అలరుమేనిది అని మేనుశబ్దం అలాగే ఉంటుంది.

'ఉపమానంబుమీఁది' అనడంచేత పూర్వపదం ఉపమానం కాకపోతే ఈకార్యం రాదు. చక్కబోడి, అని కాదు. (చక్కనిమేనిది.)

'అగు' అనటంచేత ఈఆదేశం నిత్యం కాబట్టి అలరుబోఁడి అనేఅర్థంలో అలరుమేను అనేరూపం ఉండదు.

'బోఁడి' అని యీఆదేశం సరళాదిగా చెప్పడంవలన అలరుబోఁడి పూబోఁడి ఇత్యాదిగా ఈస్థలాల్లో బోఁడికి ముందు అరసున్న ఉండదు. అలరుంబోఁడి ఇత్యాదిగా ఉదంతంమీద నిండుసున్న ఉండవచ్చు. తళకుంగజ్జెలులాగా. తీయంబోడి అనేప్రయోగ మొకటి విశేషం.

**12. ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు.** (24)

సమాసంలోని పూర్వ,ఉత్తరపదాలు రెండింటిఅర్థమూ ప్రధాన మైతే (క్రియతో అన్వయిస్తుంటే) అది ద్వంద్వసమాసం. 'ఋకారంబునకు' అనడంచేత ఈద్వంద్వంలో పూర్వపదం ఋకారాంతం కావాలి. అచ్చతెలుగులో ఋకారమె లేదు గాబట్టి ఇది ఆచ్ఛికద్వంద్వం కాదు. 'స్త్రీసమంబుతోడ ఆచ్ఛిక శబ్దంబు –' అనేసూత్రంప్రకారం సంస్కృతసమాలకు ద్వంద్వం కుదరదు, గాబట్టి మిశ్రద్వంద్వం గాని సంస్కృతసమద్వంద్వం గానీ తెలుగులోనే ఉండదు. కాబట్టి ఇకక్కడఇది సంస్కతంలో ఏర్పడిన సిద్ధద్వంద్వం అని గ్రహించాలి. 'ఋకారంబునకు' అనేచోటిషష్ఠిచేత ఋకారం 'స్థానంలో' అని అర్థం. ఈఋకారం పూర్వపదానికి సంబంధించిందే అయిఉండాలి. రేఫ అని కాక 'ర' వర్ణం అనడంవల్ల అత్త్వంతో గూడిన రేఫ (ర్ + అ) 'ర' అనేవర్ణం వస్తుంది.

సంస్కృతంలో ఏర్పడినద్వంద్వసమాసంలో పూర్వపదం చివర ఉన్న ఋకారం యొక్క స్థానంలో తెలుగులో 'ర' అనే అక్షరం వికల్పంగా ఆదేశంగా వస్తుం దని సూత్రాని కర్థం.

'మాతృ – పితృ' అనేశబ్దాలకు సంస్కృతంలో ద్వంద్వసమాసం ఏర్పడగనె తెలుగులో ప్రస్తుతసూత్రంచేత పూర్వపదం చివరిఋకారానికి రవర్ణం వచ్చి మాత్రపితృ – 'ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' అని అత్వస్త్రీవద్భావాలు కలిగి ప్రథమాబహువచనంలో 'మాత్రపితలు' అని అవుతుంది.

'విభాష' అనడంచేత రవర్ణం ఆదేశం కానిపక్షంలో మళ్లీ సంస్కృతవ్యాకరణం ప్రకారం (ఆనఙ్ ఋతో ద్వన్ద్వే) ఆనఙాదేశం వచ్చి మాతాపితృ – అత్వస్త్రీవద్భావాలతో 'మాతాపితలు' అవుతుంది.

'ద్వంద్వంబునందు' అనడంచేత ఇతరసమాసాల్లో ఈకార్యం రాదు. పితృవాక్యము, విధాతృపలుకు మొద లగునవి.

'ఋకారంబునకు' అనడంచేత ఇతరవర్ణాలకు ఈకార్యం రాదు. రామకృష్ణులు, అన్నదమ్ములు, మొద లగునవి.

'ఆనఙుకు' కాకుండా ఋకారానికి విధించడాన్నిబట్టి ఆనఙు రానిస్థలాల్లో గూడ రవర్ణాదేశం రావడం సూరిసమ్మత మనవలసిఉంది. మాంధాత్రరఘుక్షితీశ.

సంస్కృతసమాసంలో అందులోనూ ప్రక్రియామధ్యంలో తెలుగువ్యాకరణం ప్రవర్తించడం ఈఒక్కచోటనె కనబడుతుంది.

**13. సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు.** (25)

'విభక్తి' అంటే ప్రథమ మొదలుగా అన్ని విభక్తులు. (సమాసం సుబంతాలకే కాబట్టి) 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తుకు లడాగమం బగు' అని ద్వితీయాదుల కాగమంగా వచ్చినది లట్టు.

తెలుగులో సమాసంలో ప్రథమ మొద లైన అన్నివిభక్తులకు లోపం వస్తుంది. లడాగమ 'ల' వర్ణానికి మాత్రం లోపం రాదు. అని సూత్రాని కర్థం.

'రామునియొక్క' అనే షష్ఠ్యంతానికి 'బాణము' అనే మీదిపదంతో వ్యధికరణ (తత్పురుష) సమాసం చేయగా, రామునియొక్క + బాణము అని ఉంటుంది. ప్రస్తుతసూత్రంచేత మొదటిపదంలోని 'యొక్క', తరువాతిపదంలోని 'ము' అనేవిభక్తులు రెండూ లోపించి 'రామునిబాణ' అని అవుతుంది. ఈసమాసం (కృత్తద్ధిత సమాసా శ్చ) ప్రాతిపదికం. కాబట్టి దానిమీద ప్రథమావిభక్తి ఏకవచనాన్ని వివక్షించగా 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి – రామునిబాణము అని అవుతుంది.

గుణములయొక్క + ప్రోక + (సు) – అనేచోట 'లట్టు' షష్ఠీవిభక్తికి బహుత్వంలో ఆగమంగా వచ్చింది. 'యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే' అని విభక్తికి ఆగమ మైన లట్టు విభక్తే అవుతుంది. కాబట్టి' సమాసవిభక్తికి లోపం బగు' అనేదానిచేత 'యొక్క'తోపాటు 'లట్టు' గూడా లోపించాల్సివస్తుంటే 'లట్టునకు గాదు' అన్నాడు. కాబట్టి 'ల' లోపించదు. యొక్క – (సు) – లోపించి గుణములప్రోక .

స్త్రీసమ మైన ఈసమాసప్రాతిపదికపై – 'స్త్రీలింగంబుల –' అని ప్రథమైకవచనలోపం.

'సమాస' శబ్దం తద్ధితవృత్తికీ ఉపలక్షకం. కాబట్టి తద్ధితప్రత్యయాలు పర మైనపుడు గూడా ఈసూత్రంచేత విభక్తి లోపిస్తుంది. రామునియొక్క + తన = రామునితనము.

'సమాస' అనడంచేత సమాసం గానిస్థలాల్లో విభక్తి లోపించదు. రామునిచేత చంపబడెను. మొద లగునవి.

'విభక్తికి' అనడంచేత విభక్తి కానిదానికి లోపం రాదు. రాముని(యొక్క) బాణము అనేచోట 'ని' వర్ణం 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు' అనేసూత్రంచేత ప్రాతిపదికకు ఆగమ మైంది. కాబట్టి 'యదాగమాః–' అనే న్యాయం చేత నిగాగమం ప్రాతిపదికలో భాగమె అవుతుంది. కాని విభక్తి కాదు. అందుచేత దానికి లోపం రాదు. ఇలాగే సంజీవకమురావము, (నువర్ణకంబునుత్వంబు) వధువుముఖము మొ. ము,వు మొద లైనవి ప్రకృతికాగమాలు గావడంచేత లోపింపలేదు.

'అగు' అనడంచేత సమాసంలో విభక్తిలోపం నిత్యం. రామునియొక్క బాణము అని సమాసంలో విభక్తి నిలిచిఉండదు.

**14. కర్మాదులకుం బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబలె వానితోడ సమసించు.** (26)

కర్మ–మొద లైనవి కర్మాదులు. కర్మ–కరణం–సంప్రదానం–అపాదానం– అధికరణం– అనేవి అయిదు ఇక్కడి కర్మాదులు. ప్రాధాన్యం అంటే క్రియలోకి అన్వయం కలిగిఉండడం. వివక్ష అంటే (వక్తుం ఇచ్ఛా) చెప్పదలచుకోవడం. ధాతువునుండి ఏర్పడినవిశేషణరూపాలు ధాతుజవిశేషణాలు, ఎడి, ఎడు, వానిలోపం, ఉన్న, కల, న, ని అనేవాటితో ప్రతిధాతువునుండి విశేషణరూపాలు ఏడు విధాలుగా ఏర్పడతాయి.

ధాతుజవిశేషణాలు సామర్థ్యాన్నిబట్టి కర్తతో ఏవిధంగా (కర్మధారయంగా) సమాసం పొందుతున్నాయో, అదేవిధంగా క్రియతో అన్వయాన్ని చెప్పదలచుకొన్నపుడు అలా ప్రాధాన్యాన్ని పొందినకర్మాదులతో గూడా (సామర్థ్యం లేకున్నా) సమాసం పొందుతాయి అని సూత్రాని కర్థం. ఉదా. రాముఁడు రక్షించిన భృత్యుఁడు.

(రాముఁడు భృత్యుని రక్షించెను ) 'భృత్యుని రక్షించినరాముడు' అనేవాక్యంలో రాముడు కర్త. 'రక్షించెను' అనేక్రియ భూతార్థకం (కాబట్టి) ఆధాతువునుండి యేర్పడిన భూతార్థక మైనవిశేషణరూపం – రక్షించిన. దీనప్రథమాంతరూపం రక్షించినవాడు.

ఈవిశేషణం కర్త – రాముడే కాబట్టి 'రక్షించినరాముడు' అనేవిధంగా కర్తతో సమాసం పొందడం సామర్థ్యానుగుణం, పైవాక్యంలో 'భృత్యుని' అనేది కర్మ. రాముడు అనేకర్తకు కాక, భృత్యు డనేకర్మకు ప్రాధాన్యం చెప్పదలుచుకుంటే 'రక్షించిన' అనేధాతుజవిశేషణం 'భృత్యు' డనేకర్మతో సమాసం పొంది 'రక్షించినభృత్యుడు' అని అవుతుంది. ఇక్కడ రక్షించినవాడు భృత్యుడు కాదు గాబట్టి సామర్థ్యం లేదు. కాబట్టి సమాసం కుదరదు. అందుచేత ఈసూత్రం సమాసాన్ని విశేషంగా విధించింది. సామాసిక మైనశబ్దప్రక్రియ ఇది. నిజానికి రాముడు రక్షించిన – భృత్యుడు అనేచోట రక్షించిన అనేవిశేషణం తరువాత భృత్యుడితో కాకుండా ఆసమాసానికి పూర్వంలో వేరుగా ఉన్న 'రాముడు' అనే కర్తతోటే అన్వయం కలిగిఉంటుంది. సమాసంమాత్రం కర్మతో పొందింది. ఇలాగే ప్రాధాన్యవివక్షలో–

1. కర్మ – భృత్యుని రక్షించినరాముడు.
   రాముడు రక్షించిన భృత్యుడు.
2. కరణం – బాణముతో (వాలి) నేసిన రాముఁడు.
   రాముడు (వాలిని) ఏసిన బాణము.
3. సంప్రదానం – విప్రునికొఱకు (గోవును) ఇచ్చిన రాముఁడు.
   రాముడు (గోవును) ఇచ్చిన విప్రుడు.
4. అపాదానం – వనమువలన వెడలిన రాముడు.
   రాముడు వెడలినవనము.
5. అధికరణం – పర్ణగృహమునందు వసించినరాముడు.
   రాముడు వసించిన పర్ణగృహము.

'కర్మాదులకు' అనడంచేత కర్తతో సమాసం ఇక్కడ ప్రసక్తం కాదు. సామర్థ్యాన్నిబట్టి అది పూర్వసిద్ధమె. రక్షించినరాముడు మొ.

'ప్రాధాన్యవివక్షయందు' అనడంచేత కర్మాదులకు ప్రాధాన్యం వివక్షింపకపోతే 'రక్షించిన రాముడు' ఇత్యాదిగా కర్తతో సమాసం మొద లైనవి సాధారణమె.

'ధాతుజవిశేషణంబులు' అని సామాన్యంగా చెప్పడంచేత ఏడు విధా లైన విశేషణాలకు ఈకార్యం కలుగుతుంది.

'రాముడు రక్షించెడు భక్తులు, రాముడు రక్షించుచున్న భక్తులు
రాముడు రక్షించెడి భక్తులు, రాముడు రక్షింపగల భక్తులు

రాముడు రక్షించు భక్తులు, రాముడు రక్షించిన భక్తులు.

రాముడు రక్షింపని రాక్షసులు

ధాతుజములు కాని ఇతరవిశేషణాలకు ఇటువంటిస్థితి ఉండదు.

# తద్ధితపరిచ్ఛేదం

**1. తనవర్ణకంబు త్వార్థంబునం దగు.** (1)

'త్వ' అనేప్రత్యయంయొక్క అర్థం త్వార్థం.'తస్య భావ స్త్వతలౌ' అని సంస్కృతంలో 'త్వ' అనేప్రత్యయం భావార్థంలో విధింపబడింది. కాబట్టి త్వార్థం అంటే భావార్థం. 'ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు భావంబు' ప్రాతిపదికనుంచి కలిగే జ్ఞానంలోని ధర్మం భావం. ఉదాహరణకు 'రామ' ఇది ప్రకృతి. దీనినుంచి కలిగే (జన్య) జ్ఞానం (బోధం) దశరథుడికొడుకు అనేది. దానిలోని ధర్మం – అంటే దశరథుడికొడుకుయొక్క ధర్మం – భావార్థం. రామత్వం.

ఈఅర్థంలో తెలుగులో 'తన' అనేతద్ధితప్రత్యయం వస్తుంది. సంస్కృతంలో త్వప్రత్యయంలాగా ఈతనప్రత్యయం కూడా (భావార్థంలో) షష్ఠీవిభక్తి (యొక్క) చివర కలిగినశబ్దంమీద వస్తుంది. ప్రత్యయం కాబట్టి పరంగా వస్తుంది.

'మనుమనియొక్క భావం' అనేఅర్థంలో 'మనుమనియొక్క' అనేషష్ఠ్యంతంమీద ప్రస్తుతసూత్రంచేత తనప్రత్యయం వచ్చి 'మనుమనియొక్క+తన' 'సమాసవిభక్తికి లోపం బగు' అని యొక్కవిభక్తి లోపించి, 'మనుమనితన'. 'కృత్తద్ధితసమాసా శ్చ' అని తద్ధితప్రత్యయాంతం ప్రాతిపదిక అవుతుంది. కాబట్టి దానిపై ప్రథమాదివిభక్తులు చేరతాయి. తనప్రత్యయాంతం తెలుగులోని 'ఆచ్ఛికశబ్దంబు లెల్లన్' అనేసూత్రంచేత క్లీబసమం అవుతుంది. కాబట్టి 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత 'ము' వర్ణకం వచ్చి మనుమనితనము అని అవుతుంది. ఆచ్ఛికతద్ధితప్రత్యయాలలో 'తన' అనేది ఒక్కటే సంస్కృతసమాలమీద కూడా సాధారణంగా వస్తుంది. రాముని తనము, సీతతనము. మొ.

'త్వార్థంబునందు' అనడంచేత ఇతరఅర్థాలలో తనప్రత్యయం రాదు. అరమరిక, జాలరి మొ.

**2. కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు. (11)**

'కాకత్తియవర్ణకంబులు' అన్నపుడు (లక్ష్యానుగుణంగా) 'కా' అనేది ఒక ప్రత్యయంగానూ, 'కత్తియ' అనేది మరో ప్రత్యయంగానూ గ్రహించాలి. పుంస్త్వం అంటే పురుషుడిని తెలియజేయడం. అలాగే స్త్రీత్వం అంటే స్త్రీని తెలియజేయడం. యథాక్రమంగా పుంస్త్వంలో 'కా', స్త్రీత్వంలో 'కత్తియ' వస్తాయి. 'మతుప్' అనే (సంస్కృత)ప్రత్యయంయొక్క అర్థం మతుబర్థం. 'త ద స్యా స్త్యస్మి న్న స్తీతి మతుప్'

అనేసూత్రంప్రకారం కలిగిన (కలది, కలవాడు) అని అర్థం. సంస్కృతానుసారంగా మతుప్ప్రత్యయం లాగానే ప్రథమావిభక్తి చివర కలిగినశబ్దాలపై 'కా, కత్తియ' వస్తాయి. ప్రత్యయం కాబట్టి పరంగా వస్తుంది.

మతుప్ప్రత్యయార్థంలో తెలుగులో ప్రథమావిభక్త్యంతా లయిన ఆట మొద లయిన శబ్దాలకు పరంగా పురుషుడిని బోధించేసందర్భంలో 'కా' అనేప్రత్యయమూ, స్త్రీని బోధించేసందర్భంలో 'కత్తియ' అనేప్రత్యయమూ వస్తా యని సూత్రానికి అర్థం.

ఆట కలిగిన పురుషుడు అనేఅర్థంలో 'ఆట' అనేప్రథమాంతశబ్దంపై ప్రస్తుతసూత్రం చేత 'కా' అనేప్రత్యయం వచ్చి 'ఆట+కా'. 'సమాసవిభక్తికి లోపం బగు' అని ప్రథమైకవచనం (సు) లోపించి, ఆటకా. తద్ధితాంత మైనఈశబ్దం ప్రాతిపదికం. (ఆచ్ఛికశబ్దంబులెల్ల- అని పుంలింగతుల్యం) 'కా'ప్రత్యయం చివరగలిగినశబ్దాలు మగాదుల్లో చేరిఉన్నాయి. ప్రథమైకవచనంలో 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అని డుజ్ వచ్చి, 'ఆటకాఁడు' అవుతుంది.

'ఆట కలిగినస్త్రీ' అనే అర్థంలో 'కత్తియ' అనేప్రత్యయం వచ్చి 'ఆటకత్తియ'. కత్తియ ప్రత్యయంతాలు స్త్రీసమాలు కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. ఆటకత్తియ. 'ఇయ'కు ఎత్వం వస్తే ఆటకత్తె.

'పుంస్త్వ స్త్రీత్వంబుల' అనడంచేత ఇతర మైన తిర్యక్కులు మొ. వాటిని తెలిపే శబ్దాలపై ఈకార్యం లేదు. ఆటకాడు, ఆటకత్తియ అయిన నెమలి అని ఉండదు.

'మతుబర్థంబున' అనడంచేత ఇతరఅర్థంలో ఈప్రత్యయాలు రావు. ఆట అనేఅర్థం (స్వార్థం)లో ఆటకాడు ఆటకత్తియ అని ఉండదు.

'ఆటాదులకు' అనడంచేత ఆట మొ. వాటిలో చేరనిశబ్దానికి కా కత్తియలు రావు. ఇల్లుకాడు(ఇల్లు కలవాడు) ఇల్లుకత్తియ(ఇల్లు కలది) అని కావు.

'కోపగాడు' ఇత్యాదిగా ఈతద్ధితం సంస్కృతసమంపై అరుదుగా ప్రయోగింపబడింది.

**3. కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి.** (14)

తిర్యక్కులు అంటే పశువులు, పక్షులు మొద లైనవి. 'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' అని పూర్వం 'కా'అనేప్రత్యయం మతుబర్థంలోనూ, 'కాకత్తియలు కొండొకవానికి స్వార్థంబున' అని స్వార్థంలోనూ పురుషుడిని బోధించేసందర్భంలో చెప్పబడింది.

'కా' అనేతద్ధితప్రత్యయం పశుపక్ష్యాదులను తెలియజేసేశబ్దాలమీద కూడా మతుబర్థంలోనూ, స్వార్థంలోనూ కవిప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రార్థం.

'ఒంటి' (ఒంటరితనం) కలది (జంతువు) అని ఒంటి అనేప్రథమాంతశబ్దంమీద మతుబర్థంలో ప్రస్తుతసూత్రంచేత 'కా' ప్రత్యయం వచ్చి ఒంటికా. 'సమాసవిభ క్తికి లోపం బగు' అని విభక్తి లోపించి, 'కాకత్తియలకకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి' అని గకార మై, ఒంటిగా. తద్ధితాంత మైనఈప్రాతిపదికం పుంలింగతుల్యం. కాప్రత్యయాంతం మగాదిగణంలో చేరింది. కాబట్టి 'మహత్తు లగుమగాదులకుం గయి రాదులకు డు జగు, నుత్వంబు గాదు' అని ప్రథమైక వచనంలో డుజు వచ్చి ఒంటిగాఁడు.

ఇబ్బంది శబ్దంమీద అదే (పెద్దపులికి చిఱుతపులికి పుట్టినజంతువు) అర్థంలో అంటే స్వార్థంలో ప్రస్తుతసూత్రంచేత 'కా' ప్రత్యయం వచ్చి ఇబ్బందిగాఁడు అవుతుంది. ఇబ్బందిగాఁడు అంటే ఇబ్బంది అనే అర్థం.

'కావర్ణకంబు' అనడంచేత 'కత్తియ' తిర్యక్కులపై లేదు. ఒంటిగత్తియ ఇబ్బందిగత్తియ ఇత్యాదిరూపాలు ఉండవు.

'తిర్యక్కులకును' అన్నచోటిసముచ్చయార్థంచేత 'కా'ప్రత్యయం పుంస్త్వంలో ప్రసిద్ధమే కాని తిర్యక్కులకు రావడం అరుదు అని అర్థం.

'కానంబడియెడి' అనడంచేత తిర్యక్కులపై కా ప్రత్యయం రావడాన్ని కవిప్రయోగాలలో కానవచ్చినచోట్ల మాత్రమే గ్రహించాలి.

**4. తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు.** (19)

కులాన్ని బోధించేశబ్దం కులవాచకం. 'మతుప్' అనేప్రత్యయంయొక్క అర్థం మతుబర్థం. కలిగిన(ది) అని దీనిఅర్థం. మతుబర్థకప్రత్యయం ప్రథమావిభక్త్యంతంమీద వస్తుంది. ప్రత్యయం కాబట్టి పరంగా వస్తుంది.

స్త్రీని తెలియజేసేసందర్భంలో కులాన్ని బోధించే, ప్రథమావిభక్తి చివర కలిగిన అచ్చతెలుగుశబ్దానికి పరంగా మతుప్ ప్రత్యయార్థంలో 'త' అనేప్రత్యయం వస్తుంది అని సూత్రానికి అర్థం.

'కొఱవ' కులానికి సంబంధించినస్త్రీ అనేఅర్థంలో కొఱవ అనేప్రథమాంతశబ్దంమీద ప్రస్తుతసూత్రంచేత 'త' ప్రత్యయం అయి,కొఱవ-త. 'సమాసవిభక్తికి లోపం బగు' అని ప్రథమైకవచనం (సు) లోపించి కొఱవత. తద్ధితాంతం ప్రాతిపదికం. 'ఆచ్ఛిక

శబ్దంబు లెల్ల' అనేసూత్రంచేత తప్రత్యయాంతాలు స్త్రీసమాలు. కాబట్టి దీనిపై ప్రథమైకవచనం 'స్త్రీలింగంబుల' అని లోపించి 'కొఱవత' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

'కులవాచకంబునకు' అనడంచేత కులాన్ని బోధించనిశబ్దంపై ఈప్రత్యయం రాదు. సొగసు కలిగినస్త్రీ, సొగసుత అని కాదు.

'స్త్రీ వాచ్యం బగునపుడు' అనడంచేత పురుషుడిని (మొ.) బోధించేటపుడు ఈప్రత్యయం రాదు. కొఱవజాతి పురుషుడు అనేఅర్థంలో 'కొఱవత' అని కాదు.

ఈప్రత్యయం అచ్చతెలుగుశబ్దాలమీద మాత్రమే వస్తుంది. (సంస్కృతసమాలపై కనబడదు.)

**5. వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడి వర్ణకం బగు.** (22)

వగ మొద లైనవి వగాదులు. ఇవి అన్నీ అచ్చతెలుగుశబ్దాలే. మతు(ప్) అనే సంస్కృతప్రత్యయంయొక్క అర్థం (మతు–అర్థ) మత్వర్థం. కలిగిన(ది) అని అర్థం. మతుబర్థకం ప్రథమావిభక్త్యంతంమీద వస్తుంది. కాబట్టి 'బహువచనాంతం' అంటే ప్రథమాబహువచ నాంతం. 'లువర్ణంబు బహువచనంబు' కాబట్టి 'లు' అనేబహువచనం చివర కలిగినది. 'బహువచనాంతంబులకు' అని సూత్రంలో ప్రత్యేకంగా చెప్పినసామర్థ్యంచేత ఈ 'లు' విభక్తికి 'సమాసవిభక్తికి లోపం బగు' అని రావలసిన లోపం రాదు.

ప్రథమాబహువచనం (లు) చివర కలిగిన, వగ(లు) మొద లైనశబ్దాలకు పరంగా, ఆశబ్దంచేత స్త్రీవ్యక్తి తెలియజేయబడేసందర్భంలో, మతుప్ ప్రత్యయార్థంలో 'ఆఁడి' అనే ప్రత్యయం వస్తుంది.

'వగలు కలిగినస్త్రీ' అనేఅర్థంలో వగలు అనేప్రథమాబహువచనాంతశబ్దంమీద ప్రస్తుతసూత్రంచేత ఆఁడి అనేప్రత్యయం వచ్చి. వగలు–ఆఁడి. ఈసూత్రంలో 'బహువచ నాంతంబులకు' అనేనిర్దేశసామర్థ్యంచేత 'సమాసవిభక్తికి లోపం బగు' అని రావలసిన (లు)విభక్తికి లోపం రాదు. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి వగలాఁడి. ఈతద్ధితప్రత్యయం చివర కలిగినశబ్దాలు స్త్రీసమాలు. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, వగలాఁడి అనే ప్రథమైకవచనాంత మైనపదం ఏర్పడుతుంది.

'వగాదులకు' అనడంచేత వగలు మొద లైనవాటిలో లేనిశబ్దానికి ఈకార్యం లేదు. 'ఓయారములు కలిగినస్త్రీ' ఓయారములాఁడి అని కాదు.

'బహువచనాంతంబులకు' అనడంచేత ఏకవచనాంతంపై ఈకార్యం లేదు. (వగ–ఆఁడి) వగాఁడి, (చిన్నె–ఆఁడి) చిన్నాఁడి అని ఉండదు.

'స్త్రీ వాచ్యం బగునపుడు' అనడంచేత పురుషుడిని బోధించేసందర్భంలో ఈకార్యం లేదు. వగలు కలిగిన పురుషుడు అనేఅర్థంలో వగలాఁడి కాదు. ( వేరేసూత్రంచేత వగలాఁడు అవుతుంది)

**6. వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు.** (23)

వగ మొద లైనవి వగాదులు. ఇవి అన్నీ అచ్చతెలుగుశబ్దాలే. మతు(ప్) అనే సంస్కృతప్రత్యయంయొక్క అర్థం (మతు+అర్థ) మత్వర్థం. కలిగిన(ది) అని అర్థం. మతుబర్థకం ప్రథమావిభక్త్యంతంమీద వస్తుంది. కాబట్టి 'బహువచనాంతం' అంటే ప్రథమాబహువచ నాంతం. 'లువర్ణంబు బహువచనంబు' కాబట్టి 'లు' అనే బహువచనం చివర కలిగినది. 'బహువచనాంతంబులకు' అని సూత్రంలో ప్రత్యేకంగా చెప్పినసామర్థ్యంచేత ఈ 'లు' విభక్తికి 'సమాసవిభక్తికి లోపం బగు' అని రావలసినలోపం రాదు.

ప్రథమాబహువచనం (లు) చివర కలిగిన, వగ(లు) మొద లైనశబ్దాలకు పరంగా, ఆశబ్దంచేత పురుషవ్యక్తి తెలియజేయబడేసందర్భంలో, మతుప్ ప్రత్యయార్థంలో 'ఆ' అనేప్రత్యయం వస్తుంది.

'వగలు కలిగినవాడు' అనేఅర్థంలో వగలు అనేప్రథమాబహువచనాంతశబ్దంమీద ప్రస్తుతసూత్రంచేత 'ఆ' అనేప్రత్యయం వచ్చి. వగలు+ఆ. ఈసూత్రంలో 'బహువచ నాంతంబులకు' అనేనిర్దేశసామర్థ్యంచేత 'సమాసవిభక్తికి లోపం బగు' అని లు విభక్తికి రావలసిన లోపం రాదు. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి వగలా. ఈతద్ధితప్రత్యయం చివర కలిగినశబ్దాలు (పుంలింగతుల్యాలు) మగాదుల్లో చేరినవి. కాబట్టి 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు ఙగు, నుత్వంబు గాదు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో, డుఙు వచ్చి, వగలాఁడు అనే పదం ఏర్పడుతుంది.

'వగాదులకు' అనడంచేత వగలు మొద లైనవాటిలో లేనిశబ్దానికి ఈకార్యం లేదు. 'ఓయారములు కలిగినవాడు' ఓయారములాఁడు అని కాదు.

'బహువచనాంతంబులకు' అనడంచేత ఏకవచనాంతంపై ఈకార్యం లేదు. (వగ+ఆ) వగాఁడు, (చిన్నె+ఆ) చిన్నాఁడు అని ఉండదు.

'పుంస్త్వంబున' అనడంచేత స్త్రీని బోధించేసందర్భంలో ఈకార్యం లేదు. వగలు కలిగిన స్త్రీ అనేఅర్థంలో వగలాఁడు కాదు. ( వేరేసూత్రంచేత వగలాఁడి అవుతుంది)

**7. మానార్థంబున కేకత్వంబునం దెఁడు వర్ణకం బగు.** (25)

మానం అంటే పరిమాణం. కొలత అని అర్థం. ప్రత్యయం కూడా మానార్థకమే. ఇది ప్రథమాంతంమీద వస్తుంది. 'ఏకత్వంబున' అంటే ఏకత్వాన్ని బోధించేశబ్దం మీద, ఏకత్వార్థంలోనే అని గ్రహించాలి.

పరిమాణాన్ని తెలియజేసేదీ (పరిమాణవాచకం) ప్రథమావిభక్తి ఏకవచనాంతం అయినదీ అయినశబ్దంమీద ఏకత్వార్థాన్ని తెలిపేసందర్భంలో 'ఎఁడు' అనేప్రత్యయం వస్తుంది అని సూత్రానికి అర్థం.

'తూము' అనేశబ్దం పరిమాణవాచకం. అంటే కొలతను తెలియజేసేది. తూము పరిమాణం కలది అనేఅర్థంలో 'తూము' అనేప్రథమాంతశబ్దంమీద ప్రస్తుతసూత్రంచేత ఎఁడు ప్రత్యయం వచ్చి, తూము–ఎఁడు. 'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత తూముశబ్దంమీది ప్రథమైకవచనం (సు) లోపించి, తూము–ఎఁడు. (ఉత్త్వసంధిని బాధించి) 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, తూమెఁడు. ఈతద్ధితాంత ప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి స్త్రీసమత్వ ప్రత్యేకవిధానంచేత (ఉదంత మైనా, ఊరు మొ, వాటిలాగా) 'స్త్రీలింగంబుల' అని ప్రథమైకవచనం (సు) లోపించి, తూమెఁడు అనేపదం ఏర్పడుతుంది.

'మానార్థకంబునకు' అనడంచేత పరిమాణాన్ని తెలియజేయనిశబ్దంమీద ఈకార్యం రాదు. వానియంత, ఇంత, మొ.

'ఏకత్వంబున' అనడంచేత (ప్రథమా) బహువచనాంతంమీద 'ఎఁడు' రాదు. రెండు తూములు పరిమాణం కలది అనేఅర్థంలో 'రెండు తూమెఁడు' అని కాదు.

అలాగే 'ఎఁడు' ప్రత్యయాంత మైనశబ్దం కూడా ఏకత్వార్థంలోనే (ఏకవచనంలోనే) ఉంటుంది. ఎఁడు ప్రత్యయాంతంమీద ఏవిభక్తిలోనూ బహువచనం రాదు. తూమెఁ డులు, మూరెఁడులందు ఇత్యాదిగా ఉండదు. (జుత్తెఁడు– జుత్తెంట అని అరుదుగా ఒకటి రెండు విశేషస్థలాలు కనబడుతున్నాయి.)

# క్రియాపరిచ్ఛేదం

**1. లిఙ్లాట్టుల డుజున కెను నువర్ణంబు లగు.** (16)

'భూతంబున లి ట్టగు' అని భూతార్థంలో లిట్టు వస్తుంది. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని తద్ధర్మం మొద లయినఅర్థాలలో లాట్టు వస్తుంది. ప్రథమపురుష ఏకవచనంలో డుజు వస్తుంది. లిఙ్లాట్టులు, ఎను, నువర్ణంబులు అన్నపుడు యథా క్రమంగా అన్వయం. 'లిడాదేశం బగుడుజున కెను అనునదియు, లాడాదేశం బగు డుజునకు 'ను' అనునదియు నాదేశంబు లగు' అని సూత్రార్థాన్ని సూత్రకర్త వివరించాడు.

వందుధాతువుకు భూతార్థంలో 'భూతంబున లి ట్టగు' అని లిట్టు రాగా, వందు+ల్. 'భూతంబునం దిగాగమం బగు' అని ధాతువుకు ఇగాగమం వచ్చి సంధి జరిగి, వండి–ల్. 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్గు' అని ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ వచ్చి, వండి+డుజ్. ప్రస్తుతసూత్రంచేత డుజ్ స్థానంలో 'ఎను' అనేది ఆదేశ మై, వండి+ఎను. అపదాదిస్వరసంధి జరిగి 'వండెను' అని అవుతుంది.

ఇలాగే లాట్టులో వందు+ల్. వందు+డుజ్, డుజుకు 'ను' వర్ణం వచ్చి వందును.

'లిఙ్లాట్టుల' అనడంచేత లిట్టు, లాట్టు అనేవాటికంటే వే రైన లకారానికి వచ్చిన డుజుకు ఈకార్యం లేదు. వందుచున్నాఁడు, వండఁడు మొ.

'డుజునకు' అనడంచేత ప్రథమపురుష బహువచనం మొద లైనవాటికి ఈకార్యం లేదు. వండిరి. వందుదుము మొ.

'అగు' అనడంచేత లిఙ్లాట్టులలో ఈకార్యం నిత్యం. కాబట్టి వండిఁడు(వండెను). వందుఁడు(వందును) అనేవిధంగా 'ఎను, ను' లు రానిరూపాలు ఉండవు.

**2. జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు.** (20)

'ధాతువునకు' అనేఅధికారసూత్రా న్ననుసరించి ధాతువునకు అనేఅర్థం సిద్ధిస్తుంది. 'జి' అనేవర్ణం ఇత్తుగా కలిగినది జీత్తు. కల(జి), పదు(జి) మొ. జీత్తు పరంగా ఉండేది చివరివర్ణానికే కాబట్టి 'ఉత్వంబునకు' అంటే '(ధాతువు)చివరిఉత్వమునకు' అనే అర్థం.

జి అనేది ఇత్తుగా కలిగినశబ్దం పరంగా ఉన్నపుడు పూర్వంలో ఉన్నధాతువుయొక్క చివర ఉన్నఉకారం స్థానంలో హ్రస్వ మైనఅకారం ఆదేశంగా వస్తుం దని సూత్రార్థం.

వండు ధాతువుపై 'వ్యతిరేకభావంబున మిజి యగు' అనేసూత్రంచేత మిజి ప్రత్యయం వచ్చి వండు+మి. మిజిలో 'జి' ఇత్తు. జి ఇత్తుగా కలిగినది కాబట్టి 'మి' జీత్తు. జీ త్తయిన 'మి' పరంగా ఉన్నది కాబట్టి ప్రస్తుతసూత్రంచేత వండు ధాతువులో చివరిఉత్వానికి అత్వం వచ్చి 'వండమి'. ఈకృదంతప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రం ప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి వండమి అనేపదం ఏర్పడుతుంది.

'జీత్తు పరం బగునపుడు' అనడంచేత జీత్తు కానిది పర మైనపుడు ఈఅత్వం రాదు. వండుచున్నాఁడు.

'ఉత్వంబునకు' అనడంచేత ఇతర మైనవర్ణానికి అత్వం రాదు. చాక, ఈకు మొ.

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్నిబట్టి ఈఅత్వం ధాతువుకె కాబట్టి జీత్తు పర మైనా ధాతువు కానిదానిలోని ఉత్వానికి అత్వం రాదు. 'వినకు–వుజి– ఎ. వినకువె. ఇక్కడ వినకవె అనేవిధంగా కుజిలో ఉత్వానికి అత్వం రాదు.

'అగు' అనడంచేత నిత్యం కాబట్టి అత్వం రాని వండుమి(వండమి), వండుక (వండక) అనేవిధ మయినరూపం ఉండదు.

**3. లిడ్లాట్టులవకారంబునకు లోపంబు విభాష నగు.** (24)

'భూతంబున లి ట్టగు' అని భూతార్థంలో లిట్టు వస్తుంది. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని తద్ధర్మం మొద లయినఅర్థాలలో లాట్టు వస్తుంది. వకారం అంటే వకారంపొల్లు. లిడ్లాట్టులవకారం అంటే లిట్టు లాట్టులకు ఆదేశంగా వచ్చినవకారం. లకారానికి వచ్చేక్రియావిభక్తులలో మధ్యమపురుష ఏకవచనమైన 'వు' వర్ణంలో మాత్రమే వకారం ఉంది. లిట్టు, లాట్టు లకారాలకు ఆదేశంగా వచ్చిన మధ్యమపురుష ఏకవచన మైన వు(వి)వర్ణంలోని వకారపుపొల్లు(వ్) కు వికల్పంగా లోపం వస్తుంది. అని సూత్రార్థం.

వండు ధాతువుపై తద్ధర్మార్థంలో 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు వచ్చి, వండు–ల్. లకారంబునకు డుౘు వురు నుము ఙ్ఞగు' అని మధ్యమపురుష ఏకవచనంలో వు ప్రత్యయం వచ్చి, వండు+వు. 'లాట్టు రుఙ్ఞు పరం బగునపు డెదగాగమంబును ౘథమనువర్ణకంబు పరం బగునపు డెడుగెడిగాగమంబులును బహుళంబుగా నగు' అని ఎదగాగమం వచ్చి, (వండు+ఎద+వు) సంధి జరిగి, 'వండెదవు'. ప్రస్తుతసూత్రంచేత ఇక్కడివువర్ణకంలో వకారానికి (వ్+ఉ) లోపం

వచ్చి, వండెద+ఉ. అపదాదిస్వరసంధి జరిగి వండెదు అని అవుతుంది. విభాష కాబట్టి వకారం లోపించనిపక్షంలో వండెదవు.

ఇలాగే లిట్టులో వండితివి - వండితి+ఇ, వండితి.

'లిడ్లాట్టుల' అనడంచేత ఇతరలకారాలలో ఈకార్యం లేదు. వండుచున్నావు. వండగలవు. మొ.

'వకారంబునకు' అనడంచేత ఇతరవర్ణాలకు ఈకార్యం లేదు. వండెను. వండుదురు.

**4. తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టులప్రథమబహువచనంబున కేకవచనం బగు.** (25)

తిర్యక్కు లంటే పశువులు, పక్షులు మొద లైనవి. జడం అంటే అచేతనం. 'భూతంబున లి ట్టగు' అని భూతార్థంలో లిట్టు వస్తుంది. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని తద్ధర్మం మొద లయినఅర్థాలలో లాట్టు వస్తుంది.

తిర్యక్కులు కానీ, జడాలు కానీ, బోధింపబడేటపుడు (కర్తలు ఐనపుడు) లిట్టులోను, లాట్టులోనూ, ప్రథమపురుష బహువచనంస్థానంలో ఏకవచనం ఆదేశంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

మేఘములు గర్జిల్లును. గర్జ అనేసంస్కృతధాతువుపై 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, (గర్జ్-ఇంచు) 'రంజాదుల యించుక్ చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అని ద్విరుక్త లకారం వచ్చి గర్జిల్లు. దీనిపై తద్ధర్మార్థంలో 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు వచ్చి, గర్జిల్లు-ల్, మేఘములు అని (నామ) కర్త బహుత్వార్థంలో ఉండటంచేత ప్రథమపురుషబహువచనంలో 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్గగు' అని రు వర్ణకం వచ్చి, గర్జిల్లు+రు అని ఉండగా ఇక్కడ కర్త అయిన మేఘములు జడం కావడంచేత ప్రస్తుతసూత్రంప్రకారం ఏకవచనం (డుఙ్) వచ్చి, గర్జిల్లు+డుఙ్. 'లిడ్లాట్టుల డుఙున కెను ను వర్ణంబు లగు' అని డుఙ్ స్థానంలో 'ను' వర్ణం వచ్చి గర్జిల్లును అని అవుతుంది.

ఇలాగే చిలుకలు పలికెను, తిర్యక్కు వాచ్య మైనపుడు లిట్టులో ప్రథమ బహువచనానికి ఏకవచనం.

'తిర్యగ్జడములు వాచ్యంబు లగునపుడు' అనడంచేత మహత్తు లేదా మహతి వాచ్య మైనపుడు ఈకార్యం రాదు. రామకృష్ణులు వచ్చిరి. లక్ష్మీసరస్వతులు మెత్తురు.

'లిడ్లాట్టుల' అనడంచేత ఇతరలకారాలలో ఈకార్యం రాదు. ఉదా. మేఘములు గర్జిల్లఁగలవు. మొ.

'ప్రథమబహువచనంబునకు' అనడంచేత మధ్యమ, ఉత్తమపురుషలలో ఈకార్యం లేదు. చిలకలారా చక్కగా పలికితిరి. గర్జిల్లుదుము మొ.

'అగు' అనడంచేత నిత్యం కాబట్టి తిర్యగ్జడాలు వాచ్య మైనపుడు ఈకార్యం రానిరూపం ఉండదు. చిలుకలు పలికిరి, మేఘములు గర్జిల్లురు ఇత్యాదిగా ఉండవు.

**5. ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు.** (30)

యుష్మదర్థం (నీవు, మీరు) అస్మదర్థం (నేను,మేము) అనే ఉభయమూ కర్తగా కలిగిన ప్రార్థనం ఉభయప్రార్థనం. 'ఉత్వంబునకు' అనేచోటిషష్ఠిచేత ఉత్వం'స్థానంలో' అని అర్థం. అత్వం ఏకాల్లు కాబట్టి 'అలో ఽంత్యస్య' అని దుగాగమంలో చివరి వర్ణానికి (ఉకారానికి) ఆదేశంగా వస్తుంది.

యుష్మదస్మదర్థాలు కూడినఉభయప్రార్థనార్థంలో ధాతువుకు వచ్చినదుగాగమం లోని ఉకారంస్థానంలో హ్రస్వ మైన అకారం వస్తుం దని సూత్రాని కర్థం.

'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అని ప్రార్థనార్థంలో లూట్టు వస్తుంది, కాని లూట్టులో దుగాగమం విధింపబడలేదు. (లాట్టు రుఙ్ఞు పరంబగునపుడు దుగాగమం చెప్పబడింది, కాని ఇది లాట్టు కాదు. లాదంతాలప్రక్రియ చెప్పడం అయిపోయినతర్వాత లూట్టుప్రక్రియ ప్రారంభించినతర్వాత ప్రస్తుతలక్షణం చెప్పబడడం గమనించాలి) దుగాగమం లేకుండా దుగాగమానికి అత్వం రావడం సాధ్యం కాదు. కాబట్టి దుగాగమానికి అత్వం విధించినసామర్థ్యంచేత ఈసూత్రంప్రకారమే దుగాగమమూ, దానికి అత్వమూ కూడా వస్తా యని గ్రహించాలి.

వందు ధాతువుమీద ప్రార్థనార్థంలో లూట్టు వచ్చి, (యుష్మద్, అస్మద్) ఉభయార్థంలో (అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు) ఉత్తమపురుషబహువచనంలో 'లకారంబునకు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి వందు–ము, ప్రస్తుతసూత్రంప్రకారం ధాతువుకు దుగాగమమూ, దానికి అత్వమూ వచ్చి. వందుదము.

'ఉభయ' అనడంచేత ఉభయార్థం లేనపుడు ఈకార్యం ఉండదు. కాని ఉభయార్థం లేకపోతే, ప్రార్థనార్థం కూడా మృగ్యమే. మేము వందుదుము, నీవు వందుదువు అనిలాదంతరూపం ఉండవచ్చు. లూట్టులో వందుము, వందుఁడు అని మధ్యమపురుషలో ఏర్పడతాయి.

'ప్రార్థనంబున' అనడంచేత ఇతరార్థంలో ఈకార్యం లేదు. మనము నిల్చునది.

'ద' వర్ణాన్ని ఆగమం చేయకుండా, దుగాగమ మనీ దానికి అత్వ మనీ, చెప్పడంవల్ల 'భుజించుదము- భుజింతము' (క్రియా. 108) 'పోదము' (క్రియా. 98) మొద లయిన విధంగా ఇక్కడ దుగాగమకార్యాలు రావటం ప్రయోజనం.

'అగు' అనడంచేత నిత్యం. కాబట్టి అత్వం రాకపోవడం ఉండదు. ఉభయ ప్రార్థనంలో మనము వండుదుము అని ఉండదు.

**6. సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు.** (38)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువునకు అని అర్థం అవుతుంది. ఒకేదానిని ఆశ్రయించిఉన్న అనేక మయినవ్యాపారాలలో పూర్వకాలానికి చెందినదానిని తెలిపేధాతువుకు 'ఇ' అనేప్రత్యయం వస్తుంది. సంస్కృతంలో ఈఅర్థంలో (సమానకర్తృకయోః పూర్వకాలే) క్త్వా అనేప్రత్యయం వస్తుంది. క్త్వా ప్రత్యయంయొక్క అర్థంలో ఉన్నది కాబట్టి ఈ ఇప్రత్యయాన్ని క్త్వార్థం అంటారు.

చైత్రుండు వండి తినెను. ఇక్కడ వండుట, తినుట అనేరెండు క్రియలు (కర్త అయిన) చైత్రుడు ఒక్కడినే ఆశ్రయించి సమానాశ్రయం అయినాయి. ఈరెండింటిలో 'తినుట' అనేదానికంటె 'వండుట' అనేక్రియ పూర్వకాలానికి చెందింది. కాబట్టి వండు ధాతువుకు ప్రస్తుతసూత్రంచేత 'ఇ'ప్రత్యయం వచ్చి, వండు+ఇ. 'అంద్వవగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి 'వండి' అవుతుంది. ఇప్రత్యయాంత మైనఈశబ్దం అవ్యయం. కాబట్టి విభక్తి లోపించి వండి అనేపదం ఏర్పడుతుంది.

క్రియలు ఎన్ని అయినా పూర్వకాలానికి సంబంధించినవాటికి అన్నింటికీ ఇ ప్రత్యయం వస్తుంది. చైత్రుడు వండి, తిని, చదివి నిద్రించెను.

సంస్కృతంలోలాగా సమానకర్తృకములు అనకపోవడంచేత కర్తలు భిన్న మయినా ఆశ్రయం ఒకటే అయితే ఇ ప్రత్యయం వస్తుంది. చైత్రునిచేత మైత్రుడు కొట్టబడి మడిసెను. ఇక్కడ కొట్టుట అనేక్రియకు చైత్రుడు కర్త. మడియుటకు మైత్రుడు కర్త. అయినా కొట్టుట అనేక్రియకు కర్మగానూ, మడియుట అనేక్రియకు కర్తగానూ ఇవి రెండూ మైత్రుడు ఒక్కడినే ఆశ్రయించిఉండడంచేత సమానఆశ్రయం అయింది. కాబట్టి కర్మార్థక మైన కొట్టంబడు అనేదానికి ఇ ప్రత్యయం వచ్చింది.

'సమానాశ్రయంబులన్' అనడంచేత ధాత్వర్థ మైనవ్యాపారం వేరువేరు వాటిని ఆశ్రయించిఉంటే ఈకార్యం రాదు. చైత్రుడు వండఁగా మైత్రుడు తినెను. మొ.

'పూర్వకాలంబునందు' అనడంచేత పూర్వకాలికం కానిదానికి ఈకార్యం రాదు. చూచుచుం బోయెను.

**7. లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఀతికిం గర్తయందు నగు.** (48)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం సిద్ధిస్తుంది. సూత్రంలో ముందు సకర్మకం పేర్కొనబడింది. కాబట్టి 'లాఀతి' అంటే అకర్మకం. కర్మయొక్క ఆకాంక్షను కలిగించేధాతువు సకర్మకం. చైత్రుడు అన్నమును తినెను. ఇక్కడ తినెను అనేది దేనిని తినెను? అనేవిధంగా కర్మను గూర్చినఆకాంక్షను కలిగిస్తున్నది. కాబట్టి తినుధాతువు సకర్మకం. అకర్మకం అంటే కర్మయొక్క ఆకాంక్షను కలిగింపనిధాతువు. చైత్రుడు వచ్చెను. ఇక్కడ వచ్చెను అంటే దేనిని వచ్చెను అనేప్రశ్న పుట్టదు. అంటే కర్మను గూర్చినఆకాంక్ష లేదు. కాబట్టి వచ్చుధాతువు అకర్మకం.

లకారం మొద లైనవి లకారాదులు. లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు, లూట్టు, లజి అని తెలుగులో లకారాలు ఆరు. ఆదిశబ్దంచేత భావార్థక ట ప్రత్యయం, క్త్వార్థక ఇ ప్రత్యయం. కలజి, పడుజి మొద లైనవి గ్రహింపబడతాయి.

సకర్మకం ఐనధాతువుకు కర్త్రర్థంలోనూ, కర్మార్థంలోనూ లకారాలు మొద లైనవి వస్తాయి. క్రియచేత కర్త చెప్పబడితే కర్త్రర్థం. క్రియచేత కర్మ చెప్పబడితే కర్మార్థం.

చైత్రుడు అన్నమును తినుచున్నాడు. కర్త్రర్థంలో తిను అనేసకర్మకధాతువుమీద లట్టు లకారం అయింది.

చైత్రునిచేత అన్నము తినబడుట. కర్మార్థంలో(పడు అనుబంధం గలిగిన) తిను పై భావార్థక 'ట' ప్రత్యయం.

అకర్మకం ఐనధాతువుకు కర్మ ఉండదు. కాబట్టి కర్త్రర్థంలో మాత్రమె లకారాదులు వస్తాయి.

చైత్రుడు వచ్చెను. వచ్చు అనేఅకర్మకధాతువుకు కర్త్రర్థంలో లిట్టు లకారం ఐంది.

చైత్రుడు రాక (మైత్రుడు రాడు) వచ్చు అనేఅకర్మకధాతువుకు వ్యతిరేకక్త్వార్థంలో కజి ప్రత్యయం.

**8. గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.** (50)

గురువు అంటే ఛందశ్శాస్త్రంలో చెప్పబడిన దీర్ఘం మొద లైనలక్షణాలు కలిగినది. యాంతం కానిది, అంటే చివర యకారం లేనిధాతువు అయాంతం. ఇయుట్–ఆగమ. అన్నపుడు ఇయుట్ లో టకారం ఇత్తు. టి త్తయిన ఇయు విధించినదానికి(ఆద్యంతౌ టకితౌ) ఆద్యవయవంగా (ముందుగా) వచ్చి చేరుతుంది. ఇయులో ఉకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చబడింది. కాబట్టి ఇయ్ అనేదే ఆగమంగా వస్తుంది. అని సూత్రానికి అర్థం.

1. గురు వయినఅక్షరం లేనిదీ, 2. చివర యకారం లేనిదీ, 3. ఒకటి, లేదా రెండు మాత్రమె అచ్చులు కలిగినదీ అయినధాతువుకు పరంగా ఉన్న ఇంచుగాగమానికీ, 'ఎ' అనే వక్రానికీ ముందుగా 'ఇయ్' అనేది వికల్పంగా ఆగమంగా వస్తుంది.

భుజ్ ధాతువుకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగ మై, భుజ్+ఇంచు. ప్రస్తుతసూత్రంచేత 'ఇంచు'కు ముందు 'ఇయ్' చేరి భుజ్+ఇయ్+ఇంచు= భుజియించు అవుతుంది. విభాష కాబట్టి ఇయుడాగమం రానిపక్షంలో భుజ్+ఇంచు=భుజించు అని అవుతుంది.

వక్రం పరంగా ఉండగా, నగి+ఎడును = నగియెడును, నగెడును. సంస్కృతధాతువులు అన్నింటికీ ముందు ఇంచుగాగమం వస్తుంది, కాబట్టి ఇక్కడ వక్రం ఆచ్ఛికధాతువులకు మాత్రమే పరంగా ఉంటుంది.

'గురువిరహితంబు లయి' అనడంచేత గురుమంతా లయినధాతువులకు ఈకార్యం లేదు. యాచ్+ఇంచు=యాచించు. అర్థ+ఇంచు=అర్థించు. మొ.

'అయాంతంబు లయిన' అనడంచేత యకారాంతాలకు ఈకార్యం లేదు. జయ్+ఇంచు=జయించు. వ్యయ+ఇంచు=వ్యయించు. మొ.

'ఏకస్వర ద్విస్వరంబుల' అనడంచేత మూడు, అంతకంటే ఎక్కువ అచ్చులు ఉంటే ఈకార్యం రాదు. కరుణించు. పొటమరించు మొ. త్రిమ్మరియెడు, క్రుమ్మరియెడి అని ఒకటి రెండు విశేషప్రయోగాలు కనబడుతున్నాయి.

'ఇంచుగ్వక్రంబులకు' అనడంచేత ఇతరవర్ణాలు పర మైనపుడు ఈకార్యం లేదు. నగి (నగు+ఇ), పడినవాడు (పడు+ఇ+న) మొ.

**9. క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు.**(52)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం

కలుగుతుంది. క్రియ(వ్యాపారం–పని)యొక్క ఫలం కర్తను పొందేఅర్థంలో ధాతువుకు మీద 'కొను' అనే ధాతువు అనుప్రయుక్తం అవుతుంది. అని సూత్రానికి అర్థం.

'దేవదత్తుడు వండుకొనుచున్నాడు. ఇక్కడ వండుకొనుచున్నాడు అంటే తనకోసం వండుకుంటున్నాడు అని అర్థం. వండినపదార్థం తనే తింటా డని తాత్పర్యం. కాగా 'వండుట' అనేక్రియకు ఫలం ఐన వంట, కర్త ఐన దేవదత్తుడినే పొందుతుంది. కాబట్టి వండు ధాతువుపై ప్రస్తుతసూత్రంచేత కొను అనేధాతువు చేరుతుంది. ఈ 'కొను' అనేది ధాతువు కాబట్టి లడాదిలకారాలు మొద లైనవి కొనుధాతువుమీద వస్తాయి. దీనినె ఆత్మనేపదార్థం అంటారు.

'కర్తృగామి యగుచో' అనడంచేత క్రియాఫలం కర్తను మాత్రమే పొందడం అనేఅర్థం లేనిపక్షంలో కొనుధాతువు చేరదు. దేవదత్తుడు వండుచున్నాడు. ఇక్కడ వండుక్రియకు ఫల మైన వంట దేవదత్తుడిని ఒక్కడిని మాత్రమే పొందుతుం దనేఅర్థం లేదు.(వండింది దేవదత్తుడే అయినా తినేది దేవదత్తు డొక్కడే కాదు)కాబట్టి కొనుధాతువు అనుప్రయుక్తం కాలేదు.

కొను 'ధాతువు' అనడంచేత లడాదికార్యాలు, ఆయావర్ణవికారాలు, కొనుకు కలుగుతాయి. వండుకొనియె.

'అగు' అనడంచేత నిత్యం కాబట్టి ఆత్మనేపదార్థంలో కొనుధాతువు చేరకపోవడం ఉండదు. వండెను అనేదానికి వండుకొనెను అనేఅర్థం లేదు.

**10. ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు.** (54)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం కలుగుతుంది. ఎఏఒఓలు నాలుగు వక్రాలు. అయినా ఎను, ఎడు, ఎడి, ఎద మొద లైనవాటిలో ఉండి 'ఎ' అనేది ఒక్కటి మాత్రమే ధాతువుకు పరంగా ఉండడం సంభవిస్తుంది. ఉక్తము లంటే ఈసూత్రానికి పూర్వం వరకు చెప్పినవి. యాకు అంటే యకారానికి అని అర్థం. ఇక్కడ యకారాన్ని స్వరసహితంగా గ్రహించాలి.

ఈసూత్రానికి పూర్వంవరకు చెప్పబడినలక్షణాలలోని 'ఇ' కారమూ, 'ఎ' అనేవక్రమూ పరంగా ఉన్నపుడు వాటికి పూర్వంలో ఉన్న, ధాతువులోనిఅచ్చుతో గూడినయకారంస్థానంలో సకారం ఆదేశంగా వస్తుంది. అని సూత్రానికి అర్థం.

చేయుధాతువుమీద క్త్వార్థంలో 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనేసూత్రంచేత ఇ ప్రత్యయం వచ్చి చేయు+ఇ. ప్రస్తుతసూత్రంచేత

యు వర్ణం స్థానంలో సకారం వచ్చి, చేస్+ఇ=చేసి అని అవుతుంది. 'చేయు+ఎడు' అన్నపుడు వక్రం పరంగా ఉండగా యాకు సకారం వచ్చి, చేసెడు. మొ.

'ఇకారవక్రంబులు' అనడంచేత ఇ,ఎ అనేవాటికంటె వే రైనవర్ణం పర మయితే సకారం రాదు. చేయగలడు, చేయుట. మొ.

'ఉక్తంబులందలివి' అనడంచేత ఈసూత్రానికి తర్వాత చెప్పబోయే (ప్రత్యయాదులలోని) ఇకార(వక్ర)ం పరమైనపుడు సకారం రాదు. చేయు+ఇంచు= చేయించు. చేసించు అని సకారం రాదు.

'యాకు' అనడంచేత ఇతర మైనహల్లుకు సకారం రాదు. వండు–ఇ. వండి. వచ్చు+ఎను=వచ్చెను. మొ.

**10. ముఙు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియు నగు.** (61)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనే అర్థం కలుగుతుంది. 'లూణ్మధ్యమవురులకు ముడుఙు లగు' అని లూట్టులో మధ్యమపురుష ఏక, బహువచనాలలో ఉండే ము,డుఙ్ అనేవాటికి ముఙు అని పేరు. ఈ 'ము,డుఙ్' అనేప్రత్యయాలు పరంగా ఉన్నపుడు వాటికి పూర్వంలో ఉన్నధాతువుయొక్క దీర్ఘానికి హ్రస్వం వస్తుంది. దానికి పైన ఉన్నముపర్ణానికి మాముడి ( ్మ ) కలుగుతుంది.

'కొను' ధాతువుకు లూట్టులో మధ్యమపురుషబహువచనంలో కొను+డుఙ్ అని ఏర్పడగా 'ముఙు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత 'కొను'కు 'కో' అనేది ఆదేశంగా వచ్చి, కో+డుఙ్. ప్రస్తుతసూత్రంచేత కో దీర్ఘానికి హ్రస్వం వచ్చి కొ+డుఙ్. డు(ఙ్) ఙిత్తు కాబట్టి ముందు నిండుసున్న వచ్చి కొండు. 'అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప' అని ఇక్కడ అరసున్న రాదు. బహుళం కాబట్టి కొనుకు 'కో' ఆదేశం రానపుడు కొనుఁడు అని ఉంటుంది.

కొను+ము అనే ఏకవచనంలో కొనుకు కో ఆదేశ మై, కో+ము, ప్రస్తుతసూత్రంచేత హ్రస్వమూ, (కొ+ము) ముపర్ణానికి మాముడీ వచ్చి 'కొమ్ము' అవుతుంది. ఇలాగే రమ్ము, రండు మొ.

'కో' ఆదేశం రానిపక్షంలో కొనుము అని ఉన్నపుడు (దీర్ఘమే లేదు కాబట్టి హ్రస్వంప్రసక్తి లేదు) ఈసూత్రంచేత దీర్ఘానికి హ్రస్వం రాలేదు. కాబట్టి ముపర్ణకానికి మాముడి కూడా రాదు. కొనుమ్ము ఇత్యాదిగా కాదు.

'ముఙు పరం బగునపుడు' అనడంచేత ఉత్తమపురుషబహువచన మైన ము, ప్రథమపురుష ఏకవచన మైన డుజ్, మొద లైనవి పర మైనపుడు ఈకార్యం లేదు. రాఁడు, రాము, రాక మొ.

**11. సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు.** (63)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనే అర్థం కలుగుతుంది. సంస్కృతంబునకు అంటే సంస్కృతధాతువుకు అని అర్థం. అంగల మొద లైనవి అంగలాదులు. ఇవి ఆచ్ఛికధాతువులు. ఇంచుక్–ఆగమ. అన్నపుడు ఇంచుక్‌లో కకారం ఇత్తు. కిత్తు అయిన 'ఇంచు' ధాతువుకు అంత్యావయవంగా అంటే చివర ఆగమంగా వస్తుంది. సంస్కృతధాతువులకు అన్నింటికీ, అంగల మొద లైనఆచ్ఛికధాతువులకూ చివర 'ఇంచు' అనేది ఆగమంగా వచ్చి చేరుతుంది. అర్థవిశేషం చెప్పలేదు కాబట్టి ఈఇంచుక్కు స్వార్థంలో (ధాతువుమీద అదే అర్థంలో) వస్తుంది.

భుజ్ అనేది సంస్కృతధాతువు. తెలుగులో దీనికి ప్రస్తుతసూత్రంచేత 'ఇంచు' అనేది ఆగమంగా వచ్చి, భుజ్–ఇంచు. (ఇయుడాగమం రానపుడు) భుజించు అని అవుతుంది.

ధాతువుకు ఆగమంగా రావడంచేత ఇంచు ధాతువుకు అవయవం అవుతుంది. కాగా లట్టు మొద లైనలకారాదులు స్వార్థంలో వచ్చినఈఇంచుమీద వస్తాయి. భుజించుచున్నాఁడు.

అంగల అనేఆచ్ఛికధాతువుకు ఈసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి అంగల–ఇంచు. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, అంగలించు. దీనిపై లడాదులు వస్తాయి. అంగలించుచున్నది. మొ.

'సంస్కృతంబునకు' అని సామాన్యంగా చెప్పడంచేత తెలుగులో ప్రవేశించే సంస్కృత ధాతువులు అన్నింటికీ ముందుగా స్వార్థంలో ఈసూత్రంప్రకారం ఇంచుగాగమం వస్తుంది.

'అంగలాదులకు' అనడంచేత ఆచ్ఛికాలకు మాత్రం అంగలాదులలో లేనిధాతువుకు ఈ(స్వార్థంలో) ఇంచుగాగమం రాదు. వండుచున్నాడు, వండెను. మొ.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ఇంచుగాగమం లేకుండా సంస్కృత ధాతువు, అంగలాదులు తెలుగులో ప్రయోగింపబడవు. భుజెను (భుజించెను) అంగలచున్నాడు ఇత్యాది రూపా లుండవు.

**12. ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయు గవు గరుక్కు లగు.** (64)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం కలుగుతుంది. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేపూర్వసూత్రంనుంచి 'సంస్కృతంబునకు' అనేపదం ఈసూత్రంలోకి అనువర్తిస్తుంది. 'ఇఉఋులకు' అని తపరకరణం లేకుండా నిర్దేశించడంచేత ఈఆగమాలు దీర్ఘాలు(ఈఊౠ) కూడా గ్రహింపబడతాయి. అయుక్- అవుక్- అరుక్ (అయు గవు గరుక్కు) అనేవాటిలో కకారాలు ఇత్తులు. మిగిలిన అయు, అవు, అరు అనేవాటిలో చివరిఉకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్పబడింది. కిత్తులు అయిన అయ్, అవ్, అర్ అనేవి ధాతువుకు చివర ఆగమంగా వచ్చి చేరతాయి.

1. ఇంచుగాగమం పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువుచివర ఉన్న ఇకారానికి అంటే ఇ,ఈ లకు పైన అయ్ అనేది ఆగమంగా వస్తుంది.

'జి' అనేధాతువుకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి. జి+ఇంచు. (ఇయుడాగమాన్ని బాధించి) ప్రస్తుతసూత్రంచేత ధాతువుకు అయ్ ఆగమంగా వచ్చి. జి+అయ్+ఇంచు. అపదాదిస్వరసంధి జరిగి జయ్+ఇంచు= జయించు. ఇలాగే నీ అనేఈకారాంతధాతువుకు అయుగాగమ మై, నీ+ఇంచు= నయించు.

2. ఇంచుగాగమం పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువు చివర ఉన్న 'ఉ'కారానికి పైన అవ్ అనేది ఆగమంగా వస్తుంది.

'ద్రు' ధాతువుపై 'సంస్కృతంబునకు' అని ఇంచుగాగమం వచ్చి ద్రు-ఇంచు. ప్రస్తుత సూత్రంచేత అవ్ ఆగమ మై, ద్రు+అవ్+ఇంచు. అపదాదిస్వరసంధి జరిగి, ద్రవ్+ఇంచు= ద్రవించు.

దీర్ఘ మైనఊకారాంతానికి కూడా ఇలాగే అవ్ ఆగమం వస్తుంది. లూ-ఇంచు. లూ-అవ్-ఇంచు. లవించు.

3. ఇంచుగాగమం పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువుచివర ఉన్న 'ఋ'కారానికి పైన అర్ అనేది ఆగమంగా వస్తుంది.

'ధృ' ధాతువుపై 'సంస్కృతంబునకు' అని ఇంచుగాగమం వచ్చి ధృ-ఇంచు. ప్రస్తుతసూత్రంచేత అర్ ఆగమ మై, ధృ+అర్+ఇంచు. అపదాదిస్వరసంధి జరిగి, ధర్+ఇంచు= ధరించు.

దీర్ఘ మైనఋూకారాంతానికి కూడా ఇలాగే అర్ ఆగమం వస్తుంది. తౄ+ఇంచు. తౄ+అర్+ఇంచు = తరించు.

'ఇఉఋులకు' అనడంచేత ఇఉఋులకంటె వే రయినవర్ణాలకు ఈకార్యం రాదు. కరుణ+ఇంచు= కరుణించు.

అనువృత్త మైన 'సంస్కృతంబునకు' అనేదళంచేత ఈకార్యం ఆచ్ఛికధాతువులకు రాదు. వండు+ఇంచు = వండించు.

జయించు అనేదానిమీద ప్రేరణంలో ఇంచుక్కు వచ్చి జయించు+ఇంచు, ఇక్కడ జయించు అనేది ఇంచుగాగమం చేరడంచేత తత్సమధాతువు అయింది. సంస్కృత ధాతువు కాదు కాబట్టి అక్కడ అవుగాగమం రాదు. జయింపించు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ఆగమాలు లేకుండా జించు (జయించు), ద్రించు (ద్రవించు) ఇత్యాది రూపాలు ఉండవు.

**13. నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు.** (65)

నిర్జి అంటే నిర్ అనేఉపసర్గ పూర్వంలో ఉన్న 'జి' అనేధాతువు. నామములు అంటే నామధాతువులు. నామం అంటే ప్రాతిపదికం. ప్రాతిపదికం (అధాతుః) ధాతువు కాదు. కాని ధాతువులుగా చెప్పదలచుకున్నపుడు (ధాతుత్వ–వివక్ష) కొన్నినామాలు ధాతువు లవుతాయి. అవి నామధాతువులు. (వాటికి ఇంచుగాగమం వస్తుంది.) ఇంచుక్కు పరంగా ఉన్నపుడు 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అని సంస్కృతధాతువులచివరి 'ఇ' కారానికి అయుగాగమం వస్తుంది.

అయుగాగమం (సంస్కృతధాతువులకు మాత్రమే.) ఆచ్ఛికధాతువులకు రాదు. అగ్గి+ఇంచు= అగ్గించు. కాబట్టి ఈనిషేధస్థలంలో ఆచ్ఛికాలప్రసక్తి లేదు.

ఆఅయుగాగమం నిర్జి అనేసంస్కృతధాతువుకూ, సంస్కృతనామధాతువులకూ రాదు అని సూత్రానికి అర్థం.

నిర్జి ధాతువుకు 'సంస్కృతంబునకు' అని ఇంచుగాగమం వచ్చి, నిర్జి+ఇంచు. 'ఇఉఋుల కించుక్కు పరం బగునపుడు' అని అయుగాగమం రావలసిఉండగా ప్రస్తుతసూత్రం నిషేధించడంచేత రాదు. అపదాదిస్వరసంధి జరిగి నిర్జించు అని అవుతుంది.

ఇలాగే నుతి అనేనామధాతువునుంచి నుతి+ఇంచు=నుతించు.

(నిర్జయించు, నుతయించు ఇత్యాదిగా అయుగాగమం వచ్చినరూపం ఉండదు.)

'నిర్జి' అని నిర్ అనేఉపసర్గతో నిర్దేశించడంచేత ఈఉపసర్గ లేనిపక్షంలో ఈనిషేధం వర్తించదు. జయించు.

నామాలు అంటే ప్రాతిపదికలు, ధాతువులు కావు. కాబట్టి వాటికి ఇంచుగాగమం రాదు. ఇంచుగాగమం పరంగ ఉంటే గాని అయుగాగమానికి ప్రాప్తే లేదు. ప్రాప్తి లేనపుడు నిషేధించడం అనవసరం. కాబట్టి –

1. సూత్రంలో 'నామంబులకు' అనేదళం వ్యర్థం అవుతున్నది.

2. వ్యర్థ మయినఈదళం 'ధాతువులుగా చెప్పదలచుకొన్నప్పుడు నామాలు కూడా ధాతుత్వాన్ని పొంది, ఇంచుగాగమాన్ని పొందుతాయి' అనేఅర్థాంతరాన్ని తెలియజేస్తుంది. దీనినే అర్థాంతరజ్ఞాపనం అంటారు.

3. ఇలా నామాలకు ధాతుత్వమూ, ఇంచుగాగమమూ రాగా, నుతి+ఇంచు మొ. ఇకారాంతాలకు అయుగాగమం ప్రాప్తిస్తున్నది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత అయుగాగమం నిషేధింపబడి, రాకపోవటంచేత సంధి జరిగి, నుతించు అని అవుతుంది. నుతయించు అనేవిధ మైనఅసాధురూపాలను వారిస్తూ ప్రస్తుత అయుగాగమనిషేధలక్షణం సార్థకం అవుతున్నది.

4. జ్ఞాపకసిద్ధమైన పైఅర్థంచేత శయన+ఇంచు=శయనించు. పయన+ఇంచు= పయనించు.మొ. కవిప్రయుక్తరూపాలు సిద్ధించటం ప్రయోజనం.

వ్యర్థ మైనస్థలంలో ఈవిధంగా 1. వైయర్థ్యం 2. అర్థాంతరజ్ఞాపనం 3. స్వాంశంలో చారితార్థ్యం 4. అన్యత్రఫలం అని నాలుగంశాలు ఉంటాయి.

**14. సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణంబగు.** (66)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం సిద్ధిస్తుంది. ఉపధ అంటే చివరివర్ణానికి ముందు వర్ణం. అ,ఏ,ఓ అనేవర్ణాలకు గుణం (అదేజ్ గుణః) అని పేరు. 'ఇకో గుణవృద్ధీ' అనేసంస్కృతపరిభాషచేత గుణం విధించినచోట అది ఇఉఋలకే వస్తుంది. ఋకారంస్థానంలో వచ్చే 'అ' అనేగుణం, తరువాత రేఫ కలిగి(అర్) వస్తుంది.

1.ఇంచుక్కు పరంగా ఉండగా సంస్కృతధాతువులలో చివరినుంచి రెండవవర్ణం ఐన హ్రస్వ మైన ఇకారం స్థానంలో 'ఏ' అనేగుణవర్ణం ఆదేశంగా వస్తుంది.

ఛిద్ ధాతువుకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, ఛిద్+ఇంచు. ప్రస్తుతసూత్రంచేత ఉపధ ఐన ఇకారానికి ఏకారం వచ్చి, ఛేదించు అని అవుతుంది.

2. ఇంచుక్కు పరంగా ఉండగా సంస్కృతధాతువులలో చివరినుంచి రెండవవర్ణం ఐన హ్రస్వ మైన ఉకారంస్థానంలో 'ఓ'అనేగుణవర్ణం ఆదేశంగా వస్తుంది. ఉదా. పుష్+ఇంచు, పోషించు.

3. ఇంచుక్కు పరంగా ఉండగా సంస్కృతధాతువులలో చివరినుంచి రెండవవర్ణం ఐన హ్రస్వ మైనఋకారంస్థానంలో 'అర్' అనేగుణవర్ణం ఆదేశంగా వస్తుంది. ఉదా. వృష్+ఇంచు, వర్ష్+ఇంచు=వర్షించు.

'సంస్కృతంబునకు' అనడం స్పష్టతకే. ఆచ్ఛికధాతువులు హలంతాలు లేవు. కాబట్టి ఆచ్ఛికధాతువులలో ఇఉఋలు ఉపధలుగా ఉండవు,

'లఘు' అనడంచేత గురూపధలకు ఈకార్యం రాదు. ఊహ్+ఇంచు=ఊహించు.

'ఉపధలకు' అనడంచేత ఇఉఋలు ఉపధలు కాకపోతే ఈకార్యం రాదు. జి+ఇంచు=జయించు. ద్రు+ఇంచు=ద్రవించు. ధృ+ఇంచు. ఇక్కడ గుణం రాదు. ఇంక అరుగాగమం వచ్చి, ధరించు. మొ.

'ఇంచుక్కు పరం బగునపుడు' అనడం స్పష్టతకె. సంస్కృతధాతువులకు (ఇంచుక్కు తప్పకుండా వస్తుంది కాబట్టి) ఇంచుక్ భిన్నం పరంగా ఉండదు. ఈగుణంచేత (ఛేదించు మొ.) ఈధాతువులు గురుమంతాలు అవుతాయి కాబట్టి వీటిమీద ఇయుడాగమం రాదు.

'అగు' అనడంచేత గుణం రావడం నిత్యం. కాబట్టి గుణం రాని ఛిదించు, పుషించు, వృషించు వంటిరూపాలు ఉండవు.

**15. సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు.** (66)

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి ధాతువుకు అనేఅర్థం సిద్ధిస్తుంది. పనిలో ఇతరులను ప్రేరేపించినఅర్థం ప్రేరణం. ఇంచుక్కులో చివరికకారం ఇత్తు. కిత్తు ఐన ఇంచు, ధాతువుకు అంత్యావయవంగా అంటే చివర్లో వచ్చి చేరుతుంది. అన్ని ధాతువులకూ చివర ప్రేరణార్థంలో ఇంచు అనేది ఆగమంగా వచ్చి చేరుతుంది.

వండు ధాతువుమీద 'వండేవిధంగా చేయు' అనేఅర్థంలో ప్రస్తుతసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, వండు+ఇంచు, అపదాదిస్వరసంధి జరిగి వండించు.

లకారాదులు దీనిపై వస్తాయి. వండించుచున్నాడు. వండించుట మొ.

వండు - వండెను అంటే తానై వండా డని అర్థం. వండించెను అంటే తాను వండకుండా ఇతరులను వండేటట్లు చేశాడు అని అర్థం.

సంస్కృతధాతువులకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ముందుగా స్వార్థంలో ఒకఇంచుక్కు వస్తుంది. కాబట్టి ప్రేరణార్థక మైనఈఇంచుక్కు స్వార్థేంచుక్కు మీద వస్తుంది. ఘట్+ఇంచు+ఇంచు = ఘటింపించు. మొ.

'సర్వంబునకు' అనడంచేత సంస్కృతాలు, ఆచ్ఛికాలూ అయినధాతువులకు అన్నింటికీ ఈకార్యం అవుతుంది. ఘటింపించు, వండించు, మొ.

'ప్రేరణంబునందు' అనడంచేత స్వార్థంలో ఈసూత్రంచేత ఇంచుగాగమం రాదు. వండు అనేఅర్థంలో వండించు అని కాదు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి (సామాన్యశాస్త్రాని కనుగుణంగా) ఇంచుక్కు లేకుండా ప్రేరణార్థం సిద్ధించదు. ఘటించు అనేదానికి ఘటింపించు అనేఅర్థం ఉండదు. అలాగే వండించు అనేఅర్థంలో వండు అని ఉండదు.

**16. రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు.** (71)

రంజ్ మొద లైనవి రంజాదులు. ఇంచుక్కులోనిచకారం ఇంచుక్చకారం. సబిందుకం అంటే బిందువు (ఇంచులో నిండుసున్న) తో కూడినది. ప్రేరణం కానిది అప్రేరణం. అంటే స్వార్థం. ద్విరుక్తలకారం అంటే రెండుసార్లు ఉచ్చరింపబడినలకారం. 'ల్ల్' అనేది.

రంజ్ మొద లైనధాతువులకు స్వార్థంలో పరంగా ఉన్న ఇంచుగాగమంలో నిండుసున్నతో కూడిన చకారపుపొల్లు (ంచ్) స్థానంలో 'ల్ల్' అనేవర్ణం ఆదేశంగా వస్తుంది అని సూత్రార్థం.

రంజ్ ధాతువుమీద 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, రంజ్+ఇంచు. ప్రస్తుతసూత్రంచేత ఇంచు లోని 'ంచ్' అనేభాగానికి (రంజ్+ఇ ంచ్ ఉ) ల్ల్ ఆదేశ మై, (రంజ్-ఇ ల్ల్ ఉ ) రంజిల్లు అని అవుతుంది.

'రంజాదులకు' అనడంచేత రంజ్ మొద లైనవాటిలో చేరనిధాతువుకు ఈకార్యం రాదు. రుచించు, భుజించు మొ.

'ఇంచుక్పకారంబునకు సబిందుకంబునకు' అనడంచేత మిగిలినవర్ణాలు (ఇంచులో మొదటి ఇకారం, చివరి ఉకారం. ఇంచు – ఇల్లు) అలాగే ఉంటాయి. ఇవి అన్నీ సంస్కృతధాతువులు. కాబట్టి రంజాదులకు ఇంచుక్కు తప్ప మరొకటి పరంగా ఉండదు. అందుచేత ఈకార్యం ఇంచుగ్భిన్నానికి వచ్చేఅవకాశం ఎపుడూ ఉండదు.

'అప్రేరణంబున' అనడంచేత ప్రేరణంలో వచ్చిన ఇంచుక్కులో ఈకార్యం రాదు. (రంజ్ ధాతువుమీద స్వార్థంలో ఒకటీ, ప్రేరణంలో ఒకటీ రెండు ఇంచుక్కులు రాగా (స్వార్థంలో వచ్చిన మొదటి ఇంచుక్కు లోపించి) రంజించు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ద్విరుక్తలకారం రాకుండా స్వార్థంలో రంజించు అని ఉండదు.

**17. ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు.** (72)

రంజ్ మొద లైనవి రంజాదులు. ఇవి సంస్కృతధాతువులు. కాబట్టి వీటికి మొదట స్వార్థంలో ఇంచుగాగమం వస్తుంది. తర్వాత ప్రేరణార్థంలో మరొక ఇంచుగాగమం వస్తుంది.

రంజ్ మొద లైనధాతువులకు ప్రేరణార్థంలో వచ్చినఇంచుగాగమం పరంగా ఉండగా అంతకు మునుపు స్వార్థంలో వచ్చిన(మొదటి)ఇంచుక్కుకు లోపం వస్తుంది అని సూత్రార్థం.

రంజ్ ధాతువుమీద 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుక్కు వచ్చి రంజ్–ఇంచు, ప్రేరణార్థంలో దీనిపైన 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అని ఇంచుక్ చేరి, రంజ్+ఇంచు+ఇంచు. 'రంజాదులయించుక్పకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అని రావలసిన ద్విరుక్తలకారాన్ని బాధించి ప్రస్తుత సూత్రంచేత మొదటి(స్వార్థంలో వచ్చిన) ఇంచుక్కు లోపింపగా రంజించు అని (ప్రేరణేంచుక్కుతో) రూపం అవుతుంది.

'ఇంచుక్కు' (పరం బగునపుడు) అనడంచేత ఇతరం ఏ దయినా పరంగా ఉంటే ఈకార్యం రాదు. (రంజించు+ఎను) రంజించెను.

(ఇంచుక్కు) 'పరం బగునపుడు' అనడంచేత ప్రేరణేంచుక్కు పరంగా లేనపుడు స్వార్థేంచుక్కుకు లోపం రాదు. రంజ్+ఇంచు=రంజిల్లు.

'రంజాదుల' అనడంచేత రంజాదులలో చేరనిదానిపై స్వార్థేంచుక్కు లోపించదు. భుజ్+ఇంచు+ఇంచు = భుజింపించు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ప్రేరణంలో ఈలోపం రానిరూపం ఉండదు. రంజించు అనేఅర్థంలో రంజిల్లించు లేదా రంజింపించు అనేరూపం ఉండదు.

**18. ప్రేరణంబునం దించుక్కుమీద నించుక్కు లేదు.** (84)

క్రియ(వ్యాపారం-పని)లో ఇంకొకరిని వర్తించేటట్లు చేయడం ప్రేరణం. (ప్రేరణార్థక ధాతువుమీద తిరిగి ప్రేరణార్థాన్ని వివక్షించినపుడు) ప్రేరణార్థంలో వచ్చిన ఇంచుగాగమం మీద మళ్లీ (ప్రేరణార్థంలో) ఇంచుగాగమం రాదు అని సూత్రానికి అర్థం.

వందు ధాతువుపై ప్రేరణార్థంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అని ఇంచుక్కు వచ్చి, వందు+ఇంచు. దీనిపై మరల ప్రేరణార్థాన్ని వివక్షిస్తే ప్రస్తుత సూత్రంప్రకారం 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అని ఇంచుగాగమం రాదు. కాబట్టి వండింపించు (వండింపింపించు) అని మొదలుగా రూపం కాదు.

'ప్రేరణంబునందు' అనడంచేత స్వార్థంలో వచ్చినఇంచుక్కుమీద ప్రేరణార్థంలో ఇంచుక్కు రావచ్చు. భుజించు+ఇంచు=భుజింపించు. మొ.

'ఇంచుక్కుమీద' అనడంచేత ప్రేరణార్థంలో ఇంచుక్కుకంటే వేరుగా వచ్చిన చుక్, పుక్ అనేఆగమాలమీద ఇంచుగాగమం రావచ్చును. నొచ్చు+చు=నొంచు. నొంచు+ఇంచు= నొంపించు. చచ్చు+పు=చంపు. చంపు+ఇంచు=చంపించు. మొ. వీటిమీద మళ్లీ ప్రేరణార్థంలో ఇంచుగాగమం రాదు. నొంపింపించు, చంపింపించు ఇత్యాదిగా కాదు.

ప్రేరణార్థంలో ఇంచుగాగమంమీద చుక్,పుక్ మొ. ఇతరాగమాలు వచ్చే అవకాశం లేదు.

**19. ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయుత్వంబున కిత్వం బగు.** (85)

ఆద్యం అంటే మొదటిది. న+ఆద్య=అనాద్య. అనాద్యం అంటే మొదటిది కానిది. ఇత్వం లేదా ఎత్వంతో కూడినవర్ణం తరువాతగా ఉన్నపుడు ధాతువులో మొదటిది కాని హ్రస్వ మైనఉకారంయొక్క స్థానంలో హ్రస్వ మైనఇకారం ఆదేశంగా వస్తుంది అని సూత్రానికి అర్థం.

నిగుడు అనేధాతువుమీద క్త్వార్థంలో 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అని ఇ ప్రత్యయం వచ్చి. నిగుడు+ఇ. అపదాదిస్వరసంధి జరిగి-

నిగుడి. దానికి పూర్వంలో ఉన్న గువర్ణంలోని ఉత్వానికి ప్రస్తుతసూత్రంచేత ఇత్వం వచ్చి– నిగిడి అని అవుతుంది.

ఇలాగే నిగుడు+ఎడును=నిగుడెడును అని కాగా ఎత్వంతో గూడిన(నిగు+డె) వర్ణం పరంగా ఉండగా ప్రస్తుతసూత్రంచేత ఇత్వం వచ్చి– నిగిడెడును.

'ఇత్వంబు గాని, ఎత్వంబు గాని' అనడంచేత ఇతరస్వరంతో కూడినపుడు ఈకార్యం లేదు. నిగుడును. నిగుడఁగలదు, మొ.

'అనాద్యం బయిన' అనడంచేత మొదటి దయినఉత్వానికి ఇత్వం రాదు. ముదురు – ముదిరి. కుదురు – కుదిరెడిని. మొ.

'ఉత్వంబునకు' అనడంచేత ఇతరస్వరానికి ఈకార్యం రాదు. విసరు – విసరి, విసరెదు,మొ.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి ఇత్వం రాకుండా నిగుడి, నిగుడెను ఇత్యాదిగా ఉండదు. కాని పగుల్చి. నిగుడ్చి, మొద లైనచోట్ల అరుదుగా ఇత్వం రాకపోవడం కనిపిస్తున్నది. ఆవులించు మొద లైనస్థలాలలో ఇత్వం అసలు రావడం లేదు.

**20. ఇచ్చునకు సర్వంబున కీ యగు.** (92)

'అగు వచ్చు చొచ్చు చూచు లకు ముత్తు పరం బగునపుడు' అనేపూర్వసూత్రంనుంచి 'ముత్తు పరం బగునపుడు' అనేభాగం ఈసూత్రంలోకి అనువర్తిస్తుంది. మధ్యమపురుష ఏక, బహువచనా లయిన ము,డుజు, అనేవీ, జివర్ణం ఇత్తుగా కలిగినవీ (వీటికి ముత్తు అని పేరు) పరంగా ఉన్నపుడు 'ఇచ్చు' అనేధాతువు మొత్తంస్థానంలో 'ఈ' అనేది ఆదేశంగా వస్తుంది అని సూత్రానికి అర్థం.

ఇచ్చు ధాతువుమీద 'వ్యతిరేకంబున లజి యగు' అని లజి లకారం వచ్చి, ఇచ్చు+ల్ అని ఉండగా, జీత్తు (ముత్తు) పర మైంది కాబట్టి ప్రస్తుతసూత్రంచేత 'ఇచ్చు' ధాతువుస్థానంలో 'ఈ' ఆదేశ మై, ఈ+ల్. 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఞ్గు' అని లకారం స్థానంలో ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ వచ్చి, ముందు బిందువుతో ఈఁడు అని అవుతుంది. ఇలాగే ఇమ్ము, ఈక, మొ.

'ఇచ్చునకు' అనడంచేత ఇతరధాతువునకు ఈఆదేశం రాదు. ఒసఁగడు. మొ.

'సర్వంబునకు' అనడంచేత ఇచ్చు మొత్తానికి ఈకారం ఆదేశంగా వస్తుంది.

'ఈ'వర్ణం ఏకాల్లు (ఒకేవర్ణం) కాబట్టి 'అలో ऽన్త్యస్య' అనేపరిభాష ననుసరించి

విధించినదానిలో చివరివర్ణానికి అంటే ఇచ్చులో చివర ఉన్న ఉకారానికి మాత్రమే ఆదేశ మై 'ఇచ్చే' అని కావలసి ఉంది. ఇచ్చు ధాతువు మొత్తానికి ఆదేశం కావడంకోసం సూత్రంలో 'సర్వంబునకు' అనేదళం ప్రత్యేకంగా చేర్చబడింది.

ముత్తు పరంగా ఉన్నపుడే 'ఈ' ఆదేశం. కాబట్టి ముత్తు కానిది పరంగా ఉన్నపుడు ఈకార్యం రాదు. ఇచ్చుచున్నాఁడు, ఇచ్చెను మొ.

ఇచ్చు ధాతువుకు అరుదుగా 'ఈయు' అనేఆదేశం రావడం కూడా కవిప్రయోగాలలో కనిపిస్తున్నది. ఈయని.

**21. లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి.** (102)

కా అనే ఆదేశం కాదేశం. కాదేశం మొద లైనవి కాదేశాదులు. 'అగు వచ్చు చొచ్చు చూచులకు కా రా చొరు చూడు' అని మొదలుగా ముత్తు పరంగా ఉన్నపుడు అగు మొద లైనధాతువులకు కా మొద లైనఆదేశాలు విధింపబడ్డాయి. ఈకార్యం ఇతరస్థలాలలో అంటే ముత్తు కంటే ఇతర మైనది పరంగా ఉన్నపుడు కూడా కవిప్రయోగాలలో కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

అగు ధాతువుమీద ఆశీరర్థంలో లూట్టు లకారం (ఆశీ శ్శాప సంప్రార్థనవిధులందు లూ ట్టగు) వచ్చి, అగు+ల్. ('లకారంబునకు డుఁ్రు వురు నుము ఙ్ఞగు' అని) ప్రథమపురుష ఏకవచనంలో డుఙ్ ప్రత్యయం వచ్చి, అగు+డుఙ్. 'లూట్టు డుఙ్ఙున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబు లగు' అని డుఙ్స్థానంలో 'తను' ప్రత్యయం వచ్చి, అగు+తను. (ఇక్కడ 'తను' అనేది ముత్తు కాదు. కాబట్టి పూర్వసూత్రాలచేత 'కా' ఆదేశం రాదు.) ప్రస్తుతసూత్రంచేత అగు ధాతువుమొత్తానికి 'కా' అనేది ఆదేశంగా వచ్చి, కాతను అని అవుతుంది.

'లాఁతిచో' అనడంచేత ముత్తు పరంగా ఉన్నపుడు పూర్వసూత్రాలచేత ఆదేశాలు రావడం సాధారణమూ, ప్రచురమూ, అని తాత్పర్యం.

'సహితము' అనడంచేత ముత్తు కానిది పర మైనపుడు ఆదేశాలు రావడం అరుదు..

'కాదేశాదులు' అన్నచోటి ఆదిశబ్దం లోగడ విధించినవి మాత్రమె కాక ఇతర మైన ఆదేశాలను కూడా బోధిస్తుంది. అగు+తను అని ఉండగా అగుధాతువుకు 'కావు' అనే ఆదేశం వచ్చి 'కావుతను' అనేరూపం అవుతుంది. 'కావు' అనేఈఆదేశం పూర్వోక్తం గాదు. ఇలాగే అను+దును. అనవుదును. ఇక్కడ అను అనేధాతువుకు 'అనవు' అనేది ఆదేశం.

'కానంబడియెడి' అనడంచేత ముత్తు కానిది పర మైనపుడు కాదేశాదులు రావడాన్ని ప్రయోగాలనుంచి మాత్రమె గ్రహించా లనీ, స్వతంత్రంగా కల్పించగూడ దనీ, అభిప్రాయం.

**22. ఆచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు.**(103)

'ఐఔలు వక్రతమంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు.' 'సంస్కృతసమేతరం బయినయీభాష' ఆచ్ఛికం.'అయియవులకు వక్రతమంబులు' అన్నపుడు యథా క్రమంగా అన్వయం. అయి, అవు అనేనిర్దేశసామర్థ్యాన్ని ఆశ్రయించి ఆదేశం అయి అవులలో చివరివర్ణానికి ఒక్కదానికి కాకుండా మొత్తానికి వస్తుం దని గ్రహించాలి. ఈకార్యం క్రియలలో మాత్రమె కాక అన్నిచోట్ల వస్తుంది.

అచ్చతెలుగుశబ్దంలోని 'అయి' అనేభాగానికి మొత్తానికి, 'ఐ' అనేవక్రతమమూ, 'అవు' అనేదానికి మొత్తానికి 'ఔ' అనేవక్రతమమూ బహుళంగా ఆదేశంగా వస్తాయి అని సూత్రార్థం.

అయిదు అనేశబ్దంలో మొదట ఉన్న 'అయి' అనేభాగానికి ప్రస్తుతసూత్రంచేత 'ఐ' ఆదేశంగా వచ్చి, ఐదు అని అవుతుంది. బహుళం అనడంచేత ఆదేశం రానిపక్షంలో 'అయిదు' అని అయి అనేభాగం అలానే ఉంటుంది.

ఇలాగే 'అవును' అనేదానిలో 'అవు' కు 'ఔ' వస్తే ఔను. రాకపోతే 'అవును'.

'ఆచ్ఛికంబులందు' అనడంచేత సంస్కృతసమాలలో ఈకార్యం లేదు. జయించు, కవులు, జైంచు, కౌలు అనేవిధంగా కాదు.

'అయియవులకు' అనడంచేత ఇతరభాగాలకు ఈకార్యం రాదు. చెయిదము. నివురు. ఇక్కడ చైదము, నౌరు అనేరీతి రూపాలు ఉండవు.

'బహుళంబు' అనడంచేత కొన్నిచోట్ల అప్రవృత్తి. అయి అవు లకు కూడా ఐఔలు రావు. వెలయించు, చవులు మొ.

**23. చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు.** (108)

దుగాగమంలోని దకారం దుగ్ దకారం. 'లాట్టు రుఙ్ము పరం బగునపుడు దుగాగమం బగు' అని లాట్టులో దుగాగమం చెప్పబడింది. ఉభయప్రార్థనంలో లూట్టులో దుగాగమం జ్ఞాపకం చేయబడింది. 'ఆగమాన్య' వివక్ష లేకుండా 'చువర్ణంబునకు' అని సామాన్యంగా చెప్పడంచేత ధాతువులో సహజంగా ఉన్నా, ఆగమంగా వచ్చినా ధాతువు చివర ఉన్న చువర్ణం మొత్తం, దానికి పరంగా ఉన్న

దుగాగమంలోని దకారంతో కలిసిన చుద్ అనేభాగం స్థానంలో పొల్లు తకారం (త్) ఆదేశంగా వస్తుం దని సూత్రానికి అర్థం.

నిలుచు ధాతువు. ఇందులో చువర్ణం శబ్దగతం. ఇది లాట్టులో ప్రథమపురుష బహువచనంలో నిలుచుదురు అని కాగా, ఇందులోని చుద్ అనేదానిస్థానంలో (నిలు+చుద్+ఉ+రు) ప్రస్తుతసూత్రంచేత తకారం ఆదేశం అయి (నిలు+త్+ఉరు) నిలుతురు అవుతుంది.

వచించు. ఇక్కడ ఇంచుగాగమంలోనిది కాబట్టి చువర్ణం ఆగమం. లూట్టులో ఉభయప్రార్థనంలో వచించుదము. చుద్ కు తకారం వచ్చి వచింతము.

ధాతువులో చువర్ణంలోని చకారం ద్విరుక్తం ఐతే (చ్చుద్ అనేదానికి) తకారం కూడా ద్విరుక్త మయ్యే వస్తుంది. వచ్చుదురు–వత్తురు. మెచ్చుదురు–మెత్తురు.

'చువర్ణంబుతోడ' అనడంచేత ధాతువుచివరివర్ణం 'చు' అనేదానికంటే వే రైతే ఈకార్యం రాదు. పొగడుదురు=పొగతురు. చేయుదురు=చేతురు అనేవిధంగా ఏర్పడవు.

'దుగ్దకారంబు' అనడంచేత దుక్కు (దకారం) లేకపోతే ఈకార్యం రాదు. నిలుచును, వచించును మొ.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి తకారం రానిరూపాలు ఉండవు. నిలుచుదురు ఇత్యాదిగా ఉండడం లక్షణానికి విరుద్ధం.

**24. అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు.** (121)

చూ. వాక్యవివరణం.

**25. వలయ్యాదిక్రియలకుం గర్త యగుభావంబునందు నుజీ యగు.** (122)

చూ. 'వలయ్యాదిక్రియలకుం కర్తృభూతక్రియావృత్తి యగుధాతువునకు నుజివర్ణకం బగు' వాక్యవివరణం.

**24. భూతంబున లజికి లిడంతం బగునగుధాతు వనుప్రయుక్తం బగు.** (113)

అంతకుముందు ఉండి అప్పటికి లేనిది (పని) భూతార్థం. లజి ప్రత్యయం కాబట్టి లజి అంటే లజ్యంతం అని అర్థం. 'వ్యతిరేకంబున లజి యగు' అని లజి వ్యతిరేకార్థంలో వస్తుంది. 'భూతంబున లి ట్టగు'. లిడంతం అంటే భూతార్థక క్రియాపదం. అయ్యెను మొ. లిడంత మైనఅగుధాతురూపాలు. అనుసరించి ప్రయోగింబడడం అనుప్రయోగం.

భూతార్థంలో వ్యతిరేకార్థక మైన (లజీ లకారం చివర కలిగిన) క్రియాపదానికి పైని లిట్టు లకారం చివర గలిగిన అగుధాతువురూపం వచ్చి చేరుతుంది అని అర్థం. లజ్యంతం ఏపురుషలో ఏవచనంలో ఉంటుందో, దానిమీద లిట్టులో ఆపురుషలో ఆవచనంలో ఉన్న అగుధాతువురూపం వచ్చి చేరుతుం దని గ్రహించాలి.

వాడు రాఁడు. ఇక్కడ రాఁడు అనేది లజ్యంత మైనక్రియాపదం. 'రాకపోవడం'లో భూతార్థాన్ని వివక్షించినపుడు రాఁడు అనేలజ్యంతక్రియమీద ప్రస్తుతసూత్రంచేత లిడంత మైనఅగుధాతువురూపం చేరుతుంది. రాఁడు అనేది ప్రథమపురుష ఏకవచనం కాబట్టి లిట్టులో ప్రథమపురుష ఏకవచనాంత మైన అగుధాతువురూపమే అంటే 'అయ్యెను' అనేది చేరుతుంది. రాఁడు+అయ్యెను = రాఁ డయ్యెను అని అవుతుంది.

నీవు రావు. ఇది మధ్యమపురుష ఏకవచనం. కాబట్టి దీనిమీద మధ్యమపురుష ఏకవచనాంత మైన అగుధాతురూపం 'అయితివి' అనేది చేరి, నీవు రా వయితివి.

మేము రాము. ఇది ఉత్తమపురుషబహువచనం. కాబట్టి ఉత్తమపురుష బహువచనాంత మైన అగుధాతురూపం చేరుతుంది. మేము రా మయితిమి.

'భూతంబున, లిట్టు' అనేవి తద్ధర్మాదులకు ఉపలక్షణం. అంటే తద్ధర్మాద్యర్థాలలో లజికి, (తద్ధర్మాద్యర్థాలలో వచ్చే) లాట్టు అంతంలో కలిగినఅగుధాతువురూపం వస్తుంది. నీవు రా వయ్యెదవు, నమ్మనేర నయ్యెదను మొ.

'భూతంబున' అనడంచేత భూతార్థాన్ని వివక్షింపకపోతే ఈకార్యం లేదు. నీవు రావు.

'లజికి' అనడంచేత ఇతరలకారాలపై ఈకార్యం రాదు. వచ్చుచున్నాఁడు.

'అగు' అనడంచేత ఈకార్యం నిత్యం. కాబట్టి రాడు అనే (లిడంత మైన అగుధాతు రూపం చేరని) వ్యతిరేకక్రియ 'రా డయ్యెను' అనేవిధ మైన భూతార్థాన్ని ఇవ్వలేదు. ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'వ్యతిరేకక్రియ యర్థత్రయబోధకం బగు' అని చెప్పాడు. 'నలుఁ గాన మివ్వనమున'. కానము = కనినవారము గాము.

**25. ఉన్న కల న వర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకులోపంబు విభాష నగు.** (117)

'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశత్రృక్తవదర్థంబులం దగు' అనేసూత్రంచేత ఆయాఅర్థాలలో ధాతువుమీద ఉన్న, కల, న అనేవర్ణాలు విధింపబడ్డాయి. ఈప్రత్యయాలు అంతంలో గలిగినశబ్దాలు ధాతుజవిశేషణాలు. ధాతుజవిశేషణాలకు

విభక్తి వివక్షించినపుడు తచ్ఛబ్దం అనుప్రయుక్త మవుతుంది. అది మహత్తు అయినపుడు వాడు ఇత్యాదిరూపంలో ఉంటుంది. తచ్ఛబ్దవకారం అంటే వాడు శబ్దంలోనివకారం.

ఉన్న కల న అనేప్రత్యయాలమీద ఉన్న తత్ అనేశబ్దం అర్థాన్ని చెప్పే వాడు అనేశబ్దంలో మొదటిపొల్లువకారానికి వికల్పంగా లోపం వస్తుం దని సూత్రానికి అర్థం.

ఉన్న అనేప్రత్యయం చివర కలిగిన 'వండుచున్న' అనేధాతుజవిశేషణంమీద ప్రథమావిభక్తిఏకవచనాన్ని వివక్షించినపుడు 'ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దం బనుప్రయుక్తం బగు' అని తచ్ఛబ్దం చేరి 'వండుచున్నవాడు' అవుతుంది. ఇపుడు ప్రస్తుతసూత్రంచేత 'వాడు'లో వకారపుపొల్లు లోపించి 'వండుచున్న+ఆఁడు' 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళపదంచేత సంధి నిత్యంగా జరిగి వండుచున్నాడు అని అవుతుంది.

'విభాష' అనడంచేత వకారం లోపించనిపక్షంలో వకారం నిలిచిఉంటుంది. వండుచున్నవాడు. ఇలాగే, వండగలవాడు – వండగలాడు.(కలమీద లోపం) వండినవాడు – వండినాడు (నవర్ణకంమీద లోపం.)

'ఉన్న కల నవర్ణకంబులమీది' అనడంచేత ఇతరప్రత్యయాలమీద ఈలోపం రాదు. వండెడువాడు, వండనివాడు, మొ.

'తచ్ఛబ్ద' అనడంచేత తచ్ఛబ్దంలోనిది కాని వకారానికి లోపం రాదు. పోరుచున్న వీరుడు. రాగలవాగు. పోయినవంకర మొ.

'వకారంబునకు' అనడంచేత (తచ్ఛబ్దంలోనే అయినా)ఇతరవర్ణాలకు ఈకార్యం రాదు. వచ్చినయామె. మొ.

# కృదంతపరిచ్ఛేదం

**1.కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు.** (1)

ధాతువుపైన విధింపబడిన 'దుఙ్' అనేదానికంటే వే రయినప్రత్యయానికి కృత్తు అని పేరు. దుఙ్ను అంటే 'లకారంబునకు దుఙ్రువురునుము ఙ్గు' అనేసూత్రంచేత విధింపబడిన దుఙ్,రు,వు,రు,ను,ము అనేవి. వీటిస్థానంలో విధింపబడ్డాయి. కాబట్టి ది,వి,దు,వు, మొద లైనవి కూడా దుఙ్ను అనేదానిచేత గ్రహింపబడతాయి. కాగా ఈప్రత్యయాలు కాక వేరుగా ధాతువుమీద విధింపబడినప్రత్యయాలు కృత్తులు. (దుఙ్భిన్న 'ప్రత్యయానికే' కృత్తు అని పేరు. కాబట్టి ఇంచు మొ. ఆగమాదులు కృత్తులు కావు.)

కృత్ ప్రత్యయాలఅర్థం మహాజనులవ్యవహారా న్ననుసరించి గ్రహించా లని సూత్రార్థం.

'టవర్ణకంబు భావంబునం దగు' ఇత్యాదిగా సంస్కృత, ఆచ్ఛికధాతువులు అన్నింటికీ సాధారణంగా వచ్చే కృత్ప్రత్యయాలను క్రియాపరిచ్ఛేదంలో చెప్పడం జరిగింది. భుజించుట. తినుట. మొ. అక్కడ ఆయాకృత్ప్రత్యయాలు ఏయేఅర్థాలలో వస్తాయో లక్షణంలో స్పష్టం చేయబడింది.

కృదంతపరిచ్ఛేదంలో విధింపబడినకృత్ప్రత్యయాలు ఆచ్ఛికధాతువులకు మాత్రమే వస్తాయి. ఈపరిచ్ఛేదంలో 'కవర్ణకం బలుగ్వాదుల కగు' ఇత్యాదిగా ఆయాధాతువులకు ఆయాప్రత్యయాలు చెప్పబడ్డాయి. కాని అవి ఏఅర్థంలో వస్తాయో లక్షణంలో చెప్పబడలేదు. ఆకృత్ప్రత్యయాలఅర్థాలను మహాకవులకావ్యవ్యవహారాన్ని అనుసరించి గ్రహించాలి అని ప్రస్తుతసూత్రం చెప్తున్నది.

**1.భావార్థం :** ఆఁక. ఇక్కడ ఆఁగు అనేధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత 'క' అనేకృత్ప్రత్యయం వచ్చి ఆఁక అవుతుంది. ఆఁక అంటే బంధనం అని అర్థం. ఇది భావార్థకం. కాబట్టి క ప్రత్యయం ఇక్కడ భావార్థంలో వచ్చింది అని మహాజనులవ్యవహారాన్ని అనుసరించి గ్రహించాలి.

**2.కర్త్రర్థం** : మొలక, ఇక్కడ మొలచు ధాతువుపై 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అని క అనే కృత్ప్రత్యయం వచ్చింది. మొలక అంటే క్రొత్తగా పుట్టినది అని అర్థం. మొలిచినది అనేవిధంగా ఇది కర్త్రర్థాన్ని చెప్తున్నది. కాబట్టి క ప్రత్యయం ఇక్కడ కర్త్రర్థంలో వచ్చింది అని మహాజనులవ్యవహారాన్ని అనుసరించి గ్రహించాలి.

ఈరెండుచోట్ల క ప్రత్యయం ఒకేసూత్రంచేత వస్తున్నది. ఒకచోట భావార్థకం అయింది. మరొకచోట అదే కర్త్రర్థకం అయింది. కాగా సూత్రంలో ఇది ఈఅర్థంలో వస్తుంది అని చెప్పే అవకాశం లేదు. ఎక్కడ ఏఅర్థంలో వస్తున్నది అనేవిషయం నిర్ణయించి చెప్పేఅవకాశం లేదు. కాబట్టి ప్రత్యయార్థం గురించి సూత్రంలో చెప్పలేదు.

**3.కర్మార్థము:** కోరిక. కోరుధాతువుమీద 'ఇకవర్ణకం బంజ్వాదుల కగు' అనేసూత్రం చేత ఇక అనేకృత్‌ప్రత్యయం వచ్చి కోరిక అని అయింది. దీనికి వాంఛితం అని అర్థం. కోరబడినది అని కర్మార్థం. దీనికి వాంఛ అనేవిధంగా భావార్థం కూడా ఉంది. కాబట్టి ఈప్రత్యయం కర్మార్థంలోనూ, భావార్థంలోనూ వస్తుం దని గ్రహించాలి.

ఇలా కృదంతపరిచ్ఛేదంలో చెప్పబడిన ఆయాప్రత్యయాలు ఏయేఅర్థాలలో వస్తా యనే విషయం మహాకవులప్రయోగాలు ఆధారంగా గ్రహించాలి.

**2. ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు.** (2)

ఇట అంటే కృదంతపరిచ్ఛేదంలో అని అర్థం. కగతపవ అన్నపుడు అకారం ఉచ్చారణార్థం కాబట్టి క్ గ్ ఇత్యాదిగా పొల్లుహల్లులను గ్రహించాలి. కగచయవ అన్నపుడు వాటికి పైనున్న హల్లుతో కూడ మొత్తం వర్ణం గ్రహించాలి. ఇక్కడ యథాసంఖ్యంగా (క,గ,త,ప,వ,ఇమి అనేవి ఆరు, కాగా క,గ,చ,య,వ అనేవి అయిదే) అన్వయం కుదరదు. 'కగతపవఇమి'లలో ఏది పరంగా ఉన్నా 'కగచయవ'లలో దేని కయినా లోపం వస్తుంది.

ఈకృదంతపరిచ్ఛేదంలో చెప్పబడిన కృత్‌ప్రత్యయంలోని కకారం, గకారం, తకారం, పకారం, వకారం అలాగే 'ఇమి' అనే ప్రత్యయమూ, పరంగా ఉన్నపుడు ధాతువు చివర ఉన్న 'కగచయవ' అనేహల్లులు వాటికిపైన ఉన్న అచ్చులతో సహా లోపిస్తాయి.

పోవు ధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత క ప్రత్యయం వచ్చి పోవు+క. క ప్రత్యయంలోని కకారం పరంగా ఉండగా ప్రస్తుతసూత్రంచేత పోవు ధాతువులో చివరివకారం అచ్చుతో గూడ అంటే 'వు' అనేవర్ణం మొత్తం లోపించి పోక అనేకృదంతరూపం ఏర్పడుతుంది. ఈకృదంతప్రాతిపదిక స్త్రీ సమం. ప్రథమైకవచనం లోపించి పోక అనేప్రథమైక వచనాంతపదం ఏర్పడుతుంది.

1. పోవు+క= పోక. (**క**కారం పరంగా ఉండగా '**వ**' లోపం.)
2. తిరుగు+గడ = తిరుగడ. (**గ**కారం పరంగా ఉండగా '**గ**' లోపం.)

3. ఆవులించు+త= ఆవులింత. (**త**కారం పరంగా ఉండగా **'చ'** లోపం.)

4. తిరియు+ప= తిరిపము. (**ప**కారం పరంగా ఉండగా **'య'** లోపం)

5. నిలుచు+వు= నిలువు. (**వ**కారం పరంగా ఉండగా **'చ'** లోపం.)

6. బ్రదుకు+ఇమి= బ్రదిమి. (**ఇమి** పరంగా ఉండగా **'క'** లోపం.)

'ఇటన్' అనడంచేత కృదంతపరిచ్ఛేదంలో విధింపబడిన కగతపవేములు పర మైనపుడు మాత్రమె ఈకార్యం. కాబట్టి క్రియాపరిచ్ఛేదంలో చెప్పిన కృత్తు పరంగా ఉంటే ఈలోపం రాదు. తీయు ధాతువుమీద 'కజి వ్యతి రేకక్త్వార్థంబునం దగు'. అని కజి ప్రత్యయం వచ్చి తీయు+క=తీయక అని యకారం నిలిచే ఉంటుంది.

'కగతపవేములు' అనడంచేత ఇతరప్రత్యయం పర మైనపుడు ఈలోపం రాదు. అరయు+ఇక= అరయిక. నగు+అవు=నగవు. మొ.

'కగచయవలకు' అనడంచేత ఇతర మైనవర్ణాలకు ఈలోపం రాదు. తాలు+ఇమి= తాలిమి. మను+వు=మనువు. మొ.

'కగతపవ' అని సామాన్యంగా నిర్దేశించడంచేత కృత్తులలోని ఈహల్లులు ఏఅచ్చుతో కూడిఉన్నా (ఈహల్లు) పర మైతే లోపం వస్తుంది. అలుగు+క=అలుక. అడఁగు+కువ= అడఁకువ. మొ.

# ప్రకీర్ణకపరిచ్ఛేదం

**1. పదాద్యంబులు ఋ(ఌ)వర్ణంబులు రలతుల్యంబులు.** (1)

పదాద్యములు అంటే పదంమొదట ఉన్నవి. 'రల' అన్నపుడు అకారం ఉచ్చారణ సౌకర్యంకోసం చేర్చబడింది. ఋ(ఌ), రల, అన్నపుడు యథాసంఖ్యంగా అన్వయం. పదం మొదట ఉన్న ఋకారం (ఋ, ౠ లు) రేఫతో సమానం. అలాగే పదం మొదట ఉన్న(ఌ)కారం లకారంతో సమానం. రలలతో తుల్యత్వం చెప్పడంవల్ల రలలతో సమాన మైనకార్యాలు అంటే రలలు పరంగా ఉంటే వచ్చేకార్యాలు వస్తాయి.

అతడు+ఋషి అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి రావలసిఉంది. ఇక్కడ పరంగా ఉన్న ఋకారం అచ్చే అయినా ప్రస్తుతసూత్రంచేత రేఫతో తుల్య మైంది. రేఫ హల్లు. కాబట్టి ఋకారం హల్లువంటిది కావడంచేత 'అచ్చు పరం బగునపుడు' చెప్పినసంధి ఇక్కడ రాదు. అతదృషి అని కాదు. అలాగే 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అని యడాగమం కూడా పరమైన స్వరానికి చెప్పబడింది. ఇక్కడ పర మైన ఋకారం హల్లు (రేఫ) వంటిది కావడంచేత దానికి యడాగమం కూడా రాదు. అతడుయ్యృషి అని కూడా కాదు. కాగా అతడు ఋషి అని అలాగే ఉంటుంది. ఇలాగే 'లేదు (ౡ)కారము' మొ.

అలాగే ఋ(ఌ)లు ద్రుతానికి పర మైనపుడు రేఫలకారాలు స్థిరాలు కాబట్టి స్థిరపరకకార్యాలు అంటే ద్రుతానికి లోపం, సంశ్లేషం, స్వత్వం అనేకార్యాలు వస్తాయి. వచ్చెను+ఋషి=వచ్చె ఋషి. వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి.

'పదాద్యంబులు' అనడంచేత పదంలో మొదట కాకుండా ఇతరస్థలాలలో ఉన్న ఋకార(ఌ)కారాలు రేఫలకారాలతో తుల్యాలు కావు. 'కృపానిధి' ఇక్కడ ఋకారం రెండవవర్ణం. ఇది రేఫవంటిది కాక అచ్చు మాత్రమె అయింది. కాబట్టి 'కృ' సంయుక్తాక్షరం కాదు. (రేఫవంటిది అయితే క్, ర్(ఋ) అనేహల్లులసంయోగం కలిగింది కావడంచేత సంయుక్తవర్ణం అవుతుంది) కాబట్టి అ+కృపానిధి అన్నపుడు 'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ద్విత్వం వచ్చి అక్కృపానిధి అని అవుతుంది. ఇలాగే పితృవాక్యము మొద లయినచోట్ల ఋకారంతో గూడినహల్లువల్ల దానికి ముందరివర్ణం గురువు కాదు.

'ఋ(ఌ)వర్ణంబులు' అనడంచేత ఇతరస్వరాలకు ఈకార్యం లేదు. రాము డతడు.

**2. జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు.** (9)

జడ్డక్కరం అంటే ద్విత్వంతో కూడినఅక్షరం. పదాదిస్వరం అంటే పదం మొదటిఅచ్చు ద్విరుక్త మైనహల్లుతో తరువాతిపదం మొదటిఅచ్చు వచ్చి కలిసేటపుడు ద్విరుక్త మైనహల్లులో రెండవహల్లుకు లోపం రాదు అని సూత్రానికి అర్థం. 'అకారంబు క్రిందిఅకారంబునకును దుదినులులక్రిందినలలకును లోపంబు బహుళంబుగా నగు' 'అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు'. అనేపూర్వసూత్రాలచేత రావలసినలోపం పరపదాదిస్వరంతో కూడేసందర్భంలో రాదు.

విల్లు+అందె అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి నిత్యంగా వస్తుంది. కాబట్టి ద్విరుక్త మైనహల్లు రెండవపదం మొదటిఅచ్చుతో నిత్యంగా కలుస్తుంది (విల్లందె). కాబట్టి 'అకారంబుక్రింది అకారంబు నకును దుదినులులక్రింది నలలకును లోపంబు బహుళంబుగా నగు.' అనేసూత్రంచేత రావలసినలోపం ప్రస్తుతసూత్రంప్రకారం రాదు. అంటే సంధిని వివక్షించినపుడు జడ్డలోపం రాదు. విల్లందె. కాబట్టి విలందె అనేవిధంగా జడ్డ లోపించినరూపం ఉండదు.

'జడ్డక్కరంబుతో' అనడంచేత పదాదిస్వరం (జడ్డ కలిగినశబ్దంలో నైనా) ఇతర మైనహల్లుతో కూడేపక్షంలోఈనిషేధం లేదు. కాబట్టి జడ్డ లోపింపవచ్చు. (అప్పుడు) అపు డడిగెను.

'పదాది' అనడంచేత మరొకపదం మొదటిఅచ్చుతో కలిసేటప్పుడే ఈనిషేధం. విల్లు ఇత్యాదిగా పైన అ చ్చున్నపుడు ద్విత్వం లోపించడంలో బాధ లేదు. విలు.

'స్వరంబుతో' అనడంచేత పరపదాదిహల్లుతో కూడేసందర్భంలో ఈకార్యం లేదు. జడ్డ లోపింపవచ్చును. విలు+పూని=విల్పూని.

(పదాదిస్వరంబుతో) 'కూడుచో' అనడంచేత పరపదాదిని స్వరం ఉన్నా, దానితో కూడనిసందర్భంలో అంటే సంధి జరగని(వివక్షింపని)పక్షంలో ఈనిషేధం లేదు. యథా శాస్త్రంగా జడ్డ లోపింపవచ్చు. ననున్+అడిగె=నను నడిగె. (నన్ను నడిగె) ఎని యున్నవి (ఎన్ని యున్నవి) మొ.

'లేదు' అనేనిషేధంచేత సంధి జరిగేపక్షంలో జడ్డలోపించినరూపం ఉండదు. 'న నడిగె, విలందె' వంటిరూపాలు ఉండవు.

**3. ఏతాదులకు మువర్ణకంబు పరం బగునపుడు దీర్ఘంబు విభాష నగు.** (15)

ఏత మొద లైనవి ఏతాదులు. ఇవి అన్నీ క్లీబసమాలు. కాబట్టి మువర్ణకాంతాలు అవుతాయి. దీర్ఘం ఏకాల్లు కాబట్టి విధించినదానిలో (ఏతాదులలో) చివరివర్ణానికి వస్తుంది. ప్రథమావిభక్తి ఏకవచనం ఐన మువర్ణకం పరంగా ఉండగా ఏత మొద లైనశబ్దాలలోనిచివరి హ్రస్వ మయినఅకారానికి వికల్పంగా దీర్ఘం వస్తుం దని సూత్రానికి అర్థం.

గోత అనేది క్లీబసమం. కాబట్టి ప్రథమావిభక్తి ఏకవచనంలో 'అమహన్నపుంసక ముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ము ప్రత్యయం వచ్చి, గోత+ము అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత దీర్ఘం వచ్చి 'గోతాము' అని అవుతుంది. విభాష అనడంచేత దీర్ఘం రానిపక్షంలో 'గోతము' అనే ఉంటుంది.

'మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' అనేసూత్రం ప్రకారం ఇక్కడ మువర్ణకం పరం ఐనపుడు చెప్పినకార్యం ముగాగమం పరంగా ఉన్నపుడు కూడా వస్తుంది. గోతాములు, గోతామున మొ.

'ఏతాదులకు' అనడంచేత ఏత మొద లైనవాటిలో చేరనిశబ్దానికి ఈకార్యం లేదు. సున్నము, సన్నము.మొ.

'మువర్ణకంబు పరం బగునపుడు' అనడంచేత మ్ము,ంబు లు పర మైతే దీర్ఘం రాదు. ఏతమ్ము, గోతంబు. మొ.

**4. పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.** (16)

పదం చివర ఉన్నవి పదాంతాలు. సంయుక్తం అంటే వే రొకహల్లుతో కూడిఉన్నది. అలా కూడనిది అసంయుక్తం. నులురులకు చివర ఉత్వం ఉన్నది. కాబట్టి పదాంతంలోని ఈఉత్వానికి అచ్చు పరంగా ఉంటే 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని సంధి నిత్యంగా వస్తుంది, కాబట్టి వీటికి అచ్చు పర మైనపుడు ఉత్వలోపప్రసక్తి లేదు. అందుచేత హల్లు లేదా అవసానం పర మైనపుడు మాత్రమె ఈకార్యం వస్తుంది.

పదం చివర ఉన్నవీ, వే రొకహల్లుతో కూడనివీ, అయిన ను,లు,రు, అనేవర్ణాలలోని హ్రస్వ మైన ఉకారానికి (హల్లు కానీ, అవసానం కానీ పర మైనపుడు) బహుళంగా లోపం వస్తుంది అని సూత్రార్థం.

'రాములు' అనేశబ్దంలో చివరిఉకారానికి ప్రస్తుతసూత్రంచేత అవసానంలో ఉత్వం

లోపించి, 'రాముల్' అని అవుతుంది. బహుళం అనడంచేత లోపం రానిపక్షంలో 'రాములు' అనే ఉంటుంది. ఇలాగే మ్రాను+పడె=మ్రాన్పడె. వత్తురు+వారు= వత్తుర్వారు.

'పదాంతంబు లయి' అనడంచేత పదంలో ఇతరస్థలాల్లో ఉన్న ను,లు,రు లలో ఉత్వానికి లోపం లేదు. నుదురు మొ.

'అసంయుక్తంబు లయి' అనడంచేత వే రొకహల్లుతో సంయుక్త మై ఉన్న నులురులలో ఉత్వానికి లోపం రాదు. కొడవండ్లు. ఆంధ్రు. మొ. (ఎన్ని మార్గ్లా ము అని శ్రీకృష్ణదేవరాయలు. మార్లు+గాము. ఇక్కడ సంయుక్త మైన 'ర్లు' లో ఉత్వానికి లోపం వచ్చింది. ఇది అన్యకార్యం అనవచ్చు.)

'నులురుల' అనడంచేత ఇతరవర్ణాలలోనిఉత్వానికి లోపం రాదు. ఆకు, ప్రేగు మొ. త్రాడ్ గొటికి, వంటి అరు దయినప్రయోగాలు అన్యకార్యంగా బహుళగ్రహణం చేత సిద్ధిస్తాయి.

'బహుళము' అనడంచేత నురులలోనిఉత్వం అవసానంలో లోపించడం అరుదు. ప్రత్యయా లైనలురులలో ఉత్వానికి హలవసానాలు పర మయినపుడు లోపం సంస్కృతసమాలలో కూడా వస్తుంది. రాముల్, తత్వాలుర్ భయం బందగన్.

**5. అచ్ఛికంబులం బదమధ్యంబుల నలదరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.** (17)

సంస్కృతసమంకంటే వే రయినతెలుగుభాష అచ్ఛికం. అచ్చతెలుగుపదంలో నడుమ ఉన్న 'ను లు డు రు' అనేవర్ణాలలోనిహ్రస్వ మైన ఉకారానికి బహుళంగా లోపం వస్తుంది అని సూత్రానికి అర్థం.

కినుక – ఇది అచ్ఛికశబ్దం. ఈశబ్దం నడుమ ఉన్న ఉకారానికి ప్రస్తుతసూత్రంచేత లోపం వచ్చి, కిన్క అని అవుతుంది. బహుళం అనడంచేత ఉత్వం లోపింపనిపక్షంలో కినుక అని ఉంటుంది.

ఇలాగే చిలుక–చిల్క, కడుపు–కడ్పు, పెరుగు–పెర్గు. మొ.

'అచ్ఛికంబుల' అనడంచేత ఈలోపం సంస్కృతసమాలలో రాదు. వినుతి. కలుషము, అరుణము మొ.

'పదమధ్యంబుల' అనడంచేత పదం మొదట కానీ, (చివర కానీ) ఉన్నపుడు ఈలోపం రాదు. నుదురు మొ. చివర ఉన్నపుడు 'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిన నులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనే వేరేలక్షణంచేత లోపం రావచ్చును. కన్ గీటి, విల్ మొ.

'నలడరల' అనడంచేత నలడర అనేవాటికంటే వే రయినహల్లుమీద ఉన్నఉత్వానికి లోపం రాదు. చిగురు, తుమురు మొ.

'ఉత్వంబునకు' అనడంచేత ఉత్వంకంటే వే రయినఅచ్చుకు 'నలడర'ల మీద కూడా లోపం రాదు. నూనియ, నాఁడెము మొ.

**6. లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి.** (18)

లాఁతి అంటే ఇతరం. చెప్పగా మిగిలినది. 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరలయుత్వంబులకు లోపంబు బహుళంబుగ నగు' అనేపూర్వసూత్రం 'నలడర' అనేవాటిపై ఉన్నహ్రస్వ మైనఉకారానికి లోపంచెప్పింది. కాగా అచ్చతెలుగుభాషలో పదాల నడుమ ఉన్ననలడరలపై ఉన్న హ్రస్వ మైనఉకారానికంటే వే రైనఅచ్చుకు సయితం లోపం అరుదుగా కనబడుతున్న దని సూత్రానికి అర్థం.

కలికి అనేశబ్దంలో లకారంపై ఉన్న ఇకారానికి ప్రస్తుతసూత్రంచేత లోపం వచ్చి కల్కి అని అవుతుంది. ఇలాగే బుడిపి-బుడ్పి. మొ.

'లాఁతియచ్చునకు సహితము' అనేది కినుక- కిన్క ఇత్యాదిగా నలడరలపై ఉత్వం లోపించడం ప్రసిద్ధం కావడం అనువదిస్తున్నది.

'ఒకానొకచో' అనడంచేత ఉకారేతరస్వరానికిలోపం రావడం అరుదు. కాబట్టి తేనియ, పేలిక మొద లైనశబ్దాలలోని ఉకారేతర మైనఅచ్చు లోపింపదు.

'నుడినడుమ' అనడంచేత మాటమొదట కాని, చివర కానీ ఉన్నఉత్తుకంటే వే రైన అచ్చుకు లోపం రాదు. నివురు, గాలి, మొ.

'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల' అనేపూర్వసూత్రంనుండి 'పదమధ్యంబుల' అనేఅర్థం సిద్ధిస్తుంది. కాబట్టి ఈసూత్రంలోని 'నుడినడుమ' అనేదళం స్పష్టతకే అనవచ్చు.

అలాగే పూర్వసూత్రాన్ని అనుసరించి ఈకార్యం ఆచ్ఛికశబ్దంలోనే కాబట్టి సంస్కృతసమాలలో ఈలోపం రాదు. హరితము, పలితము, ఈడనము.మొ.

'కానంబడియెడి' అనడంచేత 'లాఁతిఅచ్చు' లోపించడం కవిప్రయోగాలలో కనబడినచోట్ల మాత్రమే గ్రహించాలి. అలా లోపించడం అరుదు కాబట్టి అచ్చు లోపింపని 'కలికి' అనేరీతిరూపాలు కవిప్రయోగాల ననుసరించి ప్రసిద్ధం కావడం గుర్తింపవచ్చు.

# రూపప్రక్రియ

## బాలవ్యాకరణం - (సంజ్ఞా) సంధి పరిచ్ఛేదం.

**1. అందదుకు :** అదుకు+అదుకు అని ఉండగా ('ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనే సూత్రంచేత ప్రాప్తిస్తున్న ఉత్వసంధిని బాధించి, 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అని ఆమ్రేడితసంధి రావలసిఉండగా దానిని బాధించి) 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' (సంధి. 42) అనేసూత్రంచేత ప్రయోగానుసారంగా 'దుకు' అనేదానికి 'ంద్' ఆదేశంగా వచ్చి అంద్ + అదుకు = అందదుకు అని అవుతుంది.

**2. అదియును న్గాక :** అదియును+కాక అని ఉండగా, 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' అనేసూత్రంప్రకారం 'ను' అనేద్రుతానికి తర్వాత 'న్' అనే ద్రుతం చేరి అదియునున్+కాక. 'ద్రుతప్రకృతికముమీఁ దిపరుషములకు సరళము లగు' సూత్రంచేత కకారం గకార మై, అదియునున్+గాక. 'ఆదేశసరళములకు ముం దున్న ద్రుతమునకు బిందుసంశ్లేషములు విభాష నగు' అనేసూత్రంచేత అరసున్న వస్తే అదియునుఁ గాక. నకారానికి నిండుసున్న వస్తే అదియునుం గాక. సంశ్లేషం వస్తే అదియును న్గాక. సంశ్లేష కూడా విభాషే కాబట్టి రాకపోతే స్వత్వం ఉంటుంది. ఇక్కడ విధించింది నకారం పొల్లు గాబట్టి దీని స్వత్వ రూపం గూడా అదియునున్ గాక, అనేవిధంగానే ఉంటుంది.

**3. అప్ప టప్పటికిన్ :** అప్పటికిన్ + అప్పటికిన్ అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంప్రకారం 'కిన్' అనేవిభక్తి లోపించి, అప్పటి+అప్పటికిన్. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంచేత సంధి వచ్చి 'అప్పటప్పటికిన్'. బహుళం అనడంచేత విభక్తి (కిన్) లోపించనిపక్షంలో అప్పటికిన్+అప్పటికిన్ అని ఉండగా ఏమ్యాది సూత్రంచేత సంధి వికల్పంగా వస్తుంది. సంధి జరిగితే అప్పటి కప్పటికిన్ సంధి జరక్కపోతే అప్పటికి నప్పటికిన్.

**4. ఇయం ధేను వనె :** ఇయంధేనుః+అనె అని ఉండగా 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' అనేసూత్రంచేత విసర్గ లోపించి ఇయం ధేను+అనె 'ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు' అనేసూత్రంచేత వుగాగమం వచ్చి ఇయం ధేనువ్+అనె=ఇయం ధేను వనె అవుతుంది.

**5. ఉం దుండుము :** ఉండుము+ఉండుము అని ఉండగా (ఉత్వసంధిని బాధించి, ఆమ్రేడితసంధి, దానిని బాధించి) 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత మొదటిశబ్దం చివరిమువర్ణకం లోపించి, ఉండు + ఉండుము. 'అచ్చున కామ్రేడితంబు –' అనే సూత్రంచేత సంధి వచ్చి ఉండుండుము. విభాష గాబట్టి మువర్ణం లోపించని పక్షంలో ఉండుము+ఉండుము అని ఉండగా 'అచ్చున కామ్రేడితంబు' అనేసూత్రంచేత సంధి జరిగి, ఉండు ముండుము అని అవుతుంది.

**6. ఎల్లయర్థములు :** ఎల్లన్ అనేవిశేషణానికి, అర్థములు అనేవిశేష్యంతో కర్మధారయం సమాస మై ఎల్లన్+అర్థములు. 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్రుతం లోపించి ఎల్ల+అర్థ(ములు). 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనే సూత్రంలోనిబహుళపదంచేత సంధి రాకుండగా 'సంధి లేనిచోట' అనేసూత్రంచేత యడాగమం వచ్చి, ఎల్లయర్థములు.

**7. ఏమి యేమి :** ఏమి+ఏమి అని ఉండగా 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పిముగా నగు' అనేసూత్రాన్ని బాధించి 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంలోని 'తఱుచు' శబ్దంచేత సంధి వైకల్పికంగా వస్తుంది. సంధి జరిగినపక్షంలో ఏ మేమి. వికల్పం గాబట్టి సంధి రానిపక్షంలో 'సంధి లేనిచోట' అనేసూత్రంచేత యడాగమం వచ్చి, ఏమి యేమి.

**8. ఏలితి వపుడు :** ఏలితివి+అపుడు అని ఉండగా 'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికంబుగా నగు' అనేసూత్రాన్ని బాధించి 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును' అనేసూత్రంచేత సంధి నిత్యంగా జరిగి 'ఏలితి వపుడు.'

**9. కందోయి, కన్దోయి :** కన్+దోయి అని ఉండగా 'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంచేత ద్రుతానికి లోపం రావలసిఉండగా, 'అఁట యిఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' అనేసూత్రం ప్రకారం రాదు. కాబట్టి సంశ్లేషం వచ్చి కన్దోయి. 'వర్గయుక్సరళములు పరము లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి' అని నకారం స్థానంలో నిండుసున్న వచ్చినపక్షంలో – కందోయి.

**10. కట్టకడ :** కడ+కడ అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకారం బగు'

అనేసూత్రంచేత మొదటికడశబ్దంలోని ‘డ’ స్థానంలో ‘ట్ట’ ఆదేశ మై, ‘కట్టకడ’ అని అవుతుంది.

**11. కఱకుటమ్ము :** కఱకు అనేవిశేషణానికి అమ్ము అనేవిశేష్యంతో కర్మధారయ సమాస మేర్పడి, కఱకు+అమ్ము అని ఉండగా, ‘ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు’ అనేసూత్రాన్ని బాధించి, ‘కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు’ అనేసూత్రంచేత టుగాగమం వచ్చి, కఱకుట్+అమ్ము కఱకుటమ్ము అని అవుతుంది.

**12. కిం త త్తనియె :** కిం తత్ + అనియె అని ఉండగా, ‘అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు’ అనేసూత్రంచేత చివరిహల్లుకు ద్విత్వం వచ్చి, కిం తత్త్ + అనియె = కిం తత్తనియె అని అవుతుంది.

**13. కుట్టుసురు :** కుఱు+ఉసురు అని ఉండగా, ‘ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు’ అనేసూత్రాన్ని బాధించి, ‘కుఱు చిఱు కడు నడు నిడు శబ్దంబులఱడల కచ్చు పరం బగునపుడు ద్విరుక్తటకారం బగు’ అనేసూత్రంచేత కుఱుశబ్దంలోని ఱువర్ణం స్థానంలో ‘ట్ట్’ అనేవర్ణం ఆదేశ మై, కుట్ట్+ఉసురు=కుట్టుసురు అవుతుంది.

**14. కెందామర :** కెంపు+తామర అని ఉండగా, ‘సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు’ అని తొలియచ్చు మీఁదివర్ణాలు లోపించి, కె+తామర. ‘లుప్తశేషంబునకుం బరుషంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు’ అని నుగాగమం వచ్చి, కెను+తామర. ‘ద్రుత ప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు’ – కెను+దామర. ‘ఆదేశ సరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు’ అని నిండుసున్న వచ్చి, కెందామర. ‘అఁటయిఁకచుఁదుశబ్దంబులం దప్ప – అనేసూత్రం ప్రకారం అరసున్న రాదు. ( కెఁదామర అనేరూపం ఉండదు.) వ్యవస్థిత విభాషచేత ఈద్రుతానికి సంశ్లేషం రాదు. (కెన్దామర అని ఉండదు.) ‘సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు’ కాబట్టి కెనుదామర అనేరూపం ఉండదు.

**15. క్రొమ్మావి :** క్రొత్త+మావి అని ఉండగా, ‘సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు’ అనేసూత్రంచేత తొలియచ్చుమీఁదివర్ణాలు లోపించి, ‘క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు’

అనేసూత్రంచేత లుప్తశేషముమీదిహల్లుకు ద్విత్వం వచ్చి, క్రొమ్మావి.

**16. గుణవంతురాలు :** 'గుణవంత' అనేవిశేషణశబ్దానికి స్త్రీత్వంలో 'ఆలు' శబ్దంతో కర్మధారయసమాస మై, గుణవంత+ఆలు అని ఉండగా 'కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు' అనేసూత్రంచేత ఉత్వమూ (గుణవంతు) పైన రేఫ ఆగమమూ వచ్చి, గుణవంతుర్+ఆలు = గుణవంతురాలు.

**17. చిగురుటాకు :** చిగురు అనేవిశేషణానికి 'ఆకు' అనేవిశేష్యంతో కర్మధారయమై చిగురు+ఆకు అని ఉండగా (ఉత్వసంధిని బాధించి) 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు' అనేసూత్రంచేత నిత్యంగా వస్తున్న టుగాగమాన్ని బాధించి, 'కర్మధారయంబునం బేర్వాదిశబ్దముల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు' అనేసూత్రంచేత టుగాగమం వికల్పంగా వస్తుంది. వచ్చినపక్షంలో (చిగురుట్+ఆకు) చిగురుటాకు. విభాష అనడంచేత టుగాగమం రానిపక్షంలో 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని సంధి జరిగి, చిగురాకు.

**18. చిట్టెలుక :** చిఱు+ఎలుక చూ. కుట్టుసురు.

**19. చూడు నన్ను :** చూడుము+నన్ను అని ఉండగా 'మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత మువర్ణకం లోపించి, చూడు నన్ను. విభాష అనడంచేత లోపం రానిపక్షంలో, చూడుము నన్ను.

**20. చేయునతఁడు :** చేయు+అతఁడు అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రాన్ని బాధించి 'ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణంబున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నకారం ఆగమ మై (చేయున్+అతఁడు) చేయునతఁడు.

**21. జవరాలు :** జవ్వని శబ్దానికి ఆలు శబ్దంతో కర్మధారయసమాసం ఏర్పడి జవ్వని+ఆలు అని ఉండగా 'కర్మధారయంబునం బేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు రుగాగమం బగు' అనేసూత్రంచేత రుగాగమం వచ్చేటప్పుడు 'ఇందు జవ్వనిశబ్దమునకు జవాదేశం బని యెఱుంగునది' అనేసూరివివరణా న్ననుసరించి 'జవ్వని' శబ్దంస్థానంలో 'జవ' అనేది ఆదేశంగా వచ్చి (జవ + ఆలు) దానికి చివర రేఫ ఆగమమై (జవర్ + ఆలు) జవరాలు అవుతుంది.

**22. తలఁబ్రాలు :** తలను+ప్రాలు. అనేసమాసంలో 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనే సూత్రంచేత ద్రుతానికి లోపం రావలసిఉండగా, 'తలఁబ్రాలు మొద లగుసమాసంబుల ద్రుతమునకు లోపంబు లేదు' అనేసూత్రం ప్రకారం రాదు. 'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు.' తలను+బ్రాలు. 'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అని అరసున్న వస్తే తలఁబ్రాలు. నిండుసున్న వస్తే తలంబ్రాలు. సంశ్లేష మైతే తలన్బ్రాలు. 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు' అని స్వత్వం ఉండదు. కాబట్టి 'తలనుబ్రాలు' అనే రూపం ఉండదు.

**23 . తల్లిదండ్రులు :** తల్లియును తండ్రియును అనేఅర్థం చొప్పున ద్వంద్వసమాసం ఏర్పడి తల్లి+తండ్రి అని ఉండగా 'ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవ లగు' అనేసూత్రంచేత తకారానికి దకార మై, తల్లిదండ్రి. ప్రథమావిభక్తిలో బహువచనంతో తల్లిదండ్రులు.

**24. తా విను :** తాను+విను. అని ఉండగా 'ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అని ద్రుతం లోపించగా 'తా విను'. లోపం రానిపక్షంలో సంశ్లేషం రావలసిఉండగా 'తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.' అనే సూత్రంప్రకారం సంశ్లేష రాదు. కాబట్టి 'తా న్విను' అని ఉండదు. ఇంక స్వత్వంతో 'తాను విను' అని ఉంటుంది.

**25. దాసో ఽహ మను :** దాసో ఽహమ్+అను అని ఉండగా 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు' అనేసూత్రాన్ని బాధించి 'అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు' అనేసూత్రంచేత ద్విత్వం వికల్పంగా వస్తుంది. ద్విత్వం వచ్చినపక్షంలో – దాసో ఽహ మ్మని. విభాష అనడం చేత ద్విత్వం రానిపక్షంలో – దాసో ఽహ మను.

**26. న న్నడిగె :** నన్నున్+అడిగె అని ఉండగా ('ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని ప్రాప్తిస్తున్నసంధిని బాధించి, 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అని సంధిరాకపోతుండగా, దానిని బాధించి) 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రంచేత సంధి జరిగినపక్షంలో– న న్నడిగె. వైకల్పికం అనడంచేత సంధి రానిపక్షంలో ద్రుతం మీదిఅచ్చుతో గలిసి– నన్ను నడిగె.

**27. నమో యను :** నమః+అను అని ఉండగా 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' అని విసర్గ లోపించి, నమ+అను. 'అనుకృతిని నమశ్శబ్దముతుదియత్తున

కోత్వము విభాష నగు' అనేసూత్రంచేత ఓత్వం రాగా, 'నమో+అనె. ఇక్కడ సంధి లేదు గాబట్టి 'సంధి లేనిచోట –' అనే సూత్రంచేత యడాగమం వచ్చి, నమో యనె. విభాష గాబట్టి ఓత్వం రానిపక్షంలో నమ+అనె అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అని రావలసినసంధి బహుళగ్రహణంచేత సంస్కృతీయ మైనఅకారానికి రాదు. కాబట్టి యడాగమం వచ్చి 'నమ యనె' అని అవుతుంది.

**28. నమ్మ కిట :** నమ్మకుము+ఇట అని ఉండగా ఉత్వసంధిని బాధించి 'వ్యతిరేకమధ్యమమువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత మువర్ణకం లోపింపగా, 'నమ్మకు+ఇట'. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని సంధి జరిగి, నమ్మ కిట. విభాష అనడంచేత మువర్ణకం లోపించని పక్షంలో, నమ్మకుము+ఇట అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు–' అనే సూత్రంచేత సంధి జరిగి, నమ్మకు మిట.

**29. నాది :** నాయొక్క+అది అనుచో సమాసంలో విభక్తి లోపించి, నా+అది అని ఉండగా 'అదియవిశబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహళంబుగా నగు' అనేసూత్రంచేత 'అది'లో అకారం లోపించగా, నాది. బహుళం అనడంచేత అకారానికి లోపం రానిపక్షంలో నా+అది అనేచోట దీర్ఘం గావడంవల్ల సంధి లేదు గాబట్టి 'సంధి లేనిచోట–' అనేసూత్రంచేత యడాగమం వచ్చి, నాయది అవుతుంది.

**30. నానాఁడు :** నాఁడు+నాఁడు అని ఉండగా 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలో 'బహుళగ్రహణముచేత ఇంచుక నాఁ డిత్యాదులం దంతిమాక్షరలోపంబు నగు' అని చివరిఅక్షరం 'డు' వర్ణం లోపించగా నాఁ+నాడు. 'సంస్కృతసమేతరంబు లయినతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు గానంబడుచున్నది' అనేసూత్రంప్రకారం స్థిరానికి ముందు బిందు వుండదు గాబట్టి అరసున్న లోపించి – నానాఁడు. చివరిఅక్షరం లోపించనిపక్షంలో – నాఁడునాఁడు.

**31. నాయందలికరుణ :** నాయందును + కరుణ అనేసమాసంలో 'సమాసంబు నందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్రుతం లోపించి, నాయందు + కరుణ. 'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు' అని 'అలి' ఆగమం కాగా నాయందు + అలి + కరుణ. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనేసూత్రంచేత సంధి జరిగి నాయందలికరుణ.

**32. నీచేతిప్రోపు :** నీచేతను+ప్రోపు అనేసమాసంలో 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ద్రుతం లోపించి, నీచేత+ప్రోపు. 'చేతతోడవలనల కిత్వంబు సమాసంబునం దగు' అనేసూత్రంచేత చేతలో అత్వానికి ఇత్వం వచ్చి – నీచేతిప్రోపు.

**33. నెన్నడుము :** నెఱ+నడుము అని ఉండగా 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' అనేసూత్రంచేత తొలియచ్చు మీదివర్ణాలు లోపించి (నె+నడుము), మీదిహల్లుకు ద్విత్వం వచ్చి, 'నెన్నడుము' అవుతుంది.

**34. పూరెమ్మ :** సమాసంలో పూవు+రెమ్మ అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అని తొలియచ్చుమీదివర్ణా లన్నీ లోపింపగా – పూరెమ్మ. బహుళం అనడంచేత లోపం రానిపక్షంలో – పూవురెమ్మ.

**35. భయపడె :** భయము+పడె అని ఉండగా 'పద్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు' అనేసూత్రంచేత మువర్ణకం లోపించి – భయపడె. విభాష గాబట్టి లోపం రాకపోతే మువర్ణకం స్థానంలో నిండుసున్న వచ్చి – భయంపడె. ఇదీ విభాషే కాబట్టి లోపపూర్ణబిందువులు రెండూ రానిపక్షంలో మువర్ణకం అలాగే ఉంటుంది. భయముపడె.

**36. రాజునాజ్ఞ :** రాజుయొక్క+ఆజ్ఞ. ఈషష్ఠీతత్పురుషసమాసంలో 'సమాసవిభక్తికి లోపం బగు –' అని విభక్తి లోపించి రాజు+ఆజ్ఞ అని ఉండగా "ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రాన్ని బాధించి 'షష్ఠీసమాసంబునం దుకార ఋకారముల కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అని నకారం ఆగమంగా వచ్చి – రాజున్+ఆజ్ఞ = రాజునాజ్ఞ అని అవుతుంది.

**37. వచ్చి రప్పుడు :** వచ్చిరి+అప్పుడు అని ఉండగా 'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రంచేత సంధి జరిగి, 'వచ్చి రప్పుడు'. వైకల్పికం అనడంచేత సంధి రానిపక్షంలో 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు.' అనేసూత్రంచేత యకారం ఆగమ మై 'వచ్చిరి యప్పుడు.'

**38. వచ్చెం ధాత్రీపతి :** వచ్చెను+ధాత్రీపతి అని ఉండగా 'వర్గయుక్సరళంబులు పరంబు లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి'

అనేసూత్రంచేత 'ను' వర్ణంస్థానంలో నిండుసున్న వచ్చి – వచ్చెం ధాత్రీపతి. అరుదయిననిండుసున్న రానిపక్షంలో 'ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అని ద్రుతం లోపిస్తే – వచ్చె ధాత్రీపతి. సంశ్లేషం వస్తే – వచ్చెను ధాత్రీపతి. విభాష గాబట్టి ఏదీ రానిపక్షంలో – వచ్చెను ధాత్రీపతి అని స్వత్వరూపం.

**39. వాఁడు కంసారి :** వాఁడు+కంసారి అని ఉండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అని రావలసిన గ(గసడదవ) ఆదేశం 'తెనుఁగులమీఁదిసాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అనేసూత్రంచేత రాదు. కాబట్టి 'వాఁడు కంసారి' అని అలాగే ఉంటుంది.

**40. వీసెఁడు :** వీసె+ఎఁడు అని ఉండగా 'అంద్వవగాగమంబుల దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అని సంధి నిత్యంగా జరిగి 'వీసెఁడు' అని అవుతుంది.

**41. వెలయాలు :** వెల+ఆలు అని ఉండగా 'అత్తునకు సంధి బహుళముగా నగు' అని ప్రాప్తిస్తున్న సంధి, 'వెలయాల్వాదుల సంధిలేమి బాహుళకంబుచేతనే యని యెఱుంగునది' అనేసూరివివరణంప్రకారం ఆసూత్రంలోని బహుళపదంచేత రాదు. 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అని యకారం ఆగమ మై, వెలయాలు.

**42. సరసపుమాట :** సరసము అనేవిశేషణానికి మాట అనేవిశేష్యంతో కర్మధారయసమాసమై, సరసము+మాట అని ఉండగా 'సమాసవిభక్తికి లోపం బగు, లట్టునకుఁ గాదు' అనేసూత్రంచేత (మొదటిపదంలో) రావలసినముప్రత్యయలోపం 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' అని పుంపులు విధించిన సామర్థ్యంచేత రాదు. మువర్ణకస్థానంలో 'పు' ఆదేశ మైతే, సరసపుమాట. 'ంపు' ఆదేశ మైనపక్షంలో సరసంపుమాట.

**43. సింగపుంగొదమ :** సింగము(యొక్క) కొదమ– అనేషష్ఠీసమాసంలో 'కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపు లగు' అని మువర్ణకస్థానంలో 'పు' ఆదేశం కాగా సింగపు+కొదమ. 'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుఁ బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అని నుగాగమం వచ్చి, సింగపును+కొదమ. (నుగాగమవిధానసామర్థ్యంచేత 'సమాసంబునందు ద్రుతంబునకు' రావలసిన లోపం దీనికి రాదు.) ద్రుతప్రకృతికము

మీఁదిపరుషాలకు సరళా లయి (సింగపును+గొదమ), ఆదేశసరళాలకు ముం దున్నద్రుతానికి ఖండబిందువు రాగా – సింగపుఁగొదమ, పూర్ణబిందువు వస్తే– సింగపుంగొదమ. సంశ్లేషం వస్తే – సింగపున్గొదమ అవుతుంది. 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు' కాబట్టి 'సింగపునుగొదమ' అని ఉండదు.

## తత్సమపరిచ్ఛేదం.

**1. అంగిరుఁడు :** మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీ యైకవచనాంతతుల్యత్వం బే నగు' అనేసూత్రంచేత 'అంగిరస్' అనేది ప్రాతిపదికగా నిలిచి ఆసూత్రంచేతనే చివరిసకారం లోపించి, 'అంగిర'. దీనిపై ప్రథమావిభక్తి ఏకవచనంలో 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వం బున కుత్వం బగు' అని ఉత్వమూ (అంగిరు), 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అని డుజూ వచ్చి ముందు బిందువుతో అంగిరుఁడు (అంగిరుండు). సకారలోపం రానిపక్షంలో పయిసూత్రంచేతనే ద్వితీయైకవచనాంతంతో తుల్య మైన 'అంగిరసమ్' అనేది ప్రాతిపదిక అవుతుంది. 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అని మకారం లోపించి అంగిరస. దీనిపై ప్రథమైకవచనంలో ఉత్వడుజులు వచ్చి అంగిరసుఁడు.

**2. అసుర :** అసుర–ప్రాతిపదిక. మహద్వాచకమూ, పుంలింగమూ ఐన ఈసంస్కృతప్రాతిపదిక తెలుగులోకి వచ్చినతర్వాత 'సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్రీతుల్యంబు లగు, సంస్కృతసమాసంబునఁ గావు' అనేసూత్రంచేత స్త్రీతుల్యం అయినపక్షంలో ఈశబ్దంపైన ప్రథమాఏకవచనవివక్షలో చేరిన 'సు' అనేప్రత్యయానికి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వచ్చి 'అసుర' అని అవుతుంది. వైకల్పికం అన్నాడు కాబట్టి స్త్రీతుల్యం కానిపక్షంలో సహజంగా పుంలింగం కాబట్టి ఉత్వమూ, డుజు వచ్చి. అసురుఁడు, అసురుండు.

**3. ఆత్మ** : 'ఆత్మన్' నకారాంతసంస్కృతప్రాతిపదిక. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత తెలుగులో ఆత్మా అనేరూపంతో ప్రాతిపదిక కాగా 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనే సూత్రంచేత చివరిదీర్ఘం హ్రస్వ మై, 'ఆత్మ'. (మహద్వాచకమూ) పుంలింగ మైన యీశబ్దానికి 'ఆత్మేమనిజంతంబులకు నాంతంబు లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు

బహుళంబుగా నగు’ అనేసూత్రంచేత స్త్రీలింగత్వం వస్తుంది. స్త్రీత్వంవల్ల దీనిపైని ప్రథమైకవచనానికి (సు) ‘స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు’ అని లోపం వచ్చి, ‘ఆత్మ’ అనే ప్రథమా ఏకవచనాంతపదం ఏర్పడుతుంది. బహుళం గావడంవల్ల స్త్రీత్వం రాకపోతే ఉత్వడుజులు వచ్చి, ఆత్ముఁడు, ఆత్ముండు, (అమహద్వాచక మైనపుడు ప్రథమైకవచనంలో ‘అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు’ అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి– ఆత్మము.

**4. ఇంద్రజి :** ఇంద్రజిత్ అనేసంస్కృతప్రాతిపదికకు తెలుగులో ‘హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు’ అనేసూత్రాన్ని బాధించి ‘ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతుల్యంబులు విభాష నగు’ అనేసూత్రంచేత ‘ఇంద్రజితమ్’ ప్రాతిపదిక అవుతుంది. ‘దానియంతిమమకారంబునకు లోపం బగు’ అని చివరిమకారం లోపించగా ప్రథమైకవచనవివక్షలో ఉత్వడుజులు వచ్చి ఇంద్రజితుఁడు, అవుతుంది.

విభాష అనడంవల్ల ద్వితీయైకవచనాంతతుల్యరూపం కానిపక్షంలో ‘హలంతంబు’ అనేసూత్రంప్రకారం ‘ఇంద్రిజిత్’ అనేప్రథమైకవచనాంతతుల్యరూపం తెలుగులో ప్రాతిపదిక అవుతుంది. అపుడు ‘జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాష నగు’ అనేసూత్రంచేత తకారం లోపించి ఇంద్రజి. ఇపుడు ఇకారాంతం కావడంచేత ఈప్రాతిపదికపై ప్రథమైకవచనానికి ‘ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు’ అనేసూత్రంచేత లోపం వచ్చి ‘ఇంద్రజి’ అనేపదం ఏర్పడుతుంది.

విభాష గాబట్టి తకారం లోపించనిపక్షంలో ‘ఉగాగమంబును ద్విత్వంబును దుది హల్లున కగు’ అని ఉగాగమద్విత్వాలు వచ్చి ఇంద్రజిత్తు.‘ ఇగ్లౌరాయుగంతంబుల – అనేసూత్రంచేత ప్రథమైకవచనానికి లోపం వచ్చి ఇందర్జిత్తు అనేప్రథమైకవచనాంత పదం ఏర్పడుతుంది.

**5. ఉరము :** ఉరస్ శబ్దం. (హలంతంబు ప్రథమైకవచనాంత– అనేసూత్రాన్ని బాధించి) ‘సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు’ అనేసూత్రంచేత ‘ఉరస్’ అని సకారాంతం ప్రాతిపదికగా నిలిచి, చివరిసకారం లోపించగా, ఉర. ప్రథమైకవచనంలో ‘అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు’ అని మువర్ణకం వచ్చి, ఉరము. బహుళం గాబట్టి సకారం లోపించనిపక్షంలో ‘ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు’ అనే సూత్రంచేత ఉగాగమద్విత్వాలు వచ్చి (ఉరస్సు), ‘ఇగ్లౌరాయుగంతంబుల’ అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి ఉరస్సు అని అవుతుంది.

**6. ఋత్విజుఁడు :** ఋత్విజ్ (జకారాంతసంస్కృత)శబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రాన్ని బాధించి 'ఋత్విగాదులు ద్వితీయైక వచనాంతతుల్యంబులు విభాష నగు' అనే సూత్రంచేత ఋత్విజమ్ (ద్వితీయైకవచనాంత తుల్యం) అనేది ప్రాతిపదిక. 'దానియంతిమ మకారంబునకు లోపం బగు' అని మకారం లోపించి ఋత్విజ. ప్రథమైకవచనంలో ఉత్వడుజులు వచ్చి ఋత్విజుఁడు.

విభాష అనడంచేత ద్వితీయైకవచనాంతతుల్యరూపం రాకపోతే 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు' అనేసూత్రంచేత 'ఋత్విక్' అనేది ప్రాతిపదిక యై, ఉగాగమద్విత్వాలు వచ్చి (ఋత్విక్కు) 'ఇగ్లౌరాయుగంతంబుల –' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'ఋత్విక్కు' అని అవుతుంది.

**7. ఓరామ :** రామ ప్రాతిపదిక. 'పుంలింగ బయి మహద్వాచకం బయిన' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి, రాము. సంబోధనంలో ప్రథమైకవచనంలో 'పుంలింగ మగు మహద్వాచకమునకు' అని డుజ్ వచ్చి, రాము+డుజ్ అని ఉండగా 'కృతోత్కం బగుసంస్కృతనామంబు సంబుద్ధిడుజునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత డుజ్ లోపించి రాము. 'సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుది యుకారంబున కకారం బగు' అని అత్వం వచ్చి రామ. 'సంబోధనంబునం బదంబు తుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు' అనేసూత్రంచేత దీర్ఘ మైతే, రామా. విభాష కాబట్టి దీర్ఘం రాకపోతే రామ. 'ఓ యామంత్రణంబునం దగు' అని ముందు 'ఓ' శబ్దం చేరి ఓరామా, ఓరామ. (విభాష కాబట్టి డుజు లోపించకపోతే అత్వ దీర్ఘాలతో, ఓ రాముఁడా, ఓ రాముఁడ.)

**8. ఓ విష్ణూ3 :** 'విష్ణు' శబ్దంపై (సంబోధనంలో) ప్రథమైకవచనంలో 'డుజ్' వచ్చి విష్ణు+డుజ్, 'ఉదంతసంస్కృతనామంబు సంబుద్ధి డుజునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు' అనేసూత్రంచేత డుజ్ స్థానంలో ప్లుత మైనఊకారం ఆదేశ మై, విష్ణు+ఊ3. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిసర్వంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అని సంధి జరిగి, విష్ణూ3. 'ఓ యామంత్రణంబునం దగు' అనేసూత్రంచేత ముందు 'ఓ' శబ్దంచేరి, ఓ విష్ణూ3 అని అవుతుంది.

**9. కంధరము :** కంధరా ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి కంధర. ఇది స్త్రీలింగం కాబట్టి స్త్రీలింగకార్యాలు ప్రాప్తిస్తుండగా 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఇది క్లీబతుల్య మయినపక్షంలో ప్రథమావిభక్తి ఏకవచనంలో 'అమహన్నపుంసకముల

కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి కంధరము. బహుళం అనడంచేత క్లీబతుల్యత్వం రానిపక్షంలో సహజంగా స్త్రీలింగం కాబట్టి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి కంధర.

**10. కద్రువ :** కద్రూ ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత హ్రస్వమూ, 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంచేత వువర్ణకమూ వచ్చి కద్రువు అని కావలసిఉండగా, 'కద్రువ నాగమాత' అనేసూత్రంచేత నామము తుదిదీర్ఘానికి హ్రస్వం వచ్చి (కద్రు), 'వ' అనేవర్ణం అంతాగమ మై, కద్రువ- అని అవుతుంది. ఈస్త్రీలింగశబ్దంమీద ప్రథమైకవచనానికి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వచ్చి 'కద్రువ' అనేపదం ఏర్పడుతుంది.

**11. కర్త్రి :** 'కర్తృ' శబ్దం. స్త్రీత్వంలో 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' అనేసూత్రంప్రకారం సంస్కృత స్త్రీప్రత్యయం(ఋన్నేభ్యో జీప్)తో కూడి, 'కర్త్రీ' అనేది తెలుగులో ప్రాతిపదిక అవుతుంది. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి, 'కర్త్రి'. ('స్త్రీలింగంబుల-' అనేసూత్రాన్ని బాధించి) 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైక వచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'కర్త్రి'.

**12. చరిత్ర** : చరిత్ర - ప్రాతిపదిక. దీనిపై ప్రథమైకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి చరిత్రము. 'చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఆమువర్ణకం లోపించి చరిత్ర. బహుళం అనడంచేత మువర్ణకం లోపించనిపక్షంలో చరిత్రము.

**13. జగము :** 'జగత్' అనేశబ్దానికి 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత 'జగత్' ప్రాతిపదిక. 'జగదింద్రజిత్తుల తకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత తకారం లోపించి జగ. ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి, జగము. విభాష కాబట్టి తకారం లోపించనిపక్షంలో(జగత్) 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అని ఉగాగమ (జగత్+ఉ) ద్విత్వాలు (జగత్ త్+ఉ) వచ్చి, 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం (సు) లోపించి. జగత్తు.

**14. దివి :** దివ్ అనేశబ్దానికి 'ద్యుహృచ్ఛబ్దంబులకు దివి హృది యగు' అనేసూత్రంచేత 'దివి' అనేరూపంతో ప్రాతిపదిక నిలుస్తుంది. దీనిపై ప్రథమైక వచనానికి 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రం చేత లోపం వచ్చి 'దివి' అని ఏర్పడుతుంది.

**15. దూత :** దూత ప్రాతిపదిక. ఇది మహద్వాచకం. 'పుంలింగం'. 'దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' అని స్త్రీత్వం వచ్చి, స్త్రీలింగత్వంవల్ల దీనిపై ప్రథమైకవచనం 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని లోపించగా 'దూత' అని అవుతుంది. బహుళం అనడంచేత స్త్రీత్వం రానిపక్షంలో ఈశబ్దం (మహత్) పుంలింగం కాబట్టి 'పుంలింగం బయి మహద్వాచకం బయిన –' అనేసూత్రంచేత ఉత్వమూ(దూతు), 'పుంలింగ మగు మహద్వాచకమునకు –' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో డుఞూ వచ్చి దూతుఁడు అవుతుంది.

**16. దేవశర్మ :** దేవశర్మన్– నకారాంతసంస్కృతశబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని తెలుగులో 'దేవశర్మా' ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి దేవశర్మ. 'ఆత్మేమనిజంతంబులకు నాంతంబు లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' అని స్త్రీత్వం కల్గగా, 'స్త్రీలింగంబుల–' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, దేవశర్మ. బహుళ మనడంచేత స్త్రీత్వం కల్గనపుడు ఇది (మహత్)పుంలింగం కాబట్టి ఉత్వడుఞులు వచ్చి, దేవశర్ముడు.

**17. నావ :** 'నౌ' ప్రాతిపదిక. 'నౌశబ్దంబునకు నావ యగు' అనేసూత్రంచేత 'నౌ' శబ్దానికి 'నావ' అనేది ఆదేశం కాగా నావ. ఇది స్త్రీలింగశబ్దం. కాబట్టి దీనిపై ప్రథమైకవచనానికి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రం చేత లోపం వచ్చి, 'నావ' అని యేర్పడుతుంది.

**18. బాలురు:** బాల– ప్రాతిపదిక. 'పుంలింగం బయి మహద్వాచకం బయిన నామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని ఉత్వం వచ్చి బాలు. ప్రథమా బహు వచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, బాలు+లు. 'అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయిన మహత్తుమీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు' అని లువర్ణకంలోనిలకారానికి రేఫ ఆదేశ మై, బాలురు.

**19. బ్రహ్మ :** బ్రహ్మన్– నకారాంతసంస్కృతశబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని తెలుగులో 'బ్రహ్మా' ప్రాతిపదిక.

'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి, బ్రహ్మ. ఇది మహద్వాచకమూ, పుంలింగమూ కాబట్టి ఉత్వడుజులు రావలసిఉండగా 'మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు' అని స్త్రీత్వం కల్గగా, ఉత్వడుజులు రాక 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'బ్రహ్మ' అని ఏర్పడుతుంది.

**20. భువి :** భూ- ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని రావలసినహ్రస్వం' 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు'. అని రాకుండగా 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అని ప్రథమైకవచనంలో వుప్రత్యయం వచ్చి 'భూవు' అని కావలసిఉంది. కాని 'పృథ్వీవాచి భూశబ్దంబునకు భువి యగు' అనేనిపాతసూత్రంచేత 'భువి' అనే(ప్రాతిపదిక)రూపం ఏర్పడగా 'ఇగ్లౌరాయుగంతంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, 'భువి' (భూమి) అని అవుతుంది.

**21. భ్రాత :** భ్రాతృ ప్రాతిపదిక. ఋకారాంతం. (మహద్వాచకం) పుంలింగం. 'ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' అనేసూత్రంచేత ఋకారంస్థానంలో హ్రస్వ మయిన 'అ' కారం ఆదేశంగా వచ్చి (భ్రాత), స్త్రీవద్భావం కల్గగా (డుజు రాకుండా) 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపించి, భ్రాత- అని అవుతుంది.

**22. భ్రూవు :** భ్రూ- ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని రావలసినహ్రస్వం 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' అనేసూత్రంచేత రాదు. భ్రూశబ్దంపై ప్రథమావిభక్తి ఏకవచనంలో 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అని వు ప్రత్యయం వచ్చి - భ్రూవు.

**23. మనసు :** మనస్ శబ్దం.'హలంతంబు ప్రథమైకవచనాంత -' అనేసూత్రాన్ని బాధించి 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రం చేత 'మనస్' అనేసకారాంతమె ప్రాతిపదిక మై, చివరిసకారం లోపించి - మన. ఇది అదంతనపుంసకలింగశబ్దం కాబట్టి దీనిపై ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనే సూత్రంచేత ముప్రత్యయం వచ్చి మనము.

బహుళం గాబట్టి సకారం లోపించనిపక్షంలో 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమం వస్తుంది. ద్విత్వం మాత్రం 'మనః ప్రభృతులసకారంబునకు ద్విరుక్తి విభాష నగు' అని వికల్పం. ద్విత్వం వస్తే -

మనస్సు. విభాష కాబట్టి ద్విత్వం రాకుంటే – మనసు. 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపిస్తుంది. మనస్సు, మనసు.

**24. మిత్రుఁడు :** మిత్ర– ప్రాతిపదిక. మహద్వాచక మయినయీశబ్దం స్నేహితుడు అనేఅర్థంలో నపుంసకలింగం.' క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు' అని పుంలింగతుల్యం కాగా, 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని ఉత్వం వచ్చి మిత్రు. ప్రథమైకవచనంలో 'పుంలింగ మగు మహద్వాచకమునకు డు జగు' అని డుజు రాగా, 'జిత్తు బిందుపూర్వం బగు' అని ముందు బిందువుతో మిత్రుఁడు, మిత్రుండు. విభాష అనడంచేత పుంలింగతుల్యం కానిపక్షంలో ఇది సహజంగా నపుంసకలింగం గాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి – మిత్రము.

**25. ముదము :** 'ముద్'– దకారాంతసంస్కృతశబ్దం. 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రంచేత దీనికి తెలుగులో ముదమ్ అనేది ప్రాతిపదిక. 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అని మకారం లోపించి ముద. ఈశబ్దం స్త్రీలింగం గాబట్టి దీనిపై ప్రథమైకవచనానికి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని లోపం రావలసిఉండగా ఆసూత్రాన్ని బాధించి 'ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు' అనేసూత్రంచేత లోపం రాదు. ఇది (అదంత మైన) అమహత్తు కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి ముదము.

**26. రాజు :** రాజన్ శబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబు –' అని తెలుగులో రాజా అనేది ప్రాతిపదిక మై నామంబులతుదిదీర్ఘానికి హ్రస్వమూ, తుదిఅత్వానికి ఉత్వమూ, పైన డుజులతో రాజుఁడు అని కావలసిఉంది. కాని 'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' అనే నిపాతసూత్రంచేత రాజన్ ప్రాతిపదిక అయి, అందులో చివరినకారం లోపించి (రాజ), అత్వానికి ఉత్వ మై (రాజు), జకారానికి దంత్యత కలిగి, స్త్రీత్వం కల్గగా స్త్రీలింగతచేత 'స్త్రీలింగంబుల – అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'రాజు' అని అవుతుంది.

**27. రాముఁడు :** రామ– ప్రాతిపదిక. 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అని చివరిఅత్వానికి ఉత్వం వచ్చి

రాము. దీనిపై ప్రథమైకవచనంలో 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అని డుజ్ ప్రత్యయం వచ్చి, రాము+డుజ్. 'జిత్తు బిందుపూర్వం బగు' అని డువర్ణానికి పూర్వంలో అరసున్న వస్తే, రాముఁడు. నిండుసున్న వస్తే, రాముండు.

**28. రాముని(ని) :** రామ- ప్రాతిపదిక. 'పుంలింగం బయి మహద్వాచకం బయిన -' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి, రాము. దీనిపై ద్వితీయాఏకవచనంలో 'నువర్ణంబు ద్వితీయ' అని నువర్ణకం వచ్చి, 'రాము+ను'. 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' అని నిగాగమం రాగా, రాముని+ను. 'ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తుల- అనేసూత్రంచేత నువర్ణకంలోనిఉత్వం ఇత్వ మై, రామునిని. విభాష గాబట్టి నిగాగమం రానిపక్షంలో రాము+ను అని ఉండగా 'డుమంతంబు మీఁదినువర్ణంబునుత్వంబున కిత్వం బగు' అని ఇత్వం వచ్చి రాముని.

**29. రామునకును :** రామ- ప్రాతిపదిక. 'పుంలింగ బయి మహద్వాచకం బయిన -' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి, రాము. దీనిపై షష్ఠీఏకవచనంలో 'కు యొక్క లోపల షష్ఠి' అని కువిభక్తి రాగా, రాము+కు. 'తృతీయాదులకు నుగాగమం బగు' అని కువిభక్తిపై 'ను' ఆగమంగా చేరి, రాము+కును. 'కువర్ణకంబు పరం బగునపు డుకారబుకారంబులకు నగాగమం బగు' అనేసూత్రాన్ని బాధించి 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష' నగు అని నిగాగమం వచ్చి, రాముని+కును. 'ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తుల -' అనేసూత్రంచేత ముందు 'కు' లో తర్వాత 'ను' లో ఉత్వానికి ఇత్వం వచ్చి - రామునికిని. విభాష గాబట్టి నిగాగమం రానిపక్షంలో రాము+కును అని ఉండగా 'కువర్ణకంబు పరం బగునపు డుకార' అనేసూత్రంచేత నగాగమం వచ్చి- రామునకును.

**30. రాములార :** రామ- ప్రాతిపదిక. 'పుంలింగం బయి మహద్వాచకం బయిన - అనేసూత్రంచేత ఉత్వం వచ్చి, రాము. సంబోధనార్థంలో ప్రథమావిభక్తి బహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి రాములు. 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అని లువర్ణకం మీద 'ఆర' అని ఆగమ మై, రాములు+ఆర. 'అంద్వగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి, రాములార.

**31. రో-రై :** రై-ప్రాతిపదిక. 'రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు'

అనేసూత్రంచేత 'రై' లోని ఐ కారానికి 'ఓ' కారం ఆదేశం కాగా, రో. విభాష కాబట్టి ఓత్వం రానిపక్షంలో రై. వీటిపై ప్రథమావిభక్తి ఏకవచనానికి 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని లోపం రాగా, రో– రై అని ఏర్పడతాయి. (ఇలాగే–గ్లో–గ్లౌ)

**32. వజ్రాలు :** వజ్ర– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, వజ్ర+లు. 'వానికి మువర్ణకేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు' అని ముగాగమం వచ్చి, వజ్రములు. 'లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాష నగు' అని మువర్ణం లోపించి (వజ్ర+లు),దానికి ముందరిఅత్తుకు దీర్ఘం వచ్చి, 'వజ్రాలు' అవుతుంది. 'విభాష' అనడంచేత ఈలోపదీర్ఘాలు రానిపక్షంలో 'వజ్రములు' అని ఉంటుంది.

**33. వనమందును :** వన– ప్రాతిపదిక. సప్తమీఏకవచనంలో 'అందు న సప్తమి' అని అందుప్రత్యయం వచ్చి, వన+అందు. 'తృతీయాదులకు నుగాగమం బగు' అని అందుకు చివర 'ను'వర్ణం ఆగమ మై, వన+అందును. 'వానికి మువర్ణకేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు' అని ప్రాతిపదికకు చివర మువర్ణం ఆగమ మై, వనము+ అందును అని ఉండగా (ఉత్వసంధిని బాధించి) 'ఉకారఋకారముల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రాన్ని బాధించి 'ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమంబు విభాష నగు' అని నకారం చేరి వనమున్+అందును. వనమునందును. విభాష గాబట్టి నుగాగమం రానిపక్షంలో (వనము+అందును) 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అని సంధి జరిగి, వనమందును.

**34. వనమునుండి :** వనశబ్దంపై అపాయార్థంలో 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు' అనేసూత్రంచేత 'వలన' ప్రత్యయ మై, వనమువలనన్. 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపై ఉండిపదం చేరి, వనమువలనన్+ఉండి. 'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగా నగు' అని వలనకు ద్వితీయావిభక్తి వచ్చి వనమును+ఉండి – వనమునుండి. సప్తమి వచ్చినపక్షంలో వనమందుండి, లేదా వనముననుండి. ప్రాయిక మనడంచేత ద్వితీయాసప్తములు రెండూ రాకుండా అరుదుగా వనమువలననుండి అని పంచమి అలాగే ఉండవచ్చు. 'ఉండి' కూడా

రాకపోతే, వనమువలనన్.

**35. వాకు :** 'వాచ్' చకారాంతసంస్కృతశబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంత తుల్యం బిందు నామం బగు' అని తెలుగులో 'వాక్' అని ప్రాతిపదిక. 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అని ఉగాగమం వచ్చి, ద్విత్వం గూడా నిత్యంగా రావలసిఉండగా దాన్ని బాధించి 'దీర్ఘముమీఁదిహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ద్విత్వం వచ్చి 'వాక్కు'. బహుళం అనడంచేత ద్విత్వం రానిపక్షంలో (ఉగాగమంతో) వాకు. 'ఇగ్లొరాయుగంతంబుల' అనేసూత్రంచేత వీటిపై ప్రథమైకవచనం లోపించి– వాక్కు, వాకు అని అవుతాయి.

**36. విధము :** విధా ప్రాతిపదిక. 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అనేసూత్రంలో బహుళగ్రహణంచేత 'విధాశబ్దంబునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు' కాబట్టి ఇది నిత్యంగా క్లీబతుల్యం అవుతుంది. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని దీర్ఘానికి హ్రస్వం వచ్చి విధ. క్లీబతుల్యత్వంవల్ల ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి విధము.

**37. విధాతృఁడు :** విధాతృ–ప్రాతిపదిక. 'ఋకారాంతంబున కత్వంబును స్త్రీ వద్భావంబు నగు' అనేసూత్రాన్ని బాధించి 'విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వస్త్రీవద్భావంబులు విభాష నగు' అనేసూత్రంచేత ఋకారంస్థానంలో అత్వం వచ్చి (విధాత), స్త్రీవద్భావం కల్గగా, దీనిపై ప్రథమైక వచనానికి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని లోపం వస్తుంది. విధాత. విభాష అనడంచేత అత్వస్త్రీవద్భావాలు రానిపక్షంలో విధాతృ అని ఉండగా ఇది మహత్తూ, పుంలింగమూ కాబట్టి 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అని ప్రథమావిభక్తి ఏకవచనంలో డుజ్ వచ్చి, 'జిత్తు బిందుపూర్వం బగు' అని ముందు బిందువుతో విధాతృఁడు, విధాతృండు.

**38. వినుఁడు బాలకులు :** బాలకులు అనే బహువచనాంత (సంబోధ్యవాచకం) (మీరు) వినుఁడు అనేమధ్యమపురుషక్రియతో అన్వయం కలిగిఉండడంవల్ల 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అనేసూత్రాన్ని బాధించి 'మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు' అనేసూత్రంచేత 'ఆర' అనేది ఆగమంగా చివర చేరి, బాలకులు+ఆర. 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, బాలకులార. విభాష అనడంచేత ఆరగాగమం రానిపక్షంలో వినుఁడు బాలకులు.

**39. విశ్వకర్మ :** విశ్వకర్మన్ శబ్దం. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని 'విశ్వకర్మా' ప్రాతిపదిక. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి, విశ్వకర్మ. ఇది మహత్తు కావటంతోపాటు పుంలింగం కూడా కావడంవల్ల ప్రథమైకవచనంలో ఉత్వడుజులు వచ్చి, విశ్వకర్ముఁడు అని కావలసిఉండగా, 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అనేసూత్రంచేత స్త్రీత్వం కలిగి, దానివల్ల 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపించి విశ్వకర్మ అని అవుతుంది.

**40. విష్ణువు :** విష్ణు- ప్రాతిపదిక. దీనిపై ప్రథమావిభక్తిఏకవచనంలో ('పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనేసూత్రాన్ని బాధించి) 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రాన్ని బాధించి 'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకంబు బహుళంబుగా నగు' అని వువర్ణకం వచ్చి విష్ణువు. బహుళం అనడంచేత వువర్ణకం రానిపక్షంలో 'పుంలింగ మగు-' అనేసూత్రంచేత డుజు వచ్చి, విష్ణుఁడు.

**41. వృక్షమ్ము :** వృక్ష ప్రాతిపదిక. దీనిపై ప్రథమావిభక్తిఏకవచనంలో 'అమహ న్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి-వృక్షము. 'మువర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు' అని మువర్ణకానికి మాముడి రాగా, వృక్షమ్ము. మాముడి రానిపక్షంలో 'ంబు' ఆదేశ మై, వృక్షంబు. విభాష అనడంచేత ఈరెండూ రానిపక్షంలో వృక్షము.

**42. వృద్ధు:** వృద్ధ- ప్రాతిపదిక.'పుంలింగం బయి మహద్వాచకం బయిన నామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని ఉత్వం వచ్చి, వృద్ధు. దీనిపై ప్రథమైక వచనంలో 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అని డుజ్ ప్రత్యయం వచ్చి, వృద్ధు+డుజ్ అని ఉండగా 'వృద్ధాదులడుజునకు లోపంబు విభాష నగు' అని డుజు లోపించగా వృద్ధు, అనే ప్రథమైకవచనాంతపదం సిద్ధిస్తుంది. విభాష అనడంచేత డుజ్ లోపించనిపక్షంలో, వృద్ధుఁడు.

**43. సురలు :** సుర- ప్రాతిపదిక. మహద్వాచకమూ పుంలింగమూ ఐన ఈశబ్దానికి ఉత్వాదిపుంలింగకార్యాలు రావలసిఉండగా 'సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యము లగు, సంస్కృతసమాసంబునఁ గావు' అనేసూత్రంచేత స్త్రీతుల్యం అవుతుంది. కాబట్టి ఉత్వం రాదు. "స్వర్గివాచి దేవసుర శబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపబడు' అని బహువచనంలోనే ప్రయోగింపబడుతుంది. కాబట్టి ప్రథమావిభక్తిలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, సురలు.

**44. హనుమానుఁడు :** హనుమత్ శబ్దం. 'మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రాన్ని బాధించి 'ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాష నగు' అనేసూత్రంచేత 'హనుమత్' అని ప్రాతిపదిక మై, తకారంస్థానంలో 'ఆన' అనేది ఆదేశ మై, హనుమ+ఆన. 'అంద్వవగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత నిత్యసంధి జరిగి హనుమాన. 'పుంలింగం బయిమహద్వాచకం బయిననామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని ఉత్వమూ, 'పులింగ మగు మహద్వాచకమునకు డు జగు' అని డుజూ వచ్చి, ముందు బిందువుతో హనుమానుఁడు అని అవుతుంది. విభాష కాబట్టి ఆనాదేశం రానిపక్షంలో 'మతుబాదికంబు –' అనేసూత్రంచేత 'హనుమంతమ్' ప్రాతిపదిక ఐ, తుదిమకారం లోపించి, ఉత్వడుజులతో హనుమంతుఁడు అని అవుతుంది.

**45. హరి :** హరి– ప్రాతిపదిక. దీనిపై ప్రథమైకవచనానికి ('పుంలింగ మగు మహద్వాచకమునకు డు జగు' అనే సూత్రాన్ని బాధించి) 'ఇగ్గౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వచ్చి, 'హరి' అనే ప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**46. హరులు :** హరి– ప్రాతిపదిక. దీనిపైన ప్రథమావిభక్తిబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని 'లు'ప్రత్యయ మై, హరి+లు 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అని ప్రాతిపదిక చివరి ఇత్వానికి ఉత్వ మై, హరులు.

**47. హృద్యం బగువిద్య :** విద్య అనేవిశేష్యం స్త్రీలింగం. దీనికి విశేషణ మైన హృద్యశబ్దం గూడా 'విశేష్యంబునకుం బోలె విశేషణంబులకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రంప్రకారం స్త్రీలింగంలో ఉంటుంది. 'మహతీతరంబు లగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ గ్లీబత్వంబు విభాష నగు' అని విశేషణానికి క్లీబత్వం కల్లగా 'అమహన్నపుంసకముల కందంతములకు ముపర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి, హృద్యము అగు విద్య. విభాష కాబట్టి క్లీబత్వం రానిపక్షంలో విశేష్యా న్ననుసరించి విశేషణం స్త్రీలింగంలో ఉండి 'స్త్రీలింగంబుల–' అని ప్రథమైకవచనం లోపించగా – హృద్య అగు విద్య.

## ఆచ్ఛికపరిచ్ఛేదం

**1. అఱితిని:** అఱ్ఱు–ప్రాతిపదిక. దీనిపై ద్వితీయా–ఏకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అని 'ను' ప్రత్యయం వచ్చి, 'అఱ్ఱు+ను' 'అఱ్ఱు మొద లగుశబ్దముల కంతాగమంబు తివర్ణంబును, రేఫంబున కొక్కటికి లోపంబు నగు' అనేసూత్రంచేత అఱ్ఱుశబ్దానికి పైన 'తి' అనేఔపవిభక్తికం ఆగమంగా వచ్చి (అఱ్ఱు+తి), 'అఱ్ఱు' లో ఒకశకటరేఫ లోపించగా– అఱు+తి+ను, అవుతుంది. 'టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంచేత తివర్ణానికి ముం దున్న ఉత్వం స్థానంలో 'ఇ'త్వం ఆదేశంగా వచ్చి, 'అఱితి+ను'. 'ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంచేత చివరినువర్ణకంలో ఉత్వానికి ఇత్వం వచ్చి – అఱితిని అని అవుతుంది.

**2. ఆంధ్రు :** ఆలు– ప్రాతిపదిక. దీనిపై ప్రథమాబహువచనంలో లు ప్రత్యయం చేరి, ఆలు+లు. 'ఆల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును, ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు' అనేసూత్రంచేత బహువచనం ఐన లకారంస్థానంలో రేఫం వచ్చి (ఆలు+రు), దానికి ముం దున్న 'లు'వర్ణం స్థానంలో 'ండ్' అనేది అదేశంగా వచ్చి ఆంధ్రు. అరసున్నతో 'ఁడ్' అనేది ఆదేశం అయినా 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు' అనేసూత్రంచేత అరసున్నకు నిండుసున్న వచ్చి, ఆంధ్రు అనే అవుతుంది. (ఆఁధ్రు అని ఉండదు.)

**3. కలఁకులు:** కలను– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, కలను + లు. 'కలన్వాదులనువర్ణంబు కు జగు, బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు' అనేసూత్రంచేత ను వర్ణానికి 'కుజ్' ఆదేశ మై, కలకుజ్ లు. 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత 'కు' వర్ణానికి ముందు అరసున్న వచ్చి, కలఁకులు. నిండుసున్న వస్తే–కలంకులు.

**4. కలుకులు**: కలికి– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, కలికి+లు. 'వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరం బగునపు డుత్వం బగు' అనేసూత్రంచేత ఉపోత్తమేత్వానికి ఉత్వం వచ్చి, కలుకి+లు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అని చివరియిత్త్వానికి ఉత్వం వచ్చి, కలుకులు.

**5. కూఁతురు:** కూఁతు ప్రాతిపదిక. 'అచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ

స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయి యుండు' అనేసూత్రంచేత ఇది స్త్రీసమం. దీనిపై ప్రథమైకవచనం 'స్త్రీలింగంబుల–' అనేసూత్రంచేత లోపించవలసిఉండగా 'కూఁతుశబ్దముప్రథమైకవచనంబునకు రువర్ణకం బగు' అనేసూత్రంచేత 'రు' ప్రత్యయం వచ్చి, కూఁతురు.

**6. కొడవండ్లు :** కొడవలి– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, కొడవలి + లు. 'ఔపవిభక్తింబుల లివర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' అని లివర్ణంస్థానంలో 'ండు' వచ్చి, కొడవండులు. 'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించి, కొడవండ్లు. ఉల్లోపం రాకుంటే, కొడవండులు. 'ండు' రాకపోతే – కొడవలులు (కొడవళులు, కొడవళ్లు) మొ.

**7. కొడవండ్లులు:** కొడవలి– ప్రాతిపదిక. 'ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యం బయి బహువచనంబు నెనయు' అనేసూత్రంచేత 'కొడవండ్లు' అనేరూపాన్ని పొందుతుంది. దీనిపై అన్ని విభక్తుల్లోనూ బహువచనాలు మాత్రమె వస్తాయి. ప్రథమావిభక్తిలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత లువర్ణం వచ్చి – 'కొడవండ్లులు'.

**8. *గండండ్రు*:** గండ – ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, గండ+లు. 'కొన్ని డుమంతంబుల బహువచన లకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వకడకారంబు నగు' అనేసూత్రంచేత, లువర్ణకలకారానికి రేఫం ఆదేశ మై (గండ+రు), ఆరేఫకు ముందు 'ండ్' అనేది చేరి, గండండ్రు. (అరసున్నతో 'ఁడ్' ఆగమ మైనా 'సమానపదంబునందు' అనేసూత్రంచేత ఆఅరసున్న నిండుసున్న ఐ, గండండ్రు అనే అవుతుంది. గండఁడ్రు అని ఉండదు.)

**9. గోరను :** గోరు– ప్రాతిపదిక. సప్తమీఏకవచనంలో 'అందు న సప్తమి' అనేసూత్రంచేత అందు ప్రత్యయం వచ్చి, గోరు+అందు. 'ఊరు మొద లగువాని కిత్వం బగు' అనేసూత్రంచేత ఇత్వం వచ్చి, ఊరి+అందు. 'ఔపవిభక్తికంబుల తృతీయా సప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత అందుస్థానంలో అత్వం ఆదేశంగా వచ్చి, 'గోరి+అ'. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి – గోర. 'తృతీయాదులకు నుగాగమం బగు' అని నుగాగమ మై, గోరను.

అత్వం రానిపక్షంలో, గోరియందును.

**10. చుట్టలు:** చుట్ట– ప్రాతిపదికం. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత లువర్ణకం వచ్చి, చుట్ట+లు 'వానికి ముపర్ణకేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగం బగు' అని ముగాగమం వచ్చి, చుట్టములు. 'బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులతుదియక్షరంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత ముపర్ణం లోపించి చుట్టలు. విభాష అనడంచేత లోపించనిపక్షంలో– చుట్టములు (చుట్టాలు).

**11. చెయువుఱు:** చెయువు– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, చెయువు+లు. 'చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు' అనేసూత్రంచేత 'లు' వర్ణకలకారానికి శకటరేఫ ఆదేశ మై, చెయువుఱు. విభాష అనడంచేత అలఘురేఫ రానిపక్షంలో, చెయువులు.

**12. చేలు** : చేను– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, చేను+లు. 'బహువచనంబు పరం బగునపుడు చేను పేను మీను శబ్దంబుల నువర్ణంబు లోపించు' అని 'ను'వర్ణం లోపించి, చేలు. (ఇలాగే పేను+లు–పేలు, మీను+లు=మీలు)

**13. తేంట్లు :** తేఁటి ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత లువర్ణకం వచ్చి, తేఁటి+లు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అని ఉత్వం వచ్చి, తేఁటులు. 'బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించి, తేఁట్లు, (దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేసూత్రాన్ని బాధించి) "సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు' అనేసూత్రంచేత అరసున్నకు నిండుసున్న వచ్చి 'తేంట్లు' అని అవుతుంది.

**14. త్రాళ్ళు :** త్రాడు– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రంచేత లువర్ణకం వచ్చి, త్రాడు+లు. 'బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించగా, త్రాడ్లు. 'బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకారలకారంబుల కలఘులకారము నిత్యముగా నగు' అని డకారానికి ళకారం ఆదేశ మై, త్రాళ్లు అని అవుతుంది.

**త్రాళులు :** బహుళంగా గాంబట్టి ఉత్వం లోపించనిపక్షంలో త్రాడులు అని ఉండగా 'బహువచనము పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలరల కలఘులకారంబు బహుళంబుగా నగు' అని డకారానికి ళకార మై, త్రాళులు. బహుళం గాబట్టి ళకారం రాకుంటే, త్రాడులు.

**15. పందిళులు:** పందిరి- ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లుప్రత్యయం చేరి, పందిరి+లు. 'వికృతియం దికారాంతముల యుపోత్తమేత్వంబునకు బహువచనము పరం బగునపు డుత్వం బగు' అని ఉపోత్తమేత్వానికి రావలసినఉత్వం 'రలడోపధనవార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు' అనేసూత్రంచేత రాదు. 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అని చివరియిత్వం ఉత్వ మై, పందిరులు. 'బహువచనంబు పరం బగునపు డసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలరల కలఘు లకారంబు బహుళంబుగా నగు' అని రేఫకు ళకారం వస్తే, పందిళులు. బహుళం గాబట్టి ళకారం రాకుంటే, పందిరులు.

**16. పగతురు :** పగత- ప్రాతిపదిక, మహ త్తయినయీశబ్దం 'అచ్చికశబ్దంబు లెల్ల-' అనేసూత్రంచేత పుంలింగతుల్యం. కాబట్టి 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబుతుదియత్వంబున కుత్వం బగు' అని ఉత్వం వచ్చి, పగతు. ప్రథమాబహువచనవివక్షలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, పగతు+లు. 'పగతాదుల బహువచనలకారంబునకు రేఫం బగు' అని లువర్ణంలోని లకారానికి రేఫ ఆదేశ మై, పగతురు.

**17. పవలు :** పగలు అనేశబ్దంలోనిగకారానికి 'అపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాష నగు' అనేసూత్రంచేత వకారం ఆదేశ మై, పవలు అవుతుంది. విభాష అనడంచేత వకారం రానిపక్షంలో గకారంతో పగలు అని ఉంటుంది.

**18. మగండు :** మగ- ప్రాతిపదిక. మహద్వాచక మైనయీశబ్దం 'అచ్చికశబ్దంబు లెల్ల -' అనేసూత్రంచేత పుంలింగతుల్యం. కాబట్టి ఉత్త్వడుజులు రావలసిఉండగా 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అనేసూత్రంచేత ఉత్వం రాక, ప్రథమైకవచనంలో డుజ్ ప్రత్యయం వచ్చి, మగ+డుజ్. 'జిత్తు బిందుపూర్వం బగు' అని డువర్ణానికి ముందు అరసున్న వచ్చి, మగండు. నిండుసున్న వస్తే, మగండు.

**19. మగనిని :** మగ- ప్రాతిపదిక. ద్వితీయా ఏకవచనంలో 'నువర్ణంబు

ద్వితీయ' అని నువర్ణకం వచ్చి, మగ+ను. 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' అనేసూత్రాన్ని బాధించి 'అనుదంత మగుతెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగు' అనేసూత్రంచేత నిత్యంగా నిగాగమం రాగా, మగని+ను. 'ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' – అని నువర్ణకంలో ఉత్వానికి ఇత్వం వచ్చి, మగనిని.

**20. ముత్తెము :** ముత్తియ– ప్రాతిపదిక. 'అచ్ఛికశబ్దంబు లెల్ల –' అనేసూత్రం ప్రకారం ఇది క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ముప్రత్యయం వచ్చి, ముత్తియ+ము. 'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ప్రాతిపదిక చివరి 'ఇయ' స్థానంలో 'ఎ'త్వం రాగా, ముత్తెము. బహుళం అనడంచేత ఎత్వం రానిపక్షంలో ముత్తియము.

సూత్రంలోనిబహుళపదంచేత అన్యకార్యంగా 'ముత్తియము' అన్నప్పటి ఇయలోని ఇత్వానికి లోపం రాగా (ముత్‌త్‌యము) ఒకతకారం లోపించి, ముత్యము అవుతుంది.

**21. రేఁగులు :** రేను – ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, రేను+లు 'అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గు జగు' అనేసూత్రంచేత నువర్ణంస్థానంలో గుజ్ ఆదేశ మై, రే+గుజ్+లు 'జిత్తు బిందుపూర్వం బగు' అని గువర్ణానికి ముందు అరసున్న వస్తే, రేఁగులు. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' కాబట్టి నిండుసున్న రాదు. రేంగులు అని ఉండదు. (ఇలాగే గోనులు–గోఁగులు)

**22. రేలు :** రేయి ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, రేయి+లు. 'బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు' అనేసూత్రంచేత 'యి'వర్ణం లోపించగా 'రేలు' అని అవుతుంది.

**23. తేండ్లు :** తే– ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణక మై, తే+లు. 'తేప్రభృతులబహువచనంబునకు ముందు డు జగు' అని లువర్ణానికి పూర్వంలో డుజ్ వచ్చి, తే+డుజ్+లు. 'జిత్తు బిందుపూర్వం బగు' అని డువర్ణానికి ముందు అరసున్న వచ్చి, తేఁడులు. ('దీర్ఘము మీఁద సాధ్యపూర్ణము లేదు'. కాబట్టి ఇక్కడ నిండుసున్న రాదు. తేండులు అని కాదు.) 'బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు

బహుళంబుగా నగు' అని డువర్ణంలో ఉత్తు లోపించి, ఱేఁడ్లు. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేసూత్రాన్ని బాధించి ) 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు' అనేసూత్రంచేత (ఎల్లచో అనడంవల్ల దీర్ఘ మైనా మీద) అరసున్నకు నిండుసున్న వచ్చి, ఱేండ్లు . బహుళం గాబట్టి ఉత్వలోపం రానిపక్షంలో ఱేఁడులు.

**24. విలుకాఱు:** 'విలుకా' ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని లువర్ణకం వచ్చి, విలుకా+లు. 'కాప్రత్యయముమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులను, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబు నగు' అనేసూత్రంచేత లువర్ణలకారంస్థానంలో లఘు (సాధు) రేఫ వచ్చి, విలుకా+రు. ఈసూత్రంచేతనే రేఫకు పూర్వంలో 'ండ్' అనేవర్ణం ఆగమ మై (విలుకాండ్రు), విలుకాండ్రు. లువర్ణకలకారానికి ఇంకొకపక్షంలో లఘురేఫ రాకుండా, అలఘు(శకట)రేఫ ఆదేశం కాగా, విలుకాఱు అని అవుతుంది.

## కారకపరిచ్ఛేదం

**1. అన్ని గుఱ్ఱములకు :** 'గుఱ్ఱములకు' అనేవిశేష్యం షష్ఠీవిభక్తిలో ఉంది. 'విశేష్యంబునకుం బోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రంచేత విశేషణ మైన అన్నిశబ్దానికి గూడ షష్ఠీవిభక్తి రాగా, ఆషష్ఠికి 'సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దానిద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వస్తుంది. 'అన్ని' గుఱ్ఱములకు. ఒకవేళ 'గుఱ్ఱములకు' అనేవిశేష్యమే మొదట ప్రయోగిస్తే విశేష్యం షష్ఠికే ప్రథమ వచ్చి, విశేషణం షష్ఠి అలాగే ఉండగా, 'గుఱ్ఱములు అన్నింటికి' అవుతుంది. బహుళం అన్నాడు కాబట్టి ప్రథమావిభక్తి రాకపోతే 'అన్నిటికి గుఱ్ఱములకు, గుఱ్ఱములకు అన్నిటికి, అని షష్ఠితో రూపాలూ ఉంటాయి.

**2. కోలం గూలనేసె :** కూల నేయడానికి ముఖ్యసాధన మై, కరణ మైన కోలకు – 'చేత వర్ణకంబు హేతుకరణంబులకు– అనేసూత్రంప్రకారం చేత (లేదా తోడ) అనేప్రత్యయం వచ్చి – 'కోలచేత'. 'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అని తృతీయకు ద్వితీయావిభక్తి వచ్చి, 'కోలను– కూలనేసె'. ద్రుతకార్యాలతో 'కోలం గూలనేసె'. బహుళ మనడంచేత ద్వితీయ రానిపక్షంలో తృతీయతో – కోలచేత (కోలతోడ) కూల నేసె.

**3. (నీవు) ధన్యుఁడవు** : నీవు అనేయుష్మదర్థానికి విశేషణ మయిన 'ధన్యుఁ

డు' అనేప్రథమైకవచనాంతంపై 'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగా నగు' అనేసూత్రంచేత 'వు'వర్ణం ఆగమ మై, ధన్యుఁడు+వు 'ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు' అనేసూత్రంచేత పూర్వంలోనిఉత్వానికి అత్వం వచ్చి 'ధన్యుఁడవు' అని అవుతుంది

**4. పూవులు దెచ్చె :** (తెచ్చుట అనేక్రియకు ఫలాశ్రయ మై) కర్మ అయిన పూవు శబ్దానికి 'కర్మంబున ద్వితీయ యగు' అని ద్వితీయావిభక్తి వచ్చి బహుత్వార్థంలో పూవులను అని ఉండగా 'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అని ద్వితీయకు ప్రథమ వచ్చి (బహువచనంలో) పూవులు (దెచ్చె).

**5. బాణంబునఁ గూల్చె** : కూల్చు క్రియకు సాధన మై, కరణ మైనబాణశబ్దానికి 'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అని తోడప్రత్యయం వచ్చి, బాణముతోడ. లేదా 'చేత వర్ణకంబు హేతుకరణంబులకు' అనేసూత్రంచేత చేత వచ్చి బాణముచేత, అని ఉండగా 'ఉదంతజడంబు తృతీయకు నవర్ణకం బగు' అనేసూత్రంచేత తృతీయావిభక్తికి (తోడ-చేత) 'న' అనేసప్తమీవిభక్తి వచ్చి 'బాణమునన్' అవుతుంది. నవర్ణకం రానిపక్షంలో బాణముచేత, లేదా బాణముతోడ.

**6. మాటలు పెక్కు :** ఇక్కడ మాటలు అనేది విశేష్యం. బహువచనంలో ఉంది. కాబట్టి దానికి విశేషణ మైనపెక్కుశబ్దం గూడా 'విశేష్యంబునకుం బోలె విశేషణంబు నకు లింగవిభక్తివచనంబు లగు' అనేసూత్రంచేత బహువచనంతో (ప్రథమావిభక్తి) మాటలు పెక్కులు. 'స్త్రీసమంబు లగువిశేషణంబులయు మువర్ణకాంతవిశేషణంబు లయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు' అని విశేషణ మైన పెక్కు శబ్దానికి ఏకవచనం రాగా, ఇది స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి, మాటలు పెక్కు. బహుళం అనడంచేత ఏకవచనం రానిపక్షంలో బహువచనంతో 'మాటలు పెక్కులు'.

**7. రెండు గుఱ్ఱములకు :** చూ. అన్ని గుఱ్ఱములకు

**8. వనమునుండి :** వనశబ్దంపై అపాయార్థంలో 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు' అనేసూత్రంచేత 'వలన' ప్రత్యయ మై, వనమువలనన్. 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపై ఉండి అనేపదం చేరి వనమువలనన్+ఉండి. 'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగా నగు' అని వలనకు ద్వితీయావిభక్తి

వచ్చి, వనమును+ఉండి = వనమునుండి. సప్తమి వచ్చినపక్షంలో 'వనమందుండి' లేదా 'వనముననుండి'. ప్రాయిక మనడంచేత ద్వితీయాసప్తములు రెండూ రాకుండా అరుదుగా 'వనమువలననుండి' అని పంచమి అలాగే ఉండవచ్చు.

**9. వా రిద్దఱు రుక్మిణీసత్యభామలు** : రుక్మిణీసత్యభామలు అనేవిశేష్యం స్త్రీవాచకం. దానికి విశేషణా లయిన ఆ-రెండు-అనేసర్వనామాలు గూడా ఇక్కడ స్త్రీవాచకాలే. బహుత్వంలో ఉన్నాయి. అమహత్తులు కాబట్టి అమహత్కార్యంతో అవి రెండు (రుక్మిణీసత్యభామలు) అని కావలసిఉండగా 'సర్వనామక్రియాపదంబుల బహువచనంబు మహత్తునకుం బోలె మహతి కగు' అనేసూత్రంచేత మహత్కార్యం కల్గగా వారు ఇద్దఱు (రామకృష్ణులు వలె) అవుతుంది.

**10. వాహనమును దిగెను :** వాహనశబ్దంపై అపాయార్థంలో 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు' అని వలన అనేపంచమి వచ్చి 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అని ద్వితీయ రాగా, వాహనమును. 'మఱి యొకవిభక్తియును' అనేచోటిసముచ్చయంచేత ద్వితీయ రానిపక్షంలో పంచమితో వాహనమువలన దిగెను. (ఇలాగే గృహమును వెడలెను, గృహమువలన వెడలెను.)

**11. సుఖ మున్నారు :** 'సుఖ' శబ్దానికి సహార్థంలో 'కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అని 'తోడ' అనేతృతీయావిభక్తి రాగా సుఖముతోడను. 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అని తృతీయకు ప్రథమావిభక్తి రాగా, ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి, సుఖము+ఉన్నారు. ఉత్త్వసంధి జరిగి, సుఖ మున్నారు. 'విభక్తియు' అనేచోటిసముచ్చయంచేత ప్రథమావిభక్తి రానిపక్షంలో- సుఖముతోడ నున్నారు.

# సమాసపరిచ్ఛేదం

**1. అక్కన్య :** ఆ+కన్య అని ఉండగా 'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత కకారానికి ద్విత్వం వచ్చి ఆ+క్కన్య. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్చికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి అక్కన్య. (సమాస మైనఈ ప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి దీనిపై ప్రథమైకవచనం 'స్త్రీలింగంబుల-' అనేసూత్రం చేత లోపిస్తుంది.)

**2. అచ్చటు–అచ్చొటు** : ఆ+చోటు అని ఉండగా 'త్రికంబుమీఁది..' అనేసూత్రంచేత మీదిహల్లుకు ద్విత్వమూ, 'ద్విరుక్తం బగు..' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వమూ వచ్చి అచ్చోటు. తర్వాత 'కృతహ్రస్వం బగుత్రికంబు మీఁది చోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు' అనేసూత్రంచేత 'చోటు' లో ఓకారంస్థానంలో 'అ'త్వం వస్తే– అచ్చటు; విభాష కావడంవల్ల అత్వం రాకపోతే హ్రస్వం (ఒ) వచ్చి, అచ్చొటు. హ్రస్వం గూడా విభాషే. కాబట్టి అదీ రాకపోతే ఓకారం అలాగే ఉండి 'అచ్చోటు' అని మూడు రూపా లేర్పడతాయి.

**3. అచ్చోన్ :** ఆ+చోటు అని ఉండగా మీదిహల్లుకు ద్విత్వమూ (సమా. 14) ముందరి దీర్ఘానికి హ్రస్వమూ (సమా. 13) వచ్చి అచ్చోటు. ఈసమాసప్రాతిపదికపై సప్తమిఏకవచనవివక్షలో 'అందు' లేదా 'న' అనేప్రత్యయం వచ్చి, చివర ద్రుతంతో 'అచ్చోటియందున్ – అచ్చోటునన్' అని కాగా, 'ఔపవిభక్తికములతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత సప్తమికి అత్వం ఆదేశంగా వచ్చి, (అచ్చోటి+అన్) సంధి జరిగి, అచ్చోటన్ అవుతుంది. తర్వాత 'ఉత్తరపదం బగుచోటశబ్దముటాక్షరమునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత 'ట' లోపిస్తే 'అచ్చోన్'. విభాష కాబట్టి లోపించనిపక్షంలో 'అచ్చోటన్'.

**4. అలరుబోఁడి :** అలరువంటిమేను కలది (స్త్రీ) అనేఅర్థంలో, అలరు, మేను అనేస్త్రీసమశబ్దాలకు 'స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు' అనేసూత్రంచేత బహువ్రీహి సమాస మై, అలరు+మేను అని ఉండగా 'బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁదిమేనునకు బోఁడి యగు' అనేసూత్రంచేత 'మేను' శబ్దంస్థానంలో 'బోఁడి' అనేది ఆదేశంగా వచ్చి 'అలరుబోఁడి' అవుతుంది. ఈసమాసప్రాతిపదిక స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి అలరుబోఁడి.

**5. నల్లనిగుఱ్ఱము :** నల్ల నైనగుఱ్ఱము అనేఅర్థంలో నల్ల అనేవిశేషణానికి గుఱ్ఱము అనేవిశేష్యంతో కర్మధారయసమాస మై, నల్ల+గుఱ్ఱ అని ఉండగా 'గుణవచనంబు లగునల్లాదులకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత 'ని'వర్ణం ఆగమంగా చేరి నల్లనిగుఱ్ఱ. ఈసమాసప్రాతిపదిక క్లీబసమం గాబట్టి 'అమహన్నపుంసకముల' కనేసూత్రంచేత ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి నల్లనిగుఱ్ఱము. బహుళం అనడంచేత నిగాగమం రానిపక్షంలో నల్లగుఱ్ఱము.

**6. నాఁపచేను :** సమాసంలో నాము+చేను అని ఉండగా 'కొండొకచో సమాసంబులందు నామ్వాదికనుమ్వాదులమువర్ణంబులు పఙ్వవర్ణంబు లగు'

అనేసూత్రంచేత మువర్ణకానికి 'పజ్' రాగా (నాపజ్+చేను) 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత పవర్ణానికి ముందు అరసున్న వచ్చి, నాఁపచేను. (ఇట్లె పాము+తేడు = పాఁపతేడు) 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' కాబట్టి ఇక్కడ పూర్ణబిందువు రాదు. (నాంపచేను అని కాదు.)

**7. నిక్కల:** నిక్క మైనకల - అనేఅర్థంలో నిక్కము అనేవిశేషణానికి కల అనేవిశేష్యంలో కర్మధారయసమాస మై, నిక్కము+కల అని ఉండగా, విభక్తిలోపాన్ని బాధించి 'కర్మధారయంబులందు ముపర్ణకంబునకుం బుంపు లగు' అనేసూత్రాన్ని బాధించి 'నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అనేసూత్రంచేత నిక్కములో ఒకకకారమూ, ముపర్ణకమూ లోపించి (నిక్+కల) నిక్కల అని అవుతుంది.

**8. మాత్రపితలు :** మాతృ-పితృ అనేసంస్కృతద్వంద్వసమాసంలో 'ద్వంద్వంబు నందు ఋకారంబునకు రవర్ణంబు విభాష నగు' అనేసూత్రంచేత పూర్వపదం చివరిఋకారం స్థానంలో 'ర' అనేఅక్షరం ఆదేశ మై, మాత్రపితృ. 'ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' అని అత్వస్త్రీవద్భావాలు రాగా ప్రథమాబహు వచనంలో మాత్రపితలు. విభాష అనడంచేత రవర్ణం రానిపక్షంలో సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించి (ఆనజ్ ఋతో ద్వన్ద్వే) అక్కడ ఆనజ్ వచ్చి, మాతాపితృ- మాతాపితలు అవుతుంది.

**9. ముక్కంటి :** మూఁడు కన్నులు కలవాఁడు అనేఅర్థంలో 'మూఁడు కన్ను' అనేశబ్దాలకు 'స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు' అని బహువ్రీహిసమాస మై, 'మూఁడు+కన్ను' అని ఉండగా 'సమానాధికరణం బగునుత్తర పదంబు పరం బగునపుడు మూఁడుశబ్దముదుజ్వర్ణంబునకు లోపంబును, మీఁది హల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంచేత 'ఁడు' లోపించి పైహల్లుకు ద్విత్వం రాగా, మూ+క్కన్ను. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి ముక్కన్ను. 'బహువ్రీహిని సమాసాంతకార్యంబులు గానంబడియెడి' అనేసూత్రంచేత ఈసమాసంచివర 'న్ను' వర్ణానికి 'ంటి' ఆదేశ మై (ఇది స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల' అని ప్రథమైకవచనం లోపించి) ముక్కంటి అవుతుంది.

**10. ముచ్చిచ్చు** : మూఁడు అనేసంఖ్యావాచకవిశేషణానికి చిచ్చులు అనేవిశేష్యంతో సమానాధికరణ(ద్విగు)సమాస మై, మూఁడు+చిచ్చు అని ఉండగా 'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు' అని మూఁడులో 'ఁడు' లోపించి, మీఁదిహల్లుకు ద్విత్వ మై, మూచ్చిచ్చు- అని కాగా 'ద్విరుక్తం బగు హల్లు పరం బగునపుడు - అని

ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, ముచ్చిచ్చు అనే సమాసప్రాతిపదిక యేర్పడుతుంది. బహుత్వార్థాన్నిబట్టి దీనిపై బహువచనం రావలసిఉండగా 'ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగ నగు, మిశ్రంబునకుఁ గాదు.' అనేసూత్రంచేత ఏకవచనం వస్తుంది. ఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి దీనిపై ప్రథమైకవచనం 'స్త్రీలింగంబుల–' అనేసూత్రం చేత లోపించి ముచ్చిచ్చు అనేపదం ఏర్పడుతుంది.

**11. ముజ్జగములు** : మూఁడు అనేసంఖ్యావిశేషణానికి జగములు అనే విశేష్యంతో సమానాధికరణ(ద్విగు)సమాస మై, 'మూఁడు+జగ' అని ఉండగా 'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు' అనేసూత్రంచేత మూఁడు లో 'ఁడు' లోపించి, మీఁదిహల్లుకు ద్విత్వ మై, మూజ్జగ. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, ముజ్జగ. ఈసమాసప్రాతిపదికపై ప్రథమావిభక్తిలో బహుత్వార్థాన్నిబట్టి బహువచనం రాగా (మూడు–అచ్ఛికం. జగము–తత్సమం గాబట్టి ఈద్విగువు మిశ్రం. కాబట్టి 'మిశ్రంబునకు గాదు' అని ఏకవచనం రాదు.) ముజ్జగములు.

# తద్ధితపరిచ్ఛేదం

**1. అందగాఁడు :** అందము కలవాడు అనేఅర్థంలో అందము అనేప్రథమాంత శబ్దం మీద 'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వ స్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' అనేసూత్రంచేత 'కా' అనేప్రత్యయం వచ్చి, అందము+కా. 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి లోపించి, అంద+కా. 'కాకత్తియలకకారంబునకు గకారంబు కొండొకచో గానంబడియెడి' అనేసూత్రంచేత కకారానికి గకార మై, అందగా. ఈతద్ధితాంతప్రాతిపదిక 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల–' అని పుంలింగతుల్యం. కా ప్రత్యయం మగాదులలో చేరింది. కాబట్టి ప్రథమైకవచనంలో 'మహత్తు లగుమగాదులకు –' అనేసూత్రంచేత డుజ్ ప్రత్యయం వచ్చి, ముందు బిందువుతో 'అందగాఁడు'.

**2. ఉక్కీఁడు :** ఉక్కివము కలవాడు అనేఅర్థంలో ఉక్కివము అనే ప్రథమాంత శబ్దంమీద మతుబర్థంలో 'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అనేసూత్రంచేత ఈ అనేప్రత్యయం వచ్చి, ఉక్కివము+ఈ. 'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత విభక్తి లోపించి, ఉక్కివ+ఈ. 'ఉక్కివంబునకు వలోపంబు నగు' అనేసూరి వివరణా న్ననుసరించి వవర్ణం లోపించి ఉక్కి+ఈ. 'అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపుడు'

అనేసూత్రంచేత సంధి జరిగి, ఉక్కీ. ఈతద్ధితాంతప్రాతిపదిక పుంలింగతుల్యం. ఈప్రత్యయం మగాదులలోది. కాబట్టి 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు' అనేసూత్రంచేత డుజ్ ప్రత్యయం వచ్చి ముందు బిందువుతో -ఉక్కీఁడు.

**3. ఓయారి:** ఓయారము కలిగినది (కలిగినవాడు) అనేఅర్థంలో ఓయారము అనేప్రథమాంతశబ్దంమీద 'ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు' అనేసూత్రంచేత ఇ ప్రత్యయం వచ్చి, ఓయారము+ఇ. 'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత ముఖవిభక్తి లోపించి, ఓయార+ఇ. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, ఓయారి. ఈతద్ధితాంతప్రాతిపదిక 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంచేత స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అని ప్రథమైకవచనం లోపించి 'ఓయారి' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**4. కమికెఁడు :** కమికిలి అనేశబ్దంమీద పరిమాణార్థంలో (కమికిలి పరిమాణం కలది అనేఅర్థంలో) 'మానార్థంబున కేకత్వంబునం దెఁడు వర్ణకం బగు' అనేసూత్రంచేత ఎఁడు ప్రత్యయం వచ్చి, 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి లోపించి, కమికిలి+ఎఁడు. 'ఎఁడువర్ణకంబు పరం బగునపుడు లివర్ణంబు లోపించు' అనేసూత్రం చేత లివర్ణం లోపించి, కమికి+ఎఁడు. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, కమికెఁడు. ఈతద్ధితాంతప్రాతిపదిక స్త్రీసమం. కాబట్టి ఉదంత మైనా, 'స్త్రీలింగంబుల-' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'కమికెఁడు' అనేపదం ఏర్పడుతుంది.

**5. గుబ్బెత:** గుబ్బలు కలిగినది (యువతి) అనేఅర్థంలో గుబ్బలు అనేప్రథమాంతశబ్దంమీద 'యువతి విటీ రజస్వలలు గుబ్బెత, మిండత, ముట్టుతలు నాఁబడుదురు' అనేనిపాతసూత్రంచేత మతుబర్థంలో 'త' ప్రత్యయం వచ్చి, (గుబ్బలు+త) విభక్తి లోపించి, (గుబ్బ+త) ముందరిఅత్త్వానికి ఎత్త్వం వచ్చి, 'గుబ్బెత' అని అవుతుంది. తద్ధితాంత మైనఈప్రాతిపదిక 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అని స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపించి 'గుబ్బెత' అనేపదం ఏర్పడుతుంది.

**6. చిఱుతుక :** చిఱుత అనేప్రాతిపదికమీద అదే అర్థంలో అంటే స్వార్థంలో 'ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు' అని ఉక ప్రత్యయం వచ్చి, చిఱుత+ఉక, 'అంద్వవగాగమంబులం దప్ప' అనేసూత్రంచేత సంధి జరిగి 'చిఱుతుక'. తద్ధితాంత మయినఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అని స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం

లోపించి 'చిఱుతుక' అనేపదం ఏర్పడుతుంది.

**7. చెంచెత :** చెంచు జాతికి చెందినస్త్రీ అనేఅర్థంలో కులవాచక మైన చెంచు అనేప్రథమాంతశబ్దంమీద 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు' అనేసూత్రంచేత 'త' ప్రత్యయం వచ్చి, చెంచు+త. 'తవర్ణకంబు పరం బగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు' అని ముందరిఉత్వానికి ఎత్వం వచ్చి, చెంచెత. ఈతద్ధితాంతప్రాతిపదిక స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల–' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, 'చెంచెత' అనే పదం ఏర్పడుతుంది.

**8. జాలరి:** జాల కలిగినవాడు అనేఅర్థంలో జాల అనేప్రథమాంతశబ్దం మీద 'అరి వర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు' అని అరి ప్రత్యయం వచ్చి 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి (సు) లోపించి, జాల+అరి. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి జాలరి. ఈతద్ధితప్రత్యయాంత ప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల–' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, ' జాలరి' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**9. తొత్తఱికము :** తొత్తుయొక్క భావం అనేఅర్థంలో తొత్తుయొక్క అనే షష్ఠ్యంతం మీద 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రాన్ని బాధించి, 'చిన్నాదులకు ఱిక వర్ణకం బగు' అని ఱిక ప్రత్యయం వచ్చి, తొత్తుయొక్క+ఱిక. 'సమాసవిభక్తికి లోపం బగు' అని యొక్కవిభక్తి లోపించి, తొత్తు+ఱిక. 'ఉత్వంబున కత్వంబు ఱికంబు పరం బగునపు డగు' అని ముందరిఉత్వానికి అత్వం వచ్చి, తొత్తఱిక. ఈతద్ధితాంతప్రాతిపదిక 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంచేత క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు' అనేసూత్రంచేత ము ప్రత్యయం వచ్చి, తొత్తఱికము అవుతుంది. ('ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనేలక్షణంప్రకారం ఒకపక్షంలో 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అని తన ప్రత్యయం వస్తే 'తొత్తుఁదనము' అవుతుంది.)

**10. మగఁటిమి :** మగనియొక్క భావం అనేఅర్థంలో మగనియొక్క అనే షష్ఠ్యంతశబ్దంమీద 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రాన్ని బాధించి మగఁ టిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అనేసూత్రం ప్రకారం టిమిజ్ అనేప్రత్యయం వచ్చి, ముందు బిందువు వచ్చి, 'మగనియొక్క' అనేదానిలో 'నియొక్క' అనేభాగం లోపించి, మగఁటిమి అని అవుతుంది. ఈతద్ధితాంతప్రాతిపదిక (స్త్రీసమం) కాబట్టి 'స్త్రీలింగంబుల' అని ప్రథమైకవచనం లోపించి మగఁటిమి అనేపదం ఏర్పడుతుంది. ఒకపక్షంలో 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అని తన ప్రత్యయం

వస్తే మగతనము.

**11. ముక్కిఁడి :** ముక్కు (లేకపోవుట కలవాడు) లేనివాడు అనేఅర్థంలో ముక్కు అనేప్రథమాంతశబ్దంమీద మతుబర్థంలో 'ముక్కు లోనగువానికిం దదభావద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడి వర్ణకం బగు' అనేసూత్రంచేత 'ఇఁడి' అనేప్రత్యయం వచ్చి, ముక్కు+ఇఁడి, 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి లోపించి, (ముక్కు+ ఇఁడి) (ఉత్త్వసంధిని బాధించి) 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, ముక్కిఁడి. తద్ధితాంత మైనఈప్రాతిపదిక స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, ముక్కిఁడి అనేపదం ఏర్పడుతుంది.

**12. మోకాలిబంటి :** మోకాలియొక్క (లోతు) పరిమాణము కలది అనేఅర్థంలో మోకాలియొక్క అనేషష్ఠ్యంతశబ్దంమీద 'దఘ్నార్థంబున బంటి కొలఁదు లగు' అనే సూత్రంచేత బంటి అనేప్రత్యయం వచ్చి, మోకాలియొక్క+బంటి. 'సమాసవిభ క్తికి లోపం బగు' అని యొక్కవిభక్తి లోపించి, మోకాలిబంటి. తద్ధితాంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, 'మోకాలిబంటి' అనేపదం ఏర్పడుతుంది. (కొలఁది ప్రత్యయం వస్తే మోకాలికొలఁది.)

**13. వగలాఁడి :** వగలు కలిగినస్త్రీ అనేఅర్థంలో వగలు అనేప్రథమాబహువచ నాంత మైనశబ్దంమీద మతుబర్థంలో 'వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీ వాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడివర్ణకం బగు' అనేసూత్రంచేత ఆఁడి అనేప్రత్యయం వచ్చి, వగలు+ఆఁడి.'సమాసవిభక్తికి లోపం బగు' అని రావలసిన విభక్తిలోపం ఈసూత్రంలో 'బహువచనాంతంబులకు' అని నిర్దేశించినసామర్థ్యంచేత కలగదు. (ఉత్త్వసంధిని బాధించి) 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి వగలాఁడి. తద్ధితాంత మైనఈప్రాతిపదిక స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అని ప్రథమైకవచనం లోపించి, వగలాఁడి అనేపదం ఏర్పడుతుంది.

## క్రియాపరిచ్ఛేదం

**1. అంచును :** 'అనుచును' అని ఉండగా 'చువర్ణకంబు పరం బగునపు డన్వాదుల కుత్వలోపం బేని, నుస్థానంబున బిందు వేని విభాష నగు' అనేసూత్రంచేత నువర్ణంలోనిఉత్వం లోపించగా, 'అన్చును'. విభాష కాబట్టి ఉత్వం లోపించనిపక్షంలో 'అనుచును' అనేచోట 'ను' అనేవర్ణంస్థానంలో నిండుసున్న వస్తే – 'అంచును'. 'అఁ ట ఇఁక చుఁడు శబ్దంబులం దప్ప నుడి తొలిహ్రస్వముమీఁద ఖండబిందువు'

ఉండదు. కాబట్టి ఇక్కడ నువర్ణానికి అరసున్న రాదు. అఁచును అని ఉండదు. విభాష కాబట్టి బిందువు కూడా రానిపక్షంలో నువర్ణం అలాగే ఉండి ' అనుచును' అనేరూపం ఉంటుంది.

**2. అంట :** అను ధాతువుపై 'ట వర్ణకంబు భావంబునం దగు' అనేసూత్రంచేత భావార్థంలో ట అనేప్రత్యయం వచ్చి – అనుట. 'తిదుటలు పరంబు లగునపు డన్వాదుల నుస్థానంబున సున్నయు, నుండు డులోపంబును విభాష నగు'. అనేసూత్రంచేత నువర్ణం స్థానంలో నిండుసున్న రాగా 'అంట' అని అవుతుంది. 'అఁ ట ఇఁక చుఁడు శబ్దంబులం దప్ప' అనేసూత్రంప్రకారం ఇక్కడ అరసున్న రాదు. కాబట్టి 'అఁట' అని కాదు. విభాష అనడంచేత సున్న రానిపక్షంలో నువర్ణం అలాగే ఉండి, ' అనుట' అని ఉంటుంది.

**3. ఆకర్ణింపుదురు :** ఆకర్ణించు – ధాతువు. 'తద్ధర్మాదులందు లా ట్టగు' ఆకర్ణించు+ల్. ప్రథమపురుషబహువచనవివక్షలో 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్మగు' అని రువర్ణకం వచ్చి ఆకర్ణించు+రు. 'లాట్టురుఙ్మ పరం బగునపుడు దుగాగమం బగు' అని దుగాగమం వచ్చి, ఆకర్ణించు+దురు. 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు' అనేసూత్రాన్ని బాధించి, 'ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు' అనేసూత్రంచేత చకారానికి పకారం వచ్చి 'ఆకర్ణింపుదురు'. విభాష కాబట్టి పకారం రానిపక్షంలో 'చువర్ణంబుతోడ' అని తకారం వచ్చి 'ఆకర్ణింతురు'.

**4. ఉందురు** : ఉండు ధాతువు. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు లకారం అయి, ఉండు+ల్. ప్రథమపురుషబహువచనవివక్షలో 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్మగు' అని రు వర్ణకం వచ్చి, ఉండు+రు. 'లాట్టురుఙ్మ పరం బగునపుడు దుగాగమం బగు' అని ధాతువుకు దుగాగమం వచ్చి, 'ఉండుదురు'. 'తిదుటలు పరంబు లగునపు డన్వాదులనుస్థానంబున సున్నయు నుండుదులోపంబును విభాష నగు' అనేసూత్రంచేత ఉండులో 'డు' లోపించి, 'ఉందురు' అని అవుతుంది. విభాష కాబట్టి 'డు' లోపించకపోతే 'ఉండుదురు' అని ఉంటుంది.

**5. ఉన్నాఁడు** : ఉండు – ధాతువు. 'వర్తమానంబున ల ట్టగు' ఉండు+ల్. లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్మగు' అని ప్రథమపురుష ఏకవచనంలో డుఙ్ ప్రత్యయం వచ్చి, ఉండు+డుఙ్. 'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు' అని ఉన్న అనేశబ్దం అనుబంధంగా చేరి, ఉండు–ఉన్న–డుఙ్. 'ఉన్నశబ్దంబు పరం బగునపు డుండుధాతువునకు లోపం బగు' అని 'ఉండు'

లోపించి, ఉన్న+డుజ్. 'దివీతరం బగుడుఇ్ఞు పరం బగునపు దున్నానుబంధంబునకు దీర్ఘం బగు' అని దీర్ఘం వచ్చి, 'ఉన్నాఁడు' అని అవుతుంది.

**6. కలఁడు** : కలుగు ధాతువు. వర్తమానార్థంలో 'వర్తమానంబున ల ట్టగు' అని లట్టు లకారం వచ్చి, కలుగు+ల్. 'కలుగున కస్త్యర్థంబున లట్టు పరం బగునపుడు కల యగు' అనేసూత్రంచేత కలుగు అనేదానికి కల అనేది ఆదేశంగా వచ్చి, కల+ల్. ప్రథముపురుష ఏకవచనంలో 'లకారంబునకు డుత్రు వురు నుము ఇ్ఞగు' అని డుజ్ ప్రత్యయం వచ్చి, 'జిత్తు బిందుపూర్వం బగు' అని ముందు బిందువుతో 'కలఁడు' అని అవుతుంది.

**7. కలిగెడు మనియెను** : కలిగెడును+అనియెను, అనిఉండగా 'ఎడు త ల ద్రుతమున కచ్చు పరం బగునపుడు మకారం బగు' అనేసూత్రంచేత ద్రుతానికి మకారం ఆదేశంగా వచ్చి 'కలిగెడుమ్ + అనియెను = కలిగెడు మనియెను. అని అవుతుంది.

**8. చాక** : చచ్చు ధాతువు. 'కజీ వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనేసూత్రంచేత కజీ ప్రత్యయం వచ్చి, 'చచ్చు+క'. 'చావునోవులు చచ్చునొచ్చుల కగు' అని చచ్చు ధాతువుస్థానంలో 'చావు' అనేది ఆదేశంగా వచ్చి, 'చావు+క'. జీత్తు పరం బగునపుడు వానివువర్ణంబు విభాషను లోపించు' అనేసూత్రంచేత చావు లో వువర్ణం లోపించి, 'చాక' అని అవుతుంది. విభాష కాబట్టి వువర్ణానికి లోపం రానిపక్షంలో 'చావు+ క' అని ఉండగా 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అని ముందరి ఉత్వానికి అత్త్వం వచ్చి, 'చావక' అని అవుతుంది. (కజీ ప్రత్యయాంతం అవ్యయం.)

**9. చిలుకలు పలికెను** : పలుకు- ధాతువు. 'భూతంబున లి ట్టగు' అని లిట్టు లకారం వచ్చి, 'పలుకు+ల్'. 'లకారంబునకు డుత్రు వురు నుము ఇ్ఞగు' అని ప్రథమపురుష బహువచనంలో 'రు' ప్రత్యయం రాగా, దానికి 'తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టులప్రథమబహువచనంబున కేకవచనం బగు' అనేసూత్రంప్రకారం ప్రథమైకవచన మైన డుజ్ వస్తుంది. పలుకు+డుజ్. 'లిడ్లాట్టుల డుజున కెను ను వర్ణంబు లగు' అని డుజ్ స్థానంలో 'ఎను' ప్రత్యయం వచ్చి, పలుకు+ఎను. 'భూతంబునం దిగాగమం బగు' అని ఇగాగమం వచ్చి, పలుకు+ఇ+ ఎను. అపదాదిస్వరసంధి జరిగి, పలుకి+ఎను. 'ఇత్వంబు గాని యెత్వంబు గాని గూడుచో నవాద్యం బయినయుత్వంబున కిత్త్వం బగు' అని ముందర ఇత్వం వచ్చి, పలికి+ఎను. అపదాదిస్వరసంధి జరిగి (చిలుకలు) పలికెను.

**10. చేయునది** : చేయు ధాతువు. విధి అర్థంలో 'ఆశీశ్శాపసంప్రార్థనవిధు లందు లూ ట్టగు' అని లూట్టు వచ్చి, చేయు+ల్. 'లకారంబునకు డుఱువురునుము ఞ్గు' అనుసూత్రమును బాధించి, 'విధియందు లూట్టునకు మాఱుగా నది యనుతచ్ఛబ్దంబును, ముందు నుగాగమంబు నగు' అనేసూత్రంచేత లకారంస్థానంలో 'అది' అనేశబ్దం ఆదేశంగా వచ్చి, (చేయు+అది), దానికి ముందు ధాతువుచివర నకారం ఆగమంగా వచ్చి, చేయున్+అది, చేయునది. అని అవుతుంది.

**11. నగియెను** : నగు – ధాతువు. 'భూతంబున లి ట్టగు' అని లిట్టు లకారం వచ్చి, నగు+ల్. ప్రథమపురుష ఏకవచనవివక్షలో 'లకారంబునకు డుఱు వురు నుము ఞ్గు' అని లకారంస్థానంలో డుఙ్ ప్రత్యయం వచ్చి, నగు+డుఙ్. 'లిడ్లాట్టుల డుఙున కెను నువర్ణంబు లగు' నగు+ఎను. 'భూతంబునం దిగాగమం బగు' అని ఇగాగమం వచ్చి, నగు+ఇ+ఎను. సంధి జరిగి, నగి+ఎను.'గురువిరహితంబు లయి, యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు' అని ఇయుడాగమం వచ్చినపక్షంలో, నగి+ ఇయ్+ ఎను. సంధి జరిగి, నగియెను. విభాష అనడంచేత ఇయుడాగమం రానిపక్షంలో (నగి+ఎను) అపదాదిస్వరసంధి జరిగి, నగెను.

**12. న్యాయ్యముగను** : న్యాయ్యము అనేదానికి 'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజికి విభాష నగు' అనేసూత్రంచేత అగుధాతువు నుజ్యంతరూప మైన 'కాను' అనేది అనుప్రయుక్త మై న్యాయ్యము+కాను. 'దానికి హ్రస్వంబు విభాష నగు' అని 'కాను'లో కాదీర్ఘానికి హ్రస్వం వచ్చి, న్యాయ్యము+కను. 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంలోనిబహుళశబ్దంచేత కకారానికి నిత్యంగా గకార మై, న్యాయ్యముగను అని అవుతుంది. విభాష కాబట్టి హ్రస్వం రానిపక్షంలో – న్యాయ్యముగాను అని దీర్ఘం అలాగే ఉంటుంది.

**13.పడ్డను** : పడు ధాతువు. 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణంబు నందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అని నప్రత్యయ మై, పడు+నను. 'భూతంబునం దిగాగమం బగు' అని ధాతువుకు ఇగాగమం వచ్చి, పడు+ఇ+నను. సంధి జరిగి, పడినను. 'పద్వాదులనవర్ణకంబున కత్వంబును, గడహల్లునకు ద్విత్వంబును విభాష నగు' అని అత్వ (పడి+అను), ద్విత్వాలు వచ్చి, పడ్డను. విభాష అనడంచేత రానిపక్షంలో 'పడినను' అని ఉంటుంది.

**14. పదము. పొదము. పొమ్ము** : పోవు ధాతువు. 'ఆశీశ్శాపసంప్రార్థనవిధు లందు లూ ట్టగు' అని లూట్టు లకారం వచ్చి, పోవు+ల్. మధ్యమపురుష ఏకవచనవివక్షలో 'లకారంబునకు డుఁబు వురు నుము ఙ్గగు' అని వుప్రత్యయం వచ్చి, పోవు+వు. 'లూణ్మధ్యమవురులకు ముడుజు లగు' అని వువర్ణకంస్థానంలో ము వర్ణకం వచ్చి, పోవు+ము. 'పోవునకు దుజ్ముత్తులు ముజుం బరంబు లగునపుడు వులోపంబుం బొద పదలును విభాష నగు' అనేసూత్రంచేత పోవు అనేదానిలో వు వర్ణం లోపిస్తే, పో+ము. 'ముజు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముదర్ణకంబునకు మాముడియు నగు' అని దీర్ఘానికి హ్రస్వం వచ్చి, (పొ+ము) మాముడి ( ్మ ) వచ్చి, పొమ్ము. అని అవుతుంది.

విభాష కాబట్టి వు లోపం రానిపక్షంలో పోవు అనేదానికి పొద అనేది ఆదేశంగా వచ్చి, పొదము, అని అవుతుంది.

విభాష కాబట్టి పొద కూడా రానిపక్షంలో పద అనేది ఆదేశంగా వచ్చి, పదము అని అవుతుంది.

విభాష కాబట్టి పద కూడా రానిపక్షంలో పోవుము అని అలాగే ఉంటుంది.

**15. పిలక** : పిలుచు ధాతువు. 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అని కజి ప్రత్యయం వచ్చి, పిలుచు+క. 'పిలుచు మొద లగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు' అని చువర్ణం లోపించగా పిలు+క. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అని ముందు అత్వం వచ్చి, పిలక అని అవుతుంది. బహుళం కాబట్టి చివరిఅక్షరం లోపించనిపక్షంలో పిలుచు+క. 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అని చకారానికి వకారం వచ్చి, పిలువు+క, 'జీత్తు పరం బగునపుడు' అని ఉత్వానికి అత్వం వచ్చి, పిలువక అని అవుతుంది.

**16. మేలు కలిగెడును (కలుగుతను)** : కలుగు ధాతువు. 'ఆశీశ్శాపసంప్రార్థన విధులందు లూ ట్టగు' ఆశీరర్థంలో లూట్టు లకారం వచ్చి, కలుగు+ల్. 'లకారంబునకు డుఁబు వురు నుము ఙ్గగు' అని డుజ్ ప్రత్యయం వచ్చి, కలుగు+డుజ్. 'లూట్టుడుఙ్ఞున కెడు త వర్ణంబులు ద్రుతాంతంబు లగు' అని డుజుకు ఎడును ప్రత్యయం వచ్చి, కలుగు+ఎడును. అపదాదిస్వరసంధి జరిగి, 'కలుగెడును'. 'ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయుత్వంబున కిత్వం బగు' అని ఇత్వం వచ్చి, కలిగెడును. అని అవుతుంది. త ప్రత్యయం వచ్చినపక్షంలో 'కలుగుతను' అవుతుంది.

**17. రంజించు** : రంజ్ ధాతువు. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, రంజ్+ఇంచు. దీనిపై ప్రేరణార్థంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అని (మరొక) ఇంచుగాగమం వచ్చి రంజ్+ఇంచు+ ఇంచు. 'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనేసూత్రాన్ని బాధించి 'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదుల యించుక్కునకు లోపం బగు' అనేసూత్రంచేత (స్వార్థంలో వచ్చిన) మొదటిఇంచుక్కు లోపించి రంజ్+ఇంచు, రంజించు అని అవుతుంది.

**18. రంజిల్లు** : రంజ్ ధాతువు, 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, రంజ్+ఇంచు.'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనేసూత్రంచేత ఇంచులోని చకారానికి 'ల్ల్' ఆదేశంగా వచ్చి, రంజ్ + ఇల్లు, రంజిల్లు అని అవుతుంది.

**19. రాc డయ్యెను** : రాడు అనేలజ్యంత(వ్యతిరేక)క్రియపై భూతార్థంలో 'భూతంబున లజికి లిడంతం బగు నగుధాతు వనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత 'అయ్యెను' అనే లిడంత మైన అగుధాతువురూపం చేరి, రాcడు + అయ్యెను, రాc డయ్యెను అని అవుతుంది.

**20. లెమ్ము** : లేచు ధాతువు. 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అని లూట్టు వచ్చి, లేచు+ల్. మధ్యమపురుష ఏకవచనంలో 'లకారంబునకు డుడ్రు వురు నుము ఞ్ఞగు' అని వువర్ణకం వచ్చి, లేచు+వు. 'లూణ్మధ్యమవురులకు ముడుఙు లగు' అని వువర్ణకంస్థానంలో ముఙవర్ణకం వచ్చి, లేచు+ము. 'పిలుచు మొదలగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు' అనేసూత్రంలోని బహుళశబ్దంచేత 'లేచునకు ముఙు పరం బగునపుడు చులోపం బగు' అని చు లోపించి లే+ము. 'ముఙు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును ముఙవర్ణకంబునకు మామ్ముడియు నగు' హ్రస్వము, మామ్ముడి, వచ్చి, లెమ్ము అని అవుతుంది.

**21. లేవడి** : కలుగు ధాతువు. 'వడి ప్రభృతు లి ట్లెఙుంగునది' అనేసూత్రంచేత వడి అనేప్రత్యయం వచ్చి, కలుగు+వడి. 'కలుగున కస్త్యర్థంబున లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు' అని కలుగు అనేదానిస్థానంలో 'లే' అనేది ఆదేశంగా వచ్చి, లేవడి. కృదంత మైన ఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి దీనిపై ప్రథమైకవచనానికి 'స్త్రీలింగంబుల- అనేసూత్రంచేత లోపం వచ్చి, లేవడి అనేపదం ఏర్పడుతుంది.

**22. వందుదము** : వందు ధాతువు. ప్రార్థనార్థంలో 'ఆశీశ్శాపసంప్రార్థనవిధు లందు లూ ట్టగు' అని లూట్టు లకారం వచ్చి, వందు+ల్. (యుష్మదస్మదుభయార్థంలో) ఉత్తమపురుషబహువచనంలో 'లకారంబునకు డుఁబు వురు నుము ఙ్గగు' అని ము ప్రత్యయం వచ్చి, వందు+ము. 'ఉభయప్రార్థనంబునందు దుగాగమంబున కుత్వం బగు' అనేసూత్రంచేత దుగాగమమూ, ఆదుగాగమంలోనిఉత్వానికి అత్వమూ వచ్చి, 'వందుదము' అని అవుతుంది.

**23. వందితి** : వందు ధాతువు. భూతార్థంలో 'భూతంబున లి ట్టగు' లిట్టు లకారం వచ్చి, వందు+ల్. మధ్యమపురుష ఏకవచనంలో 'లకారంబునకు డుఁబు వురు నుము ఙ్గగు' అని వుప్రత్యయం వచ్చి, వందు+వు. 'భూతంబునం దిగాగమం బగు' అని ధాతువుకు ఇగాగమం వచ్చి, సంధి జరిగి, వంది+వు. 'లిట్టు వుఙ్ఙు పరం బగునపుడు తివర్ణకం బగు' అని 'తి'ప్రత్యయం వచ్చి, వందితి+వు. 'ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అని ఇత్వం వచ్చి, వందితివి. 'లిఙ్లాట్టులవకారంబునకు లోపంబు విభాష నగు' వి ప్రత్యయంలోని వకారం లోపించగా వందితి+ఇ, సంధి జరిగి, వందితి అని అవుతుంది. విభాష కాబట్టి వకారం లోపించకపోతే 'వందితివి' అని అలాగే ఉంటుంది.

**24. వినవే** : విను ధాతువు. ప్రార్థనార్థంలో 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అని లూట్టు వచ్చి, విను+ల్. మధ్యమపురుష ఏకవచనంలో 'లకారంబునకు డుఁబు వురు నుము ఙ్గగు' అని వువర్ణకం వచ్చి, విను+వు. 'లూణ్మధ్యమవురులకు ముడుఙు లగు' వువర్ణకంస్థానంలో ము వర్ణకం వచ్చి, విను+ము. 'సంప్రార్థనంబున ముఙున కదాదులు విభాష నసుప్రయుక్తంబు లగు' అనేసూత్రంచేత 'ఏ' అనుప్రయుక్త మై, విను+ము+ఏ. 'ఏదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముఙునకు వుజీ రుజీ యగు' అని మువర్ణకంస్థానంలో వుజీ వచ్చి, విను+వు+ఏ. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అని అత్వం వచ్చి వినవు+ఏ. అపదాదిస్వరసంధి జరిగి 'వినవే' అవుతుంది.

**25. స్పృశించు** : స్పృశ్ ధాతువు. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, స్పృశ్+ఇంచు. 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అని నిత్యంగా గుణం రావలసిఉండగా 'స్పృశికి గుణంబు విభాష నగు' అని వికల్పంగా వస్తుంది. గుణం (ఋకారానికి అర్ ) వస్తే, స్పర్శించు అని అవుతుంది. విభాష కాబట్టి గుణం రాకపోతే, స్పృశించు అని అలాగే ఉంటుంది.

# కృదంతపరిచ్ఛేదం

**1. అడఁకువ** : అడఁగు ధాతువుపై 'కువవర్ణకం బడంగ్వాదుల కగు' అని కువ ప్రత్యయం వచ్చి, అడఁగు+కువ. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరి 'గు'వర్ణం లోపించి అడఁకువ అవుతుంది. కృదంత మైనఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, అడఁకువ అనేపదం ఏర్పడుతుంది.

**2. ఆట** : ఆడు ధాతువుపై 'టవర్ణకం బాడ్వాదుల కగు, నగుచో నంతలోపం బగు' అనేసూత్రంచేత ట ప్రత్యయం వచ్చి, ఆడు+ట. ఆడులో చివరిఅక్షరం (డు) లోపించి, ఆట అవుతుంది. కృదంత మైనఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. 'స్త్రీలింగంబు లెల్ల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి ఆట అనేపదం ఏర్పడుతుంది.

**3. కలిమి** : కలుగు ధాతువుపై 'ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత ఇమి అనేప్రత్యయం వచ్చి, కలుగు+ఇమి. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత కలుగులో చివర ఉన్న గువర్ణం లోపించి 'కలు+ఇమి'. 'అంద్వవగాగమంబులం దప్ప' అని సంధి జరిగి, కలిమి. కృదంత మైనఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, కలిమి అనేపదం ఏర్పడుతుంది.

**4. కానుక** : కను ధాతువుపై ' కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత క ప్రత్యయం వచ్చి, కను+క. 'ఇక కపులు పరంబు లగునపుడు కనునకు దీర్ఘం బగు' అనేసూరివివరణంచేత కనులో మొదటిహ్రస్వానికి దీర్ఘం వచ్చి, కానుక అవుతుంది. కృదంత మైనఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, కానుక అనేపదం ఏర్పడుతుంది.

**5. చూడికి** : చూచు ధాతువుపై 'ఇకి కోర్వాదుల కగు' అని ఇకి ప్రత్యయం వచ్చి చూచు+ఇకి. 'చూడు చూచున కగు' అనేసూరివివరణంప్రకారం చూచు ధాతువుస్థానంలో చూడు అనేది ఆదేశంగా వచ్చి చూడికి అవుతుంది. కృదంత మైన ఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి

'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'చూడికి' అనేపదం ఏర్పడుతుంది.

**6. తిరిపము**: తిరియు ధాతువుపై ' పవర్ణకంబు తిరియ్యాదుల కగు' అని ప-ప్రత్యయం వచ్చి, తిరియు+ప. 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అని యువర్ణం లోపించి, 'తిరిప' అవుతుంది. కృదంత మైన ఈప్రాతిపదికం 'అచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి 'తిరిపము' అనేపదం ఏర్పడుతుంది.

**7. తూనిక** : తూఁగు ధాతువుపై 'ఇక వర్ణకం బంజ్యాదుల కగు' అని ఇక ప్రత్యయం వచ్చి, తూఁగు+ఇక. 'తూను తూఁగున కగు' అనేసూరివివరణంప్రకారం తూఁగు అనేదానికి 'తూను' అనేది ఆదేశంగా వచ్చి (తూను+ఇక) సంధి జరిగి, తూనిక అవుతుంది. కృదంత మైనఈప్రాతిపదికం 'అచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి 'తూనిక' అనేపదం ఏర్పడుతుంది.

**8. పాటు**: పడు ధాతువుపై 'టు వర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నివి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు' అనేసూత్రంచేత 'టు' అనేప్రత్యయం వచ్చి (పడు+టు), మొదటిఅక్షరానికి పైన ఉన్నవర్ణాలు (డు)లోపించి (ప+టు), ఆమొదటిఅక్షరానికి దీర్ఘం వచ్చి, 'పాటు' అవుతుంది. కృదంత మైనఈప్రాతిపదికం 'అచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి పాటు అనేపదం ఏర్పడుతుంది.

**9. వంటకము** : వండు ధాతువుపై 'అక వర్ణకంబు మాఱ్వాదుల కగు' అని అక ప్రత్యయం వచ్చి, వండు+అక. 'వండు డకారంబు టకారం బగు' అనేసూరివివరణం ప్రకారం వండులో డకారానికి టకారం ఆదేశ మై, వంటు+అక. 'అంద్వవగాగమంబులం దప్పు' అని సంధి జరిగి, వంటక. కృదంత మైనఈ ప్రాతిపదికం 'అచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో మువర్ణకం వచ్చి, వంటకము అనేపదం ఏర్పడుతుంది.

**10. వీవన** : వీచు ధాతువుపై 'అప్పాదులకు నజి యగు' అనేసూత్రంచేత న ప్రత్యయం వచ్చి, వీచు+న. నజి- జీత్తు. కాబట్టి ముత్తు. 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అని చకారానికి వకారం

వచ్చి, వీవు+న. 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అని అత్వం వచ్చి, వీవన. కృదంత మైనఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంప్రకారం స్త్రీసమం. కాబట్టి 'స్త్రీలింగంబుల' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి వీవన అనేపదం ఏర్పడుతుంది.

## ప్రకీర్ణకపరిచ్ఛేదం

**1. అట్టెత్తె** : అట్టు+ఎత్తె. అని ఉండగా 'అకారంబుక్రిందిఅకారంబు నకును దుదినులులక్రిందినలలకును లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత శకటరేఫకు లోపం రావలసిఉంది. కాని 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి చేయవలసిఉంది, కాబట్టి 'జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు' అనేసూత్రంచేత జడ్డకు లోపం రాదు. ఉత్వసంధి జరిగి 'అట్టెత్తె' అని అవుతుంది.

**2. అతడు ఋషి** :అతడు+ఋషి అని ఉండగా 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి ప్రాప్తిస్తుండగా 'పదాద్యంబులు ఋ(లు) వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రం ప్రకారం అ చ్చయినఋకారం హ ల్లయిన రేఫతో సమానం అవుతుంది, హల్లు పర మైతే సంధి రాదు. కాబట్టి సంధి లేకపోవడంచేత అది అలాగే ఉండి, అతడు ఋషి.

**3. ఊయెల (ఊయల)** : ఊయేల(ఊయాల) అనేశబ్దంలో నడుమ ఉన్న దీర్ఘానికి 'ఊయేలఊయాలలచాపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు' అనేసూత్రంచేత హ్రస్వం వచ్చి, ఊయెల (ఊయల) అవుతుంది. ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అని యకారానికి ద్విత్వం వస్తే, ఊయ్యెల (ఊయ్యల). 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, ఉయ్యెల(ఉయ్యల) అవుతుంది. ఒండె అనడంచేత వికల్పం కాబట్టి ద్విత్వం రానిపక్షంలో హ్రస్వం కూడా రాదు, కాబట్టి ఊయెల (ఊయల).

ఒండె అనడంచేత ఊయేల(ఊయాల)లో నడుమ కూడా హ్రస్వం రానిపక్షంలో దీర్ఘం అలాగే ఉండి ఊయేల(ఊయాల).

**4. ఏతాము**: ఏత అనేక్లీబసమప్రాతిపదికపై ప్రథమైకవచనవివక్షలో 'అమహన్నపుంసకముల కదంతములకు ముువర్ణకం బగు' అనేసూత్రంచేత ముువర్ణకం వచ్చి. ఏతము. 'ఏతాదులకు ముువర్ణకంబు పరం బగునపడు దీర్ఘంబు విభాష నగు' అనేసూత్రంప్రకారం దీర్ఘం రాగా, 'ఏతాము' అని అవుతుంది. విభాష కాబట్టి

దీర్ఘం రానిపక్షంలో 'ఏతము' అని ఉంటుంది.

**5. ఒయారము**: ఓయారము అనేశబ్దంలో మొదటిదీర్ఘానికి 'ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాష నగు' అని హ్రస్వం వచ్చి, ఒయారము అవుతుంది. విభాష కాబట్టి హ్రస్వం రానిపక్షంలో దీర్ఘం అలాగే ఉండి, ఓయారము. 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అని ఓయారములో యకారానికి ద్విత్వం వచ్చి, (ఓయ్యారము) 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు' అని ముందు హ్రస్వం వచ్చి ఒయ్యారము అవుతుంది. ఒండె అనడంచేత ద్విత్వం రాకపోతే, హ్రస్వం కూడా రాదు. కాబట్టి ఓయారము అనే ఉంటుంది.

**6. కప్రము** : కప్పురము అనేశబ్దంలో 'అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు' అని ఉత్వం లోపించగా కప్ప్రము, నడుమ ద్విత్వంలోని ఒకహల్లు లోపించి కప్రము అని అవుతుంది. విభాష అనడంచేత లోపం రానిపక్షంలో కప్పురము అని ఉంటుంది.

**7. కల్కి** : కలికి అనేశబ్దంలో 'లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి' అని నడుమ లివర్ణంలోని ఇత్వానికి లోపం వచ్చినపక్షంలో కల్కి అని అవుతుంది. 'కానంబడియెడి' అనడంచేత లోపం రానిపక్షంలో కలికి అని ఉంటుంది.

**8. కిన్క** : కినుక అనేశబ్దంలో 'ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరల యుత్త్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత నువర్ణంలోని ఉత్త్వం లోపించి, కిన్క అని అవుతుంది. బహుళం కాబట్టి లోపం రానిపక్షంలో కినుక అని కూడా ఉంటుంది.

**9. మ్రాన్పడె** : మ్రాను+పడు అని ఉండగా 'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి, మ్రాన్పడె అని అవుతుంది. బహుళం అనడంచేత ఉత్వానికి లోపం రానిపక్షంలో మ్రానుపడె అని ఉంటుంది.

**10.రావణుడు-గీవణుడు** : రావణుడు అనేశబ్దం నిందార్థంలో ద్విరుక్త మై, రావణుడు - రావణుడు, 'నిందయందు నామ్రేడితంబునాద్యక్షరములకు హ్రస్వ దీర్ఘములకు గిగీ లగు' అనేసూత్రంచేత ఆమ్రేడిత మైన రెండవ రావణుడు అనే శబ్దంలో మొదటి దయిన 'రా' అనేదీర్ఘాక్షరానికి దీర్ఘ మైన 'గీ' ఆదేశం కాగా రావణుడు - గీవణుడు అని అవుతుంది.

# పారిభాషికపదపరిచయం

## బాలవ్యాకరణం - సంజ్ఞాపరిచ్ఛేదం.

**1. అచ్చు** (సంజ్ఞ. 1) : 'అకారాదు లచ్చులు.' అకారం మొద లైనవర్ణాలకు అచ్చులు అని పేరు. 'కకారాదులు హల్లులు' అనడంచేత వర్ణమాలలో కకారానికి పూర్వంవరకు ఉండేవర్ణాలు గ్రహింపబడతాయి. అఆఇఈఉఊఋౠ(ఌౡ) ఎఏఐఒఓఔ, అఁ (అరసున్న) అం (నిండుసున్న) అః (విసర్గ) అనే 19 వర్ణాలు అచ్చులు. సంస్కృతంలోని 'అచ్' అనేప్రత్యాహారసంజ్ఞ తత్సమంగా తెలుగులో అచ్చు అని ఏర్పడింది.

**2. అనింద్యగ్రామ్యము**(సంజ్ఞ. 23): 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు'. ఈభాష కావ్యాలలో ప్రయోగించడానికి అర్హ మైనది కాదు. కాబట్టి గ్రామ్యం నింద్యం అవుతున్నది. అయితే 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అంటే మహాకవులు ప్రయోగిస్తే గ్రామ్య మైనా గ్రహింపవలసిందే. కఱకంఠుడు, మొద లైనశబ్దాలు గ్రామ్యా లయినా నన్నయాదిమహాకవులు ప్రయోగించడంచేత గ్రహింపదగినవే కాబట్టి అవి నింద్యాలు కావు. అందుచేత వీటిని అనింద్యగ్రామ్యా లంటుంటారు.

**3. అనిత్యము :** చూ. వైకల్పికం.

**4. అనువృత్తి :** పూర్వసూత్రస్థితపదస్య పరసూత్రే షూపస్థితిః. వెనక సూత్రాలలోని పదం(పదాలు) అన్వయంకోసం తర్వాతిసూత్రాలలోకి వచ్చిచేరడం అనువృత్తి. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' (సంధి. 1) అనేసూత్రంలో ఉన్న 'అచ్చు పరం బగునపుడు' అనేపదాలు 'ప్రథమేతరవిభక్తి' అనేతర్వాతిసూత్రంలోకి వచ్చి 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు అచ్చు పరం బగునపుడు సంధి వైకల్పికంబుగా నగు'- అని అన్వయిస్తుంది. కాబట్టి ఇక్కడ 'అచ్చు పరం బగునపుడు' అనేది అనువృత్తి.

**5. అలఘువు-లఘువు:** (సంజ్ఞ. 18) 'య స్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్య మూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః' ఏవర్ణాన్ని ఉచ్చరించేటప్పుడు నాలుక మొత్తం శిథిలం (వదులు) అవుతుందో ఆవర్ణం లఘువు. తెలుగులో య,ర,ల,వ, అనేవర్ణాలకు ఇటువంటిలఘూచ్చారణం ఉన్నది. హరి యతడు, పెరుగు, తల, నిద్ర మొ. ఆశైథిల్యం లేనిఉచ్చారణ గలవర్ణం అలఘువు. కాయ, విఱుగు, త్రాళులు, వంకర మొ.

**6. ఉపధ** (సంజ్ఞ. 10): అలో కన్త్యాత్ పూర్వ ఉపధా. 'ఉపధ యనగా తుదివర్ణమునకు ముందు వర్ణము.' వర్ణం అంటే అచ్చు లేదా హల్లు. పొల్లు హల్లు గూడా వర్ణమే. శబ్దంలో చివరినుంచి రెండోవర్ణానికి ఉపధ అని సంజ్ఞ. అర్చి అర్చ్ఇ. ఇందులో చివరి 'ఇ' అనే వర్ణానికి ముం దుండటంచేత 'చ' కారం ఉపధ.

**7. కళ** (సంజ్ఞ. 13) : 'ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు' నకారానికి ద్రుత మని పేరు. ద్రుతం చివర ఉన్నపదాలకు ద్రుతప్రకృతి అని పేరు. ఆద్రుతప్రకృతికాలలో చేరనిపదం – ద్రుతప్రకృతులకంటే వే రైనపదం కళ. ప్రథమావిభక్త్యంతాలు మొ. కళలు. రాముఁడు – చేను మొ.

**8. ఖండబిందువు:** చూ. బిందువు.

**9. గ్రామ్యము** (సంజ్ఞ. 22): 'లక్షణవిరుద్ధం బగు భాష గ్రామ్యంబు.' వ్యాకరణం చెప్పినదానికి విరుద్ధంగా ఉండేశబ్దానికి గ్రామ్యం అని పేరు. ఉదా. వస్తాడు. వచ్చువాఁడు లేదా రాగలఁడు అనేవిధంగా వ్యాకరణం సాధించినరూపం. వస్తాడు అనేది దానికి విరుద్ధం. కాబట్టి గ్రామ్యం. ఈగ్రామ్యభాష కావ్యాలలో ప్రయోగించడానికి అర్హం గాదు. (అనర్హాలు కావడంచేత వీటినే నింద్యగ్రామ్యా లనీ అంటుంటారు.)

**10. తత్సమము** (సంజ్ఞ. 19): 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు' సంస్కృతంతో లేదా ప్రాకృతంతో సమాన మైనతెలుగుశబ్దానికి తత్సమం అని సంజ్ఞ. సంస్కృతంతో తుల్య మైతే సంస్కృతసమం. రాముఁడు. (రామః–సంస్కృతం) ప్రాకృతంతో తుల్య మైతే ప్రాకృతసమం. సిరి. (సిరీ–ప్రాకృతం) ఈరెండింటిని కలిపి తత్సమం అంటారు. తత్సమం అనేమాట కొన్నిచోట్ల కేవలం సంస్కృతసమం అనేఅర్థంలో ప్రయోగించడం గూడా ఉంది.

**11. తద్భవము** (సంజ్ఞ. 20): సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు' సంస్కృతం నుంచి, లేదా ప్రాకృతంనుంచి పుట్టినతెలుగుశబ్దాలు తద్భవాలు. సంస్కృతశబ్దంనుంచి పుట్టినతెలుగుశబ్దం సంస్కృతభవం. ఆకసము (ఆకాశః –సంస్కృతం) ప్రాకృతంనుంచి పుట్టినశబ్దం ప్రాకృతభవం. ఇంగలము (ఇంగాలో–ప్రాకృతం) సంస్కృతప్రాకృతభవాలు రెంటినీ కలిపి తద్భవం అంటారు.

**12. తాలవ్య(చజ)ములు** (సంజ్ఞ. 7): తాలువునుండి పుట్టినది, అంటే తాలువు సహాయంతో ఉచ్చరింపబడేవర్ణం తాలవ్యం. తాలువు అంటే నోటిలో నాలుకకు పైన (శిరోభాగం) మూర్ధం. (చిలుక అన్నపుడు చకారాన్ని పలికేటప్పుడు నాలుక

పైన ఏభాగాన్ని తాకుతుందో అది తాలువు.) ఆభాగాన్ని నాలుక స్పృశించడంవల్ల పుట్టేవర్ణాలు తాలవ్యాలు. ఇ.చ.శ మొ. 'ఇ ఈ ఎ ఏ లం గూడినచజలు తాలవ్యంబులు' చిలుక జేజె. మొ.

**13. దంత్యము-దంత్యచజలు** (సంజ్ఞ. 9): దంతస్థానంలో పుట్టినది, అంటే దంతాలసహాయంతో ఉచ్చరింపబడేవర్ణం దంత్యం. నాలుకయొక్క ఉపాగ్రభాగం దంతమూలాన్ని స్పృశించడంవల్ల పుట్టేధ్వని కలిగినవర్ణాలు. త,స, మొ. అటువంటి ఉచ్చారణం కలిగినచజలు దంత్యచజలు. 'అఆఉఊఒఓఔలం గూడిన చజలు దంత్యంబులు'. చలి జాలి మొ. ఇవి అచ్చతెలుగులో మాత్రమె ఉన్నాయి.

**14. దీర్ఘము :** చూ. హ్రస్వము

**15. దేశ్యము** (సంజ్ఞ. 21): 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' శ్రీశైలం, కాళేశ్వరం, దక్షారామం అనేత్రిలింగాలు గలదేశం (త్రిలింగదేశం,) లోని జనాలవ్యవహారం నుండి ఏర్పడినభాషకు దేశ్యం అని పేరు. ఊరు – పేరు. మొ. ఈశబ్దాలకు ఆధారం సంస్కృతాదు లైనఇతరభాషల్లో దొరకదు. కేవలం లోకవ్యవహారమే వీటికి మూలం. దేశంలో పుట్టినవి కాబట్టి యివి దేశ్యాలు.

**16. ద్రుతప్రకృతి(కము)** (సంజ్ఞ. 12): 'ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు.' నకారానికి ద్రుతం అని సంజ్ఞ. ద్రుత మైననకారం చివర ఉన్నపదాలు ద్రుతప్రకృతులు. నన్నున్. వలెన్. మొ. ప్రథమా కయి పట్టి యొక్కేతరము లయినవిభక్తులు ఇత్యాదిగా ద్రుతప్రకృతికాలుగా చెప్పబడినశబ్దాలు మాత్రమె ద్రుతప్రకృతులు. మిగిలినవాటిల్లో చివర నకారం ఉన్నా ఆనకారం ద్రుతం కాదు. ఆశబ్దాలు ద్రుతప్రకృతికాలూ కావు. మ్రాన్పడు, మిన్నడు మొ.

**17. ద్రుతము** (సంజ్ఞ. 11): 'నకారంబు ద్రుతంబు' నకారానికి ద్రుతం అని పేరు. ద్రుతప్రకృతులుగా చెప్పబడినశబ్దాలలో చివర ఉన్ననకారమే ద్రుతం. దానిని బట్టి ప్రత్యయం గాని, ఆగమం గాని, అవ్యయం గాని అయి, ఉత్వంతో గూడిన నకారానికే ద్రుత మని పేరు. వనమును, రామునిచేతను అన్నయును. వలెను మొ. అవ్యయాల్లో చివరినువర్ణం ద్రుతం. అదియునున్ గాక అనేచోట్ల నకారం పొల్లు ద్రుతం. ద్రుతనువర్ణంలో ఉత్వం ఇత్వ మైనా, అచ్చు లోపించినా అది ద్రుతమె. రాముని, వలెన్ మొ.

**18. పరుషము** (సంజ్ఞ. 5): 'కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు' కచటతప అనేహల్లులకు పరుషా లని పేరు.

'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనే సూత్రంప్రకారం ఈసూత్రంలోని తాలవ్యచకారంచేత దంత్యచకారం గూడ గ్రహింపబడుతుంది. 'కచచటతప' అనే ఆరువర్ణాలకు పరుషాలు అని పేరు. వీటిల్లో అకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చారు. కాబట్టి క్,చ్, అనే విధంగా పొల్లులకే పరుషం అని పేరు.

**19. పూర్ణబిందువు**: చూ. బిందువు

**20. ప్రాకృతభవము**: చూ. తద్భవము

**21. ప్రాకృతసమము :** చూ. తత్సమము.

**22. బిందువు** (సంజ్ఞ.17): 'బిందు రనుస్వారః' అనుస్వారానికి అంటే సున్నకు బిందువు అని సంజ్ఞ. ఇది తెలుగులో రెండు విధాలు. 1. నిండుసున్న. దీనినే పూర్ణబిందువు, నెఱసున్న, ఇత్యాదిగా వ్యవహరిస్తారు. బంతి, పూచెం గలువలు మొ.2. అరసున్న. దీనినె ఖండబిందువు అంటారు. అరఁటి, పూచెఁ గలువలు. మొ.

**23. లఘువు :** చూ. అలఘువు.

**24. వక్రతమము**(సంజ్ఞ.2): 'ఐఔలు వక్రతమంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు.' 'వక్రతమ ఐచ్' అని చింతామణి చెప్పింది. ఐ,ఔ అనే రెండువర్ణాలకు వక్రతమా లని సంజ్ఞ. (ఈసంజ్ఞ అవ్యుత్పన్నం)

**25. వక్రము** (సంజ్ఞ.2): 'ఎఏఒఓలు వక్రము లని ప్రాచీనులు వ్యవహరింతురు'. 'ఏ జధో వక్రః ' అని చింతామణి చెప్పింది. ఎ,ఏ,ఒ,ఓ అనేనాలుగువర్ణాలకు వక్రాలు అని సంజ్ఞ. వీటిలో ఎ–ఒ అనేవక్రాలు హ్రస్వాలు. కాబట్టి అవి హ్రస్వ వక్రాలు. అలాగే ఏ–ఓ అనేవక్రాలు దీర్ఘాలు. కాబట్టి అవి దీర్ఘవక్రాలు.

**26. వర్ణము** (సం.1): వర్ణ్యన్తే వ్యక్తం ధ్వన్యన్తే ఇతి వర్ణాః. ధ్వనులను వ్యక్తం చేసేవీ, ధ్వనులను వర్ణించేవీ– వర్ణాలు. అచ్చూ, పొ ల్లయిన హల్లూ వర్ణసంజ్ఞను పొందుతాయి. అ, క్. మొ. అకారం, కకారం, అనేవాటిని ఉచ్చరించేటప్పుడు కలిగేధ్వని, (ఆధ్వనిని వర్ణించే 'అ, క్' అనేవిధ మైనలిపి కూడా) వర్ణం.

**27. వర్ణసమామ్నాయము** (సంజ్ఞ.18): 'సమామ్నాయ స్సమామ్నాతః వర్ణానాం సమామ్నాయః వర్ణసమామ్నాయః'. సమామ్నాయం అంటే సముదాయం. ఒకచోట కూర్పబడిన మొత్తం వర్ణాలసముదాయం వర్ణసమామ్నాయం. 'సంస్కృతమునకు వర్ణంబు లేఁబది' ఇత్యాదిగా ఆయాస్థలాల్లో అ, ఆ– ఇత్యాదిగా కూర్చబడిన వర్ణసముదాయానికి వర్ణసమామ్నాయం అని పేరు.

**28. విసర్గము (విసర్జనీయము):** విసర్జనీయానికి విసర్గం అని వ్యవహారం. విసర్జనీయం (విడువదగినది) విసర్గం (విడువబడేది) అనేఅర్థాలనుబట్టి కంఠంనుంచి గాలి విడువబడడంచేత ధ్వనించేది. అః ఇత్యాదిగా స్వరాన్ని అనుసరించి ఉండేది, ఒకదానిమీద ఒకటిగా రెండు సున్నలుగా వ్రాయబడేవర్ణం విసర్గం.

**29. వైకల్పికము-వికల్పము-అనిత్యము :** (సంజ్ఞ. 14) 'వికల్పేన ప్రాప్తిః విధేరనిత్యత్వం వికల్పత్వమ్.' లక్షణంచేత చెప్పబడినకార్యం వికల్పంగా ప్రవర్తించడం వైకల్పికం. (భావం) రావడం, (అభావం) రాకపోవడం. అనేరెండుపక్షాలలో ప్రవర్తించడం. 'హ్రస్వముమీఁదిఖండబిందువుకుఁ బూర్ణబిందువు వైకల్పికంబుగా నగు' అరఁటి-అరంటి. ఇక్కడ అరసున్నకు నిండుసున్న రావడం, రాకపోవడం అనే రెండుస్థితులవల్ల ఇది వైకల్పికం. అనిత్యం అన్నా వైకల్పికమె. కలను - కలఁకు.

**30. సంజ్ఞ:** (విధిఘటకసంకేతపదీయశక్తిగ్రాహకం సంజ్ఞా. వ్యవహారార్థం శాస్త్రే కృత స్సంకేత స్సంజ్ఞా) ఆయాశాస్త్రవిధానాల్లో శాస్త్రం ఉద్దేశించిన ఆయా అర్థాలను తెలియజేసేశక్తి గలిగినశబ్దం సంజ్ఞ. 'నకారంబు ద్రుతంబు'. ఇక్కడ ద్రుతము అనేశబ్దం శాస్త్రకర్త ఆయాశాస్త్రవిధుల్లో ఉద్దేశించిన 'న'కారం అనేఅర్థాన్ని బోధిస్తుంది. కాబట్టి అది సంజ్ఞ.

**31. సంస్కృతభవము:** చూ. తద్భవము

**32. సంస్కృతసమము:** చూ. తత్సమము

**33. సంస్కృతసమేతరము(సమేతరము)** : చూ. అచ్చ.(ఆచ్ఛికపరిచ్ఛేదం)

**34. సరళము** (సంజ్ఞ. 9): 'కచటతపలు పరుషలంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు' గజడదబ అనేహల్లులకు సరళా లని సంజ్ఞ. ఈసూత్రంలోని తాలవ్యజకారంచేత 'దంత్యతావ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనేసూత్రంప్రకారం దంత్యజకారం గూడా గ్రహింపబడుతుంది. కాబట్టి (తాలవ్యంతోపాటు) దంత్యజకారం కూడా సరళమె అవుతుంది. గజజడదబ అనేఆరు హల్లులు సరళాలు. ఇందులో 'అ'కారం ఉచ్చారణసౌకర్యంకోసం. కాబట్టి గ్-జ్ అనేవిధంగా పొల్లులకే సరళా లని పేరు.

**35. సవర్ణములు** (సంజ్ఞ. 8): 'తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్'. స్థానప్రయత్నాలలో సామ్యం కలిగినవర్ణాలు సవర్ణాలు. అంటే ఉచ్చారణలో సమాన మైనవర్ణాలు. తెలుగులో చజలు దంత్యాలు, తాలవ్యాలు అని రెండురకాలు. ఇందులో దంత్యాలకు దంత(మూల)ం స్థానం. తాలవ్యాలకు తాలువు స్థానం. స్థానంలో భేదం ఉండడంచేత

ఇవి వేర్వేరువర్ణాలుగా వర్ణమాలలో పరిగణింపబడ్డాయి. వేరే వర్ణా లయినా శాస్త్రంలో పరుషాదిసంజ్ఞలు సకారాదేశాదికార్యాలు మొద లైనప్రయోజనాలను ఉద్దేశించి దంత్యతాలవ్యచజలకు సవర్ణత్వం విశేషంగా విధింపబడింది.

**36. సాధ్యపూర్ణము (సాధ్యబిందువు) (సాధ్యఖండం)**(సంజ్ఞ. 15): సాధ్యం అంటే సంపాదింపబడింది. బిందు వంటే అనుస్వారం. వ్యాకరణంచేత కొత్తగా సాధింపబడిన బిందువు సాధ్యబిందువు. అలా సాధింపబడింది ఖండబిందువు (అరసున్న) అయితే సాధ్యఖండం, 'రాముఁడు'. 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత సాధింపబడింది. కాబట్టి దువర్ణానికి ముం దున్న అరసున్న సాధ్యఖండం. అలాగే వ్యాకరణంచేత సాధింపబడ్డ బిందువు పూర్ణ మైతే అది సాధ్యపూర్ణం. రాముండు.

**37. సిద్ధబిందువు (సిద్ధఖండబిందువు-సిద్ధపూర్ణబిందువు) :** సహజంగా సిద్ధ మైఉన్నది సిద్ధం. బిందువు అంటే అనుస్వారం. సున్న. శబ్దంలో ఆశబ్దం పుట్టుకతోటే ఏర్పడిఉన్నసున్న సిద్ధబిందువు. సహజసిద్ధ మైనఆసున్న అరసున్న అయితే సిద్ధఖండబిందువు. చీఁకటి. సహజసిద్ధ మైన ఆబిందువు నిండుసున్న అయితే అది సిద్ధపూర్ణబిందువు. బంతి మొ.

**38. సూత్రము :** 'అల్పాక్షర మసందిగ్ధం సారవద్ విశ్వతోముఖమ్, అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః.' 1. అక్షరాలు తక్కువ సంఖ్యలో ఉండడం. 2. సందేహానికి అవకాశం లేకుండా ఉండడం. 3. పదా లన్నీ ప్రయోజనవంతంగా, (దళసార్థక్యంతో) ఉండడం, 4. లక్ష్యాలను అధికసంఖ్యలో సాధించగలగడం, 5. అన్వయాదుల్లో క్లేశం లేకపోవడం. 6. ప్రామాణికంగా తగినలక్ష్యాలను మాత్రమే సాధించడం - అనే ఆరులక్షణాలు కలిగినవాక్యం సూత్రం. బాలవ్యాకరణంలో ప్రతిసూత్రం అలాంటిదే.

**39. స్థిరము** (సంజ్ఞ. 6): 'ఇతరము లగుహల్లులు స్థిరములు'. 'కచటతపలు పరుషంబు లని, గజడదబలు సరళంబు లని' అనేపూర్వలక్షణాన్ని అనుసరించి కచచటతప అనేపరుషాలు, గజజడదబ అనేసరళాలు కాకుండా, మిగిలిఉన్నహల్లు లన్నింటికీ స్థిరములు అని సంజ్ఞ. ఈసంజ్ఞలు సంస్కృతసమంతో కలిసి ఉన్న మొత్తం ఆంధ్రభాషలో. కాబట్టి ఖ, ఘ, ఙ మొద లైన 22 హల్లులకు స్థిరా లని సంజ్ఞ.

**40. హల్లు** (సంజ్ఞ. 1): 'కకారాదులు హల్లులు' వర్ణమాలలో నిర్దేశింపబడిన వర్ణాలలో కకారం మొదలుకొని చివరివరకు ఉన్నవర్ణాలు అన్నింటికీ హల్లులు అని

సంజ్ఞ. క–ఖ–స–హ–ళ మొ. వీటిలో అకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చబడింది. అది తొలగిపోగా మిగిలిన, క్ ఖ్ అనే విధ మైనపొల్లుకే హల్లు అని పేరు. 'హల్' అనేసంస్కృతప్రత్యాహారసంజ్ఞ తెలుగులో 'హల్లు' అని తత్సమం అయింది.

**41. హ్రస్వము :** 'ఊకాలో ఽజ్ర్ఘుస్వ దీర్ఘ ప్లుతః'. 'ఏకమాత్రో భవే ద్ధ్రస్వో ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే, త్రిమాత్ర స్తు ప్లుతో జ్ఞేయో, వ్యంజనం చార్ధమాత్రకమ్'. ఒకమాత్ర (సెకనులో అయిదోవంతు) కాలంలో ఉచ్చరింపబడే అచ్చు హ్రస్వం. అ–ఇ–ఉ మొ. రెండు మాత్రలకాలంలో ఉచ్చరింపబడేఅచ్చు దీర్ఘం. ఆ ఈ ఊ మొ. మూడు (అంతకంటే ఎక్కువ) మాత్రలకాలం ఉచ్చరింపబడేఅచ్చు ప్లుతం. ఆ3. ఈ3. ఊ3. మొ.

**42. హ్రస్వవక్రము** (సంజ్ఞ. 1) : చూ. వక్రము.

## 2. సంధిపరిచ్ఛేదం.

**1. అనుకరణము – అనుకృతి** (సంధి. 50–51): అను=సదృశంగా, కరణము= చేయుట. శబ్దశాస్త్రంలో ఇతరులవాక్యాలు, పదాలు, అలాగే ధ్వనులు మొద లైనశబ్దాలను యథాతథంగా అలాగే గ్రహించి చెప్పడం అనుకరణం. ఇదే అనుకృతి. (ఇది శబ్దానుకరణం. అర్థం మాత్రం అలాగే ఉండేటట్లు శబ్దాన్ని మార్చి చెప్తే అది అర్థానుకరణం అవుతుంది.) 'తుభ్యం నమో యనె'. ఇక్కడ – తుభ్యం నమః అనేసంస్కృతవాక్యం తెలుగులో అనుకరింపబడింది. ఇలాగే – సలసల మను మొ. (ఈసందర్భంలో తెలుగులో అనుకరింపబడేదానికి తర్వాత అనుధాతువు రూపం చేరుతుంది. కాబట్టి అనుధాతురూపాలను చేర్చడం అనుకరణం అని చమత్కరిస్తుంటారు.)

**2. అపదము** (సంధి. 11): పదం గానిది అపదం. 'సుప్తిజంతం పదమ్' సుప్పులు అంటే డు–ము–వు మొద లైననామవిభక్తులు, తిజులు–అంటే డుజ్–రు మొద లైనక్రియావిభక్తులు చివర గలిగినశబ్దాలకు పదా లని పేరు. వాటికంటే వే రైనశబ్దాలు అపదాలు. ప్రాతిపదికలు, ధాతువులు, ప్రత్యయాలు, ఆగమాలు మొద లైనవి అపదాలు. రామ – వండు – డుజ్ – టుక్ – మొ.

**3. అవసానము** (సంధి. 20): 'విరామో ఽవసానమ్.' 'వర్ణానా మభావః అవసానసంజ్ఞం స్యాత్'. తర్వాత వర్ణాలు లేకపోవడం అవసానం. వాక్యాదుల్లో చివర అని అర్థం. వాడు వచ్చెను. ఇక్కడ నువర్ణానికి తర్వాత వర్ణాలు లేవు. కాబట్టి యిది అవసానం.

**4. ఆకృతిగణము** (సంధి. 5): (ఆకృత్యా ఏవంజాతీకతయా నిర్ణేతవ్యో గణం ఆకృతిగణం. లోకప్రయోగానుసారేణ ఏవం జాతీయకాః శబ్దాః అస్మిన్ గణే నివేశనీయాః) కవిప్రయోగాలలో సమాన మైనఆకారం (లక్షణం) కలిగినవాటిని చేర్చుకోదగినగణం (శబ్దసముదాయం) ఆకృతిగణం. సంధి వికల్పంగా రావడం అనే (ఏమిశబ్దంతో) సామ్యం ప్రయోగాలలో ఉన్నశబ్దాన్ని ఏమ్యాదుల్లో చేర్చుకోవచ్చు. కాబట్టి ఏమ్యాది ఆకృతిగణం. మగని+ఆలు= మగనాలు. ఇందులో 'మగని' అనేశబ్దం ఏమ్యాదుల్లో చేరుతుంది.

**5. ఆగమము** (సంధి. 3): 'ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.' ఉన్నవర్ణాలు అన్నీ అలాగే ఉండగా అధికంగా వచ్చి(చేరడం ఆగమం)చేరేవర్ణం, లేదా వర్ణాలకు ఆగమం అని సంజ్ఞ. 'మాయమ్మ' ఇక్కడ మా+అమ్మ అని ఉండగా ' సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత అదనంగా వచ్చిచేరింది కాబట్టి యకారం ఆగమం. ఇలాగే రామునిచేత – 'ని' ఆగమం మొ.

**6. ఆమ్రేడితము** (సంధి. 10): 'తస్య పర మామ్రేడితమ్. ద్విరుక్తస్య పరం రూప మామ్రేడితసంజ్ఞం స్యాత్'. ఒకేశబ్దం రెండుసార్లు ఉచ్చరించినపుడు అందులో రెండవ (సారి ఉచ్చరించిన)శబ్దానికి ఆమ్రేడితం అని పేరు. ఏమి యేమి. ఇందులో రెండవ 'ఏమి' ఆమ్రేడితం. అరుదుగా 'గుభుల్ గుభుల్ గుభు లని' అని మూడుసార్లు గూడా ఉచ్చరించవచ్చు. రెండవదానినుంచి తరువాతి వన్నీ ఆమ్రేడితాలే.

**7. కిత్తు** (సంధి. 25) : కకారం ఇత్తుగా గలిగినది కిత్తు. ను(క్), టు(క్). మొ. 'నుక్' అనేఆగమంలో చివరికకారానికి ఇత్తు అని పేరు. కకారం ఇత్తుగా గలిగింది కాబట్టి 'ను' అనేవర్ణం కిత్తు అవుతుంది. 'ఆద్యంతౌ టకితౌ' అనేసంస్కృతపరిభాష ననుసరించి కిత్తు అయినవర్ణం విధించినదానికి చివర వచ్చిచేరుతుంది. చిగురు+కయిదువు. నుగాగమం వచ్చి, చిగురును+కయిదువు=చిగురుంగయిదువు ఇక్కడ 'ను' వర్ణం కి త్తయిన ఆగమం.

**8. క్త్వార్థము** (సంధి. 7): క్త్వా అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం క్త్వార్థం. 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు.' 'ఇదియె క్త్వార్థంబు నాఁబడు' సంస్కృతంలోని క్త్వా అనేప్రత్యయంయొక్క అర్థంలో తెలుగులో 'ఇ' అనేప్రత్యయం వస్తుంది. కాబట్టి ఈ 'ఇ' ప్రత్యయం క్త్వార్థం. 'వచ్చి' (వచ్చు+ఇ).

**9. టిత్తు** (సంధి. 3): టకారం ఇత్తు (ఇద్వర్ణం)గా కలిగినది టిత్తు. యట్, లట్,

ఇయుట్ అనేచోటుల్లో చివరిటకారం ఇత్తు. టకారం ఇత్తుగా కలిగినవి కాబట్టి దానికి ముందున్న, య,ల,ఇయు, అనేవి టిత్తులు. 'ఆద్యంతౌ టకితౌ' అనే సంస్కృతపరిభాషచేత టి త్తయినవర్ణం విధింపబడినదానికి ఆద్యవయవంగా అంటే ముందుగా వచ్చి చేరుతుంది. 'మా యమ్మ.' (మా+ య్అమ్మ). రాము+లను, భజియించు మొ.

**10. తద్ధర్మార్థకవిశేషణము** (సంధి 18.): ధాతువు(కర్త)యొక్క ధర్మం తద్ధర్మం. తస్య ధాతోః (కర్తుః) ధర్మః తద్ధర్మః. తద్ధర్మార్థమునందు ధాతువుపై కర్త్రర్థంలో ఎడి ఎడు ప్రత్యయాలూ, వానికి లోపమూ వస్తాయి. చేసెడువాడు, చేసెడివాడు, చేయువాడు. తద్ధర్మార్థకా లైన యీ(సుబంత)విశేషణరూపాలు తద్ధర్మార్థకవిశేషణాలు.

**11. నిరవకాశవిధి** (సంధి. 9): 'లక్ష్యాంతరచరితార్థతా అవకాశః. తచ్ఛూన్యత్వం నిరవకాశత్వమ్.' వే రొకఉదాహరణంలో లక్షణం ప్రయోజనవంతం కావడం అవకాశం. (సూత్రం ప్రవర్తించడానికి ఉదాహరణలు ఉండడం అవకాశం.) లేకపోవడం నిరవకాశత్వం. 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికంబులకు సంధి లేదు' అనేసూత్రంప్రకారం ద్రుతప్రకృతికాలకు అన్నింటికీ సంధి వారింపబడుతుండగా, ద్రుతప్రకృతికాలకుమాత్రమె కొన్నింటికి సంధి చెపుతున్న 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్నయుకారంబునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రం ప్రవర్తించడానికి ఉదాహరణలే ఉండవు. కాబట్టి అది నిరవకాశవిధి అవుతుంది. ప్రథమేతరవిభక్తి మొద లయినసూత్రాలలక్ష్యాలను విడిచిపెట్టినా, ఇకాది సూత్రానికి – వచ్చున్ అతడు, మొదలుగా ఇతర మయిన ఉదాహరణలు ఉన్నాయి కాబట్టి అది సావకాశవిధి.

**12. బహుళము** (సంధి. 36): క్వచిత్ ప్రవృత్తిః, క్వచి దప్రవృత్తిః, క్వచిద్ విభాషా, క్వచి దన్యదేవ. (విధే ర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహుళకం వదన్తి) విధించిన కార్యం 1. కొన్ని లక్ష్యాల్లో నిత్యంగా రావడం (ప్రవృత్తి) 2. కొన్ని లక్ష్యాల్లో అసలు రాక పోవడం(అప్రవృత్తి) 3. కొన్నిటిలో వికల్పంగా రావడం (విభాష) 4. కొన్నిచోట్ల విధించినదానికంటె ఇతర మైనకార్యం జరగడం అనేనాలుగువిధాలుగా కావడం బహుళం. ప్రాతాదుల్లో తొలియచ్చు మీదివర్ణాలు లోపించడం బహుళం. 1. మీదు+కడ – మీఁగడ. ప్రవృత్తి 2. క్రొత్తకుండలు – అప్రవృత్తి 3. ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు – విభాష 4. క్రీఁగాలు– క్రిందు+కాలు అనేచోట లుప్తశేషానికి (క్రి+కాలు) దీర్ఘం రావడం– అన్యకార్యం.

**13. లోపము** (సంధి. 18): 'అదర్శనం లోపః'. కనిపించకపోవడం, అంటే

వర్ణం తొలగిపోవడం లోపం. వచ్చె గోవులు. ఇక్కడ వచ్చెను+గోవులు అని ఉండగా 'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు.' అనేసూత్రంచేత 'ను' అనేద్రుతం అక్కడినుంచి తొలగిపోయింది. కాబట్టి ఇది లోపం.

**14. వర్గయుక్కు-వర్గయుగ్మము** (సంధి. 19): యుక్కు లేదా యుగ్మం అంటే సరిసంఖ్య కలిగింది. క-చ-ట-త-ప అనేవర్గలలో సరిసంఖ్య కలిగినవర్ణాలు. అంటే 2,4, సంఖ్య గలిగినవర్ణాలు వర్గయుక్కులు. ఖఛఠథఫ-ఘఝఢధభ-అనేపదివర్ణాలు వర్గయుక్కులు లేదా వర్గయుగ్మాలు.

**15. విధానము-విధి:** 'అప్రాప్యప్రాపణం విధానమ్. అప్రాప్తప్రాపకో విధిః.' పూర్వం (వివక్షించకపోవటంచేత) రానికార్యాన్ని వచ్చేటట్లుగా చెప్పడం విధానం లేదా విధి. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' మ రేలక్షణంచేత గూడా ప్రాప్తించనటువంటి పరస్వరైకాదేశం అనేకార్యం వచ్చేటట్లు చెప్తున్నది. కాబట్టి యీశాస్త్రం విధానం, విధి. (అలాగే 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు అనేతీరుగా రాకుండ చేయడం గూడా విధానమె.)

**16. విధానసామర్థ్యము:** (అప్రాప్యప్రాపణం విధానమ్. వైయర్థ్యాభావ స్సామర్థ్యమ్' కలుగనిదాన్ని కలుగజెప్పడం విధానం. ఆవిధానం వ్యర్థం కాకుండా ఉండడం విధానసామర్థ్యం. 'సమాసంబుల...నుగాగమం బగు' (సంధి. 25) అనేసూత్రం సమాసంలో నుగాగమం చెప్పింది. ఆనుగాగమం ద్రుతం. కాబట్టి 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంప్రకారం లోపించాలి. అలా లోపిస్తే నుగాగమం విధించడం వ్యర్థం. అది వ్యర్థం కాకుండా, సమర్థం కావాలంటే ఆద్రుతం లోపించగూడదు. కాబట్టి విధానసామర్థ్యంవల్ల అక్కడిద్రుతం లోపించ దని సూరి వివరించాడు. చిగురుంగైదువు.

**17. విభక్తి** (సంధి. 42): 'విభక్తి శ్చ- సుప్తిఙౌ విభక్తిసంజ్ఞౌ స్తః' అనేసంస్కృతసంప్రదాయా న్ననుసరించి తెలుగులో ప్రాతిపదికలపైన డుమువులు-ప్రథమ, ...అందు,న- సప్తమి అని వచ్చే 'డు' మొద లయిన ప్రత్యయాలూ (సుప్పులు), ధాతువులమీద 'లకారంబునకు డుడ్రువురునుము ఇఁగు' అని వచ్చే డుజ్ మొద లయిన ప్రథమ, మధ్యమ, ఉత్తమ పురుష ప్రత్యయాలు(తిఙులు) విభక్తులు. ప్రాతిపదికలమీద వచ్చేవి నామవిభక్తులు. ధాతువులమీద వచ్చేవి క్రియావిభక్తులు.

**18. విభాష** (సంధి. 29): 'న వేతి విభాషా- నిషేధవికల్పయో ర్విభాషా

సంజ్ఞా స్యాత్.' విభాష అంటే విధించినకార్యం కొన్ని లక్ష్యాలలో అసలు రాకపోవడం, కొన్నిచోట్ల వికల్పంగా రావడం. కాని యిది తఱుచుగా వికల్పం అనేఅర్థంలోనే కనిపిస్తున్నది. 'ఆదేశసరళములకు ముం దున్న ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' పూచెం గలువలు, పూచె న్గలువలు మొ. (అయితే ఆయాస్థలాలలలో తప్పక రావటం, అసలు రాకపోవటం, వికల్పంగా రావటం అనేవ్యవస్థ చేయడం విభాష స్థలంలో కనబడుతుంది. ఇది వ్యవస్థితవిభాష.)

**19. విశేషవిధి:** (అల్ప స్స్యా ద్విషయో యస్య స విశేషవిధి ర్భవేత్.) ఏలక్షణానికి లక్ష్యం కొంచెం అయిఉంటుందో అది విశేషవిధి. 'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును'. క్రియాపదాలలో మధ్యమపురుషక్రియలు అనే కొంచెం భాగం మాత్రమే లక్ష్య మై వర్తించేది కాబట్టి ఇది విశేషవిధి.

**20. వృత్తి** (సంధి. 45): 'పరార్థాభిధానం వృత్తిః– పరార్థస్య స్వార్థాభిధాయకత్వమ్. వృత్తి రేకార్థీభావః. ఏకార్థీభావం వృత్తి. అక్కడ ఉన్నశబ్దాల అర్థం ఏక మయి, వే రయినఅర్థాన్ని తెలియజేయడం వృత్తి. రామునిబాణము. ఇది రామునికి సంబంధించిన దైనబాణం అనేవిధంగా తాత్పర్యార్థం విశేషంగా తెలియజేస్తున్నది. ఇది సమాసంవల్ల కలిగింది కాబట్టి సమాసవృత్తి అవుతున్నది. ఇలాగే తద్ధితవృత్తి, కృద్వృత్తి మొ.

**21. వ్యవస్థితవిభాష** (సంధి. 17): (క్వచి ద్భవ తీ త్యంశ ఏవ ప్రవర్తతే, క్వచి త్తు న భవ తీ త్యేవ. క్వచి దుభయమ్. ఇ త్యేవం లక్ష్యానుసారేణ వ్యవస్థయా ప్రవృత్తా విభాషా, వ్యవస్థితవిభాషా) వ్యవస్థ అంటే నియమం. కొన్నిలక్ష్యాల్లో నిత్యంగా వస్తుం దనీ, కొన్నిలక్ష్యాల్లో అసలు రా దనీ, మరి కొన్నిలక్ష్యాల్లో రావడం, రాకపోవడం రెండూ ఉంటా యనీ వ్యవస్థ చేయబడిన విభాష– వ్యవస్థితవిభాష. ఆదేశసరళములకు – అనే సూత్రంలోని విభాషకు ప్రాతాదికార్యసందర్భంలో ద్రుతానికి సంశ్లేషం రా దని వ్యవస్థ చేయబడింది. కాబట్టి అది వ్యవస్థితవిభాష.

**22. శత్రర్థము** (సంధి. 2): 'శతృ' అనే సంస్కృతప్రత్యయంయొక్క అర్థం శత్రర్థం. 'లట శ్శతృ శానచౌ' అని శతృప్రత్యయం వర్తమానార్థకం. తెలుగులో ఆఅర్థంలో 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' అని చున్ అనే ప్రత్యయం వస్తుంది. చూచుచున్. ఇత్యాదుల్లో 'చున్' శత్రర్థకం.

**23. షష్ఠీ(తత్పురుష)సమాసము** (సంధి. 23): షష్ఠీవిభక్తి చివర గలిగినపదానికి తరువాతిపదంతో ఐనసమాసం షష్ఠీ(తత్పురుష)సమాసం. రాజునాజ్ఞ. ఇక్కడ

రాజుయొక్క అనేయొక్క షష్ఠీవిభ క్తి చివర గలిగినపదానికి ఆజ్ఞ అనేమీదిపదంతో సమాసం చేయడం జరిగింది. కాబట్టి యిది షష్ఠీ(తత్పురుష)సమాసం.

**24. సంధి** (సంధి. **1**): 'పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు' మొదటిశబ్దంలోనిచివరిఅచ్చుకూ, దానికి తరువాతిశబ్దం మొదటిఅచ్చుకూ రెండిటిస్థానంలోనూ తరువాతిశబ్దం మొదటిఅచ్చు ఒక్కటే ఆదేశంగా రావడం సంధి. రాముడు+అతడు = రాము డతడు. ఇక్కడ పరరూపం వస్తున్నది. కాబట్టి దీనిని పరరూపసంధి అనీ అంటారు. (సంధిపరిచ్ఛేదంలో చెప్పినసంహితలో వచ్చేకార్యా లన్నీ సంధులే. హరియతడు అనేచోట యడాగమం. మొ.)

**25. సంశ్లేషము** (సంధి. 17): 'సంశ్లేషం బనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట.' పూచె న్గలువలు. పూచెను+గలువలు అనేచోట 'ను' ద్రుతం పై నున్నహల్లుతో కలవా లంటే నువర్ణంలో ఉన్నఅచ్చు ప్రతిబంధకం. కాబట్టి ఉచ్చారణలో నకారం మీదిహల్లుతో కూడుకొనేటట్లు ద్రుతంలో ఉన్నఅచ్చు లోపిస్తుంది. 'పూచెన్ గలువలు' అని లిపిలో విడిగా ఉన్నా, ఉచ్చారణలో సంశ్లేషం అని గ్రహించాలి.

**26. సంహిత** (సంధి.): (పర స్సన్నికర్ష స్సంహితా. వర్ణానా మతిశయితసన్నిధి స్సంహితా సంజ్ఞ స్స్యాత్.)వర్ణాలకు నడుమ ఉచ్చారణంలో అర్ధమాత్రకంటే ఎక్కువ వ్యవధానం లేకుండటం సంహిత. రాముడు+అతడు. రెండుపదాలమధ్య సంహితవల్ల సంధి. సంహితనే సంధి అనేఅర్థంలో వ్యవహరించడం గమనింపవచ్చు.

**27. సాంస్కృతికపరుషములు** (సంధి. 14): 'కచటతపలు పరుషంబులు' సంస్కృతానికి సంబంధించినవి సాంస్కృతికాలు. సంస్కృతసమాల్లో (సంస్కృతానికి సంబంధించినభాగంలో)ని పరుషాలు సాంస్కృతికపరుషాలు. కంసారి– సంపూర్ణము మొ. ఇక్కడ కకారం, పకారం సాంస్కృతికపరుషాలు. (రామునకు, ఇక్కడ 'కు'విభక్తి తెలుగుభాగం. కాబట్టి ఆపరుషం సాంస్కృతికం కాదు.)

**28. సామాన్యవిధి:** (బహవో విషయా యస్య స సామాన్యవిధి ర్భవేత్.) అధిక మైనలక్ష్యభాగం కలిగి, ప్రవర్తించేఅవకాశం ఎక్కువగా ఉన్నలక్షణం సామాన్యవిధి. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' ఉత్తున కని సామాన్యంగా చెప్పటంచేత హ్రస్వ మయినఉకారం ఉండేస్థలాలు విస్తారంగా ఉండటంచేత దీనికి లక్ష్యాలు అధికంగా ఉంటాయి. అందుచేత ఇది సామాన్యవిధి.

**29.సావకాశవిధి:** చూ. నిరవకాశవిధి.

**30. స్వత్వము** (సంధి. 17): 'స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము'.

ద్రుతం స్వరూపంతో అంటే సహజ మైనరూపంతో ఉండడం స్వత్వం. వచ్చెను గోవులు, హరిని గాంచి, ఇత్యాదిగా ద్రుతం స్వత్వరూపం. ను–ని– అనేఆకారంతో ఉంటుంది. (అదియునున్ గాక మొ. అరు దైనచోట్ల నకారపుపొల్లు స్వత్వం.)

**31. స్వరము** (సంధి. 2): (అచ స్స్వరాః) అచ్చులకు స్వరా లని సంజ్ఞ. (స్వయం రాజంతే ఇతి స్వరాః) వేరొకవర్ణం సహాయం లేకుండా ప్రకాశించేవి (ఉచ్చరింపబడేవి) కాబట్టి అచ్చులు స్వరాలు. ఉదాత్త, అనుదాత్త, స్వరితాలు అనేస్వరభేదం కలిగినవి కాబట్టి అచ్చులు స్వరాలు. (ఉదాత్తం మొద లైనభేదాలు తెలుగులో లేవు.) తెలుగులో హ్రస్వం, దీర్ఘం అనేవిధ మెనస్వరభేదాలు మాత్రమే ఉన్నాయి.

## 3. తత్సమపరిచ్ఛేదం

**1. అతిదేశము** (తత్స. 75): 'అవిద్యమానధర్మప్రాపకం శాస్త్ర మతిదేశః'. (శబ్దస్తో.) లేనిధర్మాన్ని కలుగజేసే శాస్త్రానికి అతిదేశం అని పేరు.

'విశ్వకర్మ మొద లైనశబ్దాలు పుంలింగాలు. కాగా వీటిలో లేనిస్త్రీలింగత్వం అనేధర్మాన్ని ప్రాప్తింపజేస్తున్నది. కాబట్టి 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అనేశాస్త్రం, (దానివల్ల కలిగేస్త్రీలింగత్వమూ) అతిదేశం. దీనిచేత విశ్వకర్మాదిశబ్దాలకు స్త్రీలింగకార్యం అంటే ప్రథమైకవచనలోపం మొ. వస్తాయి. విశ్వకర్మ. (స్త్రీత్వం లేకపోతే) పుంలింగధర్మాన్నిబట్టి విశ్వకర్ముడు అని కావలసి వస్తుంది.

**2. అమహత్తు** (తత్స. 17): మహత్తు కానిది అమహత్తు. ' స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు' స్త్రీలూ, పశువులూ, పక్షులూ మొద లైన తిర్యక్కులనూ, అచేతనాలనూ బోధించేశబ్దాలు, వాటివిశేషణాలు, అమహత్తులు రమ (స్త్రీవాచకం) – చిలుక (తిర్యక్కు) – మేడ (జడము) ఉన్నతము (జడవిశేషణము) మొ.

**3. ఆదేశము** (తత్స. 35): 'వర్ణస్థానే వర్ణాంతరోత్పత్తి రాదేశః.' ఒకవర్ణంస్థానంలో వేరొకవర్ణం రావడం ఆదేశం. 'ఉదంతసంస్కృతనామంబుసంబుద్ధిడుజునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు'. విష్ణు+డుజ్= విష్ణు+ఊ3= విష్ణూ3 ఇక్కడ డుజ్ అనేవర్ణంస్థానంలో వచ్చింది కాబట్టి ప్లుత మైనఊకారం ఆదేశం.

**4. ఆమంత్రణము** (తత్స14): చూ. సంబోధనము.

**5. ఇత్తు** (తత్స. 19): 'కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధ మయి ప్రయోగించు నపుడు మానంబడువర్ణ మిత్తు నాఁబడు.' డుజ్. ఇందులో జకారం ఇత్తు. 1. (డువర్ణానికి) పూర్వంలో బిందువు రావడం అనేప్రయోజనం కోసం, 2. 'డు' అనే

ప్రత్యయంతో కూర్పబడి 3. రాముఁడు అనేవిధంగా ప్రయోగించేసమయంలో లేకుండా పోతుంది. కాబట్టి డుజ్‌లోని జకారం ఇత్తు. ఇలాగే యట్ లో టకారం, నుక్ లో కకారం మొ. ఇత్తులు.

**6. ఉత్తమము** (తత్స. 46): 'త్ర్యాదీనా మన్త్య ముత్తమమ్' మూడు గాని లేదా అంతకంటే ఎక్కువ గానీ అక్షరాలు ఉన్నశబ్దంలో చివరిఅక్షరానికి ఉత్తమం అని సంజ్ఞ. అక్షరం అంటే, అచ్చు లేదా అచ్చు చేరినహల్లు (హల్సముదాయం). పొల్లుహల్లు అక్షరం కాదు. కలికి. ఈమూడక్షరాలశబ్దంలో చివరి దైన 'కి' అనేఅక్షరం ఉత్తమం. అలాగే, పిడికిలి శబ్దంలో 'లి' ఉత్తమం.

**7. ఉపోత్తమము** (తత్స. 46): 'త్ర్యాదీనా మన్త్య ముత్తమమ్. తస్య సమీప ముపోత్తమమ్.' మూడు లేదా అంతకంటే ఎక్కువ అక్షరా లున్నపదంలో చివరిఅక్షరానికి ఉత్తమం అని పేరు. దానికి సమీపంలో ఉన్నఅక్షరం అంటే చివరి నుంచి రెండవఅక్షరం ఉపోత్తమం. కలికి. ఇందులో చివరి 'కి' ఉత్తమం. దానికి ముందున్న 'లి' ఉపోత్తమం. ఇలాగే 'పిడికిలిలో' 'కి' ఉపోత్తమం.

**8. ఏకవచనము** (తత్స. 11) : 'ఏకత్వసంఖ్యను బోధించుప్రత్యయం బేకవచనంబు' ఏకత్వం (ఒకటి) అనేసంఖ్యను తెలియజేసేప్రత్యయానికి ఏకవచనం అని పేరు. రాముఁడు. ఇక్కడ 'డు' అనేది ప్రథమావిభక్తి ప్రత్యయం. ఇది ఒక్కరాముడు అనేవిధంగా ఏకత్వాన్ని తెలియజేస్తున్నది. కాబట్టి యిది ఏకవచనం. ఇలాగే 'వచ్చుచున్నావు' లో – వు. మొ.

**9. క్లీబతుల్యము** (తత్స. 66): క్లీబం అంటే నపుంసకం. (సహజంగా నపుంసక లింగం కాకుండా) నపుంసకలింగశబ్దంతో తుల్యం అయినసంస్కృత(సమ) ప్రాతిపదికం క్లీబతుల్యం. 'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' కంధరా మొద లైనయీశబ్దాలు స్త్రీలింగాలు. వీటికి క్లీబాలతో తుల్యత్వం అతిదేశింపబడింది. దానివల్ల క్లీబకార్యం అంటే మువర్ణకాదులు వస్తాయి. కంధరము మొ. కంధరా మొద లయినసంస్కృతశబ్దాలు తెలుగులో క్లీబతుల్యాలు. అచ్చతెనుగుశబ్దాలు ఎప్పుడూ క్లీబతుల్యాలు కావు.

**10. జిత్తు** (తత్స.): జకారము ఇత్తుగా గలిగినది జిత్తు. 'డుజ్'– ఇందులో చివరి జకారానికి ఇత్తు అని పేరు. జకారం ఇత్తుగా కలిగింది. కాబట్టి ముందరి 'డు'వర్ణం జిత్తు. ఇలాగే, కుజ్, పజ్. 'జిత్తు బిందుపూర్వం బగు' అని జిత్తు లయిన వర్ణాలకు పూర్వంలో సున్న వస్తుంది. రాము+డుజ్ = రాముఁడు, రాముండు మొ.

**11. జడము** (తత్స17): 'జడములు అనగా అచేతనములు.' చేతన అంటే జ్ఞానం. అది లేనిది అచేతనం. అది జడం. అంటే సంకల్పాదిరూప మైనజ్ఞానం లేనిది జడం. చేతనం అంటే ప్రాణి అని కూడా అర్థం. కాబట్టి అచేతనం అంటే ప్రాణం లేనిది. ప్రాణం లేనివస్తువును బోధించేశబ్దం జడం. చెట్టు, ఱాయి. మొ.

**12. డుమంతము** (తత్స.20): 'డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు.' ప్రథమావిభక్తి ఏకవచనంలో డుజ్ అనేప్రత్యయం చేరడానికి అర్హ మైన ప్రాతిపదికకు డుమంతం అని పేరు. ప్రథమైకవచనంలో డుజ్ ఉండేశబ్దం డుమంతం. రాముఁడు, మగఁడు మొద లైనవిధంగా డుజ్వర్ణం నిలిచిఉండే, రామ, మగ మొ. ప్రాతిపదికలకు డుమంతా లని పేరు. డుజు లేకపోవడంవల్ల, హరి, మను (వు) మొద లైనవి డుమంతాలు కావు.

**13. తపరకరణము** (తత్స.45): తకారాన్ని తరువాతగా చేర్చటం త-పర-కరణం. 'ఇత్తునకు బహువచంబు పరం బగునపు డుత్వం బగు'. ఇక్కడ ఇత్తు-ఇత్-అనేచోట హ్రస్వ మైనఇకారానికి పరంగా తకారం చేర్చబడింది. ఇలా చేర్చడమే తపరకరణం. 'తపర స్తత్కాలస్య' అనేసంస్కృతపరిభాషచేత 'త'కారం దేనికి తర్వాత చేర్చబడిందో ఆవర్ణం ఒక్కదానినే ఆశబ్దం బోధిస్తుంది. కాబట్టి 'ఇత్' అంటే హ్రస్వ మైనఇకారం ఒక్కటే గ్రహింపబడుతుంది. హరి+లు, హరులు. దీర్ఘ మైనఈకారాన్ని ఇది బోధించదు. లకోరీలు.

**14. తిర్యక్కు** (తత్స.17): తిర్యక్కు లనఁగా పశుపక్ష్యాదులు. తిర్యక్కుగా-అడ్డంగా సంచరించేవి. పశువులు, పక్షులు, కీటకాలు, మొద లైనవాటిని బోధించేశబ్దాలు తిర్యక్కులు. స్త్రీపురుషులు, కాకుండా మిగిలినప్రాణు లన్నీ తిర్యక్కులు. ఏనుగు, చిలుక, చీమ. మొ.

**15. నామము** (తత్స.21): 'ప్రాతిపదికం హి నామ'. నామం బనఁగా ప్రాతిపదికము. సంస్కృతవ్యాకరణా న్ననుసరించి ప్రాతిపదిక అనేసంజ్ఞ కలిగిన శబ్దానికి తెలుగులో ప్రాతిపదికసంజ్ఞతోపాటు 'నామము' అనేసంజ్ఞ గూడా ఉంటుంది. 1. ధాతువూ, ప్రత్యయమూ, గాని అర్థవంత మైనశబ్దం - డిత్థ 2. కృదంతం- రామ. 3. తద్ధితప్రత్యయాంతం - భార్గవ 4. సమాసం - రాజపురుష మొ. నామాలు.

**16. నిపాతము** (తత్స.51): 'శాస్త్రేణ అన్యథా ప్రాప్తే అన్యథా నియమనం నిపాతః. శాస్త్రం ప్రకారం ఒకతీరుగా ఏర్పడుతున్నశబ్దాన్ని కవిప్రయోగానుగుణంగా

వేరొకవిధంగా ఉండేటట్లు నియమం చేయటాన్ని నిపాత అంటారు. కద్రూశబ్దానికి ఉదంతత్వాన్ని అనుసరించి వువర్ణకాదులు వచ్చి కద్రువు, కద్రువులు ఇత్యాదిగా ఏర్పడవలసిఉంది. 'కద్రువ నాగమాత' అనేసూత్రం కద్రువ, కద్రువలు, అనేవిధంగా 'వ' వర్ణాదులతో రూపాలను నియమించడంచేత ఇది నిపాత విధి.

**17. నియమము:** 'సామాన్యప్రాప్తస్య విశేషావధారణం నియమః.' సామాన్యంగా ప్రాప్తిస్తున్నఅంశాన్ని విశేషంగా కొన్ని ప్రత్యేకస్థలాల్లో మాత్రం ప్రవర్తించేటట్లుగా చేసేవిధానం నియమవిధి. 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రం 'విభక్తికి' అని సామాన్యంగా చెప్పడంచేత క్రియా విభక్తికి గూడా లోపం సిద్ధిస్తున్నది. అటువంటప్పుడు 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు' అని ము, డుజ్, అనేక్రియావిభక్తులకు లోపం చెప్పడం అవసరం గాదు. 'సిద్ధే స త్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి' అనేన్యాయా న్ననుసరించి ముడుజ్లోపవిధి క్రియావిభక్తుల్లో ముడుజులకు మాత్రమే లోప మనీ, విభక్తిలోపం చెప్పినసూత్రంచేత క్రియావిభక్తులకు లోపం రా దనీ నియమం చేస్తుంది. కాబట్టి ముడుజ్లోపసూత్రం నియమవిధి.

**18. పర్యుదాసము** (తత్స. 24)**:** 'పర్యుదాస స్స విజ్ఞేయో య త్రోత్తరపదేన నఞ్'. నఞ్ అనేశబ్దానికి మీదిపదంతో ఏర్పడినసమాసంతో చేయబడిననిషేధం పర్యుదాసం. 'అనుదంత మగుతెనుఁగుడుమతంబునకు నిగాగమము నిత్యముగా నగును' ఇక్కడ, న+ఉదంత – అనేవిధంగా నఞ్‌కు ఉదంత అనేతరువాతిపదంతో సమాసం చేయడంవల్ల ఏర్పడిన 'అనుదంత' అనేది పర్యుదాసం. దీనివల్ల ఉదంతాలకు నిగాగమం నిత్యంగా రావడం నిషేధింపబడింది. తమ్మునిచేత – తమ్ముచేత. మొ.

**19. పుంలింగతుల్యము** (తత్స. 18,ఆచ్ఛి. 2)**:** పుంలింగంతో తుల్య మైనది పుంలింగతుల్యం. పుంలింగం (ఏలింగమూ) కాకుండా, పుంలింగంతో తుల్యంగా చెప్పబడిన సంస్కృత(సమ), ఆచ్ఛికశబ్దాలు పుంలింగతుల్యాలు. 'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు'. అలాగే 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనేసూత్రంలో తఱుచుగా అనడంవల్ల చందుర, కొమర మొద లైన అచ్చతెలుగుశబ్దాలు గూడా పుంలింగతుల్యా లైనాయి. పుంలింగతుల్యత్వం వల్ల డుజ్ మొ. పుంలింగకార్యాలు వస్తాయి. మిత్రుఁడు. చందురుఁడు. మొ.

**20. ప్రకృతి** (తత్స. 20)**:** (ప్రకృతి ర్నామ అర్థావబోధహేతుః ప్రత్యయవిధాన అవధీభూతః శబ్దవిశేషః) నామ(సుప్)విభక్తులు, క్రియా(తిఙ్)విభక్తులు చేరడానికి

యోగ్య మైన, అర్థవంత మైనశబ్దానికి ప్రకృతి అని పేరు. ప్రథమ మొద లైనవిభక్తులు చేరడానికి మూల మైన ప్రాతిపదికలు, డుజ్ మొద లయినప్రథమపరుషాది ప్రత్యయాలు చేరడానికి మూల మైనధాతువులు మొ.ప్రకృతులు. రామ,కాచు మొ.

**21. ప్రత్యయము** (తత్స. 10): 'ప్రతీయతే ఇతి ప్రత్యయః.' (ప్రకృతి మవధీకృత్య విధీయమానః స్వార్థబోధకః శబ్దవిశేషః) ప్రత్యయము లంటే విధింపబడేవి. ప్రకృతికి ముందు, వెనుకలుగా వచ్చి చేరేవి. అర్థవంతా లైనవీ ప్రత్యయాలు. డుజ్ మొ. నామవిభక్తులు, క్రియావిభక్తులు, కృత్తులు, తద్ధితాలు మొద లైనవి.

**22. ప్రాతిపదికము** (తత్స. 21) : 'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్'. 1.ధాతువూ, ప్రత్యయమూ, కాకుండా అర్థవంత మైనశబ్దం ప్రాతిపదికం. డిత్థ, తండ్రి మొ. 'కృత్తద్ధిత సమాసా శ్చ' 2. కృత్ప్రత్యయం చివర గలవి. రామ, చదువుట, 3. తద్ధితప్రత్యయం చివర గలిగినవి. భార్గవ–చదువరి. 4. సమాసాలు. రాజపురుష, మాటనేర్పు. వీటికి సంస్కృతానుసారంగా తెలుగులో ప్రాతిపదిక అని సంజ్ఞ. తెలుగులో ప్రాతిపదికకు 'నామం' అని విశేష మైనసంజ్ఞ.

**23. బహువచనము** (తత్స. 12): 'బహుత్వసంఖ్యను బోధించుప్రత్యయంబు బహువచనంబు.' తెలుగులో ఒకటికంటె ఎక్కువ సంఖ్య కలిగినవిగా తెలిపేప్రత్యయం బహువచనం. 'రాములు'. ఇందులో 'లు' అనేప్రత్యయం ఒక్కరికంటె ఎక్కువమంది రాములు అనేవిధంగా బహుత్వాన్ని బోధిస్తున్నది. కాబట్టి బహువచనం. ఇలాగే రు, (చదువుదురు), ము, (మేము) మొ.

**24. మహతి** (తత్స. 86): మహతి అంటే స్త్రీవాచకం. 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు' అనేసూత్రంప్రకారం పురుషవాచకాలు మహత్తులు. మహత్ శబ్దం స్త్రీప్రత్యయాంత మై, మహతి అయింది. కాబట్టి స్త్రీవాచకాలకు 'అమహత్తు' అనేసంజ్ఞతోపాటు మహతి అనేసంజ్ఞ గూడ ఉన్నది. లక్ష్మి, అమ్మ, వీటివిశేషణాలు గూడా మహతులు అవుతాయి. 'గుణవతి' ఐన పెండ్లము మొ.

**25. మహత్తు** (తత్స. 17): 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులను మహత్తు లనంబడు' స్త్రీలూ, పశువులు, పక్షులు మొద లైనతిర్యక్కులూ, అచేతనాలూ, కానిదాన్ని (పురుషులను) బోధించేశబ్దాలకు, వాటివిశేషణాలకు మహత్తు అని సంజ్ఞ. గుణవంతు డైన రాముడు. ఇక్కడ రాముడు (విశేష్యం), దానికి విశేషణ మైన గుణవంతుడు, అనేవి మహత్తులు.

**26. వర్ణకము** (తత్స. 10): 'ప్రత్యయ ఇహ వర్ణకః.' 'ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.' సంస్కృతా న్ననుసరించి ప్రత్యయం అనేదానికి తెలుగులో వర్ణకం అని విశేష మైనసంజ్ఞ. రాముడు, వచ్చుచున్నాడు. నామవిభక్తులు, క్రియావిభక్తులు మొ. డుఙ్, ము, మొ.

**27. వికృతి** (తత్స. 46): '(ఇచట) వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు'. సంస్కృతసమంకంటే వే రయినఆంధ్రభాషకు వికృతి అని వ్యవహారం. వికృతి అంటే ఆచ్ఛికం, అచ్చతెనుగు అని అర్థం. ప్రాకృతసమం, సంస్కృతప్రాకృతభవాలు, దేశ్యాలు, వికృతి అవుతాయి. సిరి – ఆకసము – ఇంగలము – ఊరు. మొ.

**28. సంబుద్ధి** (తత్స. 34): 'ఏకవచనం సంబుద్ధిః' సంబోధనార్థంలో ప్రథమావిభక్తి ఏకవచనానికి సంబుద్ధి అని సంజ్ఞ. ఓ రాముఁడ. ఓ రాముఁడు అనేచోట డుఙ్ సంబోధనార్థంలో వచ్చినప్రథమావిభక్తి, ఏకవచనం కాబట్టి సంబుద్ధి అవుతుంది. సంబోధనం అనేసామాన్యార్థంలో గూడా ఇది అక్కడక్కడ కనబడుతున్నది.

**29. సంబోధనము** (తత్స. 32): 'అన్య త్రాసక్తస్య కార్యాన్తరే నియోజనార్థం ఆభిముఖ్యవిధానం సంబోధనమ్.' వేరొకదానిలో ఆసక్తి కలవాడిని, (ఇష్టకార్యంలో నియోగించడానికి) తనకు అభిముఖంగా చేసుకోవడం సంబోధనం. ఓ రామ, వృక్షములార, మొ. ఇదే ఆమంత్రణం.

**30. సంబోధ్యవాచకము** (తత్స. 14): సంబోధనం అంటే అభిముఖం చేసుకోవడం సంబోధింపదగినది సంబోధ్యం. దానిని తెలిపేశబ్దం సంబోధ్యవాచకం. అంటే ఎవర్ని పిలుస్తున్నామో వాళ్లను బోధించేశబ్దం. ఓ రామ! ఇక్కడ సంబోధింపబడేవాడు రాముడు. కాబట్టి అతణ్ణి తెలియజేసే రాముడు అనేశబ్దం సంబోధ్యవాచకం.

**31. సుబంతము** (క్రియ. 46): సుప్ అంతంలో కలిగినది సుబంతం. సుప్పులు సంస్కృతంలో నామ (ప్రాతిపదికలపై చేరే) విభక్తులు. తెలుగులో డుమువులు మొదలుగా చెప్పబడిన ప్రథమ మొద లయినవిభక్తులు (సుప్పులుగా) అంతంలో కలిగినశబ్దాలను సుబంతాలుగా గ్రహించాలి. సుబంతాలు అంటే (ప్రథమావిభక్తి మొ. సప్తమీవిభక్తి వరకున్న) నామవిభక్త్యంతాలు. రాముడు, వనమునందు. మొ.

# ఆచ్ఛికపరిచ్ఛేదం

**1. అచ్చ** (ఆచ్ఛి. 1): 'సంస్కృతసమేతరం బయినయీభాష యచ్చ యనంబడు' సంస్కృతసమంకంటె వే రయిన తెలుగుభాషకు అచ్చ అని పేరు. 1. ప్రాకృతసమం– అగ్గి 2. సంస్కృతభవం– ఆకసము. 3. ప్రాకృతసమం– ఇంగలము. 4. దేశ్యం– ఊరు. అనే నాలుగు విధా లైనపదాలు 'అచ్చ' అవుతాయి. అచ్చకే ఆచ్ఛికము అని పేరు. దీన్నే అచ్చతెనుగు, వికృతి అనీ అంటారు.

**2. అనౌపవిభక్తికము** (ఆచ్ఛి. 16): ఔపవిభక్తికాలు కానివి అనౌపవిభక్తికాలు. 'ఇటితి వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు' అని ఆచ్ఛికపరిచ్ఛేదంలో తరువాత చెప్పబోయే ఇ, టి, తి అనేవర్ణాలకు ఔపవిభ క్తికాలు అని పేరు. ఔపవిభక్తికం అనేసంజ్ఞ గలిగిన ఇ–టి–తి అనేవర్ణాలు చేరే ప్రాతిపదికలకు కూడా ఔపవిభక్తికాలు అని వ్యవహారం. కాబట్టి ఇ–టి–తి అనే ఔపవిభక్తికాలు చేరనిప్రాతిపదికలు అనౌపవిభక్తికాలు అవుతాయి. ఉదా. కల్లు (మద్యం), పల్లు (పల్లము), చిలుక–మొ.

**3. ఆచ్ఛికము** (ఆచ్ఛి. 2): అచ్చయే ఆచ్ఛికం. చూ అచ్చ.

**4. ఉపవిభక్తి:** చూ. ఔపవిభక్తికము

**5. ఔపవిభక్తికము** (ఆచ్ఛి 28) : 'విభక్తినిమిత్తకము లయి యాదేశాగమాత్మకంబు లయిన ఇ–టి–తి అనువర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు'. విభక్తిని నిమిత్తంగా చేసుకుని ముందరిప్రాతిపదికకు చివర ఆదేశంగానూ, ఆగమంగానూ వచ్చేటటువంటి ఇ–టి–తి అనే మూడువర్ణాలకు ఔపవిభక్తికా లని సంజ్ఞ. విభక్తికి సమీపంలో ఉండేవి కావడంవల్ల వీటిని ఉపవిభక్తులు అని కూడా అంటారు. ఉపవిభక్తులే ఔపవిభక్తికాలు. ఇ–ఊరిని, టి–మూటికి, మూడిటికి, తి–గోతులు. ఈఔపవిభక్తికవర్ణాలు చేరేప్రాతిపదికలకు గూడా ఔపవిభక్తికాలు అని వ్యవహారం. ఊరు. ఇల్లు, గోయి మొ.

**6. క్లీబసమము** (ఆచ్ఛి. 2): క్లీబం అంటే నపుంసకలింగం. క్లీబంతో సమ మైన అచ్చతెనుగుశబ్దం క్లీబసమం. 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు'. ఆచ్ఛికశబ్దాలకు లింగం లేదు. ఏలింగమూ కాని, సున్న– సన్న– మొద లైనఅచ్చతెలుగుశబ్దాలు క్లీబసమాలు. క్లీబసమత్వంవల్ల వీటికి మువర్ణకాది క్లీబకార్యాలు కలుగుతాయి. సున్నము (సంస్కృతసమశబ్దాలు క్లీబసమాలు గావు.)

**7. పూరణార్థము** (ఆచ్ఛి. 26): (పూర్యతే అనే నేతి పూరణః) దేనిచేత పూరింప

(నింప)బడుతుందో అది పూరణం. ఆఅర్థం పూరణార్థం. 'సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమం బగు'. రెండవవాడు. వీనిచేత రెండు అనేసంఖ్య పూరింపబడుతున్నది. అనే పూరణఅర్థంలో రెండు శబ్దంపై 'అవ' ఆగమ మైంది.

**8. సర్వనామము** (అచ్చి.24): 'అన్ని ప్రభృతులు సర్వనామంబులు' అన్ని మొద లయినశబ్దాలకు తెలుగులో సర్వనామాలు అని సంజ్ఞ. అన్ని–ఇన్ని–కొన్ని– పెక్కు– పలు– ఆ–ఈ–ఏ– నీ–నా–తా–మన– సంఖ్యను తెలియజేసే ఒక మొద లయినశబ్దాలు గూడా తెలుగులో సర్వనామాలు అవుతాయి. (సంస్కృతంలో సంఖ్యావాచకాలకు సర్వనామసంజ్ఞ లేదు.)

**9. స్త్రీసమము** (అచ్చి.2): 'అచ్చికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు'. అని కొన్ని అచ్చతెనుగుశబ్దాలకు స్త్రీసమత్వం అతిదేశింపబడింది. దీనివల్ల ఈశబ్దాలు స్త్రీలింగంతో సమాన మై, స్త్రీలింగశబ్దాలతో సమానంగా ప్రథమైకవచనలోపం మొద లైనస్త్రీలింగకార్యాలు పొందుతాయి. అన్న, తల్లి, చెట్టు మొ. ప్రథమైకవచనం లోపించేఅచ్చతెనుగుశబ్దాలు స్త్రీసమా లని స్థూలంగా చెప్పవచ్చు. (సంస్కృతసమాల్లో స్త్రీసమా లుండవు. సుర, అసుర అనేశబ్దాలు స్త్రీతుల్యాలుగా చెప్పబడ్డాయి. మాతృ, పితృ ఇత్యాదులకు స్త్రీవద్భావం విహితం.)

## కారకపరిచ్ఛేదం

**1. అధికరణ(కారక)ము** (కార.17): ఆధారో ఽధికరణమ్. 'అధికరణంబు నా నాధారంబు' అధికరణం అంటే ఆధారం. కర్త లేక కర్మ– ద్వారా, వానిక్రియకు ఆశ్రయ మైనది అధికరణం. 'ఘటమందు జల మున్నది.' ఇక్కడ జలం అనే కర్తయొక్క ఉండుట అనేక్రియకు ఆశ్రయం కాబట్టి ఘటం ఆధారం. ఘటమున జలమును నింపెను. ఇక్కడ జలం కర్మ అయింది. దాని కాశ్రయం కాబట్టి ఘటం అధికరణం. (అధికరణానికి అందు–న అనే సప్తమీవిభక్తులు వస్తాయి)

**2. అనుప్రయోగము** (కార.10): 'అనుప్రయుజ్యత ఇ త్యనుప్రయోగః.' అనుసరించి ఎడం లేకుండా వెంటనే ప్రయోగించడం అనుప్రయోగం. 'ఉండిపదం బొకానొకచో వలన వర్ణకంబున కనుప్రయుక్తం బగు' నాకంబువలననుండి నారదుండు వచ్చె. ఇక్కడ ఉండి అనేపదం వలన అనేపంచమీవిభక్తిని అనుసరించి ప్రయోగింపబడింది. కాబట్టి అనుప్రయోగం. ఇది లేకపోయినా అర్థానికి భంగం ఉండదు. 'నాకంబువలన వచ్చె' అన్నా అర్థం అదే.

**3. అపాదాన(కారక)ము** (కార.9): 'ధ్రువ మపాయే ఽపాదానమ్, అపాయో

విశ్లేషః తస్మిన్ సాధ్యే ధ్రువ మవధిభూతం కారక మపాదానం స్యాత్.' అపాయం– అంటే ఎడబాటు (వియోగం) దేనినుంచి కలుగుతుందో దానికి అపాదానం అని సంజ్ఞ. దానికి తెలుగులో 'వలన' అనేపంచమీవిభక్తి వస్తుంది. 'చెట్టువలన పండు పడెను' ఇక్కడ పండుకు చెట్టునుండి (పడిపోవటంవల్ల) ఎడబాటు కలిగింది కాబట్టి చెట్టు అపాదానం.

**4. అభివ్యాపకము** (కార. 17)**:** 'సకలావయవకృతఆధారః అభివ్యాపకః,' ఎల్లయెడలా ఆశ్రయించి ఉండేఆధారం అభివ్యాపకం. సర్వంబునం దీశ్వరుండు గలండు. ఇక్కడ ఈశ్వరుడికి సమస్త మైనయీఆధారం అభివ్యాపకం.

**5. ఆఖ్యాతము** (కార. 1)**:** 'క్రియాప్రధాన మాఖ్యాతమ్.' ఆఖ్యాతం అంటే తిఙు – తిఙంతం అని అర్థం. క్రియావిభక్తి, లేదా క్రియావిభక్తి చివర గలిగినపదం ఆఖ్యాతం. వచ్చుచున్నాడు మొ. క్రియలు, ఇందులో డుఙ్ మొద లైనక్రియావిభక్తులు ఆఖ్యాతాలు.

**6. ఉక్తార్థం (**కార. 1)**:** ఉక్తం అంటే చెప్పబడినది. తిఙ్ అంటే క్రియా(పదం) విభక్తి (అలాగే కృత్, తద్ధిత, సమాసాల)చేత చెప్పబడేఅర్థం ఉక్తార్థం. 'రాముడు మెచ్చెను' ఇక్కడ మెచ్చెను అనేక్రియాపదం (ఎను అనేక్రియావిభక్తి) రాముడు అనేకర్తను చెప్తున్నది. కాబట్టి ఇది ఉక్తార్థం. ఈఅర్థంలో ప్రథమావిభక్తి వస్తుంది. (ఇలాగే రాముడు రక్షించెడువాడు (కృత్తుచేత ఉక్తార్థం). రాముడు సొగసరి (తద్ధితంచేత ఉక్తం) మొ.

**7. ఉపయోగము** (కార. 7)**:** 'నియమపూర్వకవిద్యాస్వీకారః' 'నియమపూర్వక విద్యాస్వీకారం బుపయోగం బనంబడు.' బ్రహ్మచర్యం మొద లైననియమాలతో వేదాదివిద్యలను గ్రహించడానికి ఉపయోగం అని సంజ్ఞ. 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు' అని ఇక్కడ తోడప్రత్యయం వస్తుంది. రామకృష్ణులు సాందీపనితోడ వేదంబులు చదివిరి.

**8. ఔపశ్లేషికము** (కార. 17)**:** 'సంయోగాదిసంబంధప్రయోజ్య ఆధార ఔపశ్లేషికః సమీప(సంయోగ)సంబంధరూప మైనఆధారానికి ఔపశ్లేషికం అని పేరు. ఏకదేశం (కొంతభాగం) మాత్రమే ఆశ్రయ మైనఆధారం. ఘటమందు జల మున్నది. ఇక్కడ నీటికి కుండలో కొంత (లోపలి)భాగం మాత్రమే ఆధారం. అంటే ఏకదేశం. కాబట్టి యీఆధారం ఔపశ్లేషికం.

**9. కరణ(కారక)ము** (కార. 4)**:** ' క్రియాసిద్ధౌ ప్రకృష్టోపకారకం కారకసంజ్ఞం

స్యాత్.' 'క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు.' క్రియలవ్యాపారం సిద్ధించడంలో (మిగిలినవాటికంటె) అధికంగా ఉపకరించేటటువంటిసాధనానికి కరణం అని సంజ్ఞ. 'కోలచేత కూల్చె' ఇక్కడ కూల్చుట అనేక్రియ సాధించడానికి మిక్కిలిగా ఉపయోగించేసాధనం కాబట్టి 'కోల' కరణం. కరణానికి చేత, లేదా తోడ అనేతృతీయావిభక్తులు వస్తాయి.

**10. కర్త** (కార. 3): 'ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు.' ధాతువుకు అర్థ మైనవ్యాపారం దేనిని ఆశ్రయించిఉంటుందో (పని చేసినవాడు) అది కర్త. దేవదత్తునిచేత వంటకము వండఁబడెను' ఇక్కడ వండు అనేధాతువుయొక్క అర్థ మైన వంట చేయడం అనేవ్యాపారం దేవదత్తుణ్ణి ఆశ్రయించిఉంది. కాబట్టి దేవదత్తుడు కర్త. కర్తకు 'చేత' అనేతృతీయావిభక్తి వస్తుంది.

**11. కర్మము** (కార. 2): 'ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు.' ధాతువుయొక్క అర్థ మైనఫలం దేనిని ఆశ్రయించిఉంటుందో అది కర్మ. దేవదత్తుడు వంటకమును వండెను. 'వండు' అనేధాతువుకు అర్థ మైన (వంటచేయుట అనేవ్యాపారానికి) ఫలం వండబడినపదార్థం, (వండబడటం) అనేఫలం వంటకాన్ని ఆశ్రయించి ఉంది. కాబట్టి ఇక్కడ వంటకం కర్మం. కర్మకు ద్వితీయావిభక్తి వస్తుంది.

**12. కారకము** (కార. 1): 'క్రియాజనకమ్ కారకమ్' కరోతి క్రియాం నిర్వర్తయతి ఇతి కారకమ్' కర్మ, కర్త, కరణం, సంప్రదానం, అపాదానం, అధికరణం అనే ఆరింటికి కారకాలు అని పేరు. కారకం అంటే క్రియాజనకం. అంటే క్రియతో సంబంధం కలిగింది. క్రియతో అన్వయించేది కారకం. క్రియను గూర్చినఆకాంక్షను కలిగించేది అని అర్థం. 'దేవదత్తుడు' అంటే, అత డేం చేశాడు. మొద లైనవిధంగా క్రియను గూర్చినఆకాంక్ష కలుగుతుంది. దేవదత్తుడు చదివెను. అంటే కర్తృకారకం. (రామునియొక్క అన్నపుడు ఇలా క్రియాకాంక్ష లేదు. కాబట్టి ఆపష్ఠి కారకం కాదు.)

**13. నిర్ధారణపంచమి** (కార. 16): (పంచమీవిభక్తేః నిర్ధార్యమాణస్య యత్ర భేద ఏవ తత్ర పంచమీ) నిర్ధారణార్థంలో వచ్చేపంచమీవిభక్తి నిర్ధారణపంచమి. జాతి, గుణం, క్రియ, సంజ్ఞ అనేవాటివల్ల కేవలం భేదాన్నిబట్టి దేనినుంచి వేరుచేయడం జరుగుతుందో ఆనిర్ధారణావధికి పంచమి, దానికి – కంటె విభక్తి వస్తుంది. 'జానపదులకంటె నాగరులు వివేకులు.' ఇక్కడ జాతినిబట్టి నాగరులు జానపదులనుంచి వేరుచేయబడ్డారు. జానపదులకంటె నాగరులు భిన్నులు. భేదంతో వేరుచేయడం ఈనిర్ధారణలో విశేషం. జానపదులకంటె అని యిక్కడ వచ్చినపంచమి నిర్ధారణ పంచమి.

**14. నిర్ధారణము-నిర్ధారణషష్ఠి** (కార. 16): (జాతిగుణక్రియాసంజ్ఞాభిః సముదాయా దేకదేశస్య పృథక్కరణం నిర్ధారణమ్) 'జాతి గుణ క్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు.' సమూహంనుంచి ఆసముదాయంలోని ఒకభాగాన్ని జాతి, గుణం, క్రియా, సంజ్ఞలనుబట్టి వేరుచేయడం నిర్ధారణం. ఈఅర్థంలో దేనినుండి వేరుచేయబడుతుందో ఆసముదాయవాచకశబ్దానికి లోపల అనేషష్ఠీవిభక్తి వస్తుంది. 'ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు', ఛాత్రులు అనేసముదాయం నుంచి అందులో ఒక డైన మైత్రుడిని, మైత్రుడు అనేసంజ్ఞనుబట్టి వేరుచేయడం జరిగింది. కాబట్టి యిది నిర్ధారణం. ఈఅర్థంలో వచ్చిన 'ఛాత్రులలోపల' అన్నప్పటిలోపలషష్ఠి నిర్ధారణషష్ఠి.

**15. ప్రాతిపదికార్థము** (కార. 1): (నియతోపస్థితికః ప్రాతిదికార్థః) 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థము'. ప్రాతిపదికను ఉచ్చరించిన వెంటనే ఏఅర్థం స్ఫురిస్తుందో ఆఅర్థం ప్రాతిపదికార్థం. తండ్రి- ఈశబ్దాన్ని పలకడంతోనే స్ఫురించే 'జన్మ నిచ్చినవాడు' అనేవిధ మైనఅర్థం, ప్రాతిపదికార్థం. ఈఅర్థంలో ప్రాతిపదికపై ప్రథమావిభక్తి వస్తుంది.

**16. ప్రాయికము** (కార. 33): 'ప్రాయేణ భవః' ప్రాయికం అంటే తఱుచు అని అర్థం. 'తఱుచుగ ననుటచే నొకొనొకచో వైకల్పిక' మనేసూరివివరణాన్నిబట్టి ప్రాయికం అని చెప్పబడినకార్యం లక్ష్యాల్లో సాధారణంగా నిత్యంగా ప్రవర్తిస్తుంది. అరుదుగా రాకుండడం గూడా ఉంటుంది. నీవు భక్తుడవు ఇత్యాదిగా వు ము. ఆగమాలు రావడమే సాధారణం. 'మీరలు పెద్దలు' అని అపుడపుడూ రాకపోవడం ప్రాయికశబ్దంవల్ల సాధ్యం అవుతుంది.

**17. భవత్యర్థము** (కార. 28): భవతి+అర్థ = భవత్యర్థం. 'ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే' అని భూధాతువు 'శ్తిప్' చివర చేర్చగా ఏర్పడిన 'భవతి' అనేశబ్దంతో నిర్దేశింపబడింది. కాగా 'భవతి' అంటే భూధాతువు అని అర్థం. భవత్యర్థం అంటె భూధాతువుయొక్క అర్థం. తెలుగులో 'అగు' అనేధాతువు భూధాత్వర్థకం. అగు, అయిన మొద లైనవి భవత్యర్థకాలు.

**18. వచనము** (కార. 19): 'వచనం సంఖ్యా.' ప్రాతిపదికార్థాదుల్లోని సంఖ్యను బోధించే నామ (సుప్), క్రియా (తిఙ్), విభక్తిప్రత్యయం వచనం. తెలుగులో ఏకవచనం, బహువచనం అని వచనాలు రెండు. రాముఁడు. ఇక్కడ రాముడులోని 'డు' ఒకసంఖ్యను తెలుపుతున్నది. కాబట్టి యిది ఏకవచనం. అలాగే వత్తురు.

ఇక్కడ 'రు' అనేది ఒకరికంటె ఎక్కువమంది అనేవిధంగా బహుత్వసంఖ్యను తెలుపుతున్నది. కాబట్టి బహువచనం.

**19. వచ్యర్థము** (కార. 6): వచి+అర్థ=వచ్యర్థం 'ఇక్శ్తిపౌ ధాతునిర్దేశే' అని వచ ధాతువు 'ఇక్' అంతంగా నిర్దేశింపబడింది. వచి అంటే వచధాతువుయొక్క అర్థం వచ్యర్థం. అను, పలుకు మొ.

**20. విశేషణము** (కార. 19): 'విశిష్యతే అనేన ఇతి విశేషణమ్.' వస్తువు (విశేష్యం)లోని జాతి మొద లైన (దృష్ట) ధర్మాన్నిబట్టి వేరుచేసి చెప్పేది విశేషణం. 'విశేషణము నా జాత్యాదివిశేషములను దెలుపునది.' నల్లనియావు. నలుపు అనేగుణాన్నిబట్టి గోసముదాయంనుంచి వేరు చేస్తూ ఆవు అనేవిశేష్యంలోని విశేషగుణాన్ని తెలియజేస్తున్నది. కాబట్టి 'నల్ల' అనేది విశేషణం, (ఇది జాతి, గుణ, క్రియా, ద్రవ్య, సంజ్ఞలచేత ఆరువిధాలు.)

**21. విశేష్యము** (కార. 19) : 'విశిష్యతే గుణాదిభిః ఇతి విశేష్యమ్.' 'విశేష్యము నా విశేషణముచేఁ దెలుపఁబడువిశేషము గలది'. గుణము, జాతి, మొద లైనవాటిచేత విశిష్ట మైనది విశేష్యం. నల్లనిఆవు. నలుపు అనేగుణవిశేషం కల్గినది, కాబట్టి ఆవు విశేష్యం. (విశేష్య మంటే నామవాచకం అని కొంద రంటారు.)

**22. వైషయికము** (కార. 17) : 'విషయతాసంబంధకృత ఆధారః వైషయికః' విషయానికి సంబంధించిన ఆధారం వైషయికం. ఇంద్రియగోచారా లైనశబ్దాదులు విషయాలు. మోక్షమం దిచ్ఛ గలదు. ఇచ్ఛకు ఆధార మైనమోక్షం విషయం. కాబట్టి యీఆధారం వైషయికం.

**23. శేషము-శేషషష్ఠి** (కార. 15): (కారకప్రాతిపదికార్థవ్యతిరిక్తః స్వస్వామిభావాది సంబంధః శేషః.) కర్మ మొ. కారకాలు, ప్రాతిపదికార్థం అనేవాటికంటే వేరైన-స్వ-స్వామి భావం, జన్య-జనకభావం-మొ. సంబంధం శేషం. ఈఅర్థంలో సంబంధిపదానికి యొక్క అనే షష్ఠీవిభక్తి వస్తుంది. రామునియొక్క భక్తుడు. శేషార్థంలో వచ్చినషష్ఠి కాబట్టి 'యొక్క' శేషషష్ఠి.

**24. సంఖ్యాభిధానము** (కార. 23): 'అభిదధ తీ త్యభిధానమ్. సంఖ్యాయాః అభిధానం సంఖ్యాభిధానమ్.' సంఖ్యను తెలియజేసేశబ్దం సంఖ్యాభిధానం. ఏకము, రెండు మొ. తెలుగు సంఖ్యావాచకాలు అన్ని ప్రభృతులలో చేరిఉండడంవల్ల సర్వనామం అనేసంజ్ఞ కూడా కలిగిఉంటాయి. ఒకటి-రెండు. సంఖ్యను తెలియజేసే సంస్కృతసమాలు సంఖ్యాభిధానాలు మాత్రమే, సర్వనామాలు కావు, లక్ష, మొ.

**25. సంప్రదాన(కారక)ము** (కార. 8): 'కర్మణా య మభిప్రైతి స సంప్రదానమ్' 'దానస్య కర్మణా య మభిప్రైతి స సంప్రదానసంజ్ఞ స్స్యాత్.' 'త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు' త్యాగానికి (ఇవ్వడానికి) ఉద్దేశింపబడినదానికి సంప్రదానం అని సంజ్ఞ. ఎవ్వరికి ఇవ్వదలచారో అది సంప్రదానం. దానికి చతుర్థీవిభక్తి వస్తుంది. రామునికొఱకు కన్య నిచ్చెను. కన్యను ఇవ్వడానికి ఉద్దేశించినవాడు కాబట్టి రాముడు సంప్రదానం. (దానికి వచ్చే చతుర్థీవిభక్తి సంప్రదానకారకం.)

**26. హేతువు** (కార. 4): 'ఫలసాధనయోగ్యం బగు పదార్థంబు హేతువు' ఫలాన్ని సాధించడానికి అర్హ మైనవస్తువుకు హేతువు అని సంజ్ఞ. దీనికి చేత అనేతృతీయావిభక్తి వస్తుంది. 'విద్యచేత యశంబు కలుగు'– యశస్సు అనేఫలం సాధించడానికి తగినపదార్థం కాబట్టి యశస్సుకు విద్య – హేతువు.

# సమాసపరిచ్ఛేదం

**1. ఉత్తరపదము** (సమా. 11): 'ఉత్తరపదత్వం చ సమాస చరమావయవే రూఢమ్'. సమాసంలో చివరిపదానికి ఉత్తరపదం అని పేరు. 'నీకరుణ' నీ(యొక్క) కరుణ అనేపదాలకు ఏర్పడినయీసమాసంలో 'కరుణ' అనేది చివరిపదం. కాబట్టి అది ఉత్తరపదం.

**2. ఉపమానపూర్వపదకర్మధారయము** (సమా. 3): 'విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు.' ఇదే కర్మధారయం. కాగా కర్మధారయసమాసంలో మొదటిపదం విశేషణం, రెండవపదం విశేష్యం. పూర్వపదం అంటే సమాసంలో మొదటిపదం. వీటిలో విశేషణ మైనపూర్వపదం ఉపమానం అయితే (రెండవపదం – విశేష్యం. ఉపమేయం అవుతుంది) దాన్ని ఉపమానపూర్వపదకర్మధారయం అంటారు. 'చిగురుఁగేలు. చిగురువంటికేలు. అనేచొప్పున ఈసమాసంలో పూర్వపద మైన చిగురు అనేది ('కేలు' కు) ఉపమానం. కాబట్టి యీసమాసం ఉపమానపూర్వపదకర్మధారయం. ఇలాగే జుంటిమోవి మొ.

**3. ఉపమానోత్తరపదకర్మధారయము** (సమా. 3): విశేషణానికి విశేష్యంతో ఏర్పడినసమాసం కర్మధారయం. ఉత్తరపదం అంటే సమాసంలో చివరిపదం. కర్మధారయసమాసంలో చివరిపదం ఉపమానం అయితే అది ఉపమానఉత్తరపద కర్మధారయం. మోవిపండు. (పండువంటిమోవి) ఈసమాసంలో మోవి అనే(విశేష్యం) ఉపమేయం పూర్వపదం కాగా, పండు అనే(విశేషణం)ఉపమానం ఉత్తరపదం అయింది. కాబట్టి యిది ఉపమానోత్తరపదకర్మధారయం.

**4. ఊష్మము** (సమా. 14): 'శషసహా ఊష్మాణః' శ,ష,స,హ అనేనాలుగువర్ణాలకు ఊష్మా లని పేరు. ఊది (గాలి ఆపి విడుస్తూ) పలుకబడేవి కాబట్టి ఇవి ఊష్మాలు.

**5. కర్మధారయము** (సమా. 3): 'విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు, ఇదియె కర్మధారయ మనంబడు' నల్లనియావు. ఇక్కడ నల్ల అనేవిశేషణానికి, ఆవు అనేవిశేష్యంతో సమాస మయింది. కాబట్టి ఇది కర్మధారయసమాసం. (ఇందులో విశేషణం పూర్వపదంగా ఉంటుంది. కాబట్టి దీన్ని విశేషణపూర్వపదకర్మధారయం అని కూడా అంటారు.)

**6. తత్పురుషము** (సమా. 3): ఉత్తరపదార్థం ప్రధాన మైనసమాసం తత్పురుషం. ఇది సమానాధికరణం, వ్యధికరణం అని రెండువిధాలు. నల్లకలువ, రామునిబాణము. ఇందులో వ్యధికరణసమాసాలును విశేషంగా ద్వితీయాతత్పురుషం ఇత్యాదిగా తత్పురుషంగా వ్యవహరిస్తారు. ఈసమాసాల్లో పూర్వపదం ఉత్తరపదంతో అన్వయిస్తుండగా, ఆఉత్తరపదంయొక్క అర్థమె వాక్యంలో తర్వాతిపదాలతోను, క్రియతోను అన్వయిస్తుంది. పూర్వపదానికి క్రియతో అన్వయం ఉండదు. కాబట్టి ఇది ఉత్తరపదార్థం ప్రధాన మైనసమాసం. తత్పురుషం.

**7. త్రికము** (సమా. 4) ' ఆ ఈ ఏ యనుసర్వనామంబులు త్రికంబు నాఁ బడు'. అన్ని మొద లైనవాటిల్లో చేరి, సర్వనామసంజ్ఞ పొందినటువంటి ఆ–ఈ–ఏ అనేమూడుశబ్దాలకు త్రికం అని పేరు. ఆకన్య, ఈదేశము, ఏవిధము. మొ. (సర్వనామాలు కాని, వర్ణమాలలోని ఈవర్ణాలకు త్రికం అనే పే రుండదు)

**8. ద్వంద్వము** (సమా. 3): ఉభయపదార్థప్రధాన మైనసమాసం ద్వంద్వం. సమాసంలోనిపూర్వఉత్తరపదాలు రెండింటియొక్క అర్థమూ ప్రధానమై తర్వాతిపదాలతోటీ, క్రియతోటీ అన్వయిస్తే ఆసమాసం ద్వంద్వం. తల్లిదండ్రులు (మెత్తురు) మొ.

**9. ద్విగువు** (సమా. 3): (సంఖ్యాపూర్వో ద్విగుః) విశేషణానికి విశేష్యంతో చేసినసమాసం కర్మధారయం. 'ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు.' కర్మధారయసమాసంలో విశేషణ మైన పూర్వ(మొదటి)పదం, సంఖ్యను తెలియజేసేది అయితే ఆకర్మధారయానికే తెలుగులో ద్విగువు అని పేరు. ముల్లోకములు, నలుగడలు మొ. వీటిలో మూడు (లోకములు) నాలుగు (కడలు) అని పూర్వపదం సంఖ్యావాచకం. కాబట్టి యివి ద్విగుసమాసాలు.

**10. ధాతుజవిశేషణము** (సమా. 9): 'ఎడిప్రభృతివర్ణకాంతంబు లేదును

ధాతుజవిశేషణము లని ప్రాచీనులు వ్యవహరింతురు.' ధాతువునుండి యేర్పడిన విశేషణరూపం ధాతుజవిశేషణం. ఎడి, ఎడు, వానిలోపం, ఉన్న, కలజి, న, ని అనేవి చివర కలిగి ప్రతిధాతువునుండి విశేషణరూపాలు ఏడువిధాలుగా ఏర్పడతాయి. చదివెడు వాడు, చదువని వాడు. మొ.

**11. పూర్వపదము** (సమా. 3): 'పూర్వం పదం పూర్వపదమ్' పర(ఉత్తర)పదానికి పూర్వంలో ఉండేపదం పూర్వపదం. సమాసంలో మొదటిపదానికి పూర్వపదం అని పేరు. ఆకన్య. ఈకర్మధారయసమాసంలో 'ఆ' అనేసర్వనామపదం మొదటిది కాబట్టి అది పూర్వపదం.

**12. ప్రాధాన్యము** (సమా. 26): 'ప్రాధాన్యం చ క్రియాన్వయత్వమ్'. వాక్యంలో క్రియతో అన్వయించేది ప్రధానం. విశేష్యం మొ. ప్రధానాలు. అలా క్రియతో అన్వయించడం ప్రాధాన్యం. 'రాముడు బాణముతో ఏసెను.' ఏసెను అనేక్రియలోకి సూటిగా అన్వయిస్తుండడం చేత రాముడు అనేకర్త ప్రధానం. రాము డేసినబాణము వాలిని కూల్చెను. ఇచట బాణం అనేకరణం కూల్చెను అనేక్రియతో అన్వయిస్తున్నది కాబట్టి కరణానికి ప్రాధాన్యం.

**13. బహుబ్రీహి** (సమా. 3): అన్యపదార్థం ప్రధాన మైనసమాసం బహుబ్రీహి. సమాసంలో ఉన్నపదాలకంటే అన్య మైనపదంయొక్క అర్థం ప్రధాన మైతే (క్రియతో అన్వయించేది) ఆసమాసం బహుబ్రీహి. ముక్కంటి. ఈసమాసంలో మూడు+కన్ను అనేపదాలఅర్థంకంటె భిన్నంగా, మూడుకన్నులు కలిగినవాడు - పరమేశ్వరుడు అనేవిధంగా అన్యపదార్థం ముఖ్యం కావడంవల్ల ఇది బహుబ్రీహి.

**14. మిశ్ర(సమాస)ము** (సమా. 2): 'ఉభయంబులు గూడినది మిశ్రం బనంబడు' సంస్కృతసమమూ, అచ్చతెనుగూ రెండు విధా లైనపదాలకూ కలిపి చేసినసమాసం మిశ్రసమాసం. విధాతృనానతి. ఇందులో 'విధాతృయొక్క' అనేది సంస్కృతసమం, 'ఆనతి' అనేది ఆచ్ఛికం. సంస్కృతసమం, ఆచ్ఛికం రెండూ కలిసి ఉన్నది కాబట్టి యీసమాసం మిశ్రం. ఇలాగే సిరివల్లభుడు. మొ.

**15. విగ్రహము** :(వృత్త్యర్థావబోధకం వాక్యం విగ్రహః.) వృత్తియొక్క అర్థాన్ని తెలిపేవాక్యం విగ్రహ(వాక్య)ం. రామునిబాణము. ఇది సమాసం. (సమాసవృత్తిలో) ఈసమాసంయొక్క అర్థాన్ని బోధించే - రామునియొక్క బాణం అనేది విగ్రహం. ఇలాగే దొరతనము అన్నపుడు తద్ధితవృత్తిలో తద్ధితాంతంయొక్క అర్థాన్ని తెలియజేసే దొరయొక్క భావం అనేది విగ్రహం. ఏలిక-ఏలేవాడు కృత్తు ఐనవృత్తియొక్క అర్థం.

**16. విశేషణపూర్వపదకర్మధారయము :** చూ. కర్మధారయము.

**17. వైరిసమాసము**(సమా. 3): 'కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు.' తెలుగు చేయని(తత్సమం కాని) సంస్కృతశబ్దానికీ, అచ్చతెలుగుశబ్దానికీ సమాసం చేయగూడ దని లక్షణం. అలా సమాసం చేస్తే లక్షణానికి విరుద్ధ మై గ్రామ్య మవుతుంది. ఇటువంటి సమాసాలనే కొందరు వైరిసమాసా లనీ, అరిసమాసా లనీ అంటారు. అనేకమారులు. ఇక్కడ 'అనేక' అనేది కేవలసంస్కృతశబ్దం. మారులు అనేది అచ్చతెలుగు. ఈరెంటికి చేసినసమాసం కాబట్టి యిది వైరిసమాసం.

**18. వ్యధికరణ(సమాస)ము** (సమా. 2): 'ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికణంబు నాబఁడు,' ద్వితీయ మొద లైనవిభక్తులు చివర గలిగిన పదానికి పైపదంతో చేసినసమాసం వ్యధికరణం. సమాసంలోని రెండు పదాలు వేర్వేరు అధికరణం (ఆధారం) కలిగినవి కావడంవల్ల ఇది వ్యధికరణం. రాముని బాణము. ఇచట రామునియొక్క అనేషష్ఠ్యంతానికి బాణము అనే పైపదంతో సమాసం. ఇక్కడ రామత్వం రాముడిలోను, బాణత్వం బాణంలోను ఉండగా అధికరణం భిన్న మైంది. కాబట్టి యిది వ్యధికరణసమాసం.

**19. సమాసము** (సమా. 1) : 'సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసంబు' వేర్వేరుగా ప్రసిద్ధ మైనఅర్థం కలిగినపదాలు ఒకేఅర్థం బోధించగలగటం సామర్థ్యం. అటువంటి (ఏకార్థీభావ)సామర్థ్యం కలిగిన రెండుపదాలు ఒకేపదంగా కలియడం సమాసం. రామునిబాణము. ఇక్కడ రామునియొక్క, బాణము అనే సమర్థా లైనపదాలు (అర్థాలు) రెండు కలిసి ఒకేపదంగా ఏర్పడడంచేత ఇది సమాసం.

**20. సమాసాంతకార్యము** (సమా. 22): సమాసం చివర కలిగేటటువంటిదీ, సమాసానికి సంబంధించినదీ అయిన ఆగమ-ఆదేశాది వర్ణవికారం సమాసాంత కార్యం. తెలుగులో ఇటువంటివి బహువ్రీహిలో కనబడుతున్నాయి. ముక్కంటి. ఇక్కడ మూడు+కన్ను - ముక్కన్ను అనేసమాసం చివర అంత్యాక్షరానికి వచ్చిన 'ంటి' ఆదేశం సమాసాంతకార్యం. 'పూవిలుతుడు'. పూవు - విల్లు = పూవిల్లు అనేసమాసం చివర కలిగిన (లకారలోపం) 'తు' అనే ఆగమం సమాసాంతకార్యం.

**21. సాంస్కృతికసమాసము** (సమా. 2): సంస్కృతానికి సంబంధించినసమాసం సాంస్కృతికసమాసం. ఇది రెండు రకాలు. 1. కేవలం సంస్కృతశబ్దాలకు ఏర్పడినది, అంటే సంస్కృతంలోనే సమాసంగా ఏర్పడి, సమాసమే ప్రాతిపదికగా తెలుగులోకి వచ్చింది సిద్ధసమాసం. రాజాజ్ఞ. 2. సంస్కృతసమశబ్దాలకు తెలుగులో చేసినసమాసం

సాధ్యసమాసం. రాజుయొక్క + ఆజ్ఞ = రాజునాజ్ఞ.

**22. సాధ్యసమాసము** (సమా. 2): 'సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు నాఁబడు.' సంస్కృతసమాలు అయినశబ్దాలకు చేసినసమాసం సాధ్య(సాంస్కృతిక) సమాసం. రాజునాజ్ఞ. ఇది రాజుయొక్క, ఆజ్ఞ అనేసంస్కృతసమశబ్దాలకు ఏర్పడిన సమాసం కాబట్టి సాధ్యసమాసం.

**23. సామర్థ్యము** (సమా. 1): 'పృథగ్భూతంబు లగునర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు'. పృథక్ప్రసిదార్థంబు లగుపదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము. ప్రత్యేకంగా ప్రసిద్ధ మైనఅర్థం గలిగినశబ్దాలు (కలిసి) ఒకే అర్థాన్ని బోధిస్తూ కలియడం సామర్థ్యం. రామునియొక్క+బాణము = రామునిబాణము. ఒకే అర్థంగా మారేసమాసంలోని యీసామర్థాన్ని ఏకార్థీభావసామర్థ్యం అంటారు.

**24. సిద్ధసమాసము** (సమా. 2): 'కేవలసంస్కృతశబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు.' సంస్కృతశబ్దాలకు సంస్కృతంలోనే సమాసం ఏర్పడి ఆసమాసం ప్రాతిపదికంగా తెలుగులోకి వస్తే అది సిద్ధసమాసం. తెలుగులో ప్రవేశించేటప్పటికే సమాసం సిద్ధ మైఉన్నది. కాబట్టి యిది సిద్ధసమాసం. రాజాజ్ఞ. రాజ్ఞః ఆజ్ఞా– రాజాజ్ఞా . అని సమాసం సంస్కృతంలోనే ఏర్పడిఉంది. కాబట్టి యిది సిద్ధసమాసం.

# తద్ధితపరిచ్ఛేదం

**1. ఉత్సర్గము** (తద్ధి. 2. ) : (ఉత్సృజ్యతే ఇతి ఉత్సర్గః) విశేషవిధులవల్ల ప్రవర్తింప జేయకుండా విడిచిపెట్టబడేశాస్త్రం ఉత్సర్గం. అంటే సామాన్యవిధి అని అర్థం. 'చిన్నాదులకు ఱికవర్ణకం బగు' అనే అపవాద(విశేష)శాస్త్రంవల్ల 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేవిధి వర్తింపక విడిచిపెట్టబడుతుంది. కాబట్టి అది (తన వర్ణకంబు... ) ఉత్సర్గ(సామాన్య)విధి. చిన్నఱికము. 'చిన్నాదులకు ఱికవర్ణకం బగు' అనేసూత్రంచేత చిన్నతనము.

**2. తద్ధితము:** 'తస్మై ప్రయోగాయ హితమ్ తద్ధితమ్'. అని దీనివ్యుత్పత్తి. స్వార్థం, మతుబర్థం, మొద లయినఅర్థాలలో ప్రథమ మొద లయినవిభక్తులు చివర కలిగినశబ్దాలమీద చేరేప్రత్యయాలు తద్ధితాలు. చిఱుతుక. చిఱుత శబ్దంమీద స్వార్థంలో వచ్చిన'ఉక' ప్రత్యయం తద్ధితం. ఇలాగే 'కా' (వన్నెకాఁడు), 'బంటి' (మోఁకాలిబంటి ) మొ.

**3. తాచ్ఛీల్యము** (తద్ధి. 28)**:** (తత్ శీలం యస్య సః తచ్ఛీలః. తచ్ఛీలస్య భావః తాచ్ఛీల్యమ్. తాచ్ఛీల్యమ్ తత్ స్వభావతా.) తాచ్ఛీల్యం అంటే ఆస్వభావం కలిగినవాడితనం అని అర్థం. ఈఅర్థంలో మారి, పోతు, అనేతద్ధితప్రత్యయాలు వస్తాయి. తిండిపోతు. తిండి (తినడం) స్వభావంగా కలిగినవాడు. మంటమారి. మొ.

**4. త్వార్థము** (తద్ధి. 1)**:** 'త్వ' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం త్వార్థం. 'తస్య భావ స్త్వతలౌ' అని సంస్కృతంలో త్వప్రత్యయం భావార్థంలో విధింపబడింది. 'ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు భావంబు'. ప్రాతిపదికవలన తెలియబడేవస్తువుయొక్క ధర్మం, భావం. తెలుగులో 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అని ఈఅర్థంలో తన అనేప్రత్యయం వస్తుంది. రామునితనము– రామ అనే ప్రకృతిచేత బోధింపబడే రాముడు అనేవ్యక్తియొక్క ధర్మం– రామునితనం.

**5. దఘ్నార్థము** (తద్ధి. 27)**:** దఘ్నచ్ అనేసంస్కృతప్రత్యంయొక్క అర్థం దఘ్నార్థం. 'ప్రమాణే ద్వయసచ్ దఘ్నఞ్ మాత్రజః.' అని యిది ప్రమాణార్థంలో విధింపబడింది. అధోమానాన్ని (క్రిందివైపు కొలత–లోతు) తెలిపే దఘ్నచ్ ప్రత్యయంయొక్క అర్థంలో తెలుగులో 'దఘ్నార్థంబున బంటికొలఁదు లగు' అని బంటి, కొలది అనేప్రత్యయాలు వస్తాయి. మోకాలిబంటి. మోకాలికొలది. మోకాలివఱకు (లోతు) ప్రమాణంగా కలది అని అర్థం.

**6. మతుబర్థము, మత్వర్థము** (తద్ధి. 11,22)**:** మతుప్ అనేసంస్కృతప్రత్యయం యొక్క అర్థం (మతుప్–అర్థ) మతుబర్థం. లేదా (మతు+అర్థ) మత్వర్థం. 'త ద స్యా స్త్యస్మి న్న స్తీతి మతుప్' అని యిది సంస్కృతంలో అస్త్యర్థంలో విధింబడింది. కలది, కలవా డని స్థూలంగా దీనిఅర్థం. అందగత్తియ. (అందము కలది) ఆటగాడు.(ఆట కలవాడు)

**7. మానార్థము** (తద్ధి. 25)**:** మానం అంటే పరిమాణం. అంటే కొలత. కొలత(మానం)ను తెలిపేశబ్దం మానార్థకం. జేన, మూర మొ. వీటిమీద 'మానార్థంబున కేకత్వంబునం దెఁడువర్ణకం బగు' అని 'ఎఁడు' అనేతద్ధితప్రత్యయం వస్తుంది. ఉదా. జేనెడు. (జేన పరిమాణం కలిగింది అని అర్థం.) మొ.

**8. స్వార్థము, స్వార్థికము** (తద్ధి. 9): స్వ–అర్థ అంటే స్వీయార్థం. స్వార్థం అంటే ప్రాతిపదికార్థం అనీ, ధాతువులవిషయంలో ధాతువుయొక్క అర్థం అనీ, అర్థం. 'అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకం బగు'. అరమరిక. దీనికి అరమర అనే అర్థం. పండు అనేధాతువుమీద అదే అర్థంలో కొను ధాతువు చేరుతుంది. పండుకొను–

పండు అనే దీనికి అర్థం. స్వార్థంలో విధింపబడినప్రత్యయాదులు స్వార్థికాలు. పైన చూపిన ఇక మొద లయినవి.

## క్రియాపరిచ్ఛేదం

**1. అకర్మకము** (క్రియ. 48): అవిద్యమానం కర్మ యేషాం తే అకర్మకాః. అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు'. కర్మను గూర్చిన ఆకాంక్షను కలిగించని (కర్మ లేని) ధాతువు అకర్మకము. రాముడు వచ్చెను. ఇక్కడ వచ్చెను అంటే 'దేనిని వచ్చెను' అనేవిధంగా కర్మను గూర్చినప్రశ్నను కలిగింపదు కాబట్టి వచ్చు ధాతువు అకర్మకం.

(ఫలవ్యాపారయో రేకతా నిష్ఠతాయా మకర్మకః) ధాతువుయొక్క అర్థా లయిన వ్యాపారం, ఫలం ఒక్క (కర్త)నే ఆశ్రయించిఉంటే, ఆధాతువు అకర్మకం. రాముడు 'వచ్చెను' నడవడం మొద లైనవ్యాపారమూ, ఆచోటికి చేరుకోవడం మొద లైనఫలమూ రెండూ రాముడిని ఒక్కడినే ఆశ్రయించి ఉండడంచేత వచ్చుధాతువు అకర్మకం.)

**2. అగతికము** (క్రియ. 121): (గతి శ్చ, ఊర్యాది చ్విడాది శ్చ, సాక్షాత్ ప్రభృతీని చ.) క్రియతో సంబంధం కలిగిఉన్న ప్ర, పరా, మొద లైనవీ, ఊరీ ప్రభృతులూ, సాక్షాత్ మొద లైనవాటికి గతి అని సంజ్ఞ. ఇవి చేరకుండా ప్రత్యేకంగా ఉన్నధాతువు అగతికం. భూ, కృ మొ.

**3. అతిచారము** (క్రియ. 60): (అతిక్రమ్య చారః ) అతిక్రమించి చరించడం అతిచారం. లక్షణంచేత చెప్పబడినస్థలాలకంటే ఇతర మైనచోట్ల (లక్షణాన్ని అతిక్రమించి) గూడా ఆకార్యం ప్రవర్తించడం అతిచారం. 'ముఙు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' అనేసూత్రం ముఙు పరంగా ఉన్నపుడు కొనుకు 'కో' అనేఆదేశాన్ని చెపుతున్నది. అది బహుళశబ్దంచేత చదువుకోఁడు, చదువుకోక, మొ. ఇతరస్థలాలలో గూడా ప్రవర్తించింది. కాబట్టి అది అతిచారం.

**4. అధికారము:** 'స్వదేశే ఫలశూన్యత్వే సతి విధిశాస్త్రేణ సాక మేకవాక్యతయా అర్థబోధకః అధికారః.' స్వయంగా వాక్యార్థాన్ని సంపూర్ణంగా తెలుపకుండా, తరువాతివిధివాక్యంతో కలిసి ఆవాక్యాలఅర్థాన్ని సమగ్రం చేసి బోధించేది అధికారం. 'ధాతువునకు' (క్రియ. 1) 'వర్తమానంబున ల ట్టగు' మొద లైనతరువాతిసూత్రాలలో ఈసూత్రం కలిసి 'వర్తమానంబున ధాతువునకు ల ట్టగు' ఇత్యాదిగా ఆసూత్రం అర్థాన్ని పరిపూర్ణం చేస్తుంది. కాబట్టి 'ధాతువునకు' అనే ఈసూత్రం అధికారసూత్రం.

**5. అనభిహితకర్త** (క్రియ. 124): (తిజ్ కృత్తద్ధితసమాసైః, క్వచి న్నిపాతేన చ అభిహితత్వమ్) క్రియావిభక్తులు, కృత్తులు, మొ. వాటిచేత చెప్పబడినది అభిహితం. చెప్పబడనిది అనభిహితం. అనభిహిత మైనకర్త అనభిహితకర్త, రామునిచేత రావణుడు చంపబడెను. చంపుట అనేక్రియకు కర్త రాముడు. కాని ఈవాక్యంలో 'చంపబడెను' అనేక్రియ రాముడిని (కర్తను) తెలియజేయటం లేదు. (కర్మ అయిన రావణుని చెపుతున్నది) కాబట్టి ఇక్కడ రాముడు అనభిహితకర్త.

**6. అనుబంధము** (క్రియ. 13): (అనుబధ్యతే ఇ త్యనుబంధః) సంస్కృతంలో అనుబంధం అంటే ఇత్తు. కాని తెలుగులో అనుసరించి (వెంట) కూడిఉండేది (ప్రకృతి, ప్రత్యయం మొ. రూప మైనది) అని మాత్రమే అర్థం. 'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు'. వండు+ఉన్న, వండుచున్నాడు. ఇక్కడ ధాతువుకు ఉన్న అనేది అనుబంధం. ఇలాగే కలజి, పడుజి, మొ. అనుబంధం లేకపోతే ప్రకృతికి ఈఅర్థం ఉండదు.

(అనుబంధం లేకపోతే అర్థానికి భంగం. అనుప్రయోగం అలా కాదు. వండబడెను. ఇక్కడ పడు లేక కర్మార్థం ఉండదు. అందుచేత పడుజి లేకుండా ఈఅర్థంలో ధాతువు ప్రయోగింపబడదు. కాబట్టి ఇది అనుబంధం. నిలువబడు (క్రియ. 109) ఇక్కడ పడు లేకపోయినా ఉన్నప్పటిఅర్థానికి భంగం లేదు. నిలువబడెను – నిలిచెను. అందుచేత 'పడు' లేకుండా గూడా ఈధాతువు ఈఅర్థంలో ప్రయోగింప బడుతుంది. కాబట్టి ఈ'పడు' అనుప్రయుక్తం. శబ్దపల్లవాలు విశేషస్థలాలు.)

**7. అపవాదము** (క్రియ. 72): (యేన నాప్రాప్తే యో విధి రారభ్యతే స తస్య బాధకో భవతి.) అప(తొలగించేవిధంగా)వాదం (చెప్పటం) అంటే 'ఒకవిధి తప్పకుండా ప్రవర్తింపవలసిఉండగా అక్కడనే ప్రారంభింపబడిన వేరొకవిధి దానికి బాధకం(అపవాదం) అవుతుంది. రంజించు-ఇంచు. అనేచోట 'రంజాదులయించు క్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనేవిధిచేత ద్విరుక్తలకారం ప్రాప్తిస్తుండగా 'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' అని ఆరంభింపబడినవిధి లకారాదేశాన్ని బాధిస్తూ 'అపవాదం' అవుతున్నది.

**8. ఆత్మనేపదకర్త్రర్థము** (క్రియ. 122): క్రియాఫలం కర్తృగామి కావడం ఆత్మనేపదార్థం. క్రియాపదంచేత కర్త తెలియబడితే అది కర్త్రర్థం. మైత్రుడు వంటకము వండుకొనెను. 'వండుకొను' అనేది క్రియాఫల మైనవంటకం కర్త ఐన మైత్రుడిని

పొందటం తెలుపుతుంది. కాబట్టి కర్త్రర్థం. అందుచేత 'వండుకొనెను' ఆత్మనేపద కర్త్రర్థం.

**9. ఆత్మనేపదకర్మార్థము** (క్రియ. 122): క్రియాఫలం కర్తృగామి అయితే ఆత్మనేపదార్థం. క్రియాపదంచేత కర్మ తెలియబడితే కర్మార్థం. 'మైత్రునిచే వంటకము వండుకొనబడెను'. వండుకొను అనేది క్రియాఫలం కర్తను పొందడాన్ని తెలపడంచేత ఆత్మనేపదం. వండుకొనబడు అనేది కర్మను తెలుపుతుండడంచేత కర్మార్థం. కాబట్టి వండుకొనబడెను అనేది ఆత్మనేపదకర్మార్థం.

**9. ఆత్మనేపదార్థము** (క్రియ. 52): క్రియాఫలం కర్తృగామి కావటం ఆత్మనేపదార్థం. ఈఅర్థంలో ధాతువుపై తెలుగులో 'కొను' అనేధాతువు చేరుతుంది. 'దేవదత్తుడు వండుకొనెను.' ఇక్కడ వండుట అనేక్రియకు ఫల మైన వంటకం, వండుట అనేవ్యాపారానికి కర్త అయిన దేవదత్తుడినే పొందుతున్నది. కాబట్టి ఇది ఆత్మనేపదార్థం.

**11. ఆనంతర్యము** (క్రియ. 42): అంతరం లే(కా)నిది అనంతరం. అనంతరం యొక్క భావం ఆనంతర్యం. అంతరం అంటే ఎడం. వ్యవధానం. ఇక్కడ కాలానికి సంబంధించిన దైనవ్యవధానం లేకపోవడం ఆనంతర్యం. వెంటనే అని అర్థం. 'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు'. అని ఈఅర్థంలో ధాతువుమీద 'డును' అనేప్రత్యయం వస్తుంది.'జాబిల్లి తోతెంచుడుం గువలయంబులు వికసిల్లు'. తోతెంచుడున్– తోతెంచినవెంటనే.

**12. ఉత్తమపురుషము** (క్రియ. 9): 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్గు' అనేసూత్రం విధించినప్రత్యయాలలో 'అందు వరుసను రెండేసి ప్రథమ మధ్యమోత్తమంబు లనంబడు' అనేసూత్రంప్రకారం చివరి 'ను,ము' అనే రెండింటికి ఉత్తమం అని పేరు. అస్మదర్థాన్ని బోధించేటపుడు ఏకత్వంలో(నేను) నువర్ణమూ, బహుత్వంలో (మేము) మువర్ణమూ వస్తాయి. (నేను)చదువుచున్నాను. (మేము) చదువుచున్నాము. (నేను, మేము అనేవి కర్తగా కలిగినక్రియలు ఉత్తమపురుషక్రియలు.)

**13. ఉపసర్గ(ము)** (క్రియ. 121) : (ఉపసర్గాః క్రియాయోగే.) క్రియతో సంబంధం ఉన్నపుడు ప్ర, పరా మొద లైన ప్రాదులకు(ఇవి 22) ఉపసర్గ(ము)లు అని సంజ్ఞ. ప్రభవించు. ఇందులో 'భూ' అనేధాతువుతో యోగం (సంబంధం) ఉండడంవల్ల 'ప్ర' అనేది ఉపసర్గ.

**14. క్తవదర్థము** (క్రియ. 46): క్తవత్ అనేదానియొక్క అర్థం క్తవదర్థం.

భూతార్థంలో ఉన్నధాతువుకు కర్త్రర్థంలో సంస్కృతంలో 'క్తవత్' అనేప్రత్యయం విధింపబడింది. ఆఅర్థంలో తెలుగులో 'ఉన్నకలజినవర్ణకంబులు భవద్భావిశతృ క్తవదర్థంబులం దగు' అని 'న' అనే ప్రత్యయం వస్తుంది. చదివినవాడు. క్తవత్ ప్రత్యయార్థం క్తవదర్థం. క్తవదర్థం కలిగినది కావడంచేత ఈ 'న' వర్ణకం క్తవదర్థకం.

**15. క్రియావిశేషణము** (క్రియ. 115)**:** క్రియయొక్క విశేషణం క్రియావిశేషణం. క్రియ– వ్యాపారంలోని విశేషాన్ని తెలిపేది అని అర్థం. గట్టిగా చదివెను. చదువుట అనేక్రియలోని (గట్టితనం అనే) విశేషాన్ని తెలుపుతూ ఆక్రియతో అన్వయిస్తున్నది, కాబట్టి 'గట్టి(గా)' అనేది క్రియావిశేషణం.

**16. గుణము** (క్రియ. 66)**:** (అదేజ్ గుణః ) అ, ఏ, ఓ అనేమూడు వర్ణాలకు గుణం అని సంస్కృతంలో సంజ్ఞ. భిద్+ఇంచు= భేదించు. కుప్+ఇంచు=కోపించు. ఋకారానికి వచ్చేగుణం ఐన అకారం తరువాత రేఫ కలిగి 'అర్' అనేఆకారంతో ఉంటుంది. వృష్–ఇంచు, వర్షించు.

**17. జీత్తు** (క్రియ. 20)**:** జి అనేది ఇత్తుగా కలిగినది జీత్తు. కజి, కలజి, పడుజి మొద లైనవాటిలోని జివర్ణం ఇత్తు. జివర్ణం ఇత్తుగా గలిగినవి కాబట్టి ఇక్కడి క, కల, పడు మొద లైనవి జీత్తులు. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అని ఇవి పరంగా ఉన్నపుడు ముందరిధాతువులో చివరిఉత్వానికి అత్వం వస్తుంది. వందు+క(జి)= వందక.

**18. చేదర్థము** (క్రియ. 41)**:** చేత్ అనేది సంస్కృతంలో అవ్యయం. ఈశబ్దం యొక్క అర్థం చేదర్థం. అయితే ఏని అనేవిధంగా ఉన్నఅర్థం చేదర్థం. ఈఅర్థంలో ధాతువుకు 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణార్థంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు' అని 'నను' అనే ప్రత్యయం వస్తుంది. వచ్చినను=వచ్చినచో.

**19. జ్ఞాపకము** (క్రియ. 65)**:** (అనుమానాత్ బోధనమ్) పొగను చూచి నిప్పు ఉండడాన్ని నిశ్చయించినవిధంగా లక్షణాన్నిబట్టి (లక్షణం ద్వారా) లక్ష్యంస్థితిని తెలిపేది(శాస్త్రం) జ్ఞాపకం. 'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు'. ఇక్కడ నామాలకు అయుగాగమం నిషేధింపబడింది. అయుగాగమం ఇంచుగాగమం పరంగా ఉంటేనే వస్తుంది. ఇంచుక్కు ధాతువులకె అవుతుంది. కానీ నామాలకు కలగదు. కాగా ఇంచుక్కు పరంగా ఉండగా ధాతువులకు రావలసిన అయుగాగమాన్ని ఇంచుక్కు లేని నామాలకు నిషేధించినఈలక్షణం నామాలు కూడా ధాతువులుగా వివక్షింపబడి ధాతువులు అవుతాయి. (అపుడు నామాలకు ఇంచుగాగమం వస్తుంది)

అనేఅర్థాన్ని బోధిస్తుంది. కాబట్టి ఇది నామాలకు ఇంచుక్కు రావడానికి జ్ఞాపకవిధి అవుతుంది. మొదట వ్యర్థ మైనవిధి వేరొక అర్థానికి జ్ఞాపకం అవుతుంది.

**20. డుఙ్ఞు** (క్రియ. 15) : 'లకారంబునకు డుఁబ్రు వురు నుము ఙ్ఞగు' అనేసూత్రంలో మొదట ఉన్న డువర్ణాన్ని ఇ త్తయిన చివరి ఞకారంతో కూర్చి చేసినప్రత్యాహారం 'డుఙ్ఞు'. ఈప్రత్యాహారంచేత 'డుఙ్, రు, వు, రు, ను, ము' అని ఇక్కడ (డు–ఞకారాలకు మధ్యలో) ఉన్నవర్ణాలు బోధింపబడతాయి. వీటికి ఆదేశాలుగా వచ్చే– దు, వు, ది, వి, ము,– మొద లయినవి కూడా డుఙ్ఞు అనేప్రత్యాహారంచేత బోధింపబడతాయి. చదువుచున్నాఁడు. చదువుచున్నది. మొ.

**21. తచ్ఛీలము** (క్రియ. 5): (తస్య శీలః– తచ్ఛీలః) తత్=ఆక్రియ (అర్థం ఐన వ్యాపారం)యొక్క శీలః=స్వభావం అని అర్థం. జ్వలనజ్వాల లుప్పరం బెగయును. ఎగయు ధాతువుపై జ్వలనుడి(కర్త)యొక్క శీలం అనేఅర్థంలో 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు వచ్చింది. జ్వాల లెగయుట జ్వలనుడిశీలం.

**22. తద్ధర్మము** (క్రియ. 5): తస్య ధాతోః (కర్తుః) ధర్మః తద్ధర్మః. ధాతువు కర్తయొక్క ధర్మం తద్ధర్మం. వర్తమానం మొద లైనవిధంగా ఏదో ఒకకాలానికి పరిమితం కాకుండా, కర్తృధర్మంగా ధాతువుయొక్కఅర్థాన్ని మాత్రమే తెలిపేది తద్ధర్మం. సూర్యుడు ప్రకాశించును. ప్రకాశించుట అనేది సూర్యుడి (కర్త) ధర్మం.

**23. తిఙంతము** (క్రియ.): తిఙ్ అంతంలో (చివర) కలిగినది తిఙంతం. తిఙులు సంస్కృతంలో క్రియావిభక్తులు. వాటికి పర్యాయంగా తెలుగులో 'లకారంబునకు డుఁబ్రు వురు నుము ఙ్ఞగు' అనేసూత్రంచేత విధింపబడిన డుఙ్ ప్రత్యయాలు అంతంలో కలిగినవాటిని (డుఞంతం) తిఙంతా లని గ్రహించాలి. క్రియావిభక్తులు చివర కలిగినవి క్రియాపదాలు. అవే తిఙంతాలు. వచ్చుచున్నాడు, రాదు మొ.

**24. తుమర్థము** (క్రియ. 40): తుమ్ (తుమున్) అనేప్రత్యయంయొక్క అర్థం తుమర్థం (తుమున్నర్థం). 'తుమున్ ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్' అని వేరొకక్రియ ప్రయోజనంగా కలిగినక్రియ ఉపపద మైఉండగా ధాతువుకు భవిష్యదర్థంలో సంస్కృతంలో తుమున్ ప్రత్యయం వస్తుంది. ఆఅర్థంలో తెలుగులో 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అని నుజీ ప్రత్యయం వస్తుంది. ఉదా. చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయెను అని అర్థం. పోయెను అనేది (క్రియాంతరం) ఉపపదంగా ఉండగా వండుధాతువుకు భవిష్యదర్థం

(చేయబోయేవంట)లో నుజి ప్రత్యయం వచ్చింది. తుమర్థంలో వచ్చేది కాబట్టి ఈ'నుజి' తుమర్థకం. తదర్థం (దానికొఱకు) అని తుమర్థం. వండన్= వండుటకొఱకు.

**25. తృవర్ణకార్థము,త్రర్థము**(క్రియ. 44,106): తృ(చ్) అనేసంస్కృతప్రత్యయం యొక్క అర్థం తృవర్ణకార్థం. 'ణ్వుల్ తృచౌ' అని తృచ్‌ప్రత్యయం ధాతువుకు తద్ధర్మాదు లందు కర్త్రర్థంలో వస్తుంది. ఇదే (తృచ్–అర్థ) తృజర్థం. (తృ–అర్థ) త్రర్థం అని కూడా చెప్పబడుతుంది. 'తృవర్ణకార్థంబునం దెడి యెదు వన్నియ లగు' చదివెడివాడు, చదివెడువాడు. 'వానికి లోపంబు బహుళంబుగా నగు' చదువువాడు. తద్ధర్మా ద్యర్థాలలో కర్త్రర్థకాలు కావడంచేత ఇవి తద్ధర్మార్థకవిశేషణాలు.

**26. ధాతుజవిశేషణము** (క్రియ. 47): 'ఎడిప్రభృతివర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణము లని ప్రాచీనులు వ్యవహరింతురు.' ధాతువునుండి ఏర్పడిన విశేషణం ధాతుజవిశేషణం. 1.ఎడి, 2.ఎడు, 3.వానిలోపం, 4.ఉన్న, 5.కలజి, 6.న, 7.ని, అనేవి చివర ఉండి, ధాతువు లన్నింటినుండి విశేషణరూపాలు 7 విధాలుగా ఏర్పడతాయి. చదివెడివాడు, చదువనివాడు. మొ.

**27. నామధాతువు** (క్రియ. 65): 'నామం బనఁగా ప్రాతిపదికము'. 'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు'. అనేసూత్రజ్ఞాపనంచేత ధాతువులుగా వివక్షింపబడినపుడు కొన్ని నామాలు (ప్రాతిపదికలు) ధాతువు లై, ఇంచుగాగమాన్నీ, దానిపై లడాదిలకారాలనూ పొందుతాయి. నామాలనుండి ఏర్పడినధాతురూపాలు కాబట్టి వీటిని నామధాతువులు అని వ్యవహరిస్తారు. శయన(ము) – శయనించు. శయనించెను. మొ.

**28. నిత్యము** (క్రియ. 50): (కృతాకృతప్రసంగి నిత్యమ్) కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు. ఒకేచోట రెండు విధులు ప్రవర్తించడానికి అవకాశం ఉన్నపుడు, ఆరెండింటిలో ఒకటి ప్రవర్తింపజేసినా, చేయకపోయినా తప్పక ప్రవర్తించే (రెండవ)విధి నిత్యం. జి+ఇంచు. అన్నపుడు ధాతువుకు (ఇఉబుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు) అయుగాగమమూ. (గురువిరహితంబు లయి యయాంతంబు లయిన .....ఇయుడాగమంబు విభాష నగు) ఇయుడాగమమూ రెండు ప్రవర్తింపవలసిఉన్నది. అందులో అయుగాగమం చేస్తే (జయ్+ఇంచు) ధాతువు యకారాంతం అవుతుంది. కాబట్టి అయాంతాలకు చెప్పిన ఇయుడాగమం రాదు. కాని, మొదట ఇయుడాగమం చేసినా, చేయకపోయినా అయుగాగమం మాత్రం తప్పకుండా వస్తుంది. కాబట్టి అయుగాగమవిధి నిత్యం. అదే ప్రవర్తిస్తుంది.

కాబట్టి అయుగాగమవిధి నిత్యం.

**29. ప్రత్యవసానార్థకము** (క్రియ. 123): ప్రత్యవసానం చ భక్షణమ్. భుజించడం (తినడం) అనేఅర్థాన్ని ఇచ్చే ధాతువులు ప్రత్యవసానార్థకాలు. తిను, కుడుచు మొ.

**30. ప్రత్యాహారము** (క్రియ. 8): 'ఆది రన్త్యేన స హేతా' అనేలక్షణాన్నిబట్టి ఏర్పడిన (సంజ్ఞా)శబ్దస్వరూపానికి ప్రత్యాహారం అని పేరు. ఉదా. డుఇ్ఞ. 'డుడ్రు వురు నుముఇఞ్' అనేచోట మొదట ఉన్న డువర్ణాన్ని, ఆపిదప ఉన్న ఇత్తు అయిన ఇఞకారంతో కూర్పగా ఏర్పడిన 'డుఇఞ్' అనేది ప్రత్యాహారం. ఇది ఇందులో మొదటి దైన'డు'వర్ణానికీ, డు–ఇఞ కారాలకు నడుమ ఉన్న 'రు, వు, రు, ను, ము' అనేవాటికీ సంజ్ఞ అవుతుంది. ఇలాగే వుఇఞ్, రుఇఞ్ మొ.

**31. ప్రథమపురుషము** (క్రియ. 9): 'అందు వరుసను రెండేసి ప్రథమమధ్య మోత్తమంబు లనంబడు' 'లకారంబునకు డుడ్రు వురు నుము ఙ్ఞగు' అనేసూత్రంచేత విధింపబడినవాటిలో మొదట ఉన్న 'డుజ్, రు' అనేరెండింటికి ప్రథమ(పురుష) అని సంజ్ఞ. యుష్మదస్మదర్థాలు (నీవు,మీరు– నేను,మేము) రెండింటికంటె వే రైనది కర్త (అయినఅర్థం ప్రథమపురుషం)గా ఉన్నపుడు ఏకత్వంలో డుజ్‌వర్ణకమూ, బహుత్వంలో రువర్ణకమూ వస్తాయి. ఉదా. చదువుచున్నాడు. చదువుదురు.

**32. ప్రయోజ్యకర్త** (క్రియ. 124): ప్రయోగింపబడినకర్త, అంటే ప్రేరేపింపబడినకర్త ప్రయోజ్యకర్త. ధాత్వర్థవ్యాపారాశ్రయ మైనకర్త, ఆవ్యాపారంలో వేఱొక(ప్రేరణ)కర్తచేత ప్రయోగింపబడితే ప్రయోజ్యకర్త అవుతుంది. 'విశ్వామిత్రుడు రామునకు మిథిలం గానిపించెను.' కానిపించు అనేప్రేరణక్రియకు కర్త ఐన విశ్వామిత్రుడిచేత 'కనడం' అనేవ్యాపారంలో ప్రయోగింపబడడంచేత (కనుటకు కర్త ఐన) 'రాముడు' ప్రయోజ్యకర్త అవుతాడు.

**33. ప్రాదులు** (క్రియ. 121): ప్ర అనేది మొదట కలిగినది (ప్ర మొదలు అయినవి) ప్రాదులు. ప్ర–పరా–అప–అను–అవ–నిస్–నిర్– దుస్–దుర్– వి–ఆఙ్– ని–అధి–అపి– అతి– సు–ఉద్–అభి–ప్రతి–పరి–ఉప– అనే ఇరవైరెండింటికి ప్రాదులు అని పేరు.

**34. ప్రేరణము (ప్రేరణార్థము)** (క్రియ. 70): (నికృష్టస్య భృత్యాదేః కార్యాదౌ నియోగః) ముఖ్య (ప్రయోజ్య)కర్తను క్రియ(వ్యాపారం–పని)లో (ప్రయోజకకర్త) నియోగించడం ప్రేరణం. అంటే ధాతువుకు అర్థ మైనవ్యాపారం (పనిని)ఒకరు చేసేవిధంగా ఇంకొకరు ప్రేరేపించడం. ఉదా. చైత్రుడు మైత్రునిచేత చదివించెను. చదువుట అనేపని ఒకరు(మైత్రుడు) చేసేవిధంగా ఇంకొకరిచేత(చైత్రుడు)

ప్రేరేపింపబడినట్లు చెప్పడంచేత ఇది ప్రేరణం.

**35. ప్రేరణకర్త్రర్థము** (క్రియ. 124)**:** ధాత్వర్థం ఐన వ్యాపారం చేయడంలో ఇతరుడి(ముఖ్యకర్తను) ప్రేరేపించేఅర్థం ప్రేరణార్థం. క్రియాపదంచేత కర్త బోధింపబడితే కర్త్రర్థం. 'చైత్రుడు మైత్రుని మనిచెను'. మనుధాతువు. మనుచు– మనునట్లు చేయు. ప్రేరణం. 'మనిచెను' అనేది ప్రేరణకర్త అయినచైత్రుడిని బోధిస్తున్నది కాబట్టి ఇది ప్రేరణకర్త్రర్థం.

**36. ప్రేరణకర్మార్థము** (క్రియ. 124)**:** ధాత్వర్థం ఐనవ్యాపారం చేయడంలో ఇతరుడి(ముఖ్యకర్తను) ప్రేరేపించేఅర్థం ప్రేరణార్థం. క్రియాపదంచేత కర్మ బోధింపబడితే కర్మార్థం. 'చైత్రునిచేత మైత్రుడు మనుపబడెను'. మను–చు. (మనునట్లు చేయు) ప్రేరణార్థకం. 'మనుపబడు' అన్నపుడు కర్మ (అకర్మకధాతువుకు అప్రేరణంలో కర్త అయినదే, ప్రేరణంలో కర్మ అవుతుంది) ఐన మైత్రుడిని బోధిస్తున్నది. కాబట్టి 'మనుపబడెను' అనేది ప్రేరణకర్మార్థం.

**37. ప్రేరణాత్మనేపదకర్త్రర్థము** (క్రియ. 124)**:** ధాత్వర్థ మైనవ్యాపారంలో ఇతరులను నియోగించేవిధంగా చెప్పడం ప్రేరణం. క్రియాఫలం కర్తను పొందేవిధంగా చెప్తే ఆత్మనేపదార్థం. క్రియాపదంచేత కర్త బోధింపబడితే కర్త్రర్థం. ఉదా. 'చైత్రుండు మైత్రుని మనుచుకొనియె. మను–చు. ప్రేరణం. మనుచు–కొను. ప్రేరణాత్మనేపదం. 'మనుచుకొనియె' అనేక్రియ ప్రేరణకర్తను(చైత్రుడిని) బోధించడంచేత ఇది ప్రేరణాత్మనేపదకర్త్రర్థం.

**38. ప్రేరణాత్మనేపదకర్మార్థము** (క్రియ. 124)**:** ధాత్వర్థ మైనవ్యాపారంలో ఇతరులను నియోగించేవిధంగా చెప్పడం ప్రేరణం. క్రియాఫలం కర్తను పొందేవిధంగా చెప్తే ఆత్మనేపదార్థం. క్రియాపదంచేత కర్మ బోధింపబడితే కర్మార్థం. ఉదా. 'చైత్రునిచేత మైత్రుడు మనుచుకొనబడెను' మను - చు. ప్రేరణం. మనుచు - కొను. ప్రేరణాత్మనేపదం. మనుచుకొను–పడు. (మనుచుకొనబడె) ప్రేరణాత్మనేపదకర్మార్థం.

**39. భవచ్ఛత్రర్థము** (క్రియ. 46)**:** భవత్–శతృ–అర్థ. భూధాతువుపై సంస్కృతంలో శతృప్రత్యయం చేర్చడంచేత ఏర్పడిన 'భవత్' అనేశబ్దానికి వర్తమానార్థం అని అర్థం. వర్తమానార్థకం అయిన శతృప్రత్యయంయొక్క అర్థం ('లట శ్శతృశానచౌ' అని లట్టుకు అయ్యే శతృప్రత్యయంయొక్క అర్థం) భవచ్ఛత్రర్థం. 'ఉన్న కలజీ న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' చదువుచున్నవాడు. శత్రర్థకం ఐన ఇది విశేషణరూపమై విశేష్యంతో అన్వయిస్తుంది.

**40. భావము** (క్రియ. 35)**:** 'భావం బనగా ధాత్వర్థంబు'. ధాతువుయొక్క

అర్థం (వ్యాపారం)భావం. 'ట వర్ణకంబు భావంబునం దగు'. భావార్థంలో ధాతువుమీద టప్రత్యయం వస్తుంది. చదువుట. పఠనరూప మైనవ్యాపారం ఇక్కడ భావం. ఇలాగే అలుక, కలిమి మొ.

**41. భావలక్షణము** (క్రియ. 40)**:** 'భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ'. భావం అంటే క్రియ. వేరొకవ్యాపారానికి లక్షణ మైన- సూచక మైన(తెలిపే) వ్యాపారం (క్రియ) భావలక్షణం. 'చైత్రుడు వండ నతిథి వచ్చెను' వండన్- వండుచుండగా. అతిథి వచ్చుట అనే వేరొకవ్యాపారంయొక్క కాలాన్ని ఇక్కడ 'వండుట' అనేవ్యాపారం సూచిస్తున్నది. కాబట్టి ఇది భావలక్షణం. 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అని ఈఅర్థంలో ధాతువుకు నుజీ అనేప్రత్యయం వస్తుంది.

**42. భావి** (క్రియ. 4)**:** 'భావి నా విద్యమానప్రాగభావప్రతియోగి'. అప్పటికి పుట్టకుండడానికి విరోధి ఐనది. అంటే ఇక పైన పుట్టే క్రియ. 'చదువఁగలఁడు' ఇక్కడ చదువుట అనేక్రియ అప్పటికి లేదు. కాని తర్వాత ఉంటుంది. కాబట్టి ఇది భావ్యర్థం. అంటే భవిష్యదర్థం.

**43. భావిశత్రర్థము** (క్రియ. 46)**:** 'లృట స్స ద్వా' అని సంస్కృతంలో భవిష్యత్ (భావి) అర్థంలో వచ్చిన 'శతృ' అనే ప్రత్యయంయొక్క అర్థం భావిశత్రర్థం. 'ఉన్న కలజీ న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' చదువగలవాడు. భవిష్యత్కాలానికి సంబంధించిన విశేషణరూపం అవుతూ ఇది విశేష్యంతో అన్వయిస్తుంది. భవిష్యత్తులో చదువబోయేవాడు అని దీనికి అర్థం.

**44. భూతము (భూతార్థము)** (క్రియ. 3)**:** 'భూతంబు నా విద్యమానధ్వంస ప్రతియోగి'. విద్యమాన=కనబడుతున్న, ధ్వంస=లేకపోవడానికి, ప్రతియోగి=విరోధి. ప్రస్తుతం లేకపోవడానికి విరోధి ఐనది.అంటే అంతకు పూర్వం ఉండి, అప్పటికి లేకుండా పోయినది భూతం. ఉదా. వండెను. ఇక్కడ వండుట అనేవ్యాపారం ప్రస్తుతం లేదు. కాని అంతకు పూర్వం ఉన్నది. కాబట్టి ఇది భూతార్థం.

**45. మధ్యమ(పురుష)ము** (క్రియ. 9)**:** 'లకారంబునకు డుఁబ్రు వురు నుము ఙ్గు' అనేసూత్రం విధించినప్రత్యయాలలో 'అందు వరుసను రెండేసి ప్రథమ మధ్య మోత్తమంబు లనంబడు' అనేసూత్రంప్రకారం మధ్యలో ఉన్న 'వు,రు' అనే రెండింటికి మధ్యమం అని పేరు. యుష్మదర్థాన్ని బోధించేటపుడు ఏకత్వంలో (నీవు) వు వర్ణమూ, బహుత్వంలో (మీరు) రు వర్ణమూ వస్తాయి. (నీవు) చదువుచున్నావు. (మీరు) చదువుచున్నారు. (నీవు, మీరు అనేవి కర్తగా కలిగినక్రియలు

మధ్యమపురుషక్రియలు.)

**46. ముజు** (క్రియ. 31): 'మధ్యమముడుజులు ముజు నాబడు'. 'లూణ్మధ్యమ పురులకు ముడుజు లగు' అనేసూత్రంచేత మధ్యమపురుషప్రత్యయా లయినవురులకు లూట్టు లకారంలో ఆదేశంగా వచ్చిన ము, డుజ్ అనేప్రత్యయాలకు రెండిటికి కలిపి 'ముజు' అని సంజ్ఞ. (నీవు) చదువుము. (మీరు) చదువుఁడు.

**47. ముత్తు** (క్రియ. 86): 'ముజీత్తులు ముత్తు నాబడు' ముజునూ, జీత్తులనూ కలిపి 'ముత్తు' అంటారు. 'మధ్యమముడుజులు ముజు నాబడు' మధ్యమపురుష ప్రత్యయా లయిన ము, డుజ్ అనేరెండిటికి 'ముజు' అని సంజ్ఞ. చదువు'ము', చదువు'ఁడు'. జి అనేవర్ణం ఇత్తుగా కలిగినవి జీత్తులు. కలజి, పడుజి మొద లైనవి. తిన'క', కన'మి' మొ.

**48. రుఙ్ఞు** (క్రియ. 15): 'లకారంబునకు డుఙ్రు వురు నుము ఙ్ఞగు' అనేసూత్రంలో (మొదటి) రువర్ణాన్ని ఇ త్తయిన చివరి ఞకారంతో కూర్చి చేసినప్రత్యాహారం 'రుఙ్ఞు'. ఈప్రత్యాహారంచేత 'రు, వు, రు, ను, ము' అని ఇక్కడ (రు-ఞకారాలకు మధ్యలో) ఉన్నవర్ణాలు బోధింపబడతాయి. చదువుచున్నారు. చదువుచున్నాము. మొ.

**49. లఘూపధము** (క్రియ. 66): (అలో ఽన్త్యాత్ పూర్వ ఉపధా, హ్రస్వం లఘు) ఉపధ యనగా తుదివర్ణమునకు ముందు వర్ణము. హ్రస్వం (గురువు కానిది) లఘువు. లఘు వైనవర్ణం ఉపధగా కలిగినది లఘూపధం, 'ఛిద్'-ఛ్ ఇద్. తుది(ద్)వర్ణానికి ముందు ఉన్న ఉపధ అయిన 'ఇ' వర్ణం లఘువు (హ్రస్వం). కాబట్టి ఛిద్ అనేది లఘూపధం.

**50. లజీ (లజ్యంతము)** (క్రియ. 104): 'వ్యతిరేకంబున లజి యగు' వ్యతిరేకార్థంతో కూడినవ్యాపారాన్ని బోధించేధాతువుకు లజి అనేలకారం వస్తుంది. ఇది ప్రత్యయం. లజి అనేది అంతంలో కలిగినది లజ్యంతం. క్రియాపదం. రాడు. ఇది వచ్చుట అనేధాత్వర్థాన్ని (వ్యాపారాన్ని) వ్యతిరేకార్థవిశిష్టంగా వచ్చుట అనేపనిచేయనివాడు అనేవిధంగా బోధిస్తున్నది. వ్యతిరేకార్థకక్రియ అని అర్థం.

**51. లట్టు (లడంతము, లడర్థము)** (క్రియ. 2): 'వర్తమానంబున ల ట్టగు' అప్పటి కింకను ముగియకుండునది. ఇంకా పూర్తి కాక జరుగుతున్న (వర్తమాన) వ్యాపారాన్ని బోధించేధాతువుపై లట్ అనేలకారం వస్తుంది. లట్టుయొక్క అర్థం లడర్థం. అంటే వర్తమానం. ఇది అంతంలో కలిగినక్రియ లడంతం. చదువుచున్నాడు.

**52. లాట్టు (లాడంతము, లాడర్థము)** (క్రియ. 5): 'తద్ధర్మాదులందు లా

ట్టగు' తద్ధర్మం (ఆధాతువుకర్తయొక్క ధర్మం) మొ. అర్థాలలో వర్తించేవ్యాపారాన్ని బోధించేధాతువుమీద 'లాట్' అనేలకారం వస్తుంది. లాట్– చివర కలిగినది లాడంతం. చదువును మొ. (లాట్టుయొక్క అర్థం లాడర్థం. తద్ధర్మం, తచ్ఛీలం, సంభావన, సంప్రశ్నం, సాతత్యం, వర్తమానం, భావి, ఆశీస్సు మొద లైనవి లాడర్థాలు. జ్వలనజ్వాల లెగయును.)

**53. లిట్టు(లిడంతము, లిడర్థము)** (క్రియ. 3): 'భూతంబున లి ట్టగు' అంతకు ముందుండి అప్పటికి లేని – అంటే ముగిసిన (భూతం) వ్యాపారాన్నిబోధించే ధాతువుమీద లిట్టు లకారం వస్తుంది. లిట్టుయొక్క అర్థం లిడర్థం. అంటే భూతం. లిట్టు చివర కలిగినక్రియ లిడంతం. తినెను. తినడం అనేపని ప్రస్తుతం లేదు. కాని అంతకు ముందు ఉన్నది. కాబట్టి ఇది భూతార్థం.

**54. లూట్టు (లూడంతము, లూడర్థము)** (క్రియ. 6): 'ఆశీశ్శాపసంప్రార్థన విధులందు లూ ట్టగు'. ఆశీస్సు, శాపం, సంప్రార్థనం (వేడుకోవడం), విధి (ఆజ్ఞాపనం మొ.)అనేఅర్థాలలో ఉన్నవ్యాపారాన్ని బోధించేధాతువుపై లూట్ ప్రత్యయం వస్తుంది. లూట్టుయొక్క అర్థం లూడర్థం. అవి ఆశీస్సు, శాపం, సంప్రార్థనం, విధి అనేవి నాలుగు. లూట్ లకారం చివర కలిగిన క్రియ లూడంతం. (మేలు) కలుగుత. (రాక్షసుడవు) అగుము. రక్షింపుడు. (నీవు) చేయునది. మొ.

**55. లృట్టు (లృడంతము, లృడర్థము)** (క్రియ. 4): 'భావిని లృ ట్టగు' అప్పటి కింకా పుట్టకుండా ఆతర్వాత పుట్టబోయేవ్యాపారాన్ని బోధించే(భావి) ధాతువుమీద లృట్టు లకారం వస్తుంది. లృట్టుయొక్క అర్థం లృడర్థం. అంటే భవిష్యదర్థం. లృట్టు చివర కలిగినక్రియ లృడంతం. చదువగలడు. చదువుట అనేపని అప్పటికి ఇంకా ప్రారంభం కాలేదు. తరువాత జరుగుతుంది. కాబట్టి భవిష్యదర్థం.

**56. వర్తమానము :** (క్రియ. 2) 'వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు' మొదలు పెట్టబడి ఇంకా (వాక్యప్రయోగసమయానికి) క్రియ (వ్యాపారం) ముగియకుండటం వర్తమానం. 'చదువుచున్నాడు' చదవడం అనేపని ఇంకా పూర్తి కానట్టు చెప్తున్నది కాబట్టి ఇది వర్తమానార్థం.

**57. విధ్యర్థము** (క్రియ. 26): (విధిః ప్రేరణమ్, భృత్యాదే ర్నికృష్టస్య ప్రవర్తనమ్) సేవకులు మొద లైనవారిని క్రియ(పని)లో ప్రవర్తించేటట్లు చేయడం (ఆజ్ఞాపించడం) విధి. నీవు ఈకార్యంబు 'చేయునది'. చేసేవిధంగా నియోగించడంచేత 'చేయునది' విధ్యర్థకం.

**58. వుఇ్ణ్ణు** (క్రియ. 18): 'లకారంబునకు డుగ్రు వురు నుము ఇ్ణగు' అనేసూత్రంలో వువర్ణాన్ని ఇ త్తయిన చివరిఇకారంతో కూర్చి చేసినప్రత్యాహారం 'వుఇ్ణు'. ఈప్రత్యాహారంచేత 'వు,రు,ను,ము' అని ఇక్కడ(వు-ఇకారాలకు మధ్యలో) ఉన్నవర్ణాలు బోధింపబడతాయి. చదువుచున్నారు. చదువుచున్నాము. మొ.

**59. వృత్తం బగుభావలక్షణము** (క్రియ. 41): భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ. భావం అంటే క్రియ. వేరొకవ్యాపారానికి లక్షణ మైన-సూచక మైన(కాలాదులను తెలిపే) వ్యాపారం (క్రియ) భావలక్షణం. వృత్తం అంటే జరిగిపోయింది. అంటే భూతం. జరిగిపోయిన వేరొకక్రియకు సూచక మైనది వృత్తం బగుభావలక్షణం. 'వాడు ర మ్మనినం బోయితిని' ఇక్కడ అనడం అనేది జరిగిపోయింది కాబట్టి వృత్తం. పోవడం అనేమరొకక్రియ జరగడానికి ('అనిన కారణంగా' అని హేతువు) సూచకం కావడంచేత భావలక్షణం. అందుచేత అనినన్ అనేది వృత్తం బగుభావలక్షణం అవుతుంది.

**60. వ్యతిరేకక్త్వార్థము** (క్రియ. 39): క్త్వా అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం క్త్వార్థం. ఏకాశ్రయా లయినక్రియలలోపల పూర్వకాలానికి చెందినవ్యాపారాన్ని బోధించేది క్త్వార్థం. అక్కడ ధాత్వర్థం ఐనవ్యాపారం వ్యతిరేకార్థవిశిష్టం ఐతే అది వ్యతిరేకక్త్వార్థం అవుతుంది. 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అని ఈఅర్థంలో తెలుగులో కజి' అనేప్రత్యయం వస్తుంది. వండక, తినక. మొ.

**61. వ్యతిరేకతృవర్ణకార్థము** (క్రియ. 47): 'తృచ్' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం తృవర్ణకార్థం. ధాతువుకు తద్ధర్మాదులలో కర్తను బోధించేటపుడు తృ ప్రత్యయం అవుతుంది. ఇక్కడ ధాత్వర్థ మైనవ్యాపారం వ్యతిరేకార్థవిశిష్ట మయితే అది వ్యతిరేక తృవర్ణకార్థం. 'వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజి యగు' అని ఈఅర్థంలో నిజి అనేప్రత్యయం వస్తుంది. ఉదా. వండనివాడు.

**62. వ్యతిరేకభావము** (క్రియ. 37): 'భావం బనఁగా ధాత్వర్థంబు' ధాతువుయొక్క అర్థం ఐనవ్యాపారం వ్యతిరేకార్థవిశిష్టం ఐతే అది వ్యతిరేకభావార్థం అవుతుంది. 'వ్యతిరేకభావంబున మిజి యగు' ఈఅర్థంలో ధాతువుమీద మిజి అనేప్రత్యయం వస్తుంది. ఉదా. వండమి. వండకపోవుట అని దీనిఅర్థం. ఇది వండుట అనేభావార్థానికి వ్యతిరేకం. కాబట్టి ఇది వ్యతిరేకభావార్థకం.

**63. శత్రర్థము :** చూ. సంధి.

**64. శబ్దకర్మము :** (క్రియ. 123) (శబ్దః కర్మ యేషాం తే శబ్దకర్మాణః)

శబ్దరూపం (వేదం మొ.) కర్మగా కలిగినధాతువులు శబ్దకర్మాలు. విను. ఈధాతువుకు ఫలరూపఅర్థం ఐన వినబడడం అనేధ్వన్యాత్మకశబ్దం కర్మ. కాబట్టి 'విను' ధాతువు శబ్దకర్మం. ఇలాగే చదువు, చెప్పు మొ.

**65. శబ్దపల్లవము** (క్రియ.118): 'ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగునీయవి శబ్దపల్లవంబులు నాఁబడు' ధాతువు, నామం మొద లైనవాటికి మీద ధాతువు చేరి, వేరొకఅర్థాన్ని బోధించేశబ్దాలకు శబ్దపల్లవాలు అని సంజ్ఞ. ఉదా. నిలుచుండు (నిలుచు+ఉండు). విజయంచేయు (విజయము+చేయు) మొ.

**66. సంప్రశ్నము** (క్రియ.22): (తద్ వా కర్తవ్య మిదం వా ఇతి రూపః సంప్రశ్నః) కర్తవ్యంగా రెండు క్రియలు ఉన్నపుడు కర్తవ్యం అదా? ఇదా? అనేవిధం ఐన సందేహస్థితి సంప్రశ్నం. ఈఅర్థంలో ధాతువుమీద లాట్టు వస్తుంది. ఉందునా? పోదునా? ఉండుట, పోవుట అనేరెండుక్రియలలో కర్తవ్యం ఏది అనేవిషయంలో సందిగ్ధస్థితితో కూడినప్రశ్న ఉన్నది కాబట్టి ఇది సంప్రశ్నం.

**67. సంప్రార్థనము** (క్రియ.26): సం-ప్రార్థనం అంటే వేడుకోవడం. గొప్పవాళ్లను, (తన కిష్ట మైన) పని చేయ మని కోరడం సంప్రార్థనం. ఇటువంటిఅర్థం ఉన్నవ్యాపారంలో వర్తించేధాతువుకు 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' లూట్టు లకారం వస్తుంది. (రామా!) రక్షింపుము.

**68. సంభావన** (క్రియ.22): ఇది ఇలా అని నిశ్చయంగా చేసినఊహ సంభావన(ము). ఈఅర్థం కలిగినవ్యాపారంలో వర్తించేధాతువుకు 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు లకారం వస్తుంది. 'ఇపుడు వాడు ఇంట నుండును' ఉండుట అనేది నిశ్చయ మైన ఊహ. కాబట్టి ఇది సంభావనార్థకం.

**69. సకర్మకము** (క్రియ.48): (కర్మణా సహ వర్తమానః సకర్మకః) సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు. కర్మను గురించిన ఆకాంక్ష కలిగినధాతువు సకర్మకం. తిను, చదువు మొ. వాడు అన్నమును తినెను. ఇక్కడ 'దేనిని' (అన్నమును) తినెను, అనేవిధంగా కర్మను గూర్చిన ఆకాంక్ష కలిగినది కావడంచేత 'తిను' ధాతువు సకర్మకం.

(ఫలవ్యాపారయో రేకనిష్ఠతాయా మకర్మకః ధాతు, స్తయో ర్ధర్మభేదే సకర్మక ఉదాహృతః. ధాతువుయొక్క అర్థా లైన ఫలం, వ్యాపారం అనేరెండు ధర్మాలు భిన్నవస్తువులలో ఉంటే అది సకర్మకం. రాముడు అన్నము తినెను. తినుధాతువుకు అర్థం ఐన నోటిలో పెట్టుకోవడం మొ. రూప మైనవ్యాపారం రాముని (కర్తను),

నమలబడడం మొ. రూప మైనఫలం అన్నాన్ని (కర్మను) ఆశ్రయించడంచేత తినుధాతువు సకర్మకం.)

**70. సత్త్వము** (క్రియ. 46): 'సుబంతవాచ్యంబు సత్త్వంబు నాబడు' నామవిభక్తులు (సుప్) అంతంలో కలిగినది సుబంతం. దానిచేత తెలియజేయబడేది– అంటే ద్రవ్యం సత్త్వం. (వస్తువు) వ్యాపారాన్ని కాకుండా పదార్థాన్ని బోధించేటపుడే ధాతువుమీద, ఉన్న, కల, న మొ. ప్రత్యయాలు వస్తాయి. అంటే నామాలను ఆకాంక్షిస్తూ సుబంతాలకు విశేషణాలు అవుతాయి. (వండుచున్నవాడు). వండుచున్నాడు (వ్యక్తి). ఉన్న ప్రత్యయం వచ్చినఈశబ్దం వస్తుబోధకం. వండుచున్నాడు– (క్రియ) ఉన్న అనుబంధం ఐన ఈశబ్దం క్రియాబోధకం.

**71. సాతత్యము** (క్రియ. 22): (సతతస్య భావః) నిరంతరంగా (ఎల్లపుడు) ఉండడం సాతత్యం. ఈఅర్థంలో ఉన్నవ్యాపారంలో వర్తించేధాతువుకు 'తద్ధర్మాదులందు లా ట్టగు' అని లాట్టు లకారం వస్తుంది. 'సర్వం బీశ్వరునియం దుండును' ఇక్కడ ఉండు అనేది (ఈశ్వరుడు ఎల్లప్పుడు ఉంటాడు కాబట్టి) సతతభావాన్ని తెలియజేస్తుంది. కాబట్టి ఈఅర్థం సాతత్యం.

## కృదంతపరిచ్ఛేదం

**1. కృత్తు. కృదంతము** (కృత్. 1): (కృ దతిజ్) 'ధాతువునకు విహితం బగుడుఙ్భిన్నప్రత్యయంబు కృత్తు నాబడు' ధాతువుపై విధింపబడిన డుజ్, రు మొద లైనక్రియావిభక్తులకంటె వే రైనప్రత్యయానికి కృత్తు అని పేరు. కృత్ప్రత్యయం అంతంలో (చివర) కలిగినశబ్దం కృదంతం. వండుట. వండుధాతువుమీద డుఙ్నకు భిన్నంగా విధింపబడినది కావడంచేత (టవర్ణకంబు భావంబునం దగు) ట ప్రత్యయం కృత్తు. ఆ'ట'ప్రత్యయం చివర కలిగిన 'వండుట' అనేశబ్దం కృదంతం.

## ప్రకీర్ణకపరిచ్ఛేదం

**1. జడ్డ** (ప్రకీర్ణ. 8): ఒకే హల్లు ద్విరుక్త మైనపుడు అందులో రెండవసారి ఉచ్చరింపబడినహల్లుకు జడ్డ అని ఇక్కడ వ్యవహారం. 'అక్కట' ఇక్కడ 'క్క' అనేదానిలో (క్క్అ) రెండవ దైనకకారానికి జడ్డ అని వ్యవహారం.

(జడ్డ యం చనగను సంయుక్తము– అని వేరువేరు హల్లులు కలిసినా జడ్డ అవుతుం దని కొందరు పేర్కొన్నారు. ఈపక్షంలో కలిసిఉన్నహల్లుల మొత్తం జడ్డ

అవుతుంది. సంయుక్తవర్ణం అని సారాంశం. 'క్త' అనేసంయుక్తాక్షరాన్ని మొత్తాన్ని జడ్డ అని చెప్పాలి. ఇది విచారింపవలసినది.)

**2. జడ్డక్కరము** (ప్రకీర్ణ. 9)**:** ఒకే హల్లు ద్విరుక్త మైనపుడు అందులో రెండవసారి ఉచ్చరింపబడినహల్లుకు జడ్డ అని వ్యవహారం. 'అక్కట' ఇక్కడ 'క్క' అనేదానిలో (క్క్అ) రెండవ దైనకకారానికి జడ్డ అని పేరు. జడ్డ కలిగినఅక్షరం జడ్డక్కరం. 'అక్కట' అన్నపుడు 'క్క' అనేది జడ్డక్కరం. ఇలాగే అబ్బు లో బ్బు.

**3. తాలవ్యవక్రము** (ప్రకీర్ణ. 3)**:** 'ఎఏఒఓ లు వక్రంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు'. తాలువు ఉత్పత్తిస్థానంగా కలిగినవి తాలవ్యాలు. తాలవ్యా లయినవక్రాలు తాలవ్యవక్రాలు. 'ఏదైతోః కంఠతాలు' అనడంచేత వక్రాలలో ఎఏలు తాలవ్యాలు. కాబట్టి అవి తాలవ్యవక్రాలు. ( ఓదౌతోః కంఠోష్ఠ్యమ్ అనడంచేత ఒఓ లు ఓష్ఠ్యవక్రాలు.)

**4. ప్రాసము** (ప్రకీర్ణ. 23)**:** 'పాదంబునం బ్రథమ ద్వితీయాక్షరంబులు వళిప్రాసంబులు నాఁబడు'. పద్యంలో ప్రతిపాదంలోనూ రెండవఅక్షరానికి ప్రాస అని పేరు. ఉదా. 'శ్రీలతకుం బ్రాఁ కయి'. ఈకందపద్యపాదంలో రెండవదైన 'ల' వర్ణం ప్రాస.

**5. వళి ఏ**(ప్రకీర్ణ. 23)**:** 'పాదంబునం బ్రథమద్వితీయాక్షరంబులు వళిప్రాసంబులు నాఁబడు'. పద్యంలో ప్రతిపాదంలోనూ మొదటిఅక్షరానికి వళి అని పేరు. ఉదా. 'శ్రీలతకుం బ్రాఁ కయి'. ఈకందపద్యపాదంలో 'శ్రీ' వర్ణం మొదటిది, కాబట్టి వళి.

000000000

# వ్యాసప్రశ్నలు

## బాలవ్యాకరణం - సంజ్ఞాపరిచ్ఛేదం

### 1. బిందువును గూర్చి వివరించండి.

'బిందు రనుస్వారః' అనుస్వారానికి బిందువు అని సంజ్ఞ. సున్నయే అనుస్వారం. ఇది స్వరాన్ని అనుసరించే ఉంటుంది.

**బిందుభేదాలు**

సంస్కృతప్రాకృతాలలో బిందువు నిండుసున్నగా ఒకే విధం. తెలుగులో మాత్రం 1. ఖండబిందువు 2. పూర్ణబిందువు అని రెండు రకాలు. ఇవి ఒక్కొక్కటి మళ్ళీ 1. సిద్ధం, 2. సాధ్యం అని రెండు రకాలు.

**1. సిద్ధఖండబిందువు :** శబ్దంలో సహజంగా (సిద్ధ మై) ఉన్న సున్న సిద్ధఖండబిందువు. ఉదా. చీఁకటి. మూఁడు.

**2. సిద్ధపూర్ణబిందువు :** శబ్దంలో సహజంగా ఉన్న నిండుసున్న సిద్ధపూర్ణబిందువు. ఉదా. వంక, చెంబు.

**3. సాధ్యఖండబిందువు :** వ్యాకరణంచేత సాధింపబడినఅరసున్న సాధ్యఖండబిందువు. ఉదా. పూచెఁ గలువలు, రాముఁడు.

**4. సాధ్యపూర్ణబిందువు :** వ్యాకరణంచేత సాధింపబడిననిండుసున్న సాధ్యపూర్ణబిందువు. ఉదా. పూచెం గలువలు, తేంట్లు.

**బిందుస్థితి**

**పరుషసరళాలకుముందే :** 1. 'సంస్కృతమేతరంబు లయినతెలుఁగుశబ్దంబుల యందుఁ బరుషసరళంబులకు ముందే బిందువు కానంబడుచున్నది.' పయి నాలుగురకా లయినబిందువులు కూడ తెలుగులో కచటతప(పరుషాలు) గజడదబ(సరళాలు) అనేవర్ణాలకు మాత్రమే పూర్వంలో ఉంటాయి. ఉ. చీఁకటి, చెంబు, కలఁకులు, పూచెంగలువలు.

కాబట్టి అచ్చతెనుగుమాటలలో స్థిరానికి పూర్వంలో బిందు వుండదు. సంస్కృత సమాలలో మాత్రం స్థిరానికి ముందు బిందు వుండవచ్చు. సంఘాతము, కంసారి.

పదంనడుమ అచ్చు ఉండదు గాబట్టి అచ్చుకు పూర్వంలో బిందువు ఉండేఅవకాశమె లేదు.

**నుడితొలిహ్రస్వం మీద ఖండమె:** 2. 'అఁటఇఁకచుఁడుశబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు' పదంలో మొట్టమొదటి హ్రస్వానికి తరువాత సిద్ధ మయినా, సాధ్య మైనా అరసున్న ఉండదు.

అఁట–ఇఁక–ఇఁగ–చుఁడు అనేనాలుగుశబ్దాలలో మాత్రం ఉంటుంది. ఎఁడు, ఇఁడి ఇత్యాదులు అపదా(పత్యయా)లు.

**దీర్ఘం మీద సాధ్యపూర్ణం ఉండదు :** 3. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.' శబ్దంలో ఎక్క డైనా దీర్ఘానికి తరువాత వ్యాకరణంచేత సాధింపబడేపూర్ణబిందు వుండదు. వాఁడు – రాఁడు అనేరీతిగా అరసున్న ఉంటుంది. వాంచు కాంచు అనేవిధంగా దీర్ఘంమీద సిద్ధపూర్ణ బిందు వుండవచ్చు.

**అరసున్నకు నిండుసున్న** : 4. 'హ్రస్వముమీఁదిఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగా నగును' హ్రస్వానికి తరువాత ఉన్న అరసున్నకు (సిద్ధ మైనా, సాధ్య మైనా) వికల్పంగా నిండుసున్న వస్తుంది. అరంటి – అరఁటి, వీఁటిండి– వీఁటిఁడి.

5. 'సమానపదమునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందువు నకుం బూర్ణం బగు' ఏకపదంలో సంయుక్తవర్ణం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న అరసున్నకు నిత్యంగా నిండుసున్న వస్తుంది. అరంట్లు, తేంట్లు.

వ్యాకరణా న్ననుసరించి నిండుసున్నకు అరసున్న రావటం లేదు.

**లోపం :** బిందువుకు పైనున్న పరుషసరళాలు స్థిరాలుగా మారే టపుడు ఆబిందువు లోపిస్తుంది. తీఁగ – తీవ, నాఁడెము – నాణెము.

సున్నకు పూర్వంలో ఉన్నఅచ్చు లోపించేటపుడు దానితోపాటు సున్న కూడా లోపిస్తుంది. పొలఁతి = పొల్తి.

కొన్నియెడల పయిహల్లుమీది అచ్చు లోపించి సంయుక్త మయ్యేటపుడు ముందరిఅరసున్న లోపించడం ఉన్నది. మాఁడుచు – మాడ్చు.

## 2. దంత్యతాలవ్యచజలను గూర్చి పేర్కొనండి.

అచ్చతెనుగుభాషలో చజలు దంత్యాలూ, తాలవ్యాలూ అని రెండు విధాలు.

**తాలవ్యాలు :** తాలువుసహాయంతో ఉచ్చరింపబడేవి తాలవ్యాలు. 'ఇఈఎఏలం గూడినచజలు తాలవ్యంబులు' అచ్చతెనుగుమాటలలో చజలు ఇ, ఈ, ఎ, ఏ అనే అచ్చులతో గూడి ఉన్నపుడు తాలవ్యా లవుతాయి. ఉదా. చిలుక – జేజె.

**దంత్యాలు** : దంతాలసహాయంతో పలుకబడేచజలు దంత్యాలు. 'అఆఉఊఒఓఔలం గూడినచజలు దంత్యంబులు.' అచ్చతెనుగుమాటలలో చకారజకారాలు అ, ఆ, ఉ, ఊ, ఒ, ఓ, ఔ అనేఅచ్చులతో కూడితే దంత్యా లవుతాయి. చందమామ. జౌకు. మొ.

అచ్చతెనుగులో చజలు ఐకారంతో కలిసి ఉండవు. చైదము, చైవు అనేరీతివి అలాక్షణికాలు. కాబట్టి చై, జై అనేవి అచ్చతెనుఁగులో దంత్యాలా తాలవ్యాలా అనేసందేహానికి తావు లేదు,

స్వరసంధి జరగకపూర్వం చజలు దంత్యతాలవ్యాలలో ఏవి అవుతాయో సంధి జరిగినతరువాత ఏఅచ్చుతో గూడినా, పూర్వావస్థలోని దంత్యతాలవ్యతలే ఉంటాయి. త్రాచు + ఏది, త్రా చేది. ఇట సంధికి పూర్వం ఉత్వంతో గూడటంచేత దంత్య మైనచకారం సంధి యైనతరువాత ఏకారంతో కూడిఉన్నా తాలవ్యం గాకుండా పూర్వస్థితి ననుసరించి దంత్యమే అవుతుంది. ఇలాగే పచ్చి+ఆకు – పచ్చాకు – అన్నపుడు తాలవ్యం. దంత్యంగా పలికితే పచ్చనిఆకు (పచ్చ+ఆకు) అని అర్థం. ఇలాగే, అచ్చు + ఐనది – అ చ్చైనది మొ.

**ఉభయాలు?** : 'ఒకానొకచో జకారం బుభయంబు నగు' అనేసూత్రంచేత ప్రౌఢవ్యాకర్త జకార ముభయం అవుతుం దని చెప్పాడు.. తీయఁగఁ బంచదార వెనుదీయఁగ' ఇత్యాదులలో చకారానికి కూడా ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నస్థితి ఉన్నది. ఇలా చజలు కొన్నియెడల ఉభయము లవుతా యని చెప్పవలసిఉన్నది. ప్రౌఢవ్యాకర్త 'ఒకఅర్థమున దంత్యమును వేరొకఅర్థమున తాలవ్యమును అగు' నన్నాడు. కాగా ఇవి ఒకేసారి దంత్యతాలవ్యం(ఉభయం)గా ఉచ్చరింపబడడం లేదు. అటువంటిఉచ్చారణం అసంభవం కూడా. కాబట్టి చజలు దంత్యాలో కాక తాలవ్యాలో ఏదో ఒకటే అవుతాయి తప్ప ఉభయం కావటం లే దని గుర్తించాలి.

## సాంస్కృతికచజలు

చజలవిషయంలో దంత్యం, తాలవ్యం అనేభేదం అచ్చతెనుగులోనే. సంస్కృతంలో చజలు ఏఅచ్చుతో కూడి ఉన్నా తాలవ్యాలు మాత్రమే అవుతాయి. కాబట్టి దాని ననుసరించి తెనుగులోని సంస్కృతసమాలలో కూడా చజలు ఏఅచ్చుతో గూడినా తాలవ్యాలు మాత్రమే అవుతాయి. చంద్రుఁడు. జైత్రయాత్ర మొ.

'సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దములయుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును' అనేసూత్రంచేత సంస్కృతసమాలలోను చజలు దంత్యాలు కావటం కొన్నిసందర్భాలలో ఉన్నది. రోచులు – వాజులు మొ.

**రాజు :** 'మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి' అని సూరి ఉత్వంతో గూడినపుడు సంస్కృతసమ మైన 'రాజు' అనేశబ్దంలోనిజకారం దంత్యమె అవుతుం దని పేర్కొన్నాడు. మహారాజు, ఖగరాజు మొ. ఇలా చెప్పటంచేత పాండురాజా, చంద్రా! రాజవా? ఇత్యాదులలో 'రాజ'శబ్దంలోనిజకారం తాలవ్యమె అవుతుం దని గ్రహించాలి.

'రాజు వైకృతం బని కొంద ఱందురు' అనేసూత్రంచేత ప్రౌఢవ్యాకర్త దంత్య మైన జకారం గల 'రాజు' అచ్చతెలుఁగుపదం కావటం కొందఱిమతంగా చెప్పాడు. అయినా సంస్కృతసమ మైనరాజుశబ్దంలో దంత్యత అంగీకరింపవలసే ఉన్న దని 'మహారాజు' మొద లైనస్థలాలు నిరూపిస్తున్నాయి.

ఇంకా అచ్చు (స్వరం) మొద లైనకొన్ని తత్సమాలలో దంత్యత వినిపిస్తుంది.

## దంత్యతాలవ్యాల సవర్ణత

'తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్' అనేసూత్రంచేత సంస్కృతంలో తాలువు మొద లయినస్థానాలూ, స్పృష్టం మొద లైనప్రయత్నాలూ సమానంగా ఉన్నవర్ణాలు సవర్ణా లని చెప్పబడింది. తెనుగులోనిరెండువిధా లయినచజలూ, స్పృష్టప్రయత్నం సమానంగా గల్గినవే అయినా తాలవ్యచజలకు తాలువూ, దంత్యచజలకు దంతాలూ స్థానం కావటంచేత అక్కడ భేదం ఉంది. అందుకే సూరి ప్రత్యేకంగా 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అని వీటికి సవర్ణతను సూత్రించాడు.

## సావర్ణ్యప్రయోజనం

దంత్యతాలవ్యచజలసవర్ణతకు ప్రయోజనాన్ని సూరి వివరించాడు. 'తాలవ్యచకారంబు దంత్యచకారంబునకు, తాలవ్యజకారంబు దంత్యజకారంబునకును గ్రాహకములు' అంటే ఆయాస్థలాలలో తాలవ్యచజలచేత దంత్యచజలు కూడా గ్రహింపబడి తాలవ్యచజలకు విధించిన ఆయాకార్యాలు దంత్యచజలకు కూడా రావటం ఈసావర్ణ్యానికి ప్రయోజనం.

'కచటతపలు పరుషంబులు' అనేసూత్రంలోని తాలవ్యచకారంచేత దంత్యచకారం గ్రహింపబడుతుంది. కాబట్టి ఈసూత్రంచేత తాలవ్యచకారానికి విధింపబడినపరుషం అనేసంజ్ఞ దంత్యచకారానికి కూడా సిద్ధించి అదీ పరుషమే అవుతుంది.

'గజడదబలు సరళంబులు' అనేసూత్రంలోనితాలవ్యజకారంచేత దంత్యజకారం కూడా గ్రహింపబడుతుంది. కాబట్టి దీనిచేత తాలవ్యజకారానికి విధింపబడినసరళం అనేసంజ్ఞ దంత్యజకారానికి కూడా సిద్ధిస్తుంది.

ఇలాగే 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రం చేత యథాక్రమంగా తాలవ్యచకారానికి విధింపబడిన సకారాదేశం దంత్యచకారానికి కూడా వస్తుంది. ఇతడు + చిన్న - ఇతఁడు సిన్న. అపుడు + చనియె - అపుడు సనియె మొ.

ఇటువంటిప్రయోజనాలకోసం దంత్యతాలవ్యచజలకు తెలుగులో సావర్ణ్యం విధింపబడింది.

### 3. ద్రుతాన్ని గూర్చి వివరించండి.

ఆంధ్రవాఙ్మయంలో ద్రుతానికి ఒకప్రత్యేకస్థానం ఏర్పడింది. ద్రుతం ఏది అనేవిషయంలో వివాదాలు చాలా ఉన్నాయి.

**ద్రుతసంజ్ఞ:** 'ద్రుత మనఁగా నొల్లనియెడ మఱిగిపోవునది' అని ప్రౌఢవ్యాకర్త ద్రుతసంజ్ఞను వివరించాడు. అనవసరం అనుకున్నపుడు లోపించిపోయేది కాబట్టి అటువంటిది ద్రుతం అని అభిప్రాయం. వచ్చెను-వచ్చె. దీనిని రూఢసంజ్ఞగా గుర్తింపదగును.

**నకారం :** 'ద్రుతాఖ్యో నః' అనేఆంధ్రశబ్దచింతామణిలక్షణాన్ని అనుసరించి చిన్నయసూరి కూడా 'నకారంబు ద్రుతంబు' అని పేర్కొన్నాడు. నకారం అంటే

పొల్లునకారం (న్). 'ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు' అనేసూత్రంవద్ద ద్రుతప్రకృతులచివరి ద్రుతాన్ని పొల్లునకారంగానే చిన్నయ ప్రదర్శించాడు.

**సాధారణం కాదు :** సాధారణంగా పొల్లునకారం అన్నిచోట్ల ద్రుతం అయితే నకారం చివర గలిగినపదాలు అన్నీ ద్రుతప్రకృతికాలు అవుతాయి. కాని సూరి ద్రుతప్రకృతు లేవో ప్రత్యేకంగా వివరించాడు. కాబట్టి సూరి పేర్కొన్నద్రుత ప్రకృతులపట్టికలో చేరనిపదాలు ద్రుతప్రకృతులు కావు. అంటే అటువంటిశబ్దాలలో చివర నకారం ఉన్నా, అది ద్రుతం కాదు అనాలి. నకారం అన్నిచోట్ల ద్రుతమే, కాని నకారాంతాలు అన్నీ ద్రుతప్రకృతికాలు కావు అని చెప్పడం కుదరదు గదా.

సూరి చూపినద్రుతప్రకృతికాలలో 1. ద్వితీయ, తాను, నేను మొద లైనవాటిలో ద్రుతం ప్రత్యయం. 2. తృతీయాదులలో నకారం ఆగమం. 3. అయ్యున్ అనేచోట ఉన్ననకారం అవ్యయం. 4. వలెన్ మొద లైనవాటిలో ద్రుతం ప్రకృతిగతం.

కాబట్టి 1.ప్రత్యయగతం 2. ఆగమం, 3. అవ్యయం 4. వలెప్రభృతులలో శబ్దగతమూ అయిననకారం మాత్రమే ద్రుతం.

**నువర్ణం :** సూరిమతంలో ద్రుతం నువర్ణం అనటానికి కొన్ని ఆధారాలు కనిపిస్తున్నాయి.

1. ద్రుతప్రకృతికసంజ్ఞను చెప్పినచోట పొల్లనకారాన్ని చూపినసూరి ద్రుతకార్యాలను ప్రదర్శించేసందర్భంలో ద్రుతాన్ని నువర్ణంగా చూపించాడు. పూచెను కలువలు – పూచెను గలువలు మొ.

2. ద్రుతానికి స్వత్వాన్ని వివరించేటపుడు 'స్వత్వ మనఁగా ద్రుతమునకు ప్రకృతిభావము' అని చెప్పి ద్రుతస్వత్వస్థితిని పూచెను గలువలు, వచ్చెను గోవు లనేవిధంగా నువర్ణాన్నే చూపాడు. దీనినిబట్టి ద్రుతంయొక్క సహజరూపం ను అనేతీరుగా ఉన్నట్లు గ్రహించాలి.

3. 'మీఁదిహల్లుతో గూడికొనుట' అనేసంశ్లేషను ద్రుతానికి విశేషకార్యంగా విధించటాన్ని బట్టి ద్రుతం ను అని గ్రహించకతప్పదు. పొల్లే అయితే సంశ్లేషవిధానం వ్యర్థం. ద్రుతంలోని స్వరం లోపించటమే సంశ్లేషవిధానానికి ప్రధానప్రయోజనం. పొల్లు పొల్లుగా ఉండటాన్ని విశేషంగా చెప్పవలసినఅవసరం లేదు గదా.

4. ఇలాగే అవసానంలో ద్రుతస్వరానికి లోపమూ, ద్రుతంబుమీద నకారంబు

గానంబడియెడి, మొద లైనవిధానాలు ద్రుతం కేవలం పొల్లు నకారం కా దని తెలుపుతుంది.

5. ద్రుతాన్ని విధించినచోట్ల సూరి దాదాపు అన్నిచోట్ల 'ను'వర్ణాన్నే చూపించటం బల మైనప్రమాణం.'లూట్టు డుఙ్లున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబు లగు' అనేసూత్రంలో ద్రుతాన్ని విధిస్తూ 'కలిగెదును, కలుగుతను' అని ద్రుతాన్ని 'ను' వర్ణంగా చూపించాడు. చూపాడు. ఇటువంటిస్థలాలు ద్రుతం ను వర్ణం అనేఅంశాన్ని నిశ్చయిస్తున్నది.

**అసాధారణం:**

ఇటువంటిఆధారాలనుబట్టి సాధారణ మైననకారం ద్రుతం కాదు. కొన్ని ప్రత్యేక లక్షణాలు కలిగినదే ద్రుతం. అని సూరిమతం తెలియవచ్చు.

దీనిని గుర్తించినప్రౌఢవ్యాకర్త 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని సూత్రించి 'ప్రత్యయాగమావ్యయాత్మక మై ఉత్వవిశిష్టం బయిననకారంబు ద్రుతంబు' అని వివరించాడు. ఇది సూరి తనసూత్రాంధ్రవ్యాకరణంలో చెప్పిన– 'విభక్త్యాగమచార్థో ను ర్ద్రుతః' అనేలక్షణానికి అనువాదమే. సూరి బాలవ్యాకరణంలో ఇంకా అధికంగా 'వలెను' మొద లైనస్థలాలలో శబ్దగత మైననువర్ణం కూడా ద్రుతం కావటం నిరూపించాడు. అవ్యయాత్మకం అనేదానితో ఇది కూడా సంగ్రహింపబడుతుం దని ప్రౌఢవ్యాకర్త భావించిఉండవచ్చు.

ఇంకా బాలవ్యాకరణం కన్+దోయి=కందోయి, కన్దోయి అని ఉదాహరించిన స్థలాలను బట్టి 'కన్' మొద లైనచోట్ల శబ్దగతనకారపుపొల్లు ద్రుతం అని సూచించినట్లు భావించాలి.

ద్రుత మైనయీనువర్ణం ఆయాస్థితులలో ఇత్వాన్ని పొంది 'ని' అని అయినా, 'ఏకదేశవికృత మనన్యవత్' అనేన్యాయాన్ని అనుసరించి ద్రుతమే అవుతుంది. వనమును, రాముని, రామున్.

ను,ని,న్ అనేఈమూడింటిలో నకారం స్థిరంగా (మారకుండా) ఉన్నది. కాబట్టే చింతామణి నువర్ణాన్ని ద్రుతంగా చెప్పకుండా, 'ద్రుతాఖ్యో నః' అని 'నకారంబు ద్రుతంబు'గా చెప్పినట్లు ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు.నువర్ణాన్నే ద్రుతంగా చెప్పినా, ఈస్థలాల్లో బాధ లేదు.

కాగా బాలవ్యాకరణాన్ని అనుసరించి –

1.ప్రత్యయం : తాను, నేను, చదువును. 2. ఆగమం : నాచేతను, భక్తుడను

3.అవ్యయం : అయ్యును, రాముడును 4. శబ్దగతం : వలెను మొద లైనఅవ్యయాలలో శబ్దావయవంగా ఉన్నదీ, అయిన'ను'వర్ణం ద్రుతం.

అదియును న్గాక, కన్దోయి మొద లైనకొన్నిస్థలాలలో ద్రుత మైననువర్ణంనుండి ఏర్పడినది కాక, సహజంగా పొ ల్లయిననకారం ద్రుతం కావటం విశేషంగా గ్రహింపవలసిఉంది.

## 4. ద్రుతప్రకృతికాలను గూర్చి వివరించండి.

తెలుగుభాషలోనిపదాలు అన్నీ ద్రుతాన్నిబట్టి కళలు ద్రుతప్రకృతికాలు అని రెండువిధాలు అవుతున్నాయి.

**ద్రుతం :** 'నకారంబు ద్రుతంబు'. ప్రౌఢవ్యాకరణం 'నకారం బసాధారణంబు ద్రుతంబు' అని పేర్కొన్నది. ప్రత్యయం గానీ, ఆగమం గానీ, అవ్యయం గానీ అయి ఉత్వంతో కూడిఉన్ననకారం అంటే 'ను'వర్ణం ద్రుతం. వలెను మొద లైనఅవ్యయాలలో చివరి ను వర్ణం కూడ ద్రుతమె. ద్రుత మయినఈనువర్ణం ఇకారాదులపై ఉండి ఇత్వాన్ని పొందినా, స్వరం లోపించి పొల్లుగా ఉన్నా ద్రుతమె అవుతుంది. ఇలా ను–ని–న్ అనేవాటిలో స్థిరంగా ఉండేనకారాన్ని ఉద్దేశించే చింతామణి 'ద్రుతాఖ్యో నః' అని పేర్కొన్నట్లు ప్రౌఢవ్యాకరణం వివరించింది. సూరి కూడా 'నకారంబు ద్రుతంబు' అన్నాడు చింతామణిలాగానే.

### ద్రుతప్రకృతికాలు

'ద్రుతాంతము లైనపదములు ద్రుతప్రకృతికములు' ద్రుతం చివర గలిగినపదానికి ద్రుతప్రకృతికం అని సంజ్ఞ. ఇది ద్రుతప్రకృతి అని కూడా వ్యవహరింపబడుతుంది. ద్రుతప్రకృతికాలను చిన్నయసూరి ఇలా వివరించాడు.

**1. సుబంతాలు** :

**1. ప్రథమాకయిపట్టియొక్కేతరము లయినవిభక్తులు :** నామవిభక్త్యంతా (సుబంతా)లలో ప్రథమావిభక్తి, కయి, పట్టి, యొక్క అనేవి తప్ప మిగిలిన (ఏక, బహువచన) విభక్తి చివర గలిగినవి ద్రుతప్రకృతికాలు.

ద్వితీయ – నన్నును – రాముని; తృతీయ – నాచేతను, నాతోడను;

చతుర్థి – నాకొఱకును; పంచమి – నావలనను, నాకంటెను;

షష్ఠి – నాకును, మాలోపలను; సప్తమి – మాయందును, ఘటముననను మొ

**2. నేనుతాను పదంబులు :** ప్రథమాంతములలో నేను, తాను అనేరెండుశబ్దాలు ద్రుతప్రకృతు లవుతాయి.

**2. తిఙంతాలు :**

**3. ఉత్తమపురుషైకవచనములు :** క్రియాపదా(తిఙంతా)లలో వర్తమానం మొదలైనఅన్ని అర్థాలలోను ఉత్తమపురుషఏకవచనాంతా లైనశబ్దాలు ద్రుతప్రకృతులు. వచ్చుచున్నాను – వత్తును మొ.

**4. భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనంబులు :** క్రియాపదాలలో ఇంకా 'భూతార్థ(లిడంత)కాలూ, తద్ధర్మాద్యర్థ(లాండత)కాలూ అయినప్రథమపురుష ఏకవచనాంతాలు ద్రుతప్రకృతులు. భూత – వచ్చెను. తద్ధర్మాది – వచ్చును. మొ.

**5. ఆశీరాద్యర్థంబు లయిన'ఎడు,త'వర్ణకంబులు :** ఆశీస్సు మొద లైనఅర్థాలలో (లూడంతములు) వచ్చే ఎడు, త అనేప్రత్యయా లంతమందు గలిగినక్రియాపదాలన్నీ – ద్రుతప్రకృతులు. ప్రసన్నులయ్యేడును, కావుతను మొ.

**3. అవ్యయాలు**

**6. శతృతుమానంతర్యచేదాద్యర్థకంబులు :**

1. శతృప్రత్యయార్థక మైన 'చు' ప్రత్యయం చివరలో ఉన్నవి,– చేయుచును,

2. 'తుమున్ ప్రత్యయార్థక మైన 'ను' ప్రత్యయం చివర ఉన్నవీ – చేయను (చేయగా). ఇక్కడ భావలక్షణం కూడా గ్రహించాలి.

3. ఆనంతర్యార్థక మైన దు ప్రత్యయం చివర ఉన్నవీ,– చేయుడున్,

4. చేత్, వృత్తం బగుభావలక్షణం అనేఅర్థాలను తెలియజేసే 'న' ప్రత్యయం చివర కలవీ. చేసినన్ – ద్రుతప్రకృతులు.

**7. వలెప్రభృతులు :** వలె మొద లైనఅవ్యయాలు ద్రుతప్రకృతికాలు. వలెను, పోలెను మొ. సముచ్చయం మొద లైన అర్థవిశేషాల నిచ్చే 'ను' అనేఅవ్యయం ద్రుతం. కాబట్టి అది చివర గలిగినశబ్దాలు ద్రుతప్రకృతులు. సీతయును, రాముడును మొ.

## 5. కళలను గూర్చి పేర్కొనండి.

'ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు'.

ద్రుతప్రకృతులలో చేరనిపదం కళ అనేసంజ్ఞను పొందుతుంది. వీటికి చివర నకారం (ద్రుతం) ఉండదు. సూరి పేర్కొన్నద్రుతప్రకృతుల ననుసరించి కళలను ఇలా గుర్తింపవచ్చు.

**1. సుబంతాలు** :

**1. ప్రథమాకయిపట్టియొక్కవిభక్తులు:** 'నేను', తాను అనేరెండుపదాలు తప్ప మిగిలినప్రథమాంతాలు కళలు, కయి అనేచతుర్థి, పట్టి అనేపంచమి, యొక్క అనేషష్ఠి, విభక్తులు చివర కలిగినపదాలు కళలు. ఉదా. రాముఁడు, విష్ణువులు, గోడ, రామునికయి, జ్ఞానమునుబట్టి, హరియొక్క మొ.

**2. తిఙంతాలు** :

**2. ఉత్తమపురుషైకవచనేతరాలు:** భూతతద్ధర్మాద్యర్థక ప్రథమపురుషైకవచనాలూ, అన్ని అర్థాలలోనూ ఉత్తమపురుషైకవచనాలూ తప్ప మిగిలిన క్రియాపదా లన్నీ కళలు. ఉదా. వచ్చుచున్నాఁడు, వచ్చిరి వత్తురు, రావు, రాగలము. మొ.

**3. అవ్యయాలు** :

**3. క్త్వార్థకాదులు:** క్త్వాప్రత్యయార్థక మైన 'ఇ' ప్రత్యయం చివర గలవి, అలాగే వ్యతిరేకక్త్వార్థకా లైన కజీ ప్రత్యయాంతాలు అయినఅవ్యయాలు కళలు. ఉదా. తిని, కొట్టక, తిట్టక మొ.

'అకప్రత్యయాంతావ్యయంబు కళయ' అని ప్రౌఢవ్యాకర్త వ్యతిరేకక్త్వార్థం కళ అని ఈవిషయాన్నే మరోసారి చెప్పాడు.

'వలె ప్రభృతులు ద్రుతప్రకృతికములు' గాబట్టి వలెప్రభృతులలో చేరని అవ్యయాలు కళ లవుతాయి. ఎత్తిలి, ఒత్తిలి మొ.

ఇలా కళాద్రుతప్రకృతికాలను లాక్షణికులు విస్తరంగానె నిరూపించారు. ఇంకా ఇతర మైనవిశేషాలను ప్రయోగాలనుబట్టి గ్రహించాలి.

## 6. లఘువులూ అలఘువులూ ఐన యరలవలను గూర్చి పేర్కొనండి.

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబులు' అనేసూత్రంప్రకారం తెలుగులో 'య,ర,ల,వ' అనేనాలుగువర్ణాలను ఒక్కొక్కటి లఘు వనీ, అలఘు వనీ రెండు విధాలు.

## లఘువు - అలఘువు

'య స్యోచ్చారణే జిహ్వాగ్రోపాగ్రమధ్యమూలానాం శైథిల్యం జాయతే స లఘూచ్చారణః' ఏవర్ణాన్ని ఉచ్చరించేటపుడు నాలుక శిథిల మవుతుందో (సడలు - వదులుగా అవుతుందో) ఆవర్ణం లఘువు.

అటువంటి శైథిల్యం లేక సాధారణంగా ఉచ్చరింపబడితే ఆవర్ణం అలఘువు.

ఉచ్చారణంలోనియిట్టిభేదంచేతనె యరలవలు తెలుగులో రెండువిధాలయినాయి.

### యకారము

**లఘువు :** 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు" అనేసూత్రంచేత ఆగమంగా వచ్చినయకారం లఘువు.

హరి + అతఁడు - హరి యతఁడు మొ.

**అలఘువు :** సంధి లేనిచోట ఆగమ మయినది తప్ప ఇతర మైనయకారం ఎటువంటి దైనా అలఘువె.

హరియించు - (ఇయుడాగమంలోనియకారం)

పోయెను - (ఆదేశ మయినయకారం) మొ.

తీయన - (శబ్దంలో సహజంగా ఉన్నయకారం)

### రేఫము

**లఘువు :** సాధురేఫ (ర) లఘువు. పెరుగు - కరుగు మొ.

**అలఘువు :** శకటరేఫ (ఱ) అలఘువు. విఱుగు మెఱుగు మొ.

### లకారము

**లఘువు :** 'ల'కారం లఘువు. తల - నెల మొ.

**అలఘువు :** బహువచనం పర మైనపుడు డ,ర,ల,లకు ఆదేశంగా వచ్చినళకారం అలఘువు.

డ- త్రాడు + లు = త్రాళులు; ర- ఏరు + లు = ఏళులు,

ల - పాలు + లు = పాళులు - త్రాళ్లు మొ.

వర్ణమాలలో పరిగణింపబడినళకారం ఈఅలఘుళకారం కాదు. తళుకు, బెళుకు ఇత్యాదులలో ఉన్న ఆళకారం వేరొకటి.

**వకారము**

**లఘువు :** 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' మొద లైనలక్షణాలచేత పకారానికి ఆదేశంగా వచ్చినవకారం లఘువు. అతఁడు + పలికె – అతఁడు వలికె. ఊరువల్లెలు మొ.

**అలఘువు :**పకారానికి ఆదేశ మయినది తప్ప వే రయినవకార మే దయినా, అలఘువు.

చిగురు – చివురు – (గకారాని కాదేశ మైనవకారం).

ఆవు (శబ్దసహజ మైనవకారం) మొ.

## 7. ఆంధ్ర భాష – భేదాలను గూర్చి వివరించండి.

సంస్కృతంనుంచి, ప్రాకృతంనుంచి కొన్ని పదాలు తెలుగులోకి వచ్చి కలిశాయి. తెలుగుభాష సహజంగా కొంత ఉన్నది. ఇటువంటి మొత్తం తెలుగుభాషా పదాలను లాక్షణికులు ఇలా వర్గీకరించారు.

**1. తత్సమం :** 'సంస్కృతప్రాకృతతుల్యం బగుభాష తత్సమంబు'. సంస్కృతంతో గాని లేదా ప్రాకృతంతో గాని సమంగా ఉన్న తెలుగుశబ్దం తత్సమం. తెలుగువిభక్తులూ, విభక్తినిమిత్తకా లయిన ప్రకృతివికారాలు మాత్రమే గల్గిన సంస్కృతప్రాకృతశబ్దాలు తత్సమాలు అని స్థూలంగా చెప్పవచ్చు.

1. సంస్కృతంతో సమంగా ఉన్నది సంస్కృతసమం.

   విద్య – (విద్యా). ఆకాశము (ఆకాశః)

2. ప్రాకృతంతో సమంగా ఉన్నది ప్రాకృతసమం.

   సిరి. (సిరీ–ప్రాకృతం) (శ్రీః–సంస్కృతం)

సంస్కృతసమ, ప్రాకృతసమాలు తత్సమాలు. తత్సమాన్ని 'తత్స' అనీ పూర్వులు వ్యవహరించారు. సమ, తత్సమాది సంజ్ఞలు కేవలం సంస్కృతసమం అనేఅర్థంలో వ్యవహరించడం కూడా కనిపిస్తుంది.

**2. తద్భవం :** 'సంస్కృతప్రాకృతభవం బగుభాష తద్భవంబు' సంస్కృతంనుంచి, ప్రాకృతంనుంచి పుట్టినభాషకు తద్భవం అని సంజ్ఞ. దీనినే పూర్వులు 'తజ్జ' అనీ వ్యవహరించారు.

తెలుగువిభక్తులు, విభక్తినిమిత్తకాలు అయిన మార్పులకంటె ముందుగా సంస్కృతప్రాకృత ప్రకృతులు మార్పులు చెందితే అవి తద్భవా లవుతాయని స్థూలంగా

ఊహింపవచ్చు.

1. సంస్కృతంనుంచి పుట్టినభాష 'సంస్కృతభవం'. ఆకసము (ఆకాశః)

2. ప్రాకృతంనుంచి పుట్టినభాష 'ప్రాకృతభవం'.

(అచ్ఛేరం–ప్రాకృతం) (ఆశ్చర్యమ్ – సంస్కృతం,)

సంస్కృతభవ, ప్రాకృతభవాలు తద్భవాలు. ప్రాకృతసమభవాలను గొందఱు సంస్కృత భవాలుగా చెప్పటం కనపడుతుంది.

**3. దేశ్యం :** 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు'. త్రిలింగదేశంలోని జనులయొక్క వ్యవహారం నుంచి ఏర్పడినభాషకు దేశ్య మని సంజ్ఞ.

ఈశబ్దాలపుట్టుకకు వాటినిగూర్చి తెలియడానికి దేశజనవ్యవహార మొక్కటే ఆధారం. నే డితరద్రావిడభాషలనుంచి కూడా తెలుసుకొనే అవకాశం ఏర్పడింది. ఉదా. ఊరు – పేరు. మొ.

**4. గ్రామ్యం** : 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు'. వ్యాకరణానికి విరుద్ధంగా ఉన్న భాషకు గ్రామ్య మని పేరు. ఉదా. రాముణ్ణి – తెస్తాడు.

గ్రామ్యం లక్షణవిరుద్ధం. కాబట్టి గ్రామ్యాన్ని కావ్యాలలో ప్రయోగింపరాదు.

'గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు', అనేప్రౌఢవ్యాకరణసూత్రం గ్రామ్యం కూడ పాత్రోచితంగా కావ్యాలలో ప్రయోగించే అవకాశం కల్పిస్తున్నది. కాని అటువంటిచోట్ల కూడా గ్రామ్యం ప్రయోగింపబడటం పూర్వకావ్యాలలో వెదకవలసిఉన్నది.

**గ్రాహ్య(అనింద్య)గ్రామ్యాలు** : 'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు'. నన్నయ మొదలైన మహాకవులకావ్యాలలో కనబడినశబ్దాలు ఎటువంటి వైనా, అంటే లక్షణవిరుద్ధా లై, గ్రామ్యా లయినా అవి గ్రహింపదగినవే. అటువంటివి కావ్యాలలో ప్రయోగించడానికి అర్హాలే.

కఱకంఠుడు – కపిలకన్నులు మొ. గ్రామ్యా లయినా గ్రాహ్యాలు కావడంచేత ఇటువంటివాటిని 'గ్రాహ్యగ్రామ్యాలు' అనవచ్చు. కొందరు వీటిని 'అనింద్యగ్రామ్యాలు' అని వ్యవహరిస్తారు.

ఇలా ఆంధ్రభాష 1. తత్సమం, (సంస్కృతసమం, ప్రాకృతసమం) 2. తద్భవం (సంస్కృతభవం, ప్రాకృతభవం) 3. దేశ్యం 4. గ్రామ్యం అని విభాగింపబడింది. ఇందులో గ్రామ్యం కంటె వే ఱయిన తత్సమ, తద్భవ, దేశ్య భాష కావ్యాలలో

ప్రయోగించుకోవచ్చు.

**1. సంస్కృతసమం :** ఈతెలుగుభాష మరొకపద్ధతిలో 1. సంస్కృతసమం 2. ఆచ్ఛికం అని రెండువిధాలుగా విభజింపబడింది. సంస్కృతంతో సమం సంస్కృతసమం. ఉదా. రాముఁడు, విద్య.

**2. అచ్ఛ – ఆచ్ఛికం** : 'సంస్కృతసమేతరం బయినయీభాష యచ్ఛ యనంబడు'. సంస్కృతసమంకంటె వే ఱయినది, అంటే 1. ప్రాకృతసమం 2. తద్భవం 3. దేశ్యం అనే విధాలయినది. దీనికి 'అచ్ఛ' అని పేరు. ఇదే ఆచ్ఛికం. అచ్ఛ, అయిన ఆంధ్రం అచ్ఛాంధ్రం. అంటే అచ్చతెనుగు. సంస్కృతసమం కలవని తెలుగుభాష. ప్రాకృతసమ, తద్భవాలు కలిసినా, ఇది అచ్చతెనుఁగె.

ఉదా. సిరి – ఆకసము – అచ్చెరువు – ఊరు.

ఇలా భాషాలక్షణాలనుబట్టి ప్రాకృతంలాగా తెలుగుభాషకూడా తత్సమాదులుగా విభజింపబడింది.

# సంధిపరిచ్ఛేదం

## 1. బాలప్రౌఢవ్యాకరణాలు పేర్కొన్నఅచ్సంధులను గూర్చి తెలపండి.

**సంధి**: "పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు"– మొదటిశబ్దం చివరిఅచ్చు, దానికి పరంగా ఉన్న రెండవశబ్దం మొదటిఅచ్చు అనే రెండింటి స్థానంలోను రెండవశబ్దం మొదటిఅచ్చు ఒక్కటి మాత్రమే ఆదేశంగా రావటం తెలుగులో సంధి అనబడుతుంది. ఇది అచ్సంధిలక్షణంగా చెప్పవచ్చు.

**1. ఉత్త్వసంధి :** 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు'. హ్రస్వ మైన ఉకారానికి సంధి నిత్యంగా వస్తుంది. రాముఁడు + అతఁడు = రాముఁడతడు.

ద్రుతప్రకృతికాలలో 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్న యుకారమునకు సంధి వైకల్పికముగా నగును'. నన్నున్ + అడిగె – నన్నడిగె. వీటికి సంధి లేనిపక్షంలో ద్రుతం మీదిఅచ్చుతో కలుస్తుంది. నన్ను నడిగె. కాగా ఉత్త్వానికీ, ద్రుతప్రకృతికాలకూ పైన యడాగమం ఉండదు.

**2. ఇత్త్వసంధి :** 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు' ఏమి మొద లైనశబ్దాలలోని 'ఇ' కారానికి సంధి వైకల్పికంగా వస్తుంది. ఏమి+అంటివి = ఏ మంటివి. సంధి రానిపక్షంలో 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అని యకారం చేరి, ఏమి యంటివి.

'క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' (ప్రథమ, ఉత్తమ పురుషబహువచన) క్రియలచివరిఇకారానికి సంధి వికల్పంగా వస్తుంది. వచ్చిరి + అప్పుడు = వచ్చి రప్పుడు, వచ్చిరి యప్పుడు. వచ్చితిమి + ఇపుడు = వచ్చితి మిపుడు, వచ్చితిమి యిపుడు.

ప్రథమపురుష ఏకవచనాలూ, ఉత్తమపురుష ఏకవచనాలూ చివర ఇత్తు ఉన్నా, ద్రుతప్రకృతికాలు కావటంచేత 'ఇఁకాదులకు దప్ప' అనేసూత్రంచేత సంధి రాదు. చూచెడిన్+ అతఁడు = చూచెడి నతఁడు. కంటిన్ + అతని = కంటి నతని మొ.

'మధ్యమపురుషక్రియలయం దిత్తునకు సంధి యగును' మధ్యమపురుషక్రియల లోనిఇకారానికి సంధి నిత్యంగా వస్తుంది. ఏలితివి + అపుడు = ఏలితి వపుడు.

'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అని సూరి క్త్వార్థక మైనఇకారానికి సంధి లే దన్నాడు. ఏఁగి + ఏఁగి = ఏఁగి యేఁగి. ఈఅభిప్రాయాన్ని సవరిస్తూ ప్రౌఢవ్యాకర్త 'ఇప్రత్యయాంతావ్యయంబునకు సంధియుఁ జూపట్టెడి' అని సంధి

అరుదుగా ఉండటం పేర్కొన్నాడు. ఎటింగి + ఎటింగి = ఎటిం గెటింగి.

**3. అత్త్వసంధి** : 'అత్తునకు సంధి బహుళముగా నగు' హ్రస్వ మైనఅకారానికి సంధి బహుళంగా వస్తుంది. మేన + అల్లుడు–మేనల్లుడు. సంధి రానిపక్షంలో యడాగమం వచ్చి – మేనయల్లుడు.

పయిసూత్రంలో బహుళగ్రహణంచేత స్త్రీవాచక,తత్సమ, సంబోధనాంతాదులకు సంధి లేదు. అమ్మ యిచ్చెను, చదువుమ యనెను. వెలయాలు. వీటిలో స్త్రీవాచకతత్సమాలలోని అకారానికి అధునికకృతులలో సంధి కనిపిస్తున్నది. ఉదా. నెలఁ తిచ్చెను, గంగనుకాసె.

'ఉన్న, కల, న' వర్ణకాలపై తచ్ఛబ్దవకారం లోపించినసందర్భంలో ఈసంధి నిత్యంగా వస్తుంది. వచ్చినాడు. (వచ్చినవాడు).

**4. ఆమ్రేడితసంధి :** 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు'. ఆమ్రేడితం (ద్విరుక్తయొక్క పరరూపము) పర మైనపుడు అన్ని అచ్చులకూ సంధి తఱుచుగా వస్తుంది. ఆహా + ఆహా – ఆహాహా. తఱుచుగా అనడంచేత ఇంచుక యించుక, ఏమి యేమి అనేవిధంగా కొన్నిచోట్ల  సంధి రాకపోవటం కూడా ఉన్న దని గుర్తించవచ్చు.

**5. ఆర్యాద్యర్థకసంధి :** 'శ్రేష్ఠతావాచకంబు లగునార్యాంబాద్యర్థకశబ్దంబులు పరంబు లగుచో నన్ని యచ్చులకు సంధి నిత్యము' అని ప్రౌఢవ్యాకరణం. బిరుదాదిసమాసాలలో అయ్య అమ్మ మొద లైనశబ్దాలు పర మైనపుడు అచ్చు లన్నిటికీ సంధి నిత్యంగా వస్తుంది. వదినె + అమ్మ – వదినమ్మ , సీత+ అమ్మ – సీతమ్మ మొ.

కందాళయప్ప – అమ్మాజియమ్మ మొద లైనరీతిగా అరుదుగా ఈసంధి జరగనితావులు గూడ కవిప్రయోగాల్లో కనబడుతున్నాయి.

**6. అపదసంధి :** "అంద్వవగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు" అందు, అవ అనేవి రెండు తప్ప మిగిలిన పదం గానిశబ్దం పర మైనపుడు అన్ని అచ్చులకు నిత్యంగా సంధి వస్తుంది. వీసె+ఎఁ డు–వీసెఁడు.

అందు–అవ అనేఅపదాలు పర మయినపుడు (పదములకు లాగా) సామాన్య శాస్త్రాల కనుగుణంగా సంధి వస్తుంది. వనమందు. ఎనిమిదవ, ఎనిమిదియవ మొ.

**7. ద్రుతపూర్వస్వరసంధి :** 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికంబులకు సంధి లేదు' ఇఁక, ఇఁగ, ఎట్టకు, ఏలకు అనేవి ఇఁకాదులు. ఇవీ, ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణాలూ, ఏమ్యాదులలో చేరిన షష్ఠీవిభక్తి అయిన 'కి'వర్ణం అనేవి తప్ప మిగిలిన ఏద్రుతప్రకృతికంలోనూ ద్రుతానికి పూర్వంలో ఉన్నఅచ్చుకు సంధి రాదు. వచ్చున్ + అతడు – వచ్చు నతడు.

**8. ద్రుతద్విత్వం :** 'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి' అనే ప్రౌఢవ్యాకరణలక్షణంచేత అచ్చు పర మయినపుడు అరుదుగా ద్రుతానికి ద్విత్వం వస్తుంది.

సర్వమున్ + అతని – సర్వము న్నతని.

**9. ఋపరకసంధ్యభావం :** 'పదాద్యంబులు ఋ వర్ణంబులు రలతుల్యంబులు' పదముమొదటిఋకారం రేఫతోనూ, కారం లకారంతోనూ సమానం. కాబట్టి ఋ లు పర మైనపుడు సంధి రాదు. అలాగే యడాగమం కూడా రాదు. అతడు ఋషి, అది (లు)కారము.

ఈవిధులవలన ఆమ్రేడితం, అపదం, ఆర్యాద్యర్థకాలు తప్ప ఏది పర మైనా హ్రస్వా లయిన అ, ఇ, ఉ లకు తప్ప ఇతరస్వరాలకు సంధి లేదు. వదినె యున్నది, గ్లొ యుదయించె. 'ఉ' కారానికి తప్ప అ – ఇ – లకు కూడా సంధి సార్వత్రికం గాదు. ఇలాగే ఆమ్రేడితం ఆర్యాద్యర్థకం పర మైనపుడు కూడా సంధి లేకపోవటం అరుదుగా ఉన్నది.

మొత్తం మీద ఉత్తుకు మాత్రమె తెలుగులో సంధి నిత్యం. తెలుగులో సంధి జరగకపోవటమే అధికం.

## 2. బాలప్రౌఢవ్యాకరణాలు పేర్కొన్నఆగమసంధులను గూర్చి వివరించండి.

ఆగమంగా వచ్చే సంధికార్యం ఆగమసంధి అనవచ్చు.

**ఆగమం :** 'ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు'. అధికంగా వచ్చి చేరేవర్ణానికి ఆగమం అని సంజ్ఞ. సంధిలో కొన్నిచోట్ల ఉన్నవర్ణాలు అన్నీ అలాగే ఉండగా వేరొకవర్ణం అధికంగా వచ్చి చేరటం ఉన్నది. కఱకు + అమ్ము = కఱుకుటమ్ము మొ. ఇక్కడ టకారం ఆగమం. ఇటువంటివాటిని ఆగమసంధులుగా గ్రహింపవచ్చు.

**1. టుగాగమం :** 1. 'కర్మధారయంబులం దుత్తున కచ్చు పరం బగునపుడు టుగాగమం బగు'. కర్మధారయసమాసాలలో అచ్చు పరంగా ఉన్నపుడు పూర్వపదం

చివర ఉన్నఉత్త్వానికి పైన టకారం ఆగమ మవుతుంది. కఱకు + అమ్ము – కఱకుటమ్ము.

2. 'కర్మధారయంబునం బేర్వాదిశబ్దంబుల కచ్చు పరం బగునపుడు టుగాగమంబు విభాష నగు' పేరు మొదలైనవాటిపైన టకారాగమం వికల్పంగా వస్తుంది. చిగురు+ ఆకు = చిగురుటాకు. టుగాగమం రానపుడు ఉత్త్వసంధి వచ్చి చిగురాకు.

**2. రుగాగమం:** 1.'పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబు నందు రుగాగమం బగు' కర్మధారయసమాసంలో 'ఆలు' శబ్దం పరంగా ఉన్నపుడు పేద మొద లైనవాటికి చివర రేఫం ఆగమంగా వస్తుంది. ఉదా. పేద + ఆలు = పేదరాలు.

జవ్వని+ఆలు అన్నపుడు జవ్వనిశబ్దానికి 'జవ' అనేది ఆదేశంగా వస్తుంది. జవరాలు.

2. 'కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దము పరం బగునపు దత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు' తత్సమశబ్దాల చివరఅత్త్వానికి ఉత్వమూ, మీద రేఫమూ వస్తాయి. ధీర + ఆలు = ధీరురాలు.

**3. నుగాగమం :** 'షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' షష్ఠీతత్పురుషసమాసంలో అచ్చు పరంగా ఉన్నపుడు పూర్వపదంచివరి ఉత్వానికీ, ఋత్వానికీ పైన నకారం వచ్చి చేరుతుంది. రాజు(యొక్క) ఆజ్ఞ = రాజునాజ్ఞ, విధాతృ(యొక్క) ఆనతి = విధాతృనానతి.

ఇక్కడ ప్రౌఢవ్యాకర్త "కొన్నిచోట్ల షష్ఠీసమాసంబునం దుకారంబున కచ్చు పరం బగునపుడు నుగాగమంబునకు లోపంబు నగు" అని కొన్నిచోట్ల ఉత్వంమీద నుగాగమానికి లోపం చెప్పాడు. శిరసు(యొక్క) అందము – శిరసందము.

2. 'ఉదంత మగుతద్ధర్మార్థవిశేషణమున కచ్చు పర మగునపుడు నుగాగమం బగు' అచ్చు పరంగా ఉన్నపుడు, చేయు, చేసెడు అనేతీరుగా ఉదంతా లయిన ధాతుజవిశేషణాలకు పైన నకారం చేరుతుంది. చేయు+అతఁడు= చేయునతఁడు.

3. 'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' ఇలా ఆగమంగా వచ్చిననువర్ణం ద్రుతం కాబట్టి దానికి ద్రుతకార్యా లవుతాయి. చిగురు + కయిదువు – చిగురును + కయిదువు– చిగురుంగయిదువు మొ.

4. 'ఉదంతస్త్రీసమంబులకుం బుంపులకు నదంతగుణవాచకంబులకును దనంబు

పరం బగునపుడు నుగాగమం బగు' - 'తన' అనేతద్ధితప్రత్యయం పర మైనపుడు ఆగమ మయినఈనువర్ణం ద్రుతం కాబట్టి దీనికి ద్రుతకార్యా లవుతాయి. సొగసు + తనము - సొగసును + తనము = సొగసుందనము మొ.

5. 'లుప్తశేషంబులకుం బరుషములు పరము లగుపుడు నుగాగమం బగు' తొలిఅచ్చుమీఁదివర్ణాలు లోపింపగా మిగిలిన ప్రాతాదిశబ్దాలకు పరుషాలు పర మయినపుడు నుగాగమం వస్తుంది. ఈనువర్ణం ద్రుతం. కాబట్టి ద్రుతకార్యా లవుతాయి. ప్రా + కెంపు ప్రాఁగెంపు. క్రొ(త్త) శబ్దానికి కొన్నిచోట్ల నుగాగమం వస్తుంది. క్రొంబసిఁడి మొ.

6. ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'సమాసమందుఁ దత్సమంబు పరం బగునపుడు నుమాగమాదులు కానంబడియెడి' అని పేర్కొన్నాడు. ముందు + కోపము= ముంగోపము.

**4. అలిగాగమం :** 'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు.' సమాసంలో అందు, ఇందు, ఎందు అనేవాటికి అలి అనేది ఆగమంగా వస్తుంది. అందును + వారు - అందలివారు మొ.

**5. వుగాగమం:** 'ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు' అనుకరించేటపుడు క్రియాపదంకంటె వే రైన, ఉదంత మయినసంస్కృతశబ్దానికి చివర వకారం వచ్చి చేరుతుంది. ఇయం ధేను(ః) + అనె = ఇయం ధేను వనె.

**6. ముగాగమం :** ప్రౌఢవ్యాకర్త 'ధ్వన్యనుకరణశబ్దంబుల కనుధాతువు పరం బగుచో ముగాగమం బగు' అని చెప్పాడు. కనకన + అను - కనకనమ్ + అను - కనకనమను.

## 3. ఆమ్రేడితసంధులను గూర్చి పేర్కొనండి.

**ఆమ్రేడితం :** ద్విరుక్తంయొక్క పరరూపం ఆమ్రేడితం. ఆమ్రేడితం పర మయినపుడు సంధిలో చాలా మార్పులు గలుగుతున్నాయి.

**1. (పరరూప)సంధి :** 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' ఆమ్రేడితం మొదటిఅచ్చు పర మయినపుడు అన్ని అచ్చులకూ దాదాపు నిత్యంగానె సంధి వస్తుంది. ఔర + ఔర = ఔరౌర, ఆహా + ఆహా = ఆహాహా.

ఏమి + ఏమి మొద లైనకొన్నిచోట్ల సంధి వికల్పం. ఏ మేమి - ఏమి యేమి, ఇంచు కించుక - ఇంచుక యించుక.

**2. 'ట్ట' ఆదేశం :** 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలియచ్చు మీఁది వర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకారం బగు' భృశార్థంలో అయినద్విరుక్తిలో ఆమ్రేడితం పర మైనపుడు కడ మొద లైనవాటిలో మొదటిఅక్షరానికి పైనున్న వర్ణా లన్నింటిస్థానంలోను 'ట్ట' అనేది ఆదేశ మవుతుంది. కడ + కడ = కట్టకడ

**3. విభక్తిలోపం :** 'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగా నగు' ఇంటన్ + ఇంటన్ అన్నపుడు విభక్తి (అన్) లోపింపఁగా, ఇంట్ + ఇంటన్ = ఇంటింటన్ అవుతుంది. విభక్తి లోపింపనిపక్షంలో – ఇంట నింటన్.

**4. అంతిమాక్షరలోపం**: పయిసూత్రంలో బహుళగ్రహణంచేత ఇంచుక నాఁడు మొద లైనవాటిలో చివరిఅక్షరానికి లోపం రావటం కూడా ఉన్నది. ఇంచుక + ఇంచుక – ఇంచు + ఇంచుక. ఆమ్రేడితపరకస్వరసంధి జరిగి, ఇంచించుక. చివరిఅక్షరం లోపించకపోతే ఆమ్రేడితసంధి వికల్పంగా జరిగి, ఇంచు కించుక, ఇంచుక యించుక అని అవుతుంది.

**5. ముడుజ్లోపం :** 'ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమముడుజులకు లోపంబు విభాష నగు'. మధ్యమపురుషప్రత్యయా లైన ము,డుజ్ అనేవాటికి ఆమ్రేడితం పర మైనపుడు లోపం వికల్పంగా వస్తుంది. ఉండు(ము) + ఉండుము ఆమ్రేడితసంధి జరిగి ఉం డుండుము. లోపం రానిపక్షంలో సంధి జరిగి, ఉండు ముండుము. ఇలాగే కొట్టుకొట్టుఁడు మొ. ఇమ్మిమ్ము ఇత్యాదులలో ఈలోపం లేదు.

**6. దీర్ఘం :** పైసూత్రంచేత ముడుజులు లోపించినచోట 'ఆమ్రేడితంబు పరం బగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘం బగు' అని ప్రౌఢవ్యాకర్త కృతహ్రస్వానికి దీర్ఘం విధించాడు. (లెమ్ము + లెమ్ము) – లె + లెమ్ము – లేలెమ్ము. మొ.

**7. అందదుకుప్రభృతులు :** 'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అదుకు + అదుకు మొద లైనచోట్ల ఆమ్రేడితం పర మయినపుడు వర్ణవికారా లొక్కొక్కచోట ఒక్కొక్కవిధంగా ఉన్నాయి. వాటిని కవిప్రయోగాలనుండి గ్రహించాలి. అదుకు + అదుకు – అందదుకు, ఇంకులు – ఇంకులు – ఇట్టింకులు.

**8. గిగీలు :** 'నిందయం దామ్రేడితంబునాద్యక్షరములకు హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు' నిందార్థంలో ద్విరుక్తం అయినశబ్దంలో రెండవదాని మొదటిఅక్షరం హ్రస్వ మైతే దానికి 'గి' వర్ణ మాదేశ మవుతుంది. కుంభకర్ణుఁడు – గింభకర్ణుఁ

డు. దీర్ఘ మైతే 'గీ' ఆదేశ మవుతుంది. రావణుడు–గీవణుడు మొ. ఇది సంధికార్యం కాదు. ఆమ్రేడితస్థలంలో విశేషం.

## 4. గసడదవాదేశవిశేషాలను వివరించండి.

**గసడదవాదేశం:** 'గసడదవ' అనేవర్ణాలు ఆదేశంగా రావటం గసడదవాదేశం. ఇవి 'కచటతప' అనేపరుషాలస్థానంలో ఆదేశంగా వస్తాయి.

**1. ప్రథమమీద :** 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' ప్రథమాంతాలకు పైనున్న కచటతపలకు యథాక్రమంగా గసడదవలు వస్తాయి. వాఁడు + కొట్టె – వాఁడు గొట్టె. ఆదేశం రానిపక్షంలో వాఁడు కొట్టె. 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' కాబట్టి ఇక్కడ తాలవ్యచకారానికి విధింపబడిన సకారం దంత్య మైనచకారానికి కూడా వస్తుంది. అపుడు + చనియె – అపుడు సనియె.

**2. క్రియలమీద :** 'ఈకార్యము కళ లగుక్రియాపదములమీఁద సహితము గానంబడియెడి' పయిసూత్రంతో ప్రథమమీఁద చెప్పిన గసడదవాదేశం కళ లైనక్రియాపదాల మీద గూడ కనబడుతున్నది. రారు + కదా – రారు గదా, రారు కదా మొ.

**3. సాంస్కృతికాలకు లేదు :** 'తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు' అచ్చతెనుగుశబ్దాలకు మీద ఉన్నసంస్కృతసమశబ్దాదిపరుషాలకు గసడదవలు రావు. వాఁడు + కంసారి – వాఁడు కంసారి. మొ.

కాబట్టి 1.తెనుగులమీది తెనుగుపరుషాలకు, 2.సంస్కృతసమాలమీది తెనుగుపరుషాలకు, 3. సంస్కృతసమాలమీది సాంస్కృతికపరుషాలకూ గసడదవలు వస్తాయి. వాఁడు గొట్టె, రాముఁడు గొట్టె, రాముఁడు గరుణించు.

**4. గదవ లున్నాయి :** ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడలఁ దెనుఁగులమీఁది సాంస్కృతికకతపలకు గదవలు గానంబడియెడి' అని సాంస్కృతికా లయినకతపలకు గదవలు కవిప్రయోగాలలో ప్రాసఘటితా లై ఉండటాన్ని పేర్కొన్నాడు. వే+పణములు = వేవణములు మొ.

**5. ద్వంద్వంలో** : 'ద్వంద్వంబునం బదంబుపయిపరుషములకు గసడదవ లగు' అని ద్వంద్వసమాసంలో ఉత్తరపదాదిపరుషాలకు గసడదవలు నిత్యం. తల్లి + తండ్రి = తల్లిదండ్రులు మొ.

**6. ఆదేశాభావం :** ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల ద్వంద్వంబునం బదంబుమీఁదిచతపలకు సదవలు కానంబడవు' అని సూత్రించి ద్వంద్వంలో

కొన్నిచోట్ల ఈఆదేశం లేకపోవటాన్ని పేర్కొన్నాడు. అందచందములు. ప్రౌఢవ్యాకర్తే వే ఱొకచోట 'విన్నకన్నది' అనేది ద్వంద్వంగా ఉదాహరించాడు. (దీనినిబట్టి ద్వంద్వంలో క కారానికి గ కారం కూడా కొన్నిచోట్ల లేకపోవటం చెప్పవలసిఉన్నది.) కానీ అది ద్వంద్వం కాదు.

## 5. ద్రుతానికి కలిగేకార్యాలను గురించి వివరించండి.

ప్రత్యయమూ, ఆగమమూ, అవ్యయమూ, వలెను మొద లైనవాటిలో ఉన్నదీ అయిన ను(ని,న్) అనేవర్ణానికి ద్రుతం అని సంజ్ఞ. ద్రుతం చివర గల్గినపదం ద్రుతప్రకృతికం. అచ్చు, హల్లు, అవసానం పర మైనపుడు ఈద్రుతానికి పెక్కు మార్పులు కలుగుతున్నాయి.

**1. పూర్వస్వరసంధి :** 'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు'. ప్రథమేతరవిభక్తులలోనూ (ఉకారము) శత్రర్థచువర్ణంలోనూ, షష్ఠీకివర్ణం, ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని అనేవి తప్ప మిగిలిన ద్రుతప్రకృతులలో ద్రుతపూర్వస్వరానికి అచ్చు పర మైనపుడు సంధి లేదు. అక్కడిద్రుతం మీదిఅచ్చుతో కలుస్తుంది. వచ్చున్ + అతఁడు – వచ్చు నతఁడు. ప్రథమేతరవిభక్తులలోనిఉకారం మొద లయినవాటికి సంధి వికల్పం. నన్నున్ + అడిగె, నన్నడిగె = నన్ను నడిగె మొ.

**2. ద్విత్వం :** 'కొన్నియెడలఁ బ్రామాణికప్రయోగంబుల ద్రుతంబున కచ్చు పరం బగుచో ద్విత్వంబు చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకర్త అచ్చు పర మైనపుడు ద్రుతానికి క్వాచిత్కంగా ద్విత్వాన్ని పేర్కొన్నాడు. సర్వమున్ + అతని = సర్వము న్నతని మొ.

**3. మీఁద సరళాదేశం** : 'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు' అనేసూత్రంచేత ద్రుతానికి పైన ఉన్న పరుషాలు సరళా లవుతాయి. పూచెను + కలువలు = పూచెనుగలువలు.

**4. బిందువు :** 'ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంచేత పరుషాల కాదేశ మయినసరళాలు పరంగా ఉన్నపుడు ముందఱిద్రుతానికి బిందువు అంటే నిండుసున్నా, అఱసున్నా రెండూ వస్తాయి. పూచెను + గలువలు = పూచెంగలువలు, పూచెఁగలువలు.

**నిషిద్ధస్థలాలు :** 'అఁటయిఁకచుఁడుశబ్దంబులం దప్ప నుడితొలిహ్రస్వంబుమీఁ ద ఖండబిందువును, ద్రుతంబునకు లోపంబును లేవు' అనినుడితొలిహ్రస్వంపై అరసున్న ఉండదు, కెందామర. ' దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేసూత్రంచేత దీర్ఘంమీద నిండు సున్న రాదు. తాఁజెప్పె.

**5.లోపం**: 'ద్రుతమునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' సహజసరళాలూ, స్థిరాలూ పర మైనపుడు ద్రుతానికి లోపం విభాషగా వస్తుంది. వచ్చెను + గోవులు = వచ్చె గోవులు మొ.

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు' అచ్చు గానీ హల్లు గానీ ఏవర్ణం కూడా పరంగా లేనపుడు ద్రుతానికి లోపం బహుళంగా వస్తుంది. ఉదా. వచ్చెను – వచ్చె.

'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత సమాసంలో ద్రుతం లోపిస్తుంది. ఎల్లను + అర్థములు – ఎల్లయర్థములు మొ.

**నిషిద్ధస్థలాలు :**'అఁటయికచుఁడుశబ్దంబులం దప్ప – అనేసూత్రంచేత మాటమొదటి హ్రస్వంమీద ఉన్నద్రుతానికి లోపం రాదు. పెను+దూళి = పెందూళి. పెదూళి అని కాదు.

అవసానంలో వచ్చేలోపం పద్యాంతాలలో గణానుసారంగా వ్యవస్థిత మై ఉంటుంది.

సమాసంలో ప్రత్యేకంగా విధించినచోట్ల నువర్ణం ద్రుత మైనా, విధానసామర్థ్యంచేత లోపించదు. చిగురుంగైదువు. 'తలబ్రాలు మొద లగుసమాసంబుల ద్రుతమునకు లోపంబు లేదు' తలంబ్రాలు మొ.

**6. సంశ్లేషం :** ఆదేశసరళములకు ముందున్న, ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు – అనేసూత్రాలచేత, ఆదేశంగా వచ్చినవీ, సహజంగా ఉన్నవీ అయినసరళాలు, అలాగే స్థిరాలూ పర మైనపుడు ద్రుతానికి సంశ్లేషం వస్తుంది. 'సంశ్లేష మనఁగా ద్రుతము మీఁదిహల్లుతో గూడికొనుట' ను(ని)అనే ద్రుతంలోనిఅచ్చు లోపించటమే సంశ్లేష మని చెప్పవచ్చు. పూచెను + గలువలు – పూచెన్గలువలు. వచ్చెన్ ఋషి మొ.

**నిషిద్ధస్థలాలు :** 'తానునేనుపదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' అనేసూత్రంచేత తా న్జదివె, నేన్ వింటిని అనేవిధంగా తాను, నేను అనేవాటిలోని ద్రుతానికి సంశ్లేషం రాదు.

ఇలాగే లుప్తశేషా లయిన ప్రాతాదులకు (అన్యములకు) వచ్చిన నుగాగమ ద్రుతానికి వ్యవస్థితవిభాషచేత సంశ్లేషం రాదు. కాబట్టి ప్రాన్గెంపు, క్రొన్బసిఁడి – పన్దొమ్మిది అనేరీతిరూపా లుండవు.

**7. ద్రుతస్వరలోపం** : 'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని – అనేసూత్రంచేత

అవసానంలోని ద్రుతంలో ఉన్నఅచ్చుకు బహుళంగా లోపం వస్తుంది. వాఁడు – వచ్చెను – వాఁడు వచ్చెన్ మొ.

ఈద్రుతస్వరలోపం పద్యాంతంలో గణానుసారంగా నియమింపబడిఉంటుంది.

అచ్చు పరంగా ఉన్నపుడు ద్రుతంలోనిఅచ్చుకు సాధారణంగా లోపం వస్తుంది. నన్నున్ + అడిగె = (నన్ను నడిగె) మొ.

**8. స్వత్వం :** హలవసానపరకతలో బింద్వాదికార్యాలు విభాష, బహుళం అనేరీతిగా చెప్పటంచేత ఇటువంటిమార్పులు పొందక ద్రుతం అలాగే ఉండటం కూడా ఉన్నది. దానినే స్వత్వ మంటారు. 'స్వత్వం బనఁగా ద్రుతమునకు ప్రకృతిభావము'. పూచెను గలువలు.

**నిషిద్ధస్థలం :** 'సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు లేదు' అనేసూత్రంచేత సమాసంలో ద్రుతం స్వత్వస్థితిలో ఉండదు. తలంబ్రాలు ఇత్యాదులలో తలనుబ్రాలు అనేరీతిరూపా లుండవు. ఇలాగే తద్ధితవృత్తిలోనూ సొగసుందన మనేచోట సొగసునుదన మనేరీతిగా ఉండదు.

'చూడఁగా' మొద లైనచోట్లఁ గూడ ద్రుతానికి వ్యవస్థితవిభాషవల్ల స్వత్వ ముండదు.

**9. ద్రుతంమీద నకారం** : 'కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి' అనేసూత్రంచేత కొన్నిచోట్ల ద్రుతంమీద నకారం వస్తుంది. అదియును + కాక – అదియునున్ + కాక, అదియునుం గాక. ఇలాగే అదియును ని ట్లనె మొ. ఈలక్షణంచేత స్వరపరకత్వంలో ద్రుతద్విత్వాన్ని సంగ్రహించుకొనే అవకాశం కూడా ఉన్నది. సర్వము న్నతని.

**10. మకారాదేశం :** 'ప్రాసంబున మకారంబు పరం బగుచో ద్రుతంబునకు మకారాదేశం బగు' అని ప్రౌఢవ్యాకర్త మకారం పర మైనపుడు ద్రుతానికి మకారాదేశాన్ని విశేషంగా చెప్పాడు. చేసెను + మహానది = చేసె మ్మహానది. మొ.

## 6. అనుకరణసంధికార్యాలను గూర్చి వివరించండి.

**అనుకరణం** : యథాతథంగా గ్రహించటం అనుకరణం. సంస్కృతవాక్య(శబ్ద)ం అనుకరణంతో మాత్రమె తెలుగులో ప్రయోగించుకోవాలి.

ఆయాప్రత్యేకసందర్భాలలో తప్ప సంస్కృతవాక్య(పద)ం అనుకరణం లేకుండా తెలుగులో ప్రయోగింపబడటం లేదు.

**అనుకరణరాహిత్యం:** 'ఒకానొకచో ననుకరణవిరహితంబుగ సంస్కృతవాక్యంబు గానంబడియెడి' అనుకరణం లేకుండా కూడ సంస్కృతవాక్యం తెలుగులో ప్రయోగింప బడటాన్ని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. అంటితి నమ శ్శివాయ పాపాత్ముఁరాలి.

"జయపదం బనుకరణవిరహితంబ తఱుచుగ నగు" అని ప్రౌఢవ్యాకరణం "జయ" అనేసంస్కృతక్రియాపదం అనుకరణం లేకుండానే ప్రయోగింపబడటాన్ని పేర్కొన్నది. జయ నారాయణ. ఇది అనుకరణంతో ప్రయోగింపబడితే అదే విశేషం అనవలసిఉంటుంది.

ఈఅనుకరణంలో అనుకరించేవాక్యానికి 'అను'ధాతురూపం పరంగా ప్రయోగింపబడు తుంటుంది. అనుకరణంలో అనుధాతురూపం పర మవుతుండగా పూర్వంలోని సంస్కృతవాక్యం చివర జరిగేవర్ణవికారాలే అనుకరణసంధికార్యాలు.

**1. విసర్గలోపం :** 'విసర్గంబున కనుకరణంబున లోపం బగు' సంస్కృతవాక్యం చివర ఉన్న విసర్గకు లోపం వస్తుంది. వర్ధతాం శ్రీః + అనె = వర్ధతాం శ్రీ యనె.

**2. ఓత్వం :** 'అనుకృతిని నమశ్శబ్దంబుతుదియత్తున కోత్వంబు విభాష నగు' విసర్గ లోపించినతరువాత 'నమ' అనేశబ్దంలోని చివరిఅత్వానికి ఓత్వం వికల్పంగా వస్తుంది. తుభ్యం నమ(ః) + అనె, తుభ్యం నమో యనె. ఓత్వం రానిపక్షంలో తుభ్యం నమ యనె.

'ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి'. ఈఓత్వం నమశ్శబ్దంలోనే కాక యితరస్థలాలలోను కనబడుతున్నది. లోక(ః) + అటంచున్ – లోకో యటంచున్.

**3. ద్విత్వం :** 'అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు' సంస్కృతవాక్యం చివర ఉన్నపొల్లుకు నిత్యంగా ద్విత్వం వస్తుంది. క స్త్వమ్ + అనియె = క స్త్వ మ్మనియె.

**4. వైకల్పికద్విత్వం :** 'అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు' అహమ్ మొద లైనశబ్దాలలోనిమకారానికి మాత్రం ద్విత్వం వికల్పంగా వస్తుంది. దాసో ఽహమ్ + అనె – దాసో ఽహ మ్మనె. ద్విత్వం రానిపక్షంలో దాసో ఽహ మనె.

**5. వుగాగమం**: 'ఉదంతనామంబునం కనుకరణంబునందు వుగాగమం బగు' క్రియాపదం కానిఉదంతశబ్దానికి చివర వకారం ఆగమంగా వస్తుంది. ఇయం ధేను + వ్ + అనె = ఇయం ధేను వనె.

ఇతరస్థలాలలో సాధారణసంధికార్యాలే వస్తాయి. ధర్మో జయతు + అనుచు =

అన్నపుడు ఉత్వసంధి జరిగి – ధర్మో జయ తనుచు.

**హ్రస్వం రాదు :** అనుకరణంలో సంస్కృతవాక్యం చివరిదీర్ఘానికి హ్రస్వం వస్తుం దని అప్పకవి చెప్పాడు. కాని కవులు దీర్ఘానికి హ్రస్వాన్ని ప్రయోగించలేదు. కాబట్టి అది అంగీకరింపరాదు. దుర్బలస్య బలం రాజా యన వినవే. అనేమనుచరిత్రలోని పెద్దన ప్రయోగంలో 'రాజా' అన్నచోటిదీర్ఘం అలాగే ఉన్నది.

**6. ముగాగమం : '**ధ్వన్యనుకరణశబ్దముల కనుధాతువు పరం బగుచోఁ గొన్నియెడల ముగాగమం బగు' అని ప్రౌఢవ్యాకర్త ధ్వన్యనుకరణశబ్దాలకు అనుకరణంలో 'మ'కారం ఆగమంగా రావటాన్ని పేర్కొన్నాడు. సలసల+అను. సలసలమ్ + అను – సలసల మను.

# తత్సమపరిచ్ఛేదం

## 1. తెలుగులోనివిభక్తులను గూర్చి వివరించండి.

సంస్కృతంలోలాగానే తెలుగులో కూడా ప్రథమ మొదలుకొని సప్తమివఱకు 7 విభక్తులు ఉన్నాయి. ఒక్కొక్కవిభక్తిలో ప్రత్యయాలు పెక్కులు కావటం తెలుగులోనివిశేషం.

**1.ప్రథమ :** 'డుమువులు ప్రథమ'. 'డుమువులు' అనేవి నాల్గు ప్రథమావిభక్తులు. 'డుమువున లేకవచనంబులు' అందులో డుమువు అనేవి ఏకత్వసంఖ్యను మాత్రమె బోధిస్తాయి. కాబట్టి ఏకవచనాలు, రాముఁడు, వనము, ధేనువు.

కూతురు, నీవు, నేను మొద లైనస్థలాలలో ఆచ్ఛికాలలో రు, వు, ను, మొద లయినవి ప్రథమైకవచనాలు. కొన్ని శబ్దాలపై ప్రథమైకవచనం లోపిస్తుంది. వనిత, హరి,పేరు మొ.

'లువర్ణంబు బహువచనంబు'. 'లు'వర్ణం బహుత్వసంఖ్యను బోధిస్తుంది కాబట్టి బహువచనం. రాములు, వనములు. మొ. దీనికి రేఫాదు లైనవిశేషకార్యాలు వస్తాయి. బాలురు. ఇంకా మేము మొ.

**2. ద్వితీయ :** 'నువర్ణంబు ద్వితీయ'. ద్వితీయలో 'ను' అనే దొక్కటే ప్రత్యయం. ఇది ఏకత్వబహుత్వాలు రెండింట వస్తుంది. వనమును, వనములను. దీనికె ఇకారాంతాదులపై ఇత్వం వచ్చి 'ని' అనేరూప మేర్పడుతుంది. హరిని, రాముని, పైని, మొ.

(కొన్నియెడల నుద్దేశార్థంబునందు ద్వితీయకు గుఱిచియు నునుప్రయుక్తం బగు' అని చెప్పాడు ప్రౌఢవ్యాకర్త. దీనివల్ల ద్వితీయావిభక్తిమీద కూర్చి, (గుఱించి) అనేవి చేరతాయి. నన్ను గూర్చి, మము గుఱిచి మొ.)

**3. తృతీయ :** 'చేత తోడ తృతీయ' – చేత, తోడ అనే రెండు తృతీయావిభక్తులు. వీటినుంచి 'చేతతోడలోపలవర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగ శేషించు' అనేసూత్రంచేత – చే, తో అనేరూపాలు కూడా ఏర్పడతాయి. ఇవి ఏకత్వబహుత్వాలు రెండింట వస్తాయి. రామునిచేత, రాములతో మొ.

('ఒకానొకచో తోడకు తోడుత నని రూపాంతరంబును గలదు' అని ప్రౌఢవ్యాకరణం. 'తోడ' అనేదానికి 'తోడుత' అనేరూపాంతరం గలుగుతుంది. 'ప్రాణముతోడుత'.

'జడపదంబుమీఁదితోడకు మెయి, మైలు విభాష నగు' అనేదానిచేత మెయి, మై అనేవి తోడస్థానంలో వస్తాయి. అర్థిమెయిన్, అర్థిమైన్ (అర్థితోడ).)

**4. చతుర్థి** : 'కొఱకు కయి చతుర్థి' –కొఱకు, కయి అనేవి రెండూ చతుర్థీవిభక్తులు. ఏకత్వబహుత్వాలు రెండింట వస్తాయి. రామునికొఱకున్, రాములకయి.

('చతుర్థికిం బొంటెవర్ణకంబు నగు' అని ప్రౌఢవ్యాకరణం. చతుర్థికి కొన్నిచోట్ల 'పొంటె' అనేప్రత్యయం వస్తుంది. సంప్రయోగముపొంటెన్.)

**5. పంచమి :** 'వలన కంటె పట్టి పంచమి'. వలన, కంటె, పట్టి అనేవి పంచమీవిభక్తులు. ఇవి ఏకత్వబహుత్వాలు రెండింట వస్తాయి. వనమువలనన్, వారికంటెన్ మొ.

'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' వలనపై కొన్నియెడల 'ఉండి' అనేపదం చేరుతుంది. వనమువలననుండి.

('కొన్నియెడలఁ జేతవిభక్త్యర్థకవర్ణకంబులకును, వలనవర్ణకంబునకును జేసి యను ప్రయుక్తం బగు' అని ప్రౌఢవ్యాకరణం. ధర్మతనూభవువలనఁ జేసి, ఇచ్చుటంజేసి మొ.)

**6. షష్ఠి :** 'కు యొక్క లోపల షష్ఠి'. కు, యొక్క, లోపల, అనేవి మూఁడు షష్ఠీవిభక్తులు. ఇవి ఏకబహువచనాలు రెండూ అవుతాయి. రామునకును, రాములకును మొ.

ఇకారంమీద కువర్ణానికి ఇత్వం వచ్చి 'కి' స్వరూపం గల్గుతుంది. రామునికిని. పైకిని మొ. 'చేత తోడ లోపల వర్ణకంబుల–' అనేసూత్రంచేత 'లోపల' కు 'లో' అనేరూపం గల్గుతుంది. వనములలోన్.

**7. సప్తమి** : 'అందు న సప్తమి'. అందు, న అనేవి రెండూ సప్తమీవిభక్తులు. 'డుమువున లేకవచనంబులు'. కాబట్టి వీటిలో 'న' అనేది ఏకవచనం. వనమునను. అందు – ఏక బహువచనాలు రెండూ అవుతుంది. వనమునందును, వనములందును.

'తృతీయాదులకు నుగాగమం బగు' చేత మొద లైనవిభక్తులకు చివర నువర్ణం చేరుతుంది. రామునిచేతను. ఇవి ద్రుతప్రకృతికాలు. 'కయిపట్టియొక్కలకు నుగాగమంబు లేదు' అనటంచేత కయి, పట్టి, యొక్క ప్రత్యయాంతాలు మాత్రం కళలు. రామునికయి, జ్ఞానమునుబట్టి, రామునియొక్క మొ.

## 2. అకారాంతసంస్కృతశబ్దాలు తత్సమా లయ్యే విధానాన్ని వివరించండి.

సంస్కృత (ప్రాకృత)భాషలోనిపదాలు తత్సమాలుగానూ, తద్భవాలుగానూ తెలుగులోకి ప్రవేశిస్తున్నాయి.

అకారం చివర గలిగినశబ్దాలు అకారాంతాలు. అజంతా లయినశబ్దాలు సాధారణంగా సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో అవి అలాగే తెలుగులోనూ ప్రాతిపదికలుగా నిలుస్తాయి.

ఇవి తెలుగులో తత్సమా లయ్యేటపుడు విభక్త్యాదులతో మార్పులను పొందుతాయి.

**హ్రస్వం :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అజంతసంస్కృత (ప్రాకృత) ప్రాతిపదికలచివరిదీర్ఘానికి హ్రస్వం వస్తుంది. వనితా – వనిత.

'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' – సంస్కృతప్రాతిపదిక ఒకేఅక్షర మైనశబ్ద మయితే హ్రస్వం రాదు. క్ష్మా–ధీ.

### 1. పుంలింగాలు

సంస్కృతప్రాతిపదిక అకారాంతమూ, పుంలింగమూ అయి మహద్వాచక మయినపుడు 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్త్వంబున కుత్త్వం బగు' అని (అన్నివిభక్తులలోను) ఉత్త్వం వస్తుంది. ప్రథమైకవచనంలో 'పుంలింగ మగు మహద్వాచకంబునకు డు ఁగు' అని డుఙ్ ప్రత్యయం వస్తుంది. రామ – రాముఁడు.

**డుఙ్లోపం** : 'వృద్ధాదులడుఙునకు లోపంబు విభాష నగు'. వృద్ధ మొద లయినశబ్దాలలో చివరిఅత్త్వంస్థానంలో ఉత్వం వచ్చి, తరువాత ప్రథమైకవచనంలో వచ్చిన డుఙుకు వికల్పంగా లోపం వస్తుంది. వృద్ధు. మూర్ఖు – మొ. లోపం రానిపక్షంలో – వృద్ధుఁడు మొ.

**స్త్రీత్వం :** 'దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' దూత మొద లయినవి సహజంగా పుంలింగా లైనా, స్త్రీత్వాన్ని పొందుతాయి. కాబట్టి ప్రథమైకవచనలోపం, మొద లైనస్త్రీలింగకార్యా లవుతాయి. దూత. (దూతను) మొ. స్త్రీత్వం రానిపక్షంలో (మహత్) పుంలింగకార్యా లౌతాయి. దూతుఁడు (దూతుని మొ)

'సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీ తుల్యము లగు

సంస్కృత సమాసంబునఁ గావు' వీనికి స్త్రీతుల్యత్వ మై, సురలు. అసుర – అసురుఁడు. అనేరీతిగా ఏర్పడతాయి. సిద్ధసమాసాలలో స్త్రీతుల్యత్వం లేదు. భూసురుఁడు. మొ.

'స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు'. 'దేవ'శబ్ద మెప్పుడూ ఏకత్వాన్ని బోధించేసందర్భంలోనే ప్రయోగించాలి. దేవుఁడు దేవుని మొ. కాబట్టి దీనిమీద బహువచనం ఉండదు. సురశబ్ద మెప్పుడూ బహుత్వాన్ని బోధించేటపుడే ప్రయోగింపబడుతుంది. సురలు. (సురలను మొ.) కాగా ఇది ఏకవచనాంతం గాదు.

సంబోధనంలో 'కృతోత్కం బగుసంస్కృతనామంబుసంబుద్ధిడుజునకు లోపంబు విభాష నగు' అని వికల్పంగా డుజు లోపిస్తుంది. రాము. (రాముఁడు)

'సంబోధనంబునం దేకార్థం బయినపదంబుతుదియుకారంబున కకారం బగు' రామ, రాముఁడ. 'సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు'. రామా – రాముఁడా.

'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' బహుత్వంలో అన్ని శబ్దాలకు ఆరగాగమం సామాన్యంగా వస్తుంది. రాములార, వనితలార, వనములార. 'మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు' మధ్యమపురుషక్రియతో అన్వయించేటపుడు మాత్రం వికల్పం. బాలకులు (బాలకులార మీరు) వినుఁడు.

**లకారం–రేఫ :** 'అదంత బై దీర్ఘపూర్వలోపధం బయినమహత్తుమీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు'. బాల – అనేవిధ మయినప్రాతిపదికలపై బహువచనం ఐనలకారానికి రేఫ వస్తుంది. బాలురు – బాలురన్. దయాళురు అనేచోట కూడా రేఫం కనిపిస్తున్నది.

('ద్విత్వయుక్తలాంతంబుమీఁదిలులలకు రుర లగు' అనే ప్రౌఢవ్యాకరణలక్షణం చేత మల్లురు–మల్లురన్ మొ. మల్లులు–మల్లుల అని కూడా రూపాలు ఉంటాయి.)

**నిగాగమం :** 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' ద్వితీయాదివిభక్తులలో ఏకవచనం పర మైనపుడు వీటికి వికల్పంగా నిగాగమం వస్తుంది. రామునిని, రాముచేత. అనుదంత మయిన అచ్చతెనుగుడుమంతానికి నిగాగమం నిత్యం. మగనిచేత.

**నగాగమం :** కువర్ణకంబు పరం బగునపు డుకారబుకారంబులకు నగాగం బగు' షష్ఠి అయిన కువర్ణం పరంగా ఉన్నపుడు నిగాగమం రానిపక్షంలో నగాగమం వస్తుంది. రామునికి – రామునకు.

(ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'కువర్ణకంబు పరం బగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులం దక్క దక్కిన మహాకవి ప్రయోగంబులందును గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' అని కొన్నిచోట్ల నగాగమం లేకపోవవటాన్ని పేర్కొన్నాడు. ప్రాచేతసుకున్.

'కంటెవర్ణకంబు పరం బగునపుడు గొన్నియెడల నగాగమంబు చూపట్టెడి' అని కంటెవిభక్తి పర మైనపుడు నగాగమం అరుదుగా వస్తుం దని ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నది. శతంబునకంటె.)

**నుగాగమం :** 'ఉకారబుకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు'. సప్తమి ఏకవచనంలో 'అందు' పర మయినపుడు నిగాగమం రానిపక్షంలో నుగాగమం వస్తుంది. రామునందు. (రామునియందు)

## 2. స్త్రీలింగాలు

**ప్రథమైకవచనలోపం :** 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు'. స్త్రీలింగా లయినశబ్దాలకు పైనున్న ప్రథమైకవచనానికి (సు ప్రత్యయానికి) లోపం వస్తుంది. వనిత – విద్య.

**క్లీబతుల్యత : '**కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' 'కంధరా' మొద లయిన స్త్రీలింగశబ్దాలకు బహుళంగా క్లీబతుల్యత కలుగుతుంది. క్లీబతుల్యతచేత మువర్ణం మొ. నపుంసకలింగకార్యాలు వస్తాయి. కంధరము. క్లీబతుల్యత కలగనిపక్షంలో స్త్రీలింగకార్యాలు (ప్రథమైకవచనలోపం మొ.) కలుగుతాయి. కంధర.

బహుళశబ్దంచేత 'విధాశబ్దమునకు క్లీబతుల్యత నిత్యము'. విధము. (ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'విధాశబ్దంబు సంస్కృతంబునం బుంలింగంబు నగు' అని పేర్కొని పుంలింగా లయిన విధ, దంష్ట్ర అనేశబ్దాలనుంచి యీక్లీబతుల్యరూపాలు సాధించాడు.)

సంబోధనంలో – ఓ వనితా – ఓ వనిత, మొ.

ఇతరవిభక్తులలో వనితను ఇత్యాదిగా సాధారణంగా రూపా లేర్పడతాయి.

## 3. నపుంసకలింగాలు

**మువర్ణకం :** అకారాంతసంస్కృతశబ్దాలు నపుంసకలింగా లయినా, పుంలింగా లయి అమహద్వాచకా లయినా, 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ప్రథమావిభక్తి ఏకవచనంలో మువర్ణకం వస్తుంది. కళత్రము, వృక్షము. సంబోధనంలో, ఓ కళత్రమ ! వృక్షములారా ! మొ.

**మ్ముంబులు :** 'మువర్ణకంబునకు మాముడి యేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు' మాముడి ( ్మ ) లేదా 'ంబు' అనేది వికల్పంగా ఆమువర్ణకానికి వస్తుంది. వృక్షమ్ము – వృక్షంబులు.

**ములోపం :** 'చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' చరిత్ర మొద లయినవానిమువర్ణకానికి బహుళంగా లోపం వస్తుంది. చరిత్ర–చరిత్రము, చరిత్రలు – చరిత్రములు. బహుళ మనటంచేత దర్భ మొద లయినవాటిలో ఈలోపం నిత్యం. దర్భ. పనస మొ.

**ముగాగమం :** 'వానికి మువర్ణ కేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు' ఇతరవిభక్తి పర మయినపుడు మువర్ణం ఆగమంగా వస్తుంది. కళత్రములు, వృక్షములను మొ. 'మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' ముప్రత్యయానికి చెప్పినకార్యా లన్నీ ఆగమ మైన మువర్ణానికి కూడా వస్తాయి. వృక్షమ్ములు – వృక్షంబులు. చరిత్రలు. దర్భలు మొ.

**ములోపదీర్ఘాలు :** 'లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు' అని కొన్నియెడల ముగాగమానికి లోపమూ ముందరిఅచ్చుకు దీర్ఘమూ వస్తాయి. వజ్రాలు – వజ్రాలను – వజ్రాన మొ.

(**ఉత్వవువర్ణాలు** : 'అర్ఘాదులకడయచ్చున కుత్వంబును మీఁద వువర్ణకంబును వైకల్పికంబుగా నగు' అని ప్రౌఢవ్యాకరణం ఒక విశేషం చెప్పింది. అర్ఘ మొద లయినశబ్దాలకు ఉత్వ మై, పైన వువర్ణకాదులు కలుగుతాయి. అర్ఘువు – ధర్మువులు. వర్గము – వర్గువు మొ. వర్గువులో ఒకసారి వువర్ణం లోపించి 'వర్గు' అని కూడా ఉంటుంది.)

**పుంలింగతుల్యత :** 'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు' నపుంసకలింగా లయిన మిత్రాదిశబ్దాలు మహత్తు లయినపుడు వికల్పంగా పుంలింగతుల్యా లవుతాయి. ఆపక్షంలో మహత్పుంలింగ

కార్యాలు గలుగుతాయి. మిత్రుఁడు, పాత్రునిని మొ. పుంలింగతుల్యత గలుగనిపక్షంలో సహజంగా నపుంసకలింగాలు కావటంచేత నపుంసకలింగకార్యాలు గలుగుతాయి. మిత్రము – పాత్రము మొ.

**నక్, నుగాగమాలు :** 'కువర్ణకంబు పరం బగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు' షష్ఠీవిభక్తిలో ఏకవచనంలో కువిభక్తి పర మయినపుడు నగాగమం వస్తుంది. వృక్షమునకు. ( కొన్నిచోట్ల ఈనవర్ణం లేకపోవటాన్నీ, కంటె పర మైనపుడు కావటాన్నీ, ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. ఉత్సవముకు, చరిత్రమునకంటె మొ.)

'ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమంబు విభాష నగు' సప్తమీఏకవచనంలో అందు పర మైనపుడు వికల్పంగా నుగాగమం వస్తుంది. వృక్షమునందు – వృక్షమందు.

('ఉదంతము లగునమహత్తుల కందువర్ణకము పరం బగునపుడును నగాగమంబు కొన్ని యెడలఁ గానంబడియెడి' అని ప్రౌఢవ్యాకర్త ఇక్కడ కొన్నిచోట్ల నగాగమం చెప్పాడు. పటమునయందు – మొద లగునవి.)

పుంలింగాదు లయినశబ్దా లన్నింటికీ ద్వితీయాదిబహువచనాలలో 'బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు' అని విభక్తికి ముందుగా లవర్ణం ఆగమంగా వస్తుంది, రాములను, వనితలకొఱకు, వనములయందు.

## 3. ఇకారాంతసంస్కృతశబ్దాలు తత్సమాలయ్యేవిధానాన్ని వివరించండి.

చివర ఇకారం కలిగినశబ్దాలు ఇకారాంతాలు. అజంతా లయినశబ్దాలు సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో తెలుగులోనూ అవే ప్రాతిపదిక లవుతాయి.

**హ్రస్వం :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు'. అజంతసంస్కృత (పాకృత) ప్రాతిపదికలచివరిదీర్ఘానికి హ్రస్వం వస్తుంది. గౌరీ – గౌరి. సిరీ–సిరి మొ.

'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' సంస్కృతప్రాతిపదిక ఒకే అక్షర మైనశబ్ద మైతే హ్రస్వం రాదు. శ్రీ. మొ.

**ప్రథమైకవచనలోపం :** ఇకారాంతా లైనసంస్కృతశబ్దాలు ఏలింగంలో ఉన్నా, మహత్తు లయినా, అమహత్తు లయినా, ఇగ్గౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనానికి (సు) లోపం వస్తుంది. హరి, శ్రీ, వారి మొ.

**సంబోధనం :** 'సంబోధనంబునం బదంబు తుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు' సంబోధనంలో తుదియిత్తుకు దీర్ఘం వికల్పంగా వస్తుంది. ఓహరీ – ఓహరి. బహుత్వంలో 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' ఆరగాగమం సామాన్యంగా వస్తుంది. హరులార – గిరులారా.

'మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు' వినుఁడు హరులు (హరులారా) మొ.

**ను–కు విభక్తులు–ఇత్వము:** 'ఇకారంబుమీది కునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' ఇకారానికి పైనున్న – ను, కువర్ణాలలోనిఉత్వానికి ఇత్వం వస్తుంది. హరిని, గిరికిని మొ.

ద్వితీయాదివిభక్తులలో బహువచనంలో "బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు" అని లడాగమం వస్తుంది. హరులను – గిరులయందు మొ. మిగిలినవిభక్తివచనాలలో రూపాలు సాధారణంగానే ఏర్పడతాయి. హరిచేత మొ.

**బహుత్వం–ఉత్వం :** 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' బహుత్వంలో ప్రాతిపదిక తుదియిత్వానికి ఉత్వం వస్తుంది. హరులు, గిరులు. దీర్ఘం అలాగే ఉంటుంది. శ్రీలు, ధీలు.

దీర్ఘానికి హ్రస్వం రావటంచేత ఇదంతా లైనశబ్దాలు సహజంగా హ్రస్వాంతా లయినశబ్దాలకువలెనే రూపాలు పొందుతాయి. గౌరి – గౌరులు, (గౌరీ) మొ.

## 4. ఉకారాంత (ఓకారాంత)సంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానాన్ని తెలపండి.

చివర ఉకారం గలిగినశబ్దాలు ఉకారాంతాలు. అజంతా లయినశబ్దాలు సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో తెలుగులోనూ అవే ప్రాతిపదిక లవుతాయి.

**హ్రస్వం :** 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' సంస్కృతప్రాతిపదిక చివరిదీర్ఘానికి హ్రస్వం వస్తుంది. స్వయంభూ–స్వయంభు(వు). 'ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు' సంస్కృతప్రాతిపదిక ఒకే అక్షర మైనశబ్ద మయితే హ్రస్వం రాదు. భ్రూ(వు) గో(వు).

### అమహత్తులు

**వువర్ణం :** 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' ఉకారాంతా లయినశబ్దాలు ఏలింగంలో ఉన్నా, ప్రథమావిభక్తి యేకవచనంలో 'వు' వర్ణకం

వస్తుంది. తరువు, మధువు, 'అంతట 'అనటంచేత స్త్రీలింగశబ్దాలకు కూడా స్త్రీలింగకార్య మయినప్రథమైకవచనలోపాన్ని బాధించి యీసూత్రంచేత వువర్ణకమే వస్తుంది. వధువు – ధేనువు.

ఓకారాంతాలలో గోశబ్ద మొక్కటిమాత్రమే తెలుగులో తత్సమంగా ప్రయోగింప బడుతుంది. ఏకాక్షరశబ్దం కాబట్టి దీనికి హ్రస్వం రాదు. పైసూత్రంచేత ప్రథమైకవచనంగా వువర్ణకమే వస్తుంది. గోవు.

**వుగాగమం :** ఇతరవిభక్తులు పర మయినపుడు వీటికి చివర వువర్ణం ఆగమంగా వస్తుంది. 'వువర్ణకేతర విభక్తిపరం బగుచో నుకారాంతంబులకు బహుళంబుగా, గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమం బగు'. తరువులు మొ. బహుళం గాబట్టి ఒకపక్షంలో వువర్ణం రాక 'తరులు' అని కూడా ఉంటుంది. గోశబ్దానికి నిత్యం గాబట్టి గోవులు, గోవులందు అనేతీరుగా వువర్ణంతోనే రూపా లుంటాయి.

(**వులోపం :** ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'రాహుబాహుశబ్దంబుల కంతట వువర్ణకలోపంబు వైకల్పికంబు' అని సూత్రించి ప్రథమావిభక్తి ఏకవచనంలోనూ రాహు, బాహు అనేరూపాలను సాధించాడు.)

**నక్, నుగాగమాలు:** షష్ఠీఏకవచనంలో 'కువర్ణకంబు పరం బగునపు డుకార ఋకారంబులకు నగాగమం బగు' అని నగాగమం వస్తుంది. తరువునకు మొ.

(కువర్ణకంబు పరం బగునపుడు కవిత్రయప్రయోగంబులం దప్పఁ దక్కినమహాకవి ప్రయోగంబులందునుం గొన్నియెడల నగాగమంబు చూపట్టదు' అని ప్రౌఢవ్యాకర్త నగాగమం రాకపోవటాన్ని ప్రస్తావించాడు. తరువుకు మొ.

'కంటెవర్ణకంబు పరం బగునపుడు కొన్నియెడల నగాగమంబు చూపట్టెడి' అనేప్రౌఢ వ్యాకరణసూత్రంచేత ప్రయోగానుసారంగా "తరువునకంటె" అనేరూపాలూ గ్రహింపవచ్చు.)

సప్తమీఏకవచనంలో 'అందు' పర మయినపుడు 'ఆగమమువువర్ణంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమము విభాష నగు' అని వికల్పంగా నుగాగమం వస్తుంది. తరువునందు, తరువందు, తరునందు.

(**నగాగమం :** 'ఉదంతంబు లగునమహత్తుల కందువర్ణకము పరం బగునపుడును నగాగమంబు కొన్నియెడలఁ గానంబడియెడి, అనేప్రౌఢవ్యాకరణసూత్రంచేత ఇక్కడ కొన్నియెడల నగాగమం రావటం ఉన్నది. తరువునయందు మొ.)

'ఉదంతజడంబుసప్తమికి నవర్ణకం బగు' ఉదంతా లైనజడవాచకాలకు పైని సప్తమీ ఏకవచనంలో 'న' ప్రత్యయం వస్తుంది. తరువున. మొ.

### మహత్తులు

**వు, డుజ్వర్ణాలు :** 'ఉకారాంతం బగుమహత్తునకు వువర్ణకము బహుళముగా నగు' ఉకారాంతశబ్దం మహత్తు (పుంలింగమూ) అయితే వువర్ణకం బహుళంగా వస్తుంది. శంభువు. వువర్ణకం రానిపక్షంలో 'పుంలింగ మగుమహత్తునకు డు జగు' అని డుజు వచ్చి, శంభుఁడు. అభిమన్యు మొద లైనశబ్దాలకు వువర్ణక మసలు రాదు. అభిమన్యుఁడు. మను అనే మొద లయినశబ్దాలకు వువర్ణకం నిత్యంగా వస్తుంది. మనువు. (రాహుశబ్దంమీద వువర్ణకం వచ్చి లోపిస్తుంది. రాహు.)

ఇతరవిభక్తులలో వుగాగమాదులు వస్తాయి. శంభువును, శంభువందు. డుమంతపక్షంలో నిగాగమాదు లవుతాయి. శంభుని, శంభునిచేత, శంభునకు, శంభునందు మొ.

'బహుత్వమున ద్వితీయాదివిభక్తులకు లడాగమం బగు'. తరువులను, శంభువులను.

సంబోధనంలో "ఉదంతసంస్కృతనామంబుసంబుద్ధిడుజునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాష నగు" డుజుకు ప్లుత మయిన ఊకారం (ఊ3) వస్తుంది. శంభూ3. ప్లుతం రానిపక్షంలో 'సంబోధనంబునం దేకార్థంబయిన పదంబుతుది యుకారంబున కకారం బగు' అని అత్వం వస్తుంది. (తరువ, శంభువ,) శంభుఁ డ మొ. 'సంబోధనంబునందు బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు.' అత్వానికి వికల్పంగా దీర్ఘం వస్తుంది. (తరువా,శంభువా,)శంభుఁడా.

బహుత్వంలో ఎపుడూ సాధారణంగా 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అనేసూత్రంచేత ఆరగాగమం వస్తుంది. తరువులారా, శంభులార మొ. 'మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు' రక్షింపుఁడు ప్రభువులు, ప్రభువులార.

## 5. ఋకారాంతసంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానాన్ని గూర్చి తెలపండి.

అజంతా లయినసంస్కృతశబ్దాలు సాధారణంగా సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో అవే తెలుగులోనూ ప్రాతిపదికలుగా నిలుస్తాయి. అలాగే ఋకారాంతాలుకూడా.

**అత్త్వస్త్రీవద్భావాలు :** 'ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబు నగు' ప్రాతిపదికం చివర ఉన్నఋకారం స్థానంలో హ్రస్వ మయినఅకారం ఆదేశ మవుతుంది. భ్రాతృ – భ్రాత. మాతృ – మాత.

ఈశబ్దాలకు ఈసూత్రంచేతనే స్త్రీవద్భావం కూడా వస్తుంది. కాబట్టి డుఙు మొద లయినపుంలింగాదికార్యాలు గలుగకుండ స్త్రీలింగాలకువలె కార్యా లవుతాయి. 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనం లోపిస్తుంది. భ్రాత, మాత.

ఇలా చెప్పటంవల్ల భ్రాతృఁడు జామాతృఁడు అనేవిధంగా రూప ముండదు.

**విధాత్రాదులకు వికల్పం : '**విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్త్వస్త్రీవద్భావంబులు విభాష నగు' విధాతృ మొద లయినపయిశబ్దాల ఋకారంస్థానంలో అత్త్వమూ, ఈశబ్దాలకు స్త్రీవద్భావమూ వికల్పంగా వస్తుంది. వచ్చినపక్షంలో భ్రాత – మాత – అనేవిధంగా విధాత – సవిత ఇత్యాదిగా రూపా లేర్పడతాయి.

విభాష గాబట్టి అత్త్వస్త్రీవద్భావాలు రానిపక్షంలో మహత్పుంలింగాలకువలె కార్యా లవుతాయి. 'పుంలింగ మగుమహద్వాచకమునకు డు ఙగు' అని ప్రథమైకవచనంలో డుఙు వస్తుంది. విధాతృఁడు, సవితృఁడు. ఇలాగే ద్వితీయాదులలో రామునిని, రామునకు మున్నగువిధంగా విధాతృనిని, విధాతృనకు, విధాతృనందు – అనేరీతిగా రూపా లేర్పడతాయి. ఇవి అమహత్తు లయినపక్షంలో అత్త్వస్త్రీవద్భావాలు పూర్వసూత్రంచేత నిత్యం. నేత యగు సింహము.

అథర్వణునిమాటలనుబట్టి చిన్నయసూరికూడా ఇక్కడ విధాతృ మొద లయినవాటిని చెప్పాడు. కాని వీటిలో ధాతృ, దాతృ, నేతృ అనేశబ్దాలు మూడింటికి అత్వస్త్రీవద్భావాలు మహత్తు లయినపుడు కూడా నిత్యమె. ధాతృఁడు మున్నగుతీరుగా మహత్పుంలింగకార్యాలతో రూపా లుండవు. ఇట పేర్కొనని 'మాంధాతృ' అనుశబ్దానికి అత్త్వస్త్రీవద్భావాలు గలుగని మాంధాతృఁడు, అనేరూపం నన్నయాదులు ప్రయోగించారు.

కాగా సవితృ, విధాతృ, మాంధాతృశబ్దాలు మూడింటికిమాత్రమే అత్వ స్త్రీవద్భావాలు వైకల్పికంగా చెప్పదగును. మొత్త మాంధ్రభాషలో ఈమూడుశబ్దాలు మాత్రమె ఋకారంతో ప్రయోగింపబడుతున్నట్లు మహాకవిప్రయోగానుగుణంగా తెలియవచ్చును. విధాతృనానతి.

అత్త్వస్త్రీవద్భావా లయినశబ్దాలు స్త్రీలింగకార్యాలను పొందుతాయి. రమను, రమచేత ననురీతిగా భ్రాతను, విధాతచేత – సవితకు మొ.

ఇలాగే అత్త్వస్త్రీవద్భావాలు గలుగనిపక్షంలో ఋకారం నిలిచిఉండేశబ్దాలు అన్ని విభక్తులలోనూ మహత్పుంలింగశబ్దాలకువలెనే కార్యాలు పొందుతాయి. విధాతృని, సవితృనకు, సవితృనందు, విధాతృఁడ మొ.

షష్ఠి యేకవచనంలో నిగాగమం రానిపక్షంలో 'కువర్ణకంబు పరం బగునపుడు –' అనేసూత్రంచేత నగాగమం నిత్యంగా వస్తుం దనిపిస్తుంది. విధాతృనికి – విధాతృనకు అనే కాని 'విధాతృకు' అనేరూపం మృగ్యం. ఇలాగే సప్తమ్యేకవచనంలో నిగాగమం రానపుడు నుగాగమమూ నిత్యమె. సవితృనియందు – సవితృనందు.

**స్త్రీలింగాలు–స్త్రీప్రత్యయాంతాలు:** 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' స్త్రీలింగశబ్దాలు సంస్కృతస్త్రీప్రత్యయాలతో కూడి తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తాయి.

కర్తృ. ఋకారాంత మైనఈశబ్దం స్త్రీప్రత్యయాంత మయి– 'కర్త్రీ' అనేరూపంతో తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వ మయి 'కర్త్రి'. 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ప్రథమైకవచనానికి లోపం. కర్త్రి – ధాత్రి మొ. ఇలా వీటికి 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' మొద లయినలక్షణాల ననుసరించి హ్రస్వేకారాంతాలకువలె ఆయాకార్యా లవుతాయి. ధాత్రులు – కర్త్రిని – నేత్రికి – ఓధాత్రీ!

## 6. ఐకారాంత, ఔకారాంత సంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానం తెలపండి.

చివర ఐకారం గలిగినశబ్దాలు ఐకారాంతాలు. ఔకారం చివర గలవి ఔకారాంతాలు. అజంతా లయినయాశబ్దాలు సంస్కృతంలో ఏవి ప్రాతిపదికలో తెలుగులోనూ అవే ప్రాతిపదిక లవుతాయి.

**1. ఐకారాంతం – రై** : ఐకారాంతాలలో 'రై' శబ్ద మొక్కటి మాత్రమె తత్సమంగా తెలుగులో ప్రయోగింపబడుతున్నది.

**ఓత్వం–ప్రథమైకవచనలోపం**: 'రైగ్లౌశబ్దముల కోత్వంబు విభాష నగు' అనేసూత్రంచేత రైశబ్దంలోని ఐకారానికి వికల్పంగా 'ఓత్వం' వస్తుంది. రో. ఓత్వం

రాకపోతే – రై. 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత రో, రై శబ్దములమీఁదిప్రథమైకవచన(సు)విభక్తికి లోపం వస్తుంది.

ఇతరవిభక్తులలో రోశబ్దానికి రూపాలు రోను, రోచేత ఇత్యాదిగా సామాన్యవిధుల ప్రకారం ఏర్పడతాయి.

**ఈతుల్యత :** 'ఐకారం బీతుల్యంబు'. ఐకారాంత మై నిలిచేసందర్భంలో రైశబ్దం తత్సమరూపాలు ఈకారాంతంలాగా పొందుతుంది.'ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' రైని, రైకి. మొ. బహుత్వంలో రైలు, రైలను, మొ.

**ఔకారాంతాలు – గ్లౌ, నౌ** : ఔకారాంతాలు గ్లౌ, నౌ శబ్దాలు రెండె తత్సమాలుగా తెలుగులో ప్రయోగింపబడుతున్నాయి.

**ఓత్వం – ప్రథమైకవచనలోపం :** 'రైగ్లోశబ్దంబుల కోత్వంబు విభాష నగు' గ్లోశబ్దములోని ఔకారంస్థానంలో ఓకారం వికల్పంగా వస్తుంది. గ్లో. ఓత్వం రానిపక్షంలో గ్లౌ. 'ఇగ్లౌరాయుగంతంబుల' అనేసూత్రంచేత వీటిపైన ప్రథమైక వచనానికి(సు) లోపం వస్తుంది. గ్లో, గ్లౌ.

ఇతరవిభక్తివచనాలలో గ్లోలు, గ్లౌలు, గ్లోను, గ్లౌలను అనేవిధంగా సామాన్య శాస్త్రానుగుణంగా తత్సమరూపా లేర్పడతాయి.

**నావ :** 'నౌ'శబ్దంబునకు నావ యగు' ఇక్కడ 'నౌ' అనేశబ్దానికి 'నావ' అనేఆదేశమూ, స్త్రీత్వమూ నిపతింపబడ్డాయి. స్త్రీత్వంవల్ల 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అని సువిభక్తి లోపిస్తుంది. నావ.

ఇతరవిభక్తులలో – నావలు, నావను, నావలను అనేవిధంగా సామాన్యశాస్త్రం ప్రకారం రూపా లేర్పడతాయి.

**నావి :** నౌశబ్దానికి నావ అనే కాక 'నావి' అని కూడా ఆదేశ మవుతుం దని పుష్పదంతుడు, అథర్వణుడు మొద లైనకొందఱు లాక్షణికులు పేర్కొన్నారు. ఆపక్షంలో ఇకారాంతశబ్దాలకువలె తత్సమరూపా లేర్పడతాయి. నావి, నావులు. నావిని మొ.

## 7. హలంతసంస్కృతశబ్దాలు తత్సమాలు కావటంలో సామాన్యవిధానాలను తెలపండి.

హల్లు చివర గల్గినశబ్దాలు హలంతాలు. అజంతాలు సంస్కృతంతో దాదాపు సమానంగా తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుండగా హలంతా

లయినసంస్కృతశబ్దాలు మాత్రం తెలుగులో ప్రాతిపదికలుగా చేరటంలో కొద్దిగా భేదం గనబడుతున్నది.

## ప్రథమైకవచనాంతతుల్యాలు

'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' సాధారణంగా హలంత శబ్దాలు వాటికి సంస్కృతంలో ప్రథమైకవచనంలో ఎటువంటిరూపం ఉంటుందో అటువంటి రూపం తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది. రుచ్ – అనేశబ్దానికి 'రుక్' అనే ప్రథమైక వచనాంతతుల్యరూపం ప్రాతిపదిక. అలాగే స్రజ్ – అనేది 'స్రక్' అనేరూపంతో తెలుగులో ప్రాతిపదిక అవుతుంది.

**ఉగాగమద్విత్వాలు :** ఇటువంటిప్రాతిపదిక చివర ఉన్నహల్లుకు 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమమూ, ద్విత్వమూ వస్తాయి. రుక్కు, స్రక్కు. మొ.

**ప్రథమైకవచనలోపాదికం :** 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ఉగాగమాంతాలపై ప్రథమైకవచనం లోపిస్తుంది.

ఇలాగే యితరవిభక్తులలో రుక్కులు, రుక్కును ఇత్యాదిగా రూపా లవుతాయి.

**డుజాదులు:** ప్రథమైకవచనాంతతుల్యరూపంలో చివర హల్లు లేనపుడు ఉగాగమద్విత్వాల ప్రసక్తి లేదు. కాబట్టి అజంతాలకువలె యథార్హంగా ఉత్త్వడుజాదు లవుతాయి.

సుత్రామన్ శబ్దానికి తెలుగులో సుత్రామా అనేది ప్రాతిపదిక. తుదిదీర్ఘానికి హ్రస్వం వచ్చి సుత్రామ. ఇది మహత్ పుంలింగం గాబట్టి ఉత్వ డుజాదులు వస్తాయి. సుత్రాముఁడు, సుత్రాముని మొ.

కర్మ – ఇది అదంతం, నపుంసకలింగం గాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి కర్మము. ఇలాగే యితరవిభక్తులలో కర్మములు – వర్మమును మొ.

## ద్వితీయైకవచనాంతతుల్యాలు

మతుప్ ప్రత్యయాంతాలు మొద లయినశబ్దాలు మతుబాదికం అనేపేరుతో ఒకగణంగా కూర్పబడ్డాయి. 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేలక్షణా న్ననుసరించి ఈశబ్దాలకు సంస్కృతంలో ద్వితీయైకవచనంలో ఎటువంటిరూపం ఉంటుందో అటువంటిరూపం తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది.

ఇలాగే గుణవత్ అనేశబ్దానికి సంస్కృతంలో దానిద్వితీయైకవచనాంతంతో తుల్య మయిన 'గుణవంతమ్' అనేది తెలుగులో ప్రాతిపదిక మవుతుంది.

**మకారలోపం – డుజాదులు :** 'దానియంతిమమకారంబునకు లోపం బగు' ఇటువంటిప్రాతిపదికలచివర ఉన్నమకారం లోపిస్తుంది. ఈప్రాతిపదికలు మహత్తు లైనపుడు ఉత్త్వమూ, డుజు మొద లయినకార్యాలు వస్తాయి. గుణవంతుఁడు, గుణవంతునిని మొ.

అమహత్తు లయినపుడు మువర్ణకం మొద లయినఅమహత్కార్యాలు వస్తాయి. గుణవంతము, గుణవంతములు మొ.

స్త్రీ బోధింపబడేటపుడు ఆప్రాతిపదికకు ఆలుశబ్దంతో సమాసం ఏర్పడి ఉత్వ, రుగాగమాలు కలుగుతాయి. గుణవంతురాలు. స్త్రీలింగశబ్దాలకు ప్రథమైకవచనలోపం మొద లయినకార్యాలు వస్తాయి. అప్సరస.

## ఉభయాలు

'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు' ఋత్విజ్ మొద లయినకొన్నిశబ్దాలకు ఒకసారి ద్వితీయైకవచనాంతతుల్యరూపమూ, వేరొకసారి ప్రథమైక వచనాంతతుల్యరూపమూ ప్రాతిపదికగా నిలుస్తుంది. ఋత్విజ్ 1.ఋత్విజుఁడు2.ఋత్విక్కు. మొ. ఇలాగే మహత్తు లయినసకారాంతశబ్దాలకుగూడా రూపాలుంటాయి. ఊర్ధ్వరేతుఁడు – ఊర్ధ్వరేతసుఁడు మొ.

**స్త్రీలింగాలు – స్త్రీప్రత్యయాంతాలు :**

'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' స్త్రీలింగశబ్దాలు సంస్కృతంలో చెప్పబడిన ఆయాస్త్రీప్రత్యయాలతో గూడి తెలుగులో ప్రాతిపదికలుగా నిలుస్తాయి.

గుణవత్ – గుణవతీ – గుణవతి. రాజన్ – రాజ్ఞీ – రాజ్ఞి. మొ.

## భవచ్ఛత్రాదులు

'భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' భవత్, అనేమొద లయినహలంత సంస్కృతశబ్దాలు తెలుగులో ప్రయోగింపబడవు. భవద్గుణము లనేవిధంగా సమాసంలో పూర్వావయవా లయి ప్రయోగింపబడవచ్చు.

ఇంక రాజు, బ్రహ్మ – విశ్వకర్మ మొద లయిన ఆయాశబ్దాలు విశేషంగా నిరూపింపబడ్డాయి.

## 8. తకారాంతసంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానం వివరించండి.

**ప్రథమైకవచనాంతతుల్యనామాలు** : చివర తకారం గలిగినశబ్దాలు తకారాంతాలు. 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత తకారాంతాలు సాధారణంగా సంస్కృతప్రథమైకవచనాంతతుల్య రూపంతో తెలుగులో ప్రాతిపదికలుగా నిలుస్తాయి. మరుత్, వీరుత్ మొ.

**1. ఉగాగమద్విత్వాలు:** 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రం చేత ఉగాగమద్విత్వాలు వచ్చి మరుత్తు–వీరుత్తు అని అవుతుంది. దీనిమీద ప్రథమైకవచనానికి 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని లోపం వస్తుంది.

ఇతరవిభక్తులలో మరుత్తులు, వీరుత్తును ఇత్యాదిగా రూపాలు సామాన్యవిధుల ప్రకారం ఏర్పడుతాయి.

**2. తకారలోపం :** 'జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు' జగత్, ఇంద్రజిత్ అనేప్రాతిపదికలలోనితకారానికి వికల్పంగా లోపం వస్తుంది. జగ – ఇంద్రజి. లోపించినతరువాత 'జగ' అదంత మయింది కాబట్టి అదంతామహత్కార్యం అంటే ముపర్ణకాదులు కలుగుతాయి. జగము, జగమ్ము మొ. 'ఇంద్రజి' అనేది ఇకారాంతం అయింది కాబట్టి ఇకారాంత మైన హరిశబ్దానికి లాగా ప్రథమైకవచనలోపం మొ. ఆయాకార్యాలు వస్తాయి. ఇంద్రజి, ఇంద్రజిని, ఇంద్రజులు మొ.

తకారలోపం రానిపక్షంలో జగత్తు, ఇంద్రజిత్తు ఇత్యాదిగా ఉగాగమద్విత్వాలతో రూపాలు ఏర్పడతాయి.

**3. ఆనాదేశం :** 'ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాష నగు' హనుమత్ మొదల లైనవి ప్రాతిపదిక లై, అందులోనితకారానికి 'ఆన' అనేది ఆదేశం అవుతుంది. హనుమాన. వీటికి అదంతమహత్పుంలింగాలకు వలె రూపా లవుతాయి. హనుమానుఁడు, హనుమానుని మొ. ఆనాదేశం రానిపక్షంలో– హనుమంతుఁడు మొ.

**ద్వితీయైకవచనాంతతుల్యనామాలు :** 'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంత తుల్యంబులు విభాష నగు' ఇంద్రజిత్ మొ. శబ్దాలకు వికల్పంగా ద్వితీయైకవచనాంత

తుల్యరూపం ప్రాతిపదిక అవుతుంది. 'మతుప్' ప్రత్యయాంతా లయినశబ్దాలు తకారాంతాలే. బుద్ధిమత్ మొ. వీనికి 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అని ద్వితీయైకవచనాంతతుల్యరూపం ప్రాతిపదిక అవుతుంది. బుద్ధిమంతమ్.

**మకారలోపము – డుజాదులు :** 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అని చివరిమకారం లోపించి యీశబ్దాలు అదంతా లవుతాయి. ఇటువంటివి మహత్తు లయితే అదంతమహత్పుంలింగాలకు (రామ మొ.)వలె రూపాలు కలుగుతాయి. ఇంద్రజితుఁడు, బుద్ధిమంతుని మొ.

## 8. నకారాంతసంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానం వివరించండి.

**ప్రథమైకవచనాంతతుల్యనామాలు** : నకారం చివర గలిగినశబ్దాలు నకారాంతాలు. 'శ్వన్' అనేశబ్దం ఒక్కటి తప్ప మిగిలిననకారాంతశబ్దాలు అన్నీ "హలంతంబు ప్రథమైక వచనాంతతుల్యం బిందు నామం బగు" అనేసూత్రంప్రకారం ప్రథమైకవచనాంతతుల్యరూపంతో తెలుగులో ప్రాతిపదికంగా నిలుస్తాయి.

**డుజాదులు :** వీటికి చివర హ ల్లుండదు. కాబట్టి పుంలింగా (మహత్తు) లయితే అదంతాలు రామశబ్దంవలె ఉత్వమూ, డుజూ మొద లయినకార్యాలను పొందుతాయి. సుత్రామన్ – సుత్రామా – సుత్రాముఁడు, సుత్రాముని మొ. నపుంసకలింగా (అమహత్తు) లయితే మువర్ణకం వస్తుంది. కర్మన్ – కర్మ = కర్మము, కర్మమును మొ.

ఇకారాంతాదులు ప్రథమైకవచనలోపాదిక మయిన ఆయాకార్యాలను పొందుతాయి. కరిన్ – కరి = కరి. కరిని. కరులు. మొ.

**శ్వానము:** శ్వన్శబ్దం మతుబాదులలోనిది. కాబట్టి 'మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామం బగు'. 'శ్వానమ్' అనేది ప్రాతిపదిక. మకారలోపం, మువర్ణకం, శ్వానము. ఇలాగే శ్వానమును, శ్వానమునకు మొ.

**రాజు :** 'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు'. రాజన్ శబ్దానికి తెలుగులో రాజు అనేరూపం గలుగుతుంది. రాజు, రాజును, ఖగరాజు మొ. అమహత్త్వంలో 'రాజము'.

**విశ్వకర్మాదులు :** "విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' విశ్వకర్మన్, యువన్ – మొద లయినపుంలింగశబ్దాలకు స్త్రీత్వం గలుగుతుంది. కాబట్టి ఉత్త్వడుజాది పుంలింగకార్యాలు గలుగకుండా ప్రథమైకవచనలోపం మొద లయిన స్త్రీలింగకార్యా

లవుతాయి. విశ్వకర్మ – యువను – యజ్వకు మొ.

**(విశ్వకర్ముఁడు :** "విశ్వకర్ముఁ డనియు రూపంబు' అని ప్రౌఢవ్యాకర్త. విశ్వకర్మ శబ్దానికి ఒకప్పుడు స్త్రీత్వం లేకపోవటాన్ని ప్రస్తావించాడు. అప్పుడు పుంలింగకార్యాలు అంటే ఉత్త్వడుజాదులు వస్తాయి. విశ్వకర్ముఁడు, విశ్వకర్ముని మొ.)

**బ్రహ్మ :** 'మహద్వాచక మయి పుంలింగ మగుబ్రహ్మ శబ్దమునకు స్త్రీత్వం బగు' మహత్పుంలింగ మయిన బ్రహ్మన్ శబ్దానికి స్త్రీత్వం గలుగుతుంది. దానిచేత పుంలింగకార్యాలు వారింపబడి ప్రథమైకవచనలోపం మొద లయినస్త్రీలింగకార్యా లవుతాయి. బ్రహ్మ, బ్రహ్మను, మొ. అమహ త్తయినపుడు స్త్రీత్వం గలుగదు గాబట్టి మువర్ణకాదులు గలుగుతాయి. బ్రహ్మము, బ్రహ్మమును – మొ. ఇది తత్త్వ, తపో, వేద, యోగాలను బోధిస్తుంది.

**ఆత్మాదులు :** 'ఆత్మేమనిజంతంబులకు నాంతము లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' ఆత్మన్‌శబ్దానికి, ఇమనిచ్ – (ఇమన్) ప్రత్యయాంతాలకు, మనుష్యులకు పేర్లు అయిన నకారాంతశబ్దాలకు స్త్రీత్వం బహుళంగా వస్తుంది.

స్త్రీత్వం వచ్చినపుడు స్త్రీలింగకార్యా లవుతాయి. ఆత్మన్– ఆత్మా, ఆత్మ, ఆత్మను, ఆత్మలు మొ. స్త్రీత్వం కలుగనిపక్షంలో మహ త్తయితే మహత్ (పుంలింగ) కార్యాలు కలుగుతాయి. ఆత్ముఁడు, ఆత్ముని మొ. అమహత్తు లయితే అమహత్‌కార్యాలూ గలుగుతాయి. ఆత్మము.మొ. ఇలాగే గరిమ–గరిమము. దేవశర్మ – దేవశర్ముఁడు

సుధన్వుఁడు మొద లయినవాటికి స్త్రీత్వం లేదు.

**స్త్రీలింగాలు–స్త్రీప్రత్యయాంతాలు:** 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' నకారాంతస్త్రీలింగశబ్దాలు స్త్రీప్రత్యయంతో గూడి తెలుగులో ప్రాతిపదిక లవుతాయి.వాటికి ఇకారాంతాలకువలె ఆయాకార్యా లవుతాయి. రాజన్ – రాజ్ఞీ – రాజ్ఞి, రాజ్ఞులు మొ.

## 9. సకారాంతసంస్కృతశబ్దాలు తత్సమా లయ్యేవిధానాన్ని వివరించండి.

సకారం చివర గలిగినశబ్దాలు సకారాంతాలు. ఇవి మతుబాదులలో చేరవు. కాబట్టి 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని సకారాంతశబ్దాలకు ప్రథమైకవచనాంతతుల్యరూపం ప్రాతిపదిక కావాలి. కాని –

**సంస్కృతప్రాతిపదికలే :** 'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగ నగు' నని సకారలోపాన్ని జెప్పినసామర్థ్యంచేత సకారాంతం

సంస్కృతప్రాతిపదికమె తెలుగులోనూ ప్రాతిపదికగా నిలుస్తుం దని గ్రహించాలి.

**అప్సరస :** 'అప్సరస్ శబ్దం మతుబాదులలోది. కాబట్టి 'మతుబాదికంబు...' అనే సూత్రంచేత ద్వితీయైకవచనాంతతుల్య మయిన 'అప్సరసమ్' అనేరూపం ప్రాతిపదికం. తుదిమకారం లోపించి, స్త్రీలింగం గాబట్టి ప్రథమైకవచనలోపాది స్త్రీలింగకార్యాలను పొందుతాయి. అప్సరస – అప్సరసలు మొ. దీనికి "అప్సర – అప్సరలు అనేరీతిరూపాలు ఉంటాయి.

## అమహత్తులు

**సలోపం:** 'సాంతంబులతుదికారంబునకు లోపంబు బహుళంబుగా నగు' సాంతాల చివరిసకారం బహుళంగా లోపిస్తుంది. సకారం లోపించి అజంతంగా మాఱినయీశబ్దాలకు అజంతాలకువలెనె కార్యా లవుతాయి.

ఉరస్ – ఉర. సలోపానంతరం అదంత మయింది. కాబట్టి మువర్ణ కాదు లవుతాయి. ఉరము, ఉరములు మొ. ఇట్లే అర్చిస్ – అర్చి. ఇకారాంతాలకువలె ప్రథమైకవచనలోపం. అర్చులు, అర్చిని మొ. ధనుస్ – ధను, ఇది ఉదంతం కావటంచేత వువర్ణ కాదు లవుతాయి. ధనువు, ధనువును మొ.

**సలోపాభావపక్షం – ఉగాగమద్విత్వాలు :** సకారం లోపింపనిపక్షంలో 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అని ఉగాగమద్విత్వాలు వస్తాయి. ఈపక్షంలో 'ఇగ్లొ' సూత్రంచేత ప్రథమైకవచనం లోపిస్తుంది. ఉరస్సు – అర్చిస్సు – ఆయుస్సు.

**మనఃప్రభృతులు – వైకల్పికద్విత్వం :** 'మనఃప్రభృతులతుదిసకారంబునకు ద్విత్వంబు విభాష నగు' మనస్ మొద లయినవానిలోని సకారానికి ఉగాగమం నిత్యమె. కాని ద్విత్వం మాత్రం వికల్పం. మనస్సు – మనసు.

**పయఃప్రభృతులు – సలోపాభావం :** 'సాంతంబుల... అనేసూత్రంలోని బహుళ శబ్దంచేత పయస్– మొద లయినశబ్దాలలోని సకారానికి లోపం రాదు. పయస్సు – వయస్సు. మొ. ఇక్కడ పయము, వయము అనేరీతిగా సకారం లోపించినరూపా లుండవు.

## మహత్తులు

**సలోపం:** 'మహద్వాచకంబు లగుసాంతంబుల కంతలోపం బేని ద్వితీయైక వచనాంతతుల్యత్వం బే నగు' సకారాంతా లయినశబ్దాలు మహత్తు లయితే ఒకపక్షంలో చివర ఉన్న సకారం లోపించి ఉత్త్వమూ, డుజూ మొద లయిన కార్యా

లవుతాయి. అంగిరస్ – అంగిర = అంగిరుఁడు – అంగిరుని మొ.

**ద్వితీయైకవచనాంతతుల్యనామం :** మరోపక్షంలో వీటికి సంస్కృతంలోని ద్వితీయైకవచనాంతంతో తుల్య మయినరూపం ప్రాతిపదికగా నిలుస్తుంది. అంగిరసమ్, ఊర్ధ్వరేతసమ్ – మొ. దానియంతిమమకారము లోపించి, ఉత్త్వమూ, డుజూ మొద లయినకార్యా లవుతాయి. అంగిరసుడు, ఊర్ధ్వరేతసుని – మొ.

**సలోపస్త్రీవద్భావాలు :** 'వేధ పురోధ పురోధసుఁడు' 'వేధస్' అనేశబ్దానికి నిత్యంగా సకారం లోపించి స్త్రీవద్భావం గలుగుతుంది. స్త్రీవద్భావంచేత ఉత్త్వడుజాదు లయినపుంలింగ కార్యాలు గలుగక ప్రథమైకవచనలోపం మొద లయినస్త్రీలింగకార్యా లవుతాయి. వేధ – వేధను మొ.

పురోధస్ శబ్దంలో సకారలోపమూ, స్త్రీవద్భావమూ వికల్పంగా వస్తాయి. వచ్చినపక్షంలో స్త్రీలింగకార్యాలతో పురోధ, పురోధను, అనేరీతిగా అవుతుంది. సలోపస్త్రీవద్భావాలు లేనిపక్షంలో ద్వితీయైకవచనాంతతుల్యత, పుంలింగకార్యాలు అంటే ఉత్త్వడుజాదులు కలుగుతాయి. పురోధసమ్ – పురోధస, పురోధసుఁడు.

**స్త్రీలింగాలు – స్త్రీప్రత్యయాంతాలు:** 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీ ప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' స్త్రీలింగశబ్దాలు స్త్రీప్రత్యయాలతోఁ గూడి వస్తాయి. విద్వస్ – విదుషీ – విదుషి – మొ.

# ఆచ్ఛికపరిచ్ఛేదం

## 1. బహువచనం పరంగా ఉన్నపుడు ఆచ్ఛికశబ్దాలలో వచ్చే మార్పులనుగూర్చి వివరించండి.

### బహువచనం పర మయినపుడు కలిగేమార్పులు

ప్రాతిపదికలకు అన్నింటికీ ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అని 'లు'ప్రత్యయం వస్తుంది. ద్వితీయ మొద లయినవిభక్తులలో 'బహుత్వంబున ద్వితీయాది విభక్తులకు లడాగమం బగు' అని 'ల' వర్ణం వస్తుంది. ఇవి పర మయినపుడు అచ్చతెనుగు ప్రాతిపదికలో వివిధఆదేశాలు మొ. మార్పులు కలుగుతున్నాయి.

**1. ఉత్వం :** 'ఇత్తునకు బహువచనము పరం బగునపు దుత్త్వం బగు' ప్రాతిపదికం చివరిహ్రస్వ మయినఇకారానికి ఉత్త్వం వస్తుంది. తండ్రి+లు – తండ్రులు. తండ్రులను మొ. తత్సమాలలో హరి – హరులు. మొ. దీర్ఘానికి(ఈ) ఉత్వం రాదు. తేజీలు.

'వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు బహువచనము పరం బగునపు దుత్వం బగు' వానిఉపోత్తమ మైనఇత్వానికి ఉత్వం వస్తుంది. కలికి + లు – కలుకి + లు = కలుకులు.

**2. కుజు :** 'కలన్వాదులనువర్ణంబు కు జగు. బహువచనము పరం బగునపుడు నిత్యముగా నగు' కలను మొద లయినవాటిలోని చివరినువర్ణానికి, 'కుజ్' అనేది ఆదేశంగా వస్తుంది. మ్రాను + లు = మ్రాఁకులు మొ.

**3. గుజు :** 'అట్లు రేనుగోనుశబ్దంబులనువర్ణంబు గుజగు' రేను, గోను అనేశబ్దాలలోని నువర్ణం స్థానంలో 'గుజ్' వస్తుంది. రేనులు+లు = రేఁగులు మొ.

**4. అలఘులకారం:** 'బహువచనము పరం బగునపు దసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలరల కలఘులకారంబు బహుళంబుగా నగు' డులురులలోని హల్లుకు బహుళంగా అలఘు వయినళకారం వస్తుంది. త్రాడు +లు = త్రాళులు; ఏరు + లు = ఏళులు; పాలు + లు = పాళులు.

'బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకారలకారంబుల కలఘు లకారంబు నిత్యంబుగ నగు' స్వరం లోపించటంచేత బహువచనలకారంతో కలిసిన డకారానికీ, లకారానికీ అలఘు వయినళకారం నిత్యంగా వస్తుంది. త్రాడులు – త్రాడ్లు = త్రాళ్ళు, పాలులు – పాల్లు = పాళ్ళు మొ.

**5. ండు :** 'ఔపవిభక్తి కంబులలివర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' కొడవలి, విల్లు మొద లయినవాటిలోని, లి – ల్లు వర్ణాలకు 'ండు' ఆదేశంగా వస్తుంది. కొడవలి+లు = కొడవండులు; విల్లు+ లు = విండులు మొ.

**6. తి :** గోతులు మొ. చోట్ల ఔపవిభక్తిక మయిన తివర్ణం ఆదేశం.

**7. ండ్**: 'ఆల్వాదులబహువచనలకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు'. బహువచన లకారానికి రేఫ రావటంతోపాటు ముందున్న ఆలు మొద లయినశబ్దాలలోనిలువర్ణం స్థానంలో 'ండ్' అనేది ఆదేశ మవుతుంది. ఆలు + లు = ఆండ్రు, కోడలు + లు = కోడండ్రు.

**8. ఉత్వలోపం** : 'బహువచనము పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' – డలటరలమీది ఉత్వం లోపిస్తుంది. విండులు – విండ్లు, పాలు + లు – పాల్లు = పాళ్ళు, చెట్టులు – చెట్లు, పేరులు–పేర్లు మొ.

**9. అంతిమాక్షరలోపం:** 'బహువచనంబు పరం బగునపుడు చేను పేనుమీనుశబ్దంబుల నువర్ణంబు లోపించు'. చేను + లు = చేలు మొ.

'బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు' రేయి మొద లయినవాటిలో చివరిఅక్షరం లోపిస్తుంది. రేయి +లు = రేలు మొ.

'బహువచనంబు పరం బగునపు డావుప్రభృతులతుదియక్షరంబునకు లోపంబు విభాష నగు' ఆవులు – ఆలు మొ.

## 2. ఆచ్ఛికశబ్దాలలో బహువచనానికి గలిగేమార్పులు తెలపండి.

**లఘురేఫం :** 'పగతాదులబహువచనలకారంబునకు రేఫం బగు' పగత మొద లయిన ఆచ్ఛికశబ్దాలకు పైనున్న బహువచనలకారానికి రేఫం వస్తుంది. పగత +లు – పగతురు మొ. ('అదంతం బయి దీర్ఘపూర్వలోపధం బయిన మహత్తు మీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు'. కొన్నిచోట్ల తత్సమప్రాతిపదికలపైని బహువచనలకారానికి రేఫ వస్తుంది. బాల + లు బాలురు మొ. దయాళురు, మల్లురు అని గూడా ఉన్నాయి.)

**అలఘురేఫ: '**చెయువుబహువచనలకారంబున కలఘురేఫంబు విభాష నగు' చెయువు శబ్దంమీదిబహువచనలకారానికి శకటరేఫ ఆదేశ మవుతుంది. చెయువుఱు (చెయువులు).

'కాప్రత్యయంబుమీఁదిబహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులును లఘురేఫంబునకు ముందు బిందుపూర్వకడకారంబు నగు' కాప్రత్యయం మీద అలఘు రేఫ ఆదేశ మవుతుంది. విలుకాఱు.

**'ండ్' పూర్వాగమం :** పయిసూత్రంచేత బహువచనలకారానికి రేఫతోపాటు ముందు 'ండ్' అను ఆగమం కూడా ఒకపక్షంలో వస్తుంది. విలుకాండ్రు.

'కొన్నిడుమంతంబులబహువచనలకారంబునకు రేఫంబును దానికి ముందు పూర్ణబిందు పూర్వకడకారంబు నగు' గండ మొద లయినవానిపై బహువచనలకారానికి రేఫాదేశం వచ్చి దానికి పూర్వంలో 'ండ్' అనేది ఆగమ మవుతుంది. గండ + లు= గండండ్రు మొ.

**డుజ్ పూర్వాగమం :** 'ఱేప్రభృతులబహువచనమునకు ముందు డు జగు' ఱే మొద లయినవాటి మీదిలులలకు పూర్వంలో డుజ్ అనేది వచ్చి చేరుతుంది. ఱే + లు – ఱే + డులు = ఱేఁడులు, ఱేండ్లు.

### 3. ఔపవిభక్తికాలను వివరించండి :

**ఔపవిభక్తికాలు: '**ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు' బాలవ్యాకరణంలో ఆచ్ఛికపరిచ్ఛేదంలో చెప్పిన 'ఇ – టి – తి' అనేవర్ణాలు మూడింటికి ఔపవిభక్తికా లని సంజ్ఞ. విభక్తులకు సమీపంలో వచ్చేవి కాబట్టి ఉపవిభక్తులు. అవే ఔపవిభక్తికాలు. అని యీసంజ్ఞ కర్థం చెప్తారు. ఔపవిభక్తికాలు చేరటానికి అర్హ మైనప్రాతిపదికలను గూడ ఔపవిభక్తికా లని వ్యవహరిస్తారు.

**ఔపవిభక్తికస్థలాలు:** 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు' 'ఔపవిభక్తికాలు ద్వితీయలో రా వని 'తెలుగువ్యాకరణం' చెప్పింది. కాని అది సరి కాదు. ద్వితీయ మొదలుకొని అన్నివిభక్తులలోనూ ఏకవచనం పరంగా ఉన్నపుడు కొన్ని అచ్చతెనుగుశబ్దాలకు వస్తాయి. సప్తమీఏకవచన మయిన 'న'వర్ణకం పర మయినపుడు మాత్రం ఔపవిభక్తికాలు రావు. పేరున, త్రాడున మొ ఇవి ఆచ్ఛికాలలో స్త్రీసమాలకు మాత్రమే కన్పిస్తున్నాయి. ఇవి సాధారణంగా అప్రాణివాచక శబ్దాలకు వస్తాయి. తోఁడేటికి, కుందేటికొమ్ము, లేటిపిండు మొ. ప్రాణివాచకాలపై అరుదుగా కనిపిస్తున్నాయి.

ఈఔపవిభక్తికాలు చేరేశబ్దాలకు గూడ ఒక్కొక్కసారి ఇవి రాకపోవటం ఉన్నది. నెత్తురుటేరులు. ఇల్లాలు మొ. ఒకే శబ్దానికి పర్యాయమున రెండు ఔపవిభక్తికాలు రావటం ఉన్నది. గోరిని – గోటిని మొ. విభక్తిని నిమిత్తంగా జేసికొని యిది

ప్రాతిపదికలకు చివర ఆగమంగానూ, చివరిఅక్షరానికి ఆదేశంగానూ వస్తుంది.

ఆగమం – తి – అటితిని. ఆదేశం – ఇ – ఊరిని మొ.

**ఇవర్ణం :** ఇది ఆదేశంగా మాత్రమె అవుతుంది. 'ఊరు మొద లగువాని కిత్వం బగు' ఊరు మొద లయినశబ్దాలలో చివరివర్ణానికి ఆదేశంగా 'ఇ' అనే ఔపవిభక్తికం వస్తుంది. ఊరు–ఊరిని, చేను– చేనికి, మొ.

**టివర్ణం:** 'టివర్ణంబు గొన్నింటియంతాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంతాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు' టివర్ణం కొన్నిశబ్దాలచివరిఅక్షరానికి ఆదేశంగా వస్తుంది. నోరు – నోటిని, త్రాడు – త్రాటికి మొ. కొన్ని శబ్దాలకు చివర ఆగమంగా వస్తుంది. అన్ని – అన్నిటిని, వేయి – వేయిటిని మొ. కొన్నిశబ్దాలకు ఒకసారి చివరిఅక్షరానికి అదేశంగానూ, మఱొకసారి చివర ఆగమంగానూ వస్తుంది. రెండు – రెంటిని – రెండింటిని మొ.

**తివర్ణం :** తివర్ణం కొన్నిటి కాగమంగానూ, కొన్నిటి కాదేశంగానూ వస్తున్నది. 'అఱ్ఱు మొద లగుశబ్దంబుల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు' అఱ్ఱు మొద లయినశబ్దాలకు తివర్ణం ఆగమ మవుతుంది. అపు డొకరేఫ లోపిస్తుంది. ముందరిఉత్వానికి ఇత్వం వస్తుంది. అఱ్ఱు – అఱితిని మొ.

'విభక్తి పరం బగునపుడు గోయిప్రభృతులతుదియక్షరంబు తివర్ణం బగు' ప్రథమా బహువచనం మొదలుకొని అన్నివిభక్తివచనాలలోనూ గోయి మొద లైనశబ్దాలలోని చివరిఅక్షరానికి తివర్ణం ఆదేశంగా వస్తుంది. గోతులు – చేతిని మొ.

**ఔపవిభక్తికాలు – అత్వం :** 'ఔపవిభక్తికంబులతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' 'ఔపవిభక్తికశబ్దాలకు పైనున్న తృతీయాసప్తమీ విభక్తులస్థానంలో అత్త్వం ఆదేశంగా బహుళంగా వస్తుంది. గోరను – గోరిచేత, గోటను–గోటియందు.

('ఊరుచోటుమేన్వాదు లున్లుగ్విషయంబులు' అని ప్రౌఢవ్యాకర్త ఊరు మొద లయినవాటికి పైన అత్వం రా దనీ, సప్తమీనవర్ణకం పర మవుతుండగా 'ఉన్' లోపం వస్తుం దనీ చెప్పాడు. ఊరునన్ – ఊరన్. ఇట్లే చోటన్ – మేనన్ మొ.)

### 4. ఔపవిభక్తికాలు పర మైనపుడు ప్రాతిపదికకు వచ్చేమార్పులను గూర్చి పేర్కొనండి.

టి,తి అనేఔపవిభక్తికాలు పర మయినపుడు ప్రాతిపదికకు చివర కొన్ని వర్ణవికారాలు కన్పిస్తున్నాయి.

**బిందువు :** 'హ్రస్వముమీఁదిటివర్ణమునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు' టి అనే ఔపవిభక్తికం హ్రస్వంపైన ఉన్నపుడు దానికి ముందు బహుళంగా పూర్ణబిందువు వస్తుంది. అన్నిటిని, అన్నింటిని మొ. క్రిందటికి ఇత్యాదులలో హ్రస్వంమీద ఉన్నా బిందువు లేదు.

'పదాద్యం బగుహ్రస్వంబుమీఁదిటివర్ణంబునకు ముందు పూర్ణబిందు వగు' పదం మొదటిహ్రస్వంమీద ఉన్నటివర్ణానికి పూర్వంలో పూర్ణబిందువు నిత్యంగా వస్తుంది. కన్ను - కంటిని, ఇల్లు - ఇంటికి మొ.

**అత్త్వం :** 'టివర్ణంబు పరం బగునపుడు క్రిందుమీఁదుముందు పువర్ణంబుల కత్త్వం బగు' క్రింది మొద లయినశబ్దాలకు టివర్ణం పర మయినపుడు తుదిఉత్వానికి అత్వం వస్తుంది. క్రిందటిని - (మాపు) మాపటికి - మొ.

**ఇత్వం :** 'టితివర్ణంబులు పరంబు లగునపు డుత్వంబున కిత్వం బగు' - టి, తి అనుఔపవిభక్తికాలు పర మవుతుండగా వాటికి పూర్వంలో ఉన్నఉత్వానికి ఇత్వం వస్తుంది. రెండు-రెండింటిని. అఱ్ఱు - అఱితికి. ఈ ఇత్వం కొన్నిచోట్ల కనిపింపదు. నెత్తురు- నెత్తుటికి.

అఱుత, అనేచోట తివర్ణానికి పైన తృతీయాసప్తముల కత్వ మయినపుడు ముందు ఉత్వమె కన్పిస్తున్నది. 'తి' పరకతలో ఇత్వం రాగా (అఱితితోడ - వఱితియందు) తృతీయాసప్తముల కత్వ మైనపు డాసూత్రంలోని బహుళశబ్దంచేత ముందరి ఇత్వానికి ఉత్వం వస్తుంది.

# కారకపరిచ్ఛేదం

## 1. ప్రథమావిభక్తి ఏ ఏ అర్థాలలో వస్తుందో వివరించండి.

'విభక్తి శ్చ' అనేసంస్కృతలక్షణాన్నిబట్టి ప్రాతిపదికలపై విధింపబడిన డుమువులు మొద లైన ప్రత్యయాలకూ, ధాతువులపై విధింపబడిన డుజ్, రు మొద లైన ప్రత్యయాలకూ విభక్తులు అని సంజ్ఞ. ప్రాతిపదికలపై వచ్చేవిభక్తులు ప్రథమ, ద్వితీయ మొదలుగా ఏడు. ఈవిభక్తులు ఆయాఅర్థాలలో విధింపబడ్డాయి. అందులో ప్రథమావిభక్తి వచ్చేఅర్థాలను ఇలా గమనింపవచ్చు.

'డు ము వు లు ప్రథమ' డు,ము,వు,లు – అనేనాలుగు ప్రత్యయాలకు ప్రథమావిభక్తు లని సంజ్ఞ. వీటిలో డు, ము, వు, అనేవి మూడు ఏకవచనాలు. లు అనేది బహువచనం. రాముడు (ఒక్కడు) రాములు(అనేకులు).

'ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' ప్రాతిపదికార్థం, సంబోధనార్థం, ఉక్తార్థం అనే మూడు అర్థాలలో ప్రాతిపదికపై ప్రథమావిభక్తి వస్తుంది.

**1. ప్రాతిపదికార్థం** : నియతోపస్థితికము ప్రాతిపదికార్థము.

రాముడు, వనము, ధేనువులు.

**2. సంబోధనార్థం** : సంబోధనం అంటే అభిముఖంగా చేసికోవడం. ఓరాముడ

**3. ఉక్తార్థం** : ఉక్తం అంటే చెప్పబడింది. క్రియావిభక్తిచేత కర్త మొద లయిన వాటిలో ఏది చెప్పబడితే దానికి ప్రథమావిభక్తి వస్తుంది.

రాముడు రావణుని సంహరించెను, ఇక్కడ కర్త అయిన రామశబ్దానికి ప్రథమ. రామునిచేత రావణుడు సంహరింపబడెను, ఇక్కడ కర్మ అయినరావణశబ్దానికిప్రథమ.

**4. భావార్థకాదియోగం :** 'భావార్థకాదియోగంబున గర్తకుం బ్రథమ యగు' భావార్థకం మొద లయినవాటితో అన్వయం ఉన్నపుడు కర్తకు ప్రథమావిభక్తి వస్తుంది. రాముడు వచ్చుట, రాముడు రాగా, మొ.

**5. కాలాధ్వములు :** 'కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమ యగు' కాల వాచకాలకూ, అధ్వ (మార్గ) వాచకాలకూ తఱుచుగా ప్రథమావిభక్తి వస్తుంది. కాలం : నిన్న పోయెను. కాలవాచక మైన నిన్నశబ్దానికి ప్రథమ. అధ్వం : క్రోశము నడచిరి. మార్గం అంటే దూరాన్ని తెలియజేస్తున్న క్రోశశబ్దానికి ప్రథమ వచ్చింది.

## 2. తృతీయావిభక్తి వచ్చేసందర్భాలను పేర్కొనండి.

చేత తోడ తృతీయ. 'చేత తోడ లోపల వర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు' అనేసూత్రంచేత మొదటిఅక్షరం మాత్రమే మిగిలినవి అయి, చే, తో, అని కూడా ఉంటాయి. 'ఒకానొకచోఁ దోడుకుఁ దోడుత నని రూపాంతరంబును గలదు' అని ప్రౌఢవ్యాకర్త తోడకు 'తోడుత' అనేరూపాన్ని పేర్కొన్నాడు. ప్రాణముతోడుత. 'జడపదంబులమీఁదితోడకు మెయి మైలు విభాష నగు' అని ప్రౌఢవ్యాకర్త కొన్నిచోట్ల తోడ స్థానంలో మెయి, మై అనేవి రావడాన్ని పేర్కొన్నాడు. ఆర్థిమెయిన్, అర్థిమైన్. ఇవి ఏకత్వబహుత్వాలు రెండింట్లోనూ వస్తాయి.

**1. చేత (చే) :**

**1. కర్త్రర్థం :** 'చేతవర్ణకంబు కర్త కగు'

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త. రామునిచేత చంపఁబడెను. మొ.

**2. హేతువు :** 'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు'.

ఫలసాధనయోగ్యం బగుపదార్థము హేతువు. 'విద్యచేత' యశంబు గలుగు'.

**3. కరణం :** పయిసూత్రంచేతనే చేతవర్ణకం వస్తుంది.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. 'కోలచేత కూల్చె.

**4. గ్రహ్యాదియోగం :** కొను, విను మొద లయినవాటితోటియోగంలో 'చేత' వస్తుంది. రాజులచేత కప్పంబు గొనియె.

**2. తోడ (తో) :**

**1. కరణం :** కరణహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' కరణానికి – తోడ. కోలతోడఁ గూల్చె.

**2. సహార్థయోగం** : పయిసూత్రంచేతనే, సహ (కూడ) అర్థయోగంలో తోడ విభక్తి వస్తుంది. రాజు 'సేనలతోడ' వచ్చె.

**3. తుల్యార్థయోగం :** తుల్యార్థంతోటియోగంలో తోడ పయిసూత్రంచేతనే వస్తుంది. 'చైత్రునితోడ' మైత్రుండు తుల్యుండు.

**4. అముఖ్యకర్మ :** 'వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకువర్ణకంబులు ప్రాయికంబుగా నగు' అను, పలుకు, మొ. ధాతువులఅముఖ్యకర్మకు తోడ వస్తుంది.

మైత్రుండు 'చైత్రునితోడ' ని ట్లనియె.

**5. ఉపయోగం :** 'ఉపయోగంబునం దాఖ్యాతకు దోడ వర్ణకం బగు' నియమపూర్వక విద్యాస్వీకారంబు ఉపయోగంబు. గురువును తెలిపేశబ్దానికి తోడ వస్తుంది. రామకృష్ణులు 'సాందీపనితోడ' వేదంబులు చదివిరి.

## 3. పంచమీవిభక్తి వచ్చేసందర్భాలను పేర్కొనండి.

'వలన కంటె పట్టి పంచమి' వలన, కంటె, పట్టి అనేవి మూడు పంచమీవిభక్తులు.

### వలన

**1. అపాదానం :** 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలన వర్ణకం బగు' అపాయం, (ఎడబాటు) మొద లయినవి దేనినుంచి కలుగుతాయో దానిని తెలియజేసేశబ్దానికి వలన అనే పంచమీ విభక్తి ప్రత్యయం వస్తుంది. 'రాజ్యమువలన' భ్రష్టు డయ్యె. మొ.

ఇంకా, హేతువు మొద లయినఅర్థాలలో వలన ప్రత్యయం వస్తుంది.

**2. హేతువు:** 'విద్యవలన' (విద్యచేత) యశంబు గలుగు.

నీవు 'వచ్చుటవలన' ధన్యుడ నయితి.

**3. ఉపయోగం:** 'సాందీపనివలన' జదివిరి. మొ

### కంటె

**1. అన్యార్థాదియోగం:** 'కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు' అన్యం, ఇతరం, మొద లైన అర్థాలతోటి అన్వయం ఉంటే ఆఅన్వయం కలిగినశబ్దానికి కంటె అనే పంచమీ ప్రత్యయం వస్తుంది. 'రామునికంటె' నన్యుండు ధానుష్కుండు లేడు.

**2. నిర్ధారణం :** 'కంటె వర్ణకంబు నిర్ధారణపంచమి కగు' జాతి, గుణం, క్రియ, సంజ్ఞ అనేవాటినిబట్టి ఒకదానినుంచి వేరొకదానిని నిర్ధారించి చెప్పేటప్పుడు దేనినుంచి నిర్ధారింప బడుతున్నదో ఆశబ్దానికి కంటె ప్రత్యయం వస్తుంది. 'జానపదులకంటె' నాగరులు వివేకులు.

### పట్టి

**హేతువు :** 'పట్టి వర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు' గుణం, లేదా క్రియ హేతు వయితే దానిని తెలియజేసే (గుణ, క్రియా వాచక) శబ్దానికి పట్టి అనే

పంచమీవిభక్తి ప్రత్యయం వస్తుంది. జ్ఞానమునుబట్టి ముక్తు డగు. మొ.

'కొన్నియెడల హేతువునం దన్నంతక్రియలమీదను బట్టి వర్ణకంబు విభాష నగు' అని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు. అవ్యయం అయిననుబ్యంతంమీద పట్టి ప్రత్యయం కొన్నిచోట్ల వస్తుంది. 'కలుగంగఁబట్టి'

## 4. షష్ఠీవిభక్తి వచ్చేసందర్భాలను పేర్కొనండి.

'కు యొక్క లోపల షష్ఠి' షష్ఠిలో కు, యొక్క, లోపల అనేవి విభక్తిప్రత్యయాలు. 'లోపల' అనేది ఆద్యక్షరశేష మై 'లో' అని కూడా ఉంటుంది.

**- కు -**

**1. అముఖ్యకర్మం :** 'వచ్యర్థాముఖ్యకర్మంబునకు దోడ కు వర్ణకంబులు ప్రాయికంబుగ నగు' అను, పలుకు, మొద లైనక్రియల అముఖ్యకర్మకు 'కు' ప్రత్యయం వస్తుంది.

చైత్రుండు మైత్రుని కి ట్లనియె.

**వీప్స, కాలపరిమితి :** 'వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకం బగు' అని ప్రౌఢవ్యాకర్త పేర్కొన్నాడు.

వీప్సలో - 'గ్రామానికి గ్రామానికి' నరిగి. కాలపరిమితి- 'రేపటికి' వచ్చును.

**2. ఇతరవిభక్త్యర్థాలు:** 'షష్ఠీస్థానికం బగు కు వర్ణకం బొక్కొక్కచో ద్వితీయాది విభక్తులకు మాఱుగా దత్తదర్థంబులం జూపట్టెడి'

1. తుల్యార్థయోగంలో - చైత్రునకు మైత్రుండు తుల్యుండు (చైత్రునితో - తృతీయకు)
2. సంప్రదానంలో - రామునకు గన్య నిచ్చెను. (రామునికొఱకు - చతుర్థికి)
3. ఉద్దేశమాత్రంలో - పురుషార్థమునకు యత్నింపవలె. (పురుషార్థముకొఱకు - చతుర్థికి)
4. అపాదానంలో -చోరునకు భయపడె. (చోరునివలన - పంచమికి)
5. అన్యార్థాదియోగంలో - రామునకు నన్యంబు దైవంబు లేదు. (రామునికంటె - పంచమికి)
6. సంబంధంలో - నాకు తమ్ముడు (నాయొక్క - యొక్క షష్ఠికి)

**యొక్క**

**శేషం :** 'శేషషష్ఠికి యొక్కయు నగు' శేషం బనగా సంబంధంబు. సంబంధార్థంలో

సంబంధిపదానికి యొక్క అనేషష్ఠీవిభక్తి వస్తుంది. 'నాయొక్క' తమ్ముడు.

దీనికి అర్థవిశేషాలు కూడా ఉన్నా యంటారు. పట్టుపుట్టము(యొక్క)వాడు. పట్టుపుట్టము – కలవాడు. మొ.

### లోపల

**నిర్ధారణం :** 'నిర్ధారణషష్ఠికి లోపల వర్ణకం బగు' జాతి, గుణం, ద్రవ్యం, క్రియ, సంజ్ఞ అనేవాటినిబట్టి సముదాయంనుంచి ఏకదేశానికి పృథక్కరణం నిర్ధారణం.

'గోవులలోపల' కపిల బహుక్షీర. మొ.

ఇది అధికరణార్థంలోనూ వస్తుంది. ధరణిలోపల – ధరణియందు.

## 5. ఒకవిభక్తికి మఱి యొకవిభక్తి వచ్చేసందర్భాలను పేర్కొనండి.

తెలుగులో ఆయాఅర్థాలలో విధింపబడిన ఆయావిభక్తులకు మాఱుగా వేఱొకవిభక్తి రావటం కొన్నిచోట్ల కనబడుతున్నది.

### ప్రథమ

**1. ద్వితీయకు :** 'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' జడవాచకాలకు పైన ఉన్నద్వితీయకు మాఱుగా ప్రథమావిభక్తి వస్తుంది.'పూవులు' దెచ్చె (పూవులను దెచ్చె).

('కొన్నియెడల నజడంబు ద్వితీయకును ప్రథమ కానంబడియెడి' అని ప్రౌఢవ్యాకర్త జడాలు గానిశబ్దాలపైన గూడా పయి కార్యాన్ని అంగీకరించాడు. అమ్మదనాగ మెదిర్చి (మదనాగమును ఎదిర్చి. మదనాగము – ఏనుగు – తిర్యక్కు)

**2. తృతీయకు :** 'ఒకానొకచో నొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' – అనేసూత్రంచేత సహార్థంలో వచ్చిన తృతీయ(తోడ)కు ప్రథమ రావటం ఉన్నది. సుఖ మున్నారు. (సుఖముతో నున్నారు.)

**3. సప్తమికి :** 'ఒక్కొకచో జడంబుసప్తమికిం బ్రథమయు నగు' అని ప్రౌఢవ్యాకర్త జడాలపైన సప్తమికి ప్రథమ చెప్పాడు. 'తీర్థ మాడి' (తీర్థమం దాడి)

### ద్వితీయ

**1. తృతీయాసప్తములకు :** 'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' జడవాచకాలకు పైన ఉన్నతృతీయకూ, సప్తమికీ ద్వితీయ వస్తుంది. 'కోలం' గూల నేసె – కోలచేత (తోడ) కూల నేసె. 'లంకను కలకలంబు (లంకయందు కలకలంబు) మొ.

(ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'కొన్నియెడల నజడంబు తృతీయాసప్తములకును బహుత్వంబున ద్వితీయ చూపట్టెడి' అని సూత్రించాడు. 'చక్రవాకముల' నలరు (చక్రవాకములతో నలరు.) 'మనుజుల' విప్రుండు మనుజులందు విప్రుండు.)

**2. పంచమికి :** 'ఒకానొకవిభక్తికి మఱి యొకవిభక్తియు నగు' అని వలనపంచమికి కొన్నిచోట్ల ద్వితీయ వస్తుంది. 'గృహమును' వెడలెను (గృహమువలన వెడలెను)

**(3. షష్ఠికి** : 'క్రియాన్వయంబున రెండుపదంబులకు స్వస్వామిసంబంధము గలచో సంబంధిపదంబుషష్ఠికి ద్వితీయ యగు' అని ప్రౌఢవ్యాకర్త ద్వితీయ కొన్నిచోట్ల షష్ఠికి రావటాన్ని పేర్కొన్నాడు. నన్ను చెట్టపట్టినన్ (నాయొక్క చెట్టపట్టినన్) మొ)

తృతీయ, చతుర్థి, పంచమీ విభక్తులు వేరొకదానికి రావటం కనబడదు.

**(షష్ఠి :** ప్రథమకు యొక్క : 'ధాతుజవిశేషణభావార్థకపూర్వ వ్యవహితావ్యవహిత కర్తృపదప్రథమకు యొక్క షష్ఠియు నగు' అనే ప్రౌఢవ్యాకరణలక్షణంచేత ప్రథమకు యొక్క అనేషష్ఠీవిభక్తి వస్తుంది. మాపఠింపనిశాస్త్రము (మేము పఠింపనిశాస్త్రము.)

## సప్తమి

**తృతీయకు :** 'ఉదంతజడంబుతృతీయకు నవర్ణకం బగు' ఉకారాంతా లయినజడం పైన ఉన్న తృతీయకు 'న' అనే సప్తమి వస్తుంది. 'బాణమున' కూల్చెను. (బాణముతో కూల్చెను.)

ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'ఒక్కచో నుదంతం బగునజడంబు తృతీయకును నవర్ణకంబు గానంబడియెడి' అని అజడాలపై కూడా చెప్పాడు. 'ఏనుగున ఏనుగు' (ఏనుగుతో ఏనుగును) ఇటువంటి ప్రయోగ మిం కొకటి లేదు.

ద్వితీయాద్యర్థాలలో కుషష్ఠి, నిర్ధారణంలో సప్తమి మొదలుగా తత్తద్విభక్త్యర్థాలలో ఇతరవిభక్తులు రావటం ఉన్నది. కాని అవి తత్తద్విభక్తులస్థానంలో విధింపబడినవి కాక తత్తదర్థాలలో పేర్కొనబడినవి కావడంచేత ఇక్కడ ప్రస్తావింపదగినవి కావు.

## 6. విశేషణలింగవిభక్తివచనాలలో విశేషాలను పేర్కొనండి.

**విశేష్యానుగుణం :** 'విశేష్యంబునకుం బోలె విశేషణంబులకు లింగవిభక్తి వచనంబు లగు' విశేష్యం ఏలింగం, ఏవిభక్తి, ఏవచనంలో ఉంటుందో విశేషణం కూడా అదే లింగం, అదే విభక్తి, అదే వచనంలో ఉంటుంది. 1. రాముఁడు సుగుణాభిరాముఁడు. 2. సీత సుగుణాభిరామ. 3. సుగుణాభిరాములను

సీతారాములను. మొ.

కొన్నిచోట్ల విశేషణం లింగవిభక్తివచనాలు విశేష్యంకంటె భిన్నంగా ఉండటం కూడా కనిపిస్తున్నది.

### 1. లింగవ్యత్యాసం :

విశేషణం విశేష్యలింగంకంటె భిన్న మయినలింగంలో ఉండటం లింగవ్యత్యాసం.

**స్త్రీలింగం – క్లీబత్వం:** 'మహతీతరంబు లగు స్త్రీలింగంబుల విశేషణంబులు క్లీబతుల్యంబులు విభాష నగు' స్త్రీవాచకాలు గాని, స్త్రీలింగవిశేషణాలకు వికల్పంగా క్లీబతుల్యత్వం గలుగుతుంది. 'హృద్యము' అగువిద్య, (హృద్య అగువిద్య)

**(మహత్తు – అమహత్కార్యం :** 'మహద్విశేషణ సంఖ్యావాచకంబులకుం గొన్ని యెడల నమహత్కార్యంబు చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణం మహ త్తయినవిశేషణానికి అమహత్కార్యాన్ని ప్రస్తావించింది. అసురులు 'అరువదివేలు' మొ.

### 2. విభక్తివ్యత్యాసం

'విశేష్యవిభక్తికంటె భిన్నంగా విశేషణానికి ఇంకొక విభక్తి రావటం కొన్నిచోట్ల కనబడుతున్నది.

**1. షష్ఠికి – ప్రథమ :** 'ఒకానొకచో విశేణంబులషష్ఠికిం బ్రథమ విభాష నగు' విశేష్యా న్ననుసరించి విశేషణానికి షష్ఠీవిభక్తి రాగా దానికి వికల్పంగా ప్రథమ వస్తుంది. 'సుగుణాభిరాముఁడు' రామునకు. మొ.

(ఇక్కడ ప్రౌఢవ్యాకర్త 'ఒక్కచో సమాసాంతర్గతవిశేష్యంబుల కగువిశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపట్టెడి' అని పేర్కొన్నాడు. షష్ఠ్యంతవిశేష్యం సమాసగత మైఉండగా విడిగా ఉన్న విశేషణంయొక్క షష్ఠికి కూడా ప్రథమ రావటం ఉన్నది. 'దేవుఁడు' త్రివిక్రము సొమ్ములు.)

**(ద్వితీయ – ప్రథమ :** 'ఒక్కచో ద్వితీయాంతవిధేయవిశేషణంబునకుం బ్రథమయు నగు' అని ప్రౌఢవ్యాకరణం విధేయవిశేషణాలద్వితీయావిభక్తికి ప్రథమావిభక్తి వస్తుం దని చెప్పింది. 'ఎవ్వని' 'పురోహితుఁడు'గా చేకొనువారము. ప్రథమ రాకపోతే ద్వితీయ అలాగే ఉంటుంది. 'పురోహితునిగా'.)

**2. భ్వాద్యర్థవ్యవధానం – ప్రథమ :** 'భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబు లకుం బ్రథమ యగు'. అగు మొద లయినవాటితో ఎడం ఉన్నపుడు విశేషణంయొక్క అన్ని విభక్తులకూ ప్రథమ వస్తుంది. 'సుగుణాభిరాముఁడు' అగురాముని మొ.

(**ద్వితీయాదులు – ప్రథమ :** 'కొన్నియెడల విశేషణంబు ద్వితీయాదులకుఁ బ్రథమ చూపట్టెడి' అని ప్రౌఢవ్యాకరణం అగు మొద లయినవాటితో వ్యవధానం లేకపోయినా, విశేషణంయొక్క ద్వితీయాదివిభక్తులకు ప్రథమ వస్తుం దని పేర్కొన్నది. 'తల్లి' ద్రౌపదితోడన్ మొ.)

**3. సర్వనామసంఖ్యలు – ప్రథమ :** 'సర్వనామ, సంఖ్యాభిధాన తద్విశేష్యం బులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దానిద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు'. సర్వనామాలూ, సంఖ్యావాచకాలూ అయినవిశేషణాలు విశేష్యానికి పూర్వంలో ప్రయోగింప బడేటపుడు ఆవిశేషణాల ద్వితీయాదివిభక్తులకు కూడా ప్రథమ వస్తుంది. 'అన్ని' గుఱ్ఱములను, 'రెండు' గుఱ్ఱములకు మొ.

విశేష్యానికి తరువాత ప్రయోగిస్తే ద్వితీయాదు లలాగే ఉంటాయి. గుఱ్ఱములను 'అన్నింటిని'. గుఱ్ఱములకు 'రెండింటికి' – ఇటువంటిచోట్ల విశేష్యంయొక్క ద్వితీయాదివిభక్తులకు ప్రథమావిభక్తి బహుళంగా వస్తుంది. 'గుఱ్ఱములు' అన్నింటిని మొ.

బహుళశబ్దంచేత కొన్నింటికి ప్రథమ కాక, యొక్క షష్ఠి రావటం కనిపిస్తున్నది. మాయిద్దఱకు, మొ.

**3. వచనవ్యత్యాసం :**

కొన్నిచోట్ల విశేషణానికి విశేష్యంకంటె భిన్న మయినవచనం గలగటం ఉన్నది.

**1. స్త్రీసమాదులు – ఏకవచనం :** 'స్త్రీసమంబు లగువిశేణంబులయు మువర్ణకాంతవిశేషణంబులయు బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు' స్త్రీసమాలూ, మువర్ణకాంతాలూ అయినవిశేషణాలకు బహువచనానికి బదులుగా ఏకవచనం బహుళంగా వస్తుంది. మాటలు 'పెక్కు' (స్త్రీసమము) కులిశధారలు 'కుంఠితము' అయ్యె (మువర్ణకాంతం).

# సమాసపరిచ్ఛేదం

## 1. సమాసం ఏర్పడేతీరునుబట్టి సమాసం ఎన్నివిధాలో వివరించండి.

**సమాసం :** 'సమర్థంబు లగుపదంబు లేకపదం బగుట సమాసంబు' అని బాలవ్యాకరణం సంస్కృతానుగుణంగా చెప్పింది. సామర్థ్యం గలిగినపదాలు ఒకేపదంగా కూడటం సమాసలక్షణం. 1.రామునియొక్క, 2.బాణము అనేపదాలు కలిసి యేర్పడిన 'రామునిబాణము' అనేది సమాసం.

ప్రౌఢవ్యాకరణం 'సమాస మనఁగా సంయోగదశయందు గలిగెడు విభక్తిలోపాత్మక పదస్వరూపసంగ్రహము' అని పేర్కొన్నది. సమర్థము లయినపదాలు వాటిలోనివిభక్తులు లోపించి సంగ్రహస్వరూపంతో (ఒకేపదంగా) ఏర్పడటం సమాసంయొక్క లక్షణం. ఇది లుక్సమాసలక్షణ మని ప్రౌఢవ్యాకర్తే స్పష్టం చేశాడు.

### 1. సమాసభేదాలు

సమాసం ఏర్పడేతీరునుబట్టి అది ముందుగా రెండువిధాలు.

**1. లుక్సమాసములు:** విభక్తులు లోపించేసమాసాలు లుక్సమాసాలు. రామునియొక్క + బాణము. ఇక్కడ 'యొక్క, ము' అనేవిభక్తులు లోపించి రామునిబాణ అని సమాసం (ప్రాతిపదిక) ఏర్పడగా, తరువాత ఆయావిభక్తులతో రామునిబాణము మొద లయినవిధంగా ప్రయోగింపబడుతుంది. ఇక్కడ సమాసంలో విభక్తులు లోపించాయి గాబట్టి ఇది లుక్సమాసం. ఇలాగే, దొంగభయము. మొ.

**2. అలుక్సమాసము:** సమాసంలో విభక్తి లోపించకపోతే, అది అలుక్సమాసం అవుతుంది. నీచేతన్ + ప్రోపు – నీచేతిప్రోపు. ఇక్కడ సమాస మైనా, 'చేత' అనే(తృతీయా)విభక్తి లోపించలేదు. కాబట్టి 'నీచేతిప్రోపు' అనేది (తృతీయా) అలుక్సమాసం. నాతోడిచెలిమి, నీవలనిభయము, నాయందలికరుణ. ఇలా 'చేత, తోడ, వలన, అందు' విభక్తుల అలుక్సమాసాలను చిన్నయసూరి ప్రదర్శించాడు.

('కొన్నియెడల సప్తమీతత్పురుషంబునందు నవర్ణకంబు నగు' అని సూత్రించి ప్రౌఢవ్యాకరణం 'న' విభక్తి లోపించనిఅలుక్సమాసాన్ని గూడ ప్రస్తావించింది. కువలయంబునన్ + వారు – కువలయంబునవారు.)

(ఇవార్థకం మొదలయినవాటితో రామునట్లు, నన్నువంటి అనేవిధ మయిననసమాసాలను లుగలుక్సమాసాలుగా ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నది.)

## 2. శబ్దాలనుబట్టి సమాసభేదాలను వివరించండి.

**సమాసభేదాలు :** సమాసంగా కలిసే శబ్దాలనుబట్టి సమాసం మూఁడువిధాలు.

'సాంస్కృతి కాచ్ఛిక మిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు' 1. సాంస్కృతికం, 2. ఆచ్ఛికం, 3. మిశ్రం.

### 1. సాంస్కృతికం

సంస్కృతానికి సంబంధించినశబ్దాలతో ఏర్పడినసమాసం సాంస్కృతికం. ఇది రెండువిధాలు.

**1. సిద్ధము :** కేవలం సంస్కృతశబ్దాలకు చేయబడిన సమాసం సిద్ధం. సంస్కృతంలోనే సమాసంగా సిద్ధ మై, తర్వాత ఆసమాసమే ప్రాతిపదికగా తెలుగులోకి వస్తుంది. సమాసం (పూర్వమె, సంస్కృతంలో) సిద్ధ మై ఉండటంచేత, ఇది సిద్ధ (సాంస్కృతిక) సమాసం. (రాజాజ్ఞా – అనే సంస్కృతసమాసం తెలుగులోకి వచ్చి) రాజాజ్ఞ.

**2. సాధ్యము :** సంస్కృతసమశబ్దాలకు తెలుగులో చేయబడినసమాసం సాధ్యం. రాజుయొక్క + ఆజ్ఞ – రాజునాజ్ఞ.

### 2. ఆచ్ఛికం

సంస్కృతసమంకంటె వే రయినతెలుగుశబ్దం అచ్చతెనుగు. ఈఆచ్ఛికశబ్దాలకు చేయబడినసమాసం ఆచ్ఛికసమాసం. తేనియొక్క ఆనతి – తేనియానతి. ఈసమాసంలో ఉన్నశబ్దా లన్నీ ఆచ్ఛికాలే, కాబట్టి ఇది ఆచ్ఛికసమాసం.

### 3. మిశ్రం

సంస్కృతసమశబ్దాన్నీ, ఆచ్ఛికశబ్దాన్నీ కలిపి చేసినసమాసం మిశ్రం. రాజుయొక్క + ఆనతి – రాజునానతి. ఇందులో రాజుశబ్దం (పూర్వపదం) సంస్కృతసమం, కాగా ఆనతి అనేది ఆచ్ఛికం. సంస్కృతసమమూ, ఆచ్ఛికమూ మిశ్ర మై ఉన్నది, గాబట్టి ఇది మిశ్ర (సమాస)ం. ఇలాగే నల్లనిరాముడు. ఇందులో (రాముడు) ఉత్తరపదం సంస్కృతసమం.

**వైరి(గ్రామ్య)సమాసం :** కేవలం సంస్కృతశబ్దానికి, అచ్చతెనుగుశబ్దంతో సమాసం చేయగూడదు. అనేకమంది, గర్భగుడి మొదలుగా వ్యవహారంలో ఉన్న ఇటువంటిసమాసాలు వ్యాకరణానికి విరుద్ధాలు. కాబట్టి గ్రామ్యాలు. వీటిని కొందరు వైరిసమాసాలు అంటారు. ఇవి ప్రయోగింపదగినవి కావు. జీవగఱ్ఱ మొద లయిన

కొన్ని మాత్రం మహాకవులు ప్రయోగించటంచేత గ్రహింపదగిఉన్నాయి.

## 3. అర్థాన్నిబట్టి సమాసంలోని (తత్పురుషాది) భేదాలను పేర్కొనండి.

తెలుగులో సమాసం అర్థాన్నిబట్టి 1. తత్పురుషం 2. బహువ్రీహి 3. ద్వంద్వం అని మూడు విధాలు. 'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగా సంస్కృతోక్తంబ యగు' ఈసమాసాలలక్షణం దాదాపుగా సంస్కృతంలోవలెనే తెలుగులోనూ గ్రహించాలి.

### 1. తత్పురుషము

ఉత్తరపద (సమాసంలో చివరిపదంయొక్క) అర్థం ప్రధానంగా కలిగినసమాసం తత్పురుషం. ఈసమాసంలో చివరిపదంయొక్క అర్థం క్రియతో అన్వయిస్తుంది. రామునిబాణము (మే లయినది) మొ. ఇది రెండువిధాలు.

**1. సమానాధికరణం :** విశేషణానికి విశేష్యంతో చేసినసమాసం సమానాధికరణం. పూర్వఉత్తరపదాలు రెండింటియొక్క అర్థమూ సమాన మైన ఆధారం (ఒకే వస్తువులో ఉండటం) కలిగి ఉండటంచేత ఇది సమానాధికరణసమాసం. నల్లనియావు, ఇక్కడ నల్లదనం– పూర్వపదార్థం, గోత్వం ఉత్తరపదార్థం రెండూ ఒకే ఆవుని ఆశ్రయించి ఉండటంచేత ఇది సమానాధికరణం.

దీనినే కర్మధారయం అంటారు. 'కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదం బయియుండు' ఈసమాసంలో పూర్వపదం త్రికం, స్త్రీసమం, ముపర్ణకాంతం, ధాతుజవిశేషణం, అనేవాటిలో ఏదో ఒకటి అవుతుంది. నల్లనియావు. ఇందులోని నల్ల అనేపూర్వపదం స్త్రీసమం. కర్మధారయసమాసంలో కొన్ని విశేషాలు ఉన్నాయి.

**1. ఉపమానపూర్వపదకర్మధారయం** : విశేషణ మయినపూర్వపదం ఉపమాన మైతే ఆకర్మధారయం ఉపమానపూర్వపదకర్మధారయం. ఇటువంటిసమాసం సంస్కృతంలో లేదు. చిగురుఁగేలు, జుంటిమోవి అనేవిధంగా తెలుఁగులో ఇటువంటిసమాసాలు ఉన్నాయి. అలరు + మేను = అలరుబోఁడి అనేవిధంగా బహువ్రీహులుగా సూరి పేర్కొన్న సమాసాలను 'అలరుఁబోఁడీత్యాదు లుపమానపూర్వపదకర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణం అలరు + వోఁడి – అలరుఁబోఁడి మొద లైనవి ఉపమానపూర్వపదకర్మధారయా లని చెప్పింది.

**2. ఉపమానోత్తరపదకర్మధారయం :** కర్మధారయంలో ఉత్తరపదం ఉపమాన

మైతే అది ఉపమానోత్తరపదకర్మధారయం. మోవిపండు (మోవి, పూర్వపదం – ఉపమేయం. పండు, ఉపమానం–ఉత్తరపదం.) మొ.

**3. విశేణోభయపదకర్మధారయం:** 'ఆయిాత్యాదిఘటితంబులు విశేషణోభయపద కర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణం ఇటువంటి సమాసాలను పేర్కొన్నది. పూర్వపదమూ, ఉత్తరపదమూ విశేషణాలుగా గలిగినకర్మధారయం విశేషణోభయపదకర్మధారయ మని అభిప్రాయం. ఆయానేరములు. కన్నపెంచినవారు మొ.

**4. విశేష్యపూర్వపదకర్మధారయం :** 'తమ్ముఁగుజ్జులు చిలుకమొకరి యిత్యాదులు విశేష్యపూర్వపదకర్మధారయంబులు' అని ప్రౌఢవ్యాకరణం. దీనిచేత ఉత్తరపదంగా ఉండేవిశేష్యం పూర్వపదంగా మారుతుంది. కుజ్జ లైనతమ్ములు. తమ్ముఁగుజ్జులు. ఇక్కడ విశేష్యం పూర్వపదం కావడంవల్ల విశేషణం ఉత్తరపదం అవుతుంది. అందుచేత వీటిని విశేషణోత్తరపదకర్మధారయాలు అనీ అంటారు.

**5. ద్విగువు :** కర్మధారయంలోని పూర్వపద మయినవిశేషణం సంఖ్యను బోధించే దయితే దానినే తెలుగులో ద్విగుసమాసం అంటారు. నలుగడలు, ముజ్జగములు. మొ.

**2. వ్యధికరణం :** ద్వితీయ మొద లయినవిభక్తులు చివర గలిగినశబ్దానికి మీదిపదంతో చేసినసమాసం వ్యధికరణసమాసం. ఇందులో పూర్వఉత్తరపదాలఅర్థం వేరు వేరు వస్తువులను ఆశ్రయించిఉంటుంది. అధికరణం (ఆధారం) వేరు అయింది కాబట్టి ఇవి వ్యధికరణ సమాసాలు. నెలను తాల్చినవాడు – నెలతాల్పు. మాటయందలి నేర్పు – మాటనేర్పు మొ. వీటికి ద్వితీయాతత్పురుషం, తృతీయాతత్పురుషం మొ. విధంగా తత్పురుషశబ్దంతో వాడుక ఉన్నది. తెలుగులో షష్ఠీతత్పురుషసమాసాలు అధికంగా కనబడుతున్నాయి.

## 2. బహువ్రీహి

అన్యపదార్థం ప్రధాన మయినసమాసం బహువ్రీహి. సమాసంలో ఉన్నశబ్దాలఅర్థంకంటె వే ఱైన అర్థం ప్రధానంగా కలిగినసమాసానికి బహువ్రీహి అని పేరు. 'స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడి.' తెలుగులో బహువ్రీహిసమాసాలు అరుదు. సాధారణంగా స్త్రీసమాలకే ఈసమాసం కలుగుతుంది. ముక్కంటి, నలువ, మచ్చెకంటి మొ. ఇవి అచ్ఛికసమాసాలు మాత్రమె ఉంటాయి.

## 3. ద్వంద్వము

ఉభయపదార్థం ప్రధానం ఐనసమాసం ద్వంద్వం. ద్వంద్వసమాసంలోని పదాలు రెండింటియొక్క అర్థం కూడా ప్రధాన మై ఉంటుంది. 'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీ సమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' తెలుగులో సాధారణంగా ద్వంద్వసమాసం స్త్రీసమ మయినశబ్దానికి ఆచ్ఛికశబ్దంతో ఏర్పడుతుంది. ఆలుబిడ్డలు, అన్నదమ్ములు – అందచందములు అనేవిధ మయినస్థలాలు అరుదుగా ఉన్నాయి. తెలుగులో ఏర్పడే ద్వంద్వసమాసం ఆచ్ఛికమే.

ప్రౌఢవ్యాకర్త 'ఒకానొకచో ద్వంద్వంబు మిశ్రంబును అందలిపూర్వపదంబు క్లీబసమంబునుగా కానంబడియెడి' అని చెప్పాడు. అవసర మక్కఱలు అనేఒక్క ప్రయోగం మాత్రం కనబడుతున్నది. ఇది విలక్షణం.

### సిద్ధసంస్కృతసమాసాలు

నీలోత్పలము, (సమానాధికరణం) రాజపురుషుఁడు. (వ్యధికరణం) పీతాంబరుఁడు (బహుబ్రీహి) రామలక్ష్మణులు (ద్వంద్వం) – అనేతీరుగా సంస్కృతంలో ఏర్పడినసమాసాలు, అంటే సిద్ధసమాసాలు అన్నీ తెలుగులో కవిప్రయోగానుసారంగా గ్రహింపవచ్చు.

# తద్ధితపరిచ్ఛేదం

## 1. త్వార్థంలో వచ్చే తద్ధితప్రత్యయాలను పేర్కొనండి.

**తద్ధితము :** తస్మై ప్రయోగాయ హితమ్, తద్ధితమ్'. అని దీనివ్యుత్పత్తి. స్వార్థం, మతుబర్థం, మొద లయినఅర్థాలలో ప్రథమ మొద లయినవిభక్తులు చివర కలిగినశబ్దాలమీద చేరేప్రత్యయాలు తద్ధితాలు. చిఱుతుక. చిఱుత శబ్దంమీద స్వార్థంలో వచ్చిన'ఉక' ప్రత్యయం తద్ధితం.

**త్వార్థం:** 'త్వ' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం త్వార్థం. అంటే భావార్థం. 'ప్రకృతిజన్యబోధంబునందు ప్రకారంబు భావంబు'. ప్రాతిపదికవలన తెలియబడే వస్తువుయొక్క ధర్మం, భావం. రామునితనము– రామ అనేప్రకృతిచేత బోధింపబడే రాముడు అనేవ్యక్తియొక్క ధర్మం– రామునితనం.

ఈత్వార్థంలో వచ్చేతద్ధితప్రత్యయాలను ఇలా గ్రహించవచ్చు.

**1. తనవర్ణకం :** ప్రాతిపదికవలన తెలియబడేవస్తువుయొక్క ధర్మం, భావం. తెలుగులో 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అని ఈఅర్థంలో తన అనేప్రత్యయం వస్తుంది. రామునితనము– రామ అనేప్రకృతిచేత బోధింపబడే రాముడు అనేవ్యక్తియొక్క ధర్మం– రామునితనం. 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు.' త్వార్థంలో 'తన' అనేతద్ధితప్రత్యయం వస్తుంది. ఇది అన్నిశబ్దాలకు సాధారణంగా వస్తుంది. సంస్కృతసమశబ్దాలమీద కూడా ఈప్రత్యయం అవుతుంది. సంస్కృతంలోని త్వ ప్రత్యయంలాగానే షష్ఠ్యంతంమీద అవుతుంది. తద్ధితప్రత్యయాలు పరంగా ఉన్నపుడు విభక్తి లోపిస్తుంది. త్వ ప్రత్యయాంతంలాగానే తన ప్రత్యయాంతం కూడా క్లీబ–సమం అవుతుంది. కాబట్టి ఈతద్ధితాంతప్రాతిపదికమీద ప్రథమావిభక్తి ఏకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని ముప్రత్యయం వస్తుంది.

రామునియొక్క భావము అనేఅర్థంలో రామునియొక్క అనేషష్ఠ్యంతంమీద తన అనేప్రత్యయం వచ్చి. రామునియొక్క+తన. 'సమాసవిభక్తికి లోపం బగు' అని యొక్క విభక్తి లోపించి. రామునితన.' కృత్తద్ధితసమాసా శ్చ' అని తద్ధిత ప్రత్యయాంతానికి ప్రాతిపదిక అనేసంజ్ఞ కలుగుతుంది. కాబట్టి దీనిపై ప్రథమాదివిభక్తులు వస్తాయి. తన ప్రత్యయాంతం 'ఆచ్ఛికశబ్దంబు లెల్ల' అనే సూత్రంప్రకారం క్లీబసమం. కాబట్టి 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత

ప్రథమైకవచనంలో ముపర్ణకం వచ్చి 'రామునితనము' అని అవుతుంది.

**2. టిక ప్రత్యయం :** 'చిన్నాదులకు టిక వర్ణకం బగు' చిన్న మొద లయిన శబ్దాలమీద భావార్థంలో టిక అనేప్రత్యయం వస్తుంది. టికప్రత్యయాంతం క్లీబసమం. కాబట్టి ప్రథమైక వచనంలో ముపర్ణకం. చిన్నటికము, కన్నెటికము మొ. 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనేలక్షణంచేత టిక ప్రత్యయం రానిపక్షంలో తనప్రత్యయం వస్తుంది. చిన్నతనము, కన్నెతనము. మొ.

'ఉత్వంబున కత్వంబు టికము పరం బగునపు డగు' టిక ప్రత్యయం పరంగా ఉండగా దానికి పూర్వంలో ఉన్న ఉత్వానికి అత్వం వస్తుంది. తొత్తు – టిక. తొత్తటికము.

**3. ఇమిప్రత్యయం :** 'పేర్వాదుల కిమి వర్ణకం బగు' పేరు మొద లయినశబ్దాలకు భావార్థంలో 'ఇమి' అనే ప్రత్యయం వస్తుంది. ఇమి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. పేరు–పేరిమి. కదు – కడిమి. మొ. ఇంకొకపక్షంలో తన ప్రత్యయం వచ్చి, పేరుఁదనము, మొ.

4. **నవర్ణకం :** 'నవర్ణకంబు గుణవచనంబు లగునల్లాదుల కగు'. గుణాన్ని బోధించే నల్ల మొద లయినశబ్దాలకు మీద భావార్థంలో 'న' అనేప్రత్యయం వస్తుంది. న ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. నల్లన, పుల్లన. మొ. పక్షాంతరంలో తన ప్రత్యయం వస్తుంది. నల్లఁదనము. మొ.

**5. ఇక ప్రత్యయం :** 'ఇక వర్ణకం బగ్గలాదుల కగు'. అగ్గల మొద లయినశబ్దాలకు భావార్థంలో 'ఇక' అనేప్రత్యయం వస్తుంది. ఇక ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైక వచనలోపం. అగ్గలిక, ఒమ్మిక. తన ప్రత్యయం వచ్చినపక్షంలో అగ్గలపుఁ దనము, ఒమ్ముఁదనము.

**6. టిమి మొద లగునవి :** 'మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' మగఁటిమి' మొద లయినతద్ధితాంతశబ్దాలు కవిప్రయోగాలలో ఏరూపంతో ఉంటే వాటిని ఆరూపం కలవాటినిగా గ్రహించాలి. మగనియొక్క భావము అనేఅర్థంలో మగనియొక్క అనేషష్ఠంతంమీద టిమిజ్ అనేప్రత్యయమూ, ముందరి– ని, యొక్క లకు లోపమూ, పైన బిందువూ కలిగి ప్రథమైకవచనం లోపించి మగఁటిమి అని అవుతుంది. పక్షాంతరంలో తన ప్రత్యయం వచ్చి మగతనము అవుతుంది.

ఇలాగే కోడలు–కోడంట్రము, కోడటికము. తెల్ల–తెలుపు, మొద లయిన

ఆయాశబ్దాలలో ఆయాతద్ధితప్రత్యయాదివికారాలు వస్తున్నట్లు కవి ప్రయోగానుసారంగా గ్రహించాలి.

## 2. స్వార్థంలో వచ్చే తద్ధితప్రత్యయాలను పేర్కొనండి.

**స్వార్థము :** స్వ+అర్థ. అంటే స్వీయార్థం. స్వార్థం అంటే ఇక్కడ ప్రాతిపదికార్థం. (ధాతువులవిషయంలో ధాతువుయొక్క అర్థం) అరమర అనేశబ్దంమీద స్వార్థంలో ఇకవర్ణకం వచ్చి, అరమరిక. దీనికి అరమర అనే అర్థం. స్వార్థంలో విధింపబడిన ప్రత్యయా దులు స్వార్థికాలు. ఈప్రత్యయాలు ప్రాతిపదికమీద చేరతాయి. ఇక మొద లయినవి.

**1. ఇక ప్రత్యయం :** 'అరమరాదులకు స్వార్థంబునం దిక వర్ణకం బగు'. అరమర మొద లయినప్రాతిపదికలమీద అదే అర్థంలో 'ఇక' అనేప్రత్యయం వస్తుంది. ఈ 'ఇక' ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. అరమర శబ్దంమీద అదే అర్థంలో పైసూత్రంచేత ఇక ప్రత్యయం రాగా అరమరిక. అరమర అంటే ఏ మర్థమో, అరమరిక అన్నా అదే అర్థం.

**2. ఉక ప్రత్యయం :** 'ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునం దగు'. చిఱుత మొద లయినప్రాతిపదికలకు పైన అదే అర్థంలో ఉక అనేప్రత్యయం వస్తుంది. ఈ 'ఉక' ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. చిఱుత+ఉక. సంధి జరిగి, చిఱుతుక. ఇలాగే, నాతి–నాతుక మొ.

**3. కా కత్తియ ప్రత్యయాలు :** 'కా కత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు' సాధారణంగా మతుబర్థంలో వచ్చే కా, కత్తియ అనేరెండుప్రత్యయాలు కొన్నిశబ్దాలకు స్వార్థంలో గూడా కనబడుతున్నాయి. స్వార్థంలో అయినా 'కా' ప్రత్యయం పురుషుడిని బోధించేసందర్భంలోనూ, 'కత్తియ' ప్రత్యయం స్త్రీని బోధించేసందర్భంలోనూ వస్తుంది. చెలి అంటే మిత్రుడు అని అర్థం. అదే అర్థంలో కా ప్రత్యయం వచ్చి చెలికా. కాప్రత్యయాంతం మగాదులలోది. కాబట్టి 'మహత్తు లగుమగాదులకు' అని ప్రథమైకవచనంలో డుజ్ వచ్చి చెలికాఁడు. అలాగే మిత్రురాలు అనే అర్థంలో స్త్రీని తెలిపేటపుడు చెలిశబ్దంమీద కత్తియ ప్రత్యయం వచ్చి చెలికత్తియ. కత్తియ ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. చెలికత్తియ అంటే చెలి అనే అర్థం.

**4. ఈ ప్రత్యయం :** 'ఈప్రత్యయంబు కొన్నిటికి స్వార్థంబునం దగు'. పూర్వం మతుబర్థంలో చెప్పబడిన ఈప్రత్యయం కొన్నిశబ్దాలకు స్వార్థంలో వస్తుంది.

మొక్కలము కలవాడు (ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు) మొక్కలి. దీనిమీద అదే అర్థంలో ఈ ప్రత్యయం వచ్చి మొక్కలీ. ఈప్రత్యయాంతం మగాదిగణంలోది. కాబట్టి ప్రథమైకవచనంలో డుజ్ వస్తుంది. మొక్కలీఁడు. ఇలాగే, కల్ల(కలవాడు) కల్లరి – కల్లరీఁడు.

## 3. మతుబర్థంలో వచ్చేతద్ధితప్రత్యయాలను పేర్కొనండి.

**మతుబర్థము, మత్వర్థము:** మతుప్ అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం (మతుప్–అర్థ) మతుబర్థం. లేదా (మతు–అర్థ) మత్వర్థం. 'త ద స్యా స్త్యస్మి న్న స్తీతి మతుప్' అని యిది సంస్కృతంలో అస్త్యర్థంలో విధింపబడింది. కలది, కలవా డని స్థూలంగా దీనిఅర్థం. అందగత్తియ. (అందము కలది) ఆటగాడు.(ఆట కలవాడు.)

**1. కా, కత్తియ వర్ణకాలు:** 'కా కత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' ఆట మొద లయినశబ్దాలమీద మతుబర్థంలో పురుషుడిని బోధించేటపుడు కా అనేప్రత్యయమూ, స్త్రీని బోధించేటపుడు కత్తియ అనేప్రత్యయమూ వస్తాయి. కా ప్రత్యయాంతం పుంలింగతుల్యం. మగాదులలోది. కాబట్టి ప్రథమైకవచనంలో డుజ్ వస్తుంది. ఉత్త్వం రాదు. కత్తియ ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. ఆట కలిగినవాడు – ఆటకాఁడు. ఆట కలిగినస్త్రీ – ఆటకత్తియ.

'కా కత్తియల కకారంబునకు గకారంబు కొండొకచో గానంబడియెడి' అని కొన్నిచోట్ల ఈప్రత్యయాలలోని కకారానికి గకారం వస్తుంది. అందగాడు, అందగత్తియ.

'కావర్ణకంబు తిర్యక్కులకుం గానం బడియెడి' కాప్రత్యయం పశు, పక్ష్యాదివాచక శబ్దాలమీద కూడా మతుబర్థంలో కవిప్రయోగాలలో కనబదుతున్నది. ఇబ్బందిగాడు, ఒంటిగాడు, మొ.

**2. ఈప్రత్యయం:** 'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అటమటము మొద లయినశబ్దాలమీద మతుబర్థంలో పురుషుడిని బోధించేసందర్భంలో ఈ అనేతద్ధితప్రత్యయం వస్తుంది. ఈప్రత్యయాంతం పుంలింగతుల్యం, మగాదులలోది. అటమటము కలవాడు – అటమటీఁడు.

**3. అరి ప్రత్యయం :** 'అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదుల కగు' జాల మొద లయినశబ్దాలమీద మతుబర్థంలో అరి అనేప్రత్యయం వస్తుంది. అరి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. జాల కలవాడు

(కలది) – జాలరి.

**4. ఇ ప్రత్యయం:** 'ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునం దగు' ఓయారము మొద లయినశబ్దాలమీద మతుబర్థంలో ఇ అనేప్రత్యయం వస్తుంది. ఇ ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. ఓయారము కలవాడు (కలది) ఓయారి.

**5. త ప్రత్యయం :** 'తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీ వాచ్యం బగునపుడు మతుబర్థంబునం దగు.' కులాన్ని తెలియజేసేశబ్దం మీద, స్త్రీని బోధించేసందర్భంలో మహదర్థంలో త అనేప్రత్యయం వస్తుంది. ఈ 'త' ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. చాకి జాతి కలిగిన స్త్రీ అనేఅర్థంలో చాకిశబ్దంమీద తప్రత్యయం వచ్చి, ప్రథమైకవచనం లోపించి – చాకిత.

'తవర్ణకంబు పరం బగుచో నొకానొకచో నెత్వంబు చూపట్టెడు' అని కొన్నిచోట్ల ముందు ఎత్వం వస్తుంది. బోయ+త=బోయెత. మాల+త=మాలెత.

'యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు' గుబ్బలు కలది, మిండలు కలది, ముట్టు కలది అనేచోట్ల మతుబర్థంలో త అనేప్రత్యయం వస్తుంది. తవర్ణకం పర మవుతుండగా గుబ్బ శబ్దానికి ఎత్వం వస్తుంది. గుబ్బ–త, గుబ్బెత. మిండలు+త=మిండత. ముట్టు+త=ముట్టుత.

**6. ఆఁడి ప్రత్యయం :** 'వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యం బగునపుడు మత్వర్థంబునం దాఁడి వర్ణకం బగు' ప్రథమాబహువచనాంతా లయిన వగలు మొద లయినశబ్దాలమీద స్త్రీని బోధించేసందర్భంలో మతుబర్థంలో ఆఁడి అనే ప్రత్యయం వస్తుంది. ఆఁడి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది. వగలు కలిగిన స్త్రీ, వగలు + ఆఁడి = వగలాఁడి. మొ.

**7. ఆ ప్రత్యయం :** 'వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు' ప్రథమాబహువచనాంతా లయిన వగలు మొద లయిన శబ్దాలమీద పురుషుడిని బోధించేసందర్భంలో మతుబర్థంలో 'ఆ' అనేప్రత్యయం వస్తుంది. ఆ ప్రత్యయాంతం పుంలింగతుల్యం. మగాదులలో చేరింది.వగలు కలిగిన పురుషుడు, వగలు + ఆ = వగలాఁడు.

**8. ఇఁడి ప్రత్యయం :** 'ముక్కు లోనగువానికిం దదభావద్యోతకం బయి మతుబర్థంబునం దిఁడి వర్ణకం బగు' లేకపోవడం కలిగినవాడు (కలిగినది) అనేవిధ మయినమతుబర్థంలో ముక్కు మొద లైనశబ్దాలమీద ఇఁడి అనేప్రత్యయం వస్తుంది.

ఇఁడి ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. ముక్కు లేనివాడు– ముక్కిఁడి.

**9. అ ప్రత్యయం :** 'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది' అడపము కలది అని మతుబర్థంలో అడపము అనేశబ్దంమీద 'అ' అనేప్రత్యయం వస్తుంది. అ ప్రత్యయాంతం స్త్రీమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. అడపము+అ= అడప. (తాంబూలకరండవాహి)

**10. అము ప్రత్యయం :** 'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది'. పెండ్లి కలిగినది అని మతుబర్థంలో పెండ్లి అనేశబ్దంమీద 'అము' అనేప్రత్యయం వస్తుంది. అము ప్రత్యయాంతం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనలోపం. పెండ్లి–అము. పెండ్లము.

ఇతర మైన మతుబర్థక తద్ధితప్రత్యయాలను కవిప్రయోగానుసారంగా గ్రహించాలి.

# క్రియాపరిచ్ఛేదం

## 1. సంస్కృతధాతువులు తెలుగులో తత్సమాలు అయ్యేవిధానాన్ని వివరించండి.

**ధాతువులు**: సంస్కృతంలో 'భూ' మొద లైనవాటికి ధాతువులు అని పేరు. ఇలాగే తెలుగులో 'వండు' మొద లైనవాటికి ధాతువులు అని సంజ్ఞ. ప్రాతిపదికలలాగా ధాతువులు సైతం సంస్కృతంనుంచి తెలుగులోనికి ప్రవేశిస్తున్నాయి. ఈసంస్కృతధాతువులనుంచి ఏర్పడే తెలుగు క్రియాపదాలే తత్సమక్రియలు.

**భ్వాదులు**: 'అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు' ప్ర, పరా, మొద లైన 'గతి' సంజ్ఞ కలిగినశబ్దాలు పూర్వంలో కలిగిఉన్నపుడు మాత్రమే భూ- మొ. సంస్కృత ధాతువులు తెలుగులోకి ప్రవేశిస్తాయి. ప్రభవించెను. సాక్షాత్కరించెను. మొ. పూర్వంలో ప్ర, పరా మొద లైనఉపసర్గలు లేకపోతే ఇవి తెలుగులో ప్రయోగింపబడవు. భవించెను, కరించెను ఇత్యాదివిధంగా రూపాలు ఉండవు.

ఇక్కడి 'భూ' మొదలైనవాటిలో పేర్కొనబడనిసంస్కృతధాతువులు మాత్రం ప్ర మొద లైనవి పూర్వంలో ఉన్నా, లేకపోయినా తెలుగులో ప్రయోగింపబడతాయి. హరించెను. సంహరించెను. మొ.

ఇలా తెలుగులోకి చేరేటపుడు సంస్కృతధాతువులు చాలా మార్పులు పొందుతున్నాయి. ఆమార్పులను ఇలా గమనింపవచ్చు.

**1. ఇంచుగాగమము**: 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' సంస్కృతంనుంచి తెలుగులోకి ప్రవేశించేధాతువులు అన్నింటికీ చివర స్వార్థంలో 'ఇంచు' అనేఆగమం వస్తుంది. క్రియావిభక్తులు మొద లైనవి ఈఇంచుగాగమంమీదే చేరతాయి. భుజ్+ఇంచు = భుజించు. భుజించెను. భుజించుట. మొ. 'ఇంచు' లేకుండా సంస్కృతధాతువు భుజెను(భుజించెను), భుజగలడు(భుజింపగలడు) అనేతీరుగా ప్రయోగింపబడదు.

**నామధాతువులు**: 'నిర్జి నామంబుల కయుగాగమంబు గలుగదు' అనేసూత్ర జ్ఞాపనంచేత కొన్ని నామాలకు కూడా ధాతువులుగా వివక్షించేటపుడు (అవి ధాతువు లై) ఇంచు అనేది ఆగమంగా వస్తుంది. కరుణ - కరుణించు, అగ్గి- అగ్గించు మొ.

**2. గుణము:** 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' ఇంచుగాగమం పరంగా ఉన్నపుడు సంస్కతధాతువులలో ఉపధగా

ఉన్న ఇ,ఉ,ఋ అనేవాటిస్థానంలో వరుసగా ఏ, ఓ, అర్ అనేవి ఆదేశాలుగా వస్తాయి. ఖిద్+ఇంచు=ఖేదించు. కుప్+ఇంచు=కోపించు. వృష్+ఇంచు=వర్షించు.

'స్పృశికి గుణంబు విభాష నగు'. స్పృశ్ అనేధాతువుకు గుణం వికల్పంగా వస్తుంది. స్పర్శించు, స్పృశించు.

'సృజికి నిర్మితిని గుణంబు లేదు'. నిర్మాణార్థంలో సృజ్ అనేధాతువుకు గుణం రాదు. సృజించు. విడుచు మొద లైన ఇతరార్థాలలో గుణం వస్తుంది. విసర్జించు.

'లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు'. లిఖ్ మొద లైనఈధాతువులకు గుణం అసలు రాదు. లిఖించు, మొ. కుచ్ అనేధాతువుకు గూడ గుణం రా దని అహోబలుడు అనేలాక్షణికుడు పేర్కొన్నాడు. కాని అది సరి కాదు. సంకోచించు.

**3. అయుక్–అవుక్–అరుక్–ఆగమాలు**: 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయు గవు గరుక్కు లగు'. ఇంచుక్కు పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువు చివర ఉన్న ఇకారానికి అయ్ అనేది ఆగమంగా వస్తుంది. జి+ఇంచు=జయించు. నీ+ఇంచు=నయించు.

ఇంచుక్కు పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువు చివర ఉన్న ఉకారానికి అవ్ అనేది ఆగమంగా వస్తుంది. ద్రు+ఇంచు=ద్రవించు. ప్రభూ+ఇంచు=ప్రభవించు.

ఇంచుక్కు పరంగా ఉన్నపుడు సంస్కృతధాతువు చివర ఉన్న ఋకారానికి అర్ అనేది ఆగమంగా వస్తుంది. భృ+ఇంచు=భరించు. తౄ+ఇంచు=తరించు.

'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు'. నిర్ ఉపసర్గ పూర్వంలో ఉన్న 'జి' అనేధాతువుకూ, నామధాతువులకూ, అయుగాగమం రాదు. నిర్జి+ఇంచు= నిర్జించు. నుతి+ఇంచు=నుతించు. మొ.

**4. ఇయుడాగమము :** 'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వర ద్విస్వరంబుల యించుగ్వ్రక్రంబుల కియుడాగమంబు విభాష నగు'. గురువు లేనిదీ, చివర యకారం లేనిదీ, ఒకటి లేదా రెండు అచ్చులు కలిగినదీ, అయిన సంస్కృత ధాతువుకు పైన ఉన్న 'ఇంచు' కు పూర్వంలో 'ఇయ్' అనేది ఆగమంగా వికల్పంగా వస్తుంది.

భుజ్+ఇంచు=భుజియించు. ఇయుడాగమం రానిపక్షంలో – భుజించు.

**5. ద్విరుక్తలకారము :** 'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' రంజ్ మొద లైనధాతువులకు పైన ఉన్న 'ఇంచు' అనేదానిలోని 'ంచ్' అనేభాగంస్థానంలో 'ల్ల్' అనేది ఆదేశంగా వస్తుంది.

రంజ్+ ఇంచు= రంజిల్లు. ఇక్కడ ద్విరుక్తంలో ఒకలకారం లోపించడం గూడా ఉన్నది. రంజిలు.

**ప్రేరణంలో ఇంచుక్కు :** 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు'. సంస్కృతధాతువుల మీద స్వార్థంలో వచ్చిన ఇంచుగాగమం మీద ప్రేరణార్థంలో ఇంకొకఇంచుగాగమం వస్తుంది. భుజించు+ఇంచు=భుజింపించు. మొ.

రంజ్ మొద లైనధాతువులమీద ప్రేరణార్థంలో వచ్చిన ఇంచుక్కు పర మైనపుడు స్వార్థంలో వచ్చిన మొదటి ఇంచుక్కు లోపిస్తుంది. రంజ్+ఇంచు+ఇంచు= రంజించు.

ఇలా ఏర్పడినధాతురూపాలమీద లడాదికార్యా లయి తత్సమక్రియాపదాలు సిద్ధిస్తాయి. భుజించుచున్నాడు. రంజించెను. జయించుట మొ.

## 2. ధాతుజవిశేషణాలను వివరించండి.

**ధాతుజవిశేషణము:** విశేష్యంలోని విశేషాన్ని తెలిపేది విశేషణం. ధాతువునుంచి ఏర్పడినవిశేషణాలు ధాతుజవిశేషణాలు. వీటిని (అధర్వణుడు) ప్రౌఢవ్యాకర్త క్రియాజన్య విశేషణాలు అని కూడా వ్యవహరించాడు. ప్రౌఢవ్యాకర్త పేర్కొన్న ఆఱు విధా లయిన విశేషణాలలోని 'క్రియాప్రయుక్తవిశేషణం' అని చెప్పబడినది ధాతుజవిశేషణమే.

సంస్కృతాలూ, ఆచ్ఛికాలూ అయినధాతువులు అన్నింటినుంచి ప్రత్యయాల ననుసరించి ఏడువిధాలుగా విశేషణరూపాలు ఏర్పడతాయి. ఆప్రత్యయాల అర్థాల ననుసరించి వాటిని ఐదువిధాలుగా ఇలా గుర్తించవచ్చు.

**1. తద్ధర్మా(ద్య)ర్థకాలు:** 'తృవర్ణకార్థంబునం దెడి యెడు వన్నియ లగు'. 'తృచ్' అనే సంస్కృతప్రత్యయంయొక్క అర్థంలో తెలుగులో ఎడి, ఎడు అనేప్రత్యయాలు రెండు వస్తాయి. 1. పఠించు+ఎడి=పఠించెడి. 2. వండు+ఎడు=వండెడు.

ధాతువుమీద చేరే ఈ ఎడి మొద లైనప్రత్యయాలు కృత్తులు. కాబట్టి ఇవి చివర కలిగి (పఠించెడు మొ.)నవి (కృత్తద్ధితసమాసా శ్చ) ప్రాతిపదిక లవుతాయి. ప్రాతిపదికత్వంవల్ల వీటిమీద ప్రథమ మొద లైనవిభక్తులు చేరతాయి. మహత్తు అయితే- పఠించెడువాఁడు. అమహ త్తయితే- పఠించెడునది. మొ. ఇలాగే ఇతరవిభక్తులలో పఠించువానిని, వండుదానికొఱకు, మొ.

'వానికి లోపంబు బహుళంబుగా నగు'. తద్ధర్మా(ద్య)ర్థాలలో వచ్చిన ఎడి, ఎడు అనేప్రత్యయాలకు బహుళంగా లోపం కూడా వస్తుంది. 3. పఠించువాఁడు. వండునది. మొ. కలుగు (కల) ధాతువుమీద ఎడి, ఎడులకు లోపం నిత్యంగా

వస్తుంది. కలవాఁడు, కలుగునది. మొ.

ఇలా తద్ధర్మా(ద్య)ర్థకధాతుజవిశేషణం ఎడి, ఎడు, వానిలోపం అనేకార్యాలతో మూడు విధా లయినరూపాలతో ఉంటుంది.

**2. భవచ్ఛత్రర్థము :** 'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు'. వర్తమానార్థకశత్రర్థంలో ధాతువుమీద 'ఉన్న' అనేప్రత్యయం వస్తుంది. 4. పఠించు+ఉన్న= పఠించుచున్నవాఁడు. వండుచున్నయది. మొ.

**3. భావిశత్రర్థము :** 'ఉన్న కలజి న – అనే పైసూత్రంచేత భవిష్యదర్థక శత్రర్థంలో ధాతువుమీద 'కలజి' అనే ప్రత్యయం వస్తుంది. 5. పఠించు+కల= పఠింపఁగలవాఁడు. వండు+కల= వండఁగలయది. మొ.

**4. క్తవదర్థకము :** 'క్తవత్' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థంలో అంటే, భూతార్థంలో 'ఉన్న కలజి న – అనేపూర్వసూత్రంచేత 'న' అనేప్రత్యయం వస్తుంది. 6. పఠించు+న= పఠించినవాఁడు. వండినయది. మొ.

**5. వ్యతిరేకతద్ధర్మా(ద్య)ర్థకము :** 'వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజి యగు'. వ్యతి రేకార్థంతో కూడినతద్ధర్మా(ద్య)ర్థంలో ని(జి) అనేప్రత్యయం వస్తుంది. 7. పఠించు+ని= పఠింపనివాఁడు. వండనియది. మొ.

ఇలా 1. ఎడి, 2. ఎడు, 3. వాటిలోపం, 4. ఉన్న, 5. కల, 6. న, 7. ని – అనే (ఏడు)ప్రత్యయాలతో సంస్కృతసమ, ఆచ్ఛికధాతువులు అన్నింటినుంచి (ధాతుజ) విశేషణరూపాలు ఏడు విధాలుగా ఏర్పడతాయి.

**3. ధాతువులో చకారానికి పకారం వచ్చేసందర్భాలు పేర్కొనండి.**

మధ్యమపురుష లయిన ము,డుజ్ అనేవీ, జివర్ణం ఇత్తుగా కలిగినవీ (ముత్తు) మొద లైనవి పరంగా ఉన్నపుడు ధాతువుకు చివర ఉన్న చకారానికి పకారం వస్తుంది. అలాంటి స్థలాలను బాల (ప్రౌఢ) వ్యాకరణం ఇలా పేర్కొన్నది.

**1. ఆగమచకారము–ముత్పరకపత్వము:** 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తములకు ముత్తు పరం బగునపుడు పవ లగు'. ఆగమంగా వచ్చిచేరినతకారానికి ముత్తు పరంగా ఉన్నపుడు పకారం వస్తుంది. పచించు–పచింపఁడు. అడఁచు–అడపుము. మొ.

ఆగమంగా వచ్చింది కాక ధాతువుచివర సహజంగా ఉన్నచకారానికి ముత్తు పర మైనపుడు వకారం వస్తుంది. పిలుచు–పిలువుము. మొ.

విఱువఁడు మొ. కొన్నిచోట్ల ఆగమంగా వచ్చిన చకారానికి కూడా వకారం

రావడం కనిపిస్తున్నది.

హెచ్చు, మెచ్చు ఇత్యాదిగా చకారం ద్విరుక్త మయితే అది అలాగే ఉంటుంది. హెచ్చక, మెచ్చఁడు. మొ.

**2. దుక్పరకపత్వము :** 'ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు'. దుగాగమం పరంగా ఉన్నపుడు ముందరి నిండుసున్న మీద ఉన్నదీ, ఆగమంగా వచ్చిందీ, అయినచకారానికి వికల్పంగా పకారం వస్తుంది. పచించు+దురు=పచింపుదురు. ఇలాగే చించు+దురు= చింపుదురు. మొ.

పకారం రానిపక్షంలో 'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు' అనేలక్షణా న్ననుసరించి తకారం వస్తుంది. పచింతురు. చింతురు. మొ.

**3. శత్రర్థ(చు)పరకపత్వము:** ప్రౌఢవ్యాకరణం 'పకారంబు కొన్నియెడల శత్రర్థపరక చువర్ణకంబునకుం గానంబడియెడి' అని పేర్కొన్నది. శత్రర్థంలో వచ్చిన 'చు'ప్రత్యయం పరంగా ఉన్నపుడు ధాతువుచివర ఉన్నచకారానికి పకారం రావడం కవిప్రయోగాలనుంచి గ్రహించాలి. గర్జించు+చు=గర్జింపుచు. చేరుచు+చు= చేరుపుచు. మొ.

**4. సిద్ధచకారము–ముత్పరకపత్వము :** 'ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు' ముత్తు పర మైనపుడు ఆచ్ఛికధాతువులలలో అరసున్నమీద ఉన్న చకారానికి పకారం తఱుచుగా వస్తుంది. తలఁచు+ము=తలఁపుము. తలఁచు+కజీ=తలఁపక మొ.

'ఏఁచు' అనేధాతువులోని చకారానికి పకారం వికల్పంగా వస్తుంది. ఏఁపఁడు, ఏఁచఁడు.

'నోఁచు' అనేధాతువులోని చకారానికి పకారం రాదు. నోఁచఁడు. నోఁచక. మొ.

**5. ప్రేరణేంచుక్ పరకపత్వము :** ప్రేరణార్థంలో వచ్చిన ఇంచుక్కు పరంగా ఉన్నపుడు ధాతువుచివర ఉన్న, ఆగమ మైనది కానీ, లేదా సహజంగా ఉన్నది కానీ అయిన చకారానికి పకారం వస్తుంది. పచించు+ఇంచు=పచింపించు(ఆగమం), పిలుచు+ఇంచు= పిలిపించు (సహజం). మొ.

ద్విరుక్త మైనచకారానికి పకారం కూడా ద్విరుక్త మయ్యే వస్తుంది. ఇచ్చు+ఇంచు= ఇప్పించు. మొ.

మెచ్చు ధాతువులోని చకారానికి పకారం వికల్పంగా వస్తుంది. మెచ్చు+ఇంచు= మెప్పించు. మెచ్చించు.

హెచ్చు అనేధాతువులో చకారానికి పకారం రాదు. హెచ్చు+ఇంచు=హెచ్చించు.

**పత్వాభావము :** ప్రౌఢవ్యాకరణం 'కవిత్రయేతరప్రయోగంబులం గొన్నియెడల నిప్రత్య యాదులు పరంబు లగునపుడు పకారం బించుక్ చకారంబున కేని గానంబడదు' అని ముత్పరకతలో గూడా పత్వం రాకపోవడాన్ని పేర్కొన్నది. పోరించనిక్షణము. తీర్చుము.మొ.

## 4. ప్రేరణార్థంలో ధాతువుమీద వచ్చేఆగమాలను పేర్కొనండి.

ప్రేరణార్థంలో ధాతువులకు ఇంచుక్, చుక్, పుక్– అనేవి ఆగమాలుగా వస్తాయి.

**I. ఇంచుగాగమము :** 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు'. తత్సమాలూ, ఆచ్ఛికాలూ అయిన అన్ని ధాతువులకూ చివర ప్రేరణార్థంలో 'ఇంచు' అనేఆగమం వస్తుంది. భుజించు+ఇంచు=భుజింపించు. వండు+ఇంచు=వండించు. మొ.

**II. చుగాగమము :** చుగాగమమూ, పుగాగమమూ, ఆచ్ఛికధాతువులకు మాత్రమే వస్తాయి.

1. 'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' ను,లు,డు,రు, అనేవర్ణాలు చివర కలిగిన ఆచ్ఛికధాతువులకు ప్రేరణార్థంలో చు(క్) ఆగమంగా వస్తుంది. ఉదా. పూను– పూనుచు, తేలు–తేలుచు, మగుడు–మగుడుచు, కుదురు–కుదురుచు. మొ.

చుగాగమం రానిపక్షంలో ఇంచుక్కు వస్తుంది. పూనించు, తేలించు, మగిడించు, కుదిరించు.

అను మొద లైనధాతువులకు ఈచుగాగమం అసలు రాదు. అనిపించు, వినిపించు.మొ.

2. 'పడునకుం జుక్కును, డా కలఘురేఫంబు నగు' పడుధాతువుకు చుగాగమం ఒక్కటే వస్తుంది. పఱుచు. దీనికి ఇంచుగాగమం రాదు. కాబట్టి పడించు అని కాదు.

'శబ్దపల్లవం బగుబడున కించుక్కు విభాష నగు, నగుచో డాకు లఘురేఫం బగు' శబ్దపల్లవ మైనపడుధాతువుకు ఇంచుగాగమమూ, చుగాగమమూ రెండూ వస్తాయి. వెలువడు+ఇంచు=వెలువరించు. వెలువడు+చు=వెలువఱుచు.

3. అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్యాదుల కగు, నగుచో వానికడవ్రాలు లోపించు' అడఁగు మొద లైనధాతువులకు చుగాగమం బహుళంగా వస్తుంది. అడఁగు+చు=అడఁచు. మొ.చుగాగమం రానిపక్షంలో ఇంచుక్కు వస్తుంది. అడఁగించు.

**III. పుగాగమము :** 1.పూర్వసూత్రంచేత మాయు మొద లైనధాతువులకు ప్రేరణార్థంలో పుక్ అనేఆగమం వస్తుంది. మాయు+పు=మాపు. మొ. పుగాగమం రానిపక్షంలో ఇంచుగాగమం వస్తుంది. మాయించు.మొ.

ఆఁగు మొద లైనవి మాయ్యాదులలోనూ, అడంగ్వాదులలోనూ ఉన్నాయి. కాబట్టి చుక్, పుక్ ఆగమాలు రెండూ పర్యాయంగా వస్తాయి.ఆఁగు+చు=ఆఁచు, ఆఁగు+పు=ఆఁపు. ఇవి రెండూ రానిపక్షంలో ఇంచుక్కు వస్తుంది. ఆఁగించు.

2. 'అట్లు పుగాగమంబు మాన్వాదుల కగు' మాను మొద లైనధాతువులకు 'పుక్' అనేఆగమం బహుళంగా వస్తుంది. మాను+పు=మానుపు. పుగాగమం రానిపక్షంలో చు, ఇంచు ఆగమాలు వస్తాయి. మానుచు, మానించు.

మనుధాతువుకు పుగాగమ, చుగాగమాలు వస్తాయి. మనుపు, మనుచు. ఇంచుగాగమం రాదు. కాబట్టి మనించు అని ఉండదు.

3. 'చెడునకుం జుక్పుగాగమంబులును డా కలఘురేఫంబు నగు' చెడు అనేధాతువుకు చుక్, పుక్, అనేఆగమాలు రెండూ వస్తాయి. చెడు+చు=చెఱుచు, చెడు+పు=చెఱుపు. దీనికి ఇంచుగాగమం రాదు. కాబట్టి చెడించు అని ఉండదు.

**చుక్ పుక్కులపై ఇంచుక్కు :** 'ప్రేరణంబునం దించుక్కుపై నించుక్కు లేదు' ప్రేరణార్థంలో వచ్చిన ఇంచుగాగమంమీద మళ్ళీ (ప్రేరణార్థవివక్షా) ఇంచుగాగమం రాదు. (భుజింపించు+ఇంచు) భుజింపింపించు, (వండించు+ఇంచు) వండింపించు – అనేవిధ మైనరూపాలు ఉండవు. కాని చుగాగమం మీదా, పుగాగమం మీదా ప్రేరణార్థాన్ని వివక్షిస్తే, ఇంచుక్కు వస్తుంది. పూను ధాతువుమీద ప్రేరణంలో చుగాగమం వచ్చి, పూనుచు. దీనిమీద ప్రేరణంలో 'సర్వంబునకుం బ్రేరణంబునందు' అని ఇంచుక్కు వచ్చి పూనుచు+ఇంచు=పూనిపించు.

చచ్చు ధాతువుమీద ప్రేరణంలో పుగాగమం వచ్చి (చచ్చు+పు) చంపు. దీనిపై ఇంచుక్కు వచ్చి, చంపించు. ఈఇంచుక్కుమీద ఇంచుక్కు రాదు. కాబట్టి – పూనిపింపించు, చంపింపించు అని కాదు. ప్రేరణార్థంలో ఇంచుక్కు రాగా దానిమీద చుక్ పుక్కులకు ప్రాప్తే లేదు. (భుజింపించుపు) వండించుచెను ఇత్యాదిగా కాదు.

IV. **చేయుయోగము :** 'అన్నంతక్రియ చేయుయోగంబునం బ్రేరణార్థకం బగు' అని ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నది. కొన్నిచోట్ల నుజి చివర గలిగినధాతువులమీద ప్రేరణార్థంలో చేయుధాతువు వచ్చి చేరుతుంది. వందు– వందన్+చేయు=వందఁ జేయు= వందించు. భుజించు – భుజింపన్ + చేయు = భుజింపఁజేయు = భుజింపించు. మొ.

చను ధాతువుకు ఇంచుక్, చుక్, పుక్, అనేఆగమాలు మూడూ రావు. నుజ్యంత మై, చేయుధాతువు చేరడంవల్లనే 'చను' ధాతువుపై ప్రేరణార్థం సిద్ధిస్తుంది. చనఁ జేయు(పంపు)

## 5. ప్రేరణార్థకాగమాలు పరంగా ఉండగా ధాతువుచివర వచ్చేమార్పులు తెలపండి.

**ప్రేరణార్థకాగమాలు :** సంస్కృత(సమ)ధాతువులకు ప్రేరణార్థంలో 'ఇంచు' ఆగమం అవుతుంది. ఆచ్ఛికధాతువులకు ఇంచు, చు, పు, అనేఆగమాలు వస్తాయి. ఈఆగమాలు పర మైనపుడు పూర్వంలో ఉన్నధాతువుకు చివర వర్ణవికారాలు అనేకవిధాలుగా కనబడుతున్నాయి. అలాంటివికారాలు దేశ్యధాతువులలో ఎక్కువ. ఆగమ–ఆదేశ–లోప– రూపాలుగా ఉన్నఈవర్ణవికారాలను ఇలా గుర్తింపవచ్చు.

**1. పుగాగమము :** 'అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు, మానునకు విభాష నగు'. ప్రేరణంలో వచ్చిన ఇంచుక్కు పర మైనపుడు అను–కను–తిను–విను అనేధాతువులకు పుగాగమం వస్తుంది. అను+ఇంచు= అనిపించు.

మాను ధాతువుకు పుగాగమం వికల్పంగా వస్తుంది. మాను+ఇంచు= మానిపించు, మానించు మొ.

కను ధాతువుకు మొదట దీర్ఘం వికల్పంగా వస్తుంది. కానిపించు, కనిపించు.

**2. గుగామము :** 'అడ్డాదుల కించుక్కు పరం బగునపుడు గుగాగమం బగు, నప్పాదులకు విభాష నగు'.ప్రేరణార్థక మైన ఇంచుక్కు పర మైనపుడు అడ్డ మొద లైనధాతువులకు గుగాగమం నిత్యంగా వస్తుంది. అడ్డ+ఇంచు= అడ్డగించు.మొ.

అప్ప, ఒప్ప, పల్లము, కోపము అనేవాటికి గుగాగమం వికల్పంగా వస్తుంది. అప్పగించు–అప్పించు. మొ.

**3. ఇత్త్వానికి ఉత్త్వము** : 'చుక్పువర్ణంబులు పరంబు లగునపు డిత్వంబున

కుత్వం బగు'. ప్రేరణార్థంలో వచ్చే చుక్, పుక్, అనేఆగమాలు పర మైనపుడు పూర్వంలోని ఇత్త్వానికి ఉత్త్వం వస్తుంది. బిగియు + చు = బిగుచు. తెలియు + పు = తెలుపు. మొ.

**4. దకారము - లఘురేఫము :** 'ఆడోడుకూడులదకారంబునకుం జుక్కు పరం బగునపుడు రేఫం బగు' చుగాగమం పరం అవుతుండగా ఆడు, ఓడు, కూడు అనేధాతువులలో చివరి దకారంస్థానంలో లఘురేఫం (ర) వస్తుంది. ఆడు+చు = ఆరుచు. మొ.

'శబ్దపల్లవం బగుపడున కించుక్కు విభాష నగు, నగుచో డాకు లఘురేఫం బగు'. శబ్దపల్లవ మైన 'పడు' ధాతువుకు ఇంచుక్కు పర మైనపుడు దకారానికి లఘురేఫ అవుతుంది. వెలువడు+ఇంచు=వెలువరించు. (వెలువఱుచు)

**5. దకారము-అలఘురేఫము:** 'చెడునకుం జుక్పుగాగమంబులును డా కలఘురేఫంబు నగు'. చెడు అనేధాతువుకు ప్రేరణంలో చు, పు, అనేఆగమాలు రాగా పూర్వంలో ఉన్నదకారానికి అలఘురేఫం (ఱ) వస్తుంది. చెడు+చు=చెఱుచు. చెడు+పు=చెఱుపు.

'పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు'. పడుధాతువుకు చుగాగమమూ, అది వచ్చినపుడు డకారానికి అలఘురేఫమూ వస్తాయి. పడు+చు=పఱుచు.

**6. చకారము-పకారము :** 'ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు'. ప్రేరణార్థక మైన ఇంచుక్కు పరం అవుతుండగా పూర్వంలో ఉన్నధాతువుచివరిచకారానికి పకారం ఆదేశ మవుతుంది. పిలుచు+ఇంచు= పిలిపించు. వలచు+ఇంచు=వలపించు. మొ.

ఇది సంస్కృతసమధాతువులలో కూడా ఉన్నది. పచించు- పచింపించు. మొ.

**7. కడ(వ్రాలలోపము :** 'అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్వాదుల కగు, నగుచో వానికడ(వ్రాలు లోపించు' ప్రేరణంలో చుగాగమం పర మవుతుండగా పూర్వంలోని అడఁగు మొ.ధాతువుల చివర ఉన్న గువర్ణం లోపిస్తుంది. అడఁగు - అడఁచు. కలఁగు - కలఁచు. మొ.

అలాగే ప్రేరణార్థంలో వచ్చే పుగాగమం పర మవుతున్నపుడు మాయు మొద లైనధాతువులలో చివరిఅక్షరం లోపిస్తుంది. మాయు+పు=మాపు. తెలియు+పు=తెలుపు. మొ.

**8. ఇంచులోపము :** 'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' ప్రేరణార్థంలో వచ్చిన ఇంచు పర మవుతుండగా రంజ్ మొద లైన(సంస్కృత) ధాతువులకు స్వార్థంలో వచ్చిన ఇంచుక్కు లోపిస్తుంది. రంజ్ + ఇంచు + ఇంచు = రంజించు.

**9. బహువిధవర్ణలోపాలు :** 'ఇంచుక్ చుక్ పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశలోపంబులు పెక్కు తెఱంగులం గానంబడియెడి'. ప్రేరణార్థంలో వచ్చే ఇంచు, చు, పు అనేఆగమాలు పర మైనపుడు ఆచ్ఛికధాతువులకు ఆగమాలూ, ఆదేశాలూ, లోపాలూ అనేకవిధాలుగా వస్తున్నాయి.

1.ఆదేశం : విన్నపము– విన్నవించు. (పకారానికి వకారం ఆదేశం.)
కొను – కొలుపు. (నకారానికి లకారం ఆదేశం.)

2. ఆగమం : పలవ – పలవరించు (రేఫం ఆగమం)
ఆల – ఆలకించు (కకారం ఆగమం)

3. లోపం : ఉండు – ఉంచు (డు లోపం)
నిలుచు – నిలుపు (చులోపం)

ఇలాగే వచ్చు – రావించు, రప్పించు. పోవు – పుచ్చు, పంపు. మొద లైనచోట్ల ప్రేరణార్థకాగమాలు పర మైనపుడు ఆగమాదేశలోపాలు అనేకవిధాలుగా ఉండటం లక్ష్యాలనుబట్టి గ్రహించాలి.

## 6. (సమాపక) క్రియాపదాలను వివరించండి.

**క్రియ :** 'క్రియ లనగా వ్యాపారావబోధకము లయినవి' అని ప్రౌఢవ్యాకరణం పేర్కొంది. క్రియ అంటే వ్యాపారం. పని. పనిని బోధించేశబ్దానికి శబ్దశాస్త్రంలో క్రియ అని సంజ్ఞ. క్రియాపరిచ్ఛేదం వీటిని నిరూపిస్తుంది.

**భేదాలు :** వాక్యార్థంలో ఆకాంక్షాపరిసమాప్తిని బోధించేవి సమాపకక్రియలు. అపరిసమాప్తిని బోధించేవి అసమాపక్రియలు. ఇలా క్రియలు రెండు విధాలు అయినట్లు చెప్తారు. ఈవిభజనమూ, పేర్లూ ప్రాచీనులు చేసినట్లు కనబడదు.

**సమాపకక్రియలు :** 'క్రియ లనగా సమాపకక్రియలు' అని ప్రౌఢవ్యాకరణం. క్రియలు అంటే సమాపకక్రియలు మాత్రమే అన్నట్లుగా చెప్పడం కనిపిస్తుంది. దీనివల్ల అసమాపకక్రియలను క్రియలు అనరా దని ప్రౌఢవ్యాకరణం మతం అవుతుంది. సమాపక క్రియలనే క్రియాపదాలు అంటారు.

**క్రియాపదాలు :** ధాతువుపై వర్తమానం మొ. అర్థాలలో లట్ మొద లయిన లకారాలు వస్తాయి. వాటికి 'లకారంబునకు డుఱ్రువురునుము ఙ్గాగు' అనేసూత్రంచేత డుజ్ మొ. ప్రత్యయాలు అవుతాయి. ప్రథమపురుషలో (నీవు, మీరు, నేను, మేము అనేవాటికంటే వే రైనది కర్త అయితే ) ఏకవచనంలో 'డుజ్', బహువచనంలో 'రు' వస్తాయి. మధ్యమపురుషలో (నీవు, మీరు కర్త లైతే) వు-రు అనేవీ, ఉత్తమపురుషలో (నేను, మేము కర్త లయితే) ను-ము అనేవీ వస్తాయి. ఎను, దు, వు, మొద లైనవి ఆయాస్థలాలలో వీటిస్థానంలో వస్తాయి. ఈ 'డుజ్' మొద లైనవాటికి (క్రియా) విభక్తు లని పేరు. క్రియావిభక్తులు చివర గలిగినశబ్దాలు క్రియాపదాలు.

**భేదాలు:** వర్తమానం మొ. అర్థవిశేషాలనుబట్టి యీక్రియలు తెలుగులో ఆరు విధాలుగా ఉన్నాయి.

**1. వర్తమానార్థకాలు :** 'వర్తమానంబున ల ట్టగు'. ప్రారంభింపబడి ఇంకా ముగియని పని వర్తమానం. ఆఅర్థాన్ని తెలిపేధాతువుమీద లట్ అనేలకారం వస్తుంది. చదువుచున్నాఁడు, పలుకుచున్నవి మొ.

**2. భూతార్థకాలు :** 'భూతంబున లి ట్టగు' పూర్వం ఉండి అప్పటికి లేనిది భూతం. ఈఅర్థంలో ధాతువుమీద 'లిట్' వస్తుంది. వండెను. తింటివి. మొ.

**3. భవిష్యదర్థకములు :** 'భావిని లృ ట్టగు' అప్పటి కింకా పుట్టకుండా తరువాత ఏర్పడేది భావి. ఈఅర్థంలో ఉన్నధాతువుమీద 'లృట్' వస్తుంది. చదువఁగలను. చదువఁగలదు. మొ.

**4. తద్ధర్మాద్యర్థకాలు :** 'తద్ధర్మాదులందు లా ట్టగు'. తద్ధర్మం, తచ్ఛీలం, సంప్రశ్నం, సాతత్యం - మొద లయినఅర్థాలలో ధాతువుకు 'లాట్' వస్తుంది. చదువును, చదివెడిని, చదువుదుము, చదివెదరు. మొ.

**5. ఆశీరాద్యర్థకాలు :** 'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' ఆశీస్సు, శాపం, సంప్రార్థనం, విధి అనే అర్థాలలో ధాతువుకు 'లూట్' వస్తుంది.

**ఆశీస్సు**-మేలు కలిగెడును. ఇలాటివి ప్రథమపురుషలో మాత్రమే ప్రయోగాలలో ఉన్నా యంటారు. **శాపము**: రాక్షసుఁడ వగుము. **సంప్రార్థనం** : నన్ను రక్షింపుఁ డు మొ. **విధి:** చదువునది. ఇవి తరచూ మధ్యమపురుషలోనే ఉంటాయి. ఈఅర్థాలలో ఉత్తమపురుషక్రియలు కానరాలేదు. ఉభయ(నీవు-నేను-మొ.) ప్రార్థనంలో- చదువుదము, (ఉత్తమపురుష బహువచనం) ఉంటుంది.

**6. వ్యతిరేకార్థకాలు :** 'వ్యతిరేకంబున లజి యగు' వ్యతిరేకార్థంతో గూడి

ఉన్నపుడు ధాతువుమీద 'లజీ' వస్తుంది. వండఁడు, తినవు. మొ.

ఇలాగే ప్రార్థనంలో వ్యతిరేకార్థం చెప్పదలిస్తే, రక్షింపకుము మొ.

**మరొకవిభాగం :** ఈ సమాపకక్రియలు – అవి బోధించే అర్థవిశేషాన్నిబట్టి వేరొకవిధంగా విభజింపదగిఉన్నాయి.

**1. కర్త్రర్థకాలు:** క్రియచేత కర్త బోధింపబడితే అది కర్త్రర్థకం.

(మైత్రుడు) వండెను. మనియెను.

**2. కర్మార్థకాలు:** క్రియచేత కర్మ తెలియజేయబడితే అది కర్మార్థకం. ఇవి సకర్మక (కర్మ కలిగిన) ధాతువులనుండి మాత్రమే ఏర్పడతాయి. (వంటకము) వండఁబడెను.

**3. ఆత్మనేపదార్థకాలు:** క్రియాఫలం కర్తను పొందినట్లు చెప్పేది ఆత్మనేపదం. ఇవి కూడా సకర్మక(కర్మకలిగిన)ధాతువులనుంచి మాత్రమే ఏర్పడతాయి. వండుకొనెను. వండుకొనబడెను.

**4. ప్రేరణార్థకాలు:** ఇతరులచేత ప్రేరేపింపబడిన అర్థాన్ని తెలిపేవి ప్రేరణక్రియలు, వండించెను, మనిచెను. వండింపఁబడెను, మనుపఁబడెను. వండించుకొనెను, మనుచుకొనెను. వండించుకొనఁబడెను. మనుచుకొనఁబడెను.

## 7. అసమాపకక్రియలను గురించి వివరించండి.

వాక్యార్థంలో ఆకాంక్ష ముగియకుండటాన్ని తెలిపేక్రియలు అసమాపకక్రియలు. క్త్వా, తద్వ్యతిరేక, శతృ, తుమున్, చే, దానంతర్యార్థకాలు అసమాపకక్రియలు అని ప్రౌఢవ్యాకరణం పేర్కొన్నది. ఇందులో మొదటిమూడు (సమాపక) క్రియతో సమానమైనకర్త కలిగిన వనీ, మిగిలినమూడూ ఇతర మైనది కర్తగా గలిగిన వనీ స్థూలంగా పేర్కొన్నది. ఇవి అవ్యయాలు. లక్షణంచేత సాధింపబడినవి కాబట్టి లాక్షణికావ్యయాలు.

**1. ఇ – క్త్వార్థము :** 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' – ఒకేదానిని (కర్త, కర్మ) ఆశ్రయించి ఉన్న రెండు వ్యాపారాలలో పూర్వకాలానికి చెందినదానిని తెలిపేధాతువుకు 'ఇ' అనేప్రత్యయం వస్తుంది. చైత్రుఁడు వండి తినెను. చైత్రునిచేత మైత్రుఁడు కొట్టఁబడి చచ్చెను. ఇందలి వండి, కొట్టఁబడి అనే క్త్వార్థకాలు. అసమాపకక్రియలు.

**2. కజి – వ్యతిరేకక్త్వార్థము :** 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' వ్యతిరేకార్థంతో

కూడినక్త్వార్థంలో ధాతువుపై కజి అనే ప్రత్యయం వస్తుంది. క(జి) జీత్తు గాబట్టి 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు', అనేలక్షణంచేత ధాతువు చివరిఉత్వానికి అత్వం వస్తుంది. చైత్రుఁడు వండక తినఁగోరెను. ఇందు 'వండక' అనే వ్యతిరేకక్త్వార్థకం అసమాపక క్రియ.

**3. చును – శత్రర్థము :** 'చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునం దగు' శతృ అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం (వర్తమానార్థం)లో ధాతువుకు – 'చును' అనేప్రత్యయం వస్తుంది. చైత్రుఁడు చూచుచుం జదివెను. ఇందు 'చూచుచును' అనే శత్రర్థకం అసమాపకక్రియ.

**4. నుజి – తుమర్థము :** 'తుమర్థభావలక్షణంబులందు నుజి యగు' తుమున్ అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థంలో తెలుగులో 'నుజి' అనేప్రత్యయం వస్తుంది. ను(జి) జీత్తు గాబట్టి ధాతువు చివరిఉత్వానికి అత్వం వస్తుంది. చైత్రుఁడు వండఁ బోయెను. వండుటకొఱకు పోయెను. ఇందు 'వండను' అనేతుమర్థకం అసమాపకక్రియ.

**(నుజి) భావలక్షణము :** పయిసూత్రంచేత భావలక్షణంలోనూ నుజి వస్తుంది. భావలక్షణం అంటే "అన్యక్రియలకు లక్షణభూతం బగుక్రియ" చైత్రుండు వండ నతిథి వచ్చెను (అతిథి) వచ్చుట అనేక్రియను వండుట అనే క్రియ సూచిస్తున్నది. ఇందు 'వండన్' అనే భావలక్షణార్థకం అసమాపకక్రియ.

**5. నను – చేదర్థము :–** 'చేదర్థంబునందును వృత్తం బగుభావలక్షణంబునందును నవర్ణకంబు ద్రుతాంతం బగు'– చేత్ అనే సంస్కృతావ్యయంయొక్క అర్థంతో ఉన్నపుడు తెలుగులో ధాతువుపైన 'నను' అనే ప్రత్యయం వస్తుంది. ఇది భూతార్థవిశిష్టం. కాబట్టి 'భూతంబునం దిగాగమం బగు' అని ధాతువుకు ఇగాగమం అవుతుంది. వానలు కురిసినం బంటలు పండును. 'కురిసినను' (కురిస్తే) అనేచేదర్థకం అసమాపకక్రియ.

**వృత్తం బగుభావలక్షణము** : పయిసూత్రంచేత భూతార్థంలో ఉన్నభావలక్షణం లోనూ ధాతువుకు 'నను' ప్రత్యయం వస్తుంది. వాఁడు రమ్మనినఁ బోయితిని – అనినను (అనుటచేత) అనునది వృత్తం బగు భావలక్షణక్రియ. అసమాపకక్రియ.

**6. డును – ఆనంతర్యార్థము :–** 'ఆనంతర్యంబున డువర్ణకంబు ద్రుతాంతం బగు' వెంటనే, ఎడంకుండా అనేఅర్థంలో ధాతువుకు 'డును' అనేప్రత్యయం వస్తుంది. 'జాబిల్లి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లు' తోతెంచుడును (తోతెంచినవెంటనె)

అనేది ఆనంతర్యార్థకం. అసమాపకక్రియ.

ఇలా 1.ఇ (క్త్వార్థకం), 2.కజి (వ్యతిరేకక్త్వార్థకం), 3. చును (శత్రర్థం), 4.నుజి (తుమర్థం, భావలక్షణార్థం), 5.నను (చేదర్థం, వృత్తం బగుభావలక్షణార్థం), 6. డును (ఆనంతర్యార్థం) అనే ఆరు ప్రత్యయాలు చివర గలిగినధాతువులు అసమాపకక్రియలు.

## కృదంతపరిచ్ఛేదం

### 1. బాలవ్యాకరణం పేర్కొన్న కృత్ప్రత్యయాలను గూర్చి తెలపండి.

**కృత్తు**: ధాతువులకంటె విధింపబడిన 'దుఙ్ను' అనేదానికంటె భిన్న మైన ప్రత్యయానికి కృత్తు అని పేరు. భావం, కర్మం, మొద లైన ఆయాఅర్థాలలో ఇవి అవుతాయి. ఆఅర్థం లక్ష్యాల ననుసరించితెలియవలసిఉంది.

| సూత్రం | కృత్తు | కృదంతం |
|---|---|---|
| 1. టవర్ణకంబు భావంబునం దగు. | ట | వండుట |
| 2. వ్యతిరేకభావంబున మిజి యగు. | మిజి | వండమి |
| 3. కవర్ణకం బలుగ్వాదుల కగు. | క | అలుక |
| 4. ఇమి వర్ణకంబు కలుగ్వాదుల కగు. | ఇమి | కలిమి |
| 5. తజ్ వర్ణకంబు చేయ్వాదుల కగు. | తజ్ | చేఁత |
| 6. కువవర్ణకం బడంగ్వాదుల కగు. | కువ | అడఁకువ |
| 7. టవర్ణకం బాడ్వాదుల కగు, నగుచో నంతలోపం బగు. | ట | ఆట |
| 8. టువర్ణకంబు పడ్వాదుల కగు, నగుచో నవి యాద్యక్షరశేషంబు లయి దీర్ఘంబు నొందు. | టు | పాటు |
| 9. పవర్ణకంబు తిరియ్వాదుల కగు. | ప | తిరిపము |
| 10. తవర్ణకం బావులించు లోనగువాని కగు. | త | ఆవులింత |
| 11. పువర్ణకంబు మాయ్వాదుల కగు. | పు | మాపు |
| 12. ఇకవర్ణకం బంజ్వాదుల కగు. | ఇక | అంజిక |
| 13. అప్పాదులకు నజి యగు | నజి | అప్ప |

| | | |
|---|---|---|
| 14. బడి యేల్వాదుల కగు. | బడి | ఏలుబడి |
| 15. గడ చేర్వాదుల కగు. | గడ | చేరుగడ. |
| 16. ఇకి కోర్వాదుల కగు. | ఇకి | కోరికి |
| 17. పువర్ణకంబు మన్వాదుల కగు. | ను | మనువు |
| 18. అవర్ణకంబు గీఱ్వాదుల కగు. | అ | గీఱ |
| 19. డువర్ణకం బాఱ్వాదుల కగు | | |
| నగునపుడు పకారంబు చయల కగు. | డు | దంపుడు |
| 20. ఉవర్ణకం బడుక్వాదుల కగు. | ఉ | అడుకు |
| 21. వడిప్రభృతు లి ట్లెఱుంగునది. | వడి | కొలువడి |
| తనియు | వి | తనివి |
| నగు | అవు | నగవు |
| చేయు | ఇ | చేయి |
| కను | కలి | కనుకలి. |

# వ్యాకరణసామాన్యవిషయాలు

## 1. వ్యాకరణం ప్రయోజనాలు తెలపండి.

### వ్యాకరణం

'వ్యాక్రియన్తే శబ్దాః అనే నేతి వ్యాకరణమ్' అని వ్యాకరణశబ్దానికి నిర్వచనం. శబ్దాలను వ్యాకరించేది వ్యాకరణం. అంటే విభజించి చూపటం. ప్రకృతి, ప్రత్యయం మొద లైనవిధంగా విభాగం చేసి, శబ్ద(భాషా)స్వరూపాన్ని నిరూపించేది వ్యాకరణం.

సాధుశబ్దాలనుండి అసాధుశబ్దాలను వేరుచేసి చూపేది వ్యాకరణం. వ్యాకరణం ప్రధానంగా చేసేది సాధుశబ్దాలను నిరూపించటం.

ఇందులో భాషాలక్షణం చెప్పబడుతుంది కాబట్టి దీనిని లక్షణగ్రంథం అని వ్యవహరిస్తారు. కాగా లక్షణం అంటే వ్యాకరణం.

ఈశబ్దం ఇలా ఉండాలి, ఇలా ఉండగూడదు మొద లైనవిధంగా శబ్దస్వరూపాన్ని శాసిస్తుంది కాబట్టి వ్యాకరణాన్ని శబ్దశాసనం, శబ్దానుశాసనం అని కూడా వ్యవహరిస్తారు.

వ్యాకరణానికి వ్యాఖ్యానాలు కూడా భాషాలక్షణాన్ని చెపుతుంటాయి కాబట్టి వ్యాఖ్యానాన్ని కూడా వ్యాకరణంగా గుర్తించవచ్చు. లక్షణం చెప్పనిపదంవిషయంలో లక్ష్యమే శబ్దలక్షణానికి ప్రమాణం అవుతుంది. 'అనిష్పన్నే పదే తేన ప్రయోగాశ్రయణం హితమ్' అన్నాడు అధర్వణుడు. కాబట్టి లక్ష్యం కూడా ఒకవిధంగా వ్యాకరణమే.

(శబ్ద) అనుశాసనం, లక్షణం మొద లైనపేర్లతో ఈవ్యాకరణం వ్యవహరింప బడుతుంది.

### అసలు వ్యాకరణం ఎందుకు?

ఆంధ్రశబ్దచింతామణికర్త గ్రంథారంభంలో అసలు వ్యాకరణం వ్రాయవలసిన అవసరం గురించి ప్రశ్నించుకుని ఇలా సమాధానం చెప్పాడు. 'అనియమాద్ గ్రామ్యం హి'. నియమం అంటే వ్యాకరణం. వ్యాకరణం లేకపోతే భాష గ్రామ్యం అవుతుంది. 'య త్త్వపభ్రంశః' గ్రామ్యం అపభ్రంశం. అంటే అపశబ్దం. అందుచేత గ్రామ్యం

అంటే అపశబ్దం. వ్యాకరణం లేకపోతే భాష అపశబ్దం అయి కావ్యప్రయోగార్హం కాకుండా పోతుంది. కావ్యప్రయోగార్హత సిద్ధించా లంటే అపశబ్దత్వదోషం పోవాలి. అందుకే 'సంస్కారార్థో నియమః'. శబ్దగత మైనదోషాలను, దుష్టశబ్దాలను తొలగించి, సాధుశబ్దాలను నిరూపించటంకోసం ఏభాష కైనా వ్యాకరణం కావాలి. అందుకే వ్యాకరణం వ్రాస్తున్నా నన్నాడు.

అధర్వణుడు ఇంకా స్పష్టంగా 'సమ్మూలకత్వాత్ రూఢత్వాత్ గృహీతత్వా చ్చ సాధుభిః , నాపభ్రంశత్వ మేతస్య నియమాభావత స్తు తత్, నివారణాయ త స్యైవ ప్రవృత్తి ర్విదుషా మభూత్, తదర్థ మేవ హి వయం భూయ సాత్ర యతామహే, కవితోపాశ్రితం దోషం నైవ కించిత్ సహామహే.' అన్నాడు. తెలుగుభాష సంస్కృతంలాంటిశ్రేష్ఠ మైనభాష మూలంగా ఏర్పడింది. పండితులచేత ఆదరింపబడింది. అందుచేత అపభ్రంశం కాదు. కానీ, కేవలం వ్యాకరణం లేకపోవటంచేత మాత్రమే అపభ్రంశ మయిం దన్నాడు. అంటే వ్యాకరణం లేకపోవటంచేత, తెలుగుభాషాపదాలకు సాధుత్వం సిద్ధించకపోవటంచేత ఇది గ్రామ్యం అయింది. నిర్దుష్ట మైనశబ్దాలు మాత్రమే కావ్యాలలో ప్రయోగించవలసిఉండగా దోషాదోషాలను నిరూపించేశాస్త్రం లేకపోవటంచేత తెలుగు గ్రామ్యం అయింది. అందుకే లక్షణం చేస్తున్నా మన్నాడు.

గ్రామ్యం అయితే కావ్యప్రయోగార్హం కాదు. చిన్నయసూరి 'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అని సూత్రించి 'ఈభాష ప్రయోగంబునకు అనర్హంబు' అని వివరించాడు. ప్రయోగంబునకు అంటే కావ్యంలో ప్రయోగించటానికి అని అర్థం. లోకవ్యవహారంలో గ్రామ్యపదప్రయోగంలో దోషం లేదు. ప్రౌఢవ్యాకర్త ఒకచోట 'గ్రామ్యజనులపాటలయందును చెంచీత అని యికారదీర్ఘంబ వినంబడియెడి' అన్నాడు. ఈగ్రామ్యజనవ్యవహారము చెంచిత అనే ఇకారమధ్యరూపానికి ఒకఆధారం కావటం విశేషం. అయినా గ్రామ్యజనులపాటలో ఉన్నరూపాన్ని వ్యాకరణం అంగీకరించలేదు. దానికి కారణం అది కావ్యంలో ప్రయోగింపబడకపోవటమే.

అంటే వ్యాకరణం సాధుశబ్దాలను నిరూపిస్తే, అవి కావ్యంలో ప్రయోగింప బడడానికి అర్హాలవుతాయి. తర్వాత కావ్యంలో ప్రయోగింపబడినశబ్దాలను మాత్రమే వ్యాకరణం సాధిస్తుంది.

ఏ మైనా భాషకు (శబ్ద)సంస్కారంకోసం వ్యాకరణం అవసరం. అని చింతామణి వికృతివివేకాలు పైలక్షణాలతో నిరూపిస్తున్నాయి. ఆనాడు వ్యవహారంలో ఉన్న

వివిధప్రాకృతశబ్దాలను సంస్కరించటంచేత ఏర్పడినసంస్కృతభాషనే తరువాత కావ్యంలో ప్రయోగించా రనీ, సంస్కృతం అంటే వ్యవహారంలో ఉన్నభాషను సంస్కరించటంచేత ఏర్పడినదే అనేవిమర్శకులఅభిప్రాయం గమనింపవచ్చు. అలాగే తెలుగు కూడ. వ్యవహారంలో ఉన్నతెలుగుభాష సంస్కరింపబడితేనే అది కావ్యరచనాయోగ్యం అవుతుంది. కాబట్టి సంస్కారార్థమే వ్యాకరణం అని చింతామణి వికృతివివేకాలు పేర్కొన్నాయి.

సంప్రదాయబద్ధ మైనవ్యాకరణాలు ప్రాచీనకావ్యభాషకు లక్షణం చెప్పటంకోసం ఏర్పడ్డా యిని నిశ్చయంగా చెప్పవచ్చు.

నిజానికి నియమం భాషలో సహజంగా ఉన్నదే కాని, పండితులు ఎక్కడినుంచో తెచ్చి భాషకు బలవంతంగా అదికించేది కాదు. ఒకానొకపద్ధతి ప్రకారం ఉండటం అనేది భాషలోనే లేకపోతే వ్యాకరణంలో ఒక్కలక్షణం అనేకరూపాలను ఎలా సాధించగలుగుతుంది. అసలు లక్షణం అంటేనే అనేకవస్తువుల్లో సమానంగా ఉన్నధర్మం. రాముడు అనేరూపాన్ని వ్యాకరణం సాధించిం దంటే కృష్ణుడు, శివుడు, హరుడు ఇత్యాదిగా ఎన్నో పదాలు ఆపద్ధతిలో సిద్ధిస్తాయి.

ఇం తెందుకు? వ్యావహారికభాష వ్యాకరణానికి అనుగుణం గాదు. వ్యాకరణానికి విరుద్ధంగా ఉండేది గదా అని వ్యావహారికాన్ని ఎవరియిష్టం వచ్చినట్లుగా వారు ప్రయోగింపవచ్చునా? ప్రామాణికవ్యాకరణానికి విరుద్ధం ఐనా, వ్యావహారికానికి కూడా దానినియమం దాని కున్నది. రాముణ్ణి, లాగా కృష్ణుణ్ని, హరుణ్ణి, ఇలాగా ముందు డువర్ణకం ఉండేపదాలన్నీ ఒకేవిధంగా ఉంటాయి. అలాగే హరిని లాగా రవిని, తండ్రిని, మొ. రాముణ్ణి అన్నట్లుగా హరిణ్ని అనం కదా. అలా అంటే తప్పే, వ్యావహారికమే కదా అని హరిణ్ణి అంటే సాధు వవుతుందా? నకారం పరంగా ఉండగా, ముందరిశబ్దం చివర ఉండే డకారం ణకారంగా మారుతుం దనీ, దానిమీద నకారం కూడా ణకారం అవుతుం దనీ ఈవ్యావహారికభాషలో లక్షణం గుర్తించాలి. ఇలా వ్యావహారికభాషకు కూడా లక్షణం ఉంటుంది.

అందుచేత లక్షణవిరుద్ధం కావటం అనేది వ్యావహారికభాషలోనూ ఉంటుం దని గ్రహించాలి. అందుచేతనే భాషావేత్తలు వ్యావహారికభాషకు కూడా వ్యాకరణం అవసరం ఉందని గుర్తించారు. అక్కడ కూడా 'శిష్టవ్యవహారవిరుద్ధం గ్రామ్యం' గా గ్రామ్యం తప్పలేదు. అందుచేత ఏభాషకు ఉండేలక్షణం ఆభాషకు ఉంటుంది. కానీ

ఏభాష కైనా అసలు నియమమే లేకపోవటం అసహజం.

కాగా భాషలో సహజంగా ఉన్న లక్షణాలను గుర్తించి చెప్పడమే వ్యాకరణం చేసేపని. అంతే కాని శబ్దశాస్త్రవేత్తలు తమతమపాండిత్యం కొద్దీ ఇష్టం వచ్చినవిధంగా చెప్పడానికి వీలు లేదు.ఇలాగా భాషలోని లక్షణాలను చెప్పడంవల్ల ప్రయోజన మేమిటి?

## వ్యాకరణప్రయోజనం

సాధుశబ్దనిరూపణం వ్యాకరణానికి ప్రధానప్రయోజనం అయితే ఇతరప్రయోజనాలు ఏవి అనేవిషయం పరామర్శింపదగిఉన్నది.

'రక్షోహాగమలఘ్వసందేహాః ప్రయోజనమ్' అని రక్ష మొద లైనవి వ్యాకరణానికి ప్రయోజనాలుగా పతంజలిమహర్షి పేర్కొన్నాడు. ఆప్రయోజనాలు కొన్ని సంస్కృతభాషకు మాత్రమే చెందుతాయి.

పతంజలి పేర్కొన్న రక్ష మొద లైనవ్యాకరణప్రయోజనాలు కొంచెం అటు ఇటుగా సాధుశబ్దనిరూపణం అనేఅంశంలో చేరిపోతాయి. ఆంధ్రవ్యాకరణప్రయోజనాలు కొన్నిటిని ఆంధ్రలాక్షణికులు చెప్పారు. అన్నింటిని సమన్వయించుకుని ఆంధ్రవ్యాకరణానికి ప్రయోజనాలను ఇలా గ్రహింపవచ్చు.

## 1. భాషను సులువుగా నేర్చుకోవటం

వ్యాకరణం భాషయొక్క స్వరూపాన్ని నిరూపిస్తుంది. కాబట్టి భాషస్వరూపం తెలియజేయటం వ్యాకరణానికి మొదటిప్రయోజనం. కావ్యాదు లయినలక్ష్యగ్రంథాలనుంచి కూడా భాషను తెలుసుకోవచ్చు. కాని విస్తార మైన లక్ష్యప్రపంచం అంతా పరిశీలించటం చాలా కష్టం. వ్యాకరణం అంత శ్రమ లేకుండా భాషాస్వరూపాన్ని తెలుపుతుంది.

చిన్నయసూరి బాలవ్యాకరణపీఠికలో 'భాషాసమష్టికి లక్షణగ్రంథము కుదిరినపక్షమం దంత శ్రమపడఁ బనిలేదు. తుదముట్ట సర్వలక్షణపరిజ్ఞానము లక్ష్యపరిజ్ఞానముచేతనే సాధించుట మిక్కిలి దుష్కరము' అని పేర్కొన్నాడు.ప్రతిపదాన్ని కావ్యాలనుండి తెలుసుకోవడంకంటె సమానలక్షణాలనుబట్టి ఒకేచోట అనేకపదాలను తెలుసుకోవటం సులువు. సృష్టిలో ప్రతిఆవుదగ్గరికి వెళ్లి చూసి ఇది ఆవు, ఇది ఆవు అని ప్రత్యేకంగా తెలుసుకోవటంకంటె ఆవుయొక్క లక్షణాలను నిరూపించి

'ఈలక్షణాలు కలిగినది ఆవు' అని గ్రహిస్తే ఆలక్షణాలు గలిగినది ఎక్కడ ఉన్నా ఆవు అని ఒకేసందర్భంలో తెలియటం చాలా తేలిక. ఇలాగే భాషాలక్షణం కూడా.

అంటే భాషను సులువుగా నేర్పటం వ్యాకరణానికి ప్రయోజనం.అందుకే ఈరోజుల్లో కూడా ఇంగ్లీషు మొద లైనభాషలను నేర్పేటపుడు పద్యగద్యభాగాలతోపాటు వ్యాకరణాన్ని గూడా కలిపి చెప్పటం గమనించవచ్చు.

పతంజలి పేర్కొన్న వ్యాకరణప్రయోజనాలలో ఇది 'లఘు'అనేనాలుగవఅంశం.

## 2. సందేహనివారణం

శబ్దస్వరూపాదులను గూర్చినసందేహాలను నివారించటం వ్యాకరణానికి మ రొకప్రయోజనం. కొన్ని చిన్నవిషయాలలో సైతం ఒక్కొక్కసారి పండితులకు కూడా సామ్యాదులనుబట్టి భ్రమప్రమాదాలు సంభవిస్తాయి.

'అయ్యో నీసుతు గ్రద్ద తన్నుకొనిపోయన్', 'యవత నేనియు వెన్నుని యౌవనాఢ్య' మొద లైనస్థలాలలో పోయన్, యవత అనేవిధ మైనప్రయోగాలు ఇటువంటివే. యేమి, వుండదు మొద లైనవిధంగా తెలుగుపదాలమొదట యియీయెయే, వువూవొవో ఉచ్చరింపబడు తున్నాయి. నిజానికి ఈఉచ్చారణ శిష్టవ్యవహారంలో (వ్రాతలో లేకపోయినా) కూడా ఉన్న దనే చెప్పాలి. ఈదోషం తెలుగుకే కాక సంస్కృతశబ్దాలకు కూడా ప్రాకింది. పదాది యకారోచ్చారణప్రభావంచేతనే అయిష్టము ఇత్యాదిగా శిష్టవ్యవహారంలో కూడ వినిపిస్తున్నది. అనిష్టం అనేది లక్షణానుగుణం. 'యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు' అనేలక్షణం తెలుగులో ఆదోషాన్ని వారిస్తుంది.

ఇలాగే తెలుగులో కృమ్ము, శనగ అనేతీరుగా వ్రాయటం కనిపిస్తుంది. ఋ, శ మొద లైన ఆయావర్ణాలు అచ్చతెలుగులో లే వని వ్యాకరణంవల్ల తెలుసుకోవచ్చును. దీనిచేత లేఖనంలో, యతిప్రాసాదిసందర్భాలలో పొరపాట్లు మెల్లగా తొలగిపోతాయి. క్రుమ్ము, సెనగ అనేరీతివి సాధులక్షణానుగుణమైన సాధురూపాలుగా నిశ్చయించుకోవచ్చు.

ఇలా ఉచ్చారణం, కావ్యవ్యవహారం మొదలైనవాటిలో భిన్నరూపదర్శనంచేత ఏర్పడినసందేహాన్ని వ్యాకరణం తొలగిస్తుంది.

ఇది పతంజలి పేర్కొన్నవ్యాకరణప్రయోజనాలలో 'అసందేహ' అనే ఐదవఅంశం.

## 3. కావ్యభాషావగతి

వ్యాకరణం ప్రయోగశరణం. కవిప్రయుక్త మైనశబ్దాలకే వ్యాకరణం లక్షణం చేస్తుంది. చిన్నయసూరి బాలవ్యాకరణపీఠికలో 'పెక్కు లక్ష్యములు సావధానముగాఁ బరిశీలించి సూత్రగ్రంథము వ్రాసి' నట్లు పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త కవిప్రయోగాలకోసమే లక్షణం ఏర్పరచటం ప్రసిద్ధమే.

వ్యవహారంలో ఉన్నభాష జనులనోళ్లలో పెక్కు మార్పులకు లోనవుతూ, క్రమంగా ప్రాచీనరూపంకంటె వింతగా మారుతుంటుంది. కొన్నిసందర్భాలలో వ్యవహారంతీరే మారవచ్చు. అటువంటిసందర్భాలలో కావ్యభాష భిన్నంగా ఉండగా దానిని వ్యాకరణంవల్ల మాత్రమే తెలుసుకోవలసిఉంటుంది.

ఉదాహరణకు రాముణ్ణి, వస్తాడు మొద లైనరీతిగా వ్యవహారంలో ఉండగా రామునిని, వచ్చువాఁడు (లేదా రాఁగలఁడు) అనేతీరుగా కావ్యాలలో ప్రయోగింపబడిఉంటాయి.

కావ్యాలలో ప్రయుక్త మైన ఆపదస్వరూపాన్ని తెలుసుకోవాలంటే వ్యాకరణం తప్పనిసరి. వ్యాకరణం తెలియకుండా, వ్యావహారికభాషకు భిన్నంగా ఉన్నకావ్యభాషను గ్రహించటం సాధ్యం కా దన్నా తప్పు లేదు.

ప్రామాణిక మైన ఆంధ్రభాషాస్వరూపాన్ని చక్కగా తెలుసుకోగలగటం అనే ఈప్రయోజనం పతంజలి పేర్కొన్నవ్యాకరణప్రయోజనాలలో 'ఆగమ' అనేమూడవఅంశంగా గ్రహింపవచ్చు.

## 4. కావ్యభాషారక్షణం

ఇలా వ్యవహారంలో నిత్యపరిచిత మైనశబ్దస్వరూపంలోనే కాక అర్థస్వరూపంలో కూడా వ్యావహారికాంధ్రానికి కావ్యాంధ్రానికి భేదం కనబడుతుంది. తెలిసినరూపంకంటే వేరుగా ఉన్న ప్రాచీన(కావ్య) రూపాన్ని (దిద్దివేయకుండా) సముచితంగా గ్రహించడానికి వ్యాకరణమే ఆధారం.

ఉదాహరణకు 'ద్రోణుండు – ధనుర్వేద మగ్నివేశులతోడ నర్థిఁ గఱచి' అని కవిప్రయోగం. నేటివ్యవహారాన్ని అనుసరించి దీనికి ద్రోణుడు, అగ్నివేశుడు ఇద్దరూ సహాధ్యాయు లని అర్థం అవుతుంది. 'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు' అనేలక్షణాన్ని అనుసరించి అగ్నివేశుడు ద్రోణుడికి గురువు అనేయథార్థం

లభించి ప్రయోగంలోని ఔచిత్యం తెలియవచ్చు.

ఇలా ప్రాచీనరూపాలను చెడగొట్టకుండా, రక్షించటం వ్యాకరణానికి ఇం కొకప్రయోజనం.

ఇది పతంజలి పేర్కొన్నవ్యాకరణప్రయోజనాలలో 'రక్ష' అనేమొదటిఅంశంగా గుర్తించవచ్చు.

లౌకికసంస్కృతంకంటె భిన్నలక్షణంతో ఉన్న వేదసంస్కృతభాషాస్వరూపాన్ని కాపాడటం వ్యాకరణానికి ప్రయోజనం అయితే, తెలుగులో కావ్యప్రయుక్తభాషాస్వరూపసంరక్షణం ప్రయోజనం అవుతుంది. ఈరోజుల్లో వ్యావహారికభాష వ్యవహారానికి మాత్రమే పరిమితం కాకుండా వ్రాతలోనూ, గ్రంథరచనలోనూ దాదాపు ఏకైకంగా ఉపయోగింపబడుతుండడంచేత కావ్యాంధ్రభాష ప్రజలకు దూరం అవుతున్నది. లౌకికసంస్కృతంకంటె వైదికసంస్కృతం భిన్నం అయినట్లుగా సమీపభవిష్యత్తులోనే తెలుగు వ్యావహారికంకంటే కావ్యభాష భిన్న మైపోతుందని చెప్పవచ్చు. ఆకావ్యభాషాస్వరూపం రక్షించుకోవాలంటే వ్యాకరణంవల్ల మాత్రమే సాధ్య మని చెప్పక తప్పదు.

ఈరోజులలో కూడా అరుదుగా నయినా కావ్యం తెలుగులో వ్రాయదలచుకునేవారికి కావ్యాంధ్రభాష తెలిసిఉండాలి. ఇతరగ్రంథాలు వ్యావహారికభాషలో వ్రాస్తున్నా, పద్యకావ్యం మాత్రం ఇప్పటికీ దాదాపుగా ప్రామాణికభాషలోనే వెలువడుతున్నది.ఏ మైనా ప్రామాణి కాంధ్రభాషాస్వరూపాన్ని కాపాడుకోవటం అత్యవసరం కాబట్టి దానికి వ్యాకరణం తప్పనిసరి.

సంస్కృతంలో నైనా కేవలం వైదికసంస్కృతం మాత్రమే కాక కావ్యసంస్కృతభాషా స్వరూపం కూడా వ్యాకరణంవల్లనే గ్రహించవలసిఉంది.వ్యాకరణం లౌకికసంస్కృతలక్షణాన్ని చెప్తున్నది కదా.

### 5. పదస్వరూపగ్రహణం

కావ్యంలో సందర్భోచితంగా ఆయాపదాలు ఆయావిభ క్త్యాద్యంతాలుగా ప్రయోగింపబడతాయి.అన్ని పదాలు, అన్ని విభక్తులు మొద లైనరూప భేదాలతో ప్రయోగింపబడవు.కావ్యంలో ప్రయోగింపబడినరూపాన్నిబట్టి ఇతరవిభక్తులు, ఇతరపురుషవచనాలలో రూపాలను ఊహించడానికి వ్యాకరణం ఉపయోగిస్తుంది.

రామునిని అని ద్వితీయైకవచనపదం కవిప్రయోగంలో కనిపిస్తే దానిని బట్టి ఇతరవిభక్తివచనాలలో రామునిచేత, రామునియందు ఇత్యాదిగా ఆపదస్వరూపం ఉంటుం దని గ్రహించడానికి వ్యాకరణం ఆధారం అవుతుంది. అలాగే కంటిని అనేప్రయోగాన్నిబట్టి కంటివి ఇత్యాదిగా ఇతరపురుషవచనాలలో ఆపదస్వరూపాన్ని ఊహించడానికి వ్యాకరణమే ప్రమాణం.

ఇది పతంజలి పేర్కొన్నవ్యాకరణప్రయోజనాలలో 'ఊహ' అనేరెండవఅంశంగా గ్రహింపవచ్చు.

## 6. సాధుశబ్దవివేకం

తెలుగుకు వ్యాకరణం రచించవలసినఅవసరాన్ని గురించి చెప్తూ, చింతామణి 'సంస్కారార్థో నియమః' అన్నది. శబ్దసంస్కారం వ్యాకరణానికి మరొక ప్రయోజనం. వ్యాకరణంచేత సాధు–అసాధు శబ్దవివేకం గలుగుతుంది. వ్యవహారంలో ఉన్నభాషలకు దీనిఅవసరం ఇంకా అధికం అనిపిస్తుంది.

కూఁతురులు, కూఁతుళ్లు, కూఁతురిని ఇత్యాదిరూపాలు గ్రామ్యాలు. చేతురు, కోతు రిత్యాదు లసాధువులు. ఉంచి సాధుకవిప్రయోగారూఢం కాదు. ఇత్యాదిగా చిన్నయసూరి లోకవ్యవహారంలో ఉన్నవీ, కొన్నియెడల కావ్యాలలోకి ఎక్కినవీ, అయినశబ్దాలను కూడా ప్రామాణికప్రయోగాలనుబట్టి అసాధువులుగా పేర్కొన్నాడు. అన్నరో – మొద లైనవాటిని విషయంలో ప్రౌఢవ్యాకర్త కూడా ఆమోదం తెలుపలేదు.

ఇలా కావ్యప్రయుక్తం అయినా గ్రహించడానికి వీలు లేకపోవటం, వ్యవహారంలో ఉన్నా కూడా కావ్యాలలో ప్రయోగించడానికి వీలులేకపోవడమూ, ఎక్క డెక్కడ ఎలాగో సాధు– అసాధుశబ్దవివేకం కేవలం వ్యాకరణంచేతనే సిద్ధిస్తుంది.

చింతామణి చెప్పిన 'సంస్కారార్థో నియమః' అనేలక్షణం భాషకు వ్యాకరణం అవసరం మాత్రమే కాక, వ్యాకరణంప్రయోజనాన్ని కూడా తెలియజేస్తుంది. అదే శబ్దశుద్ధి. అసాధువు లైనశబ్దాలను తిరస్కరించి, సాధుశబ్దాలను నిరూపించడం వ్యాకరణానికి పరమప్రయోజనం.

వ్యాకరణశాస్త్రంతో పరిచయం లేకపోవటంవల్లనే గ్రంథకర్తలు తాము స్వయంగా వ్రాసినపుస్తకాలను పండితులకు అంటే శబ్దశాస్త్రం తెలిసినవాళ్లకు చూపి తమగ్రంథాలలో భాషను సరిచేయించుకోవటం గమనిస్తుంటాం. స్వయంగా

శబ్దశాస్త్రం తెలిసిఉంటే ఈఅవసరం ఉండదు.

వ్యాకరణశాస్త్రంవల్ల గ్రామ్యం అంటే దోషగ్రస్త మైనపదం ఏదో, ఆదోషం ఎటువంటిదో తెలుస్తుంది. పదంలోనిదోషం తెలిసినవాడు ఆపదాన్ని కావ్యంలో ప్రయోగించడు. కూతురిని, వనమునుంచి, చేతురు, ఇత్యాదిపదాలు దుష్టా లని తెలుసుకున్నవాడు సాధ్య మైనంతవఱకు అటువంటిపదాలను తనగ్రంథంలో ప్రయోగించకుండా ఉండటానికే ప్రయత్నిస్తాడు గదా. దుష్టపదప్రయోగం చేయకుండా ఉండడం ఒకప్రయోజనం.

.ఉదాహరణకు 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేవిధంగా హ్రస్వ మైన ఉకారానికి సంధి నిత్యం అనేవిషయాన్ని వ్యాకరణం ద్వారా గ్రహిస్తే ఉత్త్వంపైన యడాగమం చేయటం ఉండదు. పెద్దలు కూడా ఒక్కొక్కసారి 'వాడు యపుడు' ఇత్యాదిగా ఉత్త్వం మీద యడాగమం చేస్తున్నారు. ఇలాగే ద్రుతప్రకృతికాలు ఏవో కళలు ఏవో శబ్దశాస్త్రంద్వారా గ్రహించినపుడు ద్రుతప్రకృతికాలమీద యడాగమం చేయరు. లక్షణబద్ధ మైనభాష వాడా లనేఉద్దేశ్యంతోనే యడాగమం ప్రయోగిస్తారు. కాని అది ఉత్త్వం పైన, ద్రుతప్రకృతికాలపైన చేయటం గౌరవభంజకం అవుతుంది.

దుష్టపదప్రయోగంచేత కవికి ప్రామాణికత్వం ఉండదు. గ్రామ్యపదప్రయోక్తగా పండితుల అగౌరవం పొందవలసివస్తుంది. లఘ్వలఘురేఫలయతిప్రాసమైత్రి లక్షణవిరుద్ధం కావటంచేత 'అస్యా అత్యంతదోషత్వా ద్దుష్కవి స్స హి కథ్యతే' అంటాడు అథర్వణుడు. 'అది సాధుకవి ప్రయోగారూఢంబు కా దని యెఱుంగునది' అని మొదలుగా చిన్నయసూరి చెప్పగా ప్రౌఢవ్యాకర్త 'ప్రామాణికప్రయోగంబులందు.. ఇత్యాదిగా సూత్రంలోనే చెప్పటం గమనిస్తాం. లక్షణపరిజ్ఞానంచేత, వ్యాకరణంవల్ల ఇలాంటి అగౌరవానికి దూరం గావటం ఇంకొకప్రయోజనం.

శ్రీమద్రామాయణంలో హనుమంతుడిమాటతీరునుగూర్చి శ్రీరాముడు స్వయంగా

నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్

బహువ్యాహర తానేన న కించి దపభాషితమ్.

అంటాడు. చాలా మాటాడాడు, కాని అందులో అపశబ్దం లేదు. కాబట్టి హనుమంతుడు వ్యాకరణాన్ని చక్కగా నేర్చిఉంటా డని శ్రీరామచంద్రుడిప్రశంస.

అపశబ్దం లేకుండా మాటాడటం వల్లనే హనుమంతుడికి ఈవిధంగా శ్రీరాముడిప్రశంస లభించింది. ఇది కార్యసాధకం కావటం కూడా గమనించవచ్చు. బహుధా వ్యాహరతా అనటంచేత ఎక్కువగా మాటాడటానికి దగినధైర్యం శబ్దజ్ఞానంవల్లనే వస్తుంది అని గ్రహించాలి. లేకపోతే మౌనమె భూషణము మూఢమానవులకు. ఎక్కువగా మాటాడితే ఎక్కడ అజ్ఞానం బయటపడుతుందో అని మాటాడమే తగ్గిపోతుంది. వ్యాకరణానికి ప్రయోజనాన్ని భగవంతుడే స్పష్టం చేశాడన్నమాట

సాధుశబ్దజ్ఞానంవల్ల నిర్దుష్ట మైనపదప్రయోగం చేయటంద్వారా, గ్రంథకర్త ప్రామాణికు డై గౌరవానికి పాత్రు డవుతాడు. దీనివలన అసాధుశబ్దప్రయోగం చేసి అవమానంపాలు గాకుండటం, పండితసభలలో గౌరవింపబడటం మొద లైనప్రయోజనాలు వ్యాకరణంవలన సిద్ధిస్తున్నాయి.

కృత్తులు, తద్ధితాలు వాటిఅర్థాలు, అలాగే విభక్తులు, వాటిఅర్థాలు, ప్రకృతి ప్రత్యయ విభాగం మొద లైనభాషావిషయాలు కేవలంవ్యాకరణంవల్లనే తెలుస్తా యనటంలో సందేహం లేదు.

ఇలా వ్యాకరణం భాషయొక్క కీలకస్వరూపాన్ని ఆవిష్కరిస్తూ, అధ్యేతను సంస్కారవంతుడినిగా చేస్తూ భాషమీద అధికారాన్ని, తన్మూలాన గౌరవాన్ని, గలిగిస్తూ మిక్కిలి ప్రయోజనవంతమయిఉంది.

## 2. ప్రయోగశరణం వ్యాకరణమ్ - నిరూపించండి.

వ్యాకరణం ప్రయోగాన్నే ఆశ్రయించే ఉంటుంది. అంటే కవిప్రయోగానికి అనుగుణంగానే వ్యాకరణం చెప్పబడుతుంది అని అర్థం.

లక్ష్యం లేకుండా లక్షణం ఏది అయినా పుట్టటం అసంభవం. 'ఆవు' అనేజంతువు ఒకటి ఉన్నపుడు 'నాలుగు కాళ్లు కలిగిఉండడం' మొదలుగా దానిలక్షణం ఏర్పరచటానికి వీలు కలుగుతుంది. అసలు ఆవే లేకపోతే 'ఈలక్షణాలు కలిగింది ఆవు' అని చెప్పడం ఎలా కుదురుతుంది?

అలాగే భాషకు కూడా లక్ష్యం లేనిదే లక్షణం ఏర్పడేవీలు లేదు. ఆలక్ష్యం కవిప్రయోగం. రాముడు+అతడు=రాముడతడు. అనేవిధంగా సంధి జరగటం కవిప్రయోగాలలో ఉన్నది. కాబట్టే 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు'

అనేలక్షణం పుట్టింది. వచ్చియిచ్చెను అనేవిధంగా కవిప్రయోగాలలో సంధి లేదు. కాబట్టే 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అనేలక్షణం ఏర్పడింది. అలా కాకపోతే ఒకచోట సంధి అవుతుం దనీ, వేరొకచోట సంధి లే దనీ, చెప్పడం ఎలా? చెప్తే స్వీకరించడం ఎలా?

### ప్రయోగమూలకత్వం :

బాలవ్యాకరణం పీఠికలో చిన్నయసూరి స్వయంగా 'పెక్కు లక్ష్యములు సావధానముగా పరిశీలించి, రచనాప్రణాళిక నిర్ణయించుకొని', తా నొకలక్షణగ్రంథాన్ని రచించినట్లు పేర్కొన్నాడు. దీనినిబట్టి లక్షణానికి కవిప్రయోగమే మూలంగా సూరి స్పష్టం చేసిన ట్లయింది. 'ఒకానొకచో ననుటచే ప్రయోగవైరళ్యంబు సూచింపబడియె' . మొద లైనవివరణ లిటువంటివే.

శబ్దరత్నాకరం నిర్మించడానికి సంపాదించినకవిప్రయోగాలలోని విశేషాలు నిరూపించడానికే త్రిలింగలక్షణశేషం రచిస్తున్నట్లు ప్రౌఢవ్యాకర్త స్పష్టం చేశాదు.

కాబట్టి కవిప్రయోగాలలో ఆయాశబ్దాలు ఏయే తీరుగా ఉన్నాయో చూసి అవి ఆతీరుగానే ఉంటాయని వ్యాకరణం పేర్కొంటుంది. కాబట్టి ప్రయోగంలో లేనిదానికి లక్షణం ఏర్పడడమే ఉండదు.

### ప్రయోగప్రదర్శనం :

కొందరు లాక్షణికులు తాము చేసినలక్షణానికి ఉదాహరణలుగా కవిప్రయోగాలనే చూపించారు. అప్పకవి తాను చెప్పినయతిప్రాసాదులకు ఆయాకవులప్రయోగాలు అనేకం ఉదాహరించడం ప్రసిద్ధమే. స్పష్టంగా చెప్పీ, చెప్పకా, చిన్నయసూరి కూడా తనలక్షణాలకు పెక్కు కవిప్రయోగాలను ఉదాహరించాడు.

వ్యతిరేకమధ్యమమువర్ణకానికి లోపం రావడానికి ఉదాహరించిన 'నమ్మ కిట' అనేది ఉత్తరహరివంశంలో (సోమన)ప్రయోగం. సంబంధార్థంలో కు-విభక్తి కావడానికి ఉదాహరించిన 'నాకుం దమ్ముడు మీకు నెచ్చెలి' అనేది (పోతన)భాగవతంలోది. స్థలాంతరంలో 'ఆబుషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్' అనేది రామాభ్యుదయంలోది. ఇలా పెక్కుచోట్ల ఉదాహరణలు కవిప్రయోగాలె కావడం గుర్తింపవచ్చు.

ప్రౌఢవ్యాకర్త కవిప్రయోగాలను అన్నిచోట్లా చూపడం ప్రసిద్ధమే.

ఇలా లక్షణానికి కవిప్రయోగాలను ఉదాహరణలుగా ఇవ్వడ్ లక్షణం ప్రయోగాల ననుసరించి ఉండడాన్నీ, అందువల్ల ప్రయోగశరణం కావడాన్నీ సూచిస్తుంది.

### ప్రయోగప్రామాణ్యవర్ణనం:

జవ్వని+ఆలు=జవరాలు. ఇక్కడ జవ్వనిశబ్దానికి జవ ఆదేశం అవుతుం దని చెప్పిన చిన్నయసూరి 'ఏకాంతమునందు నున్నజవరాంఁడ్ర నని కవిప్రయోగము' అని వివరించాడు.

జవ్వని శబ్దానికి జవ అనేది ఆదేశం అవుతుం దని తాను చేసినలక్షణానికి జవరాంఁడ్ర అనే (పెద్దన మనుచరిత్ర) ప్రయోగం ప్రమాణం అని సూరి చెప్తున్నాడు. ఇది లక్షణం చెప్పడానికి కవిప్రయోగం మూలం అని స్పష్టంగా చెప్పిన ఇటువంటిస్థలాలు వ్యాకరణం ప్రయోగశరణం అని నిరూపిస్తాయి.

విశేషంగా కన్పించే ప్రయోగాలను నిరూపించడానికే వ్రాయబడిన ప్రౌఢవ్యాకరణంలో ఇటువంటిస్థితి సాధారణమే.

### భిన్నలక్షణతిరస్కారం:

సూరి ఒకచోట 'అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు వలికె నది నిరాకరంబు' అని చెప్పాడు. అలా పలికినఅప్పకవి అటువంటిప్రయోగాన్ని చేసి చూపాడు. అంటే కవిప్రయోగాలలో ఇక్కడ దీర్ఘానికి హ్రస్వం రావడం లేదు కాబట్టి అలా వస్తుం దని చెప్పినఅప్పకవిలక్షణం అంగీకరింపరాని దని అర్థం. ప్రయోగాలకు విరుద్ధంగా ఉంటే లక్షణమే తిరస్కరించాలి అనీ, కాగా లక్షణం ప్రయోగశరణ మై ఉండా లనీ, లక్షణకర్తే స్పష్టం చేశాడు. 'ఇట్టి ప్రయోగములచేత అన్యస్యాః క్వచి ద్భవే చ్చాన్యా అనుశబ్దశాసనులసూత్రము సార్థక మగుచున్నది' అనే ప్రౌఢవ్యాకర్త వివరణం దీనిని ఇంకా స్పష్టం చేస్తున్నది.

### ప్రయోగవర్ణనం:

ప్రయోగసామాన్యాన్ని అనుసరించి లక్షణం చేసినా ఆలక్షణానికి భిన్నంగా ఉన్న ప్రయోగాలను ప్రత్యేకంగా వర్ణించడం వ్యాకరణంలో కనిపిస్తున్నది. నమ శ్శబ్దంలో మాత్రమే ఓత్వాన్ని చెప్పినసూరి'ఈకార్యము లాతిచో సహితము కానంబడియెడి' అని వివరించి 'గతానుగతికో లోకో యంటంచు' అనేకళాపూర్ణోదయప్రయోగాన్ని చూపాడు. 'కెంధూళి, కెంజడ లనియు ప్రయోగంబులు గానంబడియెడి', 'ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు గల

దది ప్రయోగంబుల నెఱుంగునది,' మొ. అనేకస్థలాలు ఇటువంటివి.

'కొన్నియెడల ద్రుతంబుమీద నకారంబు గానంబడియెడి' స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి చూపట్టెడు' మొద లైనవిధంగా లక్షణంలో 'కానంబడియెడి'మొ. శబ్దాలు ప్రయోగాలను వర్ణిస్తున్నాయి.

ఇటువంటిలక్షణాలు ప్రౌఢవ్యాకరణంలో అధికం.

### ప్రయోగప్రాశస్త్యప్రకటనం :

'ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు' అని సూరి మహాకవులప్రయోగాలలో లక్షణానికి విరుద్ధ మై ఉన్నా, అవి అలాగే గ్రహింపదగినవే అని పేర్కొన్నాడు. ఇటువంటి లక్షణాలు (లక్షణంకంటే) ప్రయోగాలబలీయంతను నిరూపిస్తాయి. వ్యాకరణం ఏదో ఒకమార్గంలో ప్రయోగాలను ఆశ్రయించాలి అని సూచిస్తుంది.

### ప్రయోగలక్షణం:

భాషాస్వరూపం తెలియడంలో లక్షణంకంటే లక్ష్యాలలోనే లాఘవం ఉన్నపుడు ఆయావాటిని నిపాతలుగా పేర్కొనడమూ, ప్రయోగాలనుబట్టి లక్షణం తెలియజెప్పడమూ తెలుగువ్యాకరణంలోనూ ఉన్నది. 'కద్రువ నాగమాత, అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' మొద లైనలక్షణాలు ఇటువంటివి. ఇలాగే తద్ధితాలు, కృత్తులు మొ.

### అనేకవ్యాకరణోత్పత్తి:

లక్షణం ప్రయోగశరణం కావడంచేతనే ఏభాష కయినా వ్యాకరణగ్రంథాలు అనేకం ఏర్పడుతుంటాయి. పూర్వలాక్షణికులు చెప్పక విడిచినదానినీ, తరువాతి, తరువాతి కవులప్రయోగాలలో కనిపించేవిశేషాలను లక్షణబద్ధం చేయటానికి వ్యాకరణాలు వ్రాస్తుండడం జరుగుతుంది. బాలవ్యాకరణానికి పిదప ప్రౌఢవ్యాకరణం ఏర్పడడం కవిప్రయోగాలకు లక్షణం చేయడానికే కదా.

లక్షణం ప్రయోగాల నాశ్రయించి, దాని కనుగుణంగానే చెప్పబడుతుంది. కాని కవులు స్వతంత్రు లై ప్రయోగించడమూ ఉన్నది. అందువల్లనే నన్నయ కున్నప్రామాణ్యం ఆధునికకవులు మొద లైనవారివిషయంలో ఉండదు కదా. 'వనమునుంచి, ధనమునుంచి యని యుంచిశబ్దానుప్రయోగముతో కొందఱు వ్యవహరింతురు. కాని యది సాధుకవి ప్రయోగారూఢంబు కా' దని సూరి

తిరస్కరించాడు. ఇలాగే ప్రౌఢవ్యాకర్త కూడా 'ఒకానొకయాధునికగ్రంథమునందు అన్నరో, ఏనుంగురో అని ప్రయోగములు కానంబడుచున్నవి. వానికి బ్రామాణికప్రయోగంబులు కానంబడవు' అని తిమ్మకవి ప్రయోగాలను నిరసించాడు.

వ్యాకరణం (సాధుకవి)ప్రయోగశరణ మై ఉండడం అన్నది యితరభాషలకులాగా ఆంధ్రభాషకుకూడా చెల్లడం పెక్కు ఆధారాలతో గుర్తింపవచ్చు.

## 3. తెలుగునకు వ్యాకరణదీపము చిన్నది పరామర్శించండి.

చిన్న దైనదీపంవల్ల కాంతి సన్నంగానే కలుగుతుంది. అంతా ప్రత్యక్షం కాదు. కొంతఅసలె తెలియకుండగా, కొంత అస్పష్టంగా తెలుస్తూ ఉండగా, మరి కొంత కొంతమాత్రమే తెలుస్తుంది. భాషాస్వరూపాన్ని ప్రత్యక్షం చెసేదీపం వ్యాకరణం. తెలుగుకు అట్టి వ్యాకరణదీపం చిన్నది. అంటే తెలుగువ్యాకరణంచేత తెలుగుభాషాస్వరూపం అంతా తెలియదు. అంటే తెలుగుభాషను సమగ్రంగా తెలుగువ్యాకరణం నిరూపించటం లేదు. అందుచేత తెలుగుకు వ్యాకరణదీపం చిన్నది అంటే తెలుగవ్యాకరణం అసమగ్రం అనీ, లక్షణబద్ధం కాని తెలుగుభాష ఇంకా అధికంగా ఉన్న దనీ అభిప్రాయం.

**కారణాలు:**

బాలవ్యాకరణానికి గలిగినప్రాశస్త్యంవల్ల కావచ్చును, తెలుగుకు వ్యాకరణం అంటే బాలవ్యాకరణం ఒక్కటే అనే అభిప్రాయం ఏర్పడింది. (అదే పైఊహకు కారణం) కొందఱు ప్రౌఢవ్యాకరణాన్ని కూడ కలిపినా, ప్రాముఖ్యం మాత్రం బాలవ్యాకరణానికే.

బాలవ్యాకరణశిష్టలక్షణం అంతా ప్రౌఢవ్యాకరణంలో లేదు. అది దానిరచనాలక్ష్యం కూడా కాదు.

బాలవ్యాకరణం సమగ్రం కా దని తత్కర్తే స్పష్టంగా చెప్పాడు. ఇంకా తెలుగులక్షణమే మొత్తం మీద సమగ్రం కాదనడానికి హేతువులు కూడ కొన్ని చిన్నయసూరి బాలవ్యాకరణంలో చెప్పాడు.

**అలభ్యవ్యాకరణాలు :** బాలవ్యాకరణపూఠికలో సూరి తెలుగుకు వ్యాకరణాలు చాల ఉన్నా అందులో కొన్నింటికి పేర్లు మాత్రమే వినబడుతున్నా యని పేర్కొన్నాడు. తెలగువ్యాకరణాలు కొన్ని దొరకటం లేదు. పేర్లు కూడ వినిపింపని

గ్రంథాలు ఉండిఉండవచ్చు. ఏ మైనా, దొరకనిగ్రంథాలవల్ల తెలియగలిగినది ఏమి ఉంటుంది?

**సంస్కృతసమలక్షణం:** అక్కడే సూరి లభ్య మవుతున్నగ్రంథాలలో సయితం సంస్కృత లక్షణమే అధికంగా చెప్పబడింది కాని ఆచ్ఛికాలకు అంతగా లక్షణం చేయబడలే దన్నాడు.

ఇలా బాలవ్యాకరణానికి పూర్వం ఉన్నతెలుగువ్యాకరణాలు అన్నీ ఆంధ్రభాషలో ఏకదేశం ఐనసంస్కృతసమాలలక్షణం చెప్పటానికే ప్రాధాన్యం ఇచ్చాయి. కాబట్టి అవి అసమగ్రాలు అని సూరి స్పష్టం చేసినట్లే కదా.

**బాలవ్యాకరణం సమగ్రమా?** సూత్రాంధ్రం అని సంస్కృతంలో ఒకవ్యాకరణం వ్రాసి బాలురకై అందలికొన్నిసూత్రాలను తెనిగించి బాలవ్యాకరణం వ్రాసినట్లు సురి అక్కడే పేర్కొన్నాడు. ఇలా సూరి తాను గుర్తించినలక్షణాన్నే పూర్తిగా బాలవ్యాకరణంలో చెప్పలేదు. 'రేఫంబులు లఘ్వలఘువులు తక్కుంగలవిశేషంబు లార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు' అని బాలవ్యాకరణం చివర చెప్పాడు. మిగిలినలక్షణాన్ని సూత్రాంధ్రవ్యాకరణంనుంచి తెలుకుకొ మ్మన్నాడు. ఇలా బాలవ్యాకరణం సమగ్రం కా దని తత్కర్తే స్పష్టంగా చెప్పిన ట్లయింది.

**సూత్రాంధ్రాదులు:** సూత్రాంధ్రవ్యాకరణంలో కూడ 'శాసన మిదం దిక్ప్రదర్శకమ్' అని అది దిక్ప్రదర్శకంగా మాత్రమే చెప్పినట్లు పేర్కొన్నాడు. తరువాతి దైనబాలవ్యాకరణంలోనూ ఇలాగే 'దిక్ప్రదర్శకముగఁ దెలిపెద నిందు లక్షణము' అనే చెప్పి పూర్వకవులక్ష్యాలనూ, లాతిలక్ష్మాలనూ చూసి మిగిలినలక్షణం తెలుసుకో మన్నాడు. ఇతరవ్యాకరణాలతోపాటు లక్ష్యగ్రంథాలను గూడ చూసి బాలవ్యాకరణంలో చెప్పకుండా విడిచిపెట్టినలక్షణం తెలుసుకోవాలి. సూత్రాంధ్రం కూడా చిన్నయసూరి వ్రాసినది మొత్తం మనకు దొరకటం లేదు.

**త్రిలింగలక్షణశేషం:** పయి సూరిసూచనను అనుసరించే కావచ్చు, బహుజనపల్లి వారు ఇతరవ్యాకరణాలనూ, కవిప్రయోగాలనూ కూర్చి 'త్రిలింగలక్షణశేషము' అనేపేరుతో ఒకవ్యాకరణాన్ని రచించారు. తనయీగ్రంథంలో తెలుగువ్యాకరణం సమగ్రం ఐనట్లు ప్రౌఢవ్యాకర్త తలచారో లేదో స్పష్టం గాదు.

సమగ్రత సంభవమా? ఏభాషకైనా ఒకవ్యాకరణం సమగ్రం కావటం సంభవం కూడా కాదు. పాణినీయం అసాధువు లన్నశబ్దాలు కొన్ని యితరసంస్కృతవ్యాకరణాలు ప్రస్తావించాయి. అందులోనూ జనవ్యవహారంలో ఉన్నభాషకు వ్యాకరణం సమగ్రం

కావటం ఇంకా అసాధ్యం అనే చెప్పాలి. ఎంతలక్షణం ఉన్నా, వ్యవహారంలో మార్పును పొందినశబ్దం వెంటనే ప్రమాణీకరింపబడటం కూడా కష్టమే.

తెలుగులో నన్నయ ప్రయోగించినదు తప్ప వే రొకపదాన్నే గ్రహింప రా దని కవిరాక్షసుడు నియమించాడు. ఈఅభిప్రాయాన్ని తరువాత మారినా కవిత్రయం మొద లైనకొందరిమీద ఉన్నప్రామాణ్యబుద్ధి 15శతాబ్ది, ఆతరువాతికాలపుకవులమీద దృఢంగా ఏర్పడ లేదు. అందుకే బాలవ్యాకర్తలాగానే ప్రౌఢవ్యాకర్త కూడా అన్యదేశ్యాలను ప్రస్తావించలేదు.

బాలవ్యాకరణం సాధించనిశబ్దం అసాధువే అనేవిశ్వాసం కూడా ఇందుకు ఒకకారణం. బాలవ్యాకరణంమీద ఉన్నప్రామాణ్యబుద్ధి ప్రౌఢవ్యాకరణం మీద కూడా లే దనటం తప్పు గాదు. ఇతర ఆంధ్రవ్యాకరణాలలో చెప్పబడినలక్షణానికి గుర్తింపే లభించటం లేదు.

లాక్షణికులదృష్టి సంస్కృతసమాలయెడనే ప్రముఖంగా ప్రవర్తించటంచేత సంస్కృతభవ, ప్రాకృతభవాలను గుర్తించటంలో కానీ, వాటికి లక్షణం నిరూపించటంలో కానీతగువిధంగా ప్రసరింపలేదు. ఇలాగే కృత్తులు, తద్ధితాలు, వాటి అర్థాలు, అన్యదేశ్యాలు మొద లైనఅంశాలు ఇంకా పరిశీలించి నిర్ణయించవలసినస్థితిలోనే ఉన్నాయి.

**తెలుగువ్యాకరణప్రశస్తి :** తెలుగుకు లక్షణం సమగ్రం అనరాకున్నప్పటికీ, తెలుగు వ్యాకరణదీపం చిన్నదె, అన్నా, ఉన్నది ఆంధ్రభాషయొక్క సామాన్యమూ, ప్రధానమూ అయినస్వరూపాన్ని ప్రత్యక్షం చేయజాలిఉన్నది అని మాత్రం అంగీకరించవలసిందే. అల్పప్రయోగాలు మొద లైన కొన్ని ఈవెలుగులోకి రాకపోవటం పరిగణింపదగినలోటు కాదు. తెలుగువ్యాకరణం గౌరవం ప్రశంసార్హం.

## 4. పేరునకు బాలవ్యాకరణ మయ్యును విషయవివేచనమున సాటిలేనియుద్గ్రంథము - పరామర్శించునది.

సూరి సూత్రాంధ్రవ్యాకరణం అనేగ్రంథంగా సూత్రాత్మకంగా సంస్కృతంలో ఆంధ్రబాషాలక్షణాన్ని విస్తరించి రచించాడు. బాలురకు సులువుగా తెలియటంకోసం తర్వాత చివరలో ఆసూత్రగ్రంథంలోని సూత్రాలు కొన్ని తెలుగుచేసి బాలవ్యాకరణం అనేగ్రంథాన్ని కూర్చాడు.

**బాలవ్యాకరణం:**

బాలవ్యాకరణపీఠికలో సూరి పేర్కొనినదాని ననుసరించి ఇది బాలురకు

సులువుగా తెలియటంకోసం వ్రాయబడినగ్రంథం. ఇలా బాలురకొఱ కయినగ్రంథం కాబట్టి ఇది బాలవ్యాకరణం. బాలురు అంటే విషయాన్ని గ్రహించటంలోనూ, గ్రహించినవిషయాన్ని ధరించటం (మరచిపోకుండా గుర్తుంచుకోవటం) లోనూ సమర్థు లయినవారు. పేరునుబట్టి పైకి ఇది ఏదో పిల్లలవ్యాకరణం అనిపించినా, ప్రాథమికాంశాలను మాత్రమే తెలిపేది అనడానికి వీలు లేదు. విషయం అంతా సులువుగా తెలియజెప్పేదే కాని విషయాన్ని మిక్కిలి సంగ్రహించి సులువు చేసినది మాత్రం కాదు.

బాలవ్యాకరణానికి పూర్వం, తరువాత గూడ తెలుగువ్యాకరణాలు చాలా ఉన్నా, తెలుగుకు వ్యాకరణం అంటే బాలవ్యాకరణమే అనీ, బాలవ్యాకరణంచేత సాధింపబడనిరూపం సాధువే కా దనీ, విశ్వసించేంతగా బాలవ్యాకరణం ప్రసిద్ధ మైంది. ఇందులో చెప్పబడినవిషయాన్నిబట్టీ, చెప్పినవిధానాన్నిబట్టీ, దీని కిటువంటికీర్తి కలిగిం దని తెలియవచ్చు.

**విషయవివేచనం**

ఇందలో ఆంధ్రభాషావిషయం విస్తృతపరిశీలనంలో నిరూపించబడినతీరు మరొక ఆంధ్రవ్యాకరణంలో కనబడదు. దానిని ఇలా గుర్తింపవచ్చు.

**1. లక్ష్యవిస్తృతి** కవిత్రయం, శ్రీనాథుడు, సోమన మొద లైనప్రాచీనుల గ్రంథాలతోపాటు పేద్దన, సూరనాదు లైన ఆధునికులగ్రంథాలనుండి కూడా సూరి లక్ష్యాలు ప్రదర్శించాడు. అప్రామాణిక దని పెక్కురు లాక్షణికులు తిరస్కరించిపోతనప్రయోగాలను కూడా సూరి ఉద్ధరించాడు. అంటే సూరిలక్షణానికి లక్ష్యం అయినభాష పరిధి విస్తృతం. కవిరాక్షసాదులలాగా నన్నయప్రయోగాలు మాత్రమే గ్రాహ్య మని కాని మొదలుగా లక్ష్యప్రపంచాన్ని సూరి సంకుచితం చేసికోలేదు. దీనివల్ల బాలవ్యాకరణలక్షణం ఇతరాంధ్రవ్యాకరణాలకంటె అధికంగా భాషాస్వరూపాన్ని ఆవిష్కరింపగల్గుతున్నది.

**2. విషయవిభాగం** సంస్కృతవ్యాకరణప్రభావంతోనె అయినా, సూరి ఆయాపరిచ్ఛేదాలను సంజ్ఞా,సంధి, అని మొదలుగా ఆయావిషయాలనుబట్టి చేసినవిభాగమె భాషనుగూర్చి స్థూలంగా ఒక అభిప్రాయాన్ని గలిగిస్తూ దృఢ మైనరచనాప్రణాళికతో కనిపిస్తుంది.

**3. ఆచ్ఛికనిరూపణం** సూరి పీఠికలో పేర్కొనినదాని కనుగుణంగా సంస్కృతసమాలతో సమంగా ఇందలో ఆచ్ఛికపదస్వరూపనిరూపణం విస్తరించిఉంది. ఆచ్ఛికాలకు ఒకపరిచ్ఛేదం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడింది.

క్రియాపరిచ్ఛేదంలో దేశ్యక్రియాపదనిరూపణం ప్రముఖంగా విస్తరించి చెప్పబడింది ఇది ఇతరాంధ్రవ్యాకరణాలకంటె మిక్కిలి అధికమూ, సమగ్రమూ అయినప్రణాళికతో ఉండటం గమనింపవచ్చు.

సర్వనామాలపట్టిక, కృత్తద్ధితప్రకీర్ణపరిచ్ఛేదాలలో ఔపవిభక్తికప్రకరణంలో ఆచ్ఛికపద నిరూపణం సూరిలక్ష్యాన్ని సాధిస్తున్నది.

**4. కారకసమాసవివరణం** ఇందులో తెలుగువిభక్తులఅర్థం విస్తరించి చెప్పబడింది. కర్త్రాదిసంజ్ఞలయర్థము సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించి తెలుగుచేయబడింది. దీనివల్ల కొన్ని ఇతరాంధ్రవ్యాకరణాలలాగా సంస్కృత వ్యాకరణాన్ని ఆశ్రయించవలసినఅవసరం తగ్గి తెలుగులక్షణానికి స్వయంసంపూర్ణతా, స్పష్టతా కలిగింది. ఇలా ఆయాసమాసాలలక్షణాన్ని బాలవ్యాకరణంలో ఇతరవ్యాకరణాలకంటె విస్తరించి చెప్పబడింది.

**5. కృత్తద్ధితనిరూపణం**: కృత్తులను తద్ధితాలను ప్రత్యేకపరిచ్ఛేదాలలో నిరూపించటం ఇందులో మ రొకవిశేషం.

**రచనావిధానం**

చెప్పబడినవిషయంతోపాటు చెప్పినపద్ధతి గూడ బాలవ్యాకరణానికి ప్రశస్తిని తెచ్చింది.

**1. స్పష్టత**: 'లలితోక్తులలో లక్ష్యయోజన మొప్పంగ' సూరి బాలవ్యాకరణము రచించాడు. స్వీయోదాహృతులు, కవిప్రయోగాలు, చమత్కారయుక్తంగా కూర్చి లక్షణాన్ని సూరి బాలామోదకరం చేసాడు.

**2. సంస్కృతసంప్రదాయానుసరణం**: సంజ్ఞాపరిభాషాదులలో సంస్కృతవ్యాకరణమార్గాన్ని అవలంబించటంచేత సూరిలక్షణం అల్పాక్షరంతో అనల్పార్థం సాధించింది. దీనివల్ల ప్రామాణికత్వమూ, తెలుగువ్యాకరణానికి శాస్త్రగౌరవమూ కలగటంతోపాటు భాషాస్వరూపాన్ని విశేషంగా నిరూపించటం సాధ్య మయింది. అంతకు పూర్వం పఠన పాఠనాలలో ఉన్నతెలుగువ్యాకరణాలను బాలవ్యాకరణం త్రోసిరా జనగలిగింది.

**3. బహులక్ష్యసంగ్రహణం:** లక్ష్యగ్రంథాలను బహుధా పరిశీలించిన చిన్నయలక్షణం ఆంధ్రభాషాసామాన్యలక్షణాన్ని ప్రతిబింబిస్తుంది. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తుల యుత్వంబున కిత్వం బగు' 'ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో

ననాద్యం బయిన యుత్వంబున కిత్వం బగు' మొద లైన సూరిసూత్రాలు ఇటువంటివి.

ఇటువంటి లక్షణాలు చారిత్రకవ్యాకర్తలమన్ననలు గూడ పొందినాయి. తెలుగువిభక్తుల నిరూపణం మొద లైనఅంశాలలో సూరి లక్ష్యసంగ్రహణదృష్టి స్పష్టం. ఉదాహరణకు 'ల' ద్వితీయా విభక్తిగా పూర్వలాక్షణికులు చెప్పగా తృతీయాదులలోలాగా ద్వితీయలోనూ విభక్తికి ఆగమంగా సూరి దీనిని సంగ్రహించాడు. ను, కు విభక్తులనుంచి ని,కి అనేవిభక్తిరూపాలను సాధించాడు.

**4. పరిణతి - ప్రామాణ్యం**: పూర్వలక్షణగ్రంథాలను అనుసరించినా, లక్ష్యానుగుణంగా తగుమార్పులు చేసి చెప్పటంవల్ల సూరిలక్షణానికి ప్రామాణ్యం గలిగింది.

'అహమాదీనాం ద్విత్వమ్' అని చింతామణి చెప్పగా సూరి 'అనుకరణంబునం దహమాదులమకారంబునకు ద్విరుక్తి విభాష నగు' అన్నాడు. 'అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు' మొద లైనవాక్యాలు సూరిలక్ష్యలక్షణపరిశీలనాపాటవంతో బాలవ్యాకరణం రచించడాన్ని నిరూపిస్తుంది.

ఇలాగే సూరి ఆంధ్రశబ్దానుశాసనాదు లైనతెలుగువ్యాకరణాలను రచించాడు. సూత్రాంధ్రంతో గూడ తనవ్యాకరణాలలోని లోటుపాట్లు సరిదిద్దుకొని పరిణతంగా బాలవ్యాకరణం రచించాడు. సూరి పదియెనిమిదేండ్లకు పైగా చేసినపరిశ్రమకు ఫలితంగా మిక్కిలి పరిణత మై, వెలువడినబాలవ్యాకరణానికి సాటిగా ఒకవ్యాకరణం పుట్టటం అసంభవం అంటే తప్పు లేదు.

## 5. సూరిసూత్రలక్షణం - భేదాలు

తెలుగువ్యాకరణాలు ఒకటి రెండు స్వతంత్రమార్గంలో రచింపబడినా, చాలవఱకు సంస్కృతసంప్రదాయానుసారంగా కూర్పబడినవే. సూరి బాలవ్యాకరణంతో గూడ తన అన్నివ్యాకరణాలు ఆమార్గంలోనే రచించాడు. అలాగే సూరిసూత్రాలు సంస్కృతవ్యాకరణంమార్గంలో ఆయాసూత్రలక్షణాలతోనే ఉండటం గమనించవచ్చు..

### సూత్రలక్షణం

సూత్రయతి అర్థం గ్రథ్నాతి ఇతి సూత్రమ్. సూత్రానికి కొన్ని ప్రత్యేకలక్షణాలు ఉండాలి. అని సంస్కృతసంప్రదాయం.

**అల్పాక్షర మసందిగ్ధం సారవద్ విశ్వతోముఖమ్,**
**అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః.**

(ముగ్ధబోధవ్యాకరణం. సంజ్ఞాపాదాంతసూత్రదుర్గాదాసవ్యాఖ్య.)

అని సంస్కృతంలో సూత్రానికి ఆరు లక్షణాలు చెప్పారు. సూరిసూత్రాలు అన్నీ ఈలక్షణాలు మొత్తం కలిగిఉన్నవే. ఆయాసూత్రాలలో ఈలక్షణాలు ఇంకా విశేషంగా గోచరిస్తాయి.

తెలుగులో గానీ, సంస్కృతంలో గానీ ఛందోబద్ధంగా రచించినగ్రంథాలలో ఈరక మైనసూత్రలక్షణాలు కుదరవు. గణయతిప్రాసాదిలక్షణాలకోసం ఎంతో కొంత వర్ణాధిక్యం తప్పదు. అందుకే వ్యాకరణగౌరవం సిద్ధించా లంటే లాఘవం సంపాదించిపెట్టే సూత్రమార్గమే శ్రేష్ఠం. సూరి అందుకే సూత్రమార్గాన్ని అనుసరించాడు. అందువల్ల సూరిసూత్రాలలో పై లక్షణాలు నియతంగా ఉంటాయి. చందోబద్ధ మైన త్రిలింగశబ్దానుశాసనం, ఆంధ్రభాషాభూషణం వంటి సంస్కృతాంధ్రలక్షణగంథాలలో లక్షణం ఈవిధంగా ఉండేఅవకాశం చాలా తక్కువ.

**1. అల్పాక్షరం:** సూత్రం తక్కువ అక్షరాలతో స్వల్పపరిమాణంలో ఉండాలి. అంటే చెప్పదలచిన అర్థం మొత్తం సాధ్య మైనంత తక్కువ అక్షరాలలో చెప్పాలి.

కొన్నిచోట్ల వివరణరూపంలో చెప్పడంచేతా, కొన్నిచోట్ల విస్తృతవిషయం ఒక్కచోట కూర్చాలనుకోవడంచేతా, ప్రౌఢవ్యాకరణసూత్రాలు అధికాక్షరాలతో వ్యాఖ్యానప్రాయాలు కావడం గుర్తింపగలం. సూరిసూత్రాలు అలా కాదు.

'వానిలో రుములు బహువచనంబులు, పెఱ లేకవచనంబులు' ఈసూత్రంలో 'డురువురునుము' అనేక్రియావిభక్తులలో ముందుగా బహువచనాలు చెప్పబడ్డాయి. నిజానికి ముందు ఏకవచనాలను చెప్పి ఇతరాలు బహువచనాలు అనడం క్రమం. అయినా రురుము అనేబహువచనాలలో రువర్ణాలు రెండూ ఒక్క 'రు' వర్ణంచేత సంగ్రహింపబడుతూ, 'రుములు బహువచనము' లనడంలో ఒక్కఅక్షరం తగ్గింది. ఇది అల్పాక్షరత్వసాధనకే అని స్పష్టం.

**2. అసందిగ్ధం:** సూత్రం సందేహరహితం కావాలి. అల్పాక్షరం కావాలి అని సంక్షేపించడంవల్ల గానీ, ప్రమాదాదులవల్ల గానీ, చెప్పవలసినఅర్థం మొత్తం చెప్పకపోతే అక్కడ సందేహాలు కలుగుతాయి. ఉదాహరణకు 'గుణవాచకంబులు గొన్నింటి నిగాగమంబునకుఁ బరుషంబులు పరంబు లగునపుడు బిందు వగు'. అనే ప్రౌఢవ్యాకరణ సూత్రంలో మీదిపరుషం ఏ మవుతుందో చెప్పలేదు. దానివల్ల

బిందువు మాత్రమే వచ్చి కమ్మంతేనె అని కావలసివస్తుంది. కవిప్రయుక్త మైన కమ్మందేనె సాధువు కా దేమో అనే సందేహం కలుగుతుంది. ఇంకా 'బిందు వగు' అని బిందువును నిత్యంగా చెప్పటంచేత బిందువు రాని కమ్మనితేనె అనే రూపం సాధువా? కాదా? అనేసందేహం కలుగుతుంది. సూరి లక్షణాలలో ఇలాంటిస్థితి లేదు.

'యకారంబును వువూవొవోలును దెలుగుమాటలకు మొదట లేవు' ఇక్కడ తెలుగుమాటలు అంటే సంస్కృతసమాలు గ్రహించాలా? కూడదా అని సందేహం కలగవచ్చు. 'సంస్కృతసమేతరంబు లయినతెలుగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు గానంబడుచున్నది' అనేపూర్వసూత్రంనుంచి 'సంస్కృతసమేతరంబు లయిన' అనేది అనువృత్తం కాగా అచ్చతెలుగుమాటలు అనేఅర్థం సిద్ధించి ఆసందేహం తొలగి పోతుంది. కాగా సంస్కృతసమం మొదట యకారం ఉండవచ్చు. యముడు, యాత్ర మొ.

**3. సారవంతం :** సందిగ్ధత ఉండ రా దని– వివరిస్తూ, సిద్ధిస్తున్న అర్థాన్నే మళ్లీ, మళ్లీ చెప్పడం, ప్రయోజనం లేనిపదాలు కూర్చడం, మొద లైనవి చేస్తే, సూత్రం నిస్సారం అవుతుంది. అది కూడదు. అంటే సూత్రంలోని పదాలు అన్నీ మార్చరాని వై, సార్థకా లై ఉండాలి. 'ఊరు చోటు మేన్వాదు లున్లుగ్విషయంబులు' అనేసూత్రంలో ఆదిశబ్దం అవసరం. కాగా చోటు, మేనులను కూడా సూత్రంలోనే ఉచ్చరించడంలో ప్రయోజనం లేదు. ఊర్వాదులు అంటే చాలు. సూరి సూత్రాలు ఇలా కాక దళసార్థక్యంతో ఉండడం సామాన్యం. పైన 'రుములు బహువచనంబులు' అన్నచోట రువర్ణం ఒక్కటే ప్రథమమధ్యమపురుషలు రెంటిని బోధిస్తూ సారవల్లక్షణంతో ఉండడం గమనింపవచ్చు.

**4. విశ్వతోముఖం :** సూత్రం భాష మొత్తంలో అత్యధికలక్ష్యాలలో వర్తించేది కావాలి. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' 'ఇత్వంబు గాని యెత్వంబు గాని కూడుచో ననాద్యం బయినయుత్వంబున కిత్వం బగు' మొ, రీతిగా సూరిసూత్రాలు భాషాసామాన్యలక్షణాన్ని పేర్కొంటూ, అత్యధికలక్ష్యాలలో వర్తిస్తున్నాయి.

ని,కి, మొ. వాటిని విభక్తులుగా చెప్పకుండా నుకు–లనుండే సాధించడం మొ. వాటిలో భాషాలక్షణాన్ని, బహులక్ష్యాలలో సారభూత మైనదానిని గుర్తించి పేర్కొనడం

సూరిసూత్రరచనలోని ప్రత్యేకత.

అందదుకు మొ. చోట్ల ఒక్కొక్కరూపంలో మార్పులు పెక్కుతీరులుగా ఉన్నాయి. వాటిని సాధించా లంటే ఒక్కొక్కరూపానికి పెక్కు సూత్రాలు చెప్పవలసిఉంటుంది. అది సూత్రలక్షణం కాదు. అందుకే సూరి సంస్కృతమార్గంలో అందదుకు ప్రభృతులు, నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' మొ. రీతిగా సూత్రించాడు. 'కద్రువ నాగమాత' మొ. నిపాతస్థలాలు మొ. ఇలాంటివి.

**5. అస్తోభం:** స్తోభం అంటే అవరోధం. అంటే ఇక్కడ అర్థం తెలియడంలో క్లేశం. అర్థం విశ్వతోముఖం కావాలి అని లాఘవాపేక్షతో అన్వయాదులతో సూత్రం క్లిష్టం కాగూడదు. అపుడే ఆలక్షణం సమ్మాన్య మై, గ్రాహ్యం అవుతుంది.

సూరి బాలవ్యాకరణాన్ని బాలావబోధ మగుభంగి వ్రాస్తున్నట్లు పేర్కొన్నాడు. అందుకై తనయితర(సూత్రాంధ్రాది)వ్యాకరణాలకంటే గూడ బాలవ్యాకరణ సూత్రాలలో, అనువృత్తి అపకర్షవంటివాటిఅవసరాన్ని తగ్గించాడు. బాలవ్యాకరణ సూత్రాలు అన్నీ సాధారణంగా స్వయంగా సమగ్రంగా చెప్తాయి. సంధిపరిచ్ఛేదంలో 'అచ్చు పరం బగునపుడు', క్రియా పరిచ్ఛేదంలో 'ముత్తు పరం బగునపుడు' మొ. బహులక్షణాలలో చేరుతూ ఎల్లెడల ప్రయోగింపబడుతున్నా సూత్రాలు అర్థావగతిలో అవరోధం లేని వైఉండడం గమనింపవచ్చు.

**6. అనవద్యం:** అవద్యం అంటే చెప్పదగనిది. అనవద్యం అంటే చెప్పదగినది. లక్ష్యాలు అన్నీ సాధించాలి అని విశ్వతోముఖత్వంకోసం గ్రహింపదగనిశబ్దాలను గూడా లక్షణబద్ధం చేయరాదు. కూతురిని, చేతురు, మొ. అసాధువులుగా సూరి పేర్కొన్నాడు. ప్రౌఢవ్యాకర్త సైతం అన్నరో, ఏనుంగురో ఇత్యాదిప్రయోగాలను అంగీకరించకపోవడం గమనింపవచ్చు. అంటే కవిప్రయోగాలలో ఉన్న వని అన్నింటినీ కాక, సాధుకవిప్రయోగారూఢాలు ఐనయోగ్యశబ్దాలను మాత్రమే లక్షణం సాధించాలి. ఇలాగే అతివ్యాప్తి, అవ్యాప్తి మొ. దోషాలచేత సూత్రం నింద్యం కాకుండాలి.

## సూత్రభేదాలు

ఇటువంటిలక్షణాలు ఉన్నసూత్రాన్ని అది చెప్పేవిషయాన్నిబట్టి లాక్షణికులు ఆఱువిధాలుగా చెప్పారు.

**సంజ్ఞా చ పరిభాషా చైవ విధి ర్నియమ ఏవ చ**

**అతిదేశో ఽధికార శ్చ షడ్విధం సూత్రలక్షణమ్.**

**1. సంజ్ఞ : విధిఘటకసంకేతపదీయశక్తి గ్రాహకం సంజ్ఞా.**

లక్షణంలో కూర్చబడినపదంయొక్క అర్థాన్ని తెలిపేది సంజ్ఞ. 'ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు' ఇత్యాదిగా ఆయాలక్షణాలలో ద్రుతం అనేపదం ఉపయోగింపబడింది. ఆవిధులలోని ద్రుతశబ్దంచేత బోధింపబడేది ఏమిటి? ఆశబ్దానికి అర్థం ఏమిటో తెలియజేసేది కావటంచేత 'నకారంబు ద్రుతంబు' అనేలక్షణం సంజ్ఞావిధాయకం. ఇలాగే 'స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వానివిశేషణంబులును మహత్తు లనంబడు'. అనేసూత్రం మహత్తు అనే సంజ్ఞను విధించేది కాబట్టి సంజ్ఞాసూత్రం. ఇలాగే 'కచటతపలు పరుషంబు లని గజడదబలు సరళంబు లని చెప్పంబడు' మొ.

**2. పరిభాష : లింగవత్త్వే సతి సందిగ్ధార్థనిశ్చాయికా పరిభాషా.**

సప్రమాణంగా సందేహాన్ని నివారించి అర్థాన్ని సంక్షిప్తంగా నిశ్చయించి చెప్పేది పరిభాష. 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు'. ఉత్సర్గం అంటే సామాన్యవిధి అని అర్థం.'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రం త్వార్థం(భావార్థం)లో అన్ని విధమైనశబ్దాలకు 'తన' అనేప్రత్యయాన్ని విధిస్తున్నది. కాబట్టి ఇది (సామాన్యవిధి) ఉత్సర్గం. 'చిన్నాదులకు ఱికవర్ణకం బగు' మొద లైన ఆతరువాతిసూత్రాలు కొన్ని త్వార్థంలోనే ఆయాశబ్దాలకు విశేషంగా ఱిక, మొద లైన ఆయాప్రత్యయాలను చెప్తున్నాయి. ఇక్కడ చిన్నాదులకు 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనే ఉత్సర్గవిధిచేత తన ప్రత్యయం, చిన్నాదులకు ఱిక అనేవిశేషవిధిచేత ఱిక ప్రత్యయం రెండూ ప్రాప్తిస్తున్నాయి. ఏది ప్రవర్తిస్తుంది? అనేసందేహం కలుగుతుంది. అప్పుడు 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనేప్రస్తుతసూత్రం విశేష మైన ఱికవర్ణకవిధాయకసూత్రం విశేషం. ఇది ఉత్సర్గ మైన 'తన' వర్ణకవిధాయకసూత్రాన్ని వికల్పంగా బాధిస్తుంది. అని పైసందేహాన్ని నివారించి ఱిక ప్రత్యయమే వస్తుంది అనేవిషయాన్ని నిశ్చయించి చెప్తున్నది. కాబట్టి 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు' అనేది పరిభాషాసూత్రం అవుతుంది.

**3. విధి : అప్రాప్తప్రాపకో విధిః.**

అప్పటివరకు లేని (వివక్షింపని) కార్యాన్ని కలుగజేసేది విధి.

రాముడు + అతడు అని ఉండగా, మొదటిపదం చివర ఉన్న ఉకారానికి రెండవపదం మొదట ఉన్న అకారం అచ్చు పరంగా ఉన్నది. అటువంటిసందర్భంలో సంధికార్యం జరుగుతుంది అని కవిప్రయోగాదులనుబట్టి తెలుస్తుంది. కాని ఆసంధికార్యం లక్షణంచేత ప్రాప్తించటం లేదు. అటువంటిస్థితిలో 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రం ఆసంధిని ప్రాప్తింపజేస్తున్నది. కాబట్టి అది విధిసూత్రం.

ఏఁగి+ఏఁగి అని ఉండగా 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేలక్షణంప్రకారం సంధి ప్రాప్తిస్తున్నది. కాని ఇక్కడ సంధి రాకపోవటం కవిప్రయోగానుసారంగా రావలసినకార్యం. ఆసంధినిషేధాన్ని ప్రాప్తింపజేసే 'క్త్వార్థం బైనయిత్తునకు సంధి లేదు' అనేనిషేధరూప మైనవిధానం విధిసూత్రం.

ఇలా ప్రాప్తింపని, అవసర మైన, ఏకార్యాన్ని విధించినా ఆసూత్రం విధిసూత్రమే.

**4. నియమం : సామాన్యప్రాప్తస్య విశేషావధారణం నియమః.**

సామాన్యంగా (అన్నిచోట్లా) ప్రాప్తిస్తున్నదానిని విశేషంగా కొన్నిప్రత్యేకస్థలాలలో మాత్రమె వస్తుం దని నిశ్చయించేది నియమం.

'ఉదంతస్త్రీసమంబులకుం బుంపులకు నదంతగుణ వాచకంబులకుఁ దనంబు పరం బగునపుడు నుగాగమం బగు'. ఈసూత్రం ఉదంతస్త్రీసమాదులకు తనప్రత్యయం పరంగా ఉండగా నుగాగమాన్ని విధిస్తున్నది. తన ప్రత్యయంలో మొదట ఉన్నతకారం పరుషం. కాబట్టి 'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుఁ బరుషసరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం ఎలాగూ వస్తునే ఉన్నది. మళ్లీ తనప్రత్యయపరకతలో విశేషంగా విధించటం అనవసరం. ఇలా నుగాగమం సిద్ధిస్తున్నా, మళ్లీ సాధించటంకోసం ఆరంభింపబడిన ప్రస్తుతవిధి ఒకనియమం చేస్తుంది.(సిద్ధే స త్యారభ్యమాణో విధి ర్నియమాయ భవతి అని న్యాయం.)

'తన' కంటే ఇతర మయిన(పరుషసరళాది)తద్ధితం పర మైనపుడు నుగాగమం

లేదు అనేది ఆనియమం.

ఈనియమంవల్ల 'కా' మొద లైనపరుషసరళాదితద్ధితప్రత్యయాలు పరంగా ఉన్నపుడు 'సమాసంబుల నుదంతంబు లగు...' అనేసూత్రంప్రకారం నుగాగమం రాదు. నీటు+కా, సొగసు+గ(క)త్తియ, చెంచు+త, ఇత్యాదిస్థలాలలో పరుషం లేదా సరళం పరంగా ఉన్నా నుగాగమం రాకపోవటంచేత నీటుకాఁడు, సొగసుగత్తియ, చెంచుత ఇత్యాదిగా కవిప్రయుక్తరూపాలు సాధింపబడతాయి. ఈనియమం లేకపోతే తనప్రత్యయం పరంగా ఉన్నప్పటిలాగానే కత్తియ, కా,త, మొద లైన ఇతరపరుషసరళాది తద్ధితప్రత్యయపరకతలో 'సమాసంబుల ..' అనేసూత్రంచేత నుగాగమం వచ్చి, నీటుఁగాఁడు, సొగసుంగత్తియ, చెంచుంద ఇత్యాదిగా అపరూపాలు ఏర్పడవలసివచ్చేది.

తనేతరతద్ధితప్రత్యయపరకతలో నుగాగమం లేదు అనేవిధంగా నియమం చేస్తున్నది కాబట్టి 'ఉదంతంబు లగుస్త్రీసమంబులకు... తనంబు పరం బగునపుడు నుగాగమం బగు' అనే సూత్రం నియమసూత్రం అవుతుంది.

**5. అతిదేశం : అవిద్యమానధర్మప్రాపకశాస్త్ర మతిదేశః.**

లేనిధర్మాన్ని ప్రాప్తింపజేసే శాస్త్రం అతిదేశం.

ఉదా. 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు'. విశ్వకర్మ మొద లైనశబ్దాలు మహద్వాచకాలు. సంస్కృతానుసారంగా పుంలింగాలు. మహత్పుంలింగశబ్దాలకు ప్రథమైకవచనంలో ఉత్వము, డుఙు, ఇతరవిభక్తివచనాలలో ఉత్వమూ, నిగాగమం ఇత్యాదికార్యాలు రావాలి. కాని అవి ఈశబ్దాలకు లేవు. అందుకోసం పైసూత్రం విశ్వకర్మాదిశబ్దాలకు స్త్రీలింగధర్మాన్ని విధించింది. ఇవి సహజంగా పుంలింగాలు కావటంచేత వీటిలో స్త్రీలింగధర్మం లేదు. లేని స్త్రీలింగధర్మాన్ని ప్రాప్తింపజేస్తున్నది. కాబట్టి 'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అనేది అతిదేశసూత్రం.

ఇలాగే 'కంధరాదులు క్లీబతుల్యంబులు' 'మిత్రాదులు– పుంలింగతుల్యంబులు' మొ.

**6. అధికారం : స్వదేశే ఫలశూన్యత్వే సతి, విధిశాస్త్రేణ సాక మేకవాక్యతయా అర్థబోధకః అధికారః.**

స్వయంగా వాక్యార్థాన్ని సంపూర్ణంగా తెలుపకుండా, తరువాతివిధివాక్యంతో

కలిసి ఆవాక్యాలఅర్థాన్ని బోధించేది అధికారసూత్రం.

'ధాతువునకు' (క్రియ. 1). దీనిని చిన్నయసూరే ' ఇయ్యది యధికారసూత్రంబు. ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగు నని యెఱుంగునది' అని ఇది అధికారసూత్రంగా స్పష్టం చేసి, అధికారసూత్రలక్షణాన్ని కూడ వివరించాడు.

'ధాతువునకు' అనేఈసూత్రం ఇక్కడ ప్రత్యేకంగా ఏమీ విధించటం లేదు. కాగా 'వర్తమానంబున ల ట్టగు' అనే తరువాతిసూత్రంలోకి వెళ్లి 'వర్తమానంబున ధాతువునకు ల ట్టగు' అనేవిధంగా ఆసూత్రం అర్థాన్ని అక్కడ సమగ్రం చేసి చెప్తుంది. ఇలా ధాతువునకు అనేఈసూత్రం ఈపరిచ్ఛేదంలో దాదాపుగా అన్నిసూత్రాలలోకి చేరి ఆయావిధానాలు ధాతువుకు వస్తా యని ఆసూత్రాలఅర్థాన్ని పూర్తి చేస్తుంది. ఈసూత్రానికి ఇక్కడ స్వతంత్రంగా అర్థం లేదు. ఈసూత్రంతో కలవకుండా పైసూత్రం అర్థం సమగ్రం కాదు.

ఈవ్యాకరణాలలో ఇది ఒక్కటే అధికారసూత్రంగా కానవస్తున్నది.

## 6. సూరి సూత్రరచనాశిల్పం

**సూత్రాత్మకరచనం:**

తెలుగువ్యాకరణాలు కొన్ని సంస్కృతంలోనూ, తెలుగులోనూ ఛందోబద్ధ మై ఉన్నాయి. ఛందోబద్ధం అయినపుడు పాదపూరణార్థకాలు మొ. అనవసరశబ్దాల మూలంగా శాస్త్రానికి ఉండవలసిన కట్టుదిట్ట మైనరూపానికి కొద్దో, గొప్పో భంగం వాటిల్లక తప్పదు. అందుకే సూరి కూడా పద్యాంధ్రవ్యాకరణాన్ని పద్యాలలో వ్రాయడం ప్రారంభించి కూడా, సూత్రాత్మకంగా చెప్పడమే శాస్త్రానికి ఉచితం అని పద్యరచనం ఆపుచేసి, యితరవ్యాకరణాలు అన్నీ సూత్రాత్మకంగానే చెప్పాడు. అలా బాలవ్యాకరణం కూడా సూత్రాత్మకంగా రచింపబడింది. ప్రౌఢవ్యాకరణం ఆమార్గాన్నే అనుసరించటం స్పష్టం.

**సూత్రవైశిష్ట్యం:**

సంస్కృతసంప్రదాయానుసారంగా సూత్రానికి ఉండవలసినలక్షణాలతోపాటు సూత్రరచనలో సూరి ఇంకా ప్రత్యేకతలు చూపాడు. అది సూరిసూత్రరచనలోని ప్రత్యేకతగా పేర్కొనబడుతున్నది.

### 1. గ్రహణధారణయోగ్యత:

బాలవ్యాకరణం అని పేరు పెట్టినసూరి బాలశబ్దార్థాన్నిబట్టి తనసూత్రస్వరూపం సూచిస్తున్నా డనవచ్చు. 'గ్రహణధారణపటు ర్బాలః' అనే లక్షణాన్ని అనుసరించి సూరి లక్షణం గ్రహించటానికీ, ధారణ చేయటానికీ యోగ్యంగా కూర్చా డని గ్రహించాలి. అందుకు సాధనా లయినలక్షణాలను బాలవ్యాకరణంలో ఇలా గుర్తించవచ్చు.

### సుబోధకత:

పీఠికలో 'నానేర్పుకొలఁది సంస్కృతభాషలో సూత్రగ్రంథ మొకటి కావించితిని. ఆగ్రంథము బాలురకు సుబోధము గాకుండుటవలన దానియందలిసూత్రములు కొన్ని తెనిఁగించి ప్రకృతగ్రంథరూపముగా రచించినాఁడ'. అన్నాడు. బాలురకు సుబోధంగా ఉండేవిధంగా వ్రాయటం సూరిలక్ష్యం. సులువుగా తెలియటంకోసం సూరి అనుసరించినమార్గం గమనిద్దాం.

### 1. స్వయంసంపూర్ణార్థకత్వం:

సంస్కృతసూత్రగ్రంథం బాలురకు బాగా అర్థం గావటం లే దని బాలవ్యాకరణం వ్రాస్తున్నాడు. బాలవ్యాకరణం కూడా సూత్రాలుగానే వ్రాస్తున్నాడు గదా. మరి మార్పు? తెలుగులో వ్రాయటం. సంస్కృతం అందరికీ తేలికగా తెలియ దని తెలుగులో చెప్తున్నా డనేది మొదటిఅంశం.

సూరి ఆంధ్రశబ్దానుశాసనం, శబ్దలక్షణసంగ్రహం అనేవ్యాకరణాలు కూడా తెలుగులో సూత్రాత్మకాలుగానే రచించాడు. కాని వాటికంటే బాలవ్యాకరణంలో తెలుగుసూత్రం సుబోధకం కావటం విశేషం. సూత్రాంధ్రంలోలాగ ఆతెలుగు వ్యాకరణాలలో సూరి అనువృత్తి మొద లైనవిధానాలను విస్తృతంగా ఉపయోగించాడు.

కాని బాలవ్యాకరణంలో అర్థం చేసుకోవటానికి ఇబ్బంది కలగకుండా ఉండేవిధంగా మాత్రమే ఆవిధానాన్ని అనుసరించాడు.

'సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది' అనేది మొదటిసూత్రం. తరువాత 'ప్రాకృతమునకు వర్ణములు నలువది, 'తెలుగునకు వర్ణములు ముప్పదియాఱు' అనేసూత్రాలలో కూడా వర్ణములు అనేపదాన్ని ప్రయోగించాడు. ఇక్కడ 'ప్రాకృతమునకు నలువది, తెనుగునకు ముప్పదియాఱు' అని మాత్రమే చెప్పినా

వర్ణములు అనేఅర్థం 'సంస్కృతమునకు వర్ణము లేఁబది' అనేపూర్వసూత్రాన్ని అనుసరించి సిద్ధిస్తుంది. మఱి ప్రతిసూత్రంలోనూ వర్ణములు అని చెప్పడం సుబోధకతకే. వ్యాకరణం ప్రారంభంలోనే అర్థావగతికి క్లేశం గలిగించటం సరి కాదు గదా.

అలా గని అన్ని చోట్ల ఇలాగా చెప్పుకుంటూ పోతే ఒక్కొక్కసందర్భంలో విసుగు కలిగించేప్రమాదమూ ఉంటుంది.

'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రానికి 'అత్తున కచ్చు పరం బగునపుడు సంధి బహుళంబుగా నగు' అని అర్థం. కాని సూత్రంలో 'అచ్చు పరం బగునపుడు' అనేఅంశం లేదు. ఇది 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేపూర్వసూత్రంనుంచి గ్రహించాలి. ఇలాగే 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు, క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగా నగు' మొద లైనసూత్రాలలో కూడా ఈవిధంగా 'అచ్చు పరం బగునపుడు' అనేఅర్థం. స్పష్టత కని ఇక్కడ ప్రతిసూత్రంలోనూ అచ్చు పరం బగునపుడు అనేపదం ప్రయోగిస్తే అది అక్షరగౌరవ మయ్యేఅవకాశమే ఎక్కువ.

ఇక్కడ ప్రతిసూత్రంలో సూరి సంధిపదాన్ని ప్రయోగించాడు. అచ్చు పర బగునపుడు అనేదానిలాగానే 'సంధి' పదం కూడా ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు అనే సూత్రంనుంచే గ్రహించవచ్చు. అపుడు 'అత్తునకు బహుళముగా నగు. ఏమ్యాదులయిత్తునకు వైకల్పికముగా నగు, క్రియాపదంబులం దిత్తునకు వైకల్పికముగా నగు' ఇత్యాదిగా చెప్పవచ్చు. అగు అనేది కూడా అనవసరమే. 'అత్తునకు బహుళము, ఏమ్యాదులయిత్తునకు వైకల్పికము, క్రియాపదంబులందు (ఇక్కడ ఇత్తునకు అనేది కూడా అక్కర లేదు.)' ఇత్యాదిగా మాత్రమే చెప్పవచ్చు. లాఘవం ప్రయోజనం. ఇక్కడ సూరి సంధి యగు (ఇత్యాది)పదాలను మాత్రం ప్రతిసూత్రంలో ప్రయోగించడానికి కారణం ఈసూత్రాలు అర్థాన్ని సుబోధంగా తెలియజేయా లనేలక్ష్యంతోనే అనటంలో సందేహం లేదు.

ఇం తెందుకు? శబ్దలక్షణసంగ్రహంలో 'అత్తునకు' (సంధి. 3) 'కిమాదులం దిత్తునకు' (సంధి. 5), 'క్రియాపదంబులందు' (సంధి. 7) ఇత్యాదిగా ఆవిధంగానే చెప్పాడు. 'ఉత్తున కచ్చు రా సంధి యగు' అనేమొదటిసూత్రంనుంచి 'అచ్చు రా సంధి యగు' అనేభాగం మొత్తం వీటిలోనికి అనువర్తించాలి. వీటికంటె

బాలవ్యాకరణలక్షణాలు స్పష్టంగా దేని కది సమగ్రంగా అర్థాన్ని బోధిస్తున్నాయి కదా.

పైవ్యాకరణంలో 'రా' అంటే పరం బగునపుడు అని అర్థం. బాలవ్యాకరణంలో ఆఅఅర్థాన్నే స్పష్టంగా చెప్పాడు. దీనివల్ల బాలవ్యాకరణం లక్షణం చాలా సుబోధం అయింది.

కాగా పూర్వపుతనవ్యాకరణాలకంటే అనువృత్త్యాదివిధానం తగ్గించి, సుబోధకతకు తగినపదప్రయోగంతో, అలా గని సూత్రం వ్యాఖ్యానంలాగా వివరించిచెప్తున్నట్లుగా కాకుండా, సూత్రాలు స్వయంగా సమగ్రంగా అర్థాన్ని బోధించేవిధంగా కూర్చటం బాలవ్యాకరణంలో విశేషం.

ప్రౌఢవ్యాకర్త ఈవిషయంలో బాలవ్యాకరణమార్గాన్నే అనుసరించాడు.

**2. లక్షణపరిణతి:**

సూరి రచించినపూర్వవ్యాకరణాలలో చింతామణిప్రభావం చాలా ఎక్కువగా కనిపిస్తుంది. 'సిద్ధి ర్లోకతః' అనేసూరిసూత్రాంధ్రవ్యాకరణసూత్రం 'సిద్ధి ర్లోకా ద్ధుశ్యా' అనే చింతామణి సూత్రాన్ని కేవలం అనుసరించింది. 'ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది' అనేఆంధ్రశబ్దానుశాసన, శబ్దలక్షణసంగ్రహాలలోనిసూరిసూత్రం 'ఆద్యాయాః పఞ్చాశద్వర్ణాః' అనేచింతామణిలక్షణాన్ని అనువదించటం స్పష్టం. ఇలాగే 'హల్లులు ప్రాణులు, (హల స్స్యుః ప్రాణినః) అన్యంబు లన్యవ్యాకరణస్పష్టంబులు, ఇంద రేఫంబు, (అన్యే కన్యవ్యాకరణస్పష్టాః ర స్త్వత్ర గృహ్యతే ద్వివిధః) మొ.

బాలవ్యాకరణం కూడా చింతామణిప్రభావంతోనే రచింపబడింది. కాని పూర్వవ్యాకరణా లంతగా అనువదించకుండా లక్షణాన్ని సుబోధంగా మార్పు చేసి చెప్పటం, ఆలక్షణం చెప్పినవిధానంలో పరిణతీ గమనించవచ్చు. 'సిద్ధి ర్లోకతః' అనేఅంశాన్ని బాలవ్యాకరణంలో 'త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు' అనీ, 'ఆద్యప్రకృతికి వర్ణంబు లేఁబది అనేదానిని 'సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది' అనీ చెప్పటంలో స్పష్టత స్పష్టమే. అచ్చు చేరని హల్లులకు – అచ్చు గలిగినది అనేఅర్థం ఇచ్చే ప్రాణిసంజ్ఞ అర్థవంతం కాదు. సూరి బాలవ్యాకరణంలో ప్రాణిసంజ్ఞ చెప్పలేదు.

ఇలా బాలవ్యాకరణంలో సూరిలక్షణం చింతామణిప్రభావం తగ్గి, బాలురకు సుబోధంగా భాషకు ప్రయోజనవంతంగా పరిణతం కావటంవల్ల సూరిసూత్రం

ప్రత్యేకతను సంతరించుకుంది.

**3. లక్షణక్రమం :**

చిన్నయసూరి పరిచ్ఛేదాలే కాకుండా అందులోనివిషయాన్ని కూడా ఒకక్రమంలో పూర్వోత్తరసంబంధంతో కూర్చడంవల్ల సూత్రాలకు పరస్పరం సంబంధంతో గ్రంథానికి ఏకవాక్యత కలిగింది. ఇంకా సూత్రరచనంలో లాఘవం సాధింపబడింది.

'కచటతపలు పరుషంబులు, గజడదబలు సరళంబులు' అనేచోట ఉచ్చరింపబడని దంత్యచజలు 'ఇతరము లగుహల్లులు స్థిరములు' అన్నచోట ఇతరాల్లో కూడా చూపలేదు. అవి ఏ మవుతాయి? అని సందేహం కల్గగా 'దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు' అనేసూత్రం చెప్పబడింది. దీనితో తాలవ్యచజలు దంత్యచజలను గూడ గ్రహించి బోధించగా, దంత్యచకారం పరుషమూ, దంత్యజకారం సరళమూ అవుతాయి అనీ, అందుచేత దంత్యచజలను స్థిరాలలో చూపలే దనీ సందేహం నివారింపబడింది.ఇపుడు దంత్యాలు ఏవి? తాలవ్యాలు ఏవి? అనేసందేహం కల్గగా 'ఇఈఎఏలం గూడిన–' మొద లైనసూత్రాలు చెప్పబడ్డాయి. ఇలా ఒకక్రమంలో ఆకాంక్షతో కూర్పబడడం సూరిసూత్రరచనలో విశేషం.

ఈక్రమంవల్ల 'ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగునపుడు యాకు సకారం బగు' ఇత్యాదులలో లాఘవం సంపాదింపబడింది. యకారానికి సకారం వచ్చే సందర్భాలలోని ఇకారవక్రప్రత్యయాలను ఈసూత్రానికి పూర్వంలో చెప్పటం ద్వారా సూత్రరచనంలోని క్రమంవల్ల ఆయాప్రత్యయాలను ప్రత్యేకంగా ఉచ్చరించవలసినగౌరవం తగ్గింది. ఇంకా ఈసూత్రానికి తరువాత చెప్పిన ఇంచుక్కు మొ. పర మైనపుడు సకారం రాకపోవటం కూడా సాధింపబడింది. చేయు+ఇంచు–చేయించు. అరయు+ఇక–అరయిక. మొ.

స్వరసంధులను చెప్పే సందర్భంలో సూరి ముందుగా ఉత్త్వసంధిని తరువాత అత్త్వ, ఇత్త్వసంధులను చెప్పాడు. వర్ణక్రమాన్ని అనుసరించి వరుసగా అత్త్వ,ఇత్త్వ,ఉత్త్వసంధులు చెప్పాలి. ఈక్రమం చిన్నయ మూల మైన చింతామణిని అనుసరించే గ్రహించాడు. కాని మార్చుకోవలసినఅవసరం లేదని భావించటం గమనించాలి.

**4.విశేషాంశప్రతిపాదనం:**

సూరిసూత్రాలు కొన్ని లక్షణం చెప్పనివిశేషాంశాలు ప్రతిపాదిస్తూ అవే లక్షణాన్ని చెప్తున్నట్లుగా ఉంటాయి. 'ద్రుతాంతము లయినపదములు ద్రుతప్రకృతికములు' అని చెప్పినసూరి ఆతరువాత 'ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడు' అన్నాడు. దీనిచేత ద్రుతప్రకృతికములకే ద్రుతప్రకృతి అనేసంజ్ఞను గూడ చెప్పినట్లయింది. వర్ణానికంటె వర్ణకం వే రయినట్లుగా ద్రుతప్రకృతికంకంటె ద్రుతప్రకృతి వేరు కాదు.

'జూదాదుల దాకు జకారంబు విభాష నగు' ఇక్కడ దాకు అంటే దకారానికి అని అర్థం. కాబట్టి వర్ణనిర్దేశంలో దీర్ఘం. సూరి దీన్ని సూత్రించలేదు. ప్రయోగాన్నిబట్టి ఈలక్షణం గ్రహించాలి. ఇలాగే 'సమాసంబునయందు ద్రుతంబునకు లోపం బగు' అందువిభక్తిపరకతలో నగాగమం. మొ.

ఉదాహరణలనుబట్టి కూడా సూరి సూత్రార్థాన్ని విశేషంగా తెలియజేయటం సూరిలక్షణనిర్మాణంలో ప్రత్యేకత.

'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనేసూత్రానికి క్రమగా 'వచ్చున్+ఇపుడు=వచ్చు నిపుడు, చూడన్+అయితి=చూడ నయితి, ఉండెడిన్+అతడు=ఉండెడి నతడు' అని ఉదాహరణలు ఇచ్చాడు. ఇంతకు ముందు ఉత్త్వ, అత్త్వ, ఇత్త్వాలకు సంధి క్రమంగా విధించడం ఇక్కడ అనుసంధించుకోవాలి. దానివల్ల 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' ఇత్యాదిసూత్రాలు ద్రుతపూర్వస్వరానికి కూడ సంధిని చెప్తున్నాయి అని స్పష్టం అవుతుంది. చూచున్+అపుడు అనేచోట 'ఉత్తునకు .. అనేసూత్రంచేత ప్రాప్తించినసంధిని ఇఁ కాదిసూత్రం నిషేధిస్తున్నది. చూడన్ +అయితి అనేచోట అత్తునకు సంధి బహుళమూగా నగు అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నసంధిని ఇఁకాదిసూత్రం నిషేధిస్తున్నది. అలాగే ఉండెడిన్+అతడు అనేచోట 'క్రియాపదంబులందిత్తునకు..' అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్నసంధిని ఇఁకాదిసూత్రం నిషేధిస్తున్నది. కాగా 'క్రియాపదంబులం' దనేసూత్రంవద్ద ఇత్త్వం ఉన్నప్పటికీ ప్రథమపురుషైకవచనక్రియలను ఎందుకు ఉదాహరించలే దనేసందేహానికి సమాధానం ఇఁకాదిసూత్రం దగ్గర ఉదాహరణలచేత చెప్పబడిం దన్నమాట. ఉండెడిన్ అనే ప్రథమ పురుషైకవచనరూపాన్నిబట్టి ఉంటిన్+ఇపుడు అనేరీతి ఉత్తమపురుషైకవచనాలలో కూడా ద్రుతప్రకృతికత్వంచేత

సంధి రా దని చెప్పిన ట్లయింది. ఆలక్షణాలు ద్రుతపూర్వస్వరానికి సంధి చెప్పేవి కావటంచేత ఇఁకాదులకు సంధి వికల్పంగా రావటం అత్తునకు సంధి బహుళముగా నగు ఇత్యాదిపూర్వసూత్రాలచేతనే అని కూడా అర్థం సిద్ధిస్తుంది.

ఈవిధంగా సూరి వివరణ, ఉదాహరణలతో గూడ సూత్రార్థాన్ని విశేషంగా తెలుపుతూ లక్షణనిర్మాణంలో విశిష్టతను ప్రదర్శించాడు.

**5 లలితోక్తులు:**

అనయము లలితోక్తులతో నొనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం

గను బాలవ్యాకరణం బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

అన్నాడు సూరి. లక్షణంలోనిపదాలు బాలురకు సులువుగా తెలియటానికి తగినవిధంగా తెలుగులో కూడా లలిత మైనవి కూర్చా దన్నమాట. ఈలక్షణం బాలవ్యాకరణంలో ప్రతిసూత్రంలో కనిపించేది కాబట్టి విశేషంగా ఒకచోట ఉదాహరించ నవసరం లేదు. ప్రౌఢవ్యాకరణంలోని ఆయాలక్షణాలతో పోల్చిచూసినపుడు సూరిసూత్రాలలోనిభాషాలాలిత్యం ఇంకా స్పష్టం అవుతుంది. అనల్పార్థాన్ని స్వల్పాక్షరాలతోనే చెప్పడంతోపాటు ఉపయోగించినపదాలలోనూ, వాటిని కూర్చటంలోనూ సూరి లాలిత్యాన్ని సంపాదించాడు. అందువల్లనే సూరిసూత్రాన్ని వేరేవిధంగా మార్పు చేస్తే ఆఅందం ఉండదు.

'ఋఋూ(ఌౡ)విసర్గ ఖఛఠథఫఘఝఢధభఙఞశషలు సంస్కృతసమంబులం గూడి తెలుఁగున వ్యవహరింపఁబడు' ఈసూత్రంలో ఋఋూ(ఌౡ)విసర్గ అనే అచ్చులు అయిదు వర్ణమాలలో చూపినక్రమంలోనే ఇచ్చాడు సూరి. తరువాతి హల్లులను గూడా అదేవిధంగా వర్ణమాలలో చూపినక్రమంలో ఇవ్వడం సక్రమం. దానిప్రకారం 'ఖఘఙ, ఛఝఞ, ఠఢ, థధ, ఫభ, శషలు' అని ఇవ్వాలి. ఆక్రమాన్ని మార్చి సూరి ఇక్కడ చూపినవర్ణక్రమంలో సూత్రానికి చెవి కింపైననడక ఏర్పడింది. దీన్ని పైవిధంగా చెప్పిఉన్న ట్లయితే సూత్రానికి ఆఅందం వచ్చేది కాదు. అయినా, ఖఛఠథఫ (వర్గద్వితీయాక్షరాలు), ఘఝఢధభ (వర్గచతుర్థాక్షరాలు) ఙఞ (వర్గ పంచమాక్షరాలు) శష – అనేవి గూడా వేరొకవిధంగా ఒకక్రమంలోనే ఉండటం విశేషం. సూరి ఇక్కడ హల్లులవిషయంలో భిన్నక్రమాన్ని అనుసరించటానికి కారణం శ్రుతిపేయ మైననడక గ్రహణధారణయోగ్యంగా ఉండటమే.

### 6. అర్థలాలిత్యం

మాటలలోనే కాకుండా అర్థంలో కూడా సూరిలాలిత్యాన్ని సూత్రరచనలో సంపాదించాడు.

ఉత్త్వసంధిని చెప్తున్నసూత్రం సంధిపరిచ్ఛేదంలో మొట్టమొదటిది. పరిచ్ఛేదప్రారంభంలోనే 'అత్తునకు సంధి బహుళంబుగా నగు' నని బహుళసంధిని చెప్పటంకంటె నిత్య మైన ఉత్త్వసంధిని చెప్పటం యుక్తం. తెలుగులో ఉత్త్వానికి సంధి సార్వత్రికం కావటం భాషాశాస్త్రజ్ఞులు కూడా సోపపత్తికంగా భాషాలక్షణంగా గుర్తించారు. చింతామణి సంధివిధానారంభంలో 'సంధి ర్నాచో ఽచ్యనుతః' అని ఉత్తుకంటె వేరైన అచ్చుకు సంధి లే దని ఉత్త్వసంధినే చెప్పింది. కాని ప్రారంభంలోనే 'సంధి ర్న...' అని నిషేధం చెప్పటం అంత బాగా లేదు. అవసరం గూడా లేకపోవటం గమనించవచ్చు. సంధిని విధించకపోతే ఎలాగూ రాదు. బాలవ్యాకరణంలో అంతే కదా. అందుకే సూరి చింతామణిమార్గాన్ని విడిచి 'ఉత్తునకు...సంధి యగు' విధిపరంగా చెప్పటం చక్కగా ఉంది.

ఉదాహరణలలో ఇంకా విస్తృతంగా ఈలక్షణం గమనించవచ్చు. 'మేనల్లుడు పుట్టినిల్లు చూడకుండెను', 'వాడు పూవులు దెచ్చె, ఆకె సొమ్ములు దాల్చె, వా డిల్లు వెడలె', మొద లైనచోట్ల చమత్కార మైనఅర్థాన్ని అందంగా చెప్పటం వ్యాఖ్యాతలు వివరించారు.

### 7. ఛందోబంధం

శబ్దగత మైనలాలిత్యంచేత సూరిసూత్రం గద్యమే అయినా ఛందోబద్ధంలాగా ఉంటుంది. ఇటువంటి వాటిని వృత్తగంధి అని లాక్షణికులు పేర్కొంటారు.

సూరిసూత్రం ఒకక్రమ మైన మాత్రలవర్ణనియమంతో ఉండటం గమనించవచ్చు. 'తెనుఁగునకు - వర్ణములు - ముప్పది - యాఱు' ఇవి వరుసగా రెండు పంచమాత్రలుగా, రెండు చతుర్మాత్రలుగా ఉన్నాయి.'సంస్కృత-మునకు-వర్ణము-లేఁబది' మొదలుగా సూరిసూత్రాలు దాదాపుగా అన్నీ ఈరక మైనవిశిష్ట మైనవర్ణనియమంతో, పద్యవాసన గలిగి వృత్తగంధి రచనలుగా వినిపిస్తాయి.

'విసర్గంబున-కనుకరణంబున-లోపం బగు' 'ఇటితివర్ణంబులు-వక్ష్యమాణంబు- లౌపవిభక్తికంబులు' ఈసూత్రాలలో పూర్ణబిందుపూర్వక మైనబకారం

పునఃపునరావృత్తం కావటం, అటు ఇటుగా మాత్రలు ఒకక్రమంలో ఉండటంవల్ల సూత్రానికి అందమైన తూగు కలిగింది. వీటిని 'విసర్గమున కనుకరణమున లోప మగు' ఇత్యాదిగా సూరి చెప్పినతీరుకు భిన్నంగా ఊహిస్తే ఆఅందం కనబడదు. సూరియే వ్రాసిన శబ్దలక్షణసంగ్రహాది ఇతరవ్యాకరణాలలోని సూత్రాలకు ఈనడక లే దని నిశ్చయంగా గుర్తించవచ్చు. దీన్నిబట్టి సూరి ప్రయత్నపూర్వకంగానే సూత్రరచనాశైలిలో ప్రత్యేకశ్రద్ధ చూపా డని గ్రహించవచ్చు.

ఇలాంటిశైలివల్ల (అర్థం) సులభంగా ధారణ చేయడానికి కూడా సూరిసూత్రాలు అను వై ఉన్నాయి.

ఇలా సంస్కృతసంప్రదాయానుగుణంగానూ, స్వీయ మైన ప్రత్యేకతలతోనూ, బాలవ్యాకరణసూత్రాలు సూరి సూత్రరచనాసామర్థ్యాన్ని స్పష్టం చేస్తున్నాయి.

## 7. బాలవ్యాకరణరచనాప్రణాళికను గురించి తెలపండి.

'పెక్కు లక్ష్యములు పలుమాఱు సావధానముగా పరిశీలించి రచనాప్రణాళికను నిర్ణయించుకొని సంస్కృతభాషలో సూత్రవ్యాకరణమును రచించి బాలురకు సుసాధం మగుటకై అందలిసూత్రములు కొన్ని తెలిగించి పిదప బాలవ్యాకరణమును రచించి'నట్లు సూరి పేర్కొన్నాడు. లక్ష్యలక్షణపరిశీలనంతోపాటు ప్రత్యేకంగా సూరి పేర్కొన్నరచనాప్రణాళికలోని వైశిష్ట్యం గమనింపవలసినది.

### బాలవ్యాకరణరచనాలక్ష్యం

లభ్య మవుతున్న పూర్వాంధ్రవ్యాకరణాలు సంస్కృతసమేతరభాషకు లక్షణం అధికంగా పేర్కొనకపోవటం కూడా ఒకకారణంగా సూరి పేర్కొన్నాడు. అంటే సంస్కృతసమం, ఆచ్ఛికం ఐన ఆంధ్రభాషకు మొత్తానికి విపులంగా లక్షణం చెప్పదలుచుకున్నా డన్నమాట. ఆచ్ఛిక క్రియా ప్రకీర్ణాది పరిచ్ఛేదాలను పరిశీలిస్తే ఈవిషయం గుర్తింపవచ్చు.

### రచనాప్రణాళిక

'లలితోక్తులతో నొనరుపడ లక్ష్యయోజన మొప్పంగను బాలావబోధ మగుభంగి' నిర్మించడం బాలవ్యాకరణరచనావిధానం. ఆపద్ధతులు చూద్దాం.

### సంస్కృతవ్యాకరణానుసరణం

సూరి వ్యాకరణరచనలో సంస్కృతవ్యాకరణసంప్రదాయానుసరణం ప్రాముఖ్యం వహించింది.

**1. విషయవిభాగం**: భాషావిషయం సంస్కృతపద్ధతిలో సంజ్ఞా, సంధి, తత్సమ, ఆచ్ఛిక, కారక, సమాస, తద్ధిత, క్రియా, కృత్, ప్రకీర్ణాలుగా పదిభాగాలుగా సూరి విభాగించాడు. ఈవిభాగం వల్ల భాషాస్వరూపం ఒకక్రమంలో నిరూపించటానికి వీ లయింది.

**2. విషయక్రమం**: పరిచ్ఛేదాలలోనిఅంశాలు కూడా ఒకప్రత్యేక మైనక్రమంలో నిరూపింపబడ్డాయి. ఉదాహరణకు సంజ్ఞాపరిచ్ఛేదంలో మొదట సంస్కృత ప్రాకృత ఆంధ్ర వర్ణనిరూపణం, పరుషాదిసంజ్ఞలు మొద లైనవి అన్నీ ఒకక్రమంలో చెప్పబడ్డాయి. వర్ణక్రమాన్ని అనుసరించి పరుషసరళాలకు తర్వాత స్థిరాలకు పూర్వంలో నకారంయొక్క ద్రుతసంజ్ఞను చెప్పవలసి ఉంది. కాని అలా చెప్పినచింతామణిలో నకారానికి స్థిరత్వం వివాదాస్పద మయింది. తన్నివారణార్థం సూరి ఆసంజ్ఞను ఆతర్వాత పేర్కొన్నాడు. ఇలా అన్ని పరిచ్ఛేదాలలోనూ లక్షణం ప్రయోజనవిశేషంతో ఒకక్రమాన్ని అనుసరించి చెప్పటం గమనింపవచ్చు. ఈక్రమం స్పష్టతకూ, ధారణకూ సాధక మయింది.

**3. సంజ్ఞాదులు – స్వాతంత్ర్యం**: ఉపధ, ఆమ్రేడితం మొద లైనసంజ్ఞలను సంస్కృతవ్యాకరణంనుంచీ, పరుషం, సరళం మొద లైనసంజ్ఞలను పూర్వాంధ్ర వ్యాకరణాలనుంచీ సూరి స్వీకరించాడు. ప్రయోజనాభావాన్నిబట్టి పూర్వాంధ్రవ్యాకర్తలు చెప్పిన సమాసకం, తిజ్మధ్యం మొద లైనసంజ్ఞలను విడిచిపుచ్చాడు. ఇలా శాస్త్రప్రయోజనాన్ని అనుసరించి సంజ్ఞాదివిషయాలలో సూరి స్వతంత్రమార్గాన్ని ఏర్పరచాడు. తరువాతివ్యాకర్తలకు అదే ఆదరణీయం కావటం గమనించవచ్చు.

'డుజ్వర్ణకంబునకుం బ్రకృతి యయినది డుమంతం బనంబడు, ఆ ఈ ఏ అనుసర్వ నామంబులు త్రికంబు నాఁబడు' అని డుమంతం, త్రికం మొద లైనసంజ్ఞలను సూరి కొత్తగా ఏర్పరచాడు.

'లకారంబునకు డుప్రువురునుము ఇఁగు' అనేచోట ఇకారాన్ని చేర్చి డుఇఁ, వుఇఁ మొద లైనప్రత్యాహారాలను సాధించాడు.

తెలుగులో విశేషా లైఉన్న వ్యతిరేకతద్ధర్మాద్యర్థకాలను నిరూపించటానికి లజీ, లాట్టు అనే లకారాలను కల్పించాడు.

కిత్తులు మొద లైనవాటిని సంస్కృతోక్తప్రయోజనంతో గ్రహించినసూరి ఆమార్గంలో తెలుగులో జీత్తులు, మొద లైనవాటిని కల్పించాడు.

ఇలా సూరి వ్యాకరణరచనలో సంస్కృతవ్యాకరణాలను, పూర్వాంధ్రవ్యాకరణాలను యథావసరంగా అనుసరిస్తూ, ప్రయోజనవిశేషాన్నిబట్టి స్వీయ మైనమార్గంలో నూతనాంశాలను కూర్చాడు.

**4. సూత్రనిర్మాణం**: వ్యాకరణం సూత్రాత్మకంగా రచించటంలోనే శాస్త్రలక్షణం చక్కగా కుదురుతుంది. కాబట్టే సూరి సూత్రాంధ్రవ్యాకరణాదులను సూత్రాలుగానే రచించాడు.

'అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్, అస్తోభ మనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః' అని సంస్కృతంలో సూత్రానికి చెప్పబడినలక్షణాలు సూరిసూత్రాలలో స్పష్టంగా గమనింపవచ్చును.

'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు', ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబునకు లోపం బగు' అనేవిధంగా ఒకేలక్షణం కలిగినవిభిన్నస్థలాలను ఒకచోటికి తెచ్చి సాధించినసూరిసూత్రాలు సారవంతాలు అయి, సూరిసూత్రరచనాపాటవాన్ని తెలుపుతాయి.

'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేరీతి సూత్రాలు భాషాసామాన్యలక్షణాన్ని సమగ్రంగా నిరూపిస్తూ, విశ్వతోముఖాలయి. చారిత్రక వ్యాకర్తలప్రశంసలు సైతం పొందాయి.

సూరి బాలవ్యాకరణంలో చాల సూత్రాలను సూత్రాంధ్రాదులలాగా అనువృత్తులు అధికం కాకుండ స్వయంసంపూర్ణార్థకాలుగా నిర్మించాడు.

**5. వార్త్తికాలు**: సూత్రాలలో చెప్పబడనివిశేషలక్షణాన్ని సూరి వార్త్తికాలుగా వృత్తిలో పేర్కొన్నాడు.'మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి, పత్వంబు హెచ్చునకుం గలుగదు' వెు. ఇటువంటివి సూత్రాలుగా చెప్పదగినవిస్తృతప్రయోజనం గలవి కావు. కాబట్టి వార్త్తికాలుగా చెప్పటంవల్ల సూత్రాలలో సూత్రలక్షణం సమగ్రంగా సాధింపబడింది.

**6. సంగ్రహవివరణం**: కొన్నిచోట్ల సూత్రంలోని పదం అర్థాన్నో, మొత్తం సూత్రార్థాన్నో స్పష్టతకై సంగ్రహంగా సూరే వివరించాడు.

'వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు' అనేసూత్రంలోని వికృతిపదాన్ని గురించి 'ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు' అని వివరించాడు.

అంతట ననుట ప్రథమైకవచనలోపబాధనార్థము, సర్వత్ర యనుట నగాగమబాధనార్థము, మొద లైనవి సూత్రగతవిశేషపదాలఅర్థాన్ని వివరించేస్థలాలు.

ఉన్న కలజి న వర్ణకంబులు, గురువిరహితంబు లయి, మొద లైనకొన్నిసూత్రాలకు మొత్తానికి తాత్పర్యాన్ని సంగ్రహంగా వివరించాడు సూరి.

**7. సంస్కృతలక్షణానువాదం**: కారకాదివిషయాలలో సూరి సంస్కృత వ్యాకరణంలో చెప్పబడినఅంశాలనే అనువదించాడు. 'నియతోపస్థితికము ప్రాతిపదికార్థము, ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు'. మొ. దీనివల్ల కొన్నియితరాంధ్ర వ్యాకరణాలలాగా అనుక్తన్యాయంతో సంస్కృతవ్యాకరణాన్ని ఆశ్రయించవలసినఅవసరం కొంతమేర తగ్గి సమగ్రత చేకూరింది.

**8. పూర్వగ్రంథపరామర్శనం**: తనకు పూర్వం ఉన్నఆంధ్రలక్షణగ్రంథాలను పరిశీలించి కవిప్రయోగాలతో సమన్వయిస్తూ బాలవ్యాకరణంలో లక్షణం చేశాడు.

కొన్నిచోట్ల పూర్వలాక్షణికులఅభిప్రాయం పరస్పరం భిన్నంగా ఉన్నపుడు అందులో ఉచిత మైనపక్షాన్ని ప్రమాణీకరించాడు. 'యకారంబును వువూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు' మొ.

పూర్వులఅభిప్రాయాన్ని కవిప్రయోగానుసారంగా సంగ్రహించాడు. 'తద్వత్తదాదిజస్య', 'ప్రాయ స్తు స్యాత్ కిమాదిక స్యేతః' ఇత్యాదిగా చింతామణి పేర్కొనగా సూరి 'ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగా నగు' అని తదాదులనూ, కిమాదులను కలిపి ఏమ్యాదులుగా ఒకే లక్షణంతో సంగ్రహించాడు. అనుకరణంలో అహమాదులమకారానికి ద్విరుక్తి విభాషగా చిం. అభిప్రాయాన్ని సవరించాడు.

పూర్వులఅభిప్రాయం సరి కానపుడు దానిని తిరస్కరించాడు. 'అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు వలికె నది నిరాకరంబు, ద్వితీయైకవచనంబు పరం బగునపు డౌపవిభక్తికంబులు రా వని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు' మొ. ఇంతే కాక సూరి తానే వ్రాసినపూర్వవ్యాకరణాలను గూడ పరిశీలించి అందులో అనవసరాలు, అనౌచిత్యాలు పరిహరించి బాల.లో లక్షణం చేశాడు. తెలుగువిభక్తులు సంస్కృతవిభక్తులస్థానంలో ఆదేశంగా చెప్పకపోవటం మొ.

**9. ప్రక్రియానిర్వహణం**: వ్యాకరణప్రయోజనాన్ని అనుసరించి సూరి భాషాస్వరూపం సులువుగా తెలియడానికి ప్రక్రియానిర్వహణంలో మిక్కిలిమెలకువతో లాఘవం చూపాడు. కుఱు+ఉసురు=కుట్టుసురు మొద లైనరీతిప్రక్రియ

చారిత్రకవ్యాకర్తలప్రశంసలు సైతం పొందింది.

ఆయాస్థలాలలో పదాలలోనివికారాదులు సమగ్రంగా సూత్రిస్తే గౌరవమె కాని ప్రయోజనం లే దనదగినస్థలాలలో నిపతించడం మొద లైనమార్గాలలో సంస్కృతసంప్రదాయం అనుసరించి లాఘవం సంపాదించాడు. కద్రువ నాగమాత, వేధ పురోధ పురోధసుఁడు మొ.

అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు, నిక్కలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు మొద లైనవి ప్రయోగానుసారంగా గ్రహించా లని చెప్తున్నాయి. ఆచ్ఛికసర్వనామాలను పట్టికగా చూపాడు. అక్క డక్కడ కవిప్రయోగాలను విశేషంగా ప్రదర్శించాడు. నెలc తిచ్చెను, కెంధూళి మొ.

ఇలా భాషాలక్షణాన్ని వీ లైనంత సమగ్రంగా సాధ్య మైనంత లాఘవంగా సూరి నిరూపించాడు.

**10. లక్ష్యయోజనం:** లలితోక్తులతో చెప్పటంతోపాటు లక్ష్యయోజనం కూడ సూరి తనరచనావిధానంలో ప్రత్యేకంగా పేర్కొన్నాడు. లక్షణావగతికి ఇది బాగా ఉపకరిస్తుంది.

ఉదాహరణలను చూపటంలోనూ సూరి కొన్నిప్రత్యేకతలు ప్రదర్శించాడు.

ఉదాహరణలు సూత్రాభిప్రాయాన్ని విశేషంగా ప్రతిపాదించటం కనిపిస్తుంది.

ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు అనేచోట వచ్చున్+ఇపుడు. చూడన్+అయితి, వచ్చెడిన్+అతఁడు అనేఉదాహరణలు క్రమంగా ఉత్వ, అత్వ, ఇత్వ సంధులు చెప్పే ఆయాసూత్రాలు ద్రుతపూర్వస్వరానికి సంధిని చెప్తున్నాయి అని తెలియజేస్తూ, ఈనిషేధం ప్రాప్తిపూర్వకం కావడాన్ని నిరూపిస్తున్నాయి.

డిత్థ, రామ, భార్గవ, రాజపురుష ఇట్టివి ప్రాతిపదికములు. ప్రాతిపది కోదాహరణలు అర్థవదధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్, కృత్తద్ధితసమాసా శ్చ అనేసంస్కృతలక్షణాల తాత్పర్యాన్ని ప్రతిపాదిస్తున్నాయి.

పెక్కు ఉదాహరణలు ప్రదర్శించేటపుడు సూరి వాటిని అకారాదిక్రమంలో చూపాడు. అక్కటాదులు మొ.

ఉదాహరణలలో పెక్కెడల చమత్కారావహ మైనదృశ్యాలను చిత్రించాడు.

మే నల్లుడు పుట్టి నిల్లు చూడ కుండెను.

వాడు పూవులు దెచ్చె, ఆకె సొమ్ములు దాల్చె, వా డిల్లు వెడలె. మొ.

ఉదాహరణలలో రామాయణాదులనుంచి కథాభాగాలను స్ఫురింపజేయటం గమనించవచ్చు.

కొన్నిచోట్ల ప్రత్యేకంగా చెప్పకుండానే కవిప్రయోగాలను ఉద్ధరించాడు. నమ్మ కిట, నాకుం దమ్ముడు. మొ.

కొన్నియెడల కవిప్రయోగలుగా చెప్పి చూపాడు. ఏకాంతమునందు నున్నజవరాంధ్ర నని ప్రయోగము. మొ.

ఇంకా బహువిధ మైనప్రత్యేకతలు సూరిలక్ష్యాలలో గమనించవచ్చు.

ఇలా సూరి లక్ష్యలక్షణగ్రంథాలలో బహుముఖంగా బహుకాలం శ్రమించి, తెలుగుభాషకు చక్కనిరచనాప్రణాళికతో ప్రామాణికమూ, సుస్థిరమూ, శాశ్వతముగా బాలవ్యాకరణాన్ని తీర్చిదిద్దడంలో కృతకృత్యు డైనాడు.

## 8. బాలప్రౌఢవ్యాకరణాలపై సంస్కృతవ్యాకరణాలప్రభావం

వ్యాకరణరచనావిధానంలో మాత్రం ప్రసిద్ధ మైనతెలుగువ్యాకరణాలమీద సంస్కృతవ్యాకరణప్రభావం ప్రముఖంగా కనబడుతుంది. స్వతంత్రమార్గంలో రచింపబడినాంధ్రభాషాభూషణాదివ్యాకరణాలు అంతగా ప్రసిద్ధం గాలేదు.

బాగా ప్రచారంలో ఉన్న ఆంధ్రశబ్దచింతామణీ, తదనుగుణంగా బాలవ్యాకరణం కూడా సంస్కృతవ్యాకరణసంప్రదాయంలో రచింపబడినవే కావటమూ, సంస్కృతసంప్రదాయం ప్రామాణికంగా పండితులు ఆదరించడమూ, కారణంగా తెలుగువ్యాకరణం సంస్కృతవ్యాకరణప్రభావంలో ఉండటం అవసరం అన్నంతగా స్వీకరింపబడింది. తెలుగుభాష పుట్టకముందునుంచి సంస్కృతానికి తెలుగుభాష, తెలుగుజనాలతో సన్నిహితసంబంధం ఉండటమూ, సంస్కృతవ్యాకరణసంప్రదాయం నిర్దుష్టంగా పరమప్రామాణికం కావటమూవల్ల తెలుగువ్యాకరణాలపై సంస్కృతవ్యాకరణప్రభావం బహుముఖంగా స్థిరపడింది. కాగా సంస్కృతవ్యాకరణ ప్రభావంవల్ల తెలుగువ్యాకరణానికి ప్రామాణికత దానిమూలంగా ప్రసిద్ధి సిద్ధించా యని చెప్పటం యుక్తమే.

చింతామణ్యాదుల కనుగుణంగా సంస్కృతవ్యాకరణాలలోనూ పాణినీయం (వైయాకరణసిద్ధాంత కౌముది) ప్రభావమే తెలుగువ్యాకరణాలమీద కనబడుతుంది.

బాహ్య, ఆభ్యంతరవిషయాలలో తెలుగువ్యాకరణంమీద

ఆసంస్కృతవ్యాకరణప్రభావాన్ని ఇలా గుర్తింపవచ్చు.

**బాహ్యానిదర్శనాలు**

గ్రంథనిర్మాణంలో బాహ్యావిషయంలో కూడా తెలుగువ్యాకరణం సంస్కృతవ్యాకరణాన్ని ముఖ్యంగా సిద్ధాంతకౌముదిని అనుసరించటం జరిగింది.

**1. పరిచ్ఛేదవిభాగం :**

బాలవ్యాకరణంలో తెలుగుభాషాలక్షణం 'సంజ్ఞా-సంధి-తత్సమ-ఆచ్ఛిక-కారకాది పరిచ్ఛేదాలుగా విభజింపబడింది. ఇందలి తత్సమాచ్ఛికాలను శబ్దపరిచ్ఛేదంగా ఏకం చేసిన ప్రౌఢవ్యాకరణంలోనూ పరిచ్ఛేదవిభాగం ఇంతే. ఈపరిచ్ఛేదవిభాగం వైయాకరణ సిద్ధాంతకౌముదిలోని పరిచ్ఛేదవిభాగాన్ని అనుసరించిఉన్నది. సంస్కృతభాష కున్నవిస్తృతి లేకపోవడంచేత, సంధి శబ్ద, సమాస, తద్ధితాదులలో కౌముదిలో ఉన్న విశేషవిభాగం తెలుగులో లేకపోయినా, తెలుగుకు తగినరీతిలో అవాంతరవిభాగం ఉన్నది. తత్సమపరిచ్ఛేదంలో - అజంతహలంత ప్రకరణాలు, ఆచ్ఛికపరిచ్ఛేదంలో- సర్వనామ, ఔపవిభక్తిక ప్రకరణాలు మొద లయిన విటువంటివి. చింతామణిలో అజంతపరిచ్ఛేదం, హలంతపరిచ్ఛేదం అనేవిభాగం సంస్కృతానికి ఇంకా దగ్గరగా ఉంది.

కాగా లక్షణవిషయంలో తెలుగుకు తగినరీతిలో సంస్కృతవ్యాకరణమార్గాన్ని అనుసరించి ఆక్రమంలోనే ఆయాపరిచ్ఛేదాలుగా విభజింపబడిం దని గుర్తింపవచ్చు.

ఆంధ్రకౌముది (వేంకటకవి తెలుగువ్యాకరణం, నృసింహకవి సంస్కృతవ్యాకరణం) మొద లయినవాటిలో గ్రంథనామంనుంచీ, సంస్కృతప్రభావం గోచరిస్తుంది.

**2. సూత్రాత్మకరచనం :**

అల్పాక్షరత్వాదిలక్షణాలతో పాణినీయంలాగా ఈవ్యాకరణాలు సూత్రాత్మకాలుగా రచింపబడ్డాయి. (ప్రౌఢవ్యాకరణంలో మాత్రం కొన్నిసూత్రాలు వివరణలవలె సాగాయి.) 'జిత్తు బిందుపూర్వం బగు- అనుసూత్రముచేత' మొద లైనవిధంగా వీటిని సూత్రాలుగా సూరి కూడా స్పష్టంగా పేర్కొన్నాడు.

**3. వృత్తిరచనం :**

సిద్ధాంతకౌముదిలోలాగా ఈవ్యాకరణాలలో సూత్రాలకు సంగ్రహంగా వృత్తి వ్రాయడం అక్కడక్కడ కనిపిస్తుంది.

జిత్తు బిందుపూర్వం బగు.

'ఙకార మిత్తుగా గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము'.

అకప్రత్యయాంతావ్యయంబు కళయ.

'వ్యతిరేకార్థకభూతకాలికాసమాపకక్రియ ద్రుతప్రకృతికము కా దని యర్థము'.మొ.

కొన్నిచోట్ల సూత్రాలలోని ముఖ్యపదాల కర్థం వ్రాయబడింది. కొన్ని చోట్ల– స్పష్టము, ఉక్తము అనేవిధంగా వివరించడమూ చూడవచ్చు.

**4. వార్తికాలు:**

సంస్కృతవ్యాకరణంలోలాగా సూత్రంకంటె విశేషాంశాలను వార్తికాలుగా వివరణంలో చెప్పడం ఈవ్యాకరణాలలో ఉన్నది.

పత్వంబు హెచ్చునకుం గలుగదు. వర్గువునందలివువర్ణకం బొండె లోపించు. మొ.

**5. ఉదాహరణలు:**

ఉదాహరణలు, ప్రత్యుదాహరణలతో లక్షణాన్ని స్పష్టం చేయడం కౌముదిలోలాగా ఇక్కడా ఉన్నది.

విను మనియె. ఇచ్చట నచ్చుపరం బయినది కాబట్టి లోపము లేదు.

అద్విరుక్తం బనుటచే – తేపతేపకు – మొ.

ఉదాహరణలుగా బాలవ్యాకర్త కొన్నిచోట్ల 'గతానుగతికో లోకో యటంచున్, నీకుం దమ్ముఁడు నాకు నెచ్చెలి' ఇత్యాదిగా కవిప్రయోగాలను ప్రదర్శించాడు. కవిప్రయోగమూలకం కావడంచేత ప్రౌఢవ్యాకరణంలో కవిప్రయోగప్రదర్శనం దాదాపు సర్వత్ర కనిపిస్తుంది.

## ఆభ్యంతరనిదర్శనాలు

గ్రంథాంతర్విషయాలలో సంస్కృతవ్యాకరణప్రభావం ఇంకా గాఢం. సంస్కృతలక్షణాన్నే సమన్వయించుకోవలసిన తావులు కొన్ని కాగా, సంస్కృతలక్షణాన్ని అనువదించిన తావులూ, అనుసరించి స్వతంత్రంగా చెప్పిన తావులూ ఈవ్యాకరణాలలో చాలా ఉన్నాయి.

**1. సంజ్ఞలు :**

ఉపధ, ఆమ్రేడితం, ఉత్తమం, అవసానం మొద లయిన అనేక సంజ్ఞలు సంస్కృతం నుంచే గ్రహింపబడ్డాయి. 'ఉపధ యనగా తుదివర్ణమునకు ముందువర్ణము' మొద లయిన రీతిగా కొన్ని సంజ్ఞల అర్థం సంస్కృతంనుంచి అనువదింపబడింది. ఇటువంటిస్థితి కారక (సమాస) ప్రకరణంలో అధికంగా కనబడుతుంది. ఉత్తమం,

అవసానం మొద లయిన సంజ్ఞలు తెలుగులో వివరింపబడలేదు. సంస్కృతలక్షణాన్ని ఆశ్రయించే వీటిని గూర్చి తెలియాలి. వేంకటకవి ఆంధ్రకౌముదిలో జశ్ మొద లైనప్రత్యాహారాలు కూడా సంస్కృతవ్యాకరణంనుంచి స్వీకరింపబడినాయి.

త్రిలింగశబ్దానుశాసనం మొద లైన వ్యాకరణాలు పరుషం, సరళం మొద లైనసంజ్ఞలను ఏర్పాటుచేసికున్నాయి. బాలవ్యాకరణం కూడా సంస్కృతసంప్రదాయానుగుణంగా లాఘవాది ప్రయోజనాలకై– దుమంతము, ముత్తు, త్రికము మొద లయినసంజ్ఞలను స్వతంత్రంగా ఏర్పరిచింది.

**2. ఇత్తులు :**

నుక్, లట్, మొద లయినరీతిగా కకారం, టకారం మొద లయినవి సంస్కృతాను సారంగా ఇత్తులుగా స్వీకరింపబడ్డాయి. నుమ్ అన్నపుడు ప్రౌఢవ్యాకర్త మిత్తు స్వీకరించాడు. లజి, ముఞ్ ఇత్యాదిగా తత్తత్ప్రయోజనాలకై జి, ఞ్ మొద లైనవి సంస్కృతసంప్రదాయంలో స్వతంత్రంగా తెలుగువ్యాకరణంలో ఇత్తులుగా చెప్పబడ్డాయి.

**3. ప్రత్యాహారాలు :**

'లకారంబునకు డుఙ్రుువురునుము ఞ్ఞగు' అనేచోట 'ఞకారంబు ప్రత్యాహారార్థంబు' అని చెప్పి సూరి రుఞ్ఞు, వుఞ్ఞు, మొద లయిన ప్రత్యాహారాలను ప్రయోగించాడు. ఇలా ప్రత్యాహారాలు చేసేవిధానం సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించిందే.

**4. పరిభాషలు :**

లక్షణవిధానం సంస్కృతపరిభాషల ననుసరించి ఉండడం ఈవ్యాకరణాలలో సమానం. 'ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని' అనేసూరివివరణం 'నిరవకాశా హి విధయ స్సావకాశాన్ విధీన్ బాధన్తే' అనేసంస్కృతపరిభాష మూలంగా ఏర్పడిందే. నుక్, టుక్ అన్నపుడు 'ఆద్యన్తౌ టకితౌ' అనేదీ, ప్రౌఢవ్యాకర్త చెప్పిన 'నుమ్' అనేచోట 'మి దచో కన్త్యా త్పరః ' అనేదీ, మొదలుగా సంస్కృతపరిభాషలు అక్కడక్కడ సమన్వయించినపుడే ఆవిధానాలు అర్థవంత మవుతాయి. ఇలాగే 'షష్ఠీస్థానే యోగా', 'యదాగమా స్తద్గుణీభూతా స్తద్గ్రహణేన గృహ్యన్తే' అని మొదలుగా పెక్కుపరిభాషలు ఈవ్యాకరణాలలో సమన్వయింపవలసిఉన్నాయి.

**5. కార్యవిధానాలు :**

నిత్యము – విభాష– వైకల్పికము– బహుళము మొదలుగా ఆయాకార్యాలు విధింపబడినతీరు సంస్కృతానుగుణం. వాటిస్వరూపం సంస్కృతంనుంచే తెలియాలి. ఇలాగే, ఆగమ– ఆదేశాదిపద్ధతులు, మొ.

'విధానసామర్థ్యముచే నీద్రుతమునకు లోపము లేదు'

'వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు'–

అనేతీరుగా విధానసామర్థ్య మార్గం, విభాషకు వ్యవస్థ చేయడం మొద లయినపద్ధతులు సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించినవే.

**6. జ్ఞావనవిధానం:**

'ఈజ్ఞాపకంబుచేతనె నామంబులకు ధాతుత్వవివక్షయం దించుగాగమం బగు', 'ఆంధ్రశబ్దచింతామణియందుఁ గల ఇదమదసిత్యాదిసూత్రమందలి యదః ప్రభృతులు వ్యర్థము లగుచు స్వేతరంబులకును నక్కార్యంబు లని తెలుపు'– మొద లైనవిధంగా ఆయా లక్షణభాగాలు వ్యర్థం అయి అర్థాంతరాన్ని సాధిస్తూ ప్రయోజనవంతా లై సార్థకం అయ్యేటట్లు వర్ణించడం సంస్కృతసంప్రదాయమే.

**7. (అధికార) సూత్రవిశేషం:**

సంజ్ఞా, పరిభాష, మొదలుగా విధానంతీరునుబట్టి సూత్రాలలో గలభేదాలు బాలప్రౌఢవ్యాకరణాలలో కనబడతాయి. 'ధాతువునకు' – ఇయ్యది యధికారసూత్రంబు' అనేచోట సూరి అధికారసూత్రంగా స్పష్టంగా చెప్పిన యీ 'అధికార' పద్ధతి సంస్కృత సంప్రదాయమె. సంజ్ఞాదిసూత్రవిశేషాలలు ఉభయవ్యాకరణాలలోనూ ప్రసిద్ధాలే.

**8. రూపసాధనవిధానం:**

పదరూపనిష్పత్తిని ప్రక్రియ ద్వారా నిరూపించేవిధానం సంస్కృతానుసారంగానే ఈవ్యాకరణాలు పేర్కొన్నాయి.ప్రథమాదివిభక్తులను ఏడింటిని చెప్పటం, క్రియాపదాలను క్రియావిభక్త్యంతాలుగా సాధించటం, మొద లైన విటువంటివి. ప్రథమావిభక్తి కనిపించని అన్న, తండ్రి, ఊరు వంటి శబ్దాలను స్త్రీసమాలుగా పేర్కొని ప్రథమైకవచనం లోపింపజేయుటం ద్వారా పదత్వసిద్ధికై చూపినప్రక్రియావిధానం సంస్కృతసంప్రదాయానుసరణమే. బాలవ్యాకరణంలో ఇక్కడ ప్రథమైకవచనంలో సంస్కృతం ఐన 'సు' అనేవిభక్తి చేసుకుని లోపింపజేయటం

గమనింపవలసినఅంశం. చింతామణిలో భూతకాలిప్రథమైకవచనంలో సంస్కృతీయ మైన తిప్ విభక్తిని చేసి లోపింపజేయటం జరుగుతున్నది. అంద్వాదులు, అందఱ్వాదులు అనేవిధంగా గణంగా ఏర్పఱచడం మొద లయినవి ఈపద్ధతిలోవే.

**9. నిపాతలు :**

శాస్త్రంచేత ఒకతీరుగా ఏర్పడవలసినరూపాన్ని ప్రయోగానుసారంగా ఇంకొకతీరుగా ఉండేటట్లు నియమించడాన్ని నిపతించడం అంటారు. 'వేధ పురోధ పురోధసుఁడు.' 'తాము తమరు తారు నగు' అనేరీతిగా బాలప్రౌఢవ్యాకరణాలలో ఈనిపాతవిధానాలు కనబడతాయి.

**10. ఇతరాలు :**

సంస్కృతశబ్దాల లింగం, కవిప్రయోగపరామర్శనం మొ. అనేకవిధాలుగా తెలుగు వ్యాకరణాలు సంస్కృతవ్యాకరణప్రభావంతో తత్సంప్రదాయానుగుణంగా రచింపబడి శాస్త్రగౌరవం అందుకున్నాయి.

ప్రాకృతవ్యాకరణప్రభావం ఉన్న అన్ని తెలుగువ్యాకరణాలలోనూ, ప్రాకృతప్రభావంకంటే సంస్కృతవ్యాకరణప్రభావం అధికంగా ఉండటం గమనింప వచ్చు. సుప్రసిద్ధ మైన బాలప్రౌఢవ్యాకరణాలు రెండూ సంస్కృతసంప్రదా యానుగుణంగానే రచింపబడినా అందుకు నిదర్శనాలు బాలవ్యాకరణంలో అధికంగా స్పష్టంగా కనబడతాయి.

# వాక్యవివరణం

## సంజ్ఞాపరిచ్ఛేదం

**1. ఇం దకారాదు లచ్చులు. (సంజ్ఞ.1)**

'సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రవివరణంలో అ, ఆ ఇత్యాదిగా సంస్కృతవర్ణమాల చూపబడింది. ఇందు అంటే ఆవర్ణమాలలో అకారం మొద లైనవర్ణాలకు అచ్చులు అని పేరు. అని ఈవాక్యానికి అర్థం. 'కకారాదులు హల్లులు' అనేతరువాతివివరణాన్ని అనుసరించి కకారం మొద లైనవర్ణాలకు హల్లు అనేపేరు చెప్పబడటంచేత ప్రస్తుతవాక్యాన్ని అనుసరించి కకారానికి పూర్వం వరకు చూపబడినవర్ణాలకు అచ్చు అనేసంజ్ఞ సిద్ధిస్తున్నది. దీనివల్ల అచ్చతెలుగులో ఉన్న ఎ,ఒ, అరసున్న లకు కూడ అచ్చు అనేసంజ్ఞ సిద్ధిస్తున్నది.

కాగా సంస్కృతభాషలో 'అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ (ఌ,ౡ) ఏ ఐ ఓ ఔ అం అః' అనే16 వర్ణాలకు అచ్చులు అని పేరు. ఇందులో అం అః అన్నచోట్ల అనుస్వారం (ం), విసర్గ (ః) అనేవే అచ్చులు. కాని వీటిని ముందు అచ్చు లేకుండ పలకటం సాధ్యం కాదు. కాబట్టి పూర్వంలో (హల్లు లైన కకారం మొద లైనవాటికి మీద అకారం లాగా) అచ్చులలో మొదటి దైనఅకారాన్ని చేర్చి అం, అః అని నిర్దేశించటం జరిగింది. అచ్చులకే ప్రాణాలు, స్వరాలు మొద లైనపేర్లు ఉన్నాయి.

**2. కకారాదులు హల్లులు. (సంజ్ఞ1)**

'సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రవివరణంలో అ ఆ ఇత్యాదిగా సంస్కృతవర్ణమాల చూపబడింది. ఇందు అంటే ఆవర్ణమాలలోని కకారం మొదలుగా చివరివరకు ఉన్నవర్ణాలకు అన్నిటికీ హల్లులు అని పేరు. అని ఈవాక్యానికి అర్థం.

కాగా సంస్కృతభాషలో ' క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ల వ శ ష స హ ళ ' అనే 34 వర్ణాలకు హల్లులు అని సంజ్ఞ. కకారాదిహల్లులలో పైన ఉన్న అకారం ఉచ్చారణసౌకర్యంకోసం చేర్చబడింది. కాబట్టి హల్లు అనేసంజ్ఞ క్, గ్ ఇత్యాదిగా పొల్లులకే అని గ్రహించాలి. అచ్చతెలుగులోని దంత్యచజలు గూడా ఇలాగే హల్లు అనేసంజ్ఞను పొందుతాయి.

**3. అజ్ఝల్విభాగ మీలాగుననే మీఁద నెఱుంగునది. (సంజ్ఞ. 1)**

'సంస్కృతంబునకు వర్ణంబు లేఁబది' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

అచ్ హల్ విభాగ – అజ్ఝల్‌విభాగ. అచ్చులయొక్కయు, హల్లులయొక్కయు విభాగం అని అర్థం. సంస్కృతవర్ణాలను తెలిపినప్రస్తుసూత్రానికి తరువాత ప్రాకృత వర్ణాలు, తెలుగువర్ణాలు చెప్పబడుతున్నాయి. ఆపైలక్షణాలవద్ద కూడా అచ్చుల, హల్లులవిభాగం ఇక్కడ చెప్పినప్రకారంగానే గ్రహించాలి అని ఈవాక్యానికి అర్థం.

అంటే అకారం మొదలుకొని కకారానికి పూర్వం వరకు ఉన్నవర్ణాలు అచ్చులు, కకారం మొదలుకొని చివరివరకు ఉన్నవర్ణాలు హల్లులు అని తెలియాలి. ప్రాకృతంలో అ నుండి విసర్గవరకు పది అచ్చులు, క నుండి ళ వరకు 30 హల్లులు, మొత్తం 40 వర్ణాలు ఉన్నాయి. తెలుగులో అ నుండి అరసున్న వరకు 14 అచ్చులు, క నుండి ళ వరకు 22 హల్లులు మొత్తం 36 వర్ణాలు ఉన్నాయి.

సంస్కృతంలోనూ, ప్రాకృతంలోనూ కకారానికి పూర్వంలో విసర్గ ఉన్నది. కాబట్టి విసర్గవరకు అచ్చులు అని చెప్పవచ్చు. కాని తెలుగువర్ణమాలలో అరసున్న ఉన్నది. కాబట్టి అక్కడ మళ్లీ వేరుగా చెప్పవలసివస్తుంది. ఆవిధంగా అచ్చుల, హల్లులవివరణం అనేక పర్యాయాలు కాకుండా ఒకేపర్యాయం చెప్పటంలో లాఘవం ఉన్నది. అందుకే అకారాదులు, కకారాదులు అని చెప్పబడింది.

**4. కొందఱమతంబునహ్రస్వవక్రంబులును బ్రాకృతంబునందుఁ గలవు.** (సంజ్ఞ. 2)

'ప్రాకృతమునకు వర్ణములు నలువది' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఎఏఒఓ అనేవర్ణాలకు వక్రాలు అని సంజ్ఞ. ఇందులో ఎ,ఒ అనేవి హ్రస్వాలు కాబట్టి అవి హ్రస్వవక్రాలు. ఏ,ఓ అనేవి దీర్ఘాలు కాబట్టి దీర్ఘవక్రాలు. ప్రాకృతానికి వర్ణాలు 40 అని చెప్పిన సూరి అందులో అచ్చులు 'అఆ ఇఈ ఉఊ ఏఓ అంఅః అని పదివర్ణాలుగా చూపాడు. ఇందులో ఏ, ఓ అనేదీర్ఘవక్రాలు ఉన్నాయి కాని ఎ,ఒ అనేహ్రస్వవక్రాలు లేవు. కొంతమంది ప్రాకృతవ్యాకర్తలు ప్రాకృతంలో ఏ,ఓ అనేదీర్ఘాలతో పాటు హ్రస్వ మైన ఎ,ఒ అనేవక్రవర్ణాలు కూడా ఉన్నా యని చెప్పారు. ఆవిషయాన్ని సూరి ఈవివరణంలో తెలియజేస్తున్నాడు. ఇది కొంతమంది మతం మాత్రమే కావటంచేత సూరి వర్ణమాలలో హ్రస్వవక్రాలను చూపలే దని గ్రహించాలి.

**5. కొందఱమతంబున వక్రతమంబులుం గలవు.** (సంజ్ఞ. 2)

'ప్రాకృతమునకు వర్ణములు నలువది' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఐ,ఔ అనేరెండువర్ణాలకు వక్రతమాలు అని పేరు. ప్రాకృతానికి వర్ణాలు 40 అని చెప్పిన సూరి అందులో అచ్చులు ' అఆ ఇఈ ఉఊ ఏఓ అంఅః' అని పది వర్ణాలుగా చూపాడు. ఇందులో ఐ,ఔ అనే వక్రతమాలు లేవు. కాబట్టి సూరిలక్షణం ప్రకారం ప్రాకృతభాషలో వక్రతమాలు లే వని అర్థం. కాని కొంతమంది ప్రాకృత వ్యాకర్తలు ప్రాకృతంలో ఐ,ఔ అనేవక్రతమాలు కూడా ఉన్నా యని చెప్పారు. ఆవిషయాన్ని సూరి ఈవివరణంలో తెలియజేస్తున్నాడు. ఇది కొంతమంది మతం మాత్రమే కావటంచేత సూరి వర్ణమాలలో వక్రతమాలను చూపలే దని గ్రహించాలి.

**6. ఎఏఒఓలు వక్రంబు లని, ఐఔలు వక్రతమంబు లని ప్రాచీనులు వ్యవహరింతురు. (సంజ్ఞ.2)**

'ప్రాకృతమునకు వర్ణములు నలువది' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఎ,ఏ,ఒ,ఓ అనేనాలుగువర్ణాలకు వక్రాలు అనేపేరూ, ఐ,ఔ అనేవర్ణాలకు వక్రతమాలు అనేపేరూ ఉన్నట్లు ప్రాచీను లైనతెలుగువ్యాకర్తలు చెప్పారు. 'ఏ ఙథో వక్రః, వక్రతమ ఐచ్' అని చింతామణి సూత్రించింది. కాగా వక్రం అనేసంజ్ఞచేత ఎఏఒఓ అనేవర్ణాలను గ్రహించాలి. వీటిలో ఎఒ అనేవక్రాలు హ్రస్వాలు కాబట్టి ఆరెండు హ్రస్వవక్రాలు. ఏఓ అనేవక్రాలు దీర్ఘాలు కాబట్టి ఆరెండు దీర్ఘవక్రాలు. అలాగే వక్రతమసంజ్ఞచేత ఐఔ అనేవర్ణాలను గ్రహించాలి.

**7. తాలవ్యచకారంబు దంత్యచకారంబునకును, దాలవ్యజకారంబు దంత్యజకారంబు నకును గ్రాహకము లని తాత్పర్యము.** (సంజ్ఞ.7)

చూ. దంత్యతాలవ్యంబు లయినచజలు సవర్ణంబులు సూత్రవ్యాఖ్య.

**8. ఐదంతము లయినచజలు సమేతరశబ్దములందు లేవు.** (సంజ్ఞ - 9)

'అఆఉఊఒఓఔలం గూడినచజలు దంత్యంబులు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సమం అంటే సంస్కృతసమం. సమేతరం అంటే ఆచ్ఛికం. ఐకారం చివర కలిగిన చై, జై అనేఅక్షరాలు అచ్చతెనుగు పదాల్లో ఎక్కడా ఉండవు.

అచ్చతెలుగులో చజలు తాలవ్యా లనీ, దంత్యా లనీ, రెండు విధాలు. ఇఈఎఏలం గూడినచజలు తాలవ్యంబులు, అఆఉఊ ఒఓలం గూడినచజలు దంత్యంబులు. కాగా మిగిలిన అచ్చులతో గూడినవి ఏం కావాలి ? ఋ ౠ (ఌ,ౡ) (విసర్గ) అనేఅచ్చులు అచ్చతెనుగులో లేవు. కాబట్టి వాటితో గూడినచజలు అచ్చతెలుగులో ఉండవు. అం, అఁ, అని సున్న, అరసున్న అనేఅచ్చులు ఏదో ఒకఅచ్చు పూర్వంలో

కలిగి ఉంటాయి గాని చ్ం, జ్ం అనే విధంగా హల్లు మీద ఉండవు. కాగా సున్నకు పూర్వంలో ఉన్న అచ్చునుబట్టి అక్కడి (సున్న,విసర్గలకు పూర్వంలో ఉన్న)చజలు దంత్యాలో, తాలవ్యాలో అవుతాయి. చీఁకటి, జంత. కాబట్టి యిక్కడ సున్న అరసున్నల ప్రసక్తి లేదు. ఇక మిగిలింది ఐకారం. చై, జై అనే విధంలో ఐకారంతో గూడితే చజలు, తాలవ్యాలు గాక, దంత్యాలూ గాక ఏ మవుతాయి అనేప్రశ్న పుట్టగా దానికి సమాధానంగా ఈవాక్యం చెప్పబడింది.

ఐకారం అచ్చతెలుగులో ఉంది. కాబట్టి ఐకారంతో గూడిన చజలు అచ్చతెలుగులో ఉండేఅవకాశం ఉంది. కాని అచ్చతెనుగులో ఏశబ్దంలోనూ చై, జై అనే అక్షరాలు లేనే లేవు. కాబట్టి అవి దంత్యాలా తాలవ్యాలా అనే ప్రశ్నకే అవకాశం లే దని తాత్పర్యం.

దీనివల్ల చైదము, చైవు (జై) అనే విధంగా ఉండటం లక్షణవిరుద్ధం. చెయిదము చెయువు (జయ ఇది సంస్కృతం) అని ఉండాలి.

'సమేతరశబ్దములందు' అనటంచేత సంస్కృతసమాల్లో చైత్రం, జైత్రయాత్ర అని ఉంటుంది. సంస్కృతం(సమం)లో అన్నీ తాలవ్యాలే కాబట్టి ఇవి తాలవ్యాలే అవుతాయి.

**9. ఇవి దప్ప సంస్కృతసమంబులందు దంత్యచజలు లే వని తాత్పర్యము.** (సంజ్ఞ. 10)

'సంస్కృతసమంబులం దికారాతము లయినశబ్దములయుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చజలకు దంత్యతాలవ్యభేదం అచ్చతెలుగులో మాత్రమే. సంస్కృతంలో చజలు ఏఅచ్చుతో కలిసిఉన్నా, తాలవ్యాలు మాత్రమే అవుతాయి. అందుచేత సంస్కృత సమాలలో కూడా తాలవ్యచజలు మాత్రమే కాని దంత్యచజలు ఉండవు. కాని పైసూత్రాన్ని అనుసరించి అర్చులు, వాజులు అనేరీతిగా ఇకారాంతాలఉపధాచజలు బహువచనంలో తెలుగులో దంత్యాలు అవుతున్నాయి. కాబట్టి ప్రత్యేకవిధానం ఉన్న ఈసందర్భంలో తప్ప తెలుగులో సంస్కృతసమాలలో మ రెక్కడా దంత్యచజలు లే వని ఈవాక్యం వివరిస్తున్నది.

ఇఈఎఏ అనేఅచ్చులతో కూడిన చజలు (సంస్కృతంలోనూ) తెలుగులోనూ తాలవ్యాలే. కాని అఆఉఊఒఓఔ అనేఅచ్చులతో కూడినచజలు అచ్చతెలుగులో

దంత్యాలు. కాని సంస్కృతాన్ని అనుసరించి సంస్కృతసమాలలో అఆఉఊఒఓఔ లతో కూడినచజలు తాలవ్యాలే అవుతాయి. దంత్యాలు కావు. చంద్రుడు, జానకి మొ.

**10. ఉపధ యనఁగాఁ దుదివర్ణమునకు ముందువర్ణము.** (సంజ్ఞ. 10)

'సంస్కృతసమంబులం దికారాంతము లయినశబ్దములయుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును' అనేసూత్రంలోని ఉపధ అనేసంజ్ఞను గూర్చి ఈవాక్యం వివరిస్తున్నది.

ఇది సంస్కృతసంజ్ఞ. 'అలో ఽన్త్యాత్ పూర్వ ఉపధా' అనేపాణినీయలక్షణాన్ని ఈవాక్యం అనువదిస్తున్నది. శబ్దంలో చివరివర్ణానికి పూర్వంలో ఉన్నవర్ణం అంటే చివరినుంచి రెండవవర్ణానికి ఉపధ అని పేరు. అచ్చు లేదా పొ ల్లయినహల్లు వర్ణం. ఉదా. అర్చి. ఈశబ్దంలో అర్చ్ఇ అని నాలుగువర్ణాలు ఉన్నాయి. ఇందులో ఇ చివరిది. దానికి పూర్వంలో ఉన్నది (చివరినుంచి రెండవవర్ణం) చ్. ఈచకారానికి ఉపధ అని పేరు. ఇలాగే వాజి. వ్ఆజ్ఇ. ఇందులో జకారం ఉపధ.

**11. మఱియు రాజుశబ్దం బొక్కటి దంత్యయుక్తంబు గానంబడియెడి.** (సంజ్ఞ. 10)

'సంస్కృతసమంబులం దికారాతము లయినశబ్దములయుపధాచజలు బహువచనంబు పరం బగునపుడు దంత్యము లగును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చజలు అచ్చతెలుగులో తాలవ్యాలు, దంత్యాలు అని రెండురకాలు. సంస్కృతంలో దంత్యాలు లేవు. అన్నీ తాలవ్యాలే. కాబట్టి తెలుగులోని తత్సమాలలో కూడా చజలు తాలవ్యాలు మాత్రమే అవుతాయి. కాని పైసూత్రంప్రకారం అర్చులు, వాజులు మొద లైనవిధంగా ఇకారాంతసంస్కృతశబ్దాలు తెలుగులో బహువచనంలో ఉన్నపుడు ఉపధ ఐన చజలు దంత్యాలు అవుతాయి అని చెప్పింది. కాగా మిగిలినఅన్నిచోట్ల ఏకవచనంలోనూ బహువచనంలోనూ సంస్కృతసమాలలోనిచజలు తాలవ్యాలు మాత్రమే కావాలి. చంద్రుడు.

అర్చులు, వాజులు వంటి స్థలాలతోపాటు మరొక్కచోట దంత్యజకారం ఉన్నది అని ఈవాక్యం రాజు అనే సంస్కృతసమంలో కూడ ఏకవచనంలోనూ, బహువచనం లోనూ జకారం దంత్యం అవుతున్న దని చెప్తున్నది. రాజు, మహారాజులు మొ. రాజు అనేవిధంగా ఉన్నపుడే ఇది దంత్యం. రాజ! రాజా! ఇత్యాదిగా సంబోధనంలో రాజశబ్దంలోని జకారం దంత్యం కాదు. తాలవ్యమే.

అచ్చు మొద లైనఇతరస్థలాలలోనూ సంస్కృతసమాలలో దంత్యచజలు కనబడుతున్నాయి.

**12. హరి యతఁడు, నిద్ర వోయె, ఇట్టిచోట్ల సంధివశంబున వచ్చినయకార వకారంబులు గాని పూర్వసిద్ధంబులు గావు.** (సంజ్ఞ .17)

'యకారంబును వుపూవొవోలును దెలుఁగుమాటలకు మొదట లేవు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అచ్చతెనుగుపదాలకు మొదట యకారం గానీ, వుపూవోవో అనేఅక్షరాలు గానీ ఉండవు అని చెప్తున్నది.

'హరి యతఁడు' అనేచోట హరి అనేది ఒకపదం. కాబట్టి 'యతడు' అనేతర్వాతి అచ్చతెనుగుపదం మొదట యకారం ఉన్నది గదా. అలాగే 'నిద్ర వోయె' అనేచోట 'నిద్ర' మొదట పదంకాగా రెండవ దైన 'వోయె' అనేశబ్దంలో మొదట 'వో' ఉన్నది. ఇలా 'యతఁడు' అన్నప్పుడు పదంమొదట యకారము, వోయె అనే పదంమొదట 'వో' ఉండగా 'యకారంబును వుపూవొవోలును లే' వనడం లక్ష్యాలకు విరుద్ధం. లక్ష్యవిరుద్ధ మైనలక్షణం తప్పు కదా అని సందేహం కల్గగా దానికి సమాధానం ఈవాక్యం.

'హరి యతడు' అనేచోట పదంమొదట ఉన్నయకారం 'సంధి లేనిచోట స్వరంబు కంటెం బరంబయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత సంధికార్యంగా వచ్చినయడాగమయకారమే కాని, శబ్దంలో సహజంగా మొదట్లోనే సిద్ధ మై ఉన్నది గాదు. 'హరి + అతఁడు' అనే విధంగా సహజంగా ఉన్నది అకారమే.

అలాగే 'నిద్ర వోయె' అన్నప్పుడు 'వోయె'లో పదం మొదటి వకారం 'ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు' అనేసూత్రంచేత పకారానికి ఆదేశంగా వచ్చిందే తప్ప ఆశబ్దంలో మొదట సిద్ధ మై ఉన్నది గాదు. నిద్ర+పోయె అనే విధంగా అక్కడ సహజంగా ఉన్నది 'పోయె' అని 'పో' వర్ణమె.

కాగా ఇక్కడ పదాదిని యకారం (వుపూ)వోలు శబ్దంలో సహజంగా ఉన్నవి కావు. కాబట్టి యకారమూ, వుపూవొవోలు పదం మొదట లే వనేలక్షణం లక్ష్యవిరుద్ధం గాదు. కాబట్టి సమంజసమే అని తాత్పర్యం.

**13. వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వుపూవో వర్ణాదు లగుశబ్దంబులు లేవు.** (సంజ్ఞ. 17)

'యకారంబును వుపూవొవోలోను దెలుఁగుమాటలకు మొదట లేవు' అనేసూత్రం

వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంసంస్కృతసమేతర మైనఅచ్చతెలుగుమాటలకు మొదట యకారం గాని, వువూ(వొ)వో వర్ణాలు గాని ఉండవు అని చెప్తున్నది. యముడు, యాత్ర అనేవిధంగా సంస్కృతసమాల్లో పదంమొదట యకారం ఉన్నది.

మిగిలిన వువూవొవోలు మాత్రం సంస్కృతసమశబ్దం మొదట ఉండేఅవకాశం ఉన్నా కనబడ్డం లేదు. సంస్కృతభాషలో ఎ, ఒ అనే హ్రస్వవక్రాలు లేవు. కాబట్టి వకారమే కాక, ఏహల్లు గూడా ఎ, ఒ లతో కలిసి (కె, కొ, ఇత్యాదిగా) సంస్కృతంలో పదం మొదటే కాదు, మొత్తం భాషలోనే ఎక్కడా ఉండే అవకాశం లేదు. కాగా 'వు, వూ, వో' వర్ణాలు ఉండవచ్చు. వుకః, వోళికా, ఇత్యాదిగా సంస్కృతంలో ఉన్నశబ్దాలు తెలుగులో ప్రవేశించడం లేదు. వోఢృ, వోఢవ్య అనేశబ్దాలు మాత్రం తత్సమాలుగా తెలుగులో ప్రవేశిస్తున్నాయి. కాబట్టి ఆరెండుశబ్దాల్లో తప్ప తెలుగులో ఉన్నసంస్కృతసమాల్లో గూడా పదం మొదట వు, వూ, వో వర్ణాలు లేవు.

ఇలా చెప్పడంవల్ల, వుదకము, వూర్మిక, వోదనము ఇత్యాదిగా వు, వూ, వో లుగా ఉచ్చరించేచోట వకారం ఉచ్చరించటం తప్పు అని గ్రహించాలి. ఇంక ఉదకము, ఊర్మిక, ఓదనము అని ఉ, ఊ, ఓ అనే అచ్చులే ఉంటాయి.

**14. హరియతఁడు ఇత్యాదులం దాగమయకారము లఘువు.** (సంజ్ఞ.18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

యరలవలు ఎక్కడ లఘువులో, ఎక్కడ అలఘువులో వివరిస్తున్న సూరి మొదట యకారం ఎక్కడిది లఘు వవుతుందో ఈవాక్యం ద్వారా చెప్తున్నాడు.

హరి+అతడు అని ఉండగా 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయిన స్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత యకారం ఆగమంగా వచ్చి 'హరి యతడు' అని అవుతుంది. అలా ఆగమంగా వచ్చినయకారం లఘువు అవుతుం దని ఈవాక్యానికి అర్థం. కాగా సంధి లేనిచోట పరస్వరానికి ఆగమంగా వచ్చిన యకారం లఘువు. ఆగమంగా వచ్చినా ఇతరస్థలాలలో ఉన్నయకారం లఘువు కాదు. భుజ్+ఇంచు=భుజియించు. ఇక్కడ ఆగమంగా వచ్చిన ఇయుడాగమంలోనియకారం లఘువు కాదు.

**15. తక్కినయకార మలఘువు.** (సంజ్ఞ.18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

ఎక్కడియకారం అలఘువు అవుతుందో సూరి ఈవాక్యంలో వివరిస్తున్నాడు. 'హరి యతడు ఇత్యాదులం దాగమయకారము లఘువు' అనేపూర్వవాక్యాన్ని అనుసరించి తక్కినయకారం అంటే సంధి లేనిచోట ఆగమంగా వచ్చినదానికంటె వే రైనయకారం ఎటువంటి దైనా అలఘువు అవుతుంది. 1. కాయ, నేయి. ఇక్కడ శబ్దంలో సహజంగా ఉన్నయకారం. 2. భుజియించు, జయించు. ఇక్కడ ఇయుట్, అయుక్ అనేఇతరాగమాలద్వారా వచ్చినయకారం. 3. ఆయెను, పోయి. ఇక్కడ ఆదేశంగా వచ్చినయకారం. యడాగమయకారంకంటె వేరైన అన్నివిధా లైనయకారం అలఘువు.

**16. శకటరేఫము తత్సమతద్భవములందు లేదు.** (సంజ్ఞ. 18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

విఱుగు మెఱుగు ఇత్యాదులలో ఉన్న రేఫ అలఘువు. అలఘురేఫనే శకటరేఫ అంటారు. ఈశకటరేఫ తత్సమశబ్దాలలోనూ, తద్భవశబ్దాలలోనూ ఉండ దని ఈవాక్యం వివరిస్తున్నది. తత్సమం అంటే సంస్కృతప్రాకృతసమం అయినభాష. సంస్కృతప్రాకృతభాషలలో శకటరేఫ లేదు. కాబట్టి తత్సమాలలో కూడ శకటరేఫ ఉండే అవకాశం లేదు. తద్భవం అంటే సంస్కృతప్రాకృతభవం అయినభాష. సంస్కృతప్రాకృతాలలో లేకపోయినా, అచ్చతెలుగులోని వర్ణాలు (ఎఒ, దంత్యచజలు) తద్భవాలలో ఉండవచ్చు. మెకము, మొగము, అచ్చర, జన్నము మొ. కాని శకటరేఫం మాత్రం లేదు అని సూరివివరణం. కాని కాఱియ మొద లైనతద్భవాలలో శకటరేఫ ఉండటాన్ని తననిఘంటువులో చెప్పాడు. మూర్ఖ – మోఱకు ఇత్యాదిగా తద్భవాలలో శకటరేఫ ఉండటాన్ని ప్రౌఢవ్యాకరణం స్పష్టం చేసింది.

**17. ఏళులు పాళులు త్రాళు లని బహుత్వమందు రలడల కాదేశ మైనళకార మలఘువు.** (18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

సూరి అలఘువు అయిన ళకారాన్ని గూర్చి వివరిస్తున్నాడు. ఏరు+లు=ఏళులు, ఇక్కడ రేఫకు ళకారం ఆదేశంగా వచ్చింది. పాలు+లు=పాళులు. ఇక్కడ లకారానికి ళకారం ఆదేశం అయింది. త్రాడు+లు ఇక్కడ డకారానికి ళకారం ఆదేశం. ఇలా

బహువచనం పరంగా ఉన్నపుడు ర,ల,డ అనేవర్ణాలకు ఆదేశంగా వచ్చే ళకారం అలఘువు అవుతుం దని ఈవాక్యానికి అర్థం. ఇలాగే ఏళ్లు, మొ. దీనినిబట్టి అలఘుళకారం ఏశబ్దంలోనూ ఏకవచనంలో ఉండదు. కాబట్టి తళుకు, బెళుకు ఇత్యాది శబ్దాలలో ఉన్న ళకారం అలఘువు కాదు. అది వేరే వర్ణం. బహువచనంలో కూడ రలడ అనేవాటికి ఆదేశంగా వస్తేనే అలఘువు అవుతుంది.ప్రాచీనులు మాత్రం ఎక్కడ ఉన్నా ళకారం అలఘువే అని భావించారు.

**18. అతఁడు వలికె నిత్యాదులం దున్నపాదేశవకారము లఘువు.** (సంజ్ఞ.18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

లఘు వైనవకారాన్ని గూర్చి వివరిస్తూ సూరి ఈవాక్యం చెప్పాడు.

అతడు+పలికె అని ఉండగా 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత పకారానికి వకారం ఆదేశంగా వచ్చి, అతడు వలికె అని అవుతుంది. ఇలా గసడదవాదేశసందర్భంగా పకారానికి ఆదేశంగా వచ్చిన వకారం లఘువు అవుతుం దని ఈవివరణం తాత్పర్యం. ఇలాగే నిద్ర వోయె మొ. కాగా పకారంకంటె వేరైనవర్ణానికి ఆదేశంగా వచ్చిన వకారం లఘువు కాదు. చివురు. ఇక్కడ చిగురు శబ్దంలో గకారానికి ఆదేశంగా వచ్చినవకారం లఘువు కాదు. అలఘువు.

**19. తక్కినవకార మలఘువు.** (సంజ్ఞ.18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అలఘు వైనవకారాన్ని గూర్చి సూరి ఇలా వివరిస్తున్నాడు.

'అతఁడు వలికె నిత్యాదులం దున్నపాదేశవకారము లఘువు'. అనేపూర్వవాక్యాన్ని అనుసరించి తక్కినది అంటే పకారానికి ఆదేశంగా వచ్చినది కాక వే రైనది. గసడదవాదేశం మూలంగా పకారానికి ఆదేశంగా వచ్చినదానికంటె వేరైనవకారం ఏ దైనా, అలఘువు అని అర్థం. 1. శబ్దంలో సహజంగా ఉన్న వకారం. వంకర, వాగు మొ. 2. పకారానికంటె వే రైనవర్ణానికి ఆదేశంగా వచ్చినది. పవలు, చివురు (పగలు, చిగురు అనేచోట్ల ఉన్నగకారానికి ఆదేశం.) 3. ఆగమంగా వచ్చినది. ప్రభవించు, లవించు. ఇక్కడ అవుక్ అనేఆగమంవల్ల వకారం వచ్చింది. మొ.

**20. వర్ణసమామ్నాయమందలిళకారము వర్ణాంతరము గాని యలఘుళకారము కా దని యెఱుంగునది.** (సంజ్ఞ. 18)

'యరలవలు లఘువు లని యలఘువు లని ద్వివిధంబు లగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రకారం రెండువిధాలుగా ఉన్న య,ర,ల,వ అనేవాటిలో య,ర,వ అనేవి మూడూ వర్ణమాలలో ఒక్కొక్కటే చూపబడ్డాయి. లకారాలుమాత్రం 'ల,ళ', అని రెం డున్నాయి. ఇందులో 'ల'కారం లఘువు, కాగా 'ళ'కారం అలఘువు. అని బాలసరస్వతి మొద లైన పూర్వ లాక్షణికులు చెప్పారు. లఘువూ(ల), అలఘువూ (ళ) ఐన లకారాలు రెండు వర్ణసమామ్నాయంలో ఉంటే, య,ర,వ లు గూడా రెండేసి ఉండాలి కదా. ఉచ్చారణభేదంచేత ఏర్పడిం దని అలఘు (శకట) రేఫను గూడ వర్ణమాలలో చేర్చనివారు అలఘులకారం చేర్చడం దోషం కదా !

దానిని సమన్వయించడానికి ఈవివరణం చేయబడింది. వర్ణసమామ్నాయంలో ఉన్నళకారం వేరే ఇంకోవర్ణం. అంతే గాని అది అలఘువు గాదు. బహుత్వంలో 'ర,ల,డ అనేవర్ణాలస్థానంలో ఆదేశంగా వచ్చిన – ఊళులు, కాళ్లు, త్రాళ్లు, అనేచోట 'ళ' కారం అలఘువు. శబ్దంలో సహజంగా తళుకు, బెళుకు ఇత్యాదుల్లో ఉన్న'ళ'కారం అలఘువు కాదు. ఇది వేరేవర్ణం. వర్ణసమామ్నాయంలో పరిగణించినది శబ్దసహజ మైన వేరే ళకారమే గానీ బహుత్వంలో ఆదేశంగా వచ్చిన అలఘు వైనళకారం కాదు. 1.లఘు వైనలకారం, 2.అలఘు వైనళకారం 3.అలఘువు గాని 'ళ'కారం అని లకారాలు మూ డైనాయి.

దీనిప్రకారం లఘ్వలఘువుల్లో యరవలతోపాటు లకారం గూడ వర్ణమాలలో ఒకటే పరిగణింపబడింది గాబట్టి విరోధం లే దని సూరి క్రొత్త సమన్వయం. లఘ్వలఘుకల్పనం తెలుగులో సరిగా కుదురుపడలే దని మాత్రం చెప్పక తప్పదు.

**21. ఈభాష ప్రయోగంబున కనర్హంబు.** (సంజ్ఞ. 22)

'లక్షణవిరుద్ధం బగుభాష గ్రామ్యంబు' అనే సూత్రవివరణంలోనిది ఈవాక్యం.

ఈభాష అంటే గ్రామ్యభాష. ప్రయోగం అంటే కావ్యాదిగ్రంథాలలో ఉపయోగం. వ్యాకరణం సాధించినరూపానికి భిన్నంగా ఉన్నశబ్దం గ్రామ్యం, తత్సమ మైనా, తద్భవ మైనా, దేశ్య మైనా, వ్యాకరణం అంగీకరించనిరూపం గ్రామ్యం అవుతుంది. మీననేత్రి, వనమునుంచి, మొ. తత్సమాలు, కూఁతురులు, చేతురు మొ. దేశ్యాలు. ఇలా అనేకమాటలు మొ. లక్షణానికి విరుద్ధాలు గాబట్టి గ్రామ్యా లవుతాయి.

ఇటువంటి శబ్దాలను కావ్యాదుల్లో ప్రయోగించరా దని ఈవాక్యం చెప్తున్నది.

లౌకిక మైననిత్యవ్యవహారంలో వస్తాడు మొద లైనవి గ్రామ్యా లైనా ప్రయోగించు కోవచ్చు. కాని కావ్యాదుల్లో కూడ దని తాత్పర్యం. కావ్యాల్లో గూడా నీచజాతిపాత్రల సంభాషణం మొద లైనసందర్భాల్లో గ్రామ్యం ఉపయోగించవ చ్చని కొంద రంటారు. 'గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణనంబునం బ్రయోగార్హం బగు' అని ప్రౌఢవ్యాకర్త గూడా చెప్పాడు. కాని ప్రాచీనకావ్యాల్లో గ్రామ్యం ఈవిధంగా ప్రయోగించడం కనబడదు.

**22. పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యం బయిన గ్రహింపఁదగు.** (సంజ్ఞ. 22)

చూ. ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు– సూత్రవివరణము.

# సంధిపరిచ్ఛేదం

**1. పూర్వపరస్వరంబులకుం బరస్వరం బేకాదేశం బగుట సంధి యనంబడు.** (సంధి. 1)

'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంలోని సంధి అనేపదాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

పూర్వస్వరం అంటే మొదటిశబ్దంలో చివర ఉన్నఅచ్చు. పరస్వరం అంటే ఆమొదటి శబ్దానికి తర్వాత ఉన్న (రెండవ)శబ్దంలో మొదటిఅచ్చు. ఏకాదేశం అంటే రెండింటి స్థానంలో ఒక్కటి ఆదేశంగా రావటం. మొదటిశబ్దం చివరిఅచ్చు, దానికి పైనున్న రెండవశబ్దం మొదటిఅచ్చు ఈరెండు అచ్చులస్థానంలో రెండవశబ్దం మొదటిఅచ్చు ఒక్కటి ఆదేశంగా రావటం సంధి. రాముడు+అతడు అనేది రాముడతడు అని అవుతుంది. ఇక్కడ రాముడు అనేమొదటిశబ్దంలో చివర ఉన్న (రాముడ్+ఉ) 'ఉ' అనేఅచ్చు, అతడు అనేరెండవపదం మొదటి దైన 'అ' అనేఅచ్చు రెండింటిస్థానంలోనూ రెండవశబ్దం మొదటిఅచ్చు ఐన అకారం ఆదేశంగా వచ్చింది కాబట్టి ఇది సంధి అనబడుతుంది.

**2. ఆగమం బనఁగా వర్ణాధిక్యంబు.** (సంధి. 3)

'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంలోని ఆగమశబ్దాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

శబ్దాలలో అంతకుముందు అక్కడ ఉన్నవర్ణాలు అన్నీ అలాగే ఉండగా అధికంగా వర్ణం లేదా వర్ణాలు వచ్చిచేరటం ఆగమం. అలా వచ్చిచేరినవర్ణాలకు కూడా ఆగమం అని సంజ్ఞ. మా+అమ్మ అని ఉండగా 'సంధి లేనిచోట..' అనేసూత్రంచేత యకారం వచ్చి చేరి, మాయమ్మ అని అవుతుంది. ఇక్కడ మా అమ్మ అని అంతకుముందరి వర్ణాలు అన్నీ అలాగే ఉండగా అధికంగా వచ్చి చేరింది. కాబట్టి యకారం ఆగమం. ఇలా (యకారం) వచ్చి చేరటాన్ని కూడా ఆగమం అంటారు.

**3. బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకు సంధి లేదు.** (సంధి. 4)

'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఈసూత్రం అచ్చు పరంగా ఉండగా ముందరిశబ్దంచివరిహ్రస్వ మైనఅకారానికి సంధి బహుళంగా వస్తుం దని చెప్తున్నది. ఆసూత్రంలో బహుళం అని చెప్పడంచేత

కొన్నిచోట్ల సంధికి అప్రవృత్తి. ఆస్థలాలను ఈవాక్యం పేర్కొంటుంది.

1. స్త్రీని బోధించేశబ్దం స్త్రీవాచకం. అందులోని హ్రస్వఅకారానికి సంధి రాదు. అమ్మ+ఇచ్చెను. సంధి లేదు. కాబట్టి యడాగమం వచ్చి, అమ్మ యిచ్చెను.

2. తత్సమం అంటే సంస్కృత(ప్రాకృత)సమం. ఆశబ్దాల్లోనిఅత్తుకు సంధి రాదు. దూత + ఇతడు = దూత యితడు.

3. సంబోధనం అంటే పిలుపు. ఇది ప్రార్థనం మొద లైనఇతర మైన విశేషార్థాలను గూడ సూచిస్తుంది. కాబట్టి సంబోధనం, ప్రార్థనం, అవధారణం మొద లైన విశేషార్థాలను తెలియజేసేఅత్తుకు కూడా సంధి రాదు. చెలువుడ + ఇందము= చెలువడ యిందము (సంబోధనం). కావుమ + అనెను = కావుమ యనెను (ప్రార్థనం). తమ్ముడ + అప్తుడు = తమ్మడ యాప్తుడు (అవధారణం) మొ.

**4. సంస్కృతీయంబునకు సంధి యగు నని యధర్వణాచార్యులు చెప్పిరి. కాని దానికిం బూర్వకావ్యంబులందు బ్రయోగంబు మృగ్యంబు.** (సంధి. 4)

**5. ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచకతత్సమంబులకు సంధి గానంబడియెడి.** (సంధి. 4)

'అత్తునకు సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అచ్చు పరంగా ఉన్నపుడు హ్రస్వ మైనఅకారానికి సంధి బహుళంగా విధిస్తున్నది. 'బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతములకు సంధి లేదు' అని చిన్నయసూరి సంస్కృతసమంలోనిసంస్కృతానికి సంబంధించినఅత్త్వానికి బహుళపదంచేత సంధి రా దని వివరించాడు.

కాని ప్రాచీను డైనఅధర్వణుడు 'కుత్రచిత్ సంస్కృతీయో కపి ప్రాణ్యో కప్యత్ర చ్యుతో భవే' త్తని సంస్కృతీయానికి అంటే సంస్కృతానికి సంబంధించినఅచ్చుకు, కొన్నిచోట్ల సంధి వస్తుం దని చెప్పడం జరిగింది. దీనివల్ల తత్సమ – అత్త్వానికి సంధి వస్తుంది గదా.

అధర్వణుడు తత్సమాకారానికి సంధి వస్తుం దని ఎపుడో చెప్తే, ఇపుడు సంధి రా దని సూరి చెప్పడం ఎలా కుదరుతుం దని ప్రశ్న. తత్సమ మైన అకారానికి సంధి రావడం ప్రాచీన మైనకవిప్రయోగాలలో వెదకవలసిఉంది. అంటే తనకు కనబడలే దనీ, దాదాపుగా (తత్సమాకారానికి సంధి) లే దనీ తాత్పర్యం.

కవిప్రయోగాల్లో తత్సమఅకారానికి సంధి లేకపోవడంవల్ల సంధి లే దని తాను

చెప్పినలక్షణం (అధర్వణలక్షణానికి భిన్నంగా ఉన్నా) లక్ష్యానుగుణం కాబట్టి సమంజస మని సూరి అభిప్రాయం.

రాయలయుగంనుండి తరువాతికాలంలో పుట్టినవాఙ్మయం ఆధునికంగా చెప్పబడుతున్నది. ఆధునిక మైనకావ్యాలలో మాత్రం తత్సమాకారానికే కాకుండా స్త్రీవాచకాల్లోని అత్త్వానికి గూడ సంధి అరుదుగా కనబడుతున్నది.

గంగ+అనుకాసె=గం గనుకాసె. ఇక్కడ తత్సమాకారానికి సంధి జరిగింది. నెలఁత+ఇచ్చెను=నెలఁ తిచ్చెను. ఇక్కడ స్త్రీవాచకాలలో అత్త్వానికి సంధి జరిగింది.

ఆధునికమే కాక, 'ఒకానొకచోట' అరుదుగా కనబడేలక్షణం కాబట్టి దీన్ని భాషా సామాన్యలక్షణంగా చెప్పడం తగదు. అందుకే ఆధునికప్రయోగాల్లో స్త్రీవాచకతత్సమాకారాలకు సంధిని గుర్తించినా, సూరి సంధి లే దని నివారించినట్లు గ్రహించాలి.

(ఆధునికప్రయోగాలను లక్షణబద్ధం చేయదలిస్తే స్త్రీవాచకాల క్కూడా సంధి చెప్పవలసిఉంటుంది. తత్సమంలో మాత్రమే ప్రాచీన మైన అధర్వణవాక్యం సంధి చెప్తున్నది. దాన్నిబట్టి నిర్ణయింపరా దని సూరి తాత్పర్యం).

**6. వెలయాల్వాదుల సంధి లేమి బాహుళకముచేతనే యని యూహించునది.** (సంధి. 4)

'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అచ్చు పరంగా ఉండగా హ్రస్వ మయినఅకారానికి బహుళంగా సంధి వస్తుం దని చెప్తున్నది.

వెల+ఆలు అనేచోట అత్తుకు అచ్చు పరంగా ఉంది. కాబట్టి పైసూత్రం ప్రకారం సంధి రావాలి. కాని 'వెలాలు' అనేవిధంగా ఇక్కడ సంధి రావడం లేదు. ఇంక, 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత యడాగమం వచ్చి 'వెలయాలు' అని మాత్రమే అవుతుంది. యడాగమం సంధి లేనిచోట మాత్రమే వస్తుంది, కాబట్టి ఇక్కడ సంధి లేదు. మరి 'అత్తునకు' అనేసూత్రంచేత సంధి ఎందుకు రావడం లేదు? అని సందేహం. దానికి సమాధానం ఈవాక్యం.

'అత్తునకు' అనేసూత్రంలోని బహుళపదంచేతనే సంధి రాదు. 'క్వచిత్ ప్రవృత్తిః క్వచి దప్రవృత్తిః' బహుళపదానికి ఉన్న అర్థాలలో అప్రవృత్తి ఒకటి. కాబట్టి వెలయాలు మొద లైనస్థలాల్లో సంధికి అప్రవృత్తి అని గ్రహించాలి.

**7. ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.** (సంధి. 9)

'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం ద్రుతప్రకృతికాల్లో ఇఁక మొద లైనవాటికి తప్ప ఇంక దేనికీ సంధి లే దని చెప్తున్నది. అయితే 'ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రానికి లక్ష్యా లయిన ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణా లన్నీ ద్రుతప్రకృతికాలే. ఇవి ఇఁకాదుల్లో చేరలేదు. ద్రుతప్రకృతికాలకు అన్నింటికీ ఇఁకాదిసూత్రంచేత సంధి నిషేధింపబడటంచేత ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణాల లోనూ సంధి రాదు. కాగా, ఆవిధానానికి లక్ష్యాలు ఏవీ ఉండవు. ఆలక్షణం ప్రవర్తించడానికి అవకాశం లేకపోవడంవల్ల అది నిరవకాశవిధి అవుతున్నది.

ప్రథమేతరవిభక్తి శత్రర్థచువర్ణాలకు ఆవిధిప్రకారం సంధి చేసినా, ఇఁకాది సూత్రానికి వచ్చున్ మొ. ప్రథమేతరవిభక్తిశత్రర్థచువర్ణేతరద్రుతప్రకృతికా లైనలక్ష్యా లెన్నో ఉన్నాయి. అంటే ఇఁకాదివిధి ప్రవర్తించడానికి ఇతరత్ర అవకాశం ఉండడంవల్ల ఇది నిరవకాశవిధి.

'నిరవకాశా హి విధయః సావకాశాన్ విధీన్ బాధన్తే,' అనేన్యాయా న్ననుసరించి, నిరవకాశ మైనప్రథమేతరవిభక్తివిధి, సావకాశ మైనఇఁకాదివిధిని బాధించి ప్రవర్తిస్తుంది.

చూచుచున్ +ఏఁగె అని ఉన్నప్పుడు (ఉత్తున కచ్చు అనేసూత్రంచేత ప్రాప్తిస్తున్న సంధిని బాధించి) ఇఁకాదిసూత్రంచేత సంధినిషేధం ప్రవర్తిస్తుండగా దాన్ని బాధించి ప్రథమేతర విభక్తిసూత్రంచేత సంధి వికల్పంగా వస్తుంది. సంధి వస్తే చూచు చేఁ గెను రానిపక్షంలో చూచుచు నేఁగెను.

అలాగే కి షష్ఠిని ఏమ్యాదుల్లో పఠించినసామర్థ్యంచేత హరికిన్ + ఇచ్చె అనేచోట గూడ ఇఁకాదిసూత్రాన్ని బాధించి, ఏమ్యాదిసూత్రం ప్రకారం సంధి వికల్పంగా వస్తుంది.

**8. వీనికి సంధి వైకల్పికము.** (సంధి. 9)

'ఇఁకాదులకుఁ దప్ప ద్రుతప్రకృతికములకు సంధి లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో సంధినిషేధం ఇఁకాదులకు తప్ప అని చెప్పటంచేత ఇఁక మొద

లైన ద్రుతప్రకృతికాలలో సంధికి నిషేధం లేదు. కాబట్టి యథావకాశంగా సంధి రావచ్చును. ఇఁక, ఇఁగ, ఎట్టకేలకు, ఎట్టకేని అనేవి ఇఁకాదులు. వీటిలో ద్రుతానికి పూర్వంలో ఉన్న అచ్చుకు అచ్చు పర మవుతుండగా సంధి వైకల్పికంగా వస్తుం దని ఈవాక్యం వివరిస్తున్నది.

ఇందులో ఇకన్, ఇగన్ అనేశబ్దాలలో ద్రుతానికి పూర్వంలో ఉన్నది హ్రస్వ మైన అకారం. కాబట్టి 'అత్తునకు సంధి బహుళముగా నగు' అనేసూత్రంచేత సంధి వస్తుంది. ఆసూత్రంలోని బహుళపదంచేత ఇక, ఇగలలో అత్తుకు సంధి వైకల్పికంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం. ఇఁకన్+ఏమి అని ఉండగా 'అత్తునకు సంధి' అనేసూత్రంచేత సంధి వచ్చినపక్షంలో ఇఁ కేమి, రానిపక్షంలో ఇఁక నేమి. ఇలాగే ఇఁగన్+ఏమి=ఇఁ గేమి, ఇఁగ నేమి. ఎట్టకేలకు, ఎట్ట కేని అనేశబ్దాలలో ఇకాదుల లోనిది ఎట్టకున్ ఏలకున్ అనేవి రెండు అని గ్రహించాలి. ఈశబ్దాలలో ఉకారం ఉంది. ఇక్కడ 'ప్రథమేతరవిభక్తిశత్రర్థ చువర్ణంబులం దున్నయుకారమునకు సంధి వైకల్పికముగా నగు' అనేసూత్రాన్ని అనుసరించి సంధి వికల్పంగా వస్తుంది. ఎట్టకున్+ఏలకున్. సంధి వచ్చినపక్షంలో, ఎట్టకేలకున్, రానిపక్షంలో ఎట్టకు నేలకున్. ఇలాగే ఎట్టకేలకున్+అతడు=ఎట్టకేల కతడు, ఎట్టకేలకు నతడు మొ.

**9. ద్విరుక్తముయొక్క పరరూప మామ్రేడిత మనఁబడు.** (సంధి. 10)

'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంలోని 'ఆమ్రేడితము' అనేపదాన్ని ఈవాక్యం వివరిస్తుంది.

'తస్య పర మామ్రేడితమ్ - ద్విరుక్తస్య పరం రూప మామ్రేడితసంజ్ఞం స్యాత్' అనేసంస్కృతలక్షణాన్ని అనుసరించి ఆమ్రేడితశబ్దం అర్థం చెప్పబడింది. ఒకేశబ్దం రెండుపర్యాయాలు ఉచ్చరించినపుడు వాటిలో రెండవశబ్దానికి ఆమ్రేడితం అని పేరు. ఉదా. ఔర ఔర. దీనిలో రెండవ ఔరశబ్దం ఆమ్రేడితం అనబడుతుంది. మూడు మొదలుగా ఒకటికంటె ఎక్కువసార్లు ఉచ్చరించినపుడు రెండవదానినుంచి మిగిలిన వన్ని ఆమ్రేడితాలు అవుతాయి. రక్షింపుమ, రక్షింపుమ, రక్షింపుమ. ఇందులో 2,3 శబ్దాలు ఆమ్రేడితాలు.

**10. తఱుచుగ ననుటచే నొకానొకచోట వైకల్పిక సంధియుం గల దని తాత్పర్యము.** (సంధి. 10)

'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రంలో 'తఱుచుగ' అనేపదం ప్రయోగించడంవల్ల ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తుంది.

'తఱుచుగ' అని చెప్పడంచేత ఆమ్రేడితం పరంగా ఉన్నప్పుడు సంధి అరుదుగా రాకపోవడానికి అవకాశం కలిగించింది. అంటే కొన్ని స్థలాల్లో సంధి రావడమూ, రాకపోవడమూ అనేవిధంగా వైకల్పికస్థితి ఉంటుంది.

ఏమి + ఏమి అని ఉండగా ఏమ్యాదులయిత్తునకు సంధి సూత్రాన్ని బాధించి, అచ్చున కామ్రేడితంబు అనేసూత్రంచేత సంధి 'ఏ మేమి' అని అవుతుంది. ఈసూత్రంలో సంధి 'తఱుచుగ' అనటంచేత రానిపక్షంలో 'సంధి లేనిచోట–' అనేసూత్రంచేత యడాగమం వచ్చి 'ఏమి యేమి' అని అవుతుంది. ఇలాగే 'ఇంచుక యించుక' మొ.

(సంధి రాకపోవడం అరుదు) ఒకానొకచోట వైకల్పికసంధి అనడంవల్ల తఱచు శబ్దంచేత అనేకస్థలాల్లో, అంటే సాధారణంగా సంధి నిత్యంగానే వస్తుంది అని అర్థం. ఔరౌర.

'తఱుచు' అనకుండా 'ఉత్తునకు సంధి యగు' అన్నట్లు 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి యగు' అని చెప్పినపక్షంలో ఔరౌర– ఇత్యాదుల్లోలాగా ఏ మేమి ఇత్యాదుల్లో గూడా సంధి నిత్యంగా జరిగి 'ఏమి యేమి' అనేవిధ మైనసంధిరానిరూపాలకు అవకాశం లేకుండా పోయేది.

**11. ఏఁగి యేఁగి యనుచో క్త్వార్థం బగుట సంధి లేదు.** (సంధి. 10)

'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఏఁగి + ఏఁగి అని ఉండగా పైసూత్రంచేత సంధి రావలసిఉన్నది. ఏఁగు ధాతువు మీద క్త్వార్థంలో ఇప్రత్యయం వచ్చి ఏఁగు+ఇ=ఏఁగి అనేరూపం ఏర్పడుతున్నది. కాబట్టి ఏఁగి అనేచోట ఇకారం క్త్వార్థం. 'క్త్వార్థం బయినయిత్తునకు సంధి లేదు' అనేసూత్రంప్రకారం సంధి రాదు. 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత యడాగమం వచ్చి 'ఏఁగి యేఁగి' అని అవుతుంది.

ఏఁగి + ఏఁగి అనేచోట 'ఇ'కారం క్త్వార్థకం కావడంవల్ల 'అచ్చున కామ్రేడితంబు' అనేసూత్రంచేత రావలసినసంధి 'క్త్వార్థం బయినయిత్తునకు' అనేసూత్రంప్రకారం రాదు. అని పైవాక్యానికి తాత్పర్యం.

**12. అంద్వవగాగమంబులు పరంబు లగునపుడు యథాసంభవముగా గ్రహించునది.** (సంధి. 11)

'అంద్వవగాగమంబులం దప్ప నపదాది స్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో 'అంద్వవగాగమంబులం దప్ప' అనడంచేత అందు - అవ అనేవాటికంటే వే రయిన అపదం పర మైనపుడే సంధి వస్తుంది.

సప్తమీప్రత్యయ మైనఅందు, పూరణార్థకఆగమ మైన 'అవ' అనే అపదాలు పరంగా ఉంటే సంధి ఎలా వస్తుంది అనే సందేహం కల్గగా దానికి సమాధానం ఈవాక్యం.

'ఉత్తున కచ్చు పరం బగునపుడు-' మొద లైన ఆయాసంధివిధానాలచేత యథావకాశంగా అందు - అవలు పర మైనపుడు గూడా పదం పర మైనప్పటివలెనే సంధి వస్తుంది.

ఉత్తు-ఇత్తు-అత్తులకు భిన్న మైనఅచ్చుకు సంధి చెప్పబడనే లేదు కాబట్టి అందు, అవలు పర మవుతుండగా గూడా సంధి రాదు. వదినెయందు, వేయవ. మొ.

'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత ఉత్తుకు పర మైనపుడు సంధి నిత్యం. రెండు+అవ=రెండవ, వనము+అందు (నుగాగమం రానిపక్షంలో) వనమందు, ధేనువందు మొ.

ఇత్తువిషయంలో ఇదంతసంఖ్యావాచకాలను ఏమ్యాదులలో చేర్చగా 'ఏమ్యాదుల యిత్తునకు-' అనేసూత్రంచేత సంధి వికల్పం. ఎనిమిదవ, ఎనిమిదియవ మొ. ఏమ్యాదుల్లో చేరనివాటిలోనియిత్తుకు సంధి రాదు. హరియందు మొ.

అత్తునకు సంధి బహుళము. అందు (అత్తునకు అవ పరంగా ఉండదు) పరంగా ఉండగా అత్తుకు సంధి వికల్పం. రాములందు, రాములయందు మొ. తత్సమాద్యకారానికి సంధి రాదు. రమయందు, అక్కయందు, మొ.

**13. అప్పు డిప్పు డెప్పు డను శబ్దములు నిత్యైకవచనాంతములు.**

**14. వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థ మని యెఱుంగునది.** (సంధి. 13)

'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళముగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రానికి చిన్నయసూరి 'అపుడు + చనియె = అపుడు సనియె, అపుడు చనియె' అని 'అపుడు' అనేప్రథమాంతంపై ఆదేశం వచ్చినట్లు ఉదాహరించాడు. 'అపుడు' శబ్దం ప్రథమాంతమే అని వివరించడానికి ఈవాక్యం ప్రారంభించబడింది.

అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అనేమూడుశబ్దాలూ నిత్యమూ చివర ఏకవచనం మాత్రమే కలిగినవి అవుతాయి. అంటే ప్రథమ మొద లైన అన్నివిభక్తులలోను, అప్పుడు, అప్పటికిన్, అప్పటన్ ఇత్యాదిగా ఏకవచనంలో మాత్రమే ఉంటాయి. కానీ అప్పుడులు ఇత్యాదిగా ఏవిభక్తిలోనూ బహువచనాంతాలు కావు. కాబట్టి 'అపుడు చనియె' అనేచోట ఇచ్చిన అపుడు శబ్దం ప్రథమాఏకవచనాంతం. కాబట్టి దానిపై గసడదవలు రావడం లక్షణానుగుణం. అని సూరితాత్పర్యం.

అయితే ఇవి ప్రథమాంతాలు కా వనడానికి ఒకప్రమాణం కనబడుతున్నది. ఆంధ్రశబ్ద చింతామణిలో నన్నయ కళలను గూర్చి చెప్తూ 'తిఙ్మధ్య శేషషష్ఠీ సుస్ కర్మప్రవచనీయజవిభక్తీః, కించిత్ ప్రశంస నాద్భుత సన్తాప యదా తదా కి మేవాం శ్చ' అన్నాడు. ఇందులో సుస్ అంటే ప్రథమాంతం. 'అపుడు – ఇపుడు' అనేవి గూడా ప్రథమాంతాలే అయితే రాముఁడు, అన్న, బియ్యము, మొద లైనవాటిల్లాగానే 'సుస్' అనేదళంచేతనే అప్పుడు మొద లైనవి గూడా చెప్పబడతాయి. మరి సూత్రంలో 'యదా తదా' అని మళ్ళీ ఎప్పుడు, అప్పుడు అనేవాటిని ప్రథమాంతంకంటే వేరుగా ఎందుకు చెప్పాడు. అలా చెప్పడాన్నిబట్టి వాగనుశాసనులమతంలో ఎప్పుడు, అప్పుడు, ఇప్పుడు అనేవి ప్రథమాంతాలు కావు, అని స్పష్టం అవుతున్నది. ఇంకా ఆచింతామణి లక్షణంలో ఈ యదా,తదాశబ్దాలకు పూర్వం చెప్పిన సంతాపాద్యర్థకాలు, (తర్వాతి) ఏవార్థకాదులు అవ్యయాలు. కాబట్టి అవ్యయాల మధ్యలో చెప్పిన అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడు అనేవి కూడా అవ్యయాలే అనాలి అని పూర్వపక్షం.

దానికి సూరిసమాధానం– యదా, తదా అని మళ్లీ చెప్పడం స్పష్టతకోసం. బాగా తెలియడంకోసం ఒకటికి రెండవసారి చెప్పడమే తప్ప, ప్రథమాంతాలు కా వనేఉద్దేశ్యంతో కా దని. కాబట్టి ఇవి ప్రథమాంతాలే. వీటిపై గసడదవలు వస్తాయి. ఇక్కడ చింతామణికర్త అభిప్రాయం కొంత సమర్థించుకోవలసినస్థితిలో ఉన్నమాట యథార్థం. యదాతదాల తర్వాతి 'కిమ్' కూడా నిత్యైకవచనాంతమే.

**15. ఈకార్యము కళ లగుక్రియాపదముమీఁద సహితము కానంబడియెడి.**

(సంధి. 13)

'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళముగా నగు' అనేసూత్రం

వివరణంలోనిది ఈవాక్యం.

ద్రుతప్రకృతులు గానిశబ్దంబులు కళ లనంబడును. చివర ద్రుతం లేని, ద్రుత ప్రకృతికాల్లో చేరని, పదం కళ. 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళముగా నగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్త్యంతంమీద విధించిన గసడద వాదేశకార్యం. ద్రుతాంతాలు గానిక్రియాపదాలమీద కూడా కనబడుతున్న దని వాక్యార్థం. 'ప్రథమమీఁది' అనేసూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా (ప్రథమేతరా లైన) కళాక్రియాపదాల మీద పరుషాలకు గసడదవలు కవిప్రయోగాల ననుసరించి వస్తాయి.

రారు + కదా అనుచో ఇలా కకారానికి గకార మై రారు గదా. ఆదేశం రాకుంటే రారు కదా. వత్తురు + పోదురు = వత్తురు వోదురు, వత్తురు పోదురు.

'సహితము' అనడంచేత క్రియాపదాలమీద ఈకార్యం సార్వత్రికం గాదు. అరుదు అని అర్థం.

'కానంబడియెడి' అనడంవల్ల కవిప్రయోగానుగుణంగా గ్రహించాలి. కాబట్టి క్రియా పదాలమీద ఆదేశాన్ని ప్రథమమీదలాగా సూత్రంలో సాధారణంగా విధించలే దని తాత్పర్యం.

**16. సంశ్లేషం బనఁగా ద్రుతము మీఁదిహల్లుతోఁ గూడికొనుట.** (సంధి. 17)

'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంలోని సంశ్లేష అనేపదాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

ద్రుతం అంటే నకారం. అది దానికి పైన ఉన్నహల్లుతో కలియడానికి సంశ్లేషం అని పేరు. మీదిహల్లుతో గూడటం అంటే ఉచ్చారణంలో కలవడం అని అర్థం. మీదిహల్లుతో కలిపి (పూచె న్గలువలు) గానీ, విడిగా గానీ (వచ్చెన్ ఋషి) వ్రాయవచ్చు. శబ్దశాస్త్రం ముఖ్యంగా ఉచ్చారణనుగూర్చి చెపుతుంది. పూచెను గలువలు ఇత్యాదిగా సూరి ద్రుతాన్ని ఉత్వసహిత మైనదిగా చూపాడు. ఇది ఇకారాదులపైన ఉన్నపుడు ఇత్తుతో కూడి ని అనేఆకారంతో ఉంటుంది. రాముని జూచెను. మొ. ఇలా ను, లేదా ని అనేఆకారంతో స్వరసహితంగా ఉన్ననకారం పైన ఉన్నహల్లుతో కూడుకోవా లంటే ద్రుతంలో ఉన్నఅచ్చు లోపించాలి. సంశ్లేషవిధానంవల్ల ద్రుతంలో ఉన్నఅచ్చు లోపించటం ప్రయోజనం అనవచ్చు. పూచె న్గలువలు. వచ్చెన్ ఋషి మొ.

**17. పక్షంబున స్వత్వం బగు.** (సంధి. 17)

**18. స్వత్వం బనఁగా ద్రుతమునకుఁ బ్రకృతిభావము.** (సంధి. 17)

'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పక్షంబున అంటే ద్రుతానికి విధింపబడినఆయాకార్యాలు రానిపక్షంలో అని అర్థం. 'స్వత్వం బనఁగా ద్రుతమునకు ప్రకృతిభావము'. ద్రుతం సహజ మైనరూపంతో అంటే 'ను' లేదా 'ని' అనేరూపంతో ఉండటం.

'ఆదేశసరళములకు ముం దున్న' అనేసూత్రం ద్రుతానికి, బిందుసంశ్లేషలనూ, 'ద్రుతంబునకు సరళస్థిరంబులు' అనేసూత్రం లోపసంశ్లేషలనూ, 'అవసానంబునందు' అనేసూత్రం స్వర, ద్రుతలోపాలనూ, వికల్పంగా చెప్పాయి. కాబట్టి ఆయాకార్యాలు ఒకపక్షంలో ద్రుతానికి రావు. అవి రాని అన్ని సందర్భాల్లోనూ స్వత్వం ఉంటుంది.

పూచెను + గలువలు ఇక్కడ పూచెంగలువలు ఇత్యాదిగా బిందువు మొ. రాకపోతే స్వత్వంతో, పూచెను గలువలు.

వచ్చెను గోవులు, వాఁడు వచ్చెను ఇత్యాదుల్లో లోపాదులు రానిపక్షంలో ఆరూపాలు అలాగే ఉంటాయి.

ఏమార్పు రానపుడు ఉన్నది ఉన్నట్లే ఉండటం విశేషం కాదు. అంటే స్వత్వం విశేషకార్యం కాదు. కాబట్టి దాన్ని విధించలేదు. స్పష్టతకోసం వివరణంలో స్వత్వస్థితి ఉంటుం దని మాత్రమే చెప్పాడు సూరి.

**19. ఈలోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం బయి యుండు.** (సంధి. 20)

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు" అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత విధింపబడిన ద్రుతంలోని అచ్చులోపమూ, ద్రుతలోపమూ అనేవి రెండు కూడా పద్యంచివరలో ఛందోనియమానుసారంగా ఉంటాయి. అంటే ఏకార్యం జరిగితే గణాలు సరిపోతాయో ఆకార్యం జరుగుతుంది. ఏకార్యం జరిగితే గణాలు సరిపడవో ఆకార్యం అసలు రాదు.

1. అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.

ఇక్కడ ద్రుతస్వరలోపం తప్పకుండా వస్తుంది. (ద్రుతం లోపించి 'బుధసేవ'

అని ఉన్నా, ఏలోపమూ రాక 'బుధసేవను' అని ఉన్నా గణభంగం. కాబట్టి అవి రెండూ రావు.)

2. 'సదసులోని విప్రజనము మీఁద'

ఇక్కడ ద్రుతలోపం తప్పకుండా వస్తుంది. (మీఁదన్ అని ద్రుతస్వరం లోపించినా, 'మీదను' అని ఏలోపమూ కాకపోయినా గణభంగం. కాబట్టి అవి రావు).

3. 'సురుచిరవిభవమునఁ బాండుసుతుయజ్ఞముతోన్' ఇక్కడ ద్రుతస్వర లోపం, లేదా ద్రుతలోపం ఏదో ఒకటి తప్పకుండా వస్తుంది. (ఏలోపమూ రాక 'యజ్ఞముతోను' అని ఉంటే గణభంగం. కాబట్టి స్వత్వం ఉండదు.)

4. 'వైజయంతీ నవాంశుకవ్యాజమునను'

ఇక్కడ ద్రుతస్వరలోపం లేదా ద్రుతలోపం - ఏదీ రాదు. ద్రుతస్వరం లోపించి వ్యాజమునన్ అని ఉన్నా, ద్రుతం లోపించి 'వ్యాజమున్' అని ఉన్నా గణభంగం. కాబట్టి స్వత్వం మాత్రమే ఉంటుంది.

ఈవివరణం స్పష్టతకే. ఏలోప మైనా, లోపేతర మైనఏకార్య మైనా పద్యమధ్యంలో గూడా గణానుసారంగానే ఉంటుంది. కాని విరుద్ధంగా ఉండదు గదా.

**20. గుర్వవసాయి యగుపద్యంబుతుదను స్వత్వంబు లేదు.** (సంధి. 20)

'అవసానంబునందు ద్రుతస్వరంబున కేని ద్రుతంబున కేని లోపంబు బహుళంబుగా నగు" అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అవసానంలో అంటే చివర గురువే ఉండవలసినపద్యం (గుర్వవసాయి పద్యం) లో చివర ద్రుతానికి స్వత్వం ఉండదు.

పైసూత్రం అవసానంలో ద్రుతానికి స్వరలోపమూ, ద్రుతలోపమూ బహుళంగా చెప్తున్నది. ఆరెండూ రాకపోతే స్వత్వస్థితి ఉంటుంది. ఈలోపం పద్యాల్లో (చివర) గణానుగుణంగా వస్తుంది.

ఈవివరణంచేత చివర్లో గురువే ఉండవలసిన పద్యం చివరిద్రుతానికి గణానుసారంగా స్వరలోపమో, ద్రుతలోపమో ఏదో ఒకటి తప్పకుండా వస్తుంది తప్ప ఏదీ రాకుండా స్వత్వం మాత్రం ఉండదు.

'అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్' కందపద్యం చివరిఅక్షరం గురువు కావాలి. కాబట్టి 'బుధసేవను' అనేచోట ద్రుతంలో అచ్చు లోపించి 'సేవన్' అని అవుతుంది. ఇక్కడ ద్రుతం మొత్తం లోపించినా (బుధసేవ) ఏదీ లోపించకపోయినా

(బుధసేవను) చివరిఅక్షరం లఘు వై, గణభంగం. కాబట్టి ఇటువంటిచోట్ల స్వరలోపం నిత్యం.

'సురుచిరవిభవమునఁ బాండుసుతుయజ్ఞముతోన్, అనేరీతిస్థలాల్లో యజ్ఞముతో అని ద్రుతం లోపించినా, యజ్ఞముతోన్ అని ద్రుతస్వరం లోపించినా యిబ్బంది లేదు. కాబట్టి ఏ దైనా చేయవచ్చు.

కాని 'యజ్ఞముతోను' అనేవిధంగా స్వత్వం ఉంటే మాత్రం గణభంగం, గాబట్టి యిక్కడ ద్రుతస్వరలోపమో, ద్రుతలోపమో ఏదో ఒకటి చేయాలి. ఏపక్షంలోనూ స్వత్వం మాత్రం ఉండదు.

**21. దీర్ఘంబుమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.** (సంధి. 22)

'తానునేనుపదంబులద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

దీనికి అంటే తాను, నేను అనేపదాలలోని ద్రుతానికి అని అర్థం. నెఱ పూర్ణార్థకం. నెఱసున్న అంటే పూర్ణబిందువు.

తాను, నేను అనేపదాల్లో చివరి 'ను' అనేద్రుతం 'తా, నే' అనేదీర్ఘాచ్చులమీఁద ఉన్నది. 'దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు' అనేలక్షణంచేత దీర్ఘ మీఁద వ్యాకరణం సాధించే నిండుసున్న ఉండదు. కాబట్టి తా – నే –ల మీదిద్రుతానికి నిండుసున్న రాదు.

తాను+చదివె 'ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు'. తాను+ జదివె. 'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు'. అరసున్న వస్తే – తాఁ జదివె. నిండుసున్న రావలసిఉండగా 'దీర్ఘముమీఁద అనేసూత్రంచేత రాదు. కాబట్టి 'తాం జదివె' అని ఉండదు. 'తానునేనుపదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు' కాబట్టి 'తా న్జదివె' అని ఉండదు. స్వత్వంతో 'తాను జదివె'.

ఇలాగే 'నేం గెలిచితి' ఇత్యాదిగా ఇక్కడ నిండుసున్న ఉండదు.

**22. సర్వపర్యాయం బయినయెల్లశబ్దంబు ద్రుతాంతం బైనయవ్యయంబు.** (సంధి. 24)

'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత – ఎల్లన్ + అర్థములు, ఎల్లన్ + కలుషములు అనేచోట సమాసంలో ద్రుతం లోపించి, ఎల్లయర్థములు, ఎల్లకలుషములు అని అవుతుంది అని చూపాడు చిన్నయసూరి. అసలు ఇక్కడ లోపించడానికి ముందు ద్రుతం ఉందా, అనేసందేహానికి ఈవాక్యం సమాధానం.

సంస్కృతంలోని 'సర్వ' అనేశబ్దంతో సమాన మైనఅర్థం కల్గిన 'ఎల్ల' అనేఅచ్చతెలుగుశబ్దం ద్రుతప్రకృతికం, అవ్యయం. 'ఎల్లను' అనేవిధంగా చివర ద్రుతం ఉంటుంది. అవ్యయం అంటే లింగ, విభక్తి, వచనాలు లేనిది. అంటే అన్నిలింగవిభక్తివచనాల్లోనూ మార్పు లేకుండా 'ఎల్లను' అనే ఉంటుంది. అర్థములు ఎల్లను, జనము ఎల్లను, రాములకు ఎల్లను మొ.

ద్రుతాంతం కాబట్టి ఎల్లను+అర్థములు (కలుషములు) అవ్యయం కాబట్టి విశేష్యానుగుణంగా బహువచనంలో ఉండక 'ఎల్లను' అని ఏకవచనంలోనే ఉంది. అందుచేత 'ఎల్లయర్థములు' అనేవిధంగా ప్రస్తుతసూత్రంచేత ద్రుతం లోపించిం దనటానికి ఇవి లక్ష్యా లవుతున్నా యని తాత్పర్యం.

'సర్వపర్యాయం బయిన' అనడంచేత సీమ – హద్దు అనేఅర్థం కలిగిన 'ఎల్ల' అనేశబ్దం అవ్యయం కాదు. ఎల్లలు మొ.

**23. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.**(సంధి. 24)

'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

సర్వపర్యాయ మై, ద్రుతం చివర గలిగి, అవ్యయ మైన 'ఎల్ల' అనేశబ్దానికి సమాసం కానపుడు విశేష్యానికి పూర్వంలో ప్రయోగం ఉండదు అని వాక్యార్థం.

సమాసం చేయనిపక్షంలో 'ఎల్లను' అనేవిశేషణాన్ని విశేష్యానికి తరువాతనే ప్రయోగించాలి. ఆచ్ఛికశబ్దంబు లెల్లన్, స్త్రీలింగంబు లెల్లన్ – మొ. అలాగే అర్థములు ఎల్లన్, కలుషము లెల్లన్. ఇంక సమాసం కానపుడు ఎల్లన్ అర్థములు, ఎల్లన్ స్త్రీలింగములు, ఇత్యాదిగా విశేష్యానికి పూర్వంలో ప్రయోగించకూడదు. తెలుగులో సామాన్యంగా విశేషణం విశేష్యానికి పూర్వంలోనే ప్రయోగింపబడుతుంది. 'ఎల్లన్' అనేవిశేషణం తద్భిన్నంగా తరువాత మాత్రమే ప్రయోగింపబడటం విశేషం.

'ఎల్ల' శబ్దాన్ని విశేష్యానికి పూర్వంలో ప్రయోగించా లంటే తప్పకుండా సమాసం చేయవలసిందే.

'ఎల్లన్ + అర్థములు' అనేచోట సమాసం కావడంవల్ల 'సమాసంబునందు

ద్రుతంబునకు లోపం బగు” అనేసూత్రంచేత ద్రుతం లోపించి ఎల్లయర్థములు (సమాసం కాకపోతే ద్రుతం లోపించదు, కాబట్టి 'ఎల్ల నర్థములు' అని ఉండాలి. అలా ఉండదు. 'అర్థము లెల్లను' అని ఎల్లను అనేవిశేషణం విశేష్యానికి తరువాతనే ఉంటుంది).

**24. ఇచటం బరుషంబులు పరంబు లగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచే మూఁడు రూపంబులు. (సంధి.25)**

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత పూర్వపదం చివర వచ్చిననుగాగమానికి ఉత్తరపదం మొదటి పరుషం అంటే కచటతపలు పర మైనపుడు ద్రుతకార్యాలవలన బిందుసంశ్లేషలతో మూడువిధా లైనరూపాలు ఏర్పడుతాయి. అని అర్థం. ద్రుతప్రకృతికముమీఁ దిపరుషములకు సరళంబు లగు' అనేసూత్రంచేత పైపరుషం సరళం కాగా, 'ఆదేశసరళములకు ముం దున్న ద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంచేత 1. పూర్ణబిందువు, 2. ఖండబిందువు, 3. సంశ్లేషం, అనేమూడు కార్యాలు వస్తాయి.

చిగురు+కయిదువు అని ఉండగా, నుగాగమం వచ్చి, చిగురును+కయిదువు. మీదిపరుషం సరళం అయి, ద్రుతానికి పూర్ణబిందువు వచ్చి, చిగురుం గయిదువు, ఖండబిందువు వచ్చినపుడు చిగురుఁగయిదువు, సంశ్లేషం వచ్చినపుడు చిగురు న్గయిదువు అని మూడురూపాలు అవుతాయి. విభాష కాబట్టి బిందుసంశ్లేషలు రానపుడు 'పక్షంబున స్వత్వం బగు' అని నాలుగవకార్యం స్వత్వం రావాలి. కాని 'సమాసంబున ద్రుతమునకు స్వత్వంబు లేదు' అనేసూత్రంచేత ఈద్రుతానికి స్వత్వం రాదు. కాబట్టి పూర్ణఖండబిందువులు రెండు, సంశ్లేషతో మూడు రూపాలు మాత్రమే ఉంటా యని ఈవాక్యానికి అర్థం.

**25. సరళంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషపూర్ణబిందువులచేత మూఁడు రూపంబులు.** (సంధి.25)

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత పూర్వపదం చివర వచ్చిననుగాగమానికి ఉత్తరపదం మొదటిసరళం అంటే గజడదబలు పర మైనపుడు ద్రుతకార్యాలవలన లోపం, పూర్ణబిందువు, సంశ్లేషం, అని మూడువిధా లైనరూపాలు ఏర్పడతాయి. అని అర్థం.

తళుకు + గజ్జెలు అని ఉండగా, నుగాగమం వచ్చి, తళుకును + గజ్జెలు. 'ద్రుతంబునకు సరళస్థిరములు పరంబు లగునపుడు లోపసంశ్లేషలు విభాష నగు' అనేసూత్రంచేత లోపం వచ్చినపుడు తళుకుగజ్జెలు. లోపం రానిపక్షంలో 'వర్గయుక్సరళములు పరంబు లగునపు డొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి' అనేసూత్రంచేత ద్రుతానికి పూర్ణబిందువు వచ్చినపుడు తళుకుం గజ్జెలు. ఒకానొకచో అనటంచేత అరు దయిన పూర్ణబిందువు రానిపక్షంలో సంశ్లేషం వచ్చి, తళుకు న్గజ్జెలు అని రూపం సిద్ధిస్తుంది. కాగా లోప పూర్ణబిందు సంశ్లేషలచేత మూడురూపాలు అవుతాయి.

'సమాసంబున ద్రుతంబునకు స్వత్వము లేదు' అనేసూత్రంచేత స్వత్వం రాదు. కాబట్టి తళుకునుగజ్జెలు అనేరూపం ఉండదు.

**26. విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు.** (సంధి. 25)

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత సమాసంలో పూర్వపదంచివర నుగాగమం వస్తుంది. ఆనుగాగమ నకారం (ను) ద్రుతం. ఇది సమాసంలోనిద్రుతం కాబట్టి 'సమాసంబునందు ద్రుతంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం రావలసిఉంది. ఆలోపం రా దని పైవాక్యానికి అర్థం.

ప్రస్తుతసూత్రంచేత నుగాగమం ద్రుతం ఆగమంగా విధింపబడింది సమాసంలోనే. ఆసమాసంలో ద్రుతం లోపించాలి. వచ్చినఅన్నిచోట్ల ఆనుగాగమద్రుతం లోపించి పోతుంటే ఇక నుగాగమం ఎక్కడా నిలవదు. ఎక్కడా నిలవకపోతే నుగాగమం విధించటంవల్ల ప్రయోజనం ఏమిటి? ప్రయోజనం లేకుంటే విధానం వ్యర్థం కదా. కాబట్టి ఈవిధానం సార్థకం కావా లంటే ఈనుగాగమం నిలిచిఉండాలి. నిలిచిఉండా లంటే లోపించగూడదు. అందుచేత నుగాగమాన్ని విధించినసామర్థ్యంచేత ఈనుగాగమద్రుతం లోపించ దని గ్రహించాలి అని తాత్పర్యం. అందుచేత ఆద్రుతానికి బిందువు మొద లైన ఆయాద్రుతకార్యాలు వస్తాయి. సమాసం కావటంచేత వచ్చేలోపం

రాదు. కాగా సరళ(స్థిర)పరకతలో రావలసినలోపం మాత్రం వస్తుంది. తళుకుగజ్జెలు.

**27. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు.** (సంధి. 25)

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత ఆగమంగా వచ్చిననుగాగమద్రుతానికి పరుషాలు పర మైనపుడు బిందుసంశ్లేషలచేత, సరళాలు పర మైనపుడు లోపసంశ్లేషపూర్ణబిందువులచేత మూడేసి రూపా లవుతా యని చిన్నయసూరి వివరించాడు. రెండు సందర్భాలలోను పైకార్యాలు రానిపక్షంలో 'పక్షంబున స్వత్వం బగు' అని స్వత్వం వచ్చి నాలుగవరూపం కావాలి. సూరి దానిని ప్రస్తావించకపోవటానికి కారణం ఏమిటో ఈవాక్యంచేత వివరిస్తున్నాడు.

'సమాసంబుల ద్రుతంబునకు స్వత్వము లేదు' అనేలక్షణం చెప్పబోతున్నాడు. చెప్పబోయేఆవిధానంప్రకారం సమాసంలో ద్రుతానికి స్వత్వం ఉండదు. ఈనుగాగమం సమాసంలోనే వస్తుంది. అక్కడ ద్రుతానికి స్వత్వం లేదు. కాబట్టి ఈద్రుతానికి ఎక్కడా స్వత్వం ఉండదు. అందుచేత స్వత్వం లేకుండా ద్రుతానికి మూడు కార్యాలే వివరింపబడినాయి. అని తాత్పర్యం.

**28. నలుగడాదుల నీయాగమంబు లే దండ్రు. (సంధి.25)**

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

నాలు గైన కడలు అనేఅర్థంలో నాలుగు, కడలు అనేశబ్దాలకు కర్మధారయ (ద్విగు) సమాసం ఏర్పడి, నాలుగు+కడలు. సమాసంలో కలిగినవర్ణవికారాలతో నలు+కడ. అని ఉండగా ఇక్కడ ఉదంతస్త్రీసమానికి పరుషం పర మయింది కాబట్టి పైసూత్రంచేత నుగాగమం రావలసిఉంది. కాని 'సరసా దిత్యనేన నలుగడలు ఇత్యాది వ్యావృత్తిః' అని అహోబలుడు నలుగడలు ఇత్యాదులలో నుగాగమం రా దని చెప్పాడు. దానిని ఉద్దేశించి సూరి నలుగడలు మొద లైనవాటిలో నుగాగమం రా దని కొందరు చెప్పినట్లు వివరిస్తున్నాడు. దీనిచేత నలుంగడలు అనేవిధ మైనరూపాలు ఉండవు.

ఇక్కడ (ప్రాకృతమునకు వర్ణములు) నలువది ఇత్యాదులలోలాగా గసదదవాదేశం

చేత కకారానికి గకారానికి వస్తుంది అని గ్రహించాలి. కాగా నలుగడలు అని గకారమే ఉంటుంది కాని (నుగాగమం రా దనటంచేత) ఆగకారానికి ముందు బిందువు ఉండ దని తాత్పర్యం.

**29. ఈయాగమం బొకానొకచోట స్థిరంబు పరం బగుచోఁ గానంబడియెడి.** (సంధి. 25)

'సమాసంబుల నుదంతంబు లగుస్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం నుగాగమం పరుషాలు లేదా సరళాలు పరంగా ఉన్నపుడు మాత్రమే రావాలి. సూత్రంలో పరుషసరళంబులు పరంబు లగునపుడు అనటంచేత పరుషసరళాలకంటె వే రైన (అచ్చు గాని) స్థిరం పరం అయితే నుగాగమం రావడానికి వీలు లేదు. కాని 'గరువపు న్మురువు' అనేతీరుగా స్థిరం పరంగా ఉండగా అరుదుగా నుగాగమం రావటం కనిపిస్తున్నది. అటువంటి కవిప్రయోగాలను సాధించటంకోసం సూరి స్థిరం పరంగా ఉండగా కూడ నుగాగమం కనబడుతున్న దని సూత్రంకంటె విశేష మైనఅంశాన్ని వివరణంద్వారా తెలియజేశాడు. కాగా ఈవివరణవాక్యాన్ని అనుసరించి స్థిరం పరంగా ఉండగా నుగాగమం వచ్చి గరువపు+మురువు=గరువపున్ మురువు అని అయింది. ఇటువంటికవిప్రయోగాలు అరుదు.

**30. ఇందు జవ్వనిశబ్దమునకు జవాదేశం బని యెఱుంగునది.** (సంధి. 30)

**31. ఏకాంతమునందు నున్న జవరాండ్ర నని ప్రయోగము.** (సంధి. 30)

'పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఇందు అంటే కర్మధారయసమాసంలో ఆలుశబ్దం పరంగా ఉన్నపుడు అని అర్థం. జవ్వని ఐన ఆలు (స్త్రీ) అనేఅర్థంలో కర్మధారయసమాసంలో జవ్వనిశబ్దానికి జవ అనేది ఆదేశంగా వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

జవ్వని+ఆలు అని ఉండగా, 'పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు' అనేసూత్రంచేత రేఫం ఆగమంగా వస్తుంది. ఈసందర్భంలో జవ్వని అనేశబ్దం స్థానంలో 'జవ' అనేశబ్దం ఆదేశంగా వస్తుంది. జవ+ర్+ఆలు=జవరాలు అని అవుతుంది. ఈజవాదేశవివరణంవల్ల జవ్వనిరాలు అనేవిధ మైనరూపం ఉండదు.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో 'ఇంతలు కన్ను లుండ' అనేపద్యంలో 'ఏకాంతమునందు నున్నజవరాంఁద్ర' నని ప్రయోగించాడు. జవ్వని శబ్దానికి జవ ఆదేశంగా వస్తుం దని చెప్పటానికి ఈకవిప్రయోగం ప్రమాణం అని తెల్పడానికి సూరి పెద్దనప్రయోగాన్ని ప్రదర్శించాడు. అంటే కవిప్రయోగంలో జవ్వని శబ్దంస్థానంలో జవ కనబడుతున్నందుచేత ఈలక్షణం చేయబడింది అని తాత్పర్యం.

**32. ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము.** (సంధి .31)

'కర్మధారయంబులం దాలుశబ్దము పరం బగునపు దత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరం బగునపుడు కర్మధారయంబునందు రుగాగమం బగు' పేదరాలు. తత్సమాలలో చివరిఅత్వానికి ఉత్త్వం గూడా వస్తుంది. గుణవంతురాలు.

ఇక్కడ సమాసవృత్తిలో ఉన్న 'ఆలు' అనేశబ్దం స్త్రీ అని మాత్రమే అర్థాన్ని బోధిస్తుంది.

ఆలు అనేశబ్దానికి విడిగా 'భార్య' అని అర్థం. ఈకర్మధారయసమాసంలో మాత్రం భార్య అనేఅర్థాన్ని ఇవ్వదు. పేదరాలు అంటే పేదది ఐనస్త్రీ అని మాత్రమే అర్థం. పేద దైన భార్య అని కాదు. గుణవతి ఐనస్త్రీ – గుణవంతురాలు.

ఈకర్మధారయసమాసంలో మాత్రమే ఈఅర్థం. పేదయొక్క ఆలు పేదరాలు, గుణవంతుయొక్క ఆలు గుణవంతురాలు అనేవిధంగా ఇతరసమాసాలలో ఆలుశబ్దానికి స్త్రీ అని కాదు అర్థం. పేదవానిభార్య, గుణవంతునియొక్క భార్య అని 'భార్య' అనేఅర్థాన్నే తెలుపుతుంది.

**33. చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు.** (సంధి. 37)

'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

చెన్ను అనేశబ్దం వృత్తిలో అంటే ఇక్కడ కర్మధారయసమాసం(వృత్తి)లో శోణం అనే అర్థాన్ని తెలియజేస్తుంది అని ఈవాక్యానికి అర్థం.

'చెన్ను+తొవ' అని ఉండగా ప్రాతాదిసంధికార్యాలతో 'చెందొవ' అనేరూపం ఏర్పడుతుంది. ఇక్కడ సమాసంలో పూర్వపదంగా ఉన్న చెన్ను అనేశబ్దానికి ఎఱుపు అని అర్థం. చెందొవ అంటే ఎఱ్ఱకలువ అని అర్థం. తొవ(యొక్క)చెన్ను ఇత్యాదిగా కర్మధారయంకంటె వే రైనసమాసాలలోనూ, చెన్ను తరిగినది ఇత్యాదిగా సమాసమే

కానిస్థితిలోనూ చెన్నుశబ్దానికి శోణం అనేఈఅర్థం ఉండదు. అందం ఇత్యాదిగా ఇతరఅర్థాలు ఉంటాయి.

**34. బహుళగ్రహణంబుచే మీఁదుప్రభృతులకు నిట లోపంబు నిత్యంబు.**
(సంధి. 37)

'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'సమాసంబునం బ్రాఁతాదులుతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోనిబహుళశబ్దంచేత ఆకార్యం నిత్యంగా వచ్చేస్థలాన్ని అంటే ప్రవృత్తి స్థలాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

మీఁదు మొద లైనశబ్దాలు ప్రాఁతాదులలో చేరినవి. కాబట్టి సమాసంలో మీదుమొద లైనఈశబ్దాలలో తొలియచ్చుమీదివర్ణాలకు ప్రాతాదిసూత్రంచేత బహుళంగా లోపం రావలసి ఉన్నది. బహుళం అనటంచేత వీటిలో లోపం నిత్యంగా వస్తుంది. మీఁదు+కడ అని ఉండగా ఇలా లోపం నిత్యంగా వచ్చి, నుగాగమాదులతో మీఁగడ ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి. నిత్యం అనటంచేత లోపం రాని మీఁదుఁగడ అనేవిధ మైనరూపాలు ఉండవు. ఇలాగే చెందొవ ఇత్యాదులలోనూ లోపం నిత్యం. చెన్నుఁదొవ అనేవిధ మైనరూపాలు ఉండవు.

**38. వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.** (సంధి. 37)

'లుప్తశేషంబునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

వ్యవస్థ అంటే నియమం. వస్తుంది లేదా రాదు అనేవిధంగా చేయబడిన నియమం. ఆవిధంగా నియమం చేయబడిన విభాషాపదం వ్యవస్థితవిభాష.

'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంలోని 'విభాష' అనేపదానికి ఇలా వ్యవస్థ చేయబడింది. ఆసూత్రం విధించిన బిందువూ, సంశ్లేషమూ అనే రెండు కార్యాలలో సంశ్లేషం అనేకార్యం లుప్తశేషా లైనప్రాఁతాదులకు వచ్చిననుగాగమద్రుతానికి రాదు. అని ఆదేశసరళ సూత్రంలోనివిభాషకు వ్యవస్థ చేయబడింది.

ప్రాఁత+కెంపు = ప్రా+కెంపు = ప్రాను+కెంపు అని కాగా, ద్రుతకార్యాలతో ప్రాఁగెంపు. ఇక్కడ ఆదేశసరళసూత్రంచేత బిందువు రానపుడు రావలసినసంశ్లేషం

విభాషకు చేసినవ్యవస్థవల్ల రాదు. కాబట్టి ప్రాన్గెంపు అనేవిధ మైనసంశ్లిష్టరూపాలు ఈసందర్భంలో ఉండవు.

**39. పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వం బగు.** (సంధి. 38)

'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత క్రొత్తశబ్దంలో తొలిఅచ్చుమీది వర్ణాలు లోపించినసందర్భంలో పైసూత్రంచేత నుగాగమమూ, ద్విత్వమూ విధింపబడ్డాయి. 'లుప్తశేషంబునకు బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం పరుషాలు పరంగా ఉన్నప్పుడు మాత్రమే చెప్పబడింది. కాబట్టి పరుషాలకంటే వే రైన సరళాలు లేదా స్థిరాలు పరంగా ఉన్నపుడు నుగాగమం రాదు. అక్కడ లుప్తశేషమ్మీది సరళస్థిరాలకు ద్విత్వం ఒక్కటి మాత్రమే వస్తుంది అని యీవివరణం తాత్పర్యం.

క్రొత్త + గండి = క్రొగ్గండి. క్రొత్త + మావి = క్రొమ్మావి.

**40. కెంధూళి, కెంజడ లని ప్రయోగంబులు కానంబడియెడి.** (సంధి. 38)

కెంపు + ధూళి, కెంపు + జడ అని ఉండగా 'ప్రాఁతాదులతొలియచ్చుమీఁది వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత తొలియచ్చుమీది వర్ణాలు లోపిస్తే, కె + ధూళి, కె + జడ. ఇక్కడ, లుప్తశేషానికి వర్గయుక్ (ధ), సరళాలు (జ), పరంగా ఉన్నాయి. కాబట్టి 'లుప్తశేషమునకుం బరుషములు పరము లగునపుడు నుగాగమం బగు' అని పరుషాలు పరంగా ఉండగా చెప్పిననుగాగమం – ఇక్కడ రాదు. నుగాగమం రాకపోతే – కెధూళి, కెజడ అనేరూపా లుండాలి. కాని కవిప్రయోగంలో వర్గయుక్సరళాలు పరంగా ఉండగా కూడా, నుగాగమం వచ్చి ద్రుతకార్యాలు అయిన కెంధూళి, కెంజడ అనేరూపాలు కనబడుతున్నాయి.

పరుషేతరపరకతలో నుగాగమం సాధారణలక్షణానికి భిన్నం గాబట్టి వీటిని విశేషప్రయోగాలుగా గుర్తించవలసిందే, కాని ఈరెండుప్రయాగాలనుబట్టి పరుషేతర పరకతలోనూ నుగాగమం వస్తుంది అని చెప్పరా దని తాత్పర్యం. కెంధూళి మిశ్రసమాసం గావడం గూడ విశేషం.

ఇలాంటివి ఇవి రెండే అయితే – ప్రాఁతాదిసూత్రంలోనిబహుళంపదంచేత

అన్యకార్యంగా ఇక్కడ అంతిమాక్షరం ఒక్కటే (కెం - 'పు') లోపించిం దని యీరూపాలను సాధించుకోవచ్చు.

**41. బహుళగ్రహణముచేత క్రొత్తకుండ లిత్యాదులందు లోపంబు లేదు.**
(సంధి. 38)

'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళశబ్దంచేత ఆకార్యానికి అప్రవృత్తి స్థలాలను ఈవాక్యం వివరిస్తున్నది.

క్రొత్త+కుండ అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదుల–' అనేసూత్రంచేత రావలసిన తొలియచ్చుమీదివర్ణాలలోపం ఆసూత్రంలోనిబహుళపదంచేత అసలు రాదు. కాగా క్రొత్తకుండలు అని అలాగే ఉంటుంది. లోపానికి అప్రవృత్తి కాబట్టి లోపం లేకపోవటంచేత క్రొంగుండలు, లేదా క్రొక్కుండలు ఇత్యాదిగా తొలియచ్చుమీదివర్ణాలు లోపించినరూపాలు ఉండవు.

**42. క్రీఁగడుపు, క్రీఁగాలు, క్రీఁదొడ ఇత్యాదులఁ గ్రిందుశబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేత నని యెఱుంగునది.** (సంధి. 38)

'క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళశబ్దంచేత అన్యకార్యాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

క్రిందు+కడుపు అని ఉండగా 'సమాసంబునం బ్రాఁతాదుల–' అనేసూత్రంచేత తొలియచ్చుమీదివర్ణాలు లోపించి, క్రి+కడుపు అని కాగా, ప్రస్తుతవివరణాన్ని అనుసరించి పైసూత్రంలోనిబహుళపదంచేత అన్యకార్యంగా 'క్రి' అనేలుప్తశేషంలోని హ్రస్వ మైనఇకారానికి దీర్ఘం వచ్చి, క్రీ+కడుపు. నుగాగమం, ద్రుతకార్యాలు కలిగి క్రీఁగడుపు అని అవుతుంది. ఇలాగే క్రిందు+కాలు=క్రీఁగాలు, క్రిందు+తొడ=క్రీఁదొడ ఇత్యాదులలో లుప్తశేషానికి అన్యకార్యంగా దీర్ఘం వస్తుంది.

**43. ఒకానొకశబ్దమున కొకానొకశబ్దము పరం బగునపుడు తొంటియట్లు లోప నుగాగమంబులును, గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరం బగునపుడు లోప ద్విత్వములును ప్రయోగంబులయందుఁ గనుపట్టెడు నని తాత్పర్యము.** (సంధి. 39)

చూ. 'అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి' సూత్రవ్యాఖ్య.

**44. ఈసూత్రమునకు భృశార్థమునందు ద్విరుక్తి విషయం బని యెఱుంగునది.** (సంధి. 40)

'ఆమ్రేడితంబు పరం బగునపుడు కడాదులం దొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల నదంతం బగుద్విరుక్తటకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఆమ్రేడితం పరంగా ఉన్నపుడు అదంతం ఐనద్విరుక్తటకారం వస్తుం దని చెప్తున్నది. ఆమ్రేడితం అంటే ద్విరుక్తంయొక్క పరరూపం. శబ్దం ద్విరుక్తం కావటం అనేక అర్థవిశేషాలలో జరుగుతుంది. ప్రస్తుతవిధానం వర్తించేసందర్భంలో ద్విరుక్తి భృశార్థంలో వచ్చింది అవుతుం దని ఈవాక్యం వివరిస్తున్నది. భృశం అంటే మిక్కిలి అని అర్థం. కడ అంటే చివర. చాలా చివర అనేవిధ మైనఅర్థంలో కడ శబ్దం ద్విరుక్తం అయి, కడ+కడ అని ఉండగా, ప్రస్తుతసూత్రంచేత 'ట్ట' అనేఅక్షరం ఆదేశం అయి, కట్టకడ అని అవుతుంది. కట్టకడ అంటే మిక్కిలి చివర అని అర్థం. ఇలాగే మొట్టమొదట మొ. ఇలా చెప్పటంచేత క్రమంగా చివరకు ఇత్యాది అర్థాలలో ఉన్న 'చివరచివరకు' మొద లైనస్థలాలలో ఈకార్యం రాదు. 'చివరచివరకు' అనేఅర్థంలో చిట్టచివరకు అని కాదు.

**45. ఇంచుక నాఁ డిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షరలోపంబు నగు.** (సంధి. 41)

'ఆమ్రేడితంబు పరం బగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు.' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోనిబహుళపదానికి అన్యకార్యంగా వచ్చేమార్పును ఈవివరణం తెలుపుతున్నది.

సూత్రంప్రకారం ఆమ్రేడితం పరంగా ఉన్నపుడు మొదటిశబ్దంలోని విభక్తి మాత్రమే లోపించవలసిఉంది. కాని ఇంచుక, నాఁడు ఇత్యాదిశబ్దాలలో విభక్తి కాక, ఆపదంలో చివరిఅక్షరం లోపించటం కూడ జరుగుతున్నది. ఇది అన్యకార్యం. ఇంచుక+ఇంచుక

అని ఉండగా పైసుత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా చివరిఅక్షరం లోపించగా, ఇంచు+ఇంచుక. 'అచ్చున కామ్రేడితంబు పరం బగునపుడు సంధి తఱుచుగు నగు' అనేసూత్రంచేత సంధి జరిగి ఇంచించుక అని అవుతుంది. లోపంబును అన్నప్పటి ను శబ్దంచేత వికల్పం కాబట్టి అంతిమాక్షరం లోపించనిపక్షంలో సంధి జరిగి ఇంచుకించుక అని అవుతుంది. (ఆమ్రేడితసంధిసూత్రంలోని తఱుచు శబ్దంచేత ఇక్కడ సంధి రాకపోవటం కూడా ఉంది. అపుడు యడాగమం వచ్చి ఇంచుక యించుక అని కూడా అవుతుంది.) ఇలాగే నాఁడు+నాఁడు అనేచోట అంతిమాక్షర లోపం వచ్చినపుడు 'నానాఁడు', లోపం రానిపక్షంలో 'నాఁడునాఁడు' అనీ అవుతుంది.

**46. ఎందుశబ్దమున కలిగాగమంబు కొందఱు లే దంద్రు.** (సంధి. 44)

'అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అందు మొద లైనవాటికి సమాసంలో అలిక్ అనేఆగమం విధించింది. అందు, ఇందు, ఎందు అనేశబ్దాలు అంద్వాదులు. 'ఎందున్ + వారు = ఎందలివారు' అనేఉదాహరణాన్నిబట్టి సూరిమతంలో 'ఎందు'కు కూడా అలిగాగమం వస్తుంది.

అయితే కొందరు ప్రాచీనవైయాకరణులు 'ఎందు' అనేదానికి అలిగాగమం రా దన్నా రని యీవాక్యం అభిప్రాయం.

'అల్యాగమ స్స్యా దంద్విందోః' అని అథర్వణాచార్యులు అందు – ఇందు అనేరెండింటికే అలిగాగమం వస్తుం దని స్పష్టంగా చెప్పాడు. చింతామణికర్త కూడా 'జే రలి చ' అని సప్తమికి అలిగాగమం చెప్పి, 'అం ద్వింద నా స్తు సప్తమీ' అని అలిగాగమంకోసమే ఇందును సప్తమీవిభక్తిగా చెప్పాడు. కాగా వారిమతం ప్రకారం 'ఎందు' అనేశబ్దానికి అలిగాగమం రాదు. సూరి 'ఎందు'కు కూడా అలిగాగమం అంగీకరించాడు.

**47. ఉదంతము లగుతద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లే దనియు, నిదంతంబు లగుతద్ధర్మవిశేషణంబులమీఁద నిత్యం బనియు బహుళగ్రహణముచే నెఱుంగునది.** (సంధి. 45)

'అదియవిశబ్దంబులయత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళపదప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

పైసూత్రం అది, అవి అనేశబ్దాలలో హ్రస్వ మైనఅకారానికి వృత్తిలో బహుళంగా

లోపం చెప్తున్నది. ధాతువుమీద ఎడు,ఎడి, వాటికి లోపం అనేకార్యాలచేత తద్ధర్మార్థకధాతుజ విశేషణరూపాలు ఏర్పడతాయి. ఎడు మొద లైనవి కృత్తులు. కాగా కృద్వృత్తిలో ఉదంతా లైనతద్ధర్మార్థకవిశేషణాలమీద ఉన్న అది అవి, అనే శబ్దాలలోని'అ'కారానికి లోపం అసలు రాదు. అంటే బహుళగ్రహణంచేత ఇక్కడి లోపకార్యానికి అప్రవృత్తి. వచ్చెడు+అది, వచ్చు+ అవి అనేతీరుగా ఉండగా, లోపానికి అప్రవృత్తి కాబట్టి రాకపోగా, 'ఉదంత మగుతద్ధర్మార్థకవిశేషణంబున కచ్చు పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత నుగాగమం వచ్చి, వచ్చెడునది, వచ్చునవి అని అవుతుంది. ఇక్కడ లోపం అసలు లేదు కాబట్టి వచ్చెడుది, వచ్చువి అనేరీతిరూపాలు ఉండవు.

అలాగే ఇదంత మైనతద్ధర్మార్థకవిశేషణంమీద అది, అవి శబ్దాలలో అకారానికి లోపం నిత్యంగా వస్తుంది. అంటే సూత్రంలోని బహుళపదంచేత ఆకార్యానికి ఇక్కడ ప్రవృత్తి. వచ్చెడి+అది అని ఉండగా, లోపం వచ్చి 'వచ్చెడిది' అని అవుతుంది. నిత్యం కాబట్టి వచ్చెడియది, వచ్చెడియవి అనేరీతిగా లోపం రానిరూపాలు ఉండవు.

**48. ఈకార్యము కర్తృవాచిమువర్ణమునకుఁ గలుగదు.** (సంధి.46)

'పద్వాదులు పరంబు లగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పడు మొద లైనవి పరంగా ఉన్నప్పుడు దానికి పూర్వంలో మొదటిపదం చివర ఉన్న 'ము' అనేప్రత్యయానికి లోపం, నిండుసున్న వికల్పంగా వస్తాయి అని పైసూత్రం చెప్తున్నది.

ఈలోపాదికార్యం కర్తను బోధించే 'ము' ప్రత్యయానికి మాత్రం రా దని ఈవాక్యం వివరిస్తున్నది. సూత్రంలోనివిభాషాపదానికి ఈఅర్థాన్ని వ్యవస్థ చేసుకోవాలి.

గజము + పడియె ఇక్కడ పద్వాదుల్లోని పడు పరంగా ఉంది. దానికి పూర్వంలో ముప్రత్యయం ఉంది. కాబట్టి లక్షణంచేత లోపమూ, పూర్ణబిందువూ రావలసిఉంది. కాని 'పడు'ట అనేవ్యాపారానికి కర్త కాబట్టి గజం కర్త. 'గజము'లోని మువర్ణకం కర్తను బోధిస్తున్నది. అందుచేత సూత్రంలోనివిభాషకు చేసిన వ్యవస్థవల్ల కర్తను తెలిపే ఈమువర్ణకానికి లోపం గానీ, పూర్ణబిందువు గానీ రావు. 'గజము పడియె' అని మువర్ణకం అలాగే ఉంటుంది. ఇలాగే 'అశ్వము పడియె' మొ.

**49. చూడు మనియె, విను మనియె ఇచ్చట నచ్చు పరం బయినది కాఁబట్టి లోపము లేదు.** (సంధి. 47)

'మధ్యమపురుషమువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం మధ్యమపురుషమువర్ణకానికి హల్లు గాని, అవసానం గానీ పరంగా ఉంటే వికల్పంగా లోపం వస్తుం దని చెప్తున్నది. ఇలా చెప్పటంచేత అచ్చు పరంగా ఉంటే లోపం రా దని స్పష్టం అవుతున్నది. చూడుము+అనియె, వినుము+అనియె అనేఈస్థలాలలో మధ్యమపురుషమువర్ణకానికి అచ్చు పరం అయింది, కాబట్టి లోపం రాదు. అందుచేత మువర్ణకం అలాగే ఉండగా, 'ఉత్తున కచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత ఉత్వసంధి జరిగి, చూడు మనియె, విను మనియె అని రూపాలు అవుతాయి.

పైఉదాహరణాలలో అచ్చు పరంగా ఉంది కాబట్టి, మధ్యమపురుషముర్ణకానికి హల్లు లేదా అవసానం పరంగా ఉండగా చెప్పినలోపం రాక, ఉత్వసంధి వస్తుం దని పైవివరణవాక్యానికి అర్థం.

**50. ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి.** (సంధి. 51)

'అనుకృతిని నమశ్శబ్దముతుదియత్తున కోత్వము విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అనుకరణంలో 'నమ' అనేశబ్దంలోని అత్వానికి వికల్పంగా ఓత్వాన్ని చెబుతున్నది. నమో యనె. 'నమశ్శబ్దము' అనడంచేత లక్షణంప్రకారం 'నమః' అనే దానికంటే వే రయినశబ్దంలో ఈకార్యం (అత్వానికి ఓత్వం) రావడానికి వీలు లేదు.

అయినా నమశ్శబ్ద - ఇతరస్థలంలో గూడా అత్వానికి ఓత్వం కవిప్రయోగంలో కనబడుతున్న దని యీవాక్యం తాత్పర్యం.

'గతానుగతికో లోకో యటంచున్' ఇక్కడ కళాపూర్ణోదయప్రయోగంలో 'లోకః + అటంచున్' అనేచోట 'విసర్గంబున కనుకరణంబున' లోపం వచ్చినతర్వాత 'లోక + అటంచున్'. అత్వానికి ఓత్వ మై 'లోకో యటంచున్'.

'కానంబడియెడి' అనడాన్నిబట్టి 'నమః' అనేదానికంటే ఇతర మైనశబ్దంలో ఓత్వం మహాకవిప్రయోగాల్లో కనబడినస్థలాల్లో మాత్రమే స్వీకరించాలి.

**51. అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు వలికె నది నిరాకరంబు.** (సంధి. 54)

'ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

'అనుకరించెడుచోట నవ్యయాదులకొనఁ గలబొట్టుగవకు దీర్ఘంబులకు వచ్చు లోపము 'కేశవాయ తుభ్యం నమ యనఁగ రామో ఽఘ సంహర్త యనఁగ' (అప్ప 5.98) అని అప్పకవి అనుకరణంలో విసర్గ (బొట్టుగవ) లోపంతోపాటు దీర్ఘానికి హ్రస్వం గూడా వస్తుం దని చెప్పాడు. 'రామో ఽఘ సంహర్తా + అన' = 'సంహర్త యన' అని స్వీయోదాహరణం చూపాడు.

చిన్నయసూరి ఆవిషయాన్ని ప్రస్తావిస్తూ ఆలక్షణం అంగీకరింపదగ దన్నాడు, దీర్ఘానికి హ్రస్వం రావడం లక్ష్యాలలో లేదు.

'దుర్బలస్య బలం రాజా యన వినవే' అన్నమనుచరిత్రలోని ప్రయోగంలో రాజా + అనన్ – రాజ యనన్– అనేవిధంగా హ్రస్వం రాలేదు. దీర్ఘం అలాగే ఉంది. కాబట్టి నిడుదకు (దీర్ఘానికి) కుఱుచ (హ్రస్వం) వస్తుం దనేఅంశం లక్ష్యవిరుద్ధం కావడంచేత అంగీకరింపదగింది కా దని తాత్పర్యం.

**52. ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడి.** (సంధి. 55)

'వాక్యావసానంబున సంధి లేమి దోషంబు గా దని యార్యు లంద్రు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం వాక్యంచివర సంధి లేకపోవటం దోషం గా దని చెప్తున్నది. పద్యంలో ఇలా సంధి లేకపోవటం పాదం చివరలోనే కనబడుతున్న దని ఈవాక్యం వివరిస్తున్నది. అంటే పద్యంలో వాక్యంతోపాటు, పాదం కూడా పూర్తి అయితేనే సంధి లేకపోవటం దోషం కా దని అర్థం.

అంటే పద్యంలో వాక్యం అవసానం అయినా, పాదం పూర్తి కాకపోతే సంధి తప్పక చేయవలసిఉంటుం దని తాత్పర్యం. 'రాముఁడు లంక కేఁగి యట రావణుఁ గూలిచి తెచ్చె జానకిన్' ఇక్కడ 'లంకకున్ అరిగి అట రావణునిన్ కూలిచి' అనేవిధంగా సంధికార్యాలు చేయనిపక్షంలో అది దోషమే అవుతుంది.

ఇంక పద్యంలో వాక్యంతోపాటు పాదం కూడా పూర్తి అయినపక్షంలోనే సంధి మానవచ్చు. 'పడగ నున్నహనుమ భయవిహ్వలుఁడు గాఁడు, అరదమునకు సూతుఁ

డచ్యుతుండు'. ఇక్కడ 'కాదు' అనేదానితో వాక్యంతోపాటు పాదం కూడా పూర్తి అయింది. కాబట్టి ఉత్వసంధి చేయకపోవటం దోషం కాదు.(ఇక్కడ సంధి లేదు గదా అని యడాగమం చేయగూడదు. యడాగమం కూడా సంధికార్యమే. సంధికార్యం చేయదలిస్తే ఇక్కడ ఉత్వసంధే చేయాలి.)

అయితే పద్యాలలో అరుదుగా పాదం అవసానంలో అంటే పాదం పూర్తి అయినచోట వాక్యం పూర్తి కాకపోయినా, సంధి మానటం కవిప్రయోగాలలో కనబడుతున్నది.

## తత్సమపరిచ్ఛేదం

**1. ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.** (తత్స. 10)

'చేతతోడలోపలవర్ణకంబులప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు' అనేసూత్రంలోని వర్ణకం అనేపదాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'ప్రత్యయ ఇహ వర్ణకః' అని చింతామణి సూత్రించింది. సంస్కృతంలో ప్రత్యయం అని వ్యవహరింపబడేదానికి తెలుగులో వర్ణకం అనేవ్యవహారం విశేషంగా కలుగుతుం దని అర్థం. ప్రత్యయానికి సంస్కృతానుసారంగా ప్రత్యయం అనేపేరుతోపాటు తెలుగులో విశేషంగా వర్ణకం అనేపేరుగూడ ఉంటుం దని తాత్పర్యం. 'ప్రతీయతే – విధీయతే ఇతి ప్రత్యయః'. విధింపబడేది కాబట్టి ప్రత్యయం. డుమువులు మొద లైనవాటికి తెలుగులో ప్రత్యయం అనీ, వర్ణకం అనీ పేర్లు.

**2. ఏకత్వసంఖ్యను బోధించుప్రత్యయం బేకవచనంబు.** (తత్స. 11)

'డుమువున లేకవచనంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఏకవచనం అంటే ఒకటి అని తెలియజేసేది అని అర్థం. శబ్దంచేత తెలియజేయబడే పదార్థం ఒకటి అని చెప్పేప్రత్యయానికి ఏకవచనం అని పేరు అని వివరణవాక్యానికి తాత్పర్యం.

రాముడు – అంటే ఒక్క రాముడు అని అర్థం. ఈశబ్దంచేత తెలియజేయబడే రాముడు అనేవ్యక్తి ఒక్కడు అనేఅర్థాన్ని బోధిస్తున్నది కాబట్టి రాముడు లోని డు అనేప్రత్యయం ఏకవచనం అనబడుతుంది. ఇలాగే వనము అనేచోట 'ము', ధేనువు, నీవు అన్నపుడు 'వు', కూతురు అన్నచోట 'రు' మొద లైనవి ఏకవచనాలు.

**3. బహుత్వసంఖ్యను బోధించుప్రత్యయంబు బహువచనంబు.** (తత్స. 12)

'లువర్ణంబు బహువచనంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

బహువచనం అంటే ఒకటికంటె ఎక్కువ అని తెలియజేసేది అని అర్థం. శబ్దంచేత తెలియజేయబడే పదార్థం ఒకటికంటె ఎక్కువ అని చెప్పేప్రత్యయానికి బహువచనం అని పేరు అని వివరణవాక్యానికి తాత్పర్యం.

రాములు– అంటే పెక్కుమంది రాములు అని అర్థం. ఈశబ్దంచేత తెలియజేయబడే రాముడు అనేవ్యక్తి ఒక్కడికంటే ఎక్కువమంది అనేఅర్థాన్ని బోధిస్తున్నది కాబట్టి రాములు లోని 'లు' అనేప్రత్యయం బహువచనం అనబడుతుంది. ఇలాగే మేము,

తాము, మనము అనేచోట ము, మొద లైనవి బహువచనాలు.

**4. మిగిలినప్రత్యయము లేకత్వబహుత్వములకు బోధకము లని యర్థము.** (తత్స. 13)

'తక్కినవి యుభయంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తక్కినవి అంటే మిగిలినవి. అంటే పూర్వం చెప్పినవాటికంటె ఇతర మైనవి. 'డుమువున లేకవచనంబులు, లువర్ణంబు బహువచనంబు' అని చెప్పినపూర్వసూత్రాల ననుసరించి డుమువున అనేఏకవచనాలు, లు అనేబహువచనమూ తప్ప మిగిలినవి అని అర్థం. వీటి అన్నిటికంటె పూర్వం 'డుమువులు ప్రథమ' మొద లైనసూత్రాలలో చెప్పిన ప్రథమాదిసప్తవిభక్తిప్రత్యయాలలో 'డుమువున' అనేఏకవచనాలు, 'లు' అనేబహువచనమూ కాక వేరైనవి. ఇవి ఏకత్వాన్ని బోధిస్తూ ఏకవచనాలు అవుతాయి, వస్తువులోనిబహుత్వాన్ని బోధిస్తూ, బహువచనాలూ అవుతాయి అని వివరణవాక్యానికి అర్థం.

కాగా– ను,(ద్వితీయ) చేత,తోడ(తృతీయ), కొఱకు,కయి(చతుర్థి), వలన,కంటె,పట్టి (పంచమి), కు,యొక్క,లోపల(షష్ఠి), అందు(సప్తమి)అనేప్రత్యయాలు ఏకవచనాలు, బహువచనాలు రెండూ అవుతాయి అని అర్థం.

పండును. ఇక్కడ ఒక్కపండును అనేవిధంగా 'ను' అనేద్వితీయావిభక్తి ఏకత్వసంఖ్యను బోధిస్తున్నది కాబట్టి ఏకవచనం. పండ్లను, ఇక్కడ అదేనుప్రత్యయం అనేక మైనపండ్లను అంటే పండ్లలోనిబహుత్వాన్ని బోధిస్తున్నది కాబట్టి బహువచనం. ఇలా ఒకేప్రత్యయం ఒకసందర్భంలో ఏకవచనం, వేరొకసందర్భంలో బహువచనం రెండూ అవుతున్నది కాబట్టి ఇది ఉభయం. ఇలాగే 'చేత' మొద లైనవి కూడా.

**5. ఓ యనుశబ్దము సంబోధనమునం దగు నని యర్థము.** (తత్స. 14)

'ఓ యామంత్రణంబునం దగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రార్థాన్ని సంగ్రహంగా వివరిస్తున్నది.

సంబోధనంలో 'ఓ' అనేశబ్దం వస్తుం దని అర్థం. ఓ అనేశబ్దం అవ్యయ మైన ప్రత్యేకపదం. ఇది సంబోధనంలో ప్రయోగింపబడుతుంది. సంబోధనంలో అని సామాన్యంగా చెప్పటంచేత ఏకవచనంలోనూ, బహువచనంలోనూ అలాగే మహత్తులకు, అమహత్తులకు కూడ సంబోధనంలో రెండింటా ప్రయోగించుకోవచ్చు. ఓ రాముడ, ఓ రాములార. ఓ సీతా, ఓ వృక్షములార. మొ.

**6. ఇది సంబోధ్యవాచకంబునకు ముందే ప్రయోగింపఁబడును.** (తత్స. 14)

'ఓ యామంత్రణంబునం దగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సంబోధనంలో విధింపబడిన ఈశబ్దం సంబోధ్యవాచకానికి వస్తుం దనేంతవరకు స్పష్టమే. కాని ఆశబ్దానికి ముందో వెనకో ఎక్కడ వస్తుందో అస్పష్టం. దానిని స్పష్టం చేయటానికి ఈవివరణం ప్రారంభింబడింది.

సంబోధ్యవాచకం అంటే సంబోధింపబడేదానిని తెలియజేసేశబ్దం. దేనిని సంబోధిస్తామో అది సంబోధ్యం. దానిని తెలియజేసేశబ్దం సంబోధ్యవాచకం. 'ఓ యామంత్రణంబునం దగు' అని విధింపబడిన ఓ శబ్దం సంబోధ్యవాచకానికి అంటే సంబోధింపబడేపదార్థాన్ని తెలియజేసేశబ్దానికి పూర్వంలోనే ప్రయోగింప బడుతుం దని ఈవాక్యానికి అర్థం.

రాముడిని సంబోధించేసందర్భంలో 'రాముడ' అనేది సంబోధ్యవాచకం, ఓ అనేశబ్దం ఈ 'రాముడ' అనేశబ్దానికి పూర్వంలో చేరి, 'ఓ రాముడ' అనేవిధంగా ప్రయోగింపబడుతుంది. ఇలాగే ఓ సీతా, ఓ వనములార మొ.

ముందే అనటంచేత రాముడ ఓ, వనములార ఓ ఇత్యాదిగా సంబోధ్యవాచకానికి తరువాత ప్రయోగింప రా దని తాత్పర్యం.

**7. ఓశబ్దము తొలఁగియు సంబోధ్యవాచకము ప్రయోగింపవచ్చును.** (తత్స. 14)

'ఓ యామఏంత్రణంబునం దగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలో 'ఓ...అగు' అనటంచేత సంబోధనంలో ఓ శబ్దాన్ని తప్పకుండా నిత్యంగా ప్రయోగించ వలసిందేనా అనేసందేహాన్ని నివారించడానికి ఈవివరణం ప్రారంభింపబడింది.

'ఓయామంత్రణంబునం దగు' అనేసూత్రంప్రకారం సంబోధ్యవాచకానికి పూర్వంలో ఓ అనేశబ్దాన్ని ప్రయోగించవలసిఉంది. ఓ రాముడ, ఓ రాములార. ఒక్కొక్కసారి ముందుగా ఓ శబ్దం లేకుండా, కేవలం సంబోధ్యవాచకాన్ని మాత్రమే ప్రయోగించుకోవచ్చు. ఉదా. రాముడ, రాములార.

తొలఁగియు అన్నప్పటి సముచ్చయంచేత ఓశబ్దంతో ఓరాముడ, ఓరాములార అనేవిధంగా ఓశబ్దంతో ప్రయోగానికి ప్రాధాన్యం సూచింపబడుతున్నది.

**8. ఓయి మొద లగువానికి స్వతంత్రప్రయోగంబుం గలదు.** (తత్స. 16)

'ఓరియోసి మైత్రియందుం గలవు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఓయిమొద లగునవి అంటే – 'ఓశబ్దంబునకుం బురుష నీచస్త్రీపురుషామంత్రణంబు లందు యిసిరివర్ణంబులు విభాష నంతాగమంబు లగు' అనేసూత్రంచేత ఓశబ్దానికి పైన యి,సి,రి అనేవర్ణాలు ఆగమంగా రాగా ఏర్పడిన ఓయి, ఓరి, ఓసి అనేవి మూడు. ఇవి ఓయామంత్రణంబునం దగు' అనేసూత్రాన్ని అనుసరించి సంబోధ్యవాచకానికి పూర్వంలో మాత్రమే ప్రయోగింపబడాలి. కాని సంబోధ్యవాచకం లేకుండా, ఓయి, ఓరి, ఓసి అనేమూడు శబ్దాలు స్వతంత్రంగా కూడా ప్రయోగింపబడుతున్నా యని ఈవివరణం తెలియజేస్తున్నది.

సంగతియ యోయి. ఓరోరి ఇం కెందుఁ బోవచ్చు. ఓసి పోవే. మొ.

ఓయి మొద లగువానికి అనటంచేత ఓ శబ్దాన్ని స్వతంత్రంగా ప్రయోగించడానికి వీలు లేదు. ఓ (రాముడ) ఓ (సీత) ఈరీతిగా ప్రయోగించకూడదు. ప్రయోగంబును అనేచోటి నుశబ్దప్రయోగంచేత స్వతంత్రప్రయోగం కావ్యాలలో అరుదుగా ఉంటుం దని గ్రహించవచ్చు.

**9. వీనికి దీర్ఘంబుం గలదు.** (తత్స. 16)

'ఓరియోసి మైత్రియందుం గలవు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

వీనికి అంటే ఓయి మొద లగువానికి అని అర్థం. ఓయి మొద లగునవి అంటే ఓయి, ఓరి, ఓసి అనేశబ్దాలు మూడు. వీటికి దీర్ఘం కూడా వస్తుంది అని ఈవివరణం పేర్కొంటున్నది. దీర్ఘం ఓయి,ఓరి, ఓసి అనేశబ్దాలలోని చివరిఅచ్చుకు అంటే ఇకారానికి దీర్ఘం వస్తుంది. దీర్ఘంబును అనేచోటి నుశబ్దంచేత దీర్ఘం వికల్పం అని గ్రహించాలి.

ఓయీ విప్రకులావతంస, ఓరీ దుష్టనిశాటులార, ఓసీ ననుఁ జెనక రాకు. దీర్ఘం రానిపక్షంలో 'ఓయి విప్రకులావతంస' ఇత్యాదిగా హ్రస్వం అలాగే ఉంటుంది.

**10. ఙకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చు నని యర్థము.** (తత్స. 19)

చూ. 'ఙిత్తు బిందుపూర్వం బగు' సూత్రంవ్యాఖ్య.

**11. కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధ మయి ప్రయోగించునపుడు మానంబడువర్ణ మిత్తు నాఁబడు.** (తత్స. 19)

'ఙిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఏ దైనా ప్రయోజనంకోసం ప్రత్యయం, ఆగమం మొద లైనవాటితో చేర్చి,

ఆశబ్దం ప్రయోగించేసమయంలో విడిచిపెట్టబడేదానికి ఇత్తు అని పేరు. ఇందులో మూడు లక్షణాలు ఉన్నాయి. 1. ఏ దైనా ప్రయోజనం ఉండటం. 2. ప్రత్యయాదులకు చివర చేరిఉండటం. 3. ప్రయోగించేటపుడు కనపడకపోవటం.

'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' ఇక్కడ 'డు' అనేది ప్రత్యయం. (2) దీనికి చివర జ్ అనేవర్ణం చేర్చబడింది.(1) దీనివల్ల డువర్ణానికి పూర్వంలో బిందువు వస్తుంది. ఇది ప్రయోజనం. (3) రాముఁడు అనేవిధంగా డుజ్‌ప్రత్యయం ప్రయోగించేటపుడు జకారం శబ్దంలో ఉండదు. ఈమూడు లక్షణాలు కలిగిఉండటం చేత ఇక్కడి జకారానికి ఇత్తు అనేసంజ్ఞ చెల్లుతుంది.

**12. నామం బనఁగాఁ బ్రాతిపదికము.**

**డిత్థ, రామ, భార్గవ, రాజపురుష ఇట్టివి ప్రాతిపదికలు.** (తత్స. 21)

'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలోని నామం అనేసంజ్ఞను వివరిస్తున్నది.

నామం అంటే ప్రాతిపదికం అని అర్థం. ప్రాతిపదిక అనేసంజ్ఞ సంస్కృత వ్యాకరణంనుంచి ప్రసిద్ధం. అంటే సంస్కృతంలో దేనికి ప్రాతిపదిక అనేపేరు ఉన్నదో దానికి తెలుగులో ప్రాతిపదిక అనేపేరుతోపాటు నామం అనేపేరు గూడా ఉంటుంది. దాని ననుసరించి డిత్థ, రామ, భార్గవ, రాజపురుష అనేతీరువాటికి ప్రాతిపదిక అనేసంజ్ఞ సంస్కృతానుసారంగా సిద్ధిస్తుంది.

'అర్థవ దధాతు రప్రత్యయః ప్రాతిపదికమ్' అనేలక్షణాన్ని అనుసరించి, అర్థవంత మైనదీ, ధాతువు కానిదీ, ప్రత్యయం కానిదీ అయినశబ్దానికి ప్రాతిపదిక అనిపేరు. వీటినే అవ్యుత్పన్నప్రాతిపదిక లంటారు. దానికి డిత్థ అనేది ఉదాహరణం. 'కృత్తద్ధిత సమాసా శ్చ' అనేలక్షణాన్ని అనుసరించి కృత్‌ప్రత్యయం చివర గలిగినదీ, తద్ధిత ప్రత్యయం చివరగలిగినదీ, సమాసం అయినదీ అయినశబ్దం ప్రాతిపదిక అవుతుంది. రామ అనేది కృదంతం. భార్గవ అనేది తద్ధితాంతం. రాజపురుష అనేది సమాసం. కాబట్టి మూడువిధా లయిన అప్రాతిపదికలకు మూడుశబ్దాలు ప్రత్యేకంగా చూపాడు.

ఇలాగే అచ్చతెలుగులో అన్న, సన్న, మొద లైనవి అవ్యుత్పన్నప్రాతిపదికలు. వండుట, వినికి మొద లైనవి కృదంతప్రాతిపదికలు. దొంగతన, చిన్నఱిక మొద లైనవి తద్ధితాంతా లైన ప్రాతిపదికలు. తెల్లనిగుఱ్ఱ, రామునిబాణ, కూరగాయ, ముక్కంటి – మొద లైనవి సమాసప్రాతిపదికలు.

**13. ఇచ్చట డు జనుదానియందు జకార మిత్తు గావున 'జిత్తు బిందుపూర్వం బగు' ననుసూత్రముచేత డువర్ణమునకు ముందు సున్న వచ్చును బిమ్మట జకారము లోపించును.** (తత్స. 22)

'పుంలింగ మగుమహద్వాచకమునకు డు జగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో విధింపబడిన డుజ్ అనేదానిలో చివరిజకారం ఇత్తు. జకారం ఇత్తుగా కలిగినది కావటంచేత ముందరిడువర్ణం జిత్తు. కాబట్టి 'జిత్తు బిందుపూర్వం బగు' అనేసూత్రంచేత జి త్తయిన'డు'వర్ణానికి పూర్వంలో బిందువు వస్తుంది. బిందువు అని సామాన్యంగా చెప్పటంచేత అరసున్న లేదా నిండుసున్న వస్తుంది. సున్న వచ్చినతరువాత ఆజకారం లోపించిపోతుంది. డిత్థ-డిత్థఁడు, లేదా డిత్థండు.

'కార్యార్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడువర్ణ మిత్తు నాఁబడు' అనేవివరణవాక్యానికి ఉదాహరణంగానూ సూరి ఈవాక్యం సమన్వయిస్తుంది.

**14. సర్వత్ర యనుట నగాగమబాధనార్థము.** (తత్స. 23)

'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు' అనేసూత్రంలో 'సర్వత్ర' అనడానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'సర్వత్ర' అనడంచేత 'కువర్ణకంబు పరం బగునపు డుకారబుకారంబులకు నగాగమం బగు' అనేసూత్రంప్రకారం 'కు' అనేషష్ఠీ విభక్తి పరంగా ఉండగా రావలసిన నగాగమాన్ని బాధించి అక్కడ గూడా ఈసూత్రం ప్రవర్తించి నిగాగమమే వస్తుంది. అని యీవాక్యాని కర్థం.

'రాము + కును' అని ఉండగా ప్రస్తుతసూత్రంచేత నిగాగమమూ, 'కువర్ణకంబు పరం బగునపు' డనేసూత్రంచేత నగాగమమూ రెండూ ప్రాప్తిస్తున్నాయి. అయితే ఈసూత్రంలోని సర్వత్ర అనేపదం 'కువర్ణకంబు' అనేసూత్రాన్ని బాధించి యిక్కడ ప్రవర్తించగా, నిగాగమం వచ్చి రాముని + కును = రామునికిని అని అవుతుంది. విభాష కాబట్టి ఈనిగాగమం రానిపక్షంలో బాధ లేదు గాబట్టి 'కువర్ణకంబు పరం బగునపుడు' అని నగాగమం వచ్చి 'రామునకును' అని అవుతుంది.

ఇలాగే 'ఉకారబుకారంబుల కందువర్ణకము పరం బగునపుడు నుగాగమం బగు' అనేసూత్రంచేత అందువిభక్తి పరకతలో రావలసిన నుగాగమాన్ని కూడా ఈ

'సర్వత్ర' అనేదళం బాధిస్తుంది. దానివల్ల, రాము + అందును అనేచోట గూడ నిగాగమం వచ్చి, 'రామునియందును' అవుతుంది. విభాష గాబట్టి నిగాగమం రానిపక్షంలో బాధ లేకపోవడంవల్ల నుగాగమం వచ్చి రామునందును అవుతుంది.

**15. అనుదంతం బనుపర్యుదాసముచేత తమ్మునిచేతను తమ్ముచేతను ...బల్లిదునిచేతను, బల్లిదుచేతను ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికం బని యెఱుంగునది.** (తత్స. 24)

'అనుదంత మగుతెనుఁగుడుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'పర్యుదాస స్స విజ్ఞేయః య త్రోత్తరపదేన నఞ్'. నఞ్ కు పైపదంతో సమాసం చేస్తే పర్యుదాసం అంటారు. న+ఉదంత=అనుదంత. అనేవిధంగా పైసూత్రంలో అనుదంతము అనేశబ్దం పర్యుదాసం. ఉదంతం కానిది అని అర్థం. కాగా పైసూత్రం ఉదంతాలు కానిడుమంతాలకు మాత్రమే ద్వితీయాద్యేకవచనాలు పర మైనపుడు నిగాగమాన్ని నిత్యంగా చెప్పటంచేత ఉదంతాలు అయినడుమంతాలకు నిగాగమం నిత్యం కాదు. 'డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరం బగునపుడు నిగాగమంబు విభాష నగు' అనేసూత్రంచేత వికల్పంగా వస్తుంది. తమ్ము. ఈప్రాతిపదిక ఉదంతం. కాబట్టి అచ్చతెనుగే అయినా, ఉదంతం కావటంచేత నిగాగమం వికల్పంగా వచ్చి తమ్మునిచేత, తమ్ముచేత ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి.

బల్లిద శబ్దం ఉదంతం కాదు. అచ్చతెలుగే. కాని 'బల్లిదాదులు సంస్కృత తుల్యంబులు' అనేసూత్రాన్ని అనుసరించి బల్లిద మొద లైనఅచ్చతెలుగుశబ్దాలు సంస్కృతంతో తుల్య మైనవి కావటంచేత అచ్చతెలుగులకు చెప్పిన నిత్యనిగాగమం బల్లిదాదులకు వర్తించదు. కాబట్టి వాటికి కూడా నిగాగమం సంస్కృతడుమంతాలతో సమానంగా వికల్పంగా వస్తుంది. బల్లిదునిచేత, బల్లిదుచేత మొ.

**16. నువర్ణంబు ద్వితీయ యనుసూత్రముచే రామును అని ప్రాప్తింపఁగా నీసూత్రముచేత నవర్ణకోత్వంబున కిత్వంబు సిద్ధించె.** (తత్స. 25)

'డుమంతంబుమీఁదినువర్ణంబునుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం. ఇక్కడ 'రాముని' అనేరూపం ప్రక్రియ వివరించబడుతున్నది.

రామ శబ్దంమీద ద్వితీయావిభక్తి ఏకవచనవివక్షలో 'నువర్ణంబు ద్వితీయ' అనేసూత్రంచేత 'ను'ప్రత్యయం వచ్చి 'రాము+ను' అని కాగా, ఈసూత్రంచేత అంటే

'డుమంతంబుమీఁదినువర్ణంబునుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంచేత ద్వితీయా విభక్తిప్రత్యయ మైన'ను'వర్ణంలోనిఉకారంస్థానంలో హ్రస్వ మైనఇకారం వచ్చి, 'రాముని' అని అవుతుం దని ఈవివరణం తాత్పర్యం. ఇలాగే భార్గవుని మొ.

**17. సంస్కృతనామం బనుటంజేసి ఓతమ్ముఁడ, ఓబల్లిదుఁడ ఇత్యాదులందు లోపంబు లేదు.** (తత్స. 34)

'కృతోత్కం బగుసంస్కృతనామంబు సంబుద్ధిడుజునకు లోపంబు విభాష నగు' అనేసూత్రం క్రొత్తగా ఉత్వం చేసినసంస్కృతప్రాతిపదికలపై సంబోధనంలో డుజ్‌లోపం చెప్తున్నది. ఆసూత్రంలో 'సంస్కృతనామం' అనడంచేత సంస్కృతం కాని ప్రాతిపదిక మీద డుజ్‌లోపం రాదు.

తమ్ము + డుజ్. ఇచట తమ్ము, కృతోత్కం. అంటే అసలు ప్రాతిపదిక 'తమ్మ' అని అదంతం. పుంలింగతుల్యం గావడంవల్ల ఉత్వం చేయడంచేత 'తమ్ము' అని అయింది. కాగా ఇది కృతోత్కమే అయినా, ఆచ్ఛికనామం. సంస్కృతం కాదు. కాబట్టి సంబుద్ధి డుజ్లోపం రాదు. ఓ తమ్ముడా అనవలసిందే కాని 'ఓ రామ' లాగా 'ఓ తమ్మ' అని కాదు.

బల్లిదు + డుజ్ అన్నపుడు బల్లిదశబ్దం 'తమ్మ' లాగానే ఆచ్ఛికం. కానీ 'బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు' అని యిది సంస్కృతతుల్యం. అయినప్పటికీ సంస్కృతం కాదు. కాబట్టి యీకార్యం రాదు. ఓ బల్లిదుఁడ. ఓ బల్లిద అని కాదు.

(ఆచ్ఛికాలకు) సంస్కృతతుల్యా లయినఆచ్ఛికాలకు గూడ ఈకార్యం రా దని చెప్పడానికి రెం డుదాహరణలు ఇచ్చినట్లు గ్రహించవచ్చు.

**18. దీనికిం బాక్షికంబుగ దీర్ఘం బగు.** (తత్స. 36)

'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత విధింపబడిన ఆరగాగమానికి వికల్పంగా దీర్ఘం వస్తుం దని అర్థం. 'సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాష నగు' అనేసూత్రంచేత వికల్పంగా దీర్ఘం వస్తుం దని తాత్పర్యం. ఆరగాగమంలో చివర ఉన్న హ్రస్వ మైనఅకారానికి దీర్ఘం వస్తుంది.

రాములు అనేబహువచనాంతశబ్దంమీద సంబోధనంలో పైసూత్రంచేత ఆరగాగమం రాగా, రాములార. చివరిఅత్వానికి 'సంబోధనంబునందు...'

అనేసూత్రంచేత దీర్ఘం వచ్చి, రాములారా. వికల్పం కాబట్టి దీర్ఘం రానిపక్షంలో రాములార. ఇలాగే సీతలారా, వృక్షములార మొ.

**19. ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.** (తత్స. 37)

'మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం సంబోధ్యవాచకానికి మధ్యమపురుషక్రియతో అన్వయం ఉన్నపుడు బహువచనంలో నిత్యంగా రావలసిన ఆరగాగమం వికల్పంగా వస్తుం దని చెప్తున్నది. కాగా మధ్యమపురుషక్రియతో యోగం లేనపుడు ఆరగాగమం వికల్పం కాదు. అంటే నిత్యంగా వస్తుంది.

అన్నలార! మిమ్ము నడిగెద నొక్కమాట. ఈవాక్యంలో అడిగెదను అనేది ఉత్తమ పురుషక్రియ. అన్నలార అడిగెదను అనేచోట అన్నలార అనేసంబోధ్యవాచకానికి మధ్యమపురుషక్రియతో అన్వయం లేదు. కాబట్టి 'మధ్యమపురుషయోగంబునందు..' అనేసూత్రంచేత ఆరగాగమం వికల్పం కాదు. అందుచేత 'సంబోధనంబునందు బహువచనంబున కారగాగమం బగు' అనేసూత్రంచేత ఆరగాగమం నిత్యంగా వస్తుంది. అన్నలార అని మాత్రమే ఉంటుంది. వినుడు బాలకులు అని మధ్యమపురుష యోగంలో లాగా ఆరగాగమం లేకుండ ఇక్కడ 'అన్నలు అడిగెద' అని ఉండదు.

**20. దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి.** (తత్స. 38)

'అదంతం బయి దీర్ఘపూర్వలోపథం బయినమహత్తు మీఁదివిభక్తిలకారంబునకు రేఫం బగు' అనేసూత్రంలో 'అదంతం' అనడంచేత దీర్ఘపూర్వలోపధమూ, మహత్తూ అయినా, అదంతం కాకపోతే ఆప్రాతిపదికమీదివిభక్తిలకారానికి రేఫం రాదు. ధీశాలి. ఇది ఇకారాంతం. అదంతం కాదు. కాబట్టి రేఫ రాదు. ధీశాలులు.

అలాగే 'ఆళుచ్' ప్రత్యయం చివర గల్గిన 'దయాళు' అనేప్రాతిపదిక ఉదంతం. కాగా అదంతం కాదు. కాబట్టి దీనిపైని గూడా విభక్తిలకారానికి రేఫం ఈలక్షణం ప్రకారం రాదు. భాగవతం మొ. కావ్యాల్లో 'దయాళురు' అనేవిధంగా రేఫం కవిప్రయోగాల్లో కనబడుతున్నది. అందుచేత అదంతం కాకపోయినా 'దయాళు' అనేఒక్కశబ్దంమీద మాత్రం విభక్తిలకారానికి రేఫం వస్తుంది. అనేఈవివరణంచేత రేఫ సాధింపబడుతుంది. దయాళు + లు = దయాళురు, దయాళురను మొ.

'దయాళుశబ్దంబునకు' అనటంచేత కృపాళు మొద లైన ఆళుచ్ ప్రత్యయాంతాలే

అయినఇతరశబ్దాలమీద ఈకార్యం ఉండదు. కృపాళులు. మొ.

**21. క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగఁ బుంలింగత్వం బతిదేశించుటంజేసి మిత్రాదులకు ద్వైరూప్యం బెఱుంగునది.** (తత్స. 40)

'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

మిత్ర, శరణ, ప్రధాన, పాత్ర మొద లైనశబ్దాలు నపుంసకలింగాలు. అందుచేత మిత్ర–మొద లైనఈశబ్దాలపైన ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో 'అమహ న్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రంచేత ముపర్ణకం వచ్చి మిత్రము ఇత్యాదిగా ముపర్ణకంతో ఒకేవిధం అయినరూపాలు మాత్రమే కావాలి.

'క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగతుల్యంబు లగు' అనేసూత్రం మిత్రాదిశబ్దాలకు వికల్పంగా పుంలింగతుల్యత్వాన్ని అతిదేశిస్తున్నది. కాగా పుంలింగతుల్యత కలిగినపుడు మహద్వాచకాలు అయినమిత్రాదులకు ఉత్వడుజులు గలిగి మిత్రుఁడు, శరణుఁడు ఇత్యాదిగా డుమంతరూపాలు ఏర్పడతాయి. పుంలింగతుల్యత వికల్పం కాబట్టి రానిపక్షంలో సహజంగా ఇవి నపుంసకలింగాలు కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రంచేత ముపర్ణకం వచ్చి, మిత్రము, శరణము అనేవిధంగా ముపర్ణకాంతాలుగా రెండవవిధ మైనరూపాలు ఏర్పడతాయి.

ఇలా మిత్రాదులకు పుంలింగతుల్యతతో ఒకటి, నపుంసకలింగకార్యంతో ఒకటిగా రూపాలు రెండువిధాలుగా ఉంటా యని ఈవాక్యం వివరిస్తున్నది.

**22. ముపర్ణకంబునకు విధించులోపాదేశాదికార్యములు ముగాగమంబునకు సహితము వచ్చు నని యర్థము.** (తత్స. 41)

చూ. 'ముపర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' సూత్రవ్యాఖ్య.

**23. పూర్వసూత్రముచేత ముగాగమంబున కీకార్యంబు.** (తత్స. 42)

'ముపర్ణకంబునకు మాముడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణం బేని విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రత్యయ మైనముపర్ణానికి మాముడి, పూర్ణబిందుపూర్వకబువర్ణం అనేకార్యాలు విధించింది. 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి ఏకవచనంగా వచ్చేముపర్ణం ప్రత్యయం.

'వృక్షమ్ము - వృక్షంబు'. 'వానికి మువర్ణకేతరం బయినవిభక్తి పరం బగునపుడు ముగాగమం బగు' అనేసూత్రంచేత వృక్షములు ఇత్యాదిగా ప్రథమైకవచన ఇతర విభకుల్తలో వచ్చేమువర్ణం ప్రత్యయం గాదు. ఆగమం. ప్రత్యయానికి విధించిన 'మ్ము, ంబు'లు ఆగమానికి రావడానికి వీలు లేదు.

'మువర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు' అనేపూర్వసూత్రం ప్రకారం మువర్ణకానికి విధించిన లోపం, ఆదేశం మొద లైనకార్యాలు ముగాగమాని క్కూడా వస్తాయి. కాబట్టి వృక్షములు మొ. ఆగమమువర్ణాని క్కూడా మ్ముంబులు వచ్చి వృక్షమ్ములు, వృక్షంబులు ఇత్యాదిగా రూపా లవుతాయి. ఇలాగే పుంప్వాదేశం మొ. సరసపుమాటలు.

**24. ఒకానొకచో ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపఁ బడియె.** (తత్స. 43)

'లులనలు పరంబు లగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు' అనేసూత్రంలో 'ఒకానొకచో' అనేపదం ప్రయోగించడంవల్ల ప్రయోజనాన్ని వివరిస్తున్నది యీవాక్యం.

ఆసూత్రం లులనలు పరంగా ఉండగా వాటికి పూర్వంలో ఉన్న ముగాగమానికి లోపమూ, దానికి పూర్వంలో ఉన్నఅచ్చుకు దీర్ఘమూ అనేకార్యం విధిస్తున్నది. ఒకానొకచో అనడంవల్ల, ఈ 'ములోపపూర్వక పూర్వస్వరదీర్ఘం' అనేకార్యం కవి ప్రయోగాల్లో విరళంగా అంటే చాల అరుదుగా మాత్రమే ఉన్న దని సూచింప బడుతున్నది. వజ్రాలు, పగడాలను, ప్రాణానన్ అనేవిధంగా ఈకార్యం జరిగిన రూపాలు కావ్యాలలో చాల తక్కువసంఖ్యలో మాత్రమే ఉన్నా యని 'ఒకానొకచో' శబ్దతాత్పర్యం.

**25. ఇకారాంతములకు గ్లౌరైశబ్దములకు మఱి యుగాగమాంతంబులకుఁ బ్రథమైకవచనలోపం బగు.** (తత్స. 44)

చూ. 'ఇగ్లౌరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' సూత్రవ్యాఖ్య.

**26. తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబు లేదు.** (తత్స. 45)

'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు డుత్వం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం బహువచనం పరంగా ఉండగా దానికి పూర్వంలో ప్రాతిపదిక చివర ఉన్నఇత్వంస్థానంలో ఉత్వం వస్తుం దని చెప్తున్నది. హరి+లు=హరులు మొ.

ఈసూత్రంలో 'ఇత్తు' అన్నప్పుడు హ్రస్వ మైన 'ఇ' కారం తర్వాత తకారం చేర్చబడింది. తకారాన్ని పరంగా చేర్చడం తపరకరణం. దీనివల్ల 'తపర స్తత్కాలస్య' అనేసంస్కృతపరిభాష ననుసరించి ఇక్కడ హ్రస్వ మైనఇకారం మాత్రమే గ్రహింపబడుతుంది. అందుచేత ఈసూత్రంప్రకారం హ్రస్వఇకారానికిమాత్రమే ఉత్వం వస్తుంది. కాబట్టి దీర్ఘ మైన 'ఈ' కారానికి ఉత్వం రాదు. శ్రీ + లు=శ్రీలు. శ్రులు అని కాదు, కిటికీ+లను=కిటికీలను మొ.

**27. ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింపవలయు.**(తత్స. 46)

'వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు బహువచనము పరం బగునపు దుత్వం బగు ' అనేసూత్రంలోని వికృతి అనేపదానికి అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. వికృతి అంటే ఇక్కడ సంస్కృతసమంకంటే వే రయిన ఆంధ్రభాష. 'సంస్కృతసమేతరం బయినయీభాష యచ్చ యనంబడు' అనేసూత్రా న్ననుసరించి సంస్కృతసమేతరానికి ఆచ్ఛిక మని పేరు. కాబట్టి వికృతి అంటే ఆచ్ఛికము, అచ్చతెనుగు అని అర్థం.

ఈవివరణంచేత ప్రస్తుతసూత్రంప్రకారం ఉత్త్వం అచ్చతెనుగుపదాల్లో మాత్రమే వస్తుంది. కలికి+లు, కలుకిలు=కలుకులు. కాగా వికృతి అనడంచేత సంస్కృత సమాల్లో ఈకార్యం లేదు. భామిని+లు = భామినులు మొ. భామునులు అని ఉపోత్తమేత్వానికి ఉత్వం రాదు.

**28. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి నిసి ఇత్యాదులం దుత్వంబు లేదు.** (తత్స. 46)

'వికృతియం దికారాంతములయుపోత్తమేత్వంబునకు బహువచము పరం బగునపు దుత్వం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం బహువచనం పరంగా ఉండగా, అచ్చతెనుగుశబ్దంలోనిఉపోత్తమేత్వానికి ఉత్వం విధిస్తున్నది. మూడు గాని అంతకంటె ఎక్కువ గానీ అక్షారా లున్నపదంలో చివరి అక్షరానికి ఉత్తమం అని పేరు. దానికి సమీపంలో ఉన్నఅక్షరం అంటే చివరినుంచి రెండవ దైనఅక్షరానికి ఉపోత్తమం అని పేరు. అందులో ఉండే ఇత్వం స్థానంలో ఉత్వం వస్తుంది. కలికి+లు, కలుకి+లు=కలుకులు.

ఉపోత్తమేత్వానికి అనడంవల్ల ఉపోత్తమం కానిదానిలోని ఇత్త్వానికి ఉత్త్వం రాదు. జిగి ఈపదంలో అక్షరాలు రెండే. మూడు లేవు. కాబట్టి ఉత్తమం లేదు. ఇందులో చివరిఅక్షరం ఉత్తమం గాదు. కాగా దానికి పూర్వాక్షరం ఉపోత్తమం కూడా గాదు.

కాబట్టి అందులో ఉండే ఇత్వానికి ఉత్త్వం రాదు. జిగి+లు=జిగులు, 'జుగులు' అని కాదు. ఇలాగే నిసి+లు = నిసులు మొ.

**29. అంతట ననుట స్త్రీలింగప్రథమైకవచనలోపబాధనార్థము.** (తత్స. 48)

'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంలోని 'అంతట' అనేపదానికి ప్రయోజనాన్ని యీవాక్యం వివరిస్తున్నది.

'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రం స్త్రీలింగశబ్దాలకు అన్నింటికీ సామాన్యంగా ప్రథమైకవచనానికి (సువిభక్తికి) లోపం చెప్తున్నది. ఉకారాంతస్త్రీలింగాలకు గూడా ఈసామాన్యవిధానంచేత ప్రథమైకవచనం లోపించ వలసిఉంది. ఉకారాంతస్త్రీలింగాలకు ప్రాప్తిస్తున్నయీప్రథమైకవచనలోపాన్ని బాధించడంకోసం 'ఉకారాంత–' అనేసూత్రంలో 'అంతట' అనేపదం చేర్చబడింది. అందుచేత స్త్రీలింగాలపై గూడా ఉదంతాలమీద ప్రథమైకవచనం లోపించకుండా 'ఉకారాంతగోశబ్దంబుల కంతట వువర్ణకం బగు' అనేసూత్రంచేత వువర్ణకం వస్తుంది. ధేనువు, వధువు మొ.

**30. ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుంబోలెఁ గార్యం బగు.** (తత్స. 54)

'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రం సంస్కృతప్రాతిపదికల చివరిదీర్ఘానికి తెలుగులో హ్రస్వం విధిస్తున్నది. లక్ష్మీ–లక్ష్మి మొ. ఇలా దీర్ఘానికి చేయబడిన హ్రస్వం (కృతహ్రస్వం) కలిగినశబ్దాలకు సహజంగా చివర హ్రస్వం ఉన్నశబ్దాలకు ఏయేకార్యాలు వస్తున్నాయో అవి అన్నీ వస్తాయి. అని యీవాక్యం తాత్పర్యం.

'సుధన్వా' అనేప్రాతిపదిక చివరిదీర్ఘం 'నామంబులతుదిదీర్ఘంబునకు' అనేసూత్రం చేత హ్రస్వ మై 'సుధన్వ' అని అవుతుంది. 'పుంలింగం బయి మహద్వాచకం బయిననామంబుతుదియత్వంబున కుత్వం బగు' అనేసూత్రంచేత రామ – రాము అనేతీరుగా సహజహ్రస్వ మైనఅత్వానికి ఉత్వం వచ్చినట్లె 'సుధన్వ' అనే యీ కృతహ్రస్వానికి గూడా ఉత్వం వచ్చి – సుధన్వు – సుధన్వుఁడు, విశ్వపా – విశ్వపుఁ డు మొ.

'లక్ష్మీ' అనేచోట చివరిదీర్ఘానికి హ్రస్వం చేయగా లక్ష్మి. 'ఇత్తునకు బహువచనము పరం బగునపు డుత్వం బగు' అని హరి–హరులు ఇత్యాదిగా సహజంగా హ్రస్వ మైన ఇకారానికి వచ్చేఉత్వం కృతహ్రస్వ మైనఇత్వాని క్కూడా వస్తుంది. లక్ష్మి + లు = లక్ష్ములు.

ఉకారాంతాలకు హ్రస్వదీర్ఘాలకు ఆయాకార్యాలు సమానంగా విధింపబడ్డాయి. భ్రూవు, వధువు, వధువునకు, వధువునందు. మొ.

**31. బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు.** (తత్స. 58)

'చరిత్రాదులమువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం చరిత్ర మొద లైనశబ్దాలమీఁద ఉన్నమువర్ణకానికి (ముగాగమానికీ) లోపాన్ని బహుళంగా చెప్తున్నది. చరిత్ర – చరిత్రము మొ.

ఆసూత్రంలోని బహుళం అనేపదంవల్ల ఒకప్రయోజనాన్ని యీవాక్యం వివరిస్తున్నది.

బహుళం అనడంవల్ల ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని లక్షణం నాలుగువిధాలుగా ప్రవర్తించవచ్చు. చరిత్ర మొద లైనవాటిలో చేరిఉన్న దర్భ మొద లైనకొన్నిశబ్దాలకు ఆకార్యం నిత్యంగా ప్రవర్తిస్తుంది. అంటే దర్భ మొద లైన శబ్దాల పైన మువర్ణకానికి లోపం నిత్యం(ప్రవృత్తి). దర్భశబ్దంపై 'అమహ న్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత మువర్ణకం రాగా (దర్భము) దానికి 'చరిత్రాదుల' అనేసూత్రంచేత లోపం వచ్చి, దర్భ. ఇలాగే దర్భలు, పనస మొ. లోపం నిత్యం గాబట్టి దర్భము, పనసములు అనేవిధంగా మువర్ణం లోపించనిరూపా లుండవు.

**32. స్వర్గివాచి యనుటచే భూదేవులు భూసురుఁ డనుప్రయోగంబు లబాధితంబు లయ్యె.** (తత్స. 59)

'స్వర్గివాచి దేవ సురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపఁబడు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం స్వర్గంలో ఉన్నవారిని తెలియజేసేటప్పుడు దేవశబ్దం ఏకత్వార్థంలో (ఏకవచనంతో)నూ, సురశబ్దం బహుత్వార్థంలో (బహువచనంతో)నూ మాత్రమే తెలుగులో ప్రయోగింపబడతా యని చెప్తున్నది. దేవుఁడు, సకలసురులు.

సూత్రంలో 'స్వర్గివాచి' అనడానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. 'స్వర్గివాచి' అనడంచేత స్వర్గంలో ఉన్నవారిని గాక, ఇతరులను బోధించేసందర్భంలో ఈనియమం లేదు. అంటే దేవ,సురశబ్దాలు రెండూ ఏకత్వంలోనూ, బహుత్వంలోనూ రెండువిధాలుగా ప్రయోగించుకోవచ్చు.

'భూదేవులు' ఇక్కడ 'భూదేవ'శబ్దం భూమిమీదిదేవత అని భూలోకంలో ఉన్నవారిని (బ్రాహ్మణులు) బోధిస్తున్నది. స్వర్గివాచి కాదు. కాబట్టి ఇది బహుత్వార్థంలో బహువచనంతో భూదేవులు, భూదేవులను ఇత్యాదిగా గూడా ఉంటుంది. ఏకవచనంలో భూదేవుఁడు, భూదేవుని మొ.

'భూసురుఁడు' అలాగే భూసురశబ్దంగూడా భూమిమీద ఉండేదేవుడు (బ్రాహ్మణుడు) అని భూలోకంలో ఉన్నవారిని బోధిస్తున్నది, స్వర్గివాచి కాదు. కాబట్టి ఇది ఏకత్వార్థంలో ఏకవచనంతో భూసురుడు, భూసురుని ఇత్యాదిగా ఉంటుంది. బహుత్వంలో భూసురులు, భూసురులను మొ.

**33. బహుళగ్రహణముచే నమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు.** (తత్స. 61)

'దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రం పుంలింగా లయిన దూత మొద లైనశబ్దాలకు తెలుగులో బహుళంగా స్త్రీత్వాన్ని అతిదేశిస్తున్నది. దీనివల్ల స్త్రీలింగకార్యా లైనప్రథమైకవచనలోపం మొ. వస్తాయి. దూత – స్త్రీత్వం రాకుంటే, దూతుఁడు.

దూతాదులు మహత్తు లయినపుడు స్త్రీత్వం వికల్పం. 'బహుళం' అనడంచేత అమహద్వాచక మయినపుడు స్త్రీత్వం నిత్యంగా వస్తుం దని యీవాక్యం చెప్తున్నది.

సింగంబు దూత యగుజంబుకంబు. ఇక్కడ 'జంబుకం' అనే (తిర్యక్) అమహత్తుకు విశేషణం గావడంవల్ల 'దూత' అమహత్తు. అదంతమూ, (పులింగ మైనా) అమహత్తూ కాబట్టి, 'అమహన్నపుంసకములకు' అనేసూత్రంచేత మువర్ణకం రావలసిఉంది. ప్రస్తుతవివరణంచేత స్త్రీత్వం నిత్యంగా వస్తుంది. ప్రథమైకవచనలోపంతో 'దూత' నిత్యం అనడంవల్ల మువర్ణకంతో దూతము అనే విధ మైనరూపం ఉండదు.

**34. కొందఱు నావి యనియు నాదేశం బగు నంద్రు.** (తత్స. 63)

'నౌశబ్దంబునకు నావ యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ఔకారాంతసంస్కృతశబ్ద మైన 'నౌ' అనేశబ్దానికి 'నావ' అనేఆదేశాన్ని విధించింది. ఇది స్త్రీలింగశబ్దం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి 'నావ' అనే ప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

ఇక్కడ కొంతమంది 'నావ' అనేది కాక, నావి అని గూడ ఆదేశంగా వస్తుం దని చెప్తున్నా రని వాక్యార్థం. అథర్వణుడు త్రిలింగశబ్దానుశాసనం అనేవ్యాకరణంలో 'జీవ న్నావి: పుష్పదన్తస్య' అని (పుష్పదంతుడు అనేవ్యాకర్తమతంలో సంస్కృతసప్తమ్యేక వచనాంతంవంటిరూపం 'నావి' అనేది ప్రాతిపదికం అవుతుం దన్నాడు. తెలుగు

వ్యాకరణం అనేగ్రంథంలో రావిపాటిగురుమూర్తిశాస్త్రి కూడా 'నావి' అనేరూపాన్ని ప్రస్తావించాడు. (దీనిని సూరి తిరస్కరించినట్లు లేదు) 'నావ' అనేరూపం ప్రసిద్ధం. 'నావి' అనేరూపం మృగ్యం.

**35. ఇగ్లౌసూత్రముచేతం బ్రథమైకవచనంబునకు లోపంబు.** (తత్స.64)

'రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత రై, గ్లౌ అనేరెండు శబ్దాలకు వికల్పంగా ఓత్వం వస్తుంది. ఓత్వం వచ్చి రో, గ్లో అనీ, ఓత్వం రానిపక్షంలో రై, గ్లౌ అనీ, రూపం రెండు విధాలుగా ఉంటుంది. ఈవివరణవాక్యంలో సూత్రంలోని 'రైగ్లౌశబ్దములకు' అనేపదం ప్రకరణాన్ని అనుసరించి ఇక్కడ అన్వయిస్తుంది. కాగా రైగ్లౌశబ్దములకు అని సామాన్యంగా చెప్పటంచేత ఓత్వం వచ్చినరూపాలు, రానిరూపాలు రెండూ గ్రహింపబడతాయి. కాగా రో, రై, గ్లో, గ్లౌ అనేఈశబ్దాలకు నాలిగింటికి పైన ఉన్న ప్రథమావిభక్తి ఏకవచనానికి 'ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం. ఇలా ప్రథమైకవచనం లోపించగా, రో, రై, గ్లో, గ్లౌ అనేప్రథమైకవచనాంతపదాలు ఏర్పడతాయి. రైలు, గ్లౌకు ఇత్యాదిగా ఇతరవిభక్తులలో రూపాలు ఉంటాయి.

**36. విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు.** (తత్స .66)

'కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణం లోనిదిఈవాక్యం.

పైసూత్రం 'కంధరా' మొద లైనసంస్కృతస్త్రీలింగశబ్దాలకు తెలుగులో క్లీబతుల్యత్వాన్ని బహుళంగా అతిదేశించింది. ఈనపుంసకలింగతుల్యత్వంచేత కంధరాదిశబ్దాలకు మువర్ణకం మొ. నపుంసకలింగకార్యాలు కలుగుతాయి. కంధరము. క్లీబతుల్యత్వం కలగనిపక్షంలో స్త్రీలింగత్వాన్నిబట్టి ప్రథమైకవచనలోపాది స్త్రీలింగకార్యాలు కలుగుతాయి. కంధర, కంధరలు మొ.

కంధరా మొద లైన వాటిల్లోని 'విధా' అనేశబ్దానికి క్లీబతుల్యత్వం నిత్యంగా వస్తుంది. సూత్రంలోనిబహుళశబ్దంచేత ఇక్కడ నిత్యప్రవృత్తి అని తాత్పర్యం. 'నామంబు తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని హ్రస్వం వచ్చి– విధ. క్లీబతుల్యత్వంవల్ల ప్రథమావిభక్తి ఏకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి విధము. క్లీబతుల్యత్వం నిత్యం గావడంచేత క్లీబతుల్యత లేని, స్త్రీలింగరూపం ఉండదు. కాబట్టి విధ – విధలు అనేరీతిరూపా లుండవు.

**37. శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచనతుల్యంబులే యగు నని యెఱుంగునది.** (తత్స. 67)

'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత సంస్కృతంలోనిహలంతప్రాతిపదిక సంస్కృతంలో దానికి ప్రథమావిభక్తి ఏకవచనంలో ఏరూపంతో ఉంటుందో అలాంటిరూపంతో తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది. 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రంచేత మతుబాదుల్లోనిహలంతశబ్దాలకు ద్వితీయైకవచనాంతతుల్య రూపం తెలుగులో ప్రాతిపదిక అవుతుంది. మతుబాదుల్లో ఏశబ్దా లున్నాయో, ప్రయోగానుసారంగా గ్రహించవలసిందే.

నకారాంతా లయినహలంతశబ్దాలు మాత్రం 'శ్వన్' అనేశబ్దం ఒక్కటి తప్ప మిగిలినవి అన్నీ ప్రథమైకవచనాంతతుల్యరూపాలే ప్రాతిపదికలు లవుతాయి. కర్మన్ – కర్మ – కర్మము, సుధన్వన్ – సుధన్వా – సుధన్వుఁడు.

'శ్వన్' అనేశబ్దం ఒక్కటిమాత్రం మతుబాదుల్లోది కాబట్టి ద్వితీయైకవచనాంతతుల్య రూపం ప్రాతిపదిక అవుతుంది. శ్వన్ – శ్వానమ్ – శ్వానము.

**38. ఉగాగమాంతంబుల కిగ్లౌసూత్రముచేఁ బ్రథమైకవచనలోపం బగు.** (తత్స. 68)

'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత హలంతశబ్దాలచివరిహల్లుకు ఉగాగమం (ద్విత్వమూ) వస్తుంది. ఇలా వచ్చిన ఉగాగమం చివర గలిగినశబ్దాలు ఉగాగమాంతాలు. రుక్కు, వాకు మొద లైనవి. వీటికి పైన ప్రథమావిభక్తి ఏకవచనవివక్షలో వచ్చే 'సు' అనేప్రత్యయానికి 'ఇగ్లౌరా యుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వస్తుం దని ఈవివరణవాక్యానికి తాత్పర్యం. ఇగ్లౌసూత్రంలో 'ఉగంతంబులకు' అంటే ఉగాగమం చివరగలిగినశబ్దాలకు అని అర్థం.

కాగా 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత వచ్చినఉగాగమం చివర ఉన్న రుక్కు, వాకు, మొ. విధ మైనశబ్దాలకు 'ఇగ్లౌ రాయుగంతంబుల...' అనేసూత్రంచేత ప్రథమైకవచనానికి లోపం వస్తుంది. ఇలా లోపం రాగా రుక్కు, వాకు అనేవిధ మైనశబ్దాలు ప్రథమైకవచనాంతాలు ఐ, పదత్వాన్ని

పొందుతాయి.

**39. ఉగాగమంబు లేమింజేసి యిట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైకవచన లోపంబు లేదు.** (తత్స. 67)

'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

(శ్వశబ్దము తప్ప మిగిలిన) నకారాంతా లైనసంస్కృతశబ్దాలు అన్నీ 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనాంత తుల్యరూపాలు తెలుగులో ప్రాతిపదిక లవుతాయి. నకారాంతాలకు ప్రథమైకవచనంలో చివర హ ల్లుండదు. (సుధన్వన్) - సుధన్వా, (కర్మన్) - కర్మ, (బుద్ధిశాలిన్ - బుద్ధిశాలినీ). 'తుదిని హల్లు లేనందువల్ల 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమం నకారాంతాలకు వేటికీ రాదు. ఉగాగమం లేకపోవడంచేత ఇవి ఉగంతాలు గావు. కాబట్టి 'ఇగ్లొరాయుగంతంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అని ఉగాగమాంతాలమీద చెప్పినప్రథమైకవచనలోపం నకారాంతాలకు వేటికీ రాదు. మహత్ పుంలింగ మైతే (అదంతాలకు) ఉత్వడుజులు వస్తాయి. సుధన్వుఁడు. అమహత్తు లేదా నపుంసకము అయితే ముమవర్ణకం వస్తుంది. కర్మము.

(నకారాంతాలు) స్త్రీలింగాలు మాత్రం సంస్కృతస్త్రీప్రత్యయంతో కలిసి తెలుగులో ప్రాతిపదిక లవుతాయి. బుద్ధిశాలిని (బుద్ధిశాలిన్), కరి-(కరిన్), మొ. ఇకారాంతతను బట్టి 'ఇగ్లొ' సూత్రంచేత ప్రథమైకవచనం లోపిస్తుంది. బుద్ధిశాలిని, కరి.

**40. వీని కజంతంబులకుం బోలె దుజాదులు యథాయోగ్యంబుగ నగు.** (తత్స. 71)

'దానియంతిమమకారంబునకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

వీనికి అంటే అంతిమమకారం లోపించినమతుబాదులకు అని అర్థం. 'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రంచేత సంస్కృతంలోని మతుబా ద్యంతశబ్దాలు ద్వితీయైకవచనాంతతుల్యరూపాలు తెలుగులో ప్రాతిపదికలు అవుతాయి. శ్రీమంతమ్, విద్వాంసమ్ ఇత్యాదిగా ఈశబ్దాలకు చివర తప్పక మకారం ఉంటుంది. 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అనేసూత్రం చేత ఆచివరిమకారం లోపించగా ఈశబ్దాలు 'శ్రీమంత, విద్వాంస' ఇత్యాదిగా (అకారం) అచ్చు చివర గలిగినశబ్దా లవుతాయి. సహజంగా ఇవి హలంతాలే

అయినా, చివరిమకారం లోపించినతరువాత అజంతా లయినఈశబ్దాలకు సహజంగా అజంతా(అకారాంతా) లయినశబ్దాలకు లాగా ప్రథమాది విభక్తులలో డుజ్,ము,వు మొద లైనఆయాకార్యాలు పూర్వం చెప్పినవిధంగా అవుతా యని ఈవాక్యాని కర్థం.

1. మకారం లోపించినతరువాత అదంతం అయినఈశబ్దం మహత్తూ, పుంలింగమూ అయితే ఉత్వదుజులు వచ్చి, రాముఁడు, కృష్ణుఁడు లాగా, శ్రీమంతుఁడు, ఇత్యాదిగా రూపాలు అవుతాయి.

2. అదంత మైన ఈశబ్దం అమహత్తు అయితే వృక్షము, వనము లాగా మువర్ణకం వచ్చి, శ్రీమంతము ఇత్యాదిగా రూపాలు అవుతాయి.

3. స్త్రీలింగం అయితే రమ, విద్య ఇత్యాదులలాగా, ప్రథమైకవచనం లోపించి అప్సరస ఇత్యాదిగా రూపాలు అవుతాయి. కొన్నిటికి ఆలుశబ్దంతో సమాసం వచ్చి, శ్రీమంతురాలు ఇత్యాదిగా అవుతుంది.

**41. వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతములె యిందు గ్రహింపఁబడు.** (తత్స. 71)

'దానియంతిమమకారంబునకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రంచేత సంస్కృతంలోనిమతుబాద్యంతశబ్దాలు తెలుగులో ద్వితీయైకవచనాంతతుల్యరూపాలు ప్రాతిపదికలు అవుతాయి.

అయితే మతుబాద్యంతశబ్దాలు స్త్రీలింగాలు కనుక అయినపక్షంలో ద్వితీయైకవచనాంత తుల్యాలు కావు. ఇక 'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగుస్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' అని చెప్పబోయేసూత్రాన్ని అనుసరించి 'ఙీ' అనేస్త్రీప్రత్యయం చివర గలిగినవి ప్రాతిపదికలు అవుతాయి అని ఈవాక్యం వివరిస్తున్నది.

శ్రీమత్ అనే మతుబంతశబ్దం స్త్రీలింగం అయినపుడు సంస్కృతంలో విధింపబడిన 'ఙీ' అనేస్త్రీప్రత్యయంతో కలిసి 'శ్రీమతీ' అనేవిధ మైనరూపంతో తెలుగులో ప్రాతిపదిక అవుతుంది. దీర్ఘానికి హ్రస్వం వచ్చి, శ్రీమతి, అని కాగా 'ఇగ్లోరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, శ్రీమతి అనేపదం ఏర్పడుతుంది. ఇలాగే గుణవతి, విదుషి మొ.

**42. మహతి వాచ్యం బగునపుడు శ్రీమంతురాలు గుణవంతురాలు విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు.** (తత్స. 71)

'దానియంతిమమకారంబునకు లోపం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామం బగు' అనేసూత్రంచేత సంస్కృతంలోనిమతుబాద్యంతశబ్దాలు తెలుగులో ద్వితీయైకవచనాంతతుల్యరూపాలు ప్రాతిపదికలు అవుతాయి. శ్రీమంతమ్, విద్వాంసమ్ ఇత్యాదిగా ఈశబ్దాలకు చివర ఉన్న మకారం 'దానియంతిమమకారంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపించి 'శ్రీమంత, విద్వాంస' ఇత్యాదిగా అవుతాయి.

పైశబ్దాలు మహతి అంటే స్త్రీవ్యక్తిని బోధించేసందర్భంలో 'ఆలు' అనేఆచ్ఛికశబ్దంతో సమాసం ఏర్పడుతుంది. ఇలా శ్రీమంత+ఆలు అని ఉండగా, 'కర్మధారయంబునం దత్సమంబుల కాలుశబ్దంబు పరం బగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగు.' అనేసూత్రంచేత ఉత్వరుగాగమాలు వచ్చి, శ్రీమంతురాలు, గుణవంతురాలు ఇత్యాదిగా రూపాలు అవుతాయి అని ఈవివరణవాక్యం తాత్పర్యం.

సంస్కృతంనుండి స్త్రీలింగశబ్దం తీసుకుంటే 'ఙీ' అనేస్త్రీప్రత్యయంతో కలిసిన శ్రీమతీ ప్రాతిపదిక అవుతుంది. తెలుగులో శ్రీమంతమ్ ప్రాతిపదిక స్త్రీని బోధించే సందర్భంలో 'ఆలు' శబ్దంతో సమాస మేర్పడి శ్రీమంతురాలు అని అవుతుంది. అని గ్రహించాలి.

**43. స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్త్వడుజులు లే వని యెఱుంగునది.** (తత్స. 75)

'విశ్వకర్మాదులకు స్త్రీత్వం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం విశ్వకర్మ మొద లైననకారాంతసంస్కృతశబ్దాలకు స్త్రీలింగత్వాన్ని అతిదేశించింది. విశ్వకర్మాదులు పుంలింగాలు. వీటిలో లేనిస్త్రీలింగత్వం అనేధర్మం ఆరోపించడంచేత ఇది అతిదేశం. మహద్వాచకా లైనయీశబ్దాలు సహజంగా పుంలింగాలే అయినప్పటికీ తెలుగులో ఆరోపించబడిన స్త్రీలింగత్వంచేత పుంలింగకార్యాలు రావు. 'పుంలింగం బయి మహద్వాచక మయిన' అనేసూత్రంచేత ఉత్వము, 'పుంలింగ మగుమహద్వాచకమునకు' అని డుజు వీటికి రాదు. ఇలాగే ద్వితీయాదుల్లో నిగమాదు లయినపుంలింగకార్యాలు రావు. కాబట్టి 'విశ్వకర్ముఁడు విశ్వకర్ముని' అనేవిధ మైనపుంలింగ రూపా లుండవు. ప్రథమైకవచనలోపం మొ. స్త్రీలింగకార్యాలు వస్తాయి. విశ్వకర్మ, విశ్వకర్మను మొ.

**44. ఈశబ్దము చతుర్ముఖఋత్విగ్విప్రులకు వాచకంబు.** (తత్స. 76)

'మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఈశబ్దం అంటే స్త్రీత్వాన్ని పొందిన బ్రహ్మశబ్దం అని అర్థం. బ్రహ్మన్ అనేనకారాంతశబ్దం 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందునామం బగు' అనేసూత్రంప్రకారం 'బ్రహ్మ' అనేరూపంతో తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని చివరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి బ్రహ్మ అవుతుంది. ఇది మహద్వాచకమూ, పుంలింగం కూడా. కాబట్టి ఉత్వడుజులు వచ్చి, బ్రహ్మఁడు ఇత్యాదిగా కావాలి. కాని పైసూత్రంచేత స్త్రీత్వాన్ని అతిదేశించటం చేత మహత్పుంలింగకార్యం అయిన ఉత్వడుజులు రాకుండా, స్త్రీలింగత్వాన్నిబట్టి ప్రథమైకవచనలోపం వస్తుంది. అందుచేత బ్రహ్మఁడు అని కాకుండా, బ్రహ్మ అని అవుతుంది. ఇలా స్త్రీత్వంతో ఏర్పడిన 'బ్రహ్మ' అనేశబ్దం నాలుగుముఖాలు గలిగిన బ్రహ్మ, యజ్ఞం చేయించేవాడు, బ్రాహ్మణుడు అనేఅర్థాలను తెలియజేస్తుంది అని ఈవివరణవాక్యానికి అర్థం.

**45. తత్త్వతపోవేదయోగవాచకం బగునేని బ్రహ్మము నాఁబడు.** (తత్స. 76)

'మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

బ్రహ్మన్ అనేశబ్దం తత్త్వం(పరమాత్మ), తపస్సు, వేదం, ఒకగ్రహయోగం అనేవిధ మైన అర్థాలు తెలియజేసేసందర్భంలో బ్రహ్మము అనేవిధంగా మువర్ణకాంతరూపాన్ని పొందుతుం దని ఈవాక్యానికి అర్థం. ఈఅర్థాలలో బ్రహ్మన్ శబ్దం నపుంసకలింగం. కాబట్టి 'మహద్వాచక మయి పుంలింగం బగుబ్రహ్మశబ్దమునకు స్త్రీత్వం బగు' అనేసూత్రంప్రకారం స్త్రీత్వం రాదు. సహజంగా నపుంసకలింగం కాబట్టి నపుంసకలింగ కార్యమే అంటే మువర్ణకం ము. పొందుతుంది.

బ్రహ్మన్ అనేనకారాంతశబ్దం 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అనేసూత్రంప్రకారం బ్రహ్మ అనేరూపంతో తెలుగులో ప్రాతిపదికగా నిలుస్తుంది. 'నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు' అని చివరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి బ్రహ్మ అవుతుంది. ఇది నపుంసకలింగం కాబట్టి స్త్రీత్వం రాకపోవటంచేత అదంతనపుంసకత్వాన్నిబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అని మువర్ణకం వచ్చి 'బ్రహ్మము' అని అవుతుంది.

**46. అమహత్త్వంబునందు రాజము. వృక్షరాజము. (78)**

'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' అనేసూత్రవివరణం లోనిది ఈవాక్యం.

'మహత్త్వంబునందు స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' అనేసూత్రంలో 'మహత్త్వంబున' అనటంచేత రాజశబ్దం మహద్వాచకం అయినపుడే 'రాజు' అనేరూపం పొందుతుంది. కాగా రాజన్, అనేనకారాంతం కానీ, 'వృక్షరాజ' అనేవిధంగా అకారాంతం కానీ ఐన ఈశబ్దం అహత్తు అయినపుడు రాజు అనేరూపం పొందదు. అక్కడ సాధారణప్రక్రియతో ముపర్ణకాదికార్యాలే వస్తాయి.

రాజన్ అని నకారాంత మైనశబ్దం 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని రాజా అనేరూపం ప్రాతిపదిక అవుతుంది. 'నామంబులతుది దీర్ఘంబునకు హ్రస్వం బగు' అని చివరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, రాజ. అమహత్తు అవటంచేత ఈఅదంతశబ్దానికి 'అమహన్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రంచేత ముపర్ణకం వచ్చి 'రాజము'. 'వృక్షరాజ' శబ్దం అదంత మైన అమహత్తు. కాబట్టి 'అమహన్నపుంసకములకు ...' అనేసూత్రంచేత ముపర్ణకం వచ్చి వృక్షరాజము.

**47. ఉపసర్జనత్వంబునందు హతరాజుఁడు పరశురాముఁడు.** (తత్స. 78)

'మహత్త్వంబున స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' అనేసూత్రవివరణం లోనిది ఈవాక్యం.

'మహత్త్వంబునందు స్వార్థపరం బగురాజశబ్దము రాజు నాఁబడు' అనేసూత్రంలో 'స్వార్థపరం బగు' అనటంచేత రాజశబ్దం స్వార్థానికి ప్రాధాన్యం ఉన్నపుడే రాజు అనేరూపం పొందుతుంది. ఉపసర్జనత్వం అంటే అప్రాధాన్యం. రాజశబ్దం అర్థం ప్రధానం కానిస్థితిలో రాజశబ్దానికి 'రాజు' అనేరూపం కలగదు. సాధారణప్రక్రియను అనుసరించి, మహత్తూ, పుంలింగమూ అయితే ఉత్వడుజాదులు, అహత్తు అయితే ముపర్ణకం ఇత్యాదిగా ఆయాకార్యాలు కలగుతాయి.

హతరాజుఁడు పరశురాముఁడు. ఇక్కడ చంపబడినరాజులు కలవాడు అనేఅర్థంలో రాజులను చంపినవాడు ప్రధానం. అంటే క్రియతో అన్వయించేది. కాగా ఇక్కడ రాజశబ్దార్థం ప్రధానం కాదు. కాబట్టి 'రాజు' అనేరూపం రాదు. అందుచేత మహత్తు, పుంలింగమూ అయిన రాజశబ్దానికి ఉత్త్వడుజులు వచ్చి, హతరాజుఁడు అని అయింది. అమహత్తు అయితే హతరాజము (ఏనుగు) అని ముపర్ణకం వస్తుంది.

**48. ఋత్విగాది యగుటంజేసి యింద్రజితుం దనియు వాడంబడు.** (తత్స.79)

'జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఇంద్రజిత్ అనేశబ్దం ఋత్విగాదులలో చేరిఉన్నది. కాబట్టి 'ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాష నగు' అనేసూత్రంచేత ద్వితీయైకవచనాంత తుల్య మైన 'ఇంద్రజితమ్' అనేరూపం ప్రాతిపదిక అవుతుంది. అపుడు 'దానియంతిమ మకారంబునకు లోపం బగు' అని మకారం లోపించి, ప్రథమైకవచనంలో ఉత్త్వ డుజులు వచ్చి, ఇంద్రజితుఁడు, ఇంద్రజితుండు అనేరూపాలు కూడా అవుతాయి.

విభాష కావటంచేత ద్వితీయైకవచనాంతతుల్యరూపం రానిపక్షంలో 'హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామం బగు' అని ఇంద్రజిత్ అనేరూపం ప్రాతిపదిక కాగా 'జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు' అని తకారం లోపించి, 'ఇగ్లొరై...' సూత్రంచేత ప్రథమైకవచనం లోపించగా, 'ఇంద్రజి' అనేపదం ఏర్పడుతుంది. విభాష కావటంచేత తకారానికి లోపం రానిపక్షంలో ఇంద్రజిత్ అనేశబ్దానికి 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమద్విత్వాలు వచ్చి 'ఇంద్రజిత్తు'.

**49. బహుళగ్రహణంబునంజేసి పయఃప్రభృతులసకారంబునకు లోపంబు లేదు.** (తత్స.80)

'సాంతంబులతుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిఈవాక్యం సూత్రంలోనిబహుళశబ్దంచేత అప్రవృత్తిస్థలాన్ని వివరిస్తున్నది.

సూత్రంలో బహుళం అనటంచేత పయస్ మొద లైనశబ్దాలలో చివరిసకారానికి లోపం అసలు రాదు. అంటే లోపకార్యానికి అప్రవృత్తి. కాగా పయస్ అని ఉండగా, 'ఉగాగమంబును ద్విత్వంబున దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమద్విత్వాలు వచ్చి పయస్సు. తరువాత ప్రథమైకవచనంలో 'ఇగ్లొరై...' సూత్రంచేత ప్రథమైకవచనం లోపించి పయస్సు అనేపదం ఏర్పడుతుంది. సకారానికి లోపం అప్రవృత్తిచేత అసలు రాదు కాబట్టి పయము, వయము ఇత్యాదిగా సకారం లోపించినరూపాలు ఉండవు.

**50. వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు వైకల్పికముగా సలోప స్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపఁబడియె.** (తత్స.82)

చూ. 'వేధ పురోధ పురోధసుఁడు' సూత్రవ్యాఖ్య.

**51. సలోపం బయ్యే నేని మనము.** (తత్స. 83)

'మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాష నగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

మనస్ మొద లైనశబ్దాలలో చివరిసకారానికి 'సాంతంబులతుదిసకారంబునకు లోపం బగు' అనేసూత్రంచేత లోపం వచ్చినపక్షంలో 'మన' ఇత్యాదిగా అవుతుంది. ఇవి నపుంసకలింగశబ్దాలు. అదంతాలు కూడ. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత మువర్ణకం వచ్చి ప్రథమైకవచనంలో 'మనము' ఇత్యాదిగా రూపాలు అవుతాయి. బహుళం కాబట్టి సకారానికి లోపం రానిపక్షంలో మనస్ అని ఉండగా 'ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లున కగు' అనేసూత్రంచేత ఉగాగమం వచ్చి, 'మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాష నగు' అనేసూత్రంచేత ద్విత్వం వికల్పంగా వస్తుంది. ద్విత్వం వచ్చినపక్షంలో 'మనస్సు'. రానిపక్షంలో 'మనసు'. ఇలాగే శిరము, శిరస్సు, శిరసు. మొ.

**52. అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు జీ ప్రత్యయంబు లేమింజేసి మీననేత్రి ఏఇత్యాదు లసాధువులు.** (తత్స. 85)

'స్త్రీలింగంబు లెల్ల స్వస్వనియతంబు లగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం సంస్కృతంలోని స్త్రీలింగశబ్దాలన్నీ స్త్రీత్వంలో ఆయాశబ్దాలకు విధింపబడిన ఆయాస్త్రీప్రత్యయాలతో కలిసి తెలుగులోకి ప్రాతిపదికలుగా వస్తా యని చెప్తున్నది. కర్తృ – స్త్రీప్రత్యయాంతం– కర్త్రీ. తెలుగులో – కర్త్రి. మొ.

'స్వాంగా చ్చోపసర్జనా దసంయోగోపధాత్' అనేసూత్రంచేత విధింపబడిన జీష్ ప్రత్యయం – 'అసంయోగోపధాత్' అనడంవల్ల చివరినుంచి రెండవవర్ణం (ఉపధ) సంయుక్తవర్ణ మయితే రాదు. 'అంగగాత్రకంఠేభ్యో వక్తవ్యమ్' అనేవార్తికంచేత సంయోగోపధా లయినా అంగ, గాత్ర, కంఠ శబ్దాలకు మాత్రం జీప్రత్యయం వస్తుంది. మిగిలినసంయోగోపధాలకు రాదు. 'మీననేత్ర' అన్నీచోట్ల నేత్రశబ్దం సంయోగోపధం, అంగాదులలో అంటే అంగ, గాత్ర, కంఠ శబ్దాలలో లేదు. కాబట్టి దీనికి ఙీష్ ప్రత్యయం రాదు. అందుచేత సంస్కృతంలోనే 'మీననేత్రీ' అని కాదు. కాబట్టి తెలుగులో మీననేత్రి అనేరూపం ఉండదు. కాగా 'మీననేత్రా' అనేది ప్రాతిపదిక అయి, మీననేత్ర అని ఉండాలి.

**53. సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబు లగు.** (తత్స. 87)

'భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం 'భవత్' మొద లైనసర్వనామాలు, శతృప్రత్యయాంతాలు, రేఫాంతాలు మొద లైనసంస్కృతశబ్దాలను తెలుగులో తత్సమాలుగా ప్రయోగించ రాదు. ఇవి ప్రత్యేకంగా గానీ, సమాసంలో చివర ఉండి కానీ తెలుగులో ప్రయోగించ బడవు. అయితే సంస్కృతసమాసంలో పూర్వపదంగా ఉండి మాత్రం తెలుగులో ప్రయోగింపబడతాయి అని ఈవాక్యం వివరిస్తున్నది.

భవత్పుణ్యము. ఈసమాసంలో 'భవత్' అనేసర్వనామం పూర్వపదంగా ఉన్నది. లసద్రూపము. ఇక్కడ 'లసత్' అనేశతృప్రత్యయాంతం పూర్వపదంగా ఉన్నది. ధూర్వహము. ఇక్కడ ధూర్ అనేరేఫాంతం పూర్వపదం. భవదాదులకు పైన తెలుగువిభక్తిప్రత్యయం చేరేవిధంగా ఇవి తెలుగులో ప్రయోగింపబడ వని అర్థం అవుతున్నది.

## ఆచ్ఛికపరిచ్ఛేదం

**1. స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచనలోపాదికంబును, గ్లీబసమ త్వాతిదేశంబుచే మువర్ణకంబు నగు నని యెఱుంగునది.** (ఆచ్ఛి. 2)

'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుఁ గ్లీబసమంబులు నయియుండు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో ఆచ్ఛికశబ్దాలకు పెక్కింటికి స్త్రీసమత్వమూ, కొన్నింటికి క్లీబ సమత్వమూ విధింపబడింది. లేనిధర్మాన్ని ఆరోపించటం అంటే ఉండేటట్లు చెప్పటం అతిదేశం. అచ్చతెలుగుశబ్దాలకు లింగం లేదు. కాగా లేని ఆయాలింగశబ్దాలధర్మాన్ని అతిదేశించటం జరిగింది. ఈఅతిదేశంచేత ఆయాశబ్దాలు (మహత్తులు, అమహత్తులు అయినప్పటికీ) అతిదేశించినలింగాన్ని అనుసరించి రావలసినకార్యాలు మాత్రమే వస్తాయి.

అన్న, తల్లి, ఊరు మొద లైనశబ్దాలు స్త్రీసమాలు. ఈశబ్దాలకు స్త్రీసమత్వాన్ని అతిదేశించటంచేత ఈస్త్రీసమశబ్దాలకు సంస్కృతంలోనిస్త్రీలింగశబ్దాలతో సమాన మైనకార్యాలు కలుగుతాయి. 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపిస్తుంది. అన్న – మహత్తు. తల్లి (మహతి),

ఊరు - అమహత్తులు. అయినా అతిదేశించినస్త్రీసమత్వంచేత స్త్రీలింగకార్యం పొందుతాయి.

దయ్య, సున్న మొద లైనశబ్దాలకు క్లీబసమత్వం అతిదేశింపబడింది. క్లీబం అంటే నపుంసకం. నపుంసకలింగంతో సమం అవుతుంది అని చెప్పటంచేత సంస్కృతంలోనినపుంసకలింగశబ్దంతో సమాన మైనకార్యాలు కలుగుతాయి. క్లీబసమశబ్దాలు అన్నీ తప్పనిసరిగా అదంతాలే అయిఉంటాయి. కాబట్టి 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనంలో మువర్ణకం వస్తుంది. దయ్యము, సున్నము మొ.

సన్నము మొద లైనవి అమహత్తులు (అదంతాలు). అయినా క్లీబసమత్వాన్నిబట్టే మువర్ణకాదికార్యాలు అవుతాయి.

**2. తఱుచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులు గొండొక కల వని తాత్పర్యము.**

(ఆచ్ఛి. 2)

'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులుఁ గ్లీబసమంబులు నయియుండు' అనేసూత్రంలోని 'తఱుచుగ' అనడానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

అచ్చతెనుగుశబ్దాలు తఱుచుగా స్త్రీసమాలు, క్లీబసమాలూ అయిఉంటాయి. 'తఱుచుగ' అనడంవల్ల కొద్దిగా పుంలింగంతో సమాన మైనవి కూడా ఉంటా యని తాత్పర్యం. కొమర, చందుర మొ.

మహద్వాచకా లయినఅచ్చతెనుగుశబ్దాలే యిక్కడ పుంలింగతుల్యా లవుతాయి. పుంలింగతుల్యత్వఅతిదేశంచేత ఉత్వం, డుజ్, నిగాగమం మొద లైన (మహత్) పుంలింగకార్యాలు సిద్ధిస్తాయి. కొమర. 'పుంలింగం బయి మహద్వాచకం బయిన -' అనేసూత్రంచేత ఉత్వము, 'పుంలింగ మగుమహద్వాచకమునకు' అనేసూత్రంచేత డుజ్ వచ్చి కొమరుఁడు. ఇలానే చందురునిని, మగనిచేత మొ. ఇలాంటిపుంలింగ తుల్యాలు అరుదు. అన్న, దయ్యము మొ. ఇవి మహత్తు లయినా, స్త్రీసమాలు, క్లీబసమాలు కావటంచేత ఉత్వడుజాదిపుంలింగకార్యాలు రావు.

**3. మహత్త్వంబున వీని కుత్త్వడుజాదులు, నమహత్త్వంబున మువర్ణకాదులు, స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబును గలుగు నని యెఱుంగునది.**

(ఆచ్ఛి. 3)

'బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు' అనేసూత్రంఅర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

కాగా వీటికి అంటే బల్లిదాదులకు అని అర్థం. బల్లిద మొద లైన ఈశబ్దాలు అన్నీ విశేషణాలు. వీటికి సంస్కృతంతో తుల్యత్వం చెప్పడంవల్ల ఇవి 1.మహత్తు లయితే ఉత్వము, డుజ్ మొద లైనకార్యాలను పొందుతాయి. 2.అమహత్తు లయితే మువర్ణకాన్ని పొందుతాయి. 3. స్త్రీని బోధించేసందర్భంలో ఆలు శబ్దంతో సమాసాన్ని పొందుతాయి. అంటే విశేష్యంతో సమాన మైనలింగాన్ని కలిగిఉండడం దీనికి ప్రయోజనం.

విశేషణం మహద్వాచక మయితే దానికి విశేషణం అయిన బల్లిదాదుల్లోనిశబ్దం మహత్తు కావడంతోపాటు పుంలింగతుల్యం అవుతుంది. దీనివల్ల ఉత్వడుజాది పుంలింగకార్యాలు వస్తాయి. బల్లిదాదులు మహత్తు లయినపు డెల్ల పుంలింగతుల్యాలు గూడా అవుతాయి.

రాముఁడు బల్లిదుఁడు. రాముఁడు – విశేష్యం. ఇది మహత్తు (పుంలింగం) కాబట్టి 'బల్లిద' అనే విశేషణం గూడ (మహత్తు) పుంలింగతుల్యం అయి ఉత్వడుజులు వచ్చి బల్లిదుఁడు అని అయింది.

ఇలాగే 'అన్న బల్లిదుఁడు' మొ. అన్న స్త్రీసమం. అయినా మహత్తు. కాబట్టి బల్లిద అనేవిశేషణం (మహత్తు) పుంలింగతుల్యం అయింది.

బల్లిదుఁ డగుమిత్రము. మిత్రశబ్దం నపుంసకలింగం. అయినా మహత్తు. కాబట్టి దీనికి విశేషణమైన బల్లిదశబ్దం (మహత్తు) పుంలింగతుల్యం అయింది.

విశేష్యం అమహత్తు అయితే ఏలింగంలో ఉన్నా దానికి విశేషణ మైన బల్లిదాదులు గూడా అమహత్తులు కావడంతోపాటు క్లీబసమాలు అవుతాయి. ఇవి అమహ త్తయినపు డెల్ల క్లీబసమాలే.

వానివంశము బల్లిదము. ఇక్కడ వంశశబ్దం పుంలింగం. అయినా అమహత్తు. కాబట్టి దానికి విశేషణం అయిన బల్లిదశబ్దం, (అమహత్తే) క్లీబసమం అయింది. కాబట్టి మువర్ణకం వచ్చి 'బల్లిదము' అయింది. ఇలాగే – విద్య బెట్టిదము, గోడ బల్లిదము మొ.

విశేష్యం మహతి – (స్త్రీవాచకం) అయితే విశేషణమైన బల్లిదాదులు స్త్రీసమాలు. 'ఆలు'శబ్దంతో సమాసం పొందుతాయి. సంస్కృతంలో లాగా తెలుగులో స్త్రీప్రత్యయాలు లేవు. స్త్రీత్వం తెలియజేయాలంటే 'స్త్రీ' అనేఅర్థాన్ని ఇచ్చే ఆలు శబ్దంతో సమాసం పొందడం ఒక్కటే మార్గం.

సీత బల్లిదురాలు, అక్క బల్లిదురాలు మొద లగునవి. ఇవి సంస్కృతతుల్యాలు గావడంచేత 'కర్మధారయంబునం దత్సమంబుల కాలు...' అని రుగాగమంతోపాటు ఉత్వం గూడా వస్తుంది.

**4. కూఁతుళ్లు, కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబు లని యెఱుంగునది.** (ఆచ్ఛి. 9)

'కూఁతుశబ్దము ప్రథమైకవచనంబు రువర్ణకం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

కూఁతు - అనేది ప్రాతిపదిక. దీనిమీద పైసూత్రంప్రకారం ప్రథమావిభక్తి ఏకవచనంలో మాత్రమే 'రు' వర్ణకం వస్తుంది. కాబట్టి మిగిలినవిభక్తివచనాలలో రువర్ణం రాదు. కూఁతుళ్లు, కూఁతురిని ఇత్యాదిస్థలాలలో ప్రథమావిభక్తి బహువచనం మొదలుగా ఇతరవిభక్తివచనాలలో 'రు' వచ్చిఉంది. కూఁతురు+లు=కూఁతుళ్లు. ఇలాగే కూతురు+ను కూఁతురిని మొ. కాగా ప్రథమైకవచనంలో విధింపబడిన 'రు' వర్ణం ఇతరవిభక్తివచనాలలో రావటం పైలక్షణానికి విరుద్ధం. కాబట్టి 'కూఁతుళ్లు, కూఁతురిని' అనేరీతిరూపాలు గ్రామ్యాలు అవుతాయి. ఇంక 'రు'వర్ణం లేకుండా- కూఁతు ప్రాతిపదిక. ప్రథమాబహువచనంలో లువర్ణంబు బహువచనంబు. కూఁతులు. ఇలాగే ద్వితీయైకవచనంలో నువర్ణంబు ద్వితీయ. కూఁతును. ఇలాగే కూఁతుచేత, కూఁతులయందు ఇత్యాదిగా ఉన్నరూపాలు మాత్రమే లక్షణబద్ధాలు. గ్రాహ్యాలు. అని తాత్పర్యం.

**5. బహుళగ్రహణముచే విల్లులు, పిల్లులు, పులులు ఇత్యాదులందు లోపంబు లేదు.** (ఆచ్ఛి. 12)

'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని బహుళ పదంచేత అప్రవృత్తి అయినస్థలాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

విల్లు+లు, పిల్లి+లు, పులి+లు ఇత్యాదిస్థలాలలో బహువచనం పరంగా ఉండగా పైసూత్రం ప్రకారం ముందున్న ఉత్వానికి లోపం ప్రాప్తిస్తున్నది. కాని సూత్రంలో బహుళం అనటంచేత కొన్నిచోట్ల ఈకార్యానికి అప్రవృత్తి. కాగా ఇక్కడ ఉత్వానికి లోపం రాదు. అందుచేత విల్లు=విల్లులు, పిల్లు=పిల్లులు, పుళ్లు(పుల్లు)=పులులు అనేవిధ మైనరూపాలు ఉండవు. విల్లులు, పిల్లులు, పులులు అనేవిధంగానే ఉంటాయి.

**6. తత్సమంబులం గోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు.** (ఆచ్ఛి .12)

'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత అచ్చతెనుగుశబ్దాలలో మాత్రమే ఉత్వలోపకార్యం వస్తుంది. గుండ్లు, గోర్లు మొ. ఆచ్ఛికపరిచ్ఛేదంలోని ఈసూత్రంచేత సంస్కృతసమశబ్దాలలో ఉత్వలోపకార్యం రావడానికి వీలు లేదు. అయినా కోటి, పిప్పలి – అనే సంస్కృత శబ్దాలలో ఈఉత్వలోపకార్యం కవిప్రయోగాల్లో కనబడుతున్నది. సూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా ఆచ్ఛికాల్లో రావలసినలోపం, తత్సమాల్లో వస్తున్నట్లు గ్రహించాలి.

కోటి + లు. 'ఇత్తునకు బహువచనము పరం బగునపు డుత్వం బగు'. కోటు+ లు. 'బహువచనము పరంబగునపుడు' అనేసూత్రంలోనిబహుళపదంచేత ఈతత్సమశబ్దంలో ఉత్వం లోపించి కోట్లు. లోపం రానిపక్షంలో, కోటులు మొ.

**7. ఏండ్లు, కాండ్లు ఇత్యాదులందు డాకు ళాదేశంబు కొందఱు వక్కాణించిరి.**

**8. తెనుఁగున బిందుపూర్వకస్థిరము లేమింజేసి యది గ్రాహ్యంబు గాదు.** (ఆచ్ఛి. 15)

'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఏఁడు+లు (కాఁడు+లు) అని ఉండగా, 'బహువచనంబు పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి, ఏఁడ్లు (కాఁడ్లు) అని కాగా, 'సమానపదంబునందు సంయోగంబు పరం బగునపు డెల్లచో ఖండబిందువునకుం బూర్ణం బగు' అనేసూత్రంచేత పూర్ణబిందువు వచ్చి, ఏండ్లు (కాండ్లు) అని అవుతుంది. త్రాడ్లు – త్రాళ్లు అయినట్లుగా ఇక్కడ బిందువు మీదిడకారానికి కూడా 'ళ'కారం వచ్చి, ఏంళ్లు, కాంళ్లు అని అవుతుం దని, తెలుగువ్యాకరణంలో రావిపాటి గురుమూర్తి శాస్త్రి పేర్కొన్నాడు.

అది సరి గా దని సూరి యీవాక్యంలో వివరిస్తున్నాడు. 'ఏంళ్లు' అనేచోట సున్నమీది డకారానికి ళకారం ఆదేశ మైతే , బిందువు ళకారానికి అంటే స్థిరానికి పూర్వంలో ఉంటుంది. 'సంస్కృతసమేతరము లయినతెలుఁగుశబ్దములయందుఁ బరుషసరళములకు ముందే బిందువు కానంబడుచున్నది' అనేసూత్రా న్ననుసరించి స్థిరానికి ముందు బింద వుండదు. కాబట్టి స్థిరపరకబిందువు గల ఏంళ్లు, కాంళ్లు

అనేవిధ మైనరూపాలు లక్షణవిరుద్ధాలు. అందుచేత అటువంటిరూపాలను సాధించే 'బిందువుమీది డాకు ళాదేశలక్షణం' గ్రహింపరా దని సూరితాత్పర్యం.

ళాదేశం వస్తే బిందువు స్థిరపరకం కావలసివస్తుంది. అది లక్షణవిరుద్ధం కాబట్టి 'ళా'దేశం రా దని ఏండ్లు ఇత్యాదిగానే ఉంటుం దనీ సూరి సమన్వయం. కాని తనలక్షణంలో సూరి బిందుపూర్వకం కాకపోతేనే డాకు ళా వస్తుం దని చెప్తే గుంళులు, ఏంళ్లు ఇత్యాదులు స్పష్టంగా వారింపబడేవి. లేకపోతే నాఁడెము–నాణెము ఇత్యాదులలాగా గుళులు (గుండులు) ఏళ్లు (ఏండ్లు) అని కావాలి గదా.

**9. ఉల్లోపంబు.** (అచ్చి. 16)

'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందు పూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత లివర్ణంస్థానంలో ఆదేశంగా వచ్చిన 'ండు' వర్ణంలో చివర ఉన్న ఉకారానికి 'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత లోపం వస్తుం దని ఈవివరణవాక్యానికి అర్థం. దీనిచేత కొడవండ్లు అనేరూపం ప్రస్తావింపబడుతున్నది.

'కొడవలి' అనేశబ్దంమీద ప్రథమాబహువచనంలో 'లువర్ణంబు బహువచనంబు' అనే సూత్రంచేత లువర్ణకం వచ్చి, కొడవలి+లు. పైసూత్రంచేత లివర్ణంస్థానంలో 'ండు'వర్ణం ఆదేశంగా వచ్చి, కొడవండులు. 'బహువచనము పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఉత్వం లోపిస్తే, 'కొడవండ్లు' అని అవుతుంది. బహుళం కాబట్టి ఉల్లోపం రాకపోతే 'కొడవండులు' అని అవుతుంది. పక్షాంతరంలో 'కొడవళ్లు, కొడవళులు, కొడవలులు' అనేరీతిరూపాలు అవుతాయి.

**10. పక్షంబునం దలఘులకారంబు.** (అచ్చి. 16)

'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందు పూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో బహుళం అనటంచేత పూర్ణబిందుపూర్వకడువర్ణం రానిపక్షంలో ఔపవిభక్తిక లివర్ణ, సలలువర్ణాలకు అలఘులకారం వస్తుం దని పైవాక్యానికి అర్థం.

కొడవలి+లు అని ఉండగా, ండు వర్ణం వచ్చినపక్షంలో కొడవండ్లు, కొడవండులు

అని అవుతుంది. బహుళం కాబట్టి 'ండు' వర్ణం రానిపక్షంలో కొడవలి+లు అని ఉండగా, 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అనేసూత్రంచేత ఉత్వం వచ్చి, కొడవలి+లు. 'బహువచనంబు పరం బగునపుడు డలటరల యుత్వంబు నకు లోపం బగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి, కొడవల్+లు. 'బహువచన శ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయినడకార లకారంబుల కలఘులకారము నిత్యముగా నగు' అనేసూత్రంచేత అలఘులకారం వచ్చి, – కొడవళ్లు. ఉత్వం లోపించనిపక్షంలో– కొడవలు+లు అని ఉండగా, 'బహువచనంబు పరం బగునపు దసంయుక్తంబులయి యుదంతంబు లయిన డలరల కలఘులకారంబు బహుళంబుగా నగు' అని అలఘులకారం వచ్చి, కొడవళులు. బహుళం కాబట్టి అలఘులకారం రాకపోతే 'కొడవలులు'. కొడవళ్లు, కొడవళులు అనేరూపాలలో లకారానికి అలఘు'ళ'కారం రావటాన్ని ఈవివరణవాక్యం ప్రస్తావించింది.

**11. రోఁకలిప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది.** (ఆచ్ఛి. 16)

'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు'అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఇట్లు అంటే పూర్వం కొడవలిశబ్దానికి చూపినప్రకారంగా అని అర్థం. రోఁకలి మొద లైనశబ్దాలకు కొడవలిశబ్దానికి అయినవిధంగానే ఆయారూపాలు అవుతాయి. వాటిని ఇలా గుర్తింపవచ్చు. 1. బహువచనం పరంగా ఉండగా, 'ఔపవిభక్తికంబుల లివర్ణ సలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత లివర్ణం స్థానంలో 'ండు' వర్ణం వచ్చి,– 'రోఁకండులు'. 2. 'బహువచనంబు పరం బగునపుడు డలటరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించినపక్షంలో– 'రోఁకండ్లు'. 3. 'ండు'వర్ణం రానిపక్షంలో 'ఇత్తునకు బహువచనంబు పరం బగునపు దుత్వం బగు' అని ఉత్వం వచ్చి,– 'రోఁకలులు'. 4. 'బహువచనంబు పరం బగునపు దసంయుక్తంబు లయి యుదంతంబు లయినడలరల కలఘులకారంబు బహుళంబుగా నగు' అని అలఘుళకారం వచ్చినపక్షంలో– 'రోఁకళులు'. 5. 'బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ఉత్వం లోపించి, (రోఁకల్+లు) 'బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకార లకారంబుల కలఘులకారము నిత్యముగా నగు'

అనేసూత్రంచేత అలఘులకారం వచ్చి,– 'కొడవళ్లు'.

ఔపవిభక్తికా లయినలివర్ణాంతశబ్దాలకు ఇలా అయిదువిధాలుగా రూపాలు ఏర్పడతాయి.

**12. ఇట్లు కల్లు, పల్లు, ముల్లు, విల్లు శబ్దంబులకు రూపంబులు తెలియునది.** (ఆచ్ఛి. 16)

'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు'అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

కల్లు మొద లైనపైశబ్దాలు ఔపవిభక్తికాలు. సలలువర్ణాంతాలు. ఇటువంటి శబ్దాలకు ఇట్లు అంటే అంతకుపూర్వం ప్రస్తావించిన– 'ఇల్లు' అనేఔపవిభక్తిక సలలు వర్ణాంతశబ్దానికి అయినప్రకారంగా రూపాలు అవుతాయి.

1. బహువచనం పరంగా ఉండగా, 'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందుపూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత సలలు(ల్లు)వర్ణంస్థానంలో 'ండు'వర్ణం వచ్చి,– కండులు. 2. 'బహువచనంబు పరం బగునపుడు డలటరలయుత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు' అని ఉత్వం లోపించినపక్షంలో– కండ్లు. 3. బహుళం కాబట్టి ఉత్వానికి లోపం రానిపక్షంలో– కల్లులు.

ఔపవిభక్తికాలు అయిన సలలువర్ణాంతాలకు పైవిధంగా మూడురూపాలు ఏర్పడతాయి.

**13. మద్యనిమ్నార్థకంబు లయిన కల్లుపల్లుశబ్దంబులును, తెల్లుప్రభృతిశబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటంజేసి వాని కీకార్యంబు లేదు.** (ఆచ్ఛి. 16)

'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరం బగునపుడు పూర్ణబిందు పూర్వకడువర్ణంబు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

దీనికి పూర్వం 'ఇట్లు కల్లుపల్లుముల్లుశబ్దంబులకు..'అని కల్లు, పల్లు అనేశబ్దాలకు బిందుపూర్వకడువర్ణంతో కండులు, కండ్లు, కల్లులు ఇత్యాదిగా రూపాలు అవుతా యని చెప్పాడు. రాయి అనేఅర్థంలో కల్లుశబ్దమూ, దంతం అనేఅర్థంలో పల్లు శబ్దమూ ఔపవిభక్తికాలు కాబట్టి ఆఅర్థంలో 'ండు'వర్ణం వచ్చినరూపాలు ఉంటాయి.

కాని మద్యం అనేఅర్థంలో కల్లుశబ్దమూ, పల్లము అనేఅర్థంలో పల్లు శబ్దమూ ఔపవిభక్తికాలు కావు. అలాగే ఔెల్లు మొద లైన సలలువర్ణాంతశబ్దాలు కూడా ఔపవిభక్తికాలు కావు. కాబట్టి వాటికి 'ఔపవిభక్తికంబులలివర్ణసలలువర్ణంబులకు..' చెప్పిన పూర్ణబిందుపూర్వక'డు'వర్ణం రాదు. అందుచేత కల్లులు, పల్లులు, ఔెల్లులు ఇత్యాదిగానే రూపాలు ఉంటాయి. కండులు, పండ్లు, ఇత్యాదిగా ఈఅనౌపవిభక్తిక శబ్దాలకు 'ండు' వచ్చినరూపాలు ఉండవు.

**14. ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు.** (అచ్చి. 21)

'బహువచనంబు పరం బగునపుడు రేయిప్రభృతులతుదియక్షరంబు లోపించు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం బహువచనం పరంగా ఉన్నపుడు రేయి మొ. శబ్దాల్లో చివరిఅక్షరానికి లోపం విధించింది. కాబట్టి ఇతరస్థలాల్లో అంత్యాక్షరలోపం రావడానికి ఆసూత్రం ప్రకారం వీలు లేదు.

అందువల్ల లక్ష్యానుసారంగా సూరి యిలా వివరించాడు. బహువచనం పరంగా ఉండగా చెప్పినరేయిప్రభృతులలోని తుదిఅక్షరలోపం బహువచనం పరంగా లేకపోయినా, సమాసంలో కూడా వస్తున్న దని ఈవివరణవాక్యతాత్పర్యం.

రేయియొక్క రాజు (రేయి + రాజు) అనేసమాసంలో 'యి' లోపించి రేరాజు. ఇలాగే మగఱాయి + పతకము–మగఱాపతకము మొ.

**15. బహుళగ్రహణముచే సందియము కాఱియ మొద లగుశబ్దములం దెత్వము లేదు.** (అచ్చి. 23)

'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రంలోని బహుళపదంచేత అప్రవృత్తిస్థలాన్ని తెలియజేస్తున్నది ఈవాక్యం.

పైసూత్రంలో బహుళం అనేపదాన్ని గ్రహించటంచేత కొన్నిచోట్ల ఈకార్యానికి అప్రవృత్తి. సందియ, కాఱియ మొద లైనఅచ్చతెలుగుప్రాతిపదికలలో చివర 'ఇయ' అనేభాగం ఉన్నప్పటికీ, ఆ 'ఇయ'కు ఎత్వం రాదు. కాబట్టి 'సందియము' అనేశబ్దం 'సందెము' అని కాదు. అలాగే 'కాఱియ' అనేశబ్దం 'కాఱె' అని కాదు. ఇలాగే సకియ, చెలియ మొద లైనశబ్దాలలో కూడా 'ఇయ'కు ఎత్వం రాదు. కాబట్టి 'సకె, చెలె' అనేవిధ మైనరూపాలు ఉండవు.

**16. ఇయశబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి. అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు.** (ఆచ్ఛి. 23)

'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత సూరి నామాంతంలో ఇయకు ఎత్వం విధించాడు. కన్నియ–కన్నె. ఇక్కడ 'ఇయ' అనేభాగంలో 'ఇ'కారానికి లోపం వస్తుం దని కొందఱు చెప్పారు. 'ఇయాంతత్వే కుత్రచిత్ స్యాత్ ఏత్వం య శ్చాపి తద్భవే' అని అథర్వణుడు ఇయకు –య ఆదేశం (అంటే ఇలోపం అనవచ్చు) చెప్పాడు. 'అన్యేషాం చ ప్రయోగ మహితానామ్' అనేచింతామణిలక్షణంచేత ఇత్వలోపం వస్తుం దని అక్కడ అహోబలపండితుడు వ్యాఖ్యానించాడు. వీళ్లు చెప్పిన ఇకారలోపం కవిప్రయోగాల్లో ఇంకా వెదకి కనుక్కోవలసి ఉం దని పైవాక్యానికి అర్థం. మృగ్యం అంటే వెదకా లని అర్థం. అంటే సూరికి అటువంటిప్రయోగం కావ్యాలలో కనబడలే దన్నమాట. (అంటే ఇత్వం లోపించినరూపాలు కవిప్రయోగాలలో లే వనీ, అందుచేత ఆలక్షణం అంగీకరింపదగినది కా దనీ అభిప్రాయం.)

**17. ముత్తియశబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి.** (ఆచ్ఛి. 23)

'ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు బహుళంబుగా నగు' అనే సూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత సూరి నామాంతంలో ఇయకు ఎత్వం విధించాడు. కన్నియ–కన్నె. కాని అథర్వణుడు, అహోబలుడు మొద లైనకొందఱు పూర్వలాక్షణికులు 'ఇయ' అనేభాగంలో 'ఇ' కారానికి లోపం కూడా వస్తుం దని పేర్కొన్నారు. కన్నియ–కన్య, మొ.

'ముత్తియ' అనేఒక్కశబ్దంలో మాత్రం ఇయలో (ముత్‌త్‌ఇయ) ఇకారలోపం కనబడుతున్నది. ఇకారం లోపిస్తే (ముత్‌త్‌య) (ఒకతకారం గూడా లోపించి) ముత్+య= ముత్య= ముత్యము అని అవుతుంది. ఇది విశేషం. ఈఒక్కరూపంకోసం ఇకారలోపాన్ని సాధారణం చేసి చెప్పరా దని తాత్పర్యం.

కళ్యము, పళ్యము ఇత్యాదిగా ముత్తియేతరశబ్దాల్లో లోపాన్ని ప్రౌఢవ్యాకర్త ప్రదర్శించాడు.

**18. విభక్తినిమిత్తకంబు లయి యాదేశాగమాత్మకంబు లయిన ఇ టి తి వర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.** (అచ్చి. 28)

'ఇటితివర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రానికి తరువాతిసూత్రాలలో ఇ,టి,తి అనేవర్ణాలు విధింపబడ్డాయి. 'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు' అని ఔపవిభక్తికాలు ద్వితీయ మొద లైనవిభక్తులలో ఏకవచనం పరంగా ఉంటే వస్తా యని సూరి చెప్పాడు. 'తి' అనేది మాత్రం కొన్నిశబ్దాలకు అన్నివిభక్తులలో బహువచనంలో కూడా వస్తుంది. ఇలా ఔపవిభక్తికాలు విభక్తిని నిమిత్తంగా చేసుకుని వస్తాయి. ఇంక ఇవి కొన్ని ప్రాతిపదికలకు ఆగమంగా వచ్చి చేరతాయి. ఏమి–ఏమిటికి, అట్టు–అటితికి మొ.చోట్ల ఆగమం. కొన్నిచోట్ల ఆదేశంగా వస్తాయి. ఊరు–ఊరిని, ఏమి–ఏటికి, గోయి–గోతులు మొ.

ఇలా విభక్తిని నిమిత్తంగా చేసుకుని, అచ్చతెలుగుప్రాతిపదికలకు కొన్నిచోట్ల ఆగమంగానూ, కొన్నిచోట్ల ఆదేశంగానూ వచ్చే ఇ–టి–తి అనేవర్ణాలకు ఔపవిభక్తికాలు అని పేరు.

**19. ద్వితీయైకవచనంబు పరం బగునపు డౌపవిభక్తికములు రా వని కొందఱు వక్కాణించిరి.** (అచ్చి. 29)

**20. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధం బగుటంజేసి యనాదరణీయంబు.** ( అచ్చి. 29)

'ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబు లగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో సూరి ఔపవిభక్తికాలు ద్వితీయ మొద లైన విభక్తులలో ఏకవచనాలు పరంగా ఉంటే వస్తా యని చెప్పాడు. అయితే రావిపాటిగురుమూర్తిశాస్త్రి తన తెలుగువ్యాకరణంలో తృతీయాద్యేకవచనాలు పరంగా ఉంటే వస్తా యన్నాడు. కాగా ఔపవిభక్తికాలు ద్వితీయా ఏకవచనం పరంగా ఉంటే రా వని చెప్పిన ట్లయింది. కాని కాలిని, నాగటిని, అటితిని ఇత్యాదిగా లక్ష్యాలలో ద్వితీయైకవచనం పరంగా ఉండగా ఇవి వస్తున్నాయి. అలాగే చింతామణి మొద లైనపూర్వలక్షణగ్రంథాలు ద్వితీయైకవచనపరకతలో రా వని చెప్పలేదు. కాబట్టి పూర్వలక్షణాలకూ లక్ష్యాలకూ విరుద్ధంగా ఉండటంచేత ద్వితీయైకవచనపరకతలో ఔపవిభక్తికాలు రావు అనేఅభిప్రాయం ఆదరింపదగ దనీ, అందువల్ల సూరి ద్వితీయైకవచనపరకతలో

ఔపవిభక్తికాలు వస్తా యనడం లక్ష్యలక్షణ అనుగుణం, కాబట్టి గ్రాహ్యా మనీ తాత్పర్యం.

**21. కొండొకచో నుత్వంబున కిత్వంబు చూపట్టదు.** (ఆచ్ఛి. 36)

'టితివర్ణంబులు పరం బగునపు డుత్వంబున కిత్వం బగు' అనేసూత్రంవివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం 'టి,తి' అనేఔపవిభక్తికాలు పర మైనపుడు ముందరిప్రాతిపదికం చివరిఉత్వానికి ఇత్వాన్ని విధించింది. రెండు – రెండిటిని, అఱ్ఱు – అఱితిని.

టితి వర్ణాలు పరంగా ఉండగా (ఉత్వానికి) రావలసిన ఇత్వం కొన్నిచోట్ల రావడం లే దని పైవాక్యం వివరిస్తున్నది.

నెత్తురు + కు– అనేచోట అంత్యాక్షరానికి 'టి' అనే ఔపవిభక్తికం ఆదేశ మై నెత్తు + టికి అని కాగా, 'టి తి వర్ణంబులు' అనేసూత్రంచేత రావలసినయిత్వం ప్రస్తుతవివరణంచేత రాదు. నెత్తుటికి. ఇలాగే వఱుతన్. ఇక్కడ 'తి' పరంగా ఉండగా ఇత్వం రాలేదు. రెండిటన్ – ఇత్యాదుల్లో ఉన్నయిత్వం నెత్తుట, వఱుతన్ ఇత్యాదుల్లో లేదు. ఇత్వం రాదు కాబట్టి నెత్తిటికి, నుదిటికి, వఱితిన్ ఇత్యాదిగా ఇత్వ మయినరూపా లుండవు.

**22. పక్షమునందు గోరిచేత నూరియం దిత్యాది.** (ఆచ్ఛి. 38)

'ఔపవిభక్తికములతృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత ఔపవిభక్తికశబ్దాలకు పైన ఉన్న తృతీయ, సప్తమి విభక్తులస్థానంలో హ్రస్వ మైనఅకారం బహుళంగా ఆదేశంగా వస్తుంది. 'గోరిచేతన్' అన్నచోట చేత అనేతృతీయకు ఇలా అత్వం రాగా 'గోరన్' అని అయింది. ఇలాగే 'ఊరియందున్' అనేచోట 'అందు' అనేసప్తమికి అత్వం రాగా 'ఊరన్' అని అయింది. బహుళం అనటంచేత అత్వం నిత్యం గాదు. ఒకపక్షంలో రాకపోవచ్చును. అలా అత్వం రానిపక్షంలో తృతీయా, సప్తమీ విభక్తులు అలాగే ఉంటాయి. తృతీయ అలాగే ఉండగా, (గోరన్) 'గోరిచేతన్' అనేవిధంగా ఉంటుంది. సప్తమి అలాగే ఉన్నపుడు (ఊరన్) 'ఊరియందున్' అనేవిధంగా ఉంటుంది.

# కారకపరిచ్ఛేదం

**1. నియతోపస్థితికము ప్రాతిపదికార్థము.** (కార. 1)

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.సూత్రంలోని ప్రాతిపదిక అనేశబ్దం అర్థాన్ని వివరిస్తున్నది.

నియత మైన అర్థముయొక్క ఉపస్థితి ప్రాతిపదికార్థము. అర్థవంతం కావటం అనేది ప్రాతిపదికలక్షణాలలో ఒకటి. అర్థం లేనిశబ్దానికి ప్రాతిపదిక అనేసంజ్ఞ ఉండదు. శబ్దాన్ని ఉచ్చరించినవెంటనే నియతంగా అంటే తప్పకుండా స్ఫురించేఅర్థం ప్రాతిపదికార్థం. రామ అనేశబ్దం ఉచ్చరించినవెంటనే 'దశరథుని కొడుకు' అనేవిషయం స్ఫురిస్తుంది. అలా స్ఫురించేదే ప్రాతిపదికార్థం. ఈఅర్థంలో ప్రాతిపదికపైని 'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వస్తుంది. రామ అనేప్రాతిపదికపై దశరథునికొడుకు అనేఅర్థంలో ప్రథమావిభక్తి వచ్చి, రాముఁడు. పరశురాముడు అనేఅర్థం ఇచ్చేటపుడు అఅర్థంలోనే ప్రథమ వస్తుంది. ప్రాతిపదికకు అనేక మైనఅర్థాలు ఉన్నపుడు ఏఅర్థం వివక్షిస్తే ఆఅర్థంలోనే ప్రథమ వస్తుంది.ఇలాగే వనము, ధేనువు, మొ.

**2. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినది గావునఁ దద్వాచక మగురామ శబ్దమునకుఁ బ్రథమ యయ్యెను.** (కార. 1)

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'ఉక్త' అనేశబ్దం అర్థాన్ని వివరిస్తున్నది.

ఉక్తం అంటే చెప్పబడినది. క్రియావిభక్తిచేత చెప్పబడటం ఉక్తార్థం. రాముఁడు రావణుని సంహరించెను. ఈవాక్యంలో సంహరించెను అనేది క్రియాపదం. ఇది సంహరించటం అనేవ్యాపారం (పని) చేసినవాడిని (రాముడిని) అంటే కర్తను తెలియజేస్తున్నది. సంహరించెను అనేక్రియాపదంలో కర్త్రర్థంలో వచ్చిన డుజు (దానికి ఆదేశ మైన 'ఎను') అనేక్రియావిభక్తి కర్త అయిన రాముడిని తెలియజేస్తున్నది. కాబట్టి కర్తను బోధించే 'రామ' అనేశబ్దానికి 'చేతవర్ణకంబు కర్త కగు' అని రావలసిన 'చేత' అనేతృతీయావిభక్తిని బాధించి, 'ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి, రాముఁడు అని ప్రయోగింపబడింది.

'రామునిచేత రావణుడు సంహరింపఁబడెను' అనేవాక్యంలో క్రియావిభక్తిచేత చెప్పబడకపోవటంచేత కర్తకు 'చేత' (తృతీయా)విభక్తే వచ్చింది.

**3. ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచక మగురావణ శబ్దమునకుఁ బ్రథమ యయ్యెను.** (కార. 1)

'ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'ఉక్త' అనేశబ్దం అర్థాన్ని వివరిస్తున్నది.

ఉక్తం అంటే చెప్పబడినది. క్రియావిభక్తిచేత చెప్పబడటం ఉక్తార్థం. రామునిచేత రావణుఁడు సంహరింపఁబడెను. ఈవాక్యంలో సంహరింపఁబడెను అనేది క్రియాపదం. ఇది సంహరింపబడినవాడిని (రావణుడిని) అంటే కర్మను తెలియ జేస్తున్నది. సంహరింపబడెను అనేక్రియాపదంలో కర్మార్థంలో వచ్చిన పడుజీ అనే అనుబంధంమీది 'డుజు' (దానికి ఆదేశ మైన 'ఎను') అనేక్రియావిభక్తి కర్మ అయిన రావణుడిని తెలియజేస్తున్నది. కాబట్టి కర్మను తెలియజేసే 'రావణ' అనేశబ్దానికి 'కర్మంబున ద్వితీయ యగు' అని రావలసిన ద్వితీయావిభక్తిని బాధించి, 'ప్రాతిపదిక సంబోధనోక్తార్థంబులం బ్రథమ యగు' అనేసూత్రంచేత ప్రథమావిభక్తి వచ్చి, 'రావణుఁడు' అని ప్రయోగింపబడింది.

'రాముడు రావణుని సంహరించెను' అనేవాక్యంలో క్రియావిభక్తిచేత చెప్పబడక పోవటంచేత కర్మకు ద్వితీయావిభక్తే వచ్చింది.

**4. ధాత్వర్థఫలాశ్రయంబు కర్మంబు నాఁబడు. (కార. 2)**

**5. పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మ మయ్యె నని యెఱుంగునది.** (కార. 2)

'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని కర్మసంజ్ఞ అర్థాన్ని వివరిస్తున్నది.

ధాతువుకు అర్థాలు రెండు. 1. వ్యాపారం. 2. ఫలం. ఇందులో ఫలం దేనిని ఆశ్రయించి ఉంటుందో దానికి కర్మ అని పేరు. ఉదా. దేవదత్తుడు వంటకమును వండెను. ఇక్కడ వండెను అనేక్రియలో ధాతువు వండు. దీనికి వంట చేయటం అనే వ్యాపారం (పని), ఒకఅర్థం. వంట అంటే పాకం. అంటే ఉడికినపదార్థం ఫలం. పైవాక్యంలో వంటకము అనేపదం వంటచేయటం అనేవ్యాపారానికి ఫలిత మైనదానిని తెలియజేస్తున్నది. కాబట్టి అది కర్మ. అందుచేత వంటక అనేకర్మను తెలిపేశబ్దానికి 'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంచేత ద్వితీయ వచ్చి, 'వంటకమును' అని అయింది.

**6. ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్త నాఁబడు.** (కార. 3)

**7. చేయుట కాశ్రయుఁ డగుటంజేసి దేవదత్తుఁడు కర్త యయ్యె.** (కార. 3)

'చేతవర్ణకంబు కర్త కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని కర్త అనేసంజ్ఞను వివరిస్తున్నది.

ధాతువుకు అర్థాలు రెండు. 1. వ్యాపారం. 2. ఫలం. ఇందులో వ్యాపారం అంటే పని, దేనిని ఆశ్రయించిఉంటుందో దానికి కర్త అని పేరు. ఉదా. దేవదత్తునిచేత వంటకము వండబడెను. ఇక్కడ వండబడెను అంటే వంట చేయబడింది అని అర్థం. వండబడెను అనేక్రియలో ధాతువు 'వండు'. దీనికి వంట చేయటం అనేవ్యాపారం (పని), ఒకఅర్థం. వంట (పాకం) అంటే ఉడికినపదార్థం ఫలం. పైవాక్యంలో వంటచేయటం అనేవ్యాపారం దేవదత్తుడిని ఆశ్రయించిఉన్నది. వండటం అనేపని చేసింది దేవదత్తుడు కాబట్టి దేవదత్తుడు కర్త. అందుచేత కర్తను తెలిపే దేవదత్త అనేశబ్దానికి 'చేత వర్ణకంబు కర్త కగు' అనేసూత్రంచేత చేత అనేతృతీయావిభక్తి వచ్చి, దేవదత్తునిచేత అని అయింది.

**8. ఫలసాధనయోగ్యం బగుపదార్థము హేతువు.** (కార. 4)

'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనేసూత్రంలోని హేతువు అనేసంజ్ఞను వివరిస్తున్నది ఈవాక్యం.

'ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు' ఫలాన్ని సాధించడానికి యోగ్య మైనపదార్థానికి హేతువు అని పేరు. ఉదా. విద్యచేత యశంబు గలుగు. ఇక్కడ ఫలం యశస్సు. అది సిద్ధించటానికి తగినపదార్థం అంటే కారణం విద్య. కాగా, యశస్సు అనేఫలాన్ని సాధించటానికి యోగ్య మైనపదార్థం కాబట్టి విద్య హేతువు అవుతున్నది. పైసూత్రంచేత హేతువును తెలియజేసేశబ్దానికి 'చేత' అనేతృతీయావిభక్తి ప్రత్యయం వస్తుంది. కాబట్టి 'విద్యచేత' అని అయింది.

**9. క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు.** (కార. 4)

'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనేసూత్రంలోని కరణము అనేసంజ్ఞను వివరిస్తున్నది ఈవాక్యం.

'క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు'. క్రియ అంటే పని సిద్ధించటానికి ప్రధాన మైనసాధనానికి కరణం అని సంజ్ఞ. ఉదా. ఖడ్గంబుచేత ఖండించె. ఖండించుట అనేపని జరగటానికి మూల మైనసాధనం ఖడ్గం. కాబట్టి అది కరణం. కరణాన్ని తెలియజేసే ఆశబ్దానికి పైసూత్రంచేత 'చేత' అనేతృతీయావిభక్తి వచ్చి– 'ఖడ్గముచేత'

అని అయింది. బహుళం అనడంచేత చేతవిభక్తి రానిపక్షంలో 'కరణసహార్థతుల్యార్థ యోగంబునం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రంచేత 'తోడ' అనే తృతీయావిభక్తి వచ్చి 'ఖడ్గంబుతోడ ఖండించె' అని అవుతుంది.

**10. పక్షంబున వలనవర్ణకం బగు.** (కార. 4)

'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పక్షంబున – అంటే చేతవిభక్తి రానిపక్షంలో హేతువుకు వలన అనేపంచమీవిభక్తి వస్తుంది అని ఈవాక్యానికి అర్థం. పైసూత్రంచేత ఫలసాధనయోగ్యం బగుపదార్థానికి అంటే హేతువుకు చేత అనేతృతీయావిభక్తి బహుళంగా వస్తుంది. ఉదా. విద్యచేత యశంబు గలుగు. 'చేత'విభక్తి రావటం బహుళం కాబట్టి ఒకపక్షంలో రాదు. అప్పుడు ప్రస్తుతవివరణాన్ని అనుసరించి 'వలన' ప్రత్యయం వచ్చి 'విద్యవలన యశంబు గలుగు' అనేవిధంగా వ్యవహరింపబడుతుంది.

**11. పక్షంబునం దోడవర్ణకం బగు.** (కార. 4)

'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'పక్షంబున' అంటే చేతవిభక్తి రానిపక్షంలో కరణానికి 'వలన' అనేపంచమీవిభక్తి వస్తుంది అని ఈవాక్యానికి అర్థం. పైసూత్రంచేత క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకం బగుపదార్థానికి అంటే కరణానికి 'చేత' అనేతృతీయావిభక్తి బహుళంగా వస్తుంది. ఉదా. ఖడ్గంబుచేత ఖండించె. 'చేత'విభక్తి రావటం బహుళం కాబట్టి ఒకపక్షంలో రాదు. అప్పుడు అంటే చేతవిభక్తి రానిపక్షంలో 'కరణసహార్థతుల్యార్థయోగంబునం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రంచేత 'తోడ' అనేతృతీయావిభక్తి వచ్చి 'ఖడ్గంబుతోడ ఖండించె' అని అవుతుంది.

**12. పక్షంబున వలనవర్ణకం బగు.** (కార. 4)

'చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'పక్షంబున' అంటే 'చేత'విభక్తి రానిపక్షంలో అని అర్థం. గ్రహణం మొద లైన అర్థంతో అన్వయం ఉన్నసందర్భంలో పంచమికి బదులుగా చేత అనేతృతీయావిభక్తి వస్తుం దని పైసూత్రం చెపుతున్నది. చేతవిభక్తి రావటం బహుళం గాబట్టి రానిపక్షంలో 'వలన' అనేపంచమీవిభక్తే వస్తుం దని అర్థం. ఉదా. జరాసంధుండు రాజులచేత

కప్పంబు గొనియె. కొనియె అంటే గ్రహించాడు అని అర్థం. ఈఅర్థంతో అన్వయం ఉండటంచేత 'అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాద గ్రహణ భవన త్రాణ విరా మాంతర్ధి వారణంబు లెద్దాన నగు దానికి వలనవర్ణకం బగు' అనేసూత్రంచేత 'వలన' అనేపంచమీవిభక్తి రావలసిఉండగా ఆపంచమికి బదులుగా ప్రస్తుతసూత్రంచేత 'చేత' అనేతృతీయావిభక్తి వచ్చింది. బహుళం గావటంచేత చేతవిభక్తి రానిపక్షంలో 'అపాయ భయ–' ఇత్యాదిసూత్రంప్రకారం 'వలన' అనేపంచమీవిభక్తి వచ్చి, 'జరాసంధుండు రాజులవలన కప్పంబు గొనియె' అని అవుతుంది.

**13. తృతీయ కనుటంజేసి చైత్రునకు మైత్రుండు తుల్యుం డని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.** (కార. 5)

'కరణసహార్థతుల్యార్థయోగంబులం దృతీయకుం దోడవర్ణకం బగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత తుల్యార్థంతో అన్వయం ఉన్నసందర్భంలో తృతీయావిభక్తికి తెలుగులో తోడ అనేప్రత్యయం వస్తుంది. ఉదా. చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు. తృతీయకు అనటంచేత తృతీయే కానిపక్షంలో షష్ఠి వస్తుంది. అలా వచ్చినషష్ఠికి 'కు' అనేవిభక్తి వస్తుంది. ఉదా. చైత్రునకు మైత్రుండు తుల్యుండు.

**14. ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.** (కార. 6)

'వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడ, కువర్ణకంబులు ప్రాయికంబుగ నగు' అనేసూత్రంలోనిప్రాయికశబ్దానికి ప్రయోజనాన్ని యీవాక్యం వివరిస్తున్నది.

'వచి' ధాతువుయొక్క అర్థం గలిగిన అను, పలుకు, మొద లైన తెలుగుధాతువుకు సంబంధించినదీ, ముఖ్యం కానిదీ, అయిన కర్మకు, తోడ అనే తృతీయ, లేదా 'కు' అనే షష్ఠీవిభక్తి తఱచుగా వస్తాయి. 'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంచేత ముఖ్య మైనా, అముఖ్య మైనా కర్మకు ద్వితీయావిభక్తి ప్రాప్తిస్తుంది. దాన్ని బాధించి యీసూత్రంచేత 'తోడ – కు వర్ణకాలు వస్తాయి. చైత్రుని తోడ ని ట్లనియె, చైత్రునకు ని ట్లనియె మొ.

తోడ–కు వర్ణకాలు రావడం ప్రాయికం అనడంచేత అరుదుగా అవి రాకుండాపోయేఅవకాశం ఉంది. అవి రానపుడు బాధ లేదు గాబట్టి 'కర్మంబున ద్వితీయ యగు' అనేసూత్రంచేత ద్వితీయావిభక్తి వస్తుంది. చైత్రు(ని) ని ట్లనియె.

**15. నియమపూర్వకవిద్యాస్వీకారం బుపయోగం బనంబడు.** (కార. 7)

'ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకం బగు'అనేసూత్రం వివరణంలోనిది

ఈవాక్యం. చూ. పారిభాషికపదం. ఉపయోగము.

**16. త్యాగోద్దేశంబు సంప్రదానంబు నాఁబడు.** (కార. 8)

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

చూ. పారిభాషికపదం. సంప్రదానము.

**17. కొన్నియెడల నుద్దేశమాత్రంబున కగు.** (కార. 8)

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రకారం సంప్రదానానికి అంటే త్యాగాన్ని ఉద్దేశించినదానికి చతుర్థీవిభక్తి రావలసిఉంది. కాని కొన్ని సందర్భాలలో త్యాగం లేకపోయినా, కేవలం ఉద్దేశార్థంలోనే చతుర్థీవిభక్తి రావటం కనిపిస్తున్నది. ఉదా. పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. ప్రయత్నం పురుషార్థాన్ని ఉద్దేశించి జరిగింది. కాని ఇక్కడ త్యాగం లేదు. అయినా, ఉద్దేశింపబడిన పురుషార్థాన్ని తెలియజేసే 'పురుషార్థ'శబ్దానికి చతుర్థి వచ్చి 'కొఱకు' ప్రత్యయంతో 'పురుషార్థంబుకొఱకు' అని అయింది. లేదా కయిప్రత్యయంతో 'పురుషార్థంబుకయి' అని అయినా ప్రయోగించుకోవచ్చును.

**18. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱుచుగఁ బ్రయోగంబులం గానంబడియెడి.** (కార. 8)

'సంప్రదానంబునకుం జతుర్థి యగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం సంప్రదానానికి చతుర్థీవిభక్తిని విధించింది. ఎవరిని ఉద్దేశించి 'త్యాగం' అంటే ఇవ్వడం జరుగుతుందో – (ఎవ్వరికి ఇవ్వడం జరుగుతుందో) అది సంప్రదానం. దానికి కొఱకు, కయి అనే చతుర్థీవిభక్తులు వస్తాయి. రామునికొఱకు, లేదా రామునికై కన్య నిచ్చెను. త్యాగం లేకపోయినా ఉద్దేశించినదానికి కూడా చతుర్థి వస్తుంది. 'పురుషార్థంబుకొఱకు' యత్నింపవలయు.

ఈరెండుచోట్ల గూడా చతుర్థీవిభక్తికి బదులుగా 'కు' అనేషష్ఠీవిభక్తే ఎక్కువగా కవిప్రయోగాల్లో కనబడుతున్న దని యీవాక్యం చెప్తున్నది. రామునకు గన్య నిచ్చెను. పురుషార్థమునకు యత్నింపవలయు.

**19. పంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు.** (కార. 9)

'అపాయభయజుగుప్సాపరాజయప్రమాదగ్రహణభవనత్రాణవిరామాంతరివారణంబు లెద్దాన నగు దానికి వలనవర్ణకం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'కొండొకయెడల' అంటే కొన్ని అర్థాలలో, అరుదుగా అని అర్థం. పంచమికి అంటే 'వలన' అనేపంచమీవిభక్తికి. షష్ఠీవిభక్తి అంటే 'కు' అనేవిభక్తి.

పైసూత్రంప్రకారం అపాయం మొద లైనఆయాఅర్థాలలో 'వలన' అనేపంచమీ విభక్తి వస్తుంది. కాని 'భయం' మొద లైనకొన్ని అర్థాలలో పంచమికి బదులుగా 'కు' అనేషష్ఠీవిభక్తి కనబడుతున్న దని ఈవాక్యం వివరిస్తున్నది. ఉదా. చోరునకు వెఱచె. ఇక్కడ 'భయ' అర్థంలో 'వలన' ప్రత్యయానికి బదులుగా 'కు' అనేషష్ఠీవిభక్తి వచ్చింది. 'వలన' వస్తే 'చోరునివలన వెఱచె'. ఇలాగే 'పాపంబున కేవగించె'. – ఇక్కడ 'పాపంబువలన నేవగించె' అని జుగుప్సార్థంలో పంచమికి బదులుగా షష్ఠి. 'అధ్యయనంబునకు డస్సె' అనేచోట పరాజయంలో వలనకు 'కు' షష్ఠి. 'పాడికిం బరాకు వడియె' – ఇక్కడ ప్రమాదార్థంలో పంచమికి షష్ఠి.'మనువునకు ఇక్ష్వాకుండు పుట్టె'. భవనంలో షష్ఠి.

**20. వనమునుంచి, ధనమునుంచి యని యుంచిశబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు కాని యది సాధుకవిప్రయోగారూఢంబు గా దని యెఱుంగునది.** (కార. 11)

'ఉండిశబ్దము పరం బగునపుడు వలనకు ద్వితీయాసప్తములు ప్రాయికంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అపాయం మొద లైనఅర్థాలలో వలన అనేపంచమీవిభక్తి వస్తుంది. దానికి 'ఉండిపదం బొకానొకచో వలనవర్ణకంబున కనుప్రయుక్తం బగు' అని వలనపైన 'ఉండి' అనేపదం చేరుతుంది. ఉదా. వనమువలననుండి వచ్చె. వనమునందుండి వచ్చె. మొ. కాని ఇక్కడ కొందఱు 'వనమునుంచి, ధనమునుంచి' అనేవిధంగా 'ఉండి'కి బదులుగా, 'ఉంచి' అనేపదం ప్రయోగించటం కనబడుతున్నది. కాని ప్రామాణికు లైనమహాకవులు ఎక్కడా, 'ఉంచి' అనేపదాన్ని ప్రయోగించలేదు. కాబట్టి వనమునుంచి, ధనమునుంచి అనేవిధంగా 'ఉంచి' పదంతో వ్యవహరించటం సాధువు కా దని తాత్పర్యం. వనమునుండి, ధనమునుండి అనేవిధంగా ఉండి పదప్రయోగమే సాధు వని అర్థం. 'ఉండి పదం బొకానొకచో' అనేసూత్రంచేత సూరి కూడా ఉండిశబ్దాన్నే విధించాడు.

**21. ఇచట షష్ఠియు నగు.** (కార. 12)

'కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం అన్యార్థాదులతో అన్వయం ఉన్నపుడు 'కంటె' అనేపంచమీవిభక్తి ప్రత్యయం వస్తుం దని చెప్పింది. 'రామునికంటె నన్యుడు ధానుష్కుడు లేడు'. ఇక్కడ అన్యార్థాదియోగంలో 'కంటె' పంచమికి బదులుగా షష్ఠీవిభక్తి వస్తుంది. ఆషష్ఠీవిభక్తికి 'కు' అనేప్రత్యయం వస్తుం దని ఈవివరణం తాత్పర్యం. 'రామునకు నన్యుండు ధానుష్కుండు లేడు'. మొ.

**22. ఎచట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు గలిగియుండు నచటం బంచమి యగు. ఆపంచమికిం గంటెవర్ణకం బగు నని యర్థము.** (కార. 13)

చూ. 'కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు' సూత్రవ్యాఖ్య.

**23. ఇచట వలనవర్ణకంబు నగు.** (కార. 14)

'పట్టివర్ణకంబు హేతువు లగుగుణక్రియల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం హేతు వయినగుణవాచకానికి, క్రియావాచకానికి 'పట్టి' అనేపంచమీవిభక్తి విధింపబడింది. ఉదా. జ్ఞానమునుబట్టి ముక్తు డగును. వచ్చుటనుబట్టి ధన్యుడ నయితిని. ఇక్కడ పట్టి మాత్రమే కాక ఒకపక్షంలో 'వలన' అనేపంచమీవిభక్తి కూడా వస్తుం దని ఈవివరణవాక్యం చెపుతున్నది. 'వలన' ప్రత్యయాన్ని విధించిన అపాయాదిఅర్థాలలో హేతువు లేదు. ప్రస్తుతవివరణాన్ని అనుసరించి హేతువుకు 'పట్టి' వర్ణకం రాకుండా ఒకపక్షంలో 'వలన'వర్ణకం వస్తుం దని గ్రహించాలి. 'జ్ఞానమువలన ముక్తుం డగు', 'నీవు వచ్చుటవలన ధన్యుడ నైతిని'. మొ. 'విద్య(చేత)వలన యశంబు గలుగు' అన్నపుడు హేతువుకు 'చేత' రానిసందర్భంలో 'వలన' రావటం గమనించవచ్చు.

**24. కువర్ణకంబును గొన్నియెడల సంబంధంబునం దగు.** (కార. 15)

'శేషషష్ఠికి యొక్కయు నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం శేషార్థంలో సంస్కృతానుసారంగా వచ్చేషష్ఠీవిభక్తికి తెలుగులో 'యొక్క' అనే షష్ఠీవిభక్తి వస్తుం దని చెప్తున్నది. శేషం అంటే సంబంధం. సంబంధార్థంలో దేనికి సంబంధించిందో దానిని తెలియజేసేశబ్దానికి యొక్క అనే షష్ఠీవిభక్తిప్రత్యయం వస్తుంది. రామునియొక్క తమ్ముడు. కు విభక్తి వస్తే 'రామునకు దమ్ముడు.'

సంబంధార్థంలో ఇక్కడ వస్తున్న (షష్ఠి) యొక్క మాత్రమే, కాకుండా 'కు' అనేషష్ఠీవిభక్తి గూడా కొన్నిచోట్ల వస్తున్న దని యీవాక్యం చెప్పడంవల్ల సంబంధార్థంలో

తెలుగులో షష్ఠీవిభక్తే అయినా 'లోపల' రాదు. 'యొక్క' లేదా 'కు' మాత్రమే వస్తాయి.

**25. జాతిగుణక్రియాసంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు.** (కార. 16)

**26. ఎద్దానివలన నిర్ధారణం బగు నచ్చట షష్ఠికి లోపలవర్ణకం బగు.** (కార. 16)

చూ. 'నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు' సూత్రవ్యాఖ్య.

**27. ఇట సప్తమియుం గలదు.** (కార. 16)

'నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం నిర్ధారణంలో షష్ఠీవిభక్తి, దానికి లోపల అనేప్రత్యయమూ విధింపబడ్డాయి. ఉదా. దేవతలలోపల శ్రీకాంత యధికురాలు. ఇట అంటే ఇక్కడ నిర్ధారణంలో షష్ఠీవిభక్తికి మారుగా సప్తమీవిభక్తి రావటం కూడా ఉన్న దని ఈవివరణవాక్యం తెలుపుతున్నది. సప్తమిలో అందు, న అని రెండు ప్రత్యయాలు ఉన్నాయి. కాబట్టి యథావకాశంగా ఏ దైనా చేసుకోవచ్చు. దేవతలయందు శ్రీకాంత యధికురాలు. గోగణమున కపిల బహుక్షీర. మొ.

**28. అధికరణంబు నా నాధారంబు.** (కార. 17)

'అధికరణంబునకు సప్తమి యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

చూ. పారిభాషికపదం. అధికరణము.

**29. ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకం బని యాధారంబు త్రివిధంబు.** (కార. 17)

'అధికరణంబునకు సప్తమి యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

చూ. పారిభాషికపదం. ఔపశ్లేషికము, వైషయికము, అభివ్యాపకము.

**30. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు.** (కార. 22)

'జడంబుతృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రం అచేతనశబ్దాలమీద తృతీయకూ, సప్తమికీ బదులుగా ద్వితీయ బహుళంగా వస్తుం దని చెప్పింది. కోలచేత గూల్చె – కోలన్ గూల్చె, లంకయందు పుట్టె – లంకం బుట్టె మొ.

సూత్రంలోనిబహుళపదంచేత కొన్నిస్థలాల్లో ఈకార్యానికి అప్రవృత్తి. ఉదంత మయినజడవాచకాలకు పైన తృతీయా,సప్తములకు రావలసినద్వితీయ ఏకవచనంలో రాదు. బాణముచేత కూల్చె. ఇక్కడ 'బాణము' ఉదంతం కావడంవల్ల, ఏకవచనంలో ఉండడంవల్ల తృతీయకు ద్వితీయ రాదు. 'బాణమును గూల్చె' అని కాదు. ఇలాగే జలమునందు ఉండు – జలము నుండు, నని ద్వితీయ రాదు.

ఏకవచనంలోనే అప్రవృత్తి. బహుత్వార్థంలో తృతీయాసప్తములకు ద్వితీయ వస్తుంది. బాణములచేత గూల్చె – బాణములను గూల్చె, జలములందు ఉండు – జలముల నుండు మొ.

**31. బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమ రాదు** (కార. 23)

'జడంబుద్వితీయకుం బ్రథమ బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం జడవాచకాలకు పై నున్నద్వితీయావిభక్తికి ప్రథమావిభక్తిని బహుళంగా విధించింది. ఉదా. పూవులను దెచ్చె. ప్రథమ రాగా – పూవులు దెచ్చె మొ.

ఈసూత్రంలోనిబహుళపదంచేత కొన్నిచోట్ల ఈకార్యానికి అప్రవృత్తి. అప్రవృత్తి స్థలాలను ఈవాక్యం పేర్కొంటున్నది.

'జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు' అనేసూత్రంచేత తృతీయాసప్తములకు వచ్చినద్వితీయ జడవాచకాలమీద ఉన్నా, ప్రస్తుతసూత్రంచేత ఆద్వితీయకు ప్రథమ రాదు.

కోలచేత కూల్చె – తృతీయకు ద్వితీయ రాగా, కోలను గూల్చె. తృతీయకు వచ్చిన ఈద్వితీయకు ప్రథమ రాదు. 'కోల కూల్చె' అని కాదు. అలాగే 'లంకయందు పుట్టె' – సప్తమికి ద్వితీయ రాగా – లంకను బుట్టె. సప్తమి కయిన యీద్వితీయకూ ప్రథమ రాదు. 'లంక పుట్టె' నని గాదు.

**32. అగు మొద లగునవి భవత్యర్థకములు.** (కార. 28)

చూ. 'భవత్యర్థవ్యవహితంబు లగువిశేషణంబులకుం బ్రథమ యగు' సూత్రవ్యాఖ్య.

**33. ఇచట మఱియుం బ్రయోగవైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది.** (కార. 31)

'ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబు లన్నిటి కయిపదం బనుప్రయుక్తం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం ప్రకారం విశేషణవిశేష్యాలకు నడుమ ధాతుజవిశేషణంతో వ్యవధానం ఉన్నపుడు విశేషణాలకు అన్నిటికి చివర అయి అనేపదం చేరవలసిఉంది. కాని ఇక్కడ ప్రయోగాలలో పెక్కు విశేషాలు కనబడుతున్నాయి.

1. 'ఆద్యుడు, అప్రమేయుడు, అఖిలసేవ్యుడును అయి యెసంగెదుహరిని' అని ఉండవచ్చు.

ఇక్కడ మొదటివిశేషణాలకు అయి పదం చేరలేదు. చివరిదానికి ఒక్కదానికి మాత్రమే చేరింది. దానికి ముందు సముచ్చయాద్యర్థక'ను'శబ్దం చేరింది.

2. 'ఆద్యుడును, అప్రమేయుడును, అఖిలసేవ్యుడును అయి యెసంగెదుహరిని' ఇక్కడ అయిపదం లేని మొదటివిశేషణాలకు అన్నింటికి చివర నుశబ్దం చేరింది.

3. 'ఆద్యుడు, అప్రమేయుడు, అఖిలసేవ్యుడు అయి యెసంగెదుహరిని' ఇక్కడ ఏవిశేషణానికి కూడా ను శబ్దం చేరలేదు. ఇంక చివరివిశేషణానికి మాత్రం అయిపదం చేరింది.

ఇలా విశేషణవిశేష్యాలకు ధాతుజవిశేషణంతో వ్యవధానం ఉన్నపుడు అనేక మైనవిశేషాలు ఉండటం కవులప్రయోగాలను చూసి తెలిసికోవలసిఉన్న దని ఈవివరణం తాత్పర్యం.

**34. ఇకారంబుమీఁదికునువుక్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు ననుసూత్రముచేత వునుల కిత్వం బగు.** (కార. 34)

'ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కత్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు' అనేసూత్రంచేత ఏకత్వంలో ఆగమంగా వచ్చే వు,ను అనేవర్ణాలు ఇకారాంతా లయినవిశేషణాలమీద ఉన్నపక్షంలో వాటికి 'ఇగ్లౌరాయుగంతంబుల...' అనేసూత్రం ప్రకారం వును వర్ణాలలోనిఉత్వంస్థానంలో ఇత్వం వస్తుం దని అర్థం. '(నీవు) సుకృతి' అన్నపుడు యుష్మద్విశేషణం అయిన సుకృతి శబ్దం మీద 'వు'వర్ణం ఆగమ మై, 'సుకృతివు' అని ఉండగా 'ఇకారంబుమీది..' అనేసూత్రంచేత వువర్ణంలోనిఉత్వానికి ఇత్వం వచ్చి 'సుకృతివి' అని అవుతుంది. ఇలాగే అస్మద్విశేషణ మైనపుడు నువర్ణం ఆగమం కాగా, (నేను) సుకృతిను అన్నపుడు ఇలాగే ఇత్వం వచ్చి 'సుకృతిని' అని అవుతుంది. బహుత్వంలో వచ్చే 'రు,ము'లు మాత్రం ఎపుడూ ఇకారంమీద ఉండవు. ఇకారాంతాలు

కూడా బహుత్వంలో ఉవర్ణకంచేత ఉదంతాలు అవుతాయి. కాగా బహుత్వంలో ఇకారాంతాలు ఉండవు. అందుచేత బహుత్వంలో వచ్చే 'రుము'లకు ఇత్వం వచ్చే అవకాశమే లేదు. అందుకే సూరి 'వునుల కిత్వం బగు' అన్నాడు.

**35. గర్వగరిష్ఠం దగునన్ను, మీరలు పెద్దలు ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితము లయ్యె.** (కార. 34)

'ఈయాగమంబులు పరంబు లగునపు డుత్వంబున కుత్వం బగు' అనేసూత్రం వివరణంలోనిఈవాక్యం 'ప్రథమాంతంబు లగుయుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వునులును, బహుత్వంబున రుములు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు' అనేసూత్రంలోని ప్రాయికశబ్దానికి ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

యుష్మదస్మద్విశేషణాలకు 'వు,ను,రు,ము' అనేఆగమాలు ప్రాయికంగా వస్తా యని చెప్పటంచేత ఇవి నిత్యం గా దని తెలుస్తున్నది. కాబట్టి అరుదుగా ఈఆగమాలు రాకపోవచ్చును. 'గర్వగరిష్ఠం డగు నన్ను.' ఇక్కడ 'గర్వగరిష్ఠుండు' అనేది అస్మద్విశేషణం. ఏకత్వంలో ఉన్నది కాబట్టి ను అనేవర్ణం ఆగమంగా వచ్చి 'గర్వగరిష్ఠుండ నగునన్ను' అని కావాలి. కాని నువర్ణం ఆగమం కాలేదు. పైసూత్రంలోని ప్రాయికశబ్దంచేత ఆగమం రాకపోవటం లక్షణసిద్ధమే, కాబట్టి ఆగమం కానిరూపం సాధువే అవుతున్నది. ఇలాగే 'మీరలు పెద్దలు'. ఇక్కడ పెద్దలు అనేది యుష్మద్విశేషణం. బహుత్వంలో ఉన్నది. 'రు' ఆగమం కావాలి. 'పెద్దలరు' అని కావాలి. కాని ఆగమం రాలేదు. ప్రాయికశబ్దాన్ని అనుసరించి ఆగమం రాకపోవటం సాధువే.

**36. పూర్వ మిది పర మిది యనునియమ మపేక్షింపక వాక్యమం దెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపఁదగు.** (కార. 37)

చూ. 'ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుం బ్రయోగింపం జను' అనేసూత్రవ్యాఖ్య.

**37. ఏనిప్రభృతిశబ్దంబులు కొన్ని నియమసాపేక్షంబు లయియుండు.** (కార. 37)

'ఏకవాక్యంబునం దొకానొక్కండు దక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపం జను' అనేసూత్రం వాక్యంలో ఈపదంతర్వాత ఈపదం ఉండాలి అనేక్రమం అపేక్ష లేకుండా పదా లన్నీ యథేచ్ఛగా ప్రయోగించుకోవచ్చు నని చెప్తున్నది. గాలి చల్లగా వీచెను, చల్లగా గాలి వీచెను మొ.

సూత్రంలో 'ఒకానొక్కండు దక్క' అనడంచేత కొన్నిపదాలకు క్రమాపేక్ష ఉంటుం

దని తెలుస్తున్నది. దాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. 'ఏని' మొద లైనశబ్దాలు కొన్ని ఈపదం దీనితర్వాతనే ఉండాలి అనేక్రమంయొక్క అపేక్ష కలిగిఉంటా యని తాత్పర్యం.

'రాము నే సీత నేఁ గొల్తు' అనేచోట 'ఏ రాముని సీతఁ గొల్తు నే' ఇత్యాదిగా ప్రయోగిస్తే వివక్షితార్థం కుదరదు. ఇక్కడ 'ఏని' పదం నియమిత మైనచోటనే ప్రయోగించాలి. కాని క్రమనిరపేక్షగా ప్రయోగించడానికి వీలు లేదు.

# సమాసపరిచ్ఛేదం

**1. పృథగ్ఖ్యాతంబు లగునర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు.** (సమా. 1)

**2. పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబుల కేకార్థమునందు వృత్తి సామర్థ్యము.**

చూ. పారిభాషికపదం. సామర్థ్యము.

**3. సాంస్కృతికం బని యాచ్ఛికం బని, మిశ్రం బని సమాసంబు త్రివిధంబు.** (సమా. 2)

**4. అందు సాంస్కృతికంబు సిద్ధం బని, సాధ్యం బని ద్వివిధంబు.** (సమా. 2)

**5. కేవలసంస్కృతశబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు.** (సమా. 2)

**6. సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు నాఁబడు.** (సమా. 2)

'సాంస్కృతికాచ్ఛికమిశ్రబేధంబుచే సమాసంబు త్రివిధంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రాన్ని అనుసరించి తెలుగులో సమాసం మూడువిధాలు. 1. సాంస్కృతికం. 2. ఆచ్ఛికం. 3. మిశ్రం. సంస్కృతానికి సంబంధించినసమాసం సాంస్కృతికం. ఇది రెండువిధాలుగా ఉంటుంది. 1. సిద్ధం. 2. సాధ్యం. కేవలం సంస్కృతశబ్దాలతో ఏర్పడినసమాసం సిద్ధం. ఈసమాసం సంస్కృతంలోనే ఏర్పడి సమాసప్రాతిపదిక తెలుగులో ప్రవేశిస్తుంది. తెలుగులోకి వచ్చేటప్పటికే ఈసమాసం (సంస్కృతంలో) సిద్ధం అయిఉన్నది కాబట్టి ఇది సిద్ధసమాసం. ఉదా. రాజాజ్ఞ. రాజ్ఞః ఆజ్ఞా అనేవిగ్రహంచొప్పున సంస్కృతంలో (సమాసంగా) ఏర్పడిన 'రాజాజ్ఞా' అనేసమాసం ప్రాతిపదిక ఐ, తెలుగులోకి వచ్చి, తుదిదీర్ఘానికి హ్రస్వం మొద లైనకార్యాలతో రాజాజ్ఞ అని అయింది. ఇక్కడ 'రాజ ఆజ్ఞ' అనేశబ్దాలసమాసం తెలుగులో చేయలేదు. సంస్కృతంలోనే సిద్ధం కాబట్టి ఇది సిద్ధ(సాంస్కృతిక)సమాసం.

సంస్కృతశబ్దాలను తెలుగులో ముందుగా తత్సమాలుగా చేసుకుని తత్సమ

శబ్దాలకు తెలుగులో సమాసం చేస్తే అది సాధ్యసమాసం. రాజన్ శబ్దం తత్సమంగా తెలుగులో రాజు. ఆజ్ఞాశబ్దం తత్సమంగా తెలుగులో ఆజ్ఞ. ఇలా తత్సమాలు అయిన ఈరెండుశబ్దాలకు 'రాజుయొక్క ఆజ్ఞ' అనేవిగ్రహంచొప్పున తెలుగులో సమాసం చేస్తే – రాజునాజ్ఞ. 'రాజుయొక్క ఆజ్ఞ' అనేసంస్కృతసమశబ్దాలకు సమాసం తెలుగులో సాధింపబడింది కాబట్టి ఇది సాధ్య(సాంస్కృతిక)సమాసం.

**7. తక్కినతెనుఁగులసమాసం బాచ్ఛికం బనంబడు.** (సమా. 2)

'సాంస్కృతికాచ్ఛికమిశ్రబేధంబుచే సమాసంబు త్రివిధంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రా ననుసరించి తెలుగులో సమాసం మూడువిధాలు. 1. సాంస్కృతికం. 2. ఆచ్ఛికం. 3. మిశ్రం. ఇందులో ఆచ్ఛికసమాసలక్షణాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

తక్కినతెనుగులు అంటే ఇంతకు పూర్వం 'సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు' అని చెప్పిన సంస్కృతసమాలకంటె వేరయినశబ్దాలు అని అర్థం. 'సంస్కృతసమేతరం బయినయీభాష యచ్చ యనంబడు' అనేసూత్రాన్ని అనుసరించి సంస్కృతసమంకంటె వేరయినది అంటే అచ్చతెలుగు. ఆచ్ఛికం. కాగా ఆచ్ఛికశబ్దాలకు చేయబడినసమాసం ఆచ్ఛికసమాసం. తేనియొక్క, ఆనతి అనేరెండు అచ్చతెలుగుశబ్దాలకు తెలుగులో సమాసం చేస్తే 'తేనియానతి' అని అవుతుంది. ఇది అచ్చతెలుగుశబ్దాలసమాసం కాబట్టి ఆచ్ఛికసమాసం.

**8. ఉభయంబులు గూడినది మిశ్రం బనంబడు.** (సమా. 2)

'సాంస్కృతికాచ్ఛికమిశ్రబేధంబుచే సమాసంబు త్రివిధంబు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రా ననుసరించి తెలుగులో సమాసం మూడువిధాలు. 1. సాంస్కృతికం. 2. ఆచ్ఛికం. 3. మిశ్రం. వీటిలో మిశ్రసమాసలక్షణాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఉభయం అంటే పూర్వం చెప్పినవి రెండు. 'సంస్కృతసమంబులసమాసంబు సాధ్యంబు, తక్కినతెలుగులసమాసం బాచ్ఛికంబు' అని పేర్కొన్న సంస్కృతసమమూ, ఆచ్ఛికమూ. కాగా సంస్కృతసమశబ్దానికీ ఆచ్ఛికశబ్దానికీ రెంటికీ కలిపి చేయబడినసమాసం మిశ్రం అని తాత్పర్యం. ఉదా. రాజుముదల. ఈసమాసంలో 'రాజుయొక్క' అనేమొదటిపదం సంస్కృతసమం. 'ముదల' అనేరెండవపదం ఆచ్ఛికం. ఇలాగే 'చెఱువునుదకము'. ఇక్కడ 'చెఱువుయొక్క' అనేమొదటిపదం సంస్కృతసమం, 'ఉదకము' అనేరెండవశబ్దం ఆచ్ఛికం. ఇలా ఈసమాసాలలో సంస్కృతసమమూ,

ఆచ్ఛికమూ రెండు మిశ్రం అయిఉన్నాయి. కాబట్టి ఇవి మిశ్రసమాసాలు.

**9. తత్పురుషబహువ్రీహిద్వంద్వంబు లని సమాసంబు లెల్లం ద్రివిధంబు లయియుండు.** (సమా. 3)

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. తత్పురుషాదులు అన్నపుడు ఆదిశబ్దంచేత గ్రహించవలసిన సమాసాలను ఈవాక్యం వివరిస్తున్నది.

తెలుగులోని సమాసాలు అన్నీ 1. తత్పురుషం, 2. బహువ్రీహి, 3. ద్వంద్వం అని మూడువిధాలుగా ఉంటాయి. కర్మధారయం, ద్విగువు, వ్యధికరణసమాసం అనేవి తత్పురుషంలోనిభేదాలు. కాగా నల్లనియావు(కర్మధారయం), ముచ్చిచ్చు (ద్విగువు), రాముని బాణము(వ్యధికరణసమాసం), ఇ వన్నీ తత్పురుషసమాసాలు. ముక్కంటి (బహువ్రీహి). అన్నదమ్ములు (ద్వంద్వం).

**10. అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థప్రధానంబు లయియుండు.** (సమా. 3)

తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'తత్పురుషబహువ్రీహిద్వంద్వంబు లని సమాసంబు లెల్లం ద్రివిధంబు లయి యుండు' అనేపూర్వవాక్యాన్ని అనుసరించి, ఇక్కడ 'అవి' అంటే తత్పురుషం, బహువ్రీహి, ద్వంద్వం, అనేసమాసాలు అని అర్థం. యథాక్రమంగా 1. తత్పురుషం – ఉత్తరపదార్థప్రధానం. 2. బహువ్రీహి – అన్యపదార్థప్రధానం. 3. ద్వంద్వం – ఉభయపదార్థప్రధానం.

ఉత్తరపదం అంటే సమాసంలో చివరిపదం. ప్రధానం కావటం అంటే క్రియతో అన్వయం కలిగిఉండటం. సమాసంలోనిచివరిపదంయొక్క అర్థం ప్రధాన మై, క్రియతో అన్వయించిన పక్షంలో ఆసమాసం తత్పురుషం. నల్లనియావు మెల్లగా నడచుచున్నది. ఇక్కడ నల్లనియావు అనేసమాసంలో ఆవు అనేచివరిపదం అర్థం వాక్యంలో ప్రధానం. ఇది లేకుంటే వాక్యార్థం అన్వయించదు. నల్ల నడచుచున్నది అంటే అర్థం లేదు. ఆవు నడచుచున్నది అంటే నల్ల అనేవిశేషణం లేకున్నా వాక్యార్థానికి బాధ లేదు. కాబట్టి ఇది ఉత్తరపదార్థం ప్రధాన మైనది, కావటంచేత తత్పురుషసమాసం.

ముక్కంటి. ఈసమాసానికి మూడు కన్నులు గలవాడు – పరమేశ్వరుడు అని అర్థం. సమాసంలోని మూడు, కన్ను అనేశబ్దాలు రెండింటికంటె వే రయిన అవి

కలవాడు అనే ఇం కొకఅర్థం ప్రధానం అయింది కాబట్టి ఇది బహువ్రీహి. 'ముక్కంటి ప్రత్యక్ష మయ్యెను' ఈవాక్యంలో మూడు అయ్యెను, లేదా కన్ను అయ్యెను అనేవిధంగా సమాసంలోని పదాలఅర్థం క్రియతో అన్వయించదు. ఇంక పరమేశ్వరుడు ప్రత్యక్ష మయ్యెను అనేవిధంగా సమాసంలో లేని అన్యపదం అర్థం ప్రధానం.

అన్నదమ్ములు. ఈసమాసంలో అన్న, తమ్ముడు అనేరెండుపదాలఅర్థమూ ప్రధానమే. అన్నదమ్ములు వచ్చిరి. అంటే అన్న, తమ్ముడు ఇద్దరూ వచ్చారు అనే అర్థం. కాగా సమాసంలోని రెండుపదాలఅర్థమూ అంటే ఉభయపదార్థం ప్రధానం కావటంచేత ఇది ద్వంద్వసమాసం.

**11. అందుఁ దత్పురుషంబు సమానాధికరణంబు వ్యధికరణం బని ద్వివిధంబు.**

**12. ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁ బడు.** (సమా. 3)

తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తత్పురుషం, బహువ్రీహి, ద్వంద్వం అని మూడువిధాలుగా ఉన్నసమాసంలో తత్పురుషం అనేసమాసం మళ్లీ రెండువిధాలు. 1. వ్యధికరణం. 2. సమానాధికరణం.

ద్వితీయ మొదలుకొని సప్తమి వరకు గలఆయావిభక్తులు చివర గలిగినపదాలకు పైపదంతో చేసినసమాసానికి వ్యధికరణం అని పేరు. ఉదా. రామునిబాణము. 'రామునియొక్క' అనే షష్ఠీవిభక్తి చివర గలిగినపదానికి 'బాణము' అనేమీదిపదంతో సమాసం చేయగా 'రామునిబాణము' అని ఏర్పడింది. కాబట్టి ఇది వ్యధికరణ సమాసం.

అధికరణం అంటే ఆధారం. భిన్న మైన అంటే వేరువేరు అధికరణాలు కలిగినది వ్యధికరణం. సమాసంలోని పదాలఅర్థం వేరువేరు స్థలాలు ఆధారంగా ఉంటే అది వ్యధికరణం. రామునిబాణము అన్నపుడు రామునియొక్క అనేపూర్వపదం అర్థం రామత్వం (రామునితనం) రామునియందు ఉండగా, బాణము అనేరెండవశబ్దంయొక్క అర్థం బాణత్వం (బాణంతనం) బాణంలోఉంది. రాముడిలో బాణధర్మం లేదు. బాణంలో రాముడిధర్మం లేదు. కాగా సమాసంలోని రామ, బాణ శబ్దాలఅర్థం వేరువేరు చోట్లను ఆశ్రయించిఉండటంచేత రామునిబాణము అనేఈసమాసం వ్యధికరణం అయింది. పూర్వపదం విభక్తినిబట్టి ఈసమాసాలను ఆయాతత్పురుషసమాసాలుగా వ్యవహరిస్తారు. రామునిబాణము అనేదానిలో

పూర్వపదం రామునియొక్క అనేవిధంగా షష్ఠీవిభక్తి చివర గలిగినది గాబట్టి ఇది షష్ఠీతత్పురుషసమాసం. ఇలాగే ద్వితీయాదితత్పురుషసమాసాలను గ్రహించాలి.

**13. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు.**

**14. ఇదియె కర్మధారయ మనంబడు.** (సమా. 3)

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తత్పురుషం, బహువ్రీహి, ద్వంద్వం అని మూడువిధాలుగాఉన్నసమాసంలో తత్పురుషం అనేసమాసం మళ్లీ రెండువిధాలు. 1. వ్యధికరణం. 2. సమానాధికరణం.

విశేషణానికి విశేష్యంతో చేసినసమాసానికి సమానాధికరణసమాసం అని పేరు. అంటే ఇందులో విశేషణం పూర్వపదమూ (సమాసంలో మొదటిపదం), విశేష్యం ఉత్తరపదమూ (సమాసంలో చివరిపదం), అవుతాయి. ఉదా. నల్లనియావు. ఇక్కడ 'నల్ల' అనేవిశేషణానికి 'ఆవు' అనేవిశేష్యంతో సమాసం అయింది. కాబట్టి ఇది సమానాధికరణం.

అధికరణం అంటే ఆధారం. సమాన మైన అంటే ఒకేఅధికరణం కలిగినది సమానాధికరణం. సమాసంలోనిపదాలఅర్థం ఒకేచోటు ఆధారంగా కలిగిఉంటే అది సమానాధికరణం. నల్లనియావు అనేఈసమాసంలో 'నల్ల' అనేమొదటిపదం అర్థ మైన నల్లదనమూ, 'ఆవు' అనేరెండవపదం అర్థం అయిన ఆవుతనమూ (గోత్వం) రెండూ ఒకే ఆవును ఆశ్రయించిఉన్నాయి. (నల్లతనమూ, ఆవుతనమూ రెండూ ఆవులోనే ఉన్నాయి.) అధికరణం సమానంగా ఉండటంచేత ఇది సమానాధికరణం. ఈసమానాధికరణసమాసాన్నే కర్మధారయసమాసం అని కూడా అంటారు.

**15. అది సంఖ్యాపూర్వంబు ద్విగువు నాఁబడు.** (సమా. 3)

తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇదియె కర్మధారయ మనంబడు' అనేపూర్వవాక్యాన్ని అనుసరించి ఇక్కడ 'అది' అంటే కర్మధారయం అని అర్థం. కర్మధారయసమాసంలో పూర్వపదం సంఖ్యావాచకం అయితే ద్విగువు అని పేరు. కర్మధారయసమాసంలో పూర్వపదం విశేషణం అవుతుంది. జాతి, గుణ, క్రియా, సంఖ్యాదిభేదాలతో విశేషణం ఆరు విధాలు. వాటిలో సంఖ్యాప్రయుక్త మైనవిశేషణానికి విశేష్యంతో సమాసం అయితే ఆకర్మధారయసమాసాన్నే తెలుగులో ద్విగుసమాసం అని వ్యవహరిస్తారు. ఉదా.

నలుగడలు. 'నాలుగు' అనేసంఖ్యావిశేషణానికి 'కడలు' అనేవిశేష్యంతో సమాసం జరిగి 'నలుగడలు' అని అయింది. విశేషణానికి విశేష్యంతో ఏర్పడినసమాసం కాబట్టి ఇది కర్మధారయం. ఈకర్మధారయసమాసంలో విశేషణం అయినపూర్వపదం (నాలుగు) సంఖ్యను దెలియజేస్తున్నది గాబట్టి ఇది (సంఖ్యాపూర్వకం అయిన ఈకర్మధారయం) ద్విగువు.

**16. ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబు దొడరనిసమాసంబుం గల దని సూచింపఁబడియె.** (సమా. 3)

**17. దానంజేసి చిగురుఁగేలు, జుంటిమోవి యిత్యాదు లయిన యుపమాన పూర్వపదకర్మధారయంబులు గ్రాహ్యంబులు.** (సమా. 3)

**18. (ఇట్టి) ఉపమానోత్తరపదంబులు గలవు గాని విపరీతంబులు సిద్ధంబులు లే వని యెఱుంగునది.** (సమా. 3)

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. ఇది సూత్రంలోని ప్రాయికశబ్దం ప్రయోజనాన్ని వివరిస్తున్నది.

తెలుగులోని తత్పురుషం మొద లైనసమాసాలలక్షణం ప్రాయికంగా సంస్కృతంలో చెప్పినదే అవుతుంది. తఱుచుగా సంస్కృతంలో చెప్పినవిధంగా అనటంచేత అరుదుగా సంస్కృతంలో చెప్పినదానికంటె భిన్నంగా కూడా తెలుగులో సమాసాలు ఉంటా యనే అర్థం సిద్ధిస్తున్నది.

దానివల్ల చిగురుఁగేలు, జుంటిమోవి మొ. ఉపమానపూర్వపదకర్మధారయాలు గ్రహింప బడతాయి. కర్మధారయంలో పూర్వపదం అయినవిశేషణం ఉపమానం అయితే అది ఉపమానపూర్వపదకర్మధారయం. చిగురువంటికేలు అన్నపుడు 'కేలు' ఉపమేయం. 'చిగురు' ఉపమానం. ఉపమానం (చిగురు) పూర్వపదంగా ఉన్నకర్మధారయం గాబట్టి 'చిగురుఁగేలు' ఉపమానపూర్వపదకర్మధారయం. ఇలాగే జున్నువంటి మోవి - జుంటిమోవి. ఇటువంటి ఉపమానపూర్వపదకర్మధారయాలు సంస్కృతంలో లేవు, గాబట్టి ఇవి సంస్కృతలక్షణంబు తొడరని తెలుగుసమాసాలు అని గ్రహించాలి.

సంస్కృతంలో ఉపమానోత్తరపదకర్మధారయా లున్నాయి. ముఖపద్మము, ఉపమాన మైనపద్మం ఈసమాసంలో ఉత్తరపదం. విపరీతం అంటే ఉపమానపూర్వపద కర్మధారయం. చిగురువంటి కేలు - చిగురుఁ గేలు. అన్నపుడు 'చిగురు' అనేపూర్వపదం

ఉపమానం. ఉపమానం పూర్వపదంగా కలిగినకర్మధారయం కాబట్టి ఇది ఉపమానపూర్వపదకర్మధారయం. ఇలాగే జున్నువంటి మోవి – జుంటిమోవి. మొ. (ఇలాంటి) ఉపమానం పూర్వపదంగా గలిగినసమాసాలు సంస్కృతంలో లేవు.

**19. సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు.** (సమా. 3)

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'కేవలసంస్కృతశబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు' సంస్కృతశబ్దాలకు సంస్కృతంలోనే సమాసం ఏర్పడి సమాసమే ప్రాతిపదికగా తెలుగులో ప్రవేశించేవి సిద్ధసమాసాలు. సంస్కృతంలో ఏర్పడిఉన్న సిద్ధసమాసాలు అన్నీ తెలుగులో తత్సమాలుగా గ్రహింపవచ్చు నని వాక్యార్థం. 'సర్వంబు' అనడంచేత తత్పురుషాది సమాసా లన్నీ తెలుగులోకి వస్తాయి.

'రాజపురుష' అనేవ్యధికరణ (తత్పురుష) సిద్ధసమాసం తెలుగులోకి వచ్చి 'రాజపురుషుడు'. 'నీలోత్పల' అనే సమానాధికరణసమాసం తెలుగులో 'నీలోత్పలము'. ఇలాగే 'పీతాంబరుడు' (పీతాంబర) బహువ్రీహి, 'రామలక్ష్మణులు' (రామలక్ష్మణ) ద్వంద్వము. మొ.

**20. కేవలసంస్కృతశబ్దంబు వికృతిశబ్దముతోడ సమసింపదు.** (సమా. 3)

**21. అనేకమాఱులు అల్పదండు ఇత్యాదులు దుష్టంబు లని తెలియునది.** (సమా. 3)

'తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

సంస్కృతశబ్దానికి తెలుగువిభక్తులు చేసి తత్సమం చేసుకొని దానికి ఆచ్ఛికశబ్దంతో లక్షణానుగుణంగా సమాసం చేసుకోవచ్చు. రామునికొడుకు, సముద్రపుటొడ్డు, వధువు నందము మొ. కాని తత్సమం చేయకుండా సంస్కృతశబ్దాన్ని యథాతథంగా గ్రహించి దానికి అచ్చతెలుగుశబ్దంతో సమాసం చేయడానికి వీలు లేదు. అంటే సమాసంలో పూర్వపదం కేవలం సంస్కృతం కాగా ఉత్తరపదం ఆచ్ఛికం కావడం కుదరదు. (సంస్కృతం ఉత్తరపద మైతే విభక్త్యంత మై తప్పకుండా తత్సమం అవుతుంది).

అనేకమాఱులు. ఇక్కడ 'అనేక' అనేది కేవలసంస్కృతశబ్దానికి 'మాఱు' అనే అచ్చతెలుగుశబ్దంతో సమాసం చేయడంవల్ల ఇది పైలక్షణానికి విరుద్ధం గాబట్టి దుష్టం. అంటే దోషం కలిగినది. తప్పుసమాసం. ఇలాగే 'అల్పదండు' అనేచోట

గూడ 'అల్ప' అనేసంస్కృతశబ్దానికి 'దండు' అనేఆచ్ఛికశబ్దంతో సమాసం. ఇది లక్షణానికి విరుద్ధం. కాబట్టి అదీ తప్పే.

'కేవలసంస్కృతశబ్దంబు' అనడంచేత (అనేకము + మాఱులు) అనేకపుమాఱులు, (అల్పము + దండు) – అల్పపుదండు ఇత్యాదిగా తత్సమం చేసి ఆచ్ఛికంతో సమాసం చేసుకోవడంలో తప్పు లేదు.

**22. ఈనియమముచే బల్లిదుఁడు మల్లుఁడు, కావలుఁడు రాముఁడు ఇత్యాదుల సమాసము లేదు.** (సమా. 5)

'కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదం బయి యుండు' అనేసూత్రం ప్రకారం కర్మధారయసమాసంలో మొదటి (పూర్వ)పదం, త్రికం (ఆ,ఈ, ఏ), స్త్రీసమం, ముఎర్ణకాంతం, ధాతుజవిశేషణం అనేవాటిలో ఏదో ఒకటి కావాలి. అంటే ఈమూడింటికంటే వే రైనవిశేషణానికి (విశేష్యంతో) కర్మధారయసమాసం కుదరదు.

'బల్లిదుఁడు మల్లుఁడు' ఇక్కడ విశేషణ మైన 'బల్లిదుఁడు' అనేశబ్దం డుమంతం. ఇది త్రిక, స్త్రీసమ ముగంత, ధాతుజవిశేషణాల్లో ఏఒక్కటీ కాలేదు. కాబట్టి దీనికి 'మల్లుఁడు' అనేవిశేష్యంతో కర్మధారయసమాసం చేయడానికి ఈసూత్రం ప్రకారం వీలు లేదు. కాబట్టి సమాసం (బల్లిదమల్లుడు) కాకుండా 'బల్లిదుఁడు మల్లుఁడు' అని వ్యస్తంగానే ఉంటుంది.

ఇలాగే 'కావలుఁడు రావణుఁడు' అనేచోట గూడ 'కావలుఁడు' అనేవిశేషణం డుమంతం. కర్మధారయంలో పూర్వపదం త్రికాదుల్లో ఏదో ఒకటి కావా లనే నియమంచేత తద్భిన్న మైన 'కావలుఁడు' శబ్దానికి 'రావణుడు' అనేదానితో సమాసం కుదరదు. 'కావలరావణుడు' అని కాదు. 'కావలుఁడు రావణుఁడు' అని వ్యస్తంగా ఉండవలసిందే.

**23. మగఁడును బిడ్డలును, పల్లమును గళ్లెమును ఇత్యాదులు సమసింప వని యీనియమంబున నెఱుంగునది.** (సమా. 7)

'ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగ ద్వంద్వం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం స్త్రీసమశబ్దానికి మాత్రమే ఆచ్ఛికశబ్దంతో ద్వంద్వసమాసం కలుగుతుంది. అంటే ద్వంద్వంలో మొదటిపదం స్త్రీసమ మైనఆచ్ఛికం కావాలి, తరువాతిపదం స్త్రీసమ, క్లీబసమ, పుంలింగతుల్యాల్లో ఏ దైనా కావచ్చు. ఆచ్ఛికం

మాత్రం అయిఉండాలి. అని యీసూత్రం నియమం చేస్తున్నది. సంస్కృతసమంతో స్త్రీసమాని క్కూడా ద్వంద్వం కుదరదు. దీనివల్ల స్త్రీసమం కాని ఏశబ్దానికి గూడా (ఆచ్ఛిక మైనా) ద్వంద్వసమాసం చేయడానికి వీలు లేదు.

మగఁడును బిడ్డలును. ఇక్కడ 'మగఁడు' అనేది ఆచ్ఛికమే, కాని స్త్రీసమం కాదు. పుంలింగతుల్యం. కాబట్టి దీనికి 'బిడ్డలు' అనేమీది(ఆచ్ఛిక)పదంతో ద్వంద్వసమాసం కుదరదు. మగబిడ్డలు అని కాదు. 'మగఁడును బిడ్డలును' అని వ్యస్తంగానే ప్రయోగించుకోవాలి. ఇలాగే 'పల్లమును – కళ్లెమును' ఇక్కడ పల్లము అనేపదం ఆచ్ఛికమే, అయినా క్లీబసమం. స్త్రీసమం కాదు. కాబట్టి కళ్లెము అనేమీదిపదంతో ద్వంద్వసమాసం కాదు. పల్లగళ్లెములు అని కాదు. ఇంక 'పల్లమును గళ్లెమును' ఇత్యాదిగా వ్యస్తంగానే ప్రయోగించుకోవాలి.

ఇలాగే భార్యాబిడ్డలు ఇత్యాదిగా సంస్కృతసమం కలిగినద్వంద్వసమాసం కూడా కుదరదు.

**24. బాహుళకముచే నూష్మరేఫములకు ద్విత్వము కలుగదు.** (సమా. 14)

'త్రికంబుమీఁదియసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు' అనే సూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఆ,ఈ,ఏ అనే త్రికానికి పైనున్న సంయుక్తం గానిహల్లుకు బహుళంగా ద్విత్వం చెప్తున్నది. అక్కన్య మొ. అసంయుక్త 'హల్లు' అని సామాన్యంగా చెప్పడంచేత సంయుక్తం కాకపోతే ఏహల్లు కైనా లక్షణంచేత ద్విత్వం వస్తుంది.

కాని పైసూత్రంలోని 'బహుళ' పదంవల్ల కొన్నిచోట్ల ఈకార్యానికి అప్రవృత్తి. ఆస్థలాలను ఈవాక్యం వివరిస్తున్నది. త్రికంమీద ఉన్న 'శ,ష,స,హ' అనే ఊష్మ వర్ణాలకూ, రేఫకూ (ర్), సూత్రంప్రకారం రావలసినద్విత్వం బహుళపదంచేత రాదని వాక్యార్థం.

ఉదా. ఆశరము. ఇక్కడ ద్విత్వం వచ్చి అశ్శరము అనేరూపం ఉండదు.

ఇలాగే ఏషండము, ఆసుకృతి, ఈహయము, ఆరూపము. మొ.

**25. వీనిద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపం బగు.** (సమా. 15)

'కృతహ్రస్వం బగుత్రికంబుమీఁదిచోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'వీని' అంటే అత్వహ్రస్వాలు వచ్చినవాని– అని అర్థం. ఆ,ఈ,ఏ, అనేత్రికానికి

మీద ఉన్నచోటుశబ్దంలో మొదటిహల్లుకు ద్విత్వమూ, ముందరిత్రికానికి హ్రస్వమూ వచ్చి అచ్చోటు ఇత్యాదిగా ఉండగా, పైసూత్రం ప్రకారం చోటుశబ్దంలోని ఓత్వానికి, హ్రస్వమూ, లేదా అత్వమూ వచ్చి అచ్చొటు, అచ్చటు ఇత్యాదిగా రూపాలు అవుతాయి. వీటిలోని ద్విరుక్త మైనచకారాలలో రెండవదానికి 'అక్కటాదులజడ్డకు లోపంబు విభాష నగు' అని చెప్పబోయేసూత్రం ప్రకారం లోపం వస్తుం దని ఈవివరణవాక్యం తాత్పర్యం. ఇలా ద్విత్వం లోపించగా, అచటు(అచ్చటు), అచొటు(అచ్చొటు). ఇలాగే ఇచటు(ఇచ్చటు), ఇచొటు (ఇచ్చొటు), ఎచటు (ఎచ్చటు), ఎచొటు (ఎచ్చొటు) అనేతీరుగా రూపాలు అవుతాయి.

'వీనిద్విత్వంబునకు' అనటంచేత అత్వహ్రస్వాలు రాని అచ్చోటు, ఇచ్చోటు, ఎచ్చోటు అనేరూపాలలో ద్విత్వానికి లోపం లేదు. కాబట్టి అచోటు, ఇచోటు, ఎచోటు అనేరీతిరూపాలు ఉండవు. ద్విరుక్త మైనహల్లు పరంగా లేకపోవటంచేత ఇక్కడ ముందరిదీర్ఘానికి హ్రస్వం రాదు.

**26. ముచ్చోటులు, ముచ్చటులు, ముచ్చొటులు అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.** (సమా. 15)

'కృతహ్రస్వం బగుత్రికంబుమీఁదిచోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు' అనేసూత్రంవివరణలోనిది ఈవాక్యం.

మూడు+చోటులు అనేసమానాధికరణసమాసంలో 'సమానాధికరణం బగునుత్తరపదంబు పరం బగునపుడు మూఁడుశబ్దము దుజ్వర్ణంబునకు లోపంబును మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు' అనేసూత్రంచేత 'ఁడు' లోపించి పైన ద్విత్వం వచ్చి మూచ్చోటు. 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపుడు' అనేసూత్రంచేత ముందరి దీర్ఘానికి హ్రస్వం వచ్చి, 'ముచ్చోటులు' అని అవుతుంది.

ఇక్కడ కవిప్రయోగాల్లో ముచ్చటులు, ముచ్చొటులు అనేరూపాలు గూడా కనిపిస్తున్నా యని యీవాక్యం వివరిస్తున్నది.

'ముచ్చోటులు' అనేస్థలంలో 'చోటు' లోని ఓకారంస్థానంలో అత్వం ఆదేశంగా వస్తే 'ముచ్చటులు', హ్రస్వం ఆదేశం అయితే, 'ముచ్చొటులు' అని అవుతుంది. కాని ఇక్కడ అత్వహ్రస్వాలు లక్షణంచేత సిద్ధించడం లేదు.

'కృతహ్రస్వం బగు త్రికంబుమీఁదిచోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాష నగు' అనేసూత్రం త్రికంమీదనే అత్వహ్రస్వాలు విధిస్తున్నది. ముచ్చోటులు అన్నపుడు (మూడు) శబ్దం కృతహ్రస్వ మైనా, త్రికం కాదు. కాబట్టి ఆసూత్రంచేత

హ్రస్వదీర్ఘాలు రావడానికి వీలు లేదు. అందువల్ల కృతహ్రస్వ మైనమూడుశబ్దంమీద ఈఅత్వహ్రస్వాలు రావడం విశేషం. కాబట్టి ఆప్రయోగాలను సూరి ప్రత్యేకంగా ప్రస్తావించాడు.

**27. చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దానియంతిమాక్షరము సప్తమ్యాదేశ మయినయకారంబుతోడం బాక్షికంబుగ లోపించు నని యర్థము.** (సమా. 16)

చూ. 'ఉత్తరపదం బగుచోటశబ్దముటాక్షరమునకు లోపంబువిభాష నగు' సూత్రవ్యాఖ్య.

**28. వక్ష్యమాణవిధిచేత నయి యనుదాని కైకారాదేశంబు నగు.** (సమా. 21)

'ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయియాయి యనుశబ్దంబులువిభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'ఆయాకాలము' అనేవిధంగా ఆకారం ఆమ్రేడితం అయిఉన్నస్థలంలో రెండవ ఆకారంస్థానంలో అయి, లేదా ఆయి అనేఆదేశాలు వికల్పంగా వస్తాయి. (ఆయయి కాలము. అయ్యయికాలము.) అలా వచ్చిన 'అయి' అనేదానిస్థానంలో పైని చెప్పబోతున్న 'అచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత 'ఐ' అనేవక్రతమం ఆదేశంగా వస్తుంది. ఆయైకాలము. అయ్యైకాలము. బహుళం కావటంచేత ఐకారాదేశం రానిపక్షంలో ఆయయికాలము, అయ్యైకాలము అని ఉంటుంది.

ఆయి అనేది ఆదేశంగా వచ్చిన 'ఆయాయికాలము, అయ్యాయికాలము' అనేస్థలంలో 'అయి' అనేది లేదు. కాబట్టి 'ఆయి' అనేదానికి 'ఐ' ఆదేశం రాదు.

# తద్ధితపరిచ్ఛేదం

**1. టికాదులు రానిపక్షమునఁ దనప్రత్యం బన్నింటి కగు. (తద్ధి.8)**

'మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు' అనేసూత్రవివరణం లోనిది ఈవాక్యం.

'చిన్నాదులకు టికవర్ణకం బగు' అనేసూత్రం మొదలుకొని త్వార్థంలో ఆయాతద్ధిత ప్రత్యయాలు విశేషంగా విధింపబడ్డాయి. టికాదులు అన్నప్పటి ఆదిశబ్దంచేత పేర్వాదులకు ఇమి, నల్లాదులకు న, అగ్గలాదులకు ఇక, మగఁటిమి మొద లైనవాటిలో ఆయాప్రత్యయాలు బోధింపబడతాయి. 'ఇట విశేషం బుత్సర్గంబునకు విభాషను బాధకం బగు'. అనేసూత్రాన్ని అనుసరించి ఈపరిచ్ఛేదంలోని విశేషవిధులు (ఇక్కడ టికాదులు) సామాన్యవిధిని (ఇక్కడ 'తన' ప్రత్యయాన్ని) వికల్పంగా మాత్రమే బాధిస్తుంది. కాబట్టి బాధింపని వేఱొకపక్షంలో వీటికి అన్నింటికి 'తనవర్ణకంబు త్వార్థంబునం దగు' అనేసూత్రంచేత తనప్రత్యయం వస్తుంది. చిన్నటికము–చిన్నతనము, ముచ్చిమి–ముచ్చుఁదనము, నల్లన–నల్లఁదనము, అగ్గలిక–అగ్గలపుఁ దనము, మగఁటిమి–మగతనము మొ.

**2. కాప్రత్యయంబు మగాదిగణనంబునంజేసి డు జగు. (తద్ధి.11)**

'కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అనే సూత్రంలో చెప్పబడిన మగాదులలో 'కా' అనేతద్ధితప్రత్యయం చేర్పబడిఉంది. కాబట్టి 'కా'ప్రత్యయాంతాలు అయిన తద్ధితాంతప్రాతిపదికలకు 'మగాదులకుం గయిరాదులకు..' అనేసూత్రంచేత డుజు వస్తుంది. కాని ఉత్వం మాత్రం రాదు. కాగా 'కా' అనేతద్ధితప్రత్యయం చివర ఉన్నశబ్దాలకు 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు –' అనేసూత్రంచేత డుజు వచ్చి, ఆటకాఁడు, విలుకాఁడు మొ.

**3. ఈప్రత్యయంబు మగాదిగణంబు. (తద్ధి.15)**

'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అనేసూత్రం వివరణంలోని దీవాక్యం.

'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అనేసూత్రంలో చెప్పబడినమగాదులలో 'ఈ' అనేతద్ధితప్రత్యయం చేర్పబడిఉంది.

కాబట్టి ఈప్రత్యయాంతాలు అయిన తద్ధితాంతప్రాతిపదికలకు 'మగాదులకుం గయిరాదులకు డు జగు..' అనేసూత్రంచేత డుజు వస్తుంది. కాని ఉత్వం రాదు. కాగా 'ఈ' అనేతద్ధితప్రత్యయం చివర ఉన్నశబ్దాలకు 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు –' అనేసూత్రంచేత డుజు వచ్చి, అటమటీఁడు, కమ్మతీఁడు మొ.

**4. ఉక్కివంబునకు వలోపంబు నగు. (తద్ధి. 15)**

'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అనేసూత్రం వివరణంలోని దీవాక్యం.

ఉక్కివము అనేశబ్దం అటమటాదులలో చేరిఉంది. కాబట్టి 'అటమటాదులకు' అనేసూత్రంచేత దీనికి ఈ అనేతద్ధితప్రత్యయం వస్తుంది. దానితోపాటు ఉక్కివ శబ్దంలోని వ అనేఅక్షరానికి లోపం గూడా వస్తుంది అని ఈవివరణం తాత్పర్యం.

'ఉక్కివము' కలవాడు అనేఅర్థంలో 'ఉక్కివము' అనేప్రథమాంతశబ్దంమీద 'అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు' అనేసూత్రంచేత 'ఈ' అనేప్రత్యయం వచ్చి, 'సమాసవిభక్తికి లోపం బగు' అని విభక్తి లోపించగా– ఉక్కివ+ఈ. అని ఉండగా, ఇపుడు ప్రస్తుతవివరణంచేత 'ఉక్కివ' శబ్దంలోని 'వ' వర్ణానికి లోపం వచ్చి,– ఉక్కి+ఈ. 'అంద్వవగాగమంబులం దప్ప–' అని సంధి జరిగి, 'ఉక్కీ'. ఈప్రత్యయం మగాదులలోనిది కాబట్టి, 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు..' అనేసూత్రంచేత డుజు వచ్చి, 'ఉక్కీఁడు' అని అవుతుంది.

**5. ఆప్రత్యయాంతంబు మగాదిగణంబు. (తద్ధి. 23)**

'వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారం బగు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం. 'ఆ' అనేతద్ధితప్రత్యయం చివర గలిగిన శబ్దాలు మగాదులలో చేరిఉన్నాయి. కాబట్టి ప్రథమైకవచనంలో డుజ్ వస్తుంది అని అర్థం.

'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు డు జగు, నుత్వంబు గాదు' అనేసూత్రంలో చెప్పబడిన మగాదులలో 'ఆ' అనేతద్ధితప్రత్యయం చేర్చబడిఉంది. కాబట్టి ఆప్రత్యయాంతాలు అయినతద్ధితాంతప్రాతిపదికలకు 'మగాదులకు..' అనేసూత్రంచేత విధింపబడిన డుజు వస్తుంది. కాని ఉత్వం రాదు. కాగా 'ఆ' అనే తద్ధితప్రత్యయం చివర ఉన్నశబ్దాలకు 'మహత్తు లగుమగాదులకుం గయిరాదులకు–' అనేసూత్రంచేత డుజు మాత్రమే వచ్చి, వగలాఁడు, వన్నెలాఁడు మొ.

**6. తాచ్ఛీల్యంబున మారిపోతువర్ణకంబులు. (తద్ధి.28)**

'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబులం గానంబడియెడి' అనుసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

తత్ శీలంయొక్క భావం తాచ్ఛీల్యం. మహాకవిప్రయోగానుసారంగా 'వానిస్వభావం' అనేఅర్థంలో కొన్నిశబ్దాలకు మీద 'మారి', కొన్నిశబ్దాలకు మీద 'పోతు' అనేప్రత్యయం వస్తాయి అని గ్రహించా లని ఈవాక్యం తాత్పర్యం. మంట శీలంగా కలిగినవాడు అనేఅర్థంలో 'మంట' అనేప్రథమాంతశబ్దంమీద 'అర్థ విశేషంబుల–' అనేసూత్రంచేత 'మారి' అనేప్రత్యయం వచ్చి, తద్ధితప్రత్యయం పరంగా ఉండగా విభక్తి లోపించి, 'మంటమారి'. తద్ధితాంత మైన ఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, మంటమారి అనే ప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది. ఇలాగే తిండి శీలంగా కలిగినవాడు అనేఅర్థంలో 'పోతు' ప్రత్యయం వచ్చి పైవిధంగా 'తిండిపోతు' అనేపదం ఏర్పడుతుంది.

**7. మతుబర్థంబునం ద ప్రత్యయంబు. (తద్ధి.28)**

'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబులం గానంబడియెడి' అనుసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

మతుప్ అనేప్రత్యయంయొక్క అర్థం మతుబర్థం. కలది, కలవాడు అనేఅర్థంలో మహాకవిప్రయోగానుసారంగా అడపము అనేశబ్దంమీద 'అ' అనేప్రత్యయం వస్తుంది అని గ్రహించా లని ఈవాక్యం తాత్పర్యం. అడపము కలిగినది అనేఅర్థంలో అడపము అనేప్రథమాంతశబ్దంమీద 'అర్థవిశేషంబుల–' అనేసూత్రంచేత 'అ' అనేప్రత్యయం వచ్చి, తద్ధితప్రత్యయం పరంగా ఉండగా 'సమాసవిభక్తికి లోపం బగు' అనేసూత్రంచేత మువిభక్తి లోపించి, అడప+అ. అపదాదిస్వరసంధి జరిగి, 'అడప'. తద్ధితాంత మైన ఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, 'అడప' అనేపదం ఏర్పడుతుంది.

**8. పెండ్లిశబ్దమునకు మతుబర్థంబునం దము ప్రత్యయంబు. (తద్ధి.28)**

'అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబులం గానంబడియెడి' అనుసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

మతుప్ అనేప్రత్యయంయొక్క అర్థం మతుబర్థం. కలది, కలవాడు అనేఅర్థంలో మహాకవిప్రయోగానుసారంగా పెండ్లి అనేశబ్దంమీద 'అము' అనేప్రత్యయం వస్తుంది

అని గ్రహించా లని ఈవాక్యం తాత్పర్యం. పెండ్లి కలిగినవాడు అనేఅర్థంలో పెండ్లి అనేప్రథమాంతశబ్దంమీద 'అర్థవిశేషంబుల–' అనేసూత్రంచేత 'అము' అనేప్రత్యయం వచ్చి, తద్ధితప్రత్యయం పరంగా ఉండగా విభక్తి లోపించి, పెండ్లము. తద్ధితాంత మైన ఈప్రాతిపదిక స్త్రీసమం కాబట్టి 'స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపించి, పెండ్లము అనేపదం ఏర్పడుతుంది.

# క్రియాపరిచ్ఛేదం

**1. ఇది అధికారసూత్రంబు.** (క్రియ. 1)

**2. ఇంక నెయ్యది యుపక్రమింపంబడు నయ్యది ధాతువున కగు నని యెఱుంగునది.** (క్రియ. 1)

క్రియాపరిచ్ఛేదం ప్రారంభంలో మొదటిసూత్ర మైన 'ధాతువునకు' అనేది అధికారసూత్రం అని ఈవివరణం చెప్తున్నది.

సంజ్ఞ, పరిభాష, విధి, నియమము, అతిదేశము, అధికారము అని సూత్రం ఆరులక్షణాలలో ఏదో ఒకటి ఐఉంటుంది. 'ధాతువునకు' అనేది అధికారసూత్రం. దీనికి ప్రత్యేకంగా సంపూర్ణ మైనఅర్థం ఉండదు. తరువాత చెప్పబోయే అన్నిలక్షణాలలోకి ఈసూత్రం అన్వయిస్తుంది. అంటే ఈక్రియాపరిచ్ఛేదంలో (కృదంతపరిచ్ఛేదంలో కూడా) ఏది విధింపబడుతుందో అది ధాతువుకు వస్తుంది అనేఅర్థాన్ని ఇస్తుంది అని దీని తాత్పర్యం. ఇలా ఆసాంతం లక్షణం అనువృత్తం అయి అన్వయించటం 'అధికార' సూత్రలక్షణం.

ఉదాహరణకు 'వర్తమానంబున ల ట్టగు' అనేది తరువాతిసూత్రం. ఈఅధికారసూత్రం మొత్తం పైసూత్రంతో కలిసి, 'ధాతువునకు వర్తమానంబున ల ట్టగు' అని ఆసూత్రానికి అర్థం లభిస్తుంది. ఇలా సూత్రాలు అన్నింటిలో 'ధాతువునకు' అనేపదాన్ని ప్రయోగింపవలసినఅవసరం లేకుండ ముందుగా అధికారసూత్రంగా చెప్పడంలో లాఘవం ఉంది.

**3. వర్తమానక్రియావృత్తి యగుధాతువునకు ల ద్వర్ణకం బగు.** (క్రియ. 2)

**4. వర్తమానంబు నాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు. అప్పటికి ముగియకుండునది.** (క్రియ. 2)

'వర్తమానంబున ల ట్టగు' అనేసూత్రానికి అర్థవివరణం ఈవాక్యం.

వాక్యం ప్రయోగించేసమయానికి ప్రారంభం అయి ఇంకా పూర్తి కానిక్రియ వర్తమానం. అంటే క్రియ మొదలు అయింది కాని వాక్యం ప్రయోగించేసమయానికి పూర్తి కాలేదు. అటువంటి వ్యాపారంలో వర్తించే ధాతువుకు 'లట్' అనేప్రత్యయం వస్తుంది. ఈలట్టు సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించినది. చదువు అనేధాతువుమీద వర్తమానార్థంలో ఇలా 'లట్' అనేప్రత్యయం వచ్చి, చదువు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ ప్రత్యయం మొద లైనకార్యాలతో చదువుచున్నాఁడు అని

అవుతుంది. ఇలాగే ఇతరపరుషవచనాలలో చదువుచున్నారు, చదువుచున్నాము మొ. చదువుచున్నాఁడు ఇత్యాదిగా క్రియాపదం ప్రయోగించేసమయానికి చదువుట అనేవ్యాపారం మొదలు అయింది. కాని పూర్తి కాలేదు. ప్రారబ్ధ మై, అపరిసమాప్తం కావటంచేత ఇది వర్తమానం.

**5. భూతక్రియావృత్తి యగుధాతువునకు లిడ్వర్ణకం బగు.** (క్రియ. 3)

**6. భూతంబు నా విద్యమానధ్వంసప్రతియోగి. ముం దుండి యప్పటికి లేకుండునది.** (క్రియ. 3)

'భూతంబున లి ట్టగు' అనేసూత్రం వివరణం ఈవాక్యం.

భూతం అంటే విద్యమానం అయినధ్వంసానికి ప్రతియోగి. విద్యమానధ్వంసం అంటే వాక్యం ప్రయోగించేసమయానికి, వ్యాపారం (పని) నాశనం కావటం. ప్రతియోగి అంటే వ్యతిరేకం అయినది. అంటే ఆక్రియ వాక్యం ప్రయోగించే సమయానికి లేదు, కాని అంతకుముందు ఉన్నది. ఇటువంటిభూతార్థం అయిన వ్యాపారంలో వర్తించేధాతువుకు 'లిట్' అనేప్రత్యయం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

ఈలిట్టు సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించినది. చదువు అనేధాతువుమీద భూతార్థంలో ఇలా లిట్ అనేప్రత్యయం వచ్చి, చదువు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ ప్రత్యయం దానికి ఎను, మొద లైనకార్యాలతో 'చదివెను' అని అవుతుంది. ఇలాగే ఇతరపరుషవచనాలలో చదివిరి, చదివితిమి మొ. చదివెను ఇత్యాదిగా క్రియాపదం ప్రయోగించేసమయానికి చదువుట అనేవ్యాపారం నష్టం అయింది. కాని అంతకు ముందు ఆవ్యాపారం ఉంది. అంటే చదువుట అనేక్రియ అంతకుముందు ఉన్నది. కాని ప్రస్తుతం లేదు. అంటే ప్రస్తుతం ఉన్న - కియ లేకపోవటానికి - విరుద్ధం అయినది. విద్యమాన మైనధ్వంసానికి ప్రతియోగి కాబట్టి ఇది భూతార్థం.

**7. భావిక్రియావృత్తి యగుధాతువునకు లృడ్వర్ణకం బగు.** (క్రియ. 4)

**8. భావి నా విద్యమానప్రాగభావప్రతియోగి. అప్పటికిఁ బుట్టకుండునది.** (4)

'భావిని లృ ట్టగు' అనేసూత్రం వివరణం ఈవాక్యం.

భావి అంటే విద్యమానం అయిన ప్రాగభావానికి ప్రతియోగి. విద్యమానం అంటే క్రియ ప్రయోగించే సమయానికి, ప్రాగభావం అంటే అంతకుముందు లేకపోవటం. ప్రతియోగి అంటే వ్యతిరేకం అయినది. అప్పటికి ఇంకా పుట్టనిక్రియ.

అంటే అప్పటికి లేదు కాని తరువాత ఉంటుంది. అంతకు పూర్వం లేకపోవటం అనేదానికి వ్యతిరేకం ఐనది. అంటే తర్వాత ఉండేది. దీనినే భవిష్యదర్థం అని కూడా అంటారు. ఇటువంటి భావి అర్థం అయినవ్యాపారంలో వర్తించేధాతువుకు 'లృట్' అనేప్రత్యయం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

ఈలృట్టు సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించినది. చదువు అనేధాతువుమీద భవిష్యదర్థంలో ఇలా లృట్ అనేప్రత్యయం వచ్చి, చదువు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుఙ్ ప్రత్యయం, మొద లైనకార్యాలతో 'చదువఁగలఁడు' అని అవుతుంది. ఇలాగే ఇతరపురుషవచనాలలో చదువఁగలరు, చదువఁగలము మొ. చదువఁగలఁడు ఇత్యాదిగా క్రియాపదం ప్రయోగించేసమయానికి 'చదువుట' అనేవ్యాపారం లేదు. అంతకు ముందు కూడా లేదు. కాని తరువాత ఉంటుంది. అంటే పూర్వం లేకపోవటానికి విరుద్ధం అయిన క్రియ. విద్యమాన మైన ప్రాగభావానికి ప్రతియోగి కాబట్టి ఇది 'భావి' అర్థం.

**9. తద్ధర్మాదిక్రియావృత్తి యగుధాతువునకు లాడ్వర్ణకం బగు.** (క్రియ. 5)

**10. తద్ధర్మ, తచ్ఛీల, సంభావనా, సంప్రశ్న, సాతత్య, వర్తమాన, భావ్యాశీరాదు లాదిపద గ్రాహ్యంబులు.** (క్రియ. 5)

'తద్ధర్మాదులందు లా ట్టగు' అనేసూత్రం వివరణం ఈవాక్యం.

'తస్య ధాతోః ధర్మః తద్ధర్మః'. తద్ధర్మం అంటే ధాతువుయొక్క ధర్మం. తద్ధర్మాదులు అన్నప్పటిఆదిశబ్దంచేత తచ్ఛీలం, సంభావన, సంప్రశ్నం, సాతత్యం, వర్తమానం, భావి, ఆశీస్సు మొద లైనఅర్థాలు గ్రహించాలి. తద్ధర్మం, తచ్ఛీలం మొద లైన ఆయావ్యాపారంలో వర్తించేధాతువుకు పైన 'లాట్' అనేప్రత్యయం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

లాట్టు అనేఈలకారం తెలుగువ్యాకరణం స్వతంత్రంగా కల్పించుకున్నది. చదువు అనేధాతువుమీద తద్ధర్మార్థంలో ఇలా లాట్ అనేప్రత్యయం వచ్చి, చదువు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుఙ్ ప్రత్యయం, దానికి 'ను' మొద లైనకార్యాలతో 'చదువును' అని అవుతుంది. ఇలాగే ఇతరపురుషవచనాలలో చదువుదురు, చదువుదుము మొ. చదువును ఇత్యాదిగా ఈక్రియాపదం వర్తమానం మొద లైన ఆయాకాలాలకు పరిమితం కాకుండా, ధాతువుయొక్క ధర్మాన్ని మాత్రమే బోధిస్తున్నది. కాబట్టి ఇది తద్ధర్మం. ఇలాగే 'శుభంబు కలుగును' మొద లైనవి ఆశీరాది అర్థాలను బోధించే లాడంతక్రియాపదాలు.

**11. ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకం బగు. (క్రియ. 6)**

'ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూ ట్టగు' అనేసూత్రం వివరణం ఈవాక్యం.

'ఆశీరాదులు' అనేఈవివరణవాక్యంలోని ఆదిపదంచేత సూత్రంలో చెప్పిన శాపం, సంప్రార్థనం, విధి అనేఅర్థాలను గ్రహించాలి. ఆశీస్సు మొద లైన ఆయావ్యాపారంలో వర్తించేధాతువుకు పైన 'లూట్' అనేప్రత్యయం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

'లూట్టు' అనేఈలకారం సంస్కృతవ్యాకరణాన్ని అనుసరించినది. (శుభంబు) కలుగు అనేధాతువుమీద ఆశీరర్థంలో ఇలా లూట్ అనేప్రత్యయం వచ్చి, కలుగు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ ప్రత్యయం, దానికి ఎడు మొద లైనకార్యాలతో (శుభంబు) కలిగెడును అని అవుతుంది. ఇలాగే సంప్రార్థనం మొద లైనఅర్థాలలో చదువునది, మొ. 'కలిగెడును' ఇత్యాదిగా ఈక్రియాపదం 'శుభము కలుగు గాక' అనేతీరుగా ఆశీరర్థాన్ని బోధిస్తున్నది. ఇలాగే 'రాక్షసత్వంబు కలిగెడును' ఇత్యాదులలో 'శాపార్థం', 'చదువునది' ఇత్యాదులలో 'విధి' అర్థం. ఈఅర్థాలలో ఉన్న ఈక్రియాపదాలు లూట్ లకారాంతాలు.

**12. వ్యతిరేకక్రియావృత్తి యగుధాతువునకు లజీ వర్ణకం బగు. (క్రియ. 7)**

'వ్యతిరేకంబున లజీ యగు' అనేసూత్రం వివరణం ఈవాక్యం.

ధాతువుయొక్క అర్థానికి వ్యతిరేక మైనఅర్థం వ్యతిరేకం. ఇటువంటివ్యతిరేకార్థక వ్యాపారంలో వర్తించేధాతువుకు పైన 'లజీ' అనేప్రత్యయం వస్తుంది. అని ఈవాక్యానికి అర్థం.

'లజీ' అనేఈలకారం తెలుగువ్యాకరణం స్వతంత్రంగా కల్పించుకున్నది. కొట్టు అనేధాతువుమీద వ్యతిరేకార్థంలో ఇలా 'లజీ' అనేప్రత్యయం వచ్చి, కొట్టు+ల్. ప్రథమపురుష ఏకవచనంలో డుజ్ ప్రత్యయం, మొద లైనకార్యాలతో 'కొట్టఁడు' అని అవుతుంది. ఇలాగే ఇతరపరుషవచనాలలో కొట్టరు, కొట్టము మొ. కొట్టఁడు ఇత్యాదిగా ఈక్రియాపదం 'కొట్టటం' అనేధాతువుయొక్క అర్థానికి వ్యతిరేకం అయినఅర్థాన్ని తెలుపుతున్నది. కాబట్టి ఇది వ్యతిరేకక్రియ. 'లజీ' లకారాంతం.

**13. లడాదిలకారంబులకు డుజాదు లాదేశంబు లగు.** (క్రియ. 8)

'లకారంబునకు డుజ్రువురునుము ఙ్ఞగు' అనేసూత్రార్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. 'వర్తమానంబున ల ట్టగు' మొద లైనఆయాసూత్రాలు వర్తమానం మొద లైన ఆయాఅర్థాలలో లట్టు, లిట్టు, లృట్టు, లాట్టు, లూట్టు, లజీ అనేలకారాలు 6

విధిస్తున్నాయి. ఆ లకారాలస్థానంలో డుజ్,రు,వు,రు,ను,ము అనేప్రత్యయాలు ఆదేశంగా వస్తాయి అని ఈవాక్యం పైసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది. లకారాలు 6 ఉన్నాయి. ఇక్కడ ఆదేశంగా విధింపబడినవి కూడా ఆరు. అందుచేత యథాసంఖ్యంగా లట్టుకు డుజ్, లిట్టుకు 'రు' ఇత్యాదిక్రమంలో వస్తాయి అని భావించరాదు. ఇంక లకారాలకు ఒక్కొక్కదానికి 'డుజ్' మొద లైనప్రత్యయాలు ఆరు కూడా ఆదేశంగా వస్తాయి అని ఈవాక్యం స్పష్టం చేస్తున్నది.

దీనిప్రకారం లట్టులో వచ్చుచున్నాఁడు, వచ్చుచున్నారు, వచ్చుచున్నావు ఇత్యాదిగాను, అలాగే లిట్టులో వచ్చెను, వచ్చిరి, వచ్చితివి, ఇత్యాదిగాను ఆయా లకారాలు అన్నింటిలోను డుజాదుప్రత్యయాలు అన్నీ యథావకాశంగా వస్తాయి. రాఁడు, రమ్ము, వచ్చుదురు, రాఁగలవు మొ.

**14. ఇందు ఇకారంబు ప్రత్యాహారార్థంబు. (క్రియ.8)**

'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్గు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో విధింపబడుతున్నది డుజ్, రు, వు, రు, ను, ము, అనేవి. క్రియాపదంలో నిలిచేప్రత్యయస్వరూపం ఇదే. కాగా 'డుజ్రు వురు నుము'లు వస్తాయి అని చెప్తే సరిపోతుండగా, చివరలో ఇకారాన్ని చేర్చి చెప్పడంలో ప్రయోజనం ఏమిటి? అనేసందేహాన్ని నివారించడానికి ఈవివరణం చేయబడింది.

ఇకారాన్ని ఇత్తుగా చేర్చిచెప్పడం ప్రత్యాహారంకోసం. ముందున్నవర్ణాన్ని తరువాత చివర ఉన్నఇత్తు అయినవర్ణంతో కలపడం ప్రత్యాహారం. ఈప్రత్యాహారాలు మొదటిఅక్షరం మొదలుకొని ఇ త్తయినవర్ణంవరకు నడుమ ఉన్నవర్ణాలను అన్నింటినీ బోధిస్తాయి. సంస్కృతవ్యాకరణసంప్రదాయానుసారంగా ఇలా తెలుగులో ప్రత్యాహారాలు ఏర్పడతాయి. 'ఆది రన్త్యేన స హేతా' అనేసంస్కృతలక్షణాన్ని అనుసరించి ప్రత్యాహారం చేయాలంటే చివరలో ఇత్తు అయినవర్ణం ఉండాలి. కాగా 'దివీతరం బగు డుఙ్ఞునకు' 'లాట్టు రుఙ్ఞు పరం బగునపుడు' 'లిట్టు వుఙ్ఞు పరం బగునపుడు' ఇత్యాదిగా డుఙ్ఞు, రుఙ్ఞు, వుఙ్ఞు, మొద లైనప్రత్యాహారాలు సిద్ధింపజేయటంకోసం ఇత్తుగా ఈసూత్రంలో ఇకారం చేర్చబడింది. 'డుఙ్ఞు' అనేప్రత్యాహారం డు,రు,వు,రు,ను,ము అనేవర్ణాలను బోధిస్తుంది. ఇలాగే రుఙ్ఞు - 'రు వురు నుము' లను, వుఙ్ఞు - 'వురు నుము'లను బోధిస్తాయి. ఇలాంటిప్రత్యాహారాలు సాధించటంకోసమే ఇకారం ఇక్కడ ఇత్తుగా కూర్చబడింది అని వివరణం తాత్పర్యం.

**16. ఉదంతం బయినధాతువునకు లట్టు పరం బగునపుడు 'ఉన్న' అనుశబ్దం బనుప్రయుక్తం బగు. (క్రియ.13)**

'ఉదంతంబునకు లట్టు పరం బగునపు డున్నానుబంధం బగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

సూత్రంలోని 'అనుబంధం' అనేపదానికి అనుప్రయుక్తం అని సూరి అర్థం వివరించాడు. అనుప్రయుక్తం అంటే అనుసరించిప్రయోగింపబడేది. వర్తమానార్థంలో వచ్చిన 'లట్టు' పరంగా ఉండగా, ఉదంతం అయినధాతువుకు తరువాత 'ఉన్న' అనేశబ్దం ప్రయోగింపబడుతుంది అని దీనికి అర్థం.

'చదువు' అనేధాతువుమీద 'వర్తమానార్థమునందు ల ట్టగు' అనేసూత్రంచేత లట్టు వచ్చి, చదువు+ల్. ప్రస్తుతసూత్రంచేత ధాతువుకు చివర 'ఉన్న' అనేశబ్దం చేరి, చదువు+ఉన్న. ప్రథమపురుషైకవచనంలో 'డుజ్' వచ్చి, చువర్ణకాదికార్యాలతో 'చదువుచున్నాఁడు' అని అవుతుంది. ఇలాగే చదువుచున్నాము, చదువుచున్నది మొ.

**17. లిడాదేశం బగు డుజున కెను అనునదియు లాడాదేశం బగుడుజునకు ను అనునదియు నాదేశంబు లగు. (క్రియ.16)**

'లిడ్లాట్టులడుజున కెను ను వర్ణంబు లగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. (చూ. సూత్రవ్యాఖ్య.)

**18. భూతార్థవృత్తి యగుధాతువున కిగాగమం బగు. (క్రియ.17)**

'భూతంబునం దిగాగమం బగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'ధాతువునకు.' 'భూతంబు నా విద్యమానధ్వంసప్రతియోగి.' అంటే అంతకు ముందు ఉండి, వాక్యం ప్రయోగించేసమయానికి లేకుండాపోయినది. ఇగాగమం– ఇక్ + ఆగమ అన్నపుడు ఇక్‌లో కకారం ఇత్తు. కకారం ఇత్తుగా కలిగినది కాబట్టి ఇవర్ణం కిత్తు. కిత్తు అయిన 'ఇ' వర్ణం ధాతువుకు చివరలో వచ్చి చేరుతుంది.

'చదువు' ధాతువుమీద 'భూతంబున లి ట్టగు' అని లిట్టు వచ్చి, విను+ల్. దీనిమీద ప్రథమపురుషబహువచనంలో 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్ఞగు' అని రు వర్ణకం వచ్చి, విను+రు. ప్రస్తుతలక్షణంచేత ఇగాగమం వచ్చి, విను+ఇ+రు. సంధి జరిగి, విని+రు. 'ఇకారంబుమీఁదికునువు క్రియావిభక్తుల..' అనేసూత్రంచేత రుప్రత్యయంలోని ఉత్వానికి ఇత్వం వచ్చి– వినిరి. ఇలాగే – వింటిమి, వినినన్, వినినవాఁడు మొ.

**19. ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తుల యనుసూత్రముచే రుఙ్నన కిత్వంబు.** (క్రియ. 18)

'లిట్టు వుఙ్ను పరం బగునపుడు తివర్ణకం బగు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'ఇకారంబుమీఁది కునువు క్రియావిభక్తులయుత్వంబున కిత్వం బగు' అనేసూత్రం ఇకారానికి పైన ఉన్న క్రియావిభక్తులలోని'ఉ'త్వానికి ఇత్వం చెప్తున్నది. రుఙ్ను అనేది 'లకారంబునకు డుఁ్రువురునుము ఙ్నగు' అనేసూత్రంలో చెప్పబడిన క్రియావిభక్తులలో ప్రథమపురుషబహువచనం అయిన రువర్ణం నుంచి చివరివరకు అంటే 'రు వురు నుము' అనేప్రత్యయాలను బోధిస్తుంది.

భూతార్థంలో ఇగాగమం రావటంచేత ఇకారాంతం అయినధాతువు (విను+ఇ=విని) మీఁద ఉన్న ప్రథమపురుషబహువచనం మధ్యమ, ఉత్తమపురుష ఏకవచన, బహువచన క్రియావిభక్తులలోని ఉకారానికి ఇత్వం వస్తుంది. 'విను+రు, విని+రు' అని ఉండగా 'ఇకారంబుమీది..' అనేప్రస్తుతలక్షణం ప్రకారం 'రు' అనేక్రియావిభక్తిలోని ఉత్వానికి ఇత్వం వచ్చి, 'వినిరి' అని అవుతుంది. ఇలాగే వింటివి, వింటిమి మొ.

**20. లృట్టు పరం బగునపుడు ధాతువునకు కలజి అనునది యనుప్రయుక్తం బగు.** (క్రియ. 19)

'కలజ్యనుబంధంబు లృట్టు పరం బగునపు డగు' అనేసూత్రార్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'భావిని లృ ట్టగు' అని భవిష్యదర్థంలో ధాతువుకు లృట్టు వస్తుంది. అనుబంధంబు అంటే అనుప్రయుక్తము అని సూరి వివరించాడు. అనుప్రయుక్తం అంటే అనుసరించి తరువాత ప్రయోగింపబడేది. ధాతువుమీద భవిష్యదర్థంలో లృట్టు రాగా, అది పరంగా ఉన్నపుడు ధాతువుకు చివర కలజి అనేశబ్దం వచ్చి చేరుతుంది. కలజి అనేదానిలో జి అనేవర్ణం ఇత్తు. కాబట్టి అది లోపించిపోతుంది. ఇంక 'కల' అనేశబ్దం మాత్రమే అనుబంధంగా నిలుస్తుంది.

'చదువు' అనేధాతువుమీద భవిష్యదర్థాన్ని వివక్షించగా లృట్టు వచ్చి, చదువు+ల్. ప్రస్తుతలక్షణంచేత ధాతువుకు తరువాతగా 'కల' అనేశబ్దం చేరి, చదువు+కల. ప్రథమపురుష ఏకవచనంలో 'డుఙ్' మొద లైన ఆయాకార్యాలు వచ్చి, 'చదువఁ గలఁడు' అని అవుతుంది. ఇలాగే చదువఁగలదు, చదువఁగలము మొ.

'లృట్టు పరం బగునపుడు' అనటంచేత లృట్టు కానిది పరంగా ఉంటే 'కల' చేరదు. చదువుచున్నాఁడు, చదువుట మొ.

**21. జీత్తు పరం బగునపుడు ధాతువునుత్వంబున కత్వం బగు.** (క్రియ. 20)

'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'జి' అనేవర్ణం ఇత్తుగా కలిగినది జీత్తు. కల(జి), పడు(జి) మొ. ధాతువునకు అనేఅధికారసూత్రాన్ని అనుసరించి 'ధాతువునకు' అనేఅర్థం వస్తుంది. 'జి' అనేది ఇత్తుగా కలిగినశబ్దం పరంగా ఉండగా, దానికి పూర్వంలో ఉన్న ధాతువుయొక్క చివరిఉత్వం స్థానంలో అత్వం వస్తుం దని దీనికి అర్థం.

'వందు' అనేధాతువుమీద వ్యతిరేకార్థంలో 'వ్యతిరేకంబున లజి యగు' అనే సూత్రంచేత 'లజి' వచ్చి, వందు+ల్. లజిలో 'జి' వర్ణం ఇత్తు. 'జి' అనేది ఇత్తుగా కలిగినది కాబట్టి 'ల' అనేవర్ణం జీత్తు. కాబట్టి అది పరంగా ఉండగా ప్రస్తుతలక్షణం ప్రకారం ముందరిధాతువు చివరిఉత్వానికి అత్వం వచ్చి, వండ+ల్. లకారంస్థానంలో ప్రథమపురుష ఏకవచనంలో 'లకారంబునకు డుగ్రువురునుము ఙ్గగు' అని డుజ్ వచ్చి, 'వందఁడు'. ఇలాగే వందక, వందమి మొ.

'జీత్తు పరం బగునపుడు' అనటంచేత జీత్తు కానిది పరం ఐతే అత్వం రాదు. వందుచున్నాఁడు. వందును మొ.

'ధాతువునకు' అనటంచేత ధాతువుకానిదానిలోనిఉత్వానికి అత్వం రాదు. విను+కుజి+వుజి+ఎ. వినకువె. వినకవె అని కుజిలోనిఉత్వానికి అత్వం రాదు.

**22. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడుగాద్యాగమంబు లగు.** (క్రియ. 22)

'లాట్టు రుఙ్ఙు పరం బగునపుడు దుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'తద్ధర్మాదులందు లా ట్టగు' అని చెప్పబడిన తద్ధర్మాదులలో వర్తమానం అనేఅర్థం ఉంది. కాబట్టి వర్తమానార్థంలో కూడ లాట్టు లకారం వస్తుంది. కాగా 'లాట్టు రుఙ్ఙు పరం బగునపు దెదగాగమంబును బ్రథమనువర్ణకంబు పరం బగునపు డెడుగెడిగాగమంబులు నగు' అనేసూత్రంప్రకారం వర్తమానార్థంలో లాట్టు వచ్చిన సందర్భంలో ఎడుక్, ఎడిక్  ఎదక్ మొద లైన ఆగమాలు వస్తాయి. ఇప్పుడు

పొడమెడును. ఇలాగే 'వచ్చెడిని, చదివెదను' మొ. అలాగే 'లాట్టు రుఙ్ఞు పరం బగునపుడు దుగాగమం బగు' అనేసూత్రంచేత దుగాగమం కూడ వస్తుంది.

'ప్రాయికంబుగ వర్తమానంబున' అని వివరించటంచేత భూత, భవిష్యదర్థాలలో లాట్టు వచ్చినసందర్భంలో ఎడుగాద్యాగమాలు రావడం అరుదు అని అర్థం చేసుకోవచ్చు. 'ఇ ట్లనున్' (ఇట్లు అనెను) అని వచ్యర్థాలకు భూతార్థంలో లాట్టు వచ్చినచోట 'ఇట్లు అనెదును' ఇత్యాదిగా ఎడుగాద్యాగమాలు రావటం ప్రయోగాలలో ఉంటే గ్రహించాలి. ఇలాగే భవిష్యదర్థంలో 'రేపు వచ్చెదును' అనేరీతివ్యవహారం ప్రయోగాలనుబట్టి స్వీకరించవలసిఉంటుంది.

**23. వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడి. (క్రియ. 22)**

'లాట్టు రుఙ్ఞు పరం బగునపుడు దుగాగమం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇక్ శ్తిపౌ ధాతునిర్దేశే' అనేసంస్కృతసంప్రదాయానుసారంగా ఇక్కడ వచ ధాతువు ఇగంతంగా 'వచి' అని నిర్దేశింపబడింది. వచి అంటే 'వచ' ధాతువు అని అర్థం. 'వచ' అనేసంస్కృతధాతువుయొక్క అర్థం కలిగినశబ్దాలు (తెలుగు ధాతువులు) వచ్యర్థాలు. అను, పలుకు మొద లైనవి. 'తద్ధర్మాదులందు లా ట్టగు' అనేసూత్రందగ్గర తద్ధర్మాదులలో వర్తమాన, భావ్యర్థాలను పేర్కొన్న చిన్నయసూరి భూతార్థాన్ని స్పష్టంగా చెప్పలేదు. అయినా ఆదిశబ్దంచేత గ్రహించడానికి అక్కడివివరణంలోని ఆదిశబ్దం కూడా అవకాశం ఇస్తున్నది. ఇక్కడ లాడర్థాలను పేర్కొనేసందర్భంలో భూతార్థం విశేషంగా ప్రస్తావించబడింది. వర్తమానాదులవలె భూతార్థం సాధారణం కాకపోవటం కారణం కావచ్చు.

వచ్యర్థా లయిన 'అను' మొద లైనధాతువులమీద భూతార్థంలో కూడ కవిప్రయోగాలలో లాట్టు కనిపిస్తున్నది. 'పాండుతనయాగ్రణి ఇ ట్లనున్'. ఇక్కడ 'అనున్' అనేలాడంతక్రియకు 'అనెను' అని భూతం అర్థం. అంటే 'అను' అనే ధాతువుమీద భూతార్థంలో 'లాట్టు' రాగా, లాట్టుడుజుకు 'ను'వర్ణ మై, 'అనున్' అనేప్రథమపురుషైకవచనాంతక్రియాపదం ఏర్పడుతుంది.

**24. 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' ననుసూత్రముచే లజీ పరం బగునపు దత్వంబు.** (క్రియ. 30)

'ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వం బగు' అనేసూత్రంవివరణంలోని ఈవాక్యం 'వ్యతిరేకంబున లజీ యగు' అనేసూత్రంప్రకారం వ్యతిరేకార్థకరూపాలు

ఏర్పడేవిధాన్ని గూర్చి వివరిస్తున్నది.

'జి' అనేవర్ణం ఇత్తుగా కలిగినది జీత్తు. కల(జి), పడు(జి) మొ. 'ధాతువునకు' అనే అధికారసూత్రాన్ని అనుసరించి 'ధాతువునకు' అనేఅర్థం వస్తుంది. 'జి' అనేది ఇత్తుగా కలిగినశబ్దం పరంగా ఉండగా, దానికి పూర్వంలో ఉన్న ధాతువుయొక్క చివరిఉత్వం స్థానంలో అత్వం వస్తుంది అని ఆసూత్రం చెప్తున్నది.

'వండు' అనేధాతువుమీద వ్యతిరేకార్థంలో 'వ్యతిరేకంబున లజి యగు' అనేసూత్రంచేత లజి వచ్చి, వండు+ల్. లజిలో 'జి' వర్ణం ఇత్తు. 'జి' అనేది ఇత్తుగా కలిగినది కాబట్టి 'ల' అనేవర్ణం జీత్తు. కాబట్టి అది పరంగా ఉండగా ప్రస్తుతలక్షణం ప్రకారం ముందరిధాతువు చివరిఉత్వానికి అత్వం వచ్చి, – వండ+ల్. లకారంస్థానంలో ప్రథమపురుష ఏకవచనంలో 'డుజ్' వచ్చి, వండఁడు. ఇలాగే వండరు, వండము మొ.

**25. భావం బనఁగా ధాత్వర్థంబు.** (క్రియ. 35)

'టవర్ణకంబు భావంబునం దగు' అనేసూత్రంలోని భావం అనేశబ్దం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

ధాతువుయొక్క అర్థం ధాత్వర్థం. భావం అంటే ధాతువుయొక్క అర్థం అని అర్థం. ఈఅర్థంలో ధాతువుమీద పైసూత్రంచేత 'ట' అనేప్రత్యయం వస్తుంది.

వంట చేయుట అనేవిధంగా వండు ధాతువుయొక్క అర్థం ఐనవ్యాపారాన్ని బోధించేసందర్భంలో 'వండు' అనేధాతువుమీద (ఆధాతువుయొక్క అర్థంలో) 'ట' అనేప్రత్యయం వచ్చి, 'వండుట' అనేవిధంగా అవుతుంది. ధాతువుమీద విధింపబడిన డుఙ్భిన్న మైన ఈ 'ట'ప్రత్యయం కృత్తు. 'కృత్తద్ధితసమాసా శ్చ' అని కృదంతాలు ప్రాతిపదికలు. కాబట్టి 'ట'ప్రత్యయాంతం ఐన ఈకృదంతప్రాతిపదికమీద ప్రథమాది విభక్తులు చేరతాయి. ఇది స్త్రీసమం కాబట్టి ప్రథమైకవచనం లోపించి, వండుట అని అవుతుంది. ఇతరవిభక్తులలో 'వండుటలు, వండుటయందు' ఇత్యాదిగా రూపాలు అవుతాయి.

**26. వ్యతిరేకవిశిష్టక్రియాభిధాయిధాతువునకు మిజి యగు.** (క్రియ. 37)

'వ్యతిరేకభావంబున మిజి యగు' అనేసూత్రార్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'ధాతువునకు' అనేఅధికారసూత్రాన్ని అనుసరించి 'వ్యతిరేకభావంబున మిజి యగు' అని విధింపబడిన మిజి ప్రత్యయం ధాతువుకు పరంగా వస్తుంది.

ఈవాక్యం ప్రధానంగా పైసూత్రంలోని 'వ్యతిరేకభావం' అనేపదంయొక్క అర్థాన్ని చెప్తున్నది. 'భావం బనఁగా ధాత్వర్థంబు' అని ఇంతకుముందు భావార్థాన్ని సూరి వివరించాడు. ధాతువుయొక్క అర్థం అయిన వ్యాపారం వ్యతిరేకార్థంతో కూడిఉంటే అది వ్యతిరేకభావం. అంటే వ్యతిరేకధాత్వర్థం. ఈఅర్థంలో ధాతువుమీద 'మిజీ' అనేప్రత్యయం వస్తుంది.

వండు అనేధాతువుకు వంట చేయటం అనేవ్యాపారం అర్థం భావం. ఇది వ్యతిరేకార్థాన్ని బోధించటం అంటే వంట చేయకపోవటం. ఇది వ్యతిరేకభావం. ఈఅర్థంలో 'వండు' ధాతువుమీద ప్రస్తుతసూత్రంచేత 'మిజీ' అనేప్రత్యయం వచ్చి- వండు+మి. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనిముందరి ధాతువు చివరిఉత్వానికి అత్వం వచ్చి, వండమి. 'మి' వర్ణకం కృత్తు. కృదంతం ప్రాతిపదికం. కాబట్టి దీనిమీద ప్రథమాదివిభక్తులు వస్తాయి. మిజీప్రత్యయాంత ప్రాతిపదికలు స్త్రీసమాలు గాబట్టి ప్రథమైకవచనం లోపించి, 'వండమి' అనేప్రథమైక వచనాంతపదం ఏర్పడుతుంది. ఇలాగే ఇతరవిభక్తులలో - వండమిచేత, వండములు మొ.

**27. సమానాశ్రయంబు లగుక్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచి యగుధాతువున కివర్ణకం బగు.** (క్రియ. 38)

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనేసూత్రం అర్థాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఒకేదానిని ఆశ్రయించిఉన్న అనేక మైనవ్యాపారాలలో పూర్వకాలానికి చెందినదానిని తెలిపేధాతువుకు పరంగా 'ఇ' అనేప్రత్యయం వస్తుం దని ఈవాక్యానికి అర్థం. ఉదా. చైత్రుండు వండి తినెను. ఇక్కడ వండుట, తినుట అనేరెండు క్రియలు (కర్త అయిన) చైత్రుని ఒక్కడినే ఆశ్రయించిఉండటంచేత సమానాశ్రయాలు అయినాయి. ఈరెండింటిలో 'తినుట' అనేక్రియకంటె 'వండుట' అనేక్రియ పూర్వకాలానికి చెందింది (ముందు జరిగింది). కాబట్టి 'వండు' ధాతువుకు 'ఇ' అనేప్రత్యయం వచ్చి, వండు+ఇ. అపదాదిస్వరసంధి జరిగి, 'వండి' అని అవుతుంది. ఈ ఇప్రత్యయాంతం అవ్యయం. దీనిమీద విభక్తి లోపించి, 'వండి' అనే అవ్యయపదం ఏర్పడుతుంది.

ఎన్ని క్రియలు ఉన్నా, పూర్వకాలికాలు అయినవాటికి అన్నింటికీ ఇప్రత్యయం వస్తుంది. చైత్రుడు వండి, తిని, చదివి, నిద్రించెను.

**28. ఇదియె క్త్వార్థంబు నాఁబడు.** (క్రియ. 38)

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తూ, సూరి 'సమానాశ్రయంబు లగుక్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచి యగుధాతువున కివర్ణకం బగు' అని చెప్పాడు. ఆవివరణం చెప్పిన అర్థాన్నే 'క్త్వార్థం' అంటారు అని ప్రస్తుతవాక్యం పేర్కొంటున్నది. 'సమానకర్తృకయోః పూర్వకాలే' అని సంస్కృతంలో 'క్త్వా' అనేప్రత్యయం విధింపబడింది. క్త్వా అనే ప్రత్యయంయొక్క అర్థాన్ని చెప్తున్నది కాబట్టి ఈ'ఇ'ప్రత్యయం క్త్వార్థం అని తాత్పర్యం. అంటే ఒకేదానిని ఆశ్రయించిఉన్నఅనేకక్రియలలో పూర్వకాలానికి చెందినదానిని బోధించటం అని అర్థం. చైత్రుడు వండి తినెను. చైత్రుడు రేపు వచ్చి, ఆమరునాడు వెళ్లగలడు. మొ.

**29. సమానకర్తృకంబు లనక సమానాశ్రయంబు లనుటంజేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధం బయ్యె.** (క్రియ. 38)

'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అనేసూత్రంలో 'సమానాశ్రయంబు' లనటంగురించి వివరిస్తున్నది ఈవాక్యం.

'సమానాశ్రయంబులం' దనేసూత్రం ఇప్రత్యయాన్ని విధిస్తున్నది. అది క్త్వార్థం అని సూరి వివరించాడు. సంస్కృతంలో ఈ 'క్త్వా' అనేప్రత్యయం 'సమానకర్తృకయోః పూర్వకాలే' అని సమానకర్తృకా లయితే వస్తుం దని చెప్పింది. అంటే ఒకేకర్త కలిగినక్రియలలో పూర్వకాలిక మైనదానిని తెలియజేసేధాతువుకు క్త్వా ప్రత్యయం విధింపబడింది. ఆఅర్థంలో విధించే 'ఇ' ప్రత్యయం కూడా సంస్కృతంలోలాగా 'సమానకర్తృకంబులందు' అని చెప్పవలసిఉండగా తెలుగులో 'సమానాశ్రయంబులం' దని విశేషంగా చెప్పడానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

'సమానకర్తృకము' లనకపోవటంచేత తెలుగులో ఇక్కడ క్రియలకు కర్త సమానంగా ఉండవలసినఅవసరం లేదు. ఉదాహరణకు– 'చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె'. ఈవాక్యంలో కొట్టుట అనేక్రియకు కర్త చైత్రుడు. కాగా మడియుట అనేక్రియకు కర్త మైత్రుడు. కాగా ఈక్రియలు (కొట్టు, మడియు) సమానకర్తృకాలు కాలేదు. మైత్రుడు కొట్టుట అనేక్రియకు కర్మ కాగా, మడియుట అనేక్రియకు కర్త అవుతాడు. అంటే కర్తృరూపంలోనూ, కర్మరూపంలోనూ ఈక్రియలు మైత్రుడు ఒక్కడినే ఆశ్రయించిఉన్నాయి. కాబట్టి క్రియలు ఇక్కడ సమానకర్తృకాలు కాలేదు. కాని, సమానాశ్రయాలు అయినాయి. కాబట్టి వీటిలో పూర్వకాలికం అయిన 'కొట్టబడు'

అనేకర్మార్థక రూపానికి క్త్వార్థం అయిన 'ఇ' ప్రత్యయం వచ్చి, 'కొట్టంబడి' అని అవుతుంది. సంస్కృతంలో లాగా సమానకర్తృకాలు అన్న ట్లయితే ఇక్కడ 'ఇ' ప్రత్యయం వచ్చేఅవకాశం లేదు. అందుకోసం సంస్కృతానికి భిన్నంగా 'సమానాశ్రయంబు' లని చెప్పబడిం దని ఈవివరణవాక్యం తాత్పర్యం.

**30. భావలక్షణంబు నా నన్యక్రియకు లక్షణభూతం బగుక్రియ.** (క్రియ. 40)

**31. చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇచట వంట లక్షణము. వచ్చుట లక్ష్యము.**

'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అనేసూత్రంలోని భావలక్షణంబు అనేపదం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

భావలక్షణం అంటే వేరొకక్రియకు లక్షణం (గుర్తు) అయినక్రియ. వేరొక వ్యాపారాన్ని సూచించే క్రియ భావలక్షణం. చైత్రుండు వండ నతిథి వచ్చెను. ఇక్కడ వండుట, (అతిథి) వచ్చుట అని రెండు క్రియలు ఉన్నాయి. 'వండుట' అనేక్రియ జరిగినపుడు అతిథి 'వచ్చుట' అనే వేరొకక్రియ జరిగింది. వచ్చుట అనేక్రియ లక్ష్యం కాగా దానికి లక్షణం వండుట అయింది. అంటే వచ్చుట అనేక్రియ(యొక్క సమయం)ను తెలియజేసేది కావటంచేత 'వండుట' అనేక్రియ భావలక్షణం అయింది. కాబట్టి ఆక్రియను బోధించే 'వండు' ధాతువుమీద 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అనేసూత్రంచేత నుజీ ప్రత్యయం వచ్చి, వండన్ అని అవుతుంది.

**32. తుమర్థంబునందును భావలక్షణంబునందును ధాతువునకు నుజీ వర్ణకం బగు.** (క్రియ. 40)

'తుమర్థభావలక్షణంబునందు నుజీ యగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

'తుమున్' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం (తుమ్–అర్థం) తుమర్థం. స్థూలంగా 'కొఱకు' అని అర్థం. వేరొకక్రియను (క్రియయొక్క సమయం మొ.) సూచించటం భావలక్షణం. 'తుమ్' అనేప్రత్యయంయొక్క అర్థంలోనూ, భావలక్షణార్థంలోనూ, ధాతువుమీద 'నుజీ' అనేప్రత్యయం వస్తుం దని అర్థం. 'నుజీ'లో జీవర్ణం ఇత్తు. కాబట్టి అది లోపించగా 'ను' అనేది మాత్రమే నిలిచిఉంటుంది.

వండు – అనేధాతువుమీద తుమర్థంలో 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అనేసూత్రంచేత 'నుజీ' అనేప్రత్యయం వచ్చి, వండు+ను. ను(జీ) జీత్తు గాబట్టి 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరిఉత్వానికి అత్వం వచ్చి, 'వండను' అనేఅవ్యయపదం ఏర్పడుతుంది.

చైత్రుండు వండను బోయెను. వండటంకోసం పోయాడు అని ఇక్కడ తుమర్థం.

ఇలాగే భావలక్షణార్థంలో నుజి వచ్చి – చైత్రుండు వండ నతిథి వచ్చెను. వచ్చుట అనేవేరొకక్రియకు లక్షణభూతం అయింది కాబట్టి 'వండు' అనేక్రియ భావలక్షణం.

**33. ఉన్నవర్ణకంబు వర్తమానార్థకశత్రర్థంబునం దగు.** (క్రియ. 46)

'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనేసూత్రం వివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

సూత్రంలోని 'భవద్భావిశతృ' అనేచోటి శతృశబ్దం భవద్, భావి అనేరెండుశబ్దాలతో అన్వయిస్తుంది. కాగా భవచ్ఛతృ, భావిశతృ అని అర్థం. యథాక్రమంగా ఉన్న అనేప్రత్యయం భవచ్ఛత్రర్థంలోనూ, కల అనేప్రత్యయం భావిశత్రర్థంలోనూ వస్తుంది.

వర్తమానార్థక మైనశత్రర్థంలో ధాతువుకు పరంగా 'ఉన్న' అనేప్రత్యయం వస్తుంది.

వండు అనేధాతువుమీద వర్తమానార్థకశత్రర్థంలో 'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనేసూత్రంచేత 'ఉన్న' అనేప్రత్యయం వచ్చి, వండు+ఉన్న. 'ఉన్నశబ్దంబు పరం బగునపుడు చువర్ణకం బగు' అనేసూత్రంచేత 'చు' ప్రత్యయం వచ్చి, వండుచు+ఉన్న. సంధి జరిగి, 'వండుచున్న' అనేకృదంతరూపం ఏర్పడుతుంది. ఈప్రాతిపదికమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి, మహదర్థంలో ప్రథమపురుష ఏకవచనంలో 'వండుచున్నవాఁడు' అనేరూపం ఏర్పడుతుంది. ఇలాగే ఇతరవిభక్తి అర్థాలలో వండుచున్నవానిని, వండుచున్నది మొ. రూపాలు అవుతాయి.

**34. కలజివర్ణకంబు భవిష్యదర్థకశత్రర్థంబునం దగు. (క్రియ. 46)**

'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనే సూత్రం వివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

సూత్రంలోని 'భవద్భావిశతృ' అనేచోటి శతృశబ్దం భవద్, భావి అనేరెండుశబ్దాలతో అన్వయిస్తుంది. కాగా భవచ్ఛతృ, భావిశతృ అని అర్థం. యథాక్రమంగా 'ఉన్న' అనేప్రత్యయం భవచ్ఛత్రర్థంలోనూ, 'కల' అనేప్రత్యయం భావిశత్రర్థంలోనూ వస్తుంది.

భవిష్యదర్థక మైనశత్రర్థంలో ధాతువుకు పరంగా 'కలజి' అనేప్రత్యయం వస్తుంది.

వండు అనేధాతువుమీద భవిష్యదర్థకశత్రర్థంలో 'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనేసూత్రంచేత 'కలజి' అనేప్రత్యయం వచ్చి, వండు+కల. 'జీత్తు పరం బగునపు డుత్వంబున కత్వం బగు' అనేసూత్రంచేత

అత్వం వచ్చి, వండ+కల. నుగాగమం, ద్రుతకార్యాలు వచ్చి, 'వండఁగల' అనేకృదంత రూపం ఏర్పడుతుంది. ఈప్రాతిపదికమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి, మహదర్థంలో ప్రథమపురుష ఏకవచనంలో 'వండఁగలవాఁడు' అనేరూపం ఏర్పడుతుంది. ఇలాగే ఇతరవిభక్తి అర్థాలలో – వండఁగలవానిని, వండఁగలది మొ. రూపాలు అవుతాయి.

**35. నవర్ణకంబు క్తవదర్థంబునం దగు.** (క్రియ. 46)

'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనేసూత్రం వివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

'క్తవత్' అనేసంస్కృతప్రత్యయంయొక్క అర్థం క్తవదర్థం. ఇది భూతార్థం. క్తవత్ అనేప్రత్యయంయొక్క అర్థంలో తెలుగులో ధాతువుమీద 'న' అనేప్రత్యయం వస్తుంది.

వందు అనేధాతువుమీద క్తవదర్థంలో 'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృ క్తవదర్థంబులం దగు' అనేసూత్రంచేత 'న' అనేప్రత్యయం వచ్చి, వండు+న. 'భూతంబునం దిగాగమం బగు' అనేసూత్రంచేత ధాతువుకు చివర 'ఇ' అనే ఆగమం వచ్చి, వండు+ఇ+న. అపదాదిస్వరసంధి జరిగి, 'వండిన' అనేకృదంతరూపం ఏర్పడుతుంది. ఈప్రాతిపదికమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి, మహదర్థంలో ప్రథమపురుష ఏకవచనంలో 'వండినవాఁడు' అనేరూపం ఏర్పడుతుంది. ఇలాగే ఇతరవిభక్తి అర్థాలలో – వండినవానిని, వండినది మొ. రూపాలు అవుతాయి.

**36. ఇవి సత్త్వాభిధానంబునం దగు నని యెఱుంగునది.** (క్రియ46.)

**37. సుబంతవాచ్యంబు సత్త్వంబు నాఁబడు.** (క్రియ. 46)

'ఉన్న కలజి న వర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' అనేసూత్రం వివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

'ఇవి' అంటే – తృవర్ణకార్థంలో వచ్చే 1. ఎడి 2. ఎడు. 3. వానికి లోపం 4. భవచ్ఛత్రర్థక మైన 'ఉన్న' 5. భావిశత్రర్థకం ఐన 'కలజి' 6. క్తవదర్థకం ఐన 'న' 7. వ్యతిరేకతృవర్ణకార్థకం ఐన 'మిజి' అనేప్రత్యయాలు ఏడు. సత్త్వం అంటే సుబంతవాచ్యం. ప్రథమ మొద లైనవిభక్తులు చివర గలిగినశబ్దాలు సుబంతాలు. దీనిని బోధించే టపుడు ఈప్రత్యయాలు వస్తాయి. పై యేడింటిలో మొదటిమూడు (వండెడి, వండెడు, వండు) తద్ధర్మాద్యర్థకాలు అయిన క్రియాపదాల(వండెడిన్, వండెడున్, వండున్)లాగా, ఉన్న ప్రత్యయాంతం (వండుచున్న) వర్తమానార్థకక్రియాపదం(వండుచున్నాఁడు)లాగా, కలజి ప్రత్యయాంతం (వండఁగల) భవిష్యదర్థక క్రియాపదం(వండఁగలఁడు)లాగా,

ఉండటాన్నిబట్టి ఇవి క్రియాపదాలు అని భ్రమించేఅవకాశం ఏర్పడుతుండగా దానిని వారించడానికి ఈవివరణం ప్రారంభింపబడింది.

ఈవివరణాన్నిబట్టి 'ఎడి' మొద లైనఈప్రత్యయాలు ధాతువుమీద క్రియను అంటే వ్యాపారాన్ని బోధించేసందర్భంలో కాక, ద్రవ్యాన్ని (వస్తువును) బోధించే సందర్భంలో వస్తాయి. వండుచున్నాఁడు (వండుచున్నవాఁడు) అంటే ('వండుచున్నాఁడు' అనేవర్తమానార్థక క్రియాపదం లాగా) వంట చేస్తున్నాడు అనేవిధంగా అర్థం వ్యాపారం కాదు. వంట చేసేవాడు అనేవిధంగా వంట చేసేవ్యక్తి అని అర్థం. ఇలాగే 'ఎడి' మొద లైన ఇతరప్రత్యయాలవిషయంలోనూ గ్రహించాలి.

**38. ఎడిప్రభృతివర్ణకాంతంబు లేడును ధాతుజవిశేషణము లని ప్రాచీనులు వ్యవహరింతురు.** (క్రియ. 47)

'వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజీ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఎడి మొద లైనప్రత్యయాలు ఏడు. అవి–

'తృవర్ణకార్థంబునం దెడియెడు వన్నియ లగు, వానికి లోపంబు బహుళంబుగా నగు'. 1. ఎడి (వండెడివాఁడు), 2. ఎడు, (వండెడువాఁడు), 3. వానికి లోపం (వండువాఁడు).

'ఉన్న కలజి నవర్ణకంబులు భవద్భావిశతృక్తవదర్థంబులం దగు' 4. ఉన్న (వండుచున్నవాఁడు) 5. కలజి (వండఁగలవాఁడు) 6. న (వండినవాఁడు)

'వ్యతిరేకతృవర్ణకార్థంబున నిజీ యగు' 7. నిజీ (వండనివాఁడు)

ఎడి – మొద లైన ఏడుప్రత్యయాలు చివర గలిగినశబ్దాలను ధాతుజవిశేషణాలు అని పూర్వలాక్షణికులు పేర్కొన్నారు. ధాతువునుండి పుట్టిన (సుబంతరూపాలు) విశేషణాలు కాబట్టి ఇవి ధాతుజవిశేషణాలు.

**40. సకర్మకంబు నాఁ గర్మాకాంక్షోత్థాపకంబు.** (క్రియ. 48)

'లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు'. అనేసూత్రంలోని సకర్మకం అనేసంజ్ఞ అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

చూ. పారిభాషికపదవివరణం. సకర్మకము.

**41. అకర్మకంబు నాఁ గర్మాకాంక్షానుత్థాపకంబు. (క్రియ. 48)**

'లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును, లాఁతికిం గర్తయందు నగు'. అనేసూత్రంలోని సకర్మకం అనేసంజ్ఞ అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

చూ. పారిభాషికపదవివరణం. అకర్మకము.

**42. ఏకస్వరధాతు ద్విస్వరధాతువులమీఁదియించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు.** (క్రియ. 50)

'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు'. అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఒకటి లేదా రెండు అచ్చులు ఉన్న ధాతువుమీద ఉన్న ఇంచుగాగమానికీ, ఎ, ఎడి, ఎడు, ఎద మొద లైనవాటిలో మొదటి 'ఎ' అనేవక్రవర్ణానికి ముందు ఇయుట్ అనేఆగమం వస్తుం దని అర్థం. ఇయుట్ అనేఆగమంలో చివరి 'ట' కారం ఇత్తు. కాబట్టి అది లోపిస్తుంది. టిత్తు కావటంచేత 'ఇయు' అనేఆగమం ఇంచుగ్వక్రాలకు ముందుగా వచ్చి చేరుతుంది. మిగిలిన 'ఇయు'లో చివరి'ఉ'కారం ఉచ్చారణ సౌకర్యార్థం చేర్పబడింది. కాబట్టి అది కూడా లోపించగా, 'ఇయ్' అనేది మాత్రమే ఆగమం అవుతుంది.

1. ఏకస్వరధాతువు – ఇంచుక్కు పరంగా ఉండగా ఇయుడాగమం.

   భుజ్+ఇంచు. భుజ్ + ఇయ్ + ఇంచు = భుజియించు.

2. ద్విస్వరధాతువు – వక్రం పరంగా ఉండగా ఇయుడాగమం.

   నగు+ఎను. నగు + ఇయ్ + ఎను = నగియెను.

విభాష కాబట్టి ఇయుడాగమం రానిపక్షంలో భుజించు, నగెను.

**43. గురుమంతం బగుధాతువునకును, యాంతం బగుధాతువునకును మీఁదియించుగ్ వక్రంబుల కియుడాగమంబు రాదు.** (క్రియ. 50)

'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు'. అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. ఇది పైసూత్రంలోని 'గురువిరహితంబులు, అయాంతంబులు' అనేదళాలసార్థక్యాన్ని గురించి వివరిస్తున్నది.

ఏకస్వరధాతువులు, లేదా ద్విస్వరధాతువులమీద ఉన్న ఇంచుక్కుకు, వక్రములకు పైసూత్రంచేత ఇయుడాగమం వస్తుంది.

ఏకస్వరం, లేదా ద్విస్వరం అయినా, ధాతువులో గురువు ఉంటే ఇయుడాగమం రాదు. యాచ్+ఇంచు. యాచ్ ధాతువు ఏకస్వరం. ఇంచుక్కు పరంగా ఉన్నది. అయినా, గురుమంతం కావటంచేత ఇయుడాగమం రాదు. యాచించు.

యాచియించు అని ఉండదు. ఇలాగే అర్థించు. మొ.

ఏకస్వరం, లేదా ద్విస్వరం (గురువు లేనిదీ) అయినా, ధాతువు యాంతం అయితే అంటే ధాతువుచివర యకారం ఉంటే ఇయుడాగమం రాదు. వ్యయ+ఇంచు. వ్యయ– ధాతువు ద్విస్వరం. 'ఇంచు' పరంగా ఉంది. అయినా, యకారాంతం కావటంచేత ఇయుడాగమం లేదు. కాబట్టి 'వ్యయియించు' అని కాదు. 'వ్యయించు' అనే ఉంటుంది. ఇలాగే జయ్+ఇంచు. జయించు. 'జయియించు' అని కాదు.

**44. ఇంచుగ్వ్యవధానంబునం జేసి సంస్కృతధాతువులు వక్రపరకంబులు లే వని యెఱుంగునది.** (క్రియ. 50)

'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం ఏకస్వర, ద్విస్వరా లయినసంస్కృతాచ్ఛికధాతువులకు అన్నింటికి ఇంచుక్కు కాని, 'ఎ' అనేవక్రం కాని పర మైనపుడు ఇయుడాగమం వస్తుంది.

సంస్కృతధాతువులకు అన్నింటికి తెలుగులో 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వస్తుంది. భుజ్+ఇంచు, గుణ+ఇంచు మొ. కాబట్టి సంస్కృతధాతువులకు పరంగా తప్పనిసరిగా ఇంచుక్కు ఉండవలసి రావటంచేత వక్రం పరంగా ఉండటం సంభవించదు. ఇంక భుజ్+ఇంచు+ఎను, భుజ్+ఇంచు+ఎదును మొ. విధంగా వక్రం ఇంచుక్కుకే పర మవుతుంది. అందుచేత సంస్కృతధాతువులకు ఇంచుక్కుతో ఎడం ఉండటంచేత వక్రం పరంగా ఉండటం జరగదు. కాబట్టి సంస్కృతధాతువులకు వక్రపరకతలో ఇయుడాగమం రావటం జరగదు. అని ఈవాక్యం వివరిస్తున్నది.

**45. జి+ఇంచు అనుచోట నిత్యం బగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతం బగుటంజేసి యియుడాగమంబు లే దని యెఱుంగునది.** (క్రియ. 50)

'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'జి' అనేధాతువుకు 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం రాగా – జి+ఇంచు. ఇపుడు 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనేసూత్రంచేత అయుగాగమమూ, 'గురువిరహితంబు

లయి -' అననేసూత్రంచేత ఇయుడాగమమూ రావలసిఉంది. కాని ఈరెండింటిలో- నిత్యం కావటంచేత అయుగాగమం చేయగా, జి+అయ్+ఇంచు=జయ్+ఇంచు అని కాగా, ధాతువు యకారాంతం అయింది. కాబట్టి 'గురువిరహితంబు లయి యయాంతంబు లయిన' అని యకారాంతాలు కాని వాటికి విధించిన ఇయుడాగమం ఇక్కడ రాదు. 'జయియించు' అని కాదు. కాగా జయ్ ఇంచు జయించు అని మాత్రమే అవుతుంది. అయుగాగమం నిత్యం గాబట్టి అది రాకుండా, ఇయుడాగమం వచ్చి 'జియించు' అని కూడా ఉండదు.

**46. కృతాకృతప్రసంగి నిత్యంబు నాఁబడు.** (క్రియ. 50)

'గురువిరహితంబు లయి యయాంతంబు లయినయేకస్వరద్విస్వరంబులయించు గ్వ్రక్రంబుల కియుడాగమంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'జి+ఇంచు అనుచోట నిత్యం బగుటంజేసి యయుగాగమంబు రాఁగా యాంతం బగుటంజేసి యియుడాగమంబు లే దని యెఱుంగునది.' అనేపూర్వవివరణవాక్యంలో అయుగాగమం 'నిత్యం' అనటంచేత అసలు నిత్యం అంటే ఏమిటో ఈవాక్యం వివరిస్తున్నది.

కృత అకృత ప్రసంగి అంటే సమాన మైన అవకాశం గలిగిన రెండు విధులలో రెండవది ప్రవర్తించినా(కృత), ప్రవర్తింపకపోయినా(అకృత), ప్రవర్తించేఅవకాశం కలిగినది అని అర్థం. అటువంటి విధానం నిత్యం అంటే తప్పకుండా ప్రవర్తించేది అవుతుంది అని అర్థం.

'జి' అనేధాతువుమీద 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, 'జి+ఇంచు' అని కాగా 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనేసూత్రంచేత అయుగాగమమూ, 'గురువిరహితంబు లయి-' అనేసూత్రంచేత ఇయుడాగమమూ రెండూ రావలసిఉంది. వీటిలో అయుగాగమం చేస్తే 'జయ్+ఇంచు' అని కాగా ఇపుడు ధాతువు యకారాంతం అయింది, కాబట్టి అయాంతాలకు చెప్పినఇయుడాగమం రాదు. అంటే అయుగాగమం వస్తే ఇయుడాగమం రాదు.

ముందుగా ఇయుడాగమం చేస్తే జి+ఇయ్ ఇంచు. జి+ఇయించు. 'యదాగమా స్తద్గుణీభూతాః తద్గ్రహణేన గృహ్యన్తే' అనేన్యాయాన్ని అనుసరించి ఇంచుక్కుకు ఆగమం అయిన ఇయుడాగమం ఇంచుగాగమావయవం అవుతుంది. కాగా ఇయుట్టు వచ్చినా ఇంచుగాగమం పరంగా ఉన్నట్లే. కాబట్టి ఇకారాంతధాతువుకు ఇంచుగాగమం

పరంగా ఉండటంచేత అయుగాగమం రావడానికి ఇబ్బంది లేదు. అంటే ఇయుడాగమం వచ్చినా, అయుగాగమం రావటానికి బాధ లేదు. కాగా అయుగాగమం వస్తే ఇయుడాగమం రాదు. కాని, ఇయుడాగమం వచ్చినా, రాకపోయినా, అయుగాగమం ప్రవర్తించేఅవకాశం ఉంది. అందుచేత అయుగాగమం కృతాకృతప్రసంగి (ఇయుడాగమం వచ్చినా, రాకున్నా వచ్చేది) కాబట్టి నిత్యం.

ఇలా నిత్యవిధి కావటంచేత అయుగాగమం తప్పకుండా చేయాలి. అయుగాగమం చేస్తే ఇయుడాగమం రాదు. కాబట్టి జి+ఇంచు – జి+అయ్+ఇంచు = జయించు అనే అవుతుంది. ఇయుడాగమం రాదు కాబట్టి 'జియించు' అనేవిధంగా కాదు.

**47. ఇదియె ఆత్మనేపదార్థ మని వ్యవహరింతురు. (క్రియ. 52)**

'క్రియాఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'ఇదియె' అంటే సూత్రంలో చెప్పిన 'క్రియాఫలంబు కర్తృగామి యగుట'. క్రియాఫలం కర్తను పొందటం అనేఅర్థానికి ఆత్మనేపదార్థం అని పేరు. క్రియ అంటే వ్యాపారంయొక్క ఫలం, కర్త(ఆక్రియను చేసినవాడు)ను పొందినపక్షంలో అది ఆత్మనేపదం అనబడుతుంది. ఈఅర్థంలో ధాతువుమీద 'కొను' అనేధాతువు అనుప్రయుక్తం అవుతుంది. లడాదిలకారాలు ఈ'కొను'ధాతువుమీద వస్తాయి.

దేవదత్తుడు వండుకొనెను. ఈవాక్యంలో వండుకొనెను క్రియాపదం. ఇందులో వండుట అనేది వ్యాపారం (క్రియ). దానికి ఫలం 'వంట'. అంటే వండబడినపదార్థం. ఇది వండుట అనేవ్యాపారానికి ఆశ్రయం అయిన అంటే కర్త అయిన దేవదత్తుని మాత్రమే పొందుతుంది. 'వండుకొనెను' అనేక్రియాపదానికి 'వంట చేసుకున్నాడు' అని అర్థం. వంట 'తనకోసం' చేసుకున్నాడు అన్నమాట. అంటే వండినపదార్థాన్ని దేవదత్తుడు మాత్రమే తింటాడు. కాగా ఈవాక్యంలో 'వండు' ధాతువు 'క్రియాఫలము కర్తృగామి యగుట' అనే అర్థంలో ఉన్నది. కాబట్టి ఇది ఆత్మనేపదార్థం. కొనుధాతువు లేకపోతే ఈఅర్థం రాదు. 'వండెను' అంటే తనకోసం వండుకున్నాడు అనేఅర్థం లేదు. కాబట్టి 'వండెను' ఆత్మనేపదార్థం కాదు.

**48. బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు. (క్రియ. 53)**

'కొనుధాతువు పరం బగునపు డిగాగమంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోనిబహుళశబ్దప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. 'క్రియా

ఫలంబు కర్తృగామి యగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తం బగు' అనేసూత్రంచేత ఆత్మనేపదార్థంలో ధాతువుమీద 'కొను' ధాతువు చేరగా, అది పరంగా ఉన్నపుడు ముందరిధాతువుకు చివర ప్రస్తుతసూత్రంచేత హ్రస్వ మైన ఇకారం ఆగమంగా వస్తుంది. బహుళం అనటంచేత ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యాలుగా ఈకార్యం నాలుగువిధాలుగా ప్రవర్తించవచ్చు. అందులో ప్రవృత్తిస్థలం ఇది.

యకారాంతం అయినధాతువుకు ఆత్మనేపదం లేదా స్వార్థం మొద లైనఅర్థాలలో కొనుధాతువు చేరినపుడు అది పరంగా ఉండగా పూర్వంలోనియకారాంతధాతువుకు తర్వాత హ్రస్వ మైన ఇకారం నిత్యంగా ఆగమంగా వస్తుంది. ఉదా. చేయుధాతువుపై ఆత్మనేపదార్థంలో కొను ధాతువు చేరి, చేయు+కొను. చేయు ధాతువు యకారాంతం అయింది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత ఇకారం నిత్యంగా ఆగమం అయి, చేయు+ఇ+ కొను. ఇపుడు 'ఇకారవక్రంబు లుక్తంబులందలివి పరంబు లగుచో యాకు సకారం బగు' అనేసూత్రంచేత యకారానికి సకారం వచ్చి, చేసు+ఇ+కొను. అపదాదిస్వరసంధి జరిగి - చేసికొను. ఇలాగే 'తీసికొను, వేసికొను' మొ.

'నిత్యం' అనటంచేత ఇగాగమం రానిరూపాలు ఉండవు. కాబట్టి చేయుకొను, లేదా చేసుకొను ఇత్యాదిగా ఇగాగమం రానిరూపాలు లక్షణవిరుద్ధాలు.

**49. బహుళం బనుటచే దీనికి నొకానొకచో నతిచారం బని యెఱుంగునది.**

(క్రియ. 60)

'ముఙు పరం బగునపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం. ఈసూత్రంలోని బహుళశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

సూత్రంలోని బహుళశబ్దంచేత ఈకార్యం ప్రవృత్తి, అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగువిధాలుగా ప్రవర్తింపవచ్చును. అందులో అన్యకార్యంగా ఈకార్యం ఇతరస్థలాలలో కనిపిస్తున్నది.

అతిచారం అంటే లక్షణంలో చెప్పబడినదానికంటె ఇతర(అధిక)స్థలాలలో చరించటం. లక్షణం ప్రకారం ముఙు పరంగా ఉన్నపుడు మాత్రమే 'కొను' ధాతువుకు 'కో' అనేఆదేశం రావలసిఉంది. కాని ముఙుకంటె ఇతర మైనది పర మైనపుడు గూడా ఈఆదేశం వస్తున్నది అని ఈవాక్యానికి తాత్పర్యం.

అనుప్రయుక్తం అయిన కొనుధాతువుకు 'ముఙు'కంటె వే రైన జీత్తు పర మైనపుడు ఈఆదేశం వస్తున్నది.

వ్యతిరేకార్థంలో లజిలకారంలో చదువుకోఁడు. ఇక్కడ ప్రథమపురుష ఏకవచనంలో చదువుకొను+డుజ్ అని ఉండగా కొనుకు 'కో' ఆదేశం ఐ, 'చదువుకోఁడు' అని అయింది. ఇలాగే ఇతరపురుషవచనాలలో – చదువుకోరు, చదువుకోవు, చదువుకోము మొ. ఇలాగే కజి పరమైనపుడు చదువుకోక.

లృట్టులో 'కలజి' పర మైనపుడు– చదువుకోఁగలఁడు, చదువుకోఁగలము మొ.

ఇక్కడ 'కో' అనేఆదేశం రానిపక్షంలో సాధారణంగా – చదువుకొనఁడు, చదువుకొనక, చదువుకొనఁగలఁడు ఇత్యాదిగా రూపాలు ఉంటాయి.

అనుప్రయుక్తం కాక, ప్రత్యేకంగా ఉన్న కొనుధాతువుకు ముబు పరంగా ఉన్నపుడు కొమ్ము, కొండు ఇత్యాదిగా ఈకార్యాలు పైలక్షణానికి అనుగుణంగా వస్తాయి. కాని జీత్తు పరంగా ఉన్నపుడు మాత్రం (చదువుకోఁడు) కోఁడు, (చదువుకోక) కోక, (చదువుకోఁగలఁడు) కోఁగలఁడు ఇత్యాదిగా రూపాలు ఉండవు. ఇంక కో ఆదేశం లేని కొనఁడు, కొనక, కొనఁగలఁడు ఇత్యాదిగానే రూపాలు ఉంటాయి.

**50. సంస్కృతధాతువుల కంగలాదుల కించు క్కగు.** (క్రియ. 63)

'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. చూ. సూత్రవ్యాఖ్య,

**51. నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు.** (క్రియ. 65)

చూ. నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. చూ. సూత్రవ్యాఖ్య.

**52. ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయం దించుగాగమం బగు నని యెఱుంగునది.** (క్రియ. 65)

'నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు' అనేసూత్రవివరణంలోనిది ఈవాక్యం.

'నిర్జినామంబులకు..' అనేఈసూత్రం నామంబులకు అంటే ప్రాతిపదికలకు పైని ఇయుడాగమం రా దని చెప్తున్నది. 'అర్థవ దధాతుః–' అనేలక్షణాన్ని అనుసరించి ప్రాతిపదికలు ధాతువులు కావు. 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రం ప్రకారం ఇంచుగాగమం ధాతువులకు మాత్రమే వస్తుంది. కాబట్టి ప్రాతిపదికలకు పైని ఇంచుగాగమం రాదు. 'ఇఉఋుల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనేసూత్రంచేత అయుగామం ఇంచుగామం పరంగా

ఉన్నపుడే వస్తుంది. ప్రాతిపదికలు ధాతువులు కాకపోవటంచేత ఇంచుగాగమమే రాకపోతుండగా, ఇంచుగాగమం పరంగా ఉండదు, కాబట్టి అయుగాగమం కూడా ప్రాప్తించదు. ప్రాప్తించనిఅయుగాగమకార్యాన్ని నిషేధించ నవసరం లేదు.

కాగా ఈసూత్రంలో 'నామంబులకు' అనేదళం వ్యర్థం. శాస్త్రంలో ఇలా వ్యర్థం అయిన అంశం వేఱొకఅంశాన్ని జ్ఞాపకం చేస్తుంది. ఆప్రకారంగా ఈసూత్రంలోని 'నామంబులకు' అనేపదంచేత ధాతువులుగా వివక్షించినపుడు ప్రాతిపదికలు గూడా కొన్ని ధాతువులు అవుతా యనీ, అలా ధాతువులు అయినపుడు ధాతువు లయిన ప్రాతిపదికలకు కూడా ఇంచుగాగమం వస్తుం దనీ విశేష మైనఅర్థం కలుగుతుం దని ఈవివరణవాక్యం తెలియజేస్తున్నది. దీనివలన 'శయన' మొద లైన సంస్కృతనామాలకు, 'పయన' మొద లైన ఆచ్ఛికనామాలకు ధాతుత్వవివక్షలో ఇంచుగాగమం వచ్చి - శయనించు, పయనించు ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి. వీటినే నామధాతువులు అంటారు.

స్తుతి+ఇంచు, నుతి+ఇంచు ఇత్యాదిస్థలాలలో ఇంచుక్ప్రరకతలో నామాలకు రావలసిన అయుగాగమం నివారిస్తూ, జ్ఞాపకసిద్ధ మైనఅర్థంచేత ప్రస్తుతసూత్రంలోని 'నామంబులకు' అనేదళం సార్థకం అవుతుంది.

**53. అ ఏ ఓ ఈమూఁడును గుణంబులు నాఁబడు.** (క్రియ. 66)

**54. ఋస్థానికం బగు గుణంబు రపరం బయియుండు.** (క్రియ. 66)

'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనేసూత్రంలోని గుణం అనేసంజ్ఞను ఈవాక్యం వివరిస్తున్నది.

'అదేఙ్ గుణః' అనేలక్షణంతో సంస్కృతవ్యాకరణం అ, ఏ, ఓ అనేమూడు వర్ణాలకు 'గుణము' అనేసంజ్ఞను పేర్కొన్నది. కాబట్టి అ, ఏ, ఓ అనేవర్ణాలు గుణములు అవుతాయి. ఇ, ఉ, ఋ అనేలఘూపధలకు మూడిటికి ఇవి క్రమంగా వస్తాయి. అంటే 'ఇ' కారం స్థానంలో 'ఏ' అనేగుణం, 'ఉ'కారస్థానంలో 'ఓ', 'ఋ'కారం స్థానంలో 'అ' అనేగుణమూ వస్తాయి. ఉదా. భిద్ + ఇంచు. ఇకారానికి ఏకారం వచ్చి - భేదించు. ఘుష్+ఇంచు. ఉకారానికి ఓకారం వచ్చి- ఘోషించు.

ఋకారం స్థానంలో వచ్చే 'అ' అనేగుణవర్ణం రవర్ణం అంటే 'ర్' అనేవర్ణం పరంగా కలిగి (అర్ అనేరూపంతో) వస్తుంది. ఉదాహరణకు హృష్+ఇంచు అని ఉండగా ఋకారం స్థానంలో గుణ మైన 'అ' కారం 'ర్' పరంగా ఉండి వచ్చి, హర్ష్+ఇంచు=హర్షించు అని అవుతుంది. ఇలాగే వృష్+ఇంచు=వర్షించు.

**55. సంస్కృతధాతూపధలకు ఇ,ఉ,ఋ అనువానికి సొరిదిని ఏ,ఓ,అర్ అనునవి ఇంచుక్కు పరం బగునపు డగు నని యెఱుంగునది.** (క్రియ. 66)

చూ. 'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' సూత్రవ్యాఖ్య.

**56. కుచధాతువునకు గుణంబు లే దని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు.** (క్రియ. 68)

'లిఖభుజరుచకృశంబులకు గుణంబు లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరం బగునపుడు గుణం బగు' అనేసూత్రం ప్రకారం రావవసినగుణం లిఖ, భుజ, రుచ, కృశ, అనేధాతువులకు మాత్రమే ప్రస్తుతసూత్రం నిషేధించింది. 'కుచ' ధాతువుకు కూడా గుణం లే దని పూర్వం ఒకానొకవ్యాకర్త చెప్పడం జరిగింది. మఱి ఇక్కడ 'కుచ' ధాతువు గూడా సూత్రంలో పఠించవలసిఉన్నది గదా అని సందేహం కలుగుతుండగా సూరి సమాధానంగా ఇలా వివరించాడు.

ఆంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్య వ్రాస్తూ అహోబలుడు అనే ప్రసిద్ధవ్యాకర్త కుచ ధాతువుకు గుణం లే దని చెప్పాడు. అది గ్రహింపదగినది కాదు అని సూరి నిర్ణయం. కవిప్రయోగాలలో 'సంకోచించు' ఇత్యాదిగా 'కుచ' ధాతువుకు గుణం ఉన్నది. కాబట్టి గుణం లేదనే లక్షణం లక్ష్యవిరుద్ధం కాబట్టి గ్రహింపదగినది కా దని, అందుకే కుచ ధాతువును ప్రస్తుతగుణనిషేధ లక్షణంలో చేర్చ లే దని సూరి ఈవివరణవాక్యతాత్పర్యం.

**57. ఈయాదేశయోగంబున ఛిదాదు లకర్మంబు లగు.** (క్రియ. 71)

'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

వివరణంలోని ఈఆదేశం అంటే రంజాదుల అనేసూత్రంచేత వచ్చే ద్విరుక్త లకారాదేశం. అకర్మకం అంటే కర్మను గూర్చినఆకాంక్ష లేనిది. పైనున్న ఇంచుక్కులోని బిందుపూర్వక చకారానికి ద్విరుక్తలకారం ఆదేశం వచ్చినసందర్భంలో రంజ్ మొద లైనధాతువులు అకర్మకాలు అవుతాయి అని అర్థం. సంస్కృతాలు అయిన ఈధాతువులు సంస్కృతంలో సకర్మకాలు అయినా తెలుగులో అకర్మకాలు కావటం విశేషం. కాబట్టి ప్రత్యేకంగా వివరింపబడింది. 'ప్రజలు రంజిల్లిరి'. ఇచట దేనిని రంజిల్లిరి

అనేవిధంగా కర్మను గూర్చినఆకాంక్ష లేదు. కాబట్టి ఇక్కడి రంజ్ ధాతువు అకర్మకం. ఇలాగే విల్లు భేదిల్లెను. మొ.

ద్విరుక్తలకారాదేశం రానిసందర్భంలో ఇవి సకర్మకాలే అవుతాయి. రాముడు ప్రజలను రంజించెను. ఇచట రంజించెను అంటే దే(వే)నిని అనేవిధంగా కర్మను గూర్చినఆకాంక్ష కలుగుతున్నది. కాబట్టి ఇది సకర్మకం. ఇలాగే 'రాముడు శివ ధనుస్సును భేదించెను'. మొ.

### 58. లాదేశంబున కపవాదంబు. (క్రియ. 72)

'ఇంచుక్కు పరం బగునపుడు రంజాదులయించుక్కునకు లోపం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇంచుక్కు పరం బగునపుడు..' అనేసూత్రం స్వార్థంలో ధాతువుపై (మొదట) వచ్చిన ఇంచుక్కుకు లోపం విధిస్తున్నది. కాని 'రంజాదులయించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారం బగు' అనేసూత్రంచేత ఆఇంచుక్కులో బిందుపూర్వకచకారానికి ద్విరుక్తలకారం రావలసిఉంది. మరి ఏది చేయాలి? అంటే సూరి సమాధానంగా ఇలా వివరించాడు.

ద్విరుక్తలకారవిధికి ఇంచుక్కులోపవిధి అపవాదం. 'పరనిత్యాంతరంగ అపవాదానా ముత్తరోత్తరం బలీయః' అనే సంస్కృతసంప్రదాయాన్ని అనుసరించి అపవాదవిధి అయిన లోపం ద్విరుక్తలకారాదేశవిధిని బాధిస్తుంది. అందుచేత ద్విరుక్తలకారం ఆదేశం రాకుండా, ఈఅపవాదవిధిప్రకారం స్వార్థేంచుక్కుకు లోపం వస్తుంది. రంజ్ ధాతువుమీద స్వార్థంలో ఇంచుక్కు వచ్చి, రంజ్+ఇంచు. దానిమీద ప్రేరణంలో ఇంచుక్కు వచ్చి, రంజ్+ఇంచు+ఇంచు. ఇంచుక్కు పరం బగునపుడు అనేసూత్రంచేత మొదటిస్వార్థఇంచుక్కు లోపించి, రంజ్+ఇంచు, రంజించు. ఇలాగే 'భేదించు' మొ.

### 59. వక్ష్యమాణంబు పుగాగమంబు. (క్రియ. 73)

'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'విను' ధాతువుయొక్క ప్రేరణరూపాలను గురించి ప్రస్తావిస్తూ సూరి ఇలా వివరించాడు. విను ధాతువుమీద ప్రేరణార్థంలో 'చుగాగమంబు –' అనేసూత్రంచేత చుగాగమం వచ్చి 'వినుచు' అని అవుతుంది. దానితోపాటు చెప్పబోయేలక్షణం ప్రకారం మరొకరూపం కూడా ఏర్పడుతుంది. బహుళం కాబట్టి చుగాగమం

రానిపక్షంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, 'విను+ఇంచు'. 'అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు, మానునకు విభాష నగు' అనేచెప్పబోయేసూత్రంచేత పుగాగమం వచ్చి, (ముందు ఇత్వంతో) 'వినిపించు' అనేరూపం ఏర్పడుతుంది.

### 60. బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు. (క్రియ.73)

'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఈసూత్రంచేత చుగాగమం బహుళంగా విధింపబడింది. కాబట్టి ఈకార్యం ప్రవృత్తి అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగువిధాలుగా రావచ్చు. అందులో అప్రవృత్తి స్థలాన్ని సూరి ఈవాక్యంలో వివరిస్తున్నాడు.

అను ధాతువు. ఇది ఆచ్ఛికం. నకారాంతం. ఆనకారం సంయుక్తం కాదు. కాబట్టి ఈధాతువుమీద ప్రేరణంలో పైసూత్రం ప్రకారం చుగాగమం రావచ్చు. కాని బహుళం అనడంచేత ఇక్కడ అప్రవృత్తి. చుగాగమం రాదు. 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, అను+ఇంచు. 'అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు' అని పుగాగమం వచ్చి, అనుప్+ఇంచు=అనుపించు.'ఇత్వంబు గాని యెత్వంబు గాని గూడుచో–' అనేసూత్రంచేత ముందరిఉత్వానికి ఇత్వం వచ్చి 'అనిపించు' అని అవుతుంది. చుగాగమం రాదు కాబట్టి ప్రేరణంలో 'అనుచున్నాఁడు' ఇత్యాదిగా రూపాలు ఉండవు.

### 71. దీనియత్వంబునకు దీర్ఘంబు నగు. (క్రియ.73)

'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఈసూత్రంచేత చుగాగమం బహుళంగా విధింపబడింది. కాబట్టి ఈకార్యం ప్రవృత్తి అప్రవృత్తి, విభాష, అన్యకార్యం అని నాలుగువిధాలుగా రావచ్చు. అందులో (అప్రవృత్తి) అన్యకార్యాన్ని సూరి ఈవాక్యంలో వివరిస్తున్నాడు.

'కను'ధాతువు ప్రేరణరూపాలను వివరిస్తూ సూరి ఈవివరణం చేశాడు. 'చుగాగమంబు–' అనేసూత్రంలోని 'బహుళ'శబ్దంచేత కను ధాతువుమీద ప్రేరణార్థంలో చుగాగమానికి అప్రవృత్తి. కాబట్టి చుగాగమం రాదు. ఇంక 'సర్వంబునకుం

బ్రేరణంబునం దించు క్కగు' అని ఇంచుగాగమం వచ్చి, కను+ఇంచు. 'అన్వాదుల కించుక్కు పరం బగునపుడు పుగాగమం బగు' అని పుగాగమం వచ్చి ముందు ఇత్వంతో 'కనిపించు'. ప్రస్తుతసూత్రంలోని బహుళపదంచేత అన్యకార్యంగా మొదటి (కకారంమీది)అచ్చుకు ఒకపక్షంలో దీర్ఘం వస్తుంది. అలా దీర్ఘం వచ్చినపుడు 'కానిపించు' అని రూపం సిద్ధిస్తుంది. 'దీర్ఘంబును' అనేచోటిసముచ్చయంచేత దీర్ఘం వికల్పం కాబట్టి దీర్ఘం రానిపక్షంలో హ్రస్వంతో 'కనిపించు' అనేరూపం కూడ ఉంటుంది.

**72. బాహుళకంబున దీని కించుక్కు లేదు.** (క్రియ. 74)

'అట్లు పుగాగమంబు మాన్వాదుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు' అనేపూర్వసూత్రాన్ని అనుసరించి 'అట్లు పుగాగమంబు మాన్వాదుల కగు' అనేసూత్రం లోని 'అట్లు' అనేపదానికి 'బహుళముగా' అని అర్థం. 'మను' అనేధాతువు మాన్వాదులలోనిది. కాబట్టి ప్రస్తుతసూత్రంచేత పుగాగమం వస్తే, 'మనుపు'. చుగాగమం వస్తే, 'మనుచు' అనీ అవుతుంది. 'మనుపుచున్నాఁడు, మనిచెను' మొ. చుక్పుగాగమాలు రెండూ రానిపక్షంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం రావాలి. కాని ప్రస్తుతసూత్రంలో బహుళము అనటంచేత ఇంచుగాగమం మను ధాతువుకు రాదు. కాబట్టి 'మనించు' అనేరీతిరూపాలు ఉండవు. అంటే బహుళశబ్దంచేత చుగాగమం రానిపక్షంలో పుగాగమం నిత్యంగా వస్తుం దని పుగాగమానికి ప్రవృత్తిని వ్యాఖ్యానించుకోవాలి.

**73. అఁగుప్రభృతు లుభయగణంబులు.** (క్రియ. 76)

'అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్వాదుల కగు, నగుచో వానికడద్రాలు లోపించు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అఁగు మొద లైనధాతువులు రెండు గణాలలోనూ చేరిఉంటా యని ఈవాక్యానికి అర్థం. పైసూత్రంలో అడంగ్వాదులు, మాయ్వాదులు అని రెండు(ధాతువుల)గణాలు చెప్పబడ్డాయి. ప్రేరణార్థంలో అడంగ్వాది గణధాతువులకు చుగాగమమూ, మాయ్వాది గణధాతువులకు పుగాగమమూ, వస్తాయి. అఁగు మొదలైనధాతువులు అడంగ్వాదుల లోనూ, మాయ్వాదులలోనూ రెండు గణాలలో చేరిఉన్నాయి. కాబట్టి అడంగ్వాది

పక్షంలో చుగాగమం వస్తుంది. మాయ్వాదిపక్షంలో పుగాగమం వస్తుంది. ఈఆగమాలు వచ్చినపుడు ధాతువులో చివరిఅక్షరం లోపిస్తుంది.

ఆఁగు ధాతువుకు అడంగ్వాదులోనిపక్షంలో చుగాగమం వచ్చి, చివరిఅక్షరం లోపించగా, ఆఁచు. ఆఁచెను మొ. మాయ్వాదిపక్షంలో పుగాగమం వచ్చి, చివరి అక్షరం లోపించగా, ఆఁపు. ఆఁపెను మొ. బహుళం అనటంచేత రెండూ రానిపక్షంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' ననేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి ఆఁగించు అని కూడా అవుతుంది. ఇలాగే రేఁగు – రేఁచు, రేఁపు, రేఁగించు. మొ.

**74. బాహుళకంబునం జేసి కొన్నింటి కించుక్చుక్పుగాగమంబులు మూఁడును, గొన్నింటి కందు యథాసంభవంబుగా రెండును, గొన్నింటి కొక్కటియు నగు నని యెఱుంగునది. (క్రియ. 76)**

'అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాదిమాయ్వాదుల కగు, నగుచో వానికడవ్రాలు లోపించు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. ఈసూత్రంలోని బహుళశబ్దానికి ప్రయోజనాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ఆఁగు మొద లైనధాతువులు అడంగ్వాదులలోను, మాయ్వాదులలోనూ చేరిఉన్నాయి. కాబట్టి పైసూత్రంచేత చుగాగమమూ, పుగాగమమూ, అవి రెండూ రానపుడు 'సర్వంబునకుం బ్రేరణంబునం దించు క్కగు' నని ఇంచుగాగమమూ అనేవి మూడు రావాలి. అవి ఎలా వస్తాయో సూరి ఇలా వివరిస్తున్నాడు.

1. సూత్రంలో బహుళం అనటంచేత ఆఁగు మొద లైనవాటిలో కొన్నింటికి చుక్, పుక్, ఇంచుక్ అనేఆగమాలు మూడూ వస్తాయి. ఆఁచు, ఆఁపు, ఆఁగించు.

2. ఆఁగు మొద లైనవాటిలో కొన్నింటికి ఈమూడు ఆగమాలలో ఏవో రెండు మాత్రమే వస్తాయి. పాయుధాతువుకు చుక్, పుక్ అనేఆగమాలు రెండే వస్తాయి. అంటే ఇంచుగాగమం రాదు. పాచు, పాపు. ('పాయించు' అని ఉండదు.)

3. ఆఁగు మొద లైనవాటిలోనికొన్నిటికి ఒక్కఆగమం మాత్రమే వస్తుంది. విఱుగు–విఱుచు, మొ. వాటికి చుగాగమం ఒక్కటే వస్తుంది. ఇక్కడ విఱుపు, విఱిగించు ఇత్యాదిగా ఇతరాగమాలతో రూపాలు ఉండవు. చూచు–చూపు, లేచు–లేపు. మొ. వాటికి పుగాగమం ఒక్కటే వస్తుంది.

**75. అనుప్రయుక్తం బగుపోవునకుఁ బుచ్చు మాత్రం బగు.** (క్రియ. 77)

'ఇంచుక్ చుక్ పుగాగమంబులు పరంబు లగునపు డాగమాదేశలోపంబులు

పెక్కుతెఱంగులం గానంబడియెడి' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ప్రేరణార్థంలో వచ్చిన ఇంచుక్ మొద లైనఆగమాలు పరంగా ఉన్నపుడు ధాతువు చివర వర్ణాలకు లోపం, ఆగమం, ఆదేశం మార్పులు అనేకవిధాలుగా వస్తాయి.

పోవు అనేధాతువుకు పుచ్చు, పనుచు, అంపు, ఇత్యాదిగా మార్పులు వస్తాయి. కాని వేఱొకధాతువుమీద చేరిన పోవు ధాతువుకు మాత్రం పుచ్చు అనే ఆదేశం ఒక్కటి మాత్రమే వస్తుంది. అని ఈవివరణం స్పష్టం చేస్తున్నది. మోసపోవు - మోసపుచ్చు. ఇక్కడ 'మోసపనుచు, మోసయంపు' ఇత్యాదిగా పుచ్చుకంటె వే ఱైన ఆదేశాలు ఏవీ రావు. ప్రత్యేకంగా ఉన్న 'పోవు' ధాతువుకు మాత్రం వస్తాయి. పనుచు, అంపు మొ.

**76. ఇ ట్లనుటంజేసి ప్రేరణార్థం బయినయితరాగమంబుమీఁదం బ్రేరణార్థేంచు గాగమం బగు నని యెఱుంగునది.** (క్రియ. 84)

'ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో ప్రేరణార్థంలో ఇంచుక్కుమీద ఇంచుక్కు లేదు అనటంలో మొదటి ఇంచుక్కు మీద అనేదళం సార్థక్యాన్ని ఈవాక్యం వివరిస్తున్నది.

ప్రేరణార్థంలో ఇంచుక్, చుక్, పుక్ అనేవి మూడు ఆగమాలుగా విధింపబడ్డాయి. వీటిలో ఇంచుక్కు మీద అనటంచేత ఇంచుక్కుకంటె వే రైన ఇతర ఆగమాలు చుక్, పుక్ అనేవాటిమీద మళ్లీ ప్రేరణార్థాన్ని వివక్షించినపుడు ఇంచుక్ అనేఆగమం వస్తుంది. అని తాత్పర్యం. ప్రేరణార్థంలో రెండవసారి ఇంచుగాగమం మాత్రమే వస్తుంది. ప్రేరణార్థక మైనఆగమంమీద చుక్, పుక్ అనేఆగమాలు ఎపుడూ రావు. ఇంచుక్కు లే దంటే ఇంచుక్కుకంటె వేరైన ఇతరాగమం వచ్చే అవకాశం లేదు. ఇంచుక్కు మాత్రమే వస్తుంది.

**1. చుక్కు మీద ఇంచుక్కు** : నొచ్చు ధాతువుమీద ప్రేరణార్థంలో చుగాగమం వచ్చి నొచ్చు+చు - నొంచు. దీనిపై తిరిగి ప్రేరణార్థాన్ని వివక్షిస్తే (ప్రేరణార్థక మైన మొదటి) ఈచుగాగమం మీద ఇంచుగాగమం వచ్చి, నొంపించు.

**2. పుక్కు మీద ఇంచుక్కు :** అలాగే చచ్చు ధాతువు మీద ప్రేరణార్థంలో పుగాగమం వచ్చి, చచ్చు+పు = చంపు అని కాగా, దీనిపై తిరిగి ప్రేరణార్థాన్ని వివక్షింపగా ఇంచుగాగమం వచ్చి, చంపు+ఇంచు=చంపించు అని అవుతుంది.

ఇంచుక్కు మీద ఇంచుక్కు లే దని లక్షణం. కాబట్టి వండింపించు, చంపింపించు ఇత్యాదిగా ప్రేరణార్థంలో ఇంచుగాగమాలు రెండు వచ్చినరూపాలు ఉండవు.

**77. పత్వంబు హెచ్చునకుం గలుగదు.** (క్రియ. 87)

'ప్రేరణేంచుక్కు పరం బగునపుడుపకారంబు చకారంబున కగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం ప్రేరణేంచుక్కు పరంగా ఉండగా ధాతువు చివర ఉన్న చకారానికి వచ్చే పకారం హెచ్చు అనేధాతువులోనిచకారానికి మాత్రం రా దని ఈవాక్యానికి అర్థం.

హెచ్చు అనేధాతువుకు ప్రేరణార్థంలో 'సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, హెచ్చు+ఇంచు అని ఉండగా 'ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు' అనేసూత్రంచేత ధాతువులోని చకారానికి పకారం రావలసిఉండగా ప్రస్తుతవివరణవాక్యాన్ని అనుసరించి పకారం రాదు. కాబట్టి ఉత్త్వసంధి జరిగి 'హెచ్చించు' అని అవుతుంది. పకారనిషేధంవలన 'హెప్పించు' అనేవిధంగా పకారం వచ్చినరూపాలు ఉండవు.

**78. మెచ్చునకు విభాష నగు.** (క్రియ. 87)

'ప్రేరణేంచుక్కు పరం బగునపుడుపకారంబు చకారంబున కగు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

పైసూత్రంప్రకారం ప్రేరణేంచుక్కు పరంగా ఉండగా ధాతువు చివర ఉన్న చకారానికి నిత్యంగా వచ్చే పకారం మెచ్చు అనేధాతువులోనిచకారానికి మాత్రం వికల్పంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం.

మెచ్చు అనేధాతువుకు ప్రేరణార్థంలో ' సర్వంబునకుం బ్రేరణంబునం దించుక్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమం వచ్చి, మెచ్చు+ఇంచు అని ఉండగా 'ప్రేరణేంచుక్కు పరం బగునపుడు పకారంబు చకారంబున కగు' అనేసూత్రంచేత ధాతువులోని చకారానికి పకారం నిత్యంగా రావలసిఉండగా ప్రస్తుతవివరణవాక్యాన్ని అనుసరించి విభాషగా వస్తుంది. కాబట్టి పకారం వచ్చినపక్షంలో 'మెప్పు+ఇంచు'. ఉత్త్వసంధి జరిగి 'మెప్పించు' అని అవుతుంది. వికల్పం కాబట్టి పకారం రానిపక్షంలో మెచ్చు+ఇంచు అనేచోట ఉత్త్వసంధి జరిగి, 'మెచ్చించు' అనేరూపం కూడా సిద్ధిస్తుంది.

**79. ఏఁచునకు వైభాషికంబు.** (క్రియ. 89)

'ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని ప్రాయికశబ్దానికి ప్రయోజనాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. 'ఏఁచు' ధాతువులోనిచకారం సహజంగా ఉన్నది కాబట్టి సిద్ధం. దానికి పూర్వంలో ఖండబిందువు ఉంది. కాబట్టి ముత్తు పర మైతే ఇందులోనిచకారానికి పైసూత్రం ప్రకారం పకారం రావాలి. కాని సూత్రంలో పకారం రావటం ప్రాయికం అని చెప్పటంచేత ఇక్కడ ఖండబిందువు మీది సిద్ధచకారానికి పకారం వికల్పంగా వస్తుంది. అని ఈవివరణవాక్యానికి అర్థం.

'ఏఁచు' ధాతువుమీద వ్యతిరేకక్త్వార్థంలో 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనేసూత్రంచే కజి ప్రత్యయం వచ్చి, ఏఁచు+క. కజి జీత్తు కాబట్టి ముత్తు. ముత్తు పరంగా ఉండటంచేత ప్రస్తుతసూత్రంచేత ఏఁచు ధాతువులోనిచకారానికి పకారం వివరణవాక్యానుసారంగా వికల్పంగా వస్తుంది. పకారం వస్తే, ఏఁపు+క. 'జీత్తు పరం బగునపు డుత్త్వంబున కత్త్వం బగు' అనేసూత్రంచేత ఉత్త్వానికి అత్త్వం వచ్చి 'ఏఁపక'. వికల్పం కాబట్టి పకారం రానిపక్షంలో చకారం అలాగే ఉంటుంది. ఏఁచు+క. ఉత్త్వానికి అత్త్వం వచ్చి, 'ఏఁచక' అని అవుతుంది.

ఇలాగే ఏఁపఁడు, ఏఁచఁడు ఇత్యాది.

**80. నోఁచునకుం గలుగదు.** (క్రియ. 89)

'ఖండబిందువుమీఁదిసిద్ధచకారంబునకు ముత్తు పరం బగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలోని ప్రాయికశబ్దానికి ప్రయోజనాన్ని వివరిస్తున్నది ఈవాక్యం. నోఁచు ధాతువులోని చకారం సహజంగా ఉన్నది కాబట్టి సిద్ధం. దానికి పూర్వంలో ఖండబిందువు ఉంది. కాబట్టి ముత్తు పర మైతే ఇందులోనిచకారానికి పైసూత్రం ప్రకారం పకారం రావాలి. కాని సూత్రంలో పకారం రావటం 'ప్రాయికం' అని చెప్పటంచేత ఇక్కడ ఖండబిందువుమీదిసిద్ధచకారానికి పకారం అసలు రాదు. అని ఈవివరణవాక్యానికి అర్థం.

నోఁచు ధాతువుమీద వ్యతిరేకక్త్వార్థంలో 'కజి వ్యతిరేకక్త్వార్థంబునం దగు' అనేసూత్రంచేత కజి ప్రత్యయం వచ్చి, నోఁచు+క. కజి జీత్తు కాబట్టి ముత్తు.

ముత్తు పరంగా ఉండటంచేత ప్రస్తుతసూత్రంచేత నోఁచు ధాతువులోనిచకారానికి వివరణవాక్యానుసారంగా పకారం రాదు. నోఁచు+క. 'జీత్తు పరం బగునపు దుత్త్వంబున కత్త్వం బగు' అనేసూత్రంచేత ఉత్త్వానికి అత్త్వం వచ్చి 'నోఁచక'. పకారం రాదు. కాబట్టి 'నోఁపక' అనేవిధంగా పకారం వచ్చినరూపాలు ఉండవు. ఇలాగే నోఁచఁడు. మొ.

**81. పత్వంబు రానిపక్షంబున వక్ష్యమాణతాదేశంబు.** (క్రియ. 90)

'ఆగమచకారంబునకు నెఱసున్నమీఁదిదానికి దుక్కు పరం బగునపుడు పకారంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఆగమచకారంబునకు' అనేసూత్రంలో చకారానికి పకారం వికల్పంగా చెప్పబడింది. కాబట్టి ఒకపక్షంలో పకారం రాకపోవచ్చును. పకారం వచ్చినపక్షంలో 'ఆకర్ణింపుదురు' అని అవుతుంది. పకారం రానిపక్షంలో 'ఆకర్ణించుదురు' అని చకారం అలాగే ఉండగా, 'చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారం బగు' అనే చెప్పబోయేలక్షణం ప్రకారం 'చుద్' అనేభాగం మొత్తానికి తకారం ఆదేశంగా వస్తుంది. కాబట్టి 'ఆకర్ణింతురు' అని అవుతుంది. ఈతకారాదేశం నిత్యం. కాబట్టి తకారం కూడా రానిరూపం ఉండదు. అంటే చకారానికి పకారం వస్తే, 'ఆకర్ణింపుదురు', లేదా చుద్‌కు తకారం వచ్చి 'ఆకర్ణింతురు' అని మాత్రమే తప్ప ఏఆదేశమూ రాని 'ఆకర్ణించుదురు' అనేవిధంగా చకారంతో రూపం ఉండదు.

**82. ఈయ యనునాదేశంబు నొకానొకచోఁ గానంబడియెడి.** (క్రియ. 92)

'ఇచ్చునకు సర్వంబున కీ యగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇచ్చునకు సర్వంబున కీ యగు' అనేసూత్రం ముత్తు పర మైనపుడు ఇచ్చు అనేధాతువు మొత్తానికి 'ఈ' అనేఅక్షరం సర్వాదేశంగా చెప్పింది. ఈఁడు, ఈక, ఈని. మొ. కాని కవిప్రయోగాలలో అరుదుగా ఇచ్చు ధాతువుకు 'ఈ' అనేఆదేశానికి బదులుగా 'ఈయ' అనేఆదేశం రావటం కూడా కనిపిస్తున్నది అని ఈవివరణం తాత్పర్యం. 'బలిమి నీయనిభూమివలయపతుల' అనేనన్నయప్రయోగంలో ఇచ్చు ధాతువుపై ని(జి) అనే జీత్తు (ముత్తు) పరంగా ఉండగా 'ఈ' అనేఆదేశం రాకుండా, 'ఈయ' అనేది ఆదేశ మై, 'ఈయని' అని అయింది.'ఈయక, ఈయఁడు' ఇత్యాదులు వ్యవహారంలో ఉన్నాయి. కాని ముజు పరంగా ఉండగా మాత్రం 'ఈయ' ఆదేశం

లేదు. ఈయము (ఇమ్ము), ఈయఁడు (ఇందు) అనేవిధంగా ఉండదు. కాబట్టి వివరణంలో 'ఒకానొకచో' అనేదానికి 'జీత్తు పర మైనపుడు' అనీ, 'కానంబడియెడి' అంటే అరుదుగా 'కవిప్రయోగానుసారంగా' అనీ అర్థం గ్రహించాలి.

**83. వక్ష్యమాణంబు ద్విత్వంబు.** (క్రియ. 94)

'చావునోవులు చచ్చునొచ్చుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

నొచ్చు ధాతువుకు ముత్తు పరంగా ఉన్నపుడు 'చావునోవులు చచ్చునొచ్చుల కగు' అనేసూత్రంచేత 'నోవు' అనేది ఆదేశంగా వస్తుంది. ఈ'నోవు'శబ్దం ఊయేల మొద లైనవాటిలో చేరిఉంది. కాబట్టి 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అనే ప్రకీర్ణకపరిచ్ఛేదంలో చెప్పబోయేసూత్రంచేత వకారానికి వికల్పంగా ద్విత్వం వస్తుంది. అలా ద్విత్వం వచ్చినపక్షంలో (నోవ్వు) 'ద్విరుక్తం బగుహల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత ముందరిదీర్ఘానికి హ్రస్వం వచ్చి, నొవ్వు అని అవుతుంది. 'నొవ్వఁడు, నొవ్వక' ఇత్యాదిగా రూపాలు అవుతాయి. వికల్పం కావటంచేత ద్విత్వం రానిపక్షంలో 'నోవఁ డు, నోవక' ఇత్యాదిగా ఉంటాయి.

**84. అపదాద్యసూత్రంబుచే గాకు వకారంబు.** (క్రియ. 96)

'అగున కనుకనులకు ముజీత్తులు పరంబు లగునపుడు కానాకానలు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

అగు ధాతువుకు మధ్యమపురుష అయిన ము,డుజ్ ప్రత్యయాలు పర మైనపుడు పైసూత్రంచేత 'కా' అనేఆదేశం వికల్పంగా వస్తుంది. అగు+ము=కా+ము=కమ్ము, ఇలాగే అగు+డుజ్=కందు అని అవుతుంది. వికల్పం కావటంచేత 'కా' అనేఆదేశం రానిపక్షంలో 'అగుము, అగుఁడు' అనేవిధంగా ఉంటుంది. ఇపుడు 'అపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాష నగు' అనేసూత్రంచేత ఇక్కడ ధాతువులోని గకారానికి (వికల్పంగా) వకారం వస్తుంది. అని ఈవివరణ వాక్యానికి అర్థం. వకారం వచ్చినపక్షంలో 'అవుము, అవుఁడు' అని అవుతుంది. విభాష కావటంచేత వకారం రానిపక్షంలో గకారం అలాగే ఉండి, 'అగుము, అగుఁడు' అని ఉంటుంది.

**85. వక్ష్యమాణం బౌత్వంబు.** (క్రియ. 96)

'అగున కనుకనులకు ముజీత్తులు పరంబు లగునపుడు కానాకానలు విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

అగు ధాతువుకు మధ్యమపురుష అయిన ము, డుజ్ ప్రత్యయాలు పర మైనపుడు పైసూత్రంచేత 'కా' అనేఆదేశం వికల్పంగా వస్తుంది. అగు+ము=కా+ము=కమ్ము, ఇలాగే అగు+డుజ్=కండు అని అవుతుంది. వికల్పం కావటంచేత 'కా' అనేఆదేశం రానిపక్షంలో 'అగుము, అగుఁడు' అనేవిధంగా ఉంటుంది. ఇపుడు 'అపదాద్యం బయి యసంయుక్తం బయినగకారంబునకు వకారంబు విభాష నగు' అనేసూత్రంచేత ఇక్కడ ధాతువులోని గకారానికి (వికల్పంగా) వకారం వస్తుంది. వకారం వచ్చినపక్షంలో 'అవుము, అవుఁడు' అని అవుతుంది. అప్పుడు 'ఆచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు' అనేచెప్పబోయేసూత్రంచేత 'అవు' కు 'ఔ' ఆదేశంగా వస్తుంది అని ఈవివరణవాక్యానికి అర్థం. ఆవిధంగా అవుకు ఔ వస్తే,– ఔము, ఔఁడు అని అవుతుంది. బహుళం అనడంచేత ఔకారం రానిపక్షంలో అవుము, అవుఁడు అని ఉంటుంది.(వకారం కూడా విభాష కావటంచేత రానిపక్షంలో గకారం అలాగే ఉండి, 'అగుము, అగుఁడు' అని ఉంటుంది.)

**85. వక్ష్యమాణం బైత్వంబు.** (క్రియ. 99)

'అగుపోవులకడవ్రాల కిద్వ్యక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అగు అనేధాతువుకు ఇ కారం పర మైనపుడు పైసూత్రంచేత అగు లోని గువర్ణంస్థానంలో యకారం ఆదేశంగా వస్తుంది.'అగు+ఇ=అయ్+ఇ=అయి' అని అవుతుంది.తరువాత 'ఆచ్ఛికంబులం దయియవులకు వక్రతమంబులు బహుళంబుగా నగు' అనేచెప్పబోయేసూత్రం చేత 'అయి'కి 'ఐ' ఆదేశంగా వస్తుంది అని ఈవివరణ వాక్యానికి అర్థం.

అగుధాతువుమీద క్త్వార్థంలో 'సమానాశ్రయంబులం బూర్వకాలంబునం దివర్ణకం బగు' అని ఇప్రత్యయం వచ్చి, 'అగు+ఇ' అని ఉండగా 'అగుపోవులకడవ్రాల కిద్వ్యక్రంబులు పరంబు లగునపుడు యకారం బగు' అనేసూత్రంచేత అగులోని గువర్ణంస్థానంలో యకారం వచ్చి, 'అయ్+ఇ = అయి' అని అవుతుంది. ఇపుడు

'అచ్ఛికంబుల దయియవులకు-' అనేసూత్రంచేత 'అయి' కి 'ఐ' ఆదేశంగా వచ్చి, 'ఐ' అనేరూపం అవుతుంది. బహుళం అనటంచేత ఐ ఆదేశం రానిపక్షంలో 'అయి' అని అలాగే ఉంటుంది. ఇలాగే అయిరి = ఐరి, అయితిని = ఐతిని మొ.

**87. వక్ష్యమాణంబు ద్విత్వంబు.** (క్రియ. 100)

'అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

భూతాద్యర్థాలలో ఎను, ఎడు, ఎడి మొద లైనప్రత్యయాదులు పర మైనపుడు అగుధాతువులోని 'గు' వర్ణానికి యకారమూ, అకారానికి దీర్ఘమూ వచ్చినతరువాత 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అనే చెప్పబోయే సూత్రంచేత ద్విత్వం వస్తుం దని ఈవివరణవాక్యానికి అర్థం.

భూతార్థంలో ప్రథమపురుష ఏకవచనంలో 'అగు+ఎను' అని ఉండగా, 'అగుపోవుల కడవ్రాలకు-' అనేసూత్రంచేత గు వర్ణానికి యకారం వచ్చి, అయ్+ఎను=అయెను అని కాగా, 'అగునకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు' అనేసూత్రంచేత అకారానికి దీర్ఘం వచ్చి, 'ఆయెను' అని అవుతుంది. ఇటువంటివి ఊయేలాదులలో చేరిఉన్నాయి. కాబట్టి 'ఊయేలాదులం దొలియచ్చుమీఁది హల్లునకు-' అనేసూత్రంచేత యకారానికి ద్విత్వం వచ్చి, 'అయ్యెను' అని అవుతుంది. వికల్పం కాబట్టి ద్విత్వం రానిపక్షంలో 'ఆయెను' అని కూడా ఉంటుంది. ఇలాగే తద్ధర్మాదులలో 'అయ్యెడును - ఆయెడును, అయ్యెడివాఁడు - ఆయెడివాఁడు' ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి.

**88. లేచునకు ముజు పరం బగునపుడు చులోపం బగు.** (క్రియ. 101)

'పిలుచు మొద లగువానికి ముత్తు పరం బగునపుడు కడవ్రాయి బహుళంబుగ లోపించు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

లేచు ధాతువు పిలుచు మొద లైనవాటిలో లేదు. కాబట్టి పైసూత్రంచేత లేచు ధాతువులో కడవ్రాయి అయినచువర్ణం లోపించేఅవకాశం లేదు. అందుచేత ఈఅంశం విశేషంగా చెప్పబడింది. సూత్రంలోని బహుళశబ్దంచేత అన్యకార్యంగా పిలుచు మొద లైనవానిలో లేని లేచు అనేధాతువులో కూడ కడవ్రాయి అయినచువర్ణం మధ్యమపురుష ఏకవచన మయిన మువర్ణం లేదా బహువచనం ఐన డుజ్ పర మయినపుడు లోపిస్తుం దని ఈవివరణానికి తాత్పర్యం.

లేచు – ధాతువు. సంప్రార్థనాద్యర్థంలో లూట్ లకారం వచ్చి, మధ్యమపురుష ఏకవచనంలో వువర్ణమూ, దానికి మువర్ణము వచ్చి, 'లేచు+ము' అని ఉండగా ప్రస్తుతసూత్రంలోని బహుళపదంచేత 'లేచు'లో చువర్ణం లోపించి– లే+ము. 'ముఖు పరం బగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును మువర్ణకంబునకు మాముడియు నగు' అనేసూత్రంచేత హ్రస్వద్విత్వాలు వచ్చి, 'లెమ్ము' అని అవుతుంది. ఇలాగే బహువచనంలో డుజ్ పరంగా ఉండగా, 'చు' లోపించి, హ్రస్వం వచ్చి, లెండు అని అవుతుంది.

'ముఖు పరం బగునపుడు' అనడంచేత జీత్తు పర మైతే 'లేచు'లో చు లోపించదు. లేవఁడు, లేవక మొ. ఇక్కడ చు లోపించిన లేఁడు, లేక అనేవిధ మైనరూపాలు ఉండవు.

**89. ఎడియెడులకు లోపం బిట నిత్యంబు.** (క్రియ. 105)

'త్రర్థంబునం గలాదేశంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇట' అంటే కలుగుధాతువుకు 'కల' అనేఆదేశం వచ్చినచోట అని అర్థం. 'కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరం బగునపుడు కల యగు' అనేసూత్రం కలుగుధాతువుకు లట్టు పర మైనపుడు 'కల' అనేఆదేశాన్ని నిత్యంగా చెప్పింది. దానిని బాధించి, 'త్రర్థంబునం గలాదేశంబు విభాష నగు' అనేసూత్రం తృవర్ణకార్థంలో 'కల' ఆదేశం వికల్పంగా చెప్తున్నది. 'తృవర్ణకార్థంబునం దెడియెడువన్నియ లగు' అని తృవర్ణకార్థంలో 'ఎడి, ఎడు' అనేప్రత్యయాలు వస్తాయి. కాబట్టి అవి పరంగా ఉండగా కలుగుధాతువుమొత్తానికి 'కల' వికల్పంగా ఆదేశం అవుతుంది. 'కల' ఆదేశం వచ్చినపక్షంలో దానిపై నున్న 'ఎడి, ఎడు' అనేప్రత్యయాలకు లోపం నిత్యంగా వస్తుం దని ఈవివరణానికి అర్థం. 'వానికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోనిబహుళపదంచేత కలాదేశం పైనున్న 'ఎడి, ఎడు'లకు లోపం నిత్యంగా వస్తుం దని తాత్పర్యం.

కలుగు ధాతువుపై తృవర్ణకార్థంలో 'ఎడి' (ఎడు) ప్రత్యయం వచ్చి, – కలుగు+ఎడి (ఎడు). కలుగుకు 'కల' ఆదేశం కాగా, కల+ఎడి(ఎడు). 'వానికి లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంలోని బహుళపదంచేత ఎడి (ఎడు)కి నిత్యంగా లోపం రాగా, 'కల'. దీనిపై విభక్తివివక్షలో తచ్ఛబ్దం చేరి, 'కలవాఁడు, కలది' ఇత్యాదిగా రూపాలు ఏర్పడతాయి.

'ఇట' అనటంచేత  కలాదేశం రానిపక్షంలో అంటే కలుగు అనేరూపంమీద ఎడిఎడులకు లోపం వికల్పంగానే వస్తుంది. 'కల' ఆదేశం కావటం విభాష కాబట్టి ఆదేశం రానిపక్షంలో కలుగు+ఎడి(ఎడు) అని ఉండగాఎడి,ఎడులు లోపించినపుడు 'కలుగువాడు', లోపించనిపక్షంలో 'కలిగె(డు)డివాడు' అనేవిధంగా రూపాలు ఉంటాయి.

**90. పక్షంబున వలవఁ డిత్యాది.** (క్రియ. 107)

'వ్యతిరేకమునందు వలచున కొల్ల విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత వ్యతిరేకార్థంలో 'వలచు' అనేధాతువుకు మొత్తానికి 'ఒల్ల' అనేశబ్దం ఆదేశంగా వస్తుంది. అది విభాషగా చెప్పబడింది. కాబట్టి పక్షంబున అంటే 'ఒల్ల' అనేఆదేశం రానిపక్షంలో 'వలచు' అనేరూపం అలాగే ఉండి, దానినుంచి ఆయారూపాలు అవుతా యని ఈవివరణవాక్యానికి అర్థం.

వలచు ధాతువుపై 'వ్యతిరేకంబున లజీ యగు' అని లజీ చేయగా వలచు+ల్. 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరిఉత్వానికి అత్వం వచ్చి, వలచ+ల్. 'లకారంబునకు డుఙ్రువురునుము ఙ్ఞగు' అనేసూత్రంచేత ప్రథమపురుషైకవచనంలో డుఙ్ ప్రత్యయం వచ్చి, వలచ+డుఙ్. 'వ్యతిరేకంబున వలచున కొల్ల విభాష నగు' అనేసూత్రంచేత 'వలచ'కు 'ఒల్ల' ఆదేశం రాగా, ఒల్ల+డుఙ్=ఒల్లఁడు. అని అవుతుంది. విభాష అనటంచేత 'ఒల్ల' ఆదేశం రానిపక్షంలో, వలచు+ల్, వలచ+ల్, వలచ+డుఙ్ అని ఉండగా, 'ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అనేసూత్రంచేత చకారానికి వకారం వచ్చి, 'వలవఁడు' అని అవుతుంది. ఇలాగే మిగిలినసందర్భాలలో గూడ (ఒల్లక) వలవక, (ఒల్లనివాఁడు) వలవనివాఁడు ఇత్యాదిగా రూపా లుంటాయి.

**91. ఒల్లమి కొల్లఁబా టని ప్రయోగంబులం గానంబడియెడి.** (క్రియ. 107)

'వ్యతిరేకమునందు వలచున కొల్ల విభాష నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'ఒల్లమి' అనేఅర్థంలో 'ఒల్లఁబాటు' అనేవిధంగా ప్రయోగాలలో కనబడుతున్న దని ఈవాక్యానికి అర్థం.

'వలచు' ధాతువుపై 'వ్యతిరేకభావంబునందు మిఁజి యగు' అనేసూత్రంచేత మిఁజి ప్రత్యయం రాగా, వలచు+మి. 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అని ముందరి ఉత్వానికి అత్వం వచ్చి,– వలచ+మి. 'వ్యతిరేకంబున వలచున కొల్ల విభాష నగు' అని ధాతువుకు 'ఒల్ల' ఆదేశం అయి 'ఒల్లమి' అని అవుతుంది. విభాష అనటంచేత 'ఒల్ల' ఆదేశం రానిపక్షంలో 'ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవ లగు' అనేసూత్రంచేత 'వలచు' చకారానికి వకారం వచ్చి 'వలవమి' అని అవుతుంది.

కాని ఈఅర్థంలో 'ఒల్లcబాటు' అని కూడా కవులు ప్రయోగించిఉండటంచేత ఆరూపం కూడ గ్రహించవలసిఉంది. 'వలచు+మి' అనేది 'ఒల్లమి' అని కాగా దాని మొత్తానికి 'ఒల్లcబాటు' అనేది ఆదేశంగా వస్తుం దని దీనిప్రక్రియను ఊహించుకోవలసిఉంది.

**92. చేతురు, కోతు రిత్యాదు లసాధువు లని యెఱుంగునది.** (క్రియ. 108)

'చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం దుగాగమంలోని దకారం, దానికి పూర్వంలో ఉన్నచువర్ణంతో గూడ 'చుద్' అనేదానికి తకారాన్ని విధిస్తున్నది. అంటే చువర్ణాంతధాతువులకు మాత్రమే లాట్టులో దుగాగమం పరంగా ఉన్నపుడు 'చుద్' కు తకారం వస్తుంది.

చేయుదురు, కోయుదురు అనేచోట్ల దుగాగమానికి పూర్వంలో చువర్ణం లేదు. చేతురు, కోతురు అనేవిధ మైనరూపాలలో ఇక్కడ తకారం వచ్చింది. అంటే చేయుదురు అనేదానిలో 'యుద్' అనేభాగానికి తకారం వచ్చిం దన్నమాట. 'చుద్' కు విధించిన తకారం 'యుద్' మొద లైన ఇతరశబ్దాలకు రాదు. కాగా అలా 'చుద్'కు భిన్న మైనదానికి తకారం చేసిన 'చేతురు, కోతురు' ఇత్యాదులు లక్షణానికి విరుద్ధాలు కాబట్టి సాధువులు కావు. గ్రామ్యాలు అని తాత్పర్యం.

**93. కాను అనునది నుఙ్యంతం బగునగుధాతువురూపంబు.** (క్రియ. 115)

'నుఙ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుఙికి విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రం క్రియావిశేషణాలకు పైని 'నుఙి' ప్రత్యయం చివర గలిగిన'అగు'

ధాతువుయొక్క రూపం చేరుతుం దని చెప్తున్నది. ఆరూపం ఎలా ఉంటుందో ఈవాక్యం వివరిస్తున్నది.

అగు ధాతువుపై 'తుమర్థభావలక్షణంబులందు నుజీ యగు' అనేసూత్రంచేత నుజీ ప్రత్యయం వచ్చి, అగు+ను. నుజీ జీత్తు కాబట్టి ముత్తు. కాబట్టి 'అగు వచ్చు చొచ్చు చూచు లకు ముత్తు పరం బగునపుడు కా రా చొరు చూడు లగు' అనేసూత్రంచేత అగు అనేధాతువు స్థానంలో 'కా' అనేఅక్షరం ఆదేశం కాగా 'కాను' అని అవుతుంది. అందుచేత నుజ్యంత మైనఅగుధాతువు అంటే 'కాను' అనేరూపం. అని ఈవివరణ వాక్యం తాత్పర్యం.

**94. ఇట సరళంబు నిత్యంబు.** (క్రియ. 116)

'దానికి హ్రస్వంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజీకి విభాష నగు' అనేసూత్రంచేత క్రియావిశేషణాలకు పైని 'కాను' అనేరూపం అనుప్రయుక్తం అవుతుంది. ఉదా. లెస్సగా నున్నది. ఇక్కడ ఉన్నది అనేక్రియ లోనివిశేషం చెప్తుండటంచేత 'లెస్స' అనేది క్రియావిశేషణం. కాబట్టి 'కాను' అనేది అనుప్రయుక్త మై, లెస్స+కాను. 'దానికి హ్రస్వంబు విభాష నగు' అనేసూత్రంచేత కానులో దీర్ఘానికి హ్రస్వం వికల్పంగా వచ్చి, లెస్స+కను, లెస్స+కాను అని ఉంటుంది. 'ప్రథమమీఁదిపరుషములకు గసడదవలు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత ఇక్కడ కకారానికి బహుళంగా రావలసిన సరళం (గకారం) ఆదేశం నిత్యంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం. అంటే బహుళశబ్దంచేత ఇక్కడ ప్రవృత్తి అని తాత్పర్యం. కకారానికి గకారం రాగా, 'లెస్సగను, లెస్సగాను' అని అవుతుంది. ఈఆదేశం నిత్యం గాబట్టి ఆదేశం రాని 'లెస్సకను, లెస్సకాను' అనేరీతిగా 'క'కారంతోడిరూపాలు ఉండవు.

**95. ఇట స్వత్వంబు లేదు.** (క్రియ. 116)

'దానికి హ్రస్వంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'నుజ్యంతం బగునగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తం బగు, నుజీకి విభాష నగు' అనేసూత్రంచేత నుజీ ప్రత్యయం చివర ఉన్నక్రియలమీద 'కాను' అనేది చేరుతుంది. దానికి పూర్వంలో ఉన్న 'నుజీ' ద్రుతానికి స్వత్వం ఉండ దని

ప్రస్తుతవివరణవాక్యానకి అర్థం.

చూచు ధాతువుపై నుజీ ప్రత్యయం రాగా చూచు+ను. ముత్తు పరంగా ఉండగా చూచుధాతువుకు 'అగున కనుకనులకు ముత్తు పరం బగునపుడు కారాచొౌరుచూడు లగు' అని చూడు అనేఆదేశ మై, 'జీత్తు పరం బగునపు దుత్వంబున కత్వం బగు' అని ఉత్వానికి అత్వం వచ్చి, చూడను అని అవుతుంది. ఈనుజ్యంతక్రియమీద ప్రస్తుతసూత్రంచేత 'కాను' అనేది అనుప్రయుక్త మై, చూడను+కాను. 'దానికి హ్రస్వంబు విభాష నగు' అనేసూత్రంచేత 'కాను'లో దీర్ఘానికి హ్రస్వం వికల్పంగా వచ్చి, 'చూడను+కను, చూడను+కాను' అని ఉంటుంది. చూడను అనేద్రుతప్రకృతికంమీద పరుషం సరళం కాగా, చూడను+గాను, చూడను+గను. 'ఆదేశసరళములకు ముం దున్నద్రుతమునకు బిందుసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంచేత బిందుసంశ్లేషలు వస్తే, 'చూడంగ(గా)ను, చూడఁగ(గా)ను, చూడన్గ(న్గా)ను', అనేవిధంగా రూపాలు అవుతాయి. విభాష కావటంచేత బిందుసంశ్లేషలు రానిపక్షంలో స్వత్వం వచ్చి చూడనుగ(గా)ను అని కావలసిఉంది. ఈవివరణవాక్యం ఆస్వత్వాన్ని వారిస్తున్నది. అంటే ఆదేశసరళములకు అనేసూత్రంలో ఉన్న 'విభాష' పదానికి 'కాను పరంగా ఉండగా, నుజ్యంతధాతువు ద్రుతానికి స్వత్వం రా దని వ్యవస్థ చేసుకోవాలి అని తాత్పర్యం. ఇలా స్వత్వం నిషేధింపబడటంచేత చూడనుగ(గా)ను అనేరీతిరూపాలు ఉండవు.

**96. బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు.** (క్రియ. 117)

'ఉన్నకలజినవర్ణకంబులమీఁదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

భవద్భావిశతృక్తవదర్థాలలో ధాతువుమీద ఉన్న, కల, న అనేప్రత్యయాలు వచ్చి, ధాతుజవిశేషణాలు ఏర్పడతాయి. వాటిమీద విభక్తివివక్షలో తచ్ఛబ్దం అనుప్రయుక్తం అవుతుంది. అది మహదర్థంలో 'వాఁడు' అనేవిధంగా ఉన్నపుడు, రూపాలు 'వండుచున్నవాఁడు, వండగలవాఁడు, వండినవాఁడు' అనేవిధంగా ఉంటాయి. ఇటువంటపుడు 'ఉన్నకలజిన వర్ణకంబులమీదితచ్ఛబ్దవకారంబునకు లోపంబు విభాష నగు' అనేసూత్రంచేత 'వాఁడు'లో వకారం లోపించగా, వండుచున్న+ఆఁడు, వండగల+ఆఁడు, వండిన+ఆఁడు. అని కాగా, 'అత్తునకు

సంధి బహుళంబుగా నగు' అనేసూత్రంచేత సంధి బహుళంగా వస్తుంది. బహుళం అంటే ఇక్కడ ప్రవృత్తి. ఉన్న, కల, న, వర్ణకాలలోని అత్వానికి ఇక్కడ సంధి నిత్యంగా వస్తుం దని అర్థం. వండుచున్నాఁడు, వండగలాఁడు, వండినాఁడు. సంధి నిత్యం కావటంచేత సంధి రాని 'వండుచున్నయాడు, వండగలయాడు, వండినయాడు అనేవిధ మైనరూపాలు ఉండవు.

**97. భూ, సృ, కృ, రేకృ, లోకృ, లోచ, పచి, లప ఇత్యాదులకు గతివిరహితంబు లగు ధాతువుల కీభాషం బ్రయోగంబు లేదు.** (క్రియ. 121)

'అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఈవాక్యం పైసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది. 'ప్ర' మొద లైన22ఉపసర్గలకూ, ఊరీప్రభృతులకూ, సాక్షాత్ ప్రభృతులకూ 'గతి' అని పేరు. 'అగతికం' అంటే (పూర్వం)గతిసంజ్ఞగలిగినదానితో కూడనిది. 'భూ' మొద లైనవి భ్వాదులు. భూ, సృ, కృ మొద లైనసంస్కృత ధాతువులు. ఈ 'భూ' మొద లైనసంస్కృతధాతువులను, గతిసంజ్ఞ గలిగిన 'ప్ర' మొద లైనవాటితో కూడక ప్రత్యేకంగా ఉన్నవాటిని తెలుగులో ప్రయోగించరాదు అని అర్థం. అంటే గతిసంజ్ఞ కలిగినవాటితో కూడి మాత్రమే ఈధాతువులు తెలుగులో ప్రయోగింపబడతాయి.

భూ అనేధాతువు (పూర్వంలో) 'ప్ర' అనేఉపసర్గతో కూడి 'ప్రభూ' అని అయినతరువాత తెలుగులో చేరి 'సంస్కృతంబున కంగలాదుల కించు క్కగు' అనేసూత్రంచేత ఇంచుగాగమాన్ని పొంది, ప్రభూ+ఇంచు. 'ఇఉఋల కించుక్కు పరం బగునపు డయుగవుగరుక్కు లగు' అనేసూత్రంచేత అవుగాగమం వచ్చి, 'ప్రభవించు' అని అవుతుంది. లకారాదులు దీనిపై చేరి 'ప్రభవించుచున్నాఁడు', 'ప్రభవించుట' ఇత్యాదిగా రూపాలు అవుతాయి. ఇలాగే – భస్మీకరించు, సాక్షాత్కరించు మొ. గతిసంజ్ఞ గలిగినవి ముందు లేకుంటే భ్వాదులు తెలుగులో ప్రవేశించవు. కాబట్టి 'భవించుచున్నాడు, కరించుట' ఇత్యాదిరూపాలు ఉండవు.

'భ్వాదులు' అనటంచేత భ్వాదులలో చేరనిధాతువులు అగతికము లైనా, తెలుగులో ప్రయోగించుకోవచ్చును. భుజించు, కోపించు, అంగలించు మొ.

**98. ప్రాదు లిరువదిరెం డుపసర్గంబులు నాఁబడు.** (క్రియ. 121)

'అగతికంబు లగుభ్వాదుల కిందు యోగంబు లేదు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంలో 'అగతికాలు' అనటంచేత గతిసంజ్ఞ కలిగినవి ఏవో సూరి ముందుగా ఇలా వివరించాడు. 'ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప, ఊరీప్రభృతులును, సాక్షాత్ ప్రభృతులును, గతిసంజ్ఞాకంబులు'. సందర్భాన్ని అనుసరించి ప్రస్తుతవాక్యంచేత ఉపసర్గ అనేసంజ్ఞను గూడా సూరి వివరిస్తున్నాడు. గతిసంజ్ఞ గలిగినవిగా పైన చెప్పబడినవాటిలో ప్ర అనేది మొదలుగొని 22 శబ్దాలకు ఉపసర్గ అనేవిశేషసంజ్ఞ ఉన్నది అని అర్థం. ప్ర, పరా, మొద లైన పైవాటిలో ఊరీప్రభృతులు, సాక్షాత్ప్రభృతులు తప్ప మిగిలినవాటికి ఉపసర్గలు అని పేరు. ఇవి (పూర్వంలో) ధాతువులతో కలిసి ఉంటాయి. ప్రభవించు, ఉపకరించు మొ.

**99. వలయ్యాదిక్రియలకుం గర్తృభూతక్రియావృత్తి యగుధాతువునకు నుజీ వర్ణకం బగు.** (క్రియ. 122)

'వలయ్యాదిక్రియలకుం గర్త యగుభావంబునందు నుజీ యగు' అనేసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

వలయు మొద లైనవి వలయ్యాదులు. భావం అంటే ధాతువుయొక్క అర్థం. వలయు మొద లైనక్రియలకు కర్త అయినవ్యాపారంలో వర్తించేధాతువుకు పరంగా నుజీ అనేప్రత్యయం వస్తుంది అని దీనికి అర్థం. నుజీలో జీవర్ణం ఇత్తు. కాబట్టి అది లోపిస్తుంది. నువర్ణం మాత్రమే నిలుస్తుంది.

ఉదా. వాడు చూడవలయును. దీనికి 'వాడు చూచుట వలయును' అని అర్థం. ఇక్కడ 'వలయుట' అనేక్రియకు కర్త 'చూచుట' అనేది. అంతే కాని 'వాడు' కాదు. (చూచుట అనేక్రియకు కర్త వాడు.) అందువల్లనే నీవు చూడవలయును, మేము చూడవలయును మొ. చోట్ల కూడా 'వలయుదువు' ఇత్యాదిగా క్రియాపదం మారలేదు. కాబట్టి 'వలయును' అనేదానికి కర్త అయిన 'చూచుట' అనే భావార్థకవ్యాపారాన్ని తెలియజేసే 'చూచు' అనేధాతువుకు పరంగా ప్రస్తుతసూత్రంచేత 'నుజీ' ప్రత్యయం వచ్చి, 'చూడన్' (చూడన్+వలయును=చూడవలయును) అని అయింది.

ఇలాగే - నీవు చూడఁగూడదు. మేము చూడఁదగును మొ.

**100. సకర్మకంబునకు స్వార్థప్రేరణార్థంబులు రెండును గొనుపద్వనుబంధంబులం దొక్కొక్కటితోడం గూడుచో నగునవి యాఱుం గూడ రూపంబు లెనిమి దయ్యె.** (క్రియ. 122)

'వలయ్వాదిక్రియలకుం గర్తయగుభావంబునందు నుజీ యగు' అనేసూత్రం వివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

కర్మను గూర్చిన ఆకాంక్ష కలిగినధాతువు సకర్మకం. వండు మొద లైనవి. సకర్మకా లైనధాతువులకు కర్త్రర్థం, కర్మార్థం, ఆత్మనేపదార్థం, ప్రేరణార్థాలలో మొత్తం ఎనిమిది విధా లైనరూపాలు అవుతాయి. అవి-

**1. కర్త్రర్థకం.** స్వార్థంలో కర్తను బోధించేది.

మైత్రుడు వంటకమును **వండెను.**

**2. కర్మార్థకం**. స్వార్థంలో కర్మను బోధించేది.

మైత్రునిచేత వంటకము **వండబడెను**.

**3**. **ఆత్మనేపద కర్త్రర్థకం.** స్వార్థంలో ఆత్మనేపదార్థంలో కర్తను బోధించేది.

మైత్రుడు వంటకమును **వండుకొనెను.**

**4**. **ఆత్మనేపద కర్మార్థకం.** స్వార్థంలో ఆత్మనేపదార్థంలో కర్మను బోధించేది.

మైత్రునిచేత వంటకము **వండుకొనబడెను**.

**5. ప్రేరణ కర్త్రర్థకం**. ప్రేరణంలో కర్తను బోధించేది.

చైత్రుడు మైత్రునిచేత వంటకమును **వండించెను.**

**6. ప్రేరణ కర్మార్థకం.** ప్రేరణంలో కర్మను బోధించేది.

చైత్రునిచేత మైత్రునిచేత వంటకమును **వండింపబడెను**.

**7.ప్రేరణ ఆత్మనేపద కర్త్రర్థకం.** ప్రేరణంలో ఆత్మనేపదార్థంలో కర్తను బోధించేది.

చైత్రుడు మైత్రునిచేత వంటకమును **వండించుకొనెను.**

**8. ప్రేరణ ఆత్మనేపద కర్మార్థకం.** ప్రేరణంలో ఆత్మనేపదార్థంలో కర్మను బోధించేది.

చైత్రునిచేత మైత్రునిచేత వంటకము **వండించుకొనబడెను.**

**101. పొందు మొద లయినవి గత్యర్థకంబులు.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది

ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'గత్యర్థకం' అనేదానిని వివరిస్తున్నది.

గమనాన్ని తెలియజేసేధాతువులు గత్యర్థకాలు. పొందు, చేరు, మొద లైనవి. గత్యర్థకా లయిన ఈధాతువులకు స్వార్థంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ అవుతుంది.' **మైత్రుడు** గ్రామమును పొందెను'. ఇక్కడ 'పొందెను' అనేది ప్రేరణం కాదు, అప్రేరణం అంటే స్వార్థం. ఇది 'పొందించెను' అనేవిధంగా ప్రేరణార్థంలో ఉంటే – స్వార్థంలో కర్త అయిన మైత్రుడు అనేది (ప్రేరణంలో) కర్మగా మారుతుంది. 'చైత్రుడు **మైత్రుని** గ్రామంబును పొందించెను'. కర్మ కావటంచేత 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది.

**102. తెలియు మొద లగునవి బుద్ధ్యర్థకంబులు.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'బుద్ధ్యర్థకం' అనేదానిని వివరిస్తున్నది.

బోధ అంటే జ్ఞానాన్ని తెలియజేసేధాతువులు గత్యర్థకాలు. తెలియు, ఎఱుగు, మొద లైనవి. బుద్ధ్యర్థకా లయిన ఈధాతువులకు స్వార్థంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ అవుతుంది. **'మైత్రుడు** ఎఱిగెను' ఇక్కడ 'ఎఱిగెను' అనేది ప్రేరణం కాదు, అప్రేరణం అంటే స్వార్థం. ఇది 'ఎఱిగించెను' అనేవిధంగా ప్రేరణార్థంలో ఉంటే– స్వార్థంలో కర్త అయిన మైత్రుడు అనేది (ప్రేరణంలో) కర్మగా మారుతుంది. 'చైత్రుడు **మైత్రుని** ఎఱిగించెను' కర్మ కావటంచేత 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది.

**103. తిను మొద లయినవి ప్రత్యవసానార్థకంబులు.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'ప్రత్యవసానార్థకం' అనేదానిని వివరిస్తున్నది.

ప్రత్యవసానం అంటే తినటాన్ని తెలియజేసేధాతువులు ప్రత్యవసానార్థకాలు. తిను, భుజించు మొద లైనవి. ప్రత్యవసానార్థకా లయినఈధాతువులకు స్వార్థంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ అవుతుంది. **'మైత్రుడు** తినెను' ఇక్కడ 'తినెను' అనేది

ప్రేరణం కాదు, అప్రేరణం అంటే స్వార్థం. ఇది 'తినిపించెను' అనేవిధంగా ప్రేరణార్థంలో ఉంటే - స్వార్థంలో కర్త అయిన మైత్రుడు అనేది (ప్రేరణంలో) కర్మగా మారుతుంది. 'చైత్రుడు **మైత్రుని** తినిపించెను.' కర్మ కావటంచేత 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది.

**104. విను చెప్పు చదువు మొద లయినవి శబ్దకర్మంబులు.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'శబ్దకర్మము' అనేదానిఅర్థం వివరిస్తున్నది.

శబ్దం కర్మగా కలిగినధాతువులు శబ్దకర్మములు. విను, చదువు మొద లైనవి. శబ్దకర్మ లయిన ఈధాతువులకు స్వార్థంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ అవుతుంది. **'మైత్రుడు** చదివెను' ఇక్కడ 'చదివెను' అనేది ప్రేరణం కాదు, అప్రేరణం అంటే స్వార్థం. ఇది 'చదివించెను' అనేవిధంగా ప్రేరణార్థంలో ఉంటే - స్వార్థంలో కర్త అయిన మైత్రుడు అనేది (ప్రేరణంలో) కర్మగా మారుతుంది. 'చైత్రుడు **'మైత్రుని** చదివించెను' కర్మ కావటంచేత 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది.

**105. అకర్మకంబులు ప్రసిద్ధంబులు.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. సూత్రంలోని 'అకర్మకము' అనేదానిఅర్థం వివరిస్తున్నది.

కర్మను గూర్చిన ఆకాంక్ష లేనిధాతువులు అకర్మకాలు. కలుగు, వచ్చు మొద లైనవి. అకర్మకా లయిన ఈధాతువులకు స్వార్థంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ అవుతుంది. **'మైత్రుడు** వచ్చెను' ఇక్కడ 'వచ్చెను' అనేది ప్రేరణం కాదు, అప్రేరణం అంటే స్వార్థం. ఇది 'రప్పించెను' అనేవిధంగా ప్రేరణార్థంలో ఉంటే - స్వార్థంలో కర్త అయిన మైత్రుడు అనేది (ప్రేరణంలో) కర్మగా మారుతుంది. 'చైత్రుడు **మైత్రుని** రప్పించెను' కర్మ కావటంచేత 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది.

**106. లాఁతిచో సహిత మిక్కార్యంబు కానంబడియెడి.** (క్రియ. 123)

'గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దకర్మాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇక్కార్యం' అంటే అప్రేరణంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ కావటం అనేకార్యం. పైసూత్రం ఈకార్యం గత్యర్థకధాతువులకు, బుద్ధ్యర్థకధాతువులకు, ప్రత్యవసానార్థకధాతువులకు, శబ్దకర్మా లయినధాతువులకు, అకర్మకధాతువులకు వస్తుం దని చెప్పింది. లాతిచో అంటే సూత్రం చెప్పిన గత్యర్థకాదులకంటె వేఱైన ధాతువులకు కూడ పైకార్యం రావటం కనిపిస్తున్న దని వివరణవాక్యానికి అర్థం.

'మైత్రుడు పుడమి నేలెను'. ఈవాక్యంలోని 'ఏలెను' అనేక్రియ అప్రేరణం. అంటే స్వార్థంలో ఉన్నది. దీనికి కర్త మైత్రుడు. 'చైత్రుడు మైత్రుని పుడమి నేలించెను'. ఇది ప్రేరణవాక్యం. ఇందులో మైత్రశబ్దం కర్మ అయింది. అందుకే 'కర్మంబున ద్వితీయ యగు' అని మైత్రశబ్దానికి ద్వితీయావిభక్తి వచ్చింది. కాని ఏలుధాతువు పైసూత్రం చెప్పినగత్యర్థకాదులలో ఏదీ కాదు. కాబట్టి ఈకార్యం రావడానికి వీలు లేదు. అయినప్పటికీ, అప్రేరణంలో కర్త అయినది ప్రేరణంలో కర్మ కావటం అనేసూత్రోక్త కార్యం వచ్చింది.

కాబట్టి ఈకార్యం సూత్రం చెప్పినవాటికంటె ఇతరస్థలాలలో రావటం కనబడుతున్న దని సూరి పైవివరణవాక్యంచేత స్పష్టం చేస్తున్నాడు.

**107. కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగా నగు.** (క్రియ. 124)

'అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

అనభిహితకర్త అంటే క్రియచేత చెప్పబడనికర్త. ఈకర్తకు 'చేతవర్ణకంబు కర్త కగు' అనేసూత్రంచేత 'చేత' అనేతృతీయావిభక్తి వస్తుంది. ఇటువంటిచోట్ల కర్తకు తృతీయకు బదులుగా షష్ఠి బహుళంగా వస్తుం దని పైసూత్రం చెపుతున్నది. అది కొన్నిచోట్ల నిత్యం కావడాన్ని ఈవాక్యం వివరిస్తున్నది. పైసూత్రంలోని బహుళపదంచేత ఆకార్యానికి కొన్నిచోట్ల ప్రవృత్తి. అని తాత్పర్యం.

కను మొద లైనధాతువులతో అన్వయం ఉన్నపుడు ప్రయోగింపబడిన (ప్రేరణం పొందినకర్తకు షష్ఠీవిభక్తి నిత్యంగా వస్తుంది. విశ్వామిత్రుడు రామునకు మిథిలం

గానిపించెను. ఇక్కడ కనుట అనేక్రియకు కర్త రాముడు. కాని విశ్వామిత్రునిచేత 'కనుట' అనేక్రియకు కర్తగా ప్రేరేపించబడడంచేత రాముడు ప్రయోజ్యకర్త. (రాముడు కనెను అన్నపుడు రాముడు స్వయంగా అంటే అప్రేరణంలో కర్త) ఇక్కడ కానిపించెను అనేప్రేరణక్రియచేత రాముడు అనేకర్త చెప్పబడటం లేదు కాబట్టి అనభిహితకర్త. కనుక 'అనభిహితకర్తకు..' అనేసూత్రంచేత షష్ఠి బహుళంగా వస్తుంది. బహుళం అనటంచేత ప్రస్తుతస్థలంలో షష్ఠి నిత్యంగా వస్తుంది. 'రామునకు కానిపించెను'. ఇక్కడ షష్ఠికి ప్రవృత్తి. కాబట్టి షష్ఠి రాకుండ 'విశ్వామిత్రుడు రామునిచేత కానిపించెను' అనేవిధంగా తృతీయతో రూపం ఉండదు. ఇతరస్థలాలలో ' రామునిచే మిథిల కనంబడియెను' అనేవిధంగా షష్ఠి రాక తృతీయతో రూపం ఉంటుంది.

**108. అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్మానుబంధంబులు లేమింజేసి రూపభేదంబు లయి దని యెఱుగునది.** (క్రియ. 124)

'అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

కర్మను గూర్చిన ఆకాంక్షలేనిధాతువు అకర్మకం. దీనికి స్వార్థంలో ఆత్మనేపదార్థం ఉండదు. అలాగే కర్మ లేదు కాబట్టి కర్మార్థమూ, ఉండదు. అందుచేత అకర్మక ధాతువుకు రూపాలు అయిదువిధాలుగా మాత్రమే ఉంటాయి. అని ఈవాక్యానికి అర్థం. అవి–

**1.** (స్వార్థ) **కర్త్రర్థకం.** స్వార్థంలో కర్తను బోధించేది.

మైత్రుడు **వచ్చెను.**

(స్వార్థంలో 1. కర్మార్థకం, 2. ఆత్మనేపద కర్త్రర్థకం, 3. ఆత్మనేపద కర్మార్థకం ఉండవు.)

**2. ప్రేరణకర్త్రర్థకం.** ప్రేరణార్థంలో కర్తను బోధించేది.

చైత్రుడు మైత్రుని **రప్పించెను.**

**3. ప్రేరణకర్మార్థకం**. ప్రేరణంలో కర్మను బోధించేది.

చైత్రునిచేత మైత్రుడు **రప్పింపబడెను.**

**4. ప్రేరణ ఆత్మనేపద కర్త్రర్థకం.** ప్రేరణంలో ఆత్మనేపదార్థంలో కర్తను బోధించేది.

చైత్రుడు మైత్రుని **రప్పించుకొనెను.**

**5. ప్రేరణ ఆత్మనేపద కర్మార్థకం.** ప్రేరణంలో ఆత్మనేపదార్థంలో కర్మను బోధించేది.

చైత్రునిచేత మైత్రుడు **రప్పించుకొనబడెను.**

స్వార్థంలో 1. **కర్మార్థం** లేకపోవటంచేత **రాబడెను,** 2. **ఆత్మనేపదకర్త్రర్థం** లేకపోవటంచేత **వచ్చుకొనెను,** 3. **ఆత్మనేపదకర్మార్థం** లేకపోవటంచేత **వచ్చుకొనబడెను** అనేరీతిరూపాలు ఉండవు. అందుచేత సకర్మకధాతువు ఎనిమిదిరూపాలు పొందుతుండగా, అకర్మకధాతువు అయిదు రూపాలు మాత్రమే పొందుతుంది.

**109. వెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు కలిగినచో సకర్మకంబునకుం బండ్రెండును, నకర్మంబునకుం దొమ్మిదియు భేదంబు లని యూహించునది.**

'అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు' అనేసూత్రంవివరణంలో ఈవాక్యం చెప్పబడింది.

'ప్రేరణంబునం దించుక్కుమీద నించుక్కు లేదు' అనేసూత్రంప్రకారం ప్రేరణార్థంలో వచ్చిన 'చుక్, పుక్, అనేఆగమాలమీద మళ్లీ ప్రేరణార్థంలో ఇంచుగాగమం వస్తుంది. కానీ, ఇంచుక్ అనేఆగమంమీద మాత్రం మళ్లీ ఇంచుగాగమం రాదు.

ప్రేరణార్థంలో ఒకఆగమం వచ్చినపుడు ఆధాతువు సకర్మకం అయితే, 8 రూపాలు, అకర్మకం అయితే 5రూపాలు అవుతాయి. ప్రేరణార్థంలో రెండవఆగమం వస్తే, సకర్మక ధాతువుకు 12రూపాలు, అకర్మకధాతువుకు 8రూపాలు అవుతాయి. అని ఈవివరణవాక్యానికి అర్థం. ఈఆగమాలు ఆచ్ఛికధాతువులకు మాత్రమే వస్తాయి. కాబట్టి ఈరూపభేదాలు ఆచ్ఛికధాతువులకే అని గ్రహించాలి.

**సకర్మకధాతువు – మాను.**

1. స్వరూపం — మానెను.
2. ప్రేరణార్థంలో చుక్ ఆగమం రాగా– — మానిచెను.
3. మళ్లీ ప్రేరణార్థంలో చుగాగమం మీద ఇంచుగాగమంతో — మానిపించెను.

   (పై మూడింటిమీద ఆత్మనేపదార్థంలో 'కొను' ధాతువు అనుప్రయుక్తం అవుతుంది.)
4. స్వరూపం మీద కొను – — మానుకొనెను
5. ప్రేరణంలో చుక్ అనేఆగమంమీద కొను – — మానిచికొనెను

6. చుక్ మీద వచ్చిన ఇంచుక్ ఆగమంమీద కొను - మానిపించికొనెను

(పై మూడింటిమీద కర్మార్థంలో 'పడు' చేరుతుంది.)

7. స్వరూపం మీద పడు - మానఁబడెను

8. ప్రేరణంలో చుక్ అనేఆగమంమీద పడు - మానుపఁబడెను

9. చుక్ మీద వచ్చిన ఇంచుక్ ఆగమంమీద పడు - మానిపింపఁబడెను

(ఆత్మనేపదార్థంలో 'కొను' ధాతువుమీద అంటే పైనిచూపిన 4,5,6స్థలాలలోనిమూడింటిమీద కర్మార్థంలో పడు అనుప్రయుక్తం అవుతుంది.)

10. స్వరూపం మీద కొను+పడు - మానుకొనఁబడెను

11. చుక్ ఆగమంమీద కొను+పడు - మానుచుకొనఁబడెను

12. చుక్ మీద ఇంచుక్కు, దానిమీద కొను+పడు - మానిపించుకొనఁబడెను

**అకర్మకధాతువు - మను**

1. స్వరూపం మనెను.

2. ప్రేరణార్థంలో చుక్ ఆగమం రాగా- మనిచెను.

3. మళ్లీ ప్రేరణార్థంలో చుక్ మీద ఇంచుగాగమంతో మనిపించెను.

('ప్రేరణార్థక ఆగమాలమీద ఆత్మనేపదార్థంలో 'కొను' ధాతువు అనుప్రయుక్తం అవుతుంది.)

4. ప్రేరణంలో చుక్ అనేఆగమంమీద కొను - మనిచికొనెను

5. చుక్ మీద వచ్చిన ఇంచుక్ ఆగమంమీద కొను - మనిపించికొనెను

(ప్రేరణార్థక ఆగమాలమీద కర్మార్థంలో 'పడు' ధాతువు అనుప్రయుక్తం అవుతుంది.)

6. ప్రేరణంలో చుక్ అనేఆగమంమీద పడు - మనుపఁబడెను

7. చుక్ మీద వచ్చిన ఇంచుక్ ఆగమంమీద పడు - మనిపింపఁబడెను

(ఆత్మనేపదార్థంలో 'కొను' ధాతువుమీద అంటే పైనిచూపిన 4,5,స్థలాలలోనిమూడింటిమీద

కర్మార్థంలో పడు అనుప్రయుక్తం అవుతుంది.)

8. చుక్ ఆగమంమీద కొను+పడు – మనుచుకొనఁబడెను

9. చుక్ మీద ఇంచుక్కు, దానిమీద కొను+పడు – మనిపించుకొనఁబడెను

# కృదంతపరిచ్ఛేదం

**1. ధాతువునకు విహితం బగుదుఞ్భిన్నప్రత్యయంబు కృత్తు నాఁబడు.** (కృదంత. 1)

'కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

దుఞ్ అనేప్రత్యాహారంచేత తెలియజేయబడేప్రత్యయాలకంటె వే రైనవీ, ధాతువు మీద విధింపబడినవీ అయినప్రత్యయాలకు కృత్తులు అని పేరు. 'లకారంబునకు దుద్రువురునుము ఙ్గు' అనేసూత్రంచేత విధింపబడిన దు,రు, వు,రు, ను,ము అనేప్రత్యయాలు, వీటిస్థానంలో వచ్చే 'ది,వి, దు,వు, ము,డుఙ్, ఎడు,త' మొద లైనవి దుఞ్ అనేప్రత్యాహారంచేత బోధింపబడతాయి. కాబట్టి ఇవి కాకుండా, ధాతువుమీద విధింపబడిన ఇతరప్రత్యయాలకు కృత్తులు అని సంజ్ఞ.

'టవర్ణకంబు భావంబునం దగు' అని విధింపబడిన 'ట' అనేప్రత్యయం దుఞ్ కంటే వే రైనది. ధాతువుమీద విధింపబడింది. కాబట్టి ఇది కృత్తు. ఇలాగే డు, ఎడి మొద లైనప్రత్యయాలు కృత్తులు. కృత్ప్రత్యయం చివర ఉన్నశబ్దానికి కృదంతం అని పేరు.

ధాతువుకంటె వేరేదానిమీద విధింపబడినప్రత్యయానికి కృత్తు అనేపేరు లేదు. రాముని. ఇక్కడ ని అనేప్రత్యయం కృత్తు కాదు. దుఞ్భిన్నం అనటంచేత 'లకారంబునకు' అని చెప్పబడిన దుఙ్ మొద లైనవి ధాతువుమీద విధింపబడినవే అయినా, వాటికి కృత్తు అనేపేరు ఉండదు. ప్రత్యయం అనటంచేత ఎడుక్, ఇంచుక్, మొద లైన ఆగమాలు, ధాతువుమీదే విధింపబడినా, దుఞ్భిన్నాలే అయినా ప్రత్యయాలు కాకపోవటంచేత కృత్తులు గావు.

**2. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృకర్మాద్యర్థంబులు మహాజనవ్యవహా రానుసారిగా నెఱుంగునది.** (కృదంత. 1)

'కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. ఈసూత్రం అర్థాన్ని వివరిస్తున్నది ఈవాక్యం.

ఈసూత్రానికి తరువాత ఆచ్ఛికశబ్దాలమీద వచ్చే వివిధకృత్ప్రత్యయాలు విధింప బడుతున్నాయి. తత్సమాచ్ఛికధాతువులు రెంటిపై వచ్చేకృత్తులను క్రియాపరిచ్ఛేదంలో

'టవర్ణకంబు భావంబునం దగు', 'వ్యతిరేకభావంబునందు మిఁజి యగు' ఇత్యాదిగా అవి ఏయేఅర్థాలలో వస్తాయో సూత్రంలోనే నిర్దేశించాడు. కాని ఆచ్ఛికధాతువులపై వచ్చేకృత్తులను కృదంతపరిచ్ఛేదంలో 'కవర్ణకం బలుగ్వాదుల కగు' ఇత్యాదిగా ప్రత్యయాలను చెప్పాడు కాని వాటిఅర్థాలను నిర్దేశించలేదు.

కాగా చెప్పబోయేఆయాకృత్తుల అర్థాన్ని - భావం, కర్త, కర్మ ఇత్యాదిగా ఆయాఅర్థాలను మహాజనవ్యవహారాన్ని అనుసరించి గ్రహించా లని ఈవాక్యం వివరిస్తున్నది.

**భావార్థం:** ఆఁగుధాతువుపై 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత 'క' ప్రత్యయం వచ్చి, 'ఆఁక' అని అవుతుంది. దీనికి బంధనం అని అర్థం. అంటే ఇక్కడ కృత్తు భావార్థంలో వచ్చిం దని గ్రహించాలి.

**కర్త్రర్థం:** మొలచు అనేధాతువుమీద పైసూత్రంచేతనే 'క' ప్రత్యయం వచ్చి, మొలచు+క=మొలక అని అవుతుంది. దీనికి మొలచునది అని అర్థం. అంటే ఇక్కడ కప్రత్యయం కర్తను బోధిస్తూ కర్త్రర్థంలో వచ్చింది.

**కర్మార్థం:** కోరుధాతువుమీద 'ఇకవర్ణకం బంజ్వాదుల కగు' అనేసూత్రంచేత 'ఇక' ప్రత్యయం వచ్చి, 'కోరిక' అని అవుతుంది. దీనికి వాంఛితం అంటే కోరబడినది అని అర్థం. కాగా ఇక్కడ ఇకప్రత్యయం కర్మార్థంలో వచ్చింది. కోరిక అంటే వాంఛ అని కూడా అర్థం. అది భావార్థం. అంటే ఆసూత్రంచేత అదే ధాతువుమీద ఇక అనేప్రత్యయం కర్మార్థంలోనూ, భావార్థంలోనూ వచ్చింది.

ఇలా ఒకేప్రత్యయం వేరువేరుధాతువులమీద, ఒకేధాతువుమీద వేరువేరు అర్థాలలో వస్తుండటంచేత, దాన్ని ఎక్కడి కక్కడ సూత్రబద్ధం చేయటంలో గౌరవం కలుగుతుంది. కాబట్టి కృత్ప్రత్యయాలకు అర్థాలను మహాజనవ్యవహారానుసారంగా గ్రహించా లని చెప్పబడింది.

**3. కృత్సంబంధు లగుకాదులు పరంబు లగునపుడు ధాతువునంతంబు లగు క,గ,చ,య,వ, లకు లోపం బగు.** (కృదంత. 2)

'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం. పైసూత్రం అర్థాన్ని ఇది వివరిస్తున్నది.

చూ. సూత్రవ్యాఖ్య.

**4. ఇట బిందులోపంబు.** (కృదంత. 3)

'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

ఎఱుఁగు అనేధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత కప్రత్యయం వచ్చి ఎఱుఁగు+క. అని కాగా, 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరి 'గు'వర్ణం లోపించి, ఎఱుఁ+ క అని అవుతుంది. ఆస్థితిలో (ఇట=) కప్రత్యయం పరంగా ఉండగా పూర్వంలో ఉన్న (బిందులోపంబు=) అరసున్నకు లోపం వస్తుం దని ఈవివరణవాక్యం పేర్కొంటున్నది. అలా అరసున్న లోపించగా, ఎఱుక అని అవుతుంది.

**4. ఇట్లు కొన్నింట నెఱుంగునది.** (కృదంత. 3)

'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

(ఇట్లు=) ఎఱుఁగు ధాతువునకు 'క' ప్రత్యయం పరంగా ఉండగా ముందున్న సున్నకు లోపం రావటం అనేకార్యం, 'ఎఱుఁగు' ధాతువుమీదనే కాక మరి కొన్ని ఇతరధాతువులలో కూడ కలుగుతున్న దని గ్రహించాలి. అని ఈవివరణవాక్యానికి అర్థం.

కడఁగు అనేధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత కప్రత్యయం వచ్చి కడఁగు+క. అని కాగా, 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరి 'గు'వర్ణం లోపించి, కడఁ+ క అని అవుతుంది. ఆస్థితిలో ప్రస్తుతవివరణంచేత కప్రత్యయం పరంగా ఉండగా పూర్వంలో ఉన్నఅరసున్న లోపించి, 'కడక' అని అవుతుంది.

ఇలాగే తునుఁగు-తునుక, మునుఁగు-మునుక ఇత్యాదులలో కూడ కప్రత్యయం పరంగా ఉండగా ముందరిబిందువు లోపిస్తుంది.

**5. వచ్చునకు రా.** (కృదంత. 3)

'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

పైసూత్రంచేత 'క' ప్రత్యయం రాగా దానికి ముందు ఉన్న 'వచ్చు' ధాతువుస్థానంలో 'రా' అని ఆదేశం అవుతుంది అని ఈవాక్యానికి అర్థం.

వచ్చు ధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత క ప్రత్యయం వచ్చి, వచ్చు+క, అని ఉండగా, ప్రస్తుతవివరణంచేత వచ్చు ధాతువుస్థానంలో 'రా' అనేది ఆదేశంగా వచ్చి 'రాక' అనేరూపం ఏర్పడుతుంది. కృదంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి, 'రాక' అనేప్రథమైకవచనాంతపదం ఏర్పడుతుంది.

**6. ఇకకపులు పరంబు లగునపుడు కనునకు దీర్ఘం బగు.** (కృదంత. 3)

'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

1. ఇక, 2. క, 3. పు అనేకృత్ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు పూర్వంలో ఉన్న 'కను' అనేధాతువులో మొదటిహ్రస్వానికి దీర్ఘం వస్తుం దని ఈవివరణవాక్యానికి అర్థం.

కను ధాతువుమీద 'ఇకవర్ణకం బంజ్వాదుల కగు' అనేసూత్రంచేత ఇకప్రత్యయం వచ్చి కను+ఇక అని ఉండగా ప్రస్తుతవివరణంచేత కనులో కవర్ణంమీది అకారానికి దీర్ఘం వచ్చి, కాను+ఇక, అపదాదిస్వరసంధి జరిగి 'కానిక' అని అవుతుంది.

కను ధాతువుమీద 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అని క ప్రత్యయం వచ్చి కను+క, అని ఉండగా ప్రస్తుతవివరణంచేత కనులో కవర్ణంమీది అకారానికి దీర్ఘం వచ్చి, కాను+క = కానుక అని అవుతుంది.

కనుధాతువుమీద 'పువర్ణకంబు మాయ్వాదుల కగు' అని 'పు' ప్రత్యయం వచ్చి, కను+పు అని ఉండగా ప్రస్తుతవివరణంచేత కనులో కవర్ణంమీది అకారానికి దీర్ఘం వచ్చి, కాను+పు=కానుపు అని అవుతుంది.

**7. కినియు ముదియుల కుత్వంబు నగు.** (కృదంత. 3)

'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంవివరణంలోనిది ఈవాక్యం.

'క' అనేకృత్ప్రత్యయం పరంగా ఉన్నపుడు పూర్వంలో ఉన్న కినియు, ముదియు అనేధాతువులలో చివరిఇత్వం స్థానంలో ఉత్వం వస్తుం దని ఈవివరణవాక్యానికి అర్థం.

కినియు, ముదియు ధాతువులు అలుగ్వాదులలోవి. కాబట్టి 'కవర్ణకం బలుగ్వాదుల కగు' అనేసూత్రంచేత 'క' ప్రత్యయం వచ్చి– కినియు+క. అని ఉండగా 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు'

అనేసూత్రంచేత చివరి యు వర్ణం లోపించి, కిని+క. అని కాగా, ప్రస్తుతవివరణంచేత నివర్ణంలోని ఇత్వానికి ఉత్వం వచ్చి, 'కినుక' అని అవుతుంది. అలాగే ముదియు ధాతువుమీద కప్రత్యయం వచ్చి, ముదియు+క = ముది+క, అని కాగా, ఉత్వం వచ్చి 'ముదుక' అని అవుతుంది. కృదంతా లయిన ఈప్రాతిపదికలు స్త్రీసమాలు. కాబట్టి ప్రథమైకవచనం లోపిస్తుంది.

**8. అనుప్రయుక్త మయినయాటశబ్దము ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు.**
(కృదంత. 7)

'టవర్ణకం బాడ్వాదుల కగు, నగుచో నంతలోపం బగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అనుప్రయుక్తం అంటే వేరొకశబ్దం మీద చేర్చి ప్రయోగింపబడింది. ఇలా అనుప్రయుక్తం అయిన 'ఆట' అనేశబ్దం తఱుచుగా క్లీబసమం అవుతుం దని ఈవాక్యానికి అర్థం.

పోరు అనేశబ్దంమీద ఆడు ధాతువు అనుప్రయుక్తం అయి 'పోరాడు' అని ఏర్పడిన శబ్దపల్లవంలోని ఆడుధాతువుమీద పైసూత్రంచేత 'ట' ప్రత్యయం వచ్చి, 'పోరాడు+ట' అని ఐ, ఆసూత్రంచేతనే ఆడు ధాతువులో చివరిఅక్షరం లోపించి, 'పోరాట' అని అవుతుంది. కృదంతం అయిన ఈశబ్దం ప్రాతిపదికం. 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనేసూత్రంచేత ఇటువంటిప్రాతిపదికలు క్లీబసమాలు అవుతాయి. క్లీబసమత్వాతిదేశంచేత వీటిపై ప్రథమావిభక్తి ఏకవచనంలో 'అమహ న్నపుంసకముల కదంతములకు ముపర్ణకం బగు' అనేసూత్రంచేత ముప్రత్యయం వస్తుంది. పోరాటము. ఇలాగే కోలాటము మొ.

'అనుప్రయుక్త మైన ఆటశబ్దము' అనటంచేత అనుప్రయుక్తం కాకుండా ప్రత్యేకంగా ఉన్న ఆటశబ్దం క్లీబసమం కాదు.'ఆచ్ఛికశబ్దంబు లెల్ల స్త్రీసమంబులును' అనేసూత్రంచేత స్త్రీసమం అవుతుంది. దానిమీద 'స్త్రీలింగంబులప్రథమైకవచనంబునకు లోపం బగు' అనేసూత్రంచేత ప్రథమైకవచనం లోపిస్తుంది. ఆట.

'తఱుచుగా' అనటంచేత అనుప్రయుక్తం అయిన ఆటశబ్దం కూడా కొన్నిచోట్ల క్లీబసమం కాకపోవచ్చును. అపుడు అవి స్త్రీసమాలు అవుతాయి. స్త్రీసమం అయితే ప్రథమైకవచనం లోపిస్తుంది. చెర్లాట, నవ్వులాట మొ.

**9. కలియున కత్వంబు నగు.** (కృదంత. 8)

'పవర్ణకంబు తిరియ్యాదుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

కలియు అనేధాతువుకు 'ప' అనేప్రత్యయంతోపాటు అది పరంగా ఉండగా, ధాతువుచివరిఇత్వానికి ఉత్వం గూడ వస్తుం దని ఈవాక్యానికి అర్థం.

కలియు ధాతువుమీద 'పవర్ణకంబు తిరియ్యాదుల కగు' అనేసూత్రంచేత ప అనేప్రత్యయం వచ్చి – కలియు+ప. అని ఉండగా, 'ఇటం గృత్కగతపవేములు పరంబు లగునపుడు కగచయవలకు లోపం బగు' అనేసూత్రంచేత ధాతువుచివరి యువర్ణం లోపించి, కలి+ప అని కాగా ప్రస్తుతవివరణంచేత ముందరి ఇత్వానికి అత్వం వచ్చి, 'కలప' అని అవుతుంది. కృదంతం అయిన ఈప్రాతిపదికలు క్లీబసమాలు. కాబట్టి ప్రథమైకవచనంలో ముప్రత్యయం వచ్చి, 'కలపము' అని అవుతుంది.

**10. తూను తూఁగున కగు.** (కృదంత. 12)

'ఇకవర్ణకం బంజ్యాదుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'ఇక' ప్రత్యయం పరంగా ఉండగా, 'తూఁగు' అనేధాతువుస్థానంలో 'తూను' అనేది ఆదేశంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం.

తూఁగు అనేధాతువుమీద 'ఇకవర్ణకం బంజ్యాదుల కగు' అనేసూత్రంచేత 'ఇక' ప్రత్యయం వచ్చి, తూఁగు+ఇక. అని ఉండగా, ప్రస్తుతవివరణంచేత తూఁగు అనేధాతువుస్థానంలో తూను అనేది ఆదేశంగా వచ్చి 'తూను+ఇక' అని ఉండగా, అపదాదిస్వరసంధి జరిగి 'తూనిక' అని అవుతుంది. కృదంతం అయిన ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి ప్రథమైకవచనం లోపించి, 'తూనిక' అనేపదం ఏర్పడుతుంది.

**11. చూడు చూచున కగు.** (కృదంత. 16)

'ఇకి కోర్వాదుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఇకి ప్రత్యయం పరంగా ఉండగా ముందరి చూచు అనేధాతువుస్థానంలో చూడు అనేశబ్దం ఆదేశంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం. ఇకి అనేఈప్రత్యయం ముత్తు కాకపోవటంచేత 'అగువచ్చుచొచ్చుచూచులకు ముత్తు పరం బగునపుడు కా రా చొరు చూడు లగు' అనేసూత్రంచేత 'చూడు' అనేఆదేశం ప్రాప్తింపకపోవటంచేత ఇలా వివరింపబడింది.

చూచు ధాతువుమీద 'ఇకి కోర్వాదుల కగు' అనేసూత్రంచేత ఇకిప్రత్యయం వచ్చి, 'చూచు+ఇకి' అని ఉండగా, ప్రస్తుతవివరణాన్ని అనుసరించి చూచుధాతువు స్థానంలో 'చూడు' ఆదేశంగా వచ్చి, చూడు+ఇకి. అపదాదిస్వరసంధి జరిగి, 'చూడికి' అని అవుతుంది. కృదంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం. కాబట్టి దీనిమీద ప్రథమైకవచనం లోపిస్తుంది.

**12. వండుడకారంబు టకారం బగు.** (కృదంత. 19)

'అకవర్ణకంబు మాఱ్వాదుల కగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'అక' ప్రత్యయం పరంగా ఉండగా ముందరి వండు ధాతువులోనిడకారంస్థానంలో టకారం ఆదేశంగా వస్తుం దని ఈవాక్యానికి అర్థం.

వండు ధాతువుమీద 'అకవర్ణకంబు మాఱ్వాదుల కగు' అనేసూత్రంచేత అక ప్రత్యయం వచ్చి, వండు+అక. అని ఉండగా ప్రస్తుతవివరణాన్ని అనుసరించి వండులో డకారానికి టకారం ఆదేశం అయి, వంటు+అక. అపదాదిస్వరసంధి జరిగి, 'వంటక' అని అవుతుంది. కృదంతం ఐన ఈప్రాతిపదికం 'ఆచ్ఛికశబ్దంబు లెల్లం దఱుచుగ స్త్రీసమంబులును గ్లీబసమంబులు నయియుండు' అనేసూత్రంచేత క్లీబసమం. కాబట్టి ప్రథమైకవచనంలో 'అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకం బగు ' అని మువర్ణకం వచ్చి 'వంటకము' అని అవుతుంది.

**13. వ్యతిరేకంబున లేవడి.** (కృదంత. 22)

'వడిప్రభృతు లి ట్లెఱుంగునది' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'వడి' అనేప్రత్యయం పరంగా ఉండగా, ముందు 'ఉన్న' అనేఅర్థాన్ని తెలిపే 'కలుగు' అనేధాతువుస్థానంలో 'కలుగున కస్త్యర్థంబున లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు' అనేసూత్రంచేత 'లే' అనేఆదేశం వస్తుం దని ఈవాక్యానికి అర్థం.

అస్త్యర్థం ఇచ్చేసందర్భంలో కలుగు అనేధాతువుమీద 'వడిప్రభృతు లి ట్లెఱుంగునది' అనేసూత్రంచేత వడి ప్రత్యయం వచ్చి, కలుగు+వడి. అని ఉండగా, 'కలుగున కస్త్యర్థంబున లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు' అనేసూత్రంచేత కలుగుధాతువు స్థానంలో 'లే' అనేఆదేశం వచ్చి 'లేవడి' అని అవుతుంది.కృదంత మైన ఈప్రాతిపదికం స్త్రీసమం కాబట్టి దీనిమీద ప్రథమైకవచనం

లోపిస్తుంది.

'లే' అనేఆదేశం రానిసందర్భంలో అంటే సంభవించు మొద లైన ఇతరఅర్థాలను తెలిపేటపుడు 'వడి' ప్రత్యయం గూడ లేదు. సంభవించకుండుట అనేఅర్థంలో 'కలుగమి' అనేవిధంగా మిజీ ప్రత్యయం మాత్రమే వస్తుంది. 'కలుగువడి' అనేతీరుగా వడిప్రత్యయం రాదు. అస్త్యర్థంలో మిజీతో 'లేమి' అనేరూపం కూడా ఉంటుంది.

# ప్రకీర్ణకపరిచ్ఛేదం

**1. అతఁడు ఋషి. ఇట సంధి లేదు.** (ప్రకీ. 1)

'పదాద్యంబులు ఋ(లు)వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

అతడు+ఋషి అని ఉండగా అచ్చు పరంగా ఉన్నా సంధి రా దని ఈవాక్యానికి అర్థం.

అతడు+ఋషి అనేచోట 'అతడు' లో చివర ఉన్న హ్రస్వ మైనఉకారానికి ఋకారం అచ్చు పరంగా ఉండటంచేత 'ఉత్తునకు అచ్చు పరం బగునపుడు సంధి యగు' అనేసూత్రంచేత సంధి రావలసిఉంది. కాని 'పదాద్యంబులు ఋ(లు) వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రాన్ని అనుసరించి ఇక్కడ 'ఋషి' శబ్దంలో మొదట ఉన్నఋకారం రేఫతో సమానం. ఈరేఫ హల్లు. ఋకారం అ చ్చయినా, రేఫతుల్యం కావటంచేత హల్లువంటిది కాగా, హల్లు పరంగా ఉండటంవల్ల 'అచ్చు పరం బగునపుడు' చెప్పినసంధి రాదు. కాబట్టి అతదృషి అని కాదు. సంధి లేకపోతే 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అని యడాగమం రావాలి. కాని పరం బయిన స్వరంబునకు చెప్పినయడాగమం కూడా హల్లువంటి దైన ఋకారానికి రాదు. కాబట్టి 'అతడు ఋషి' అని అలాగే ఉంటుంది.

**2. ఆఋషి. ఇట యడాగమము లేదు.** (ప్రకీ. 1)

'పదాద్యంబులు ఋ(లు)వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

ఆ+ఋషి అని ఉండగా స్వరం పరంగా ఉన్నా, యడాగమం రా దని ఈవాక్యానికి అర్థం.

ఆ+ఋషి అని ఉండగా ఇక్కడ సంధి ఏలక్షణం ప్రకారం గూడా ప్రాప్తించక పోవటంచేత 'సంధి లేనిచోట స్వరంబుకంటెం బరం బయినస్వరంబునకు యడాగమం బగు' అనేసూత్రంచేత పరంగా ఉన్న స్వరం ఋకారానికి ముందు యడాగమం

రావలసిఉంది. కాని 'పదాద్యంబులు ఋ(లు)వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రాన్ని అనుసరించి ఇక్కడ 'ఋషి' శబ్దంలో మొదట ఉన్నఋకారం రేఫతో సమానం. ఈరేఫ హల్లు. ఋకారం అ చ్చయినా, రేఫతుల్యం కావటంచేత హల్లు వంటిది. కాగా హల్లు పరంగా ఉండటంవల్ల 'పరం బయినస్వరంబునకు' చెప్పిన యడాగమం హల్లువంటి దైనఋకారానికి రాదు. కాబట్టి 'ఆయృషి' అని కాదు. 'ఆఋషి' అని అలాగే ఉంటుంది.

**3. వచ్చె ఋషి, వచ్చెన్ ఋషి, వచ్చెను ఋషి.**
**ఇట ద్రుతమునకు లోపసంశ్లేషస్వత్వములు.** (ప్రకీ. 1)

'పదాద్యంబులు ఋ(లు)వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రం వివరణం లోనిది ఈవాక్యం.

వచ్చెను+ఋషి అని ఉండగా అచ్చు పర మయినప్పటికీ ద్రుతానికి లోపసంశ్లేష స్వత్వాలు వస్తా యని ఈవాక్యానికి అర్థం.

వచ్చెను+ఋషి అని ఉండగా, చూడన్+అయితి=చూడ నయితి అని అయినట్లుగా, వచ్చెన్+ఋషి = వచ్చెన్ ఋషి అని మాత్రమే రూపం కావలసిఉంది. కాని 'పదాద్యంబులు ఋ(లు) వర్ణంబులు రలతుల్యంబులు' అనేసూత్రాన్ని అనుసరించి ఇక్కడ 'ఋషి'శబ్దంలో మొదట ఉన్నఋకారం రేఫతో సమానం. ఈరేఫ పరుషసరళాలకంటె వే రయినహల్లు కాబట్టి స్థిరం. కాగా ఇక్కడ ద్రుతానికి స్థిరం పరంగా ఉన్న ట్లయింది. అందుచేత 'వచ్చెను+ ఋషి' అని ఉండగా, 'ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోపసంశ్లేషంబులు విభాష నగు' అనేసూత్రంచేత ద్రుతానికి లోపం వస్తే – 'వచ్చె ఋషి' అని అవుతుంది. లోపం రానిపక్షంలో సంశ్లేషం వచ్చి, 'వచ్చెన్ ఋషి' అని అవుతుంది. విభాష కావటంచేత సంశ్లేషం కూడ రానిపక్షంలో స్వత్వం వచ్చి, 'వచ్చెను ఋషి' అని ఉంటుంది. ఇలా పదం మొదటి ఋ(లు)లు పరంగా ఉన్నపుడు ద్రుతానికి స్థిరం పరంగా ఉన్నప్పటిలాగ లోపసంశ్లేష స్వత్వాలు వస్తా యని ఈవివరణవాక్యానికి తాత్పర్యం.

**4. వక్ష్యమాణంబు యద్విత్వంబు.** (ప్రకీ. 4)

'ఊయేలయూయాలలచాఁపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

ఊయేల మొదలైనవాటిలో యకారానికి ద్విత్వం చెప్పబడబోతున్నది అని ఈవాక్యానికి అర్థం.

ఊయేల, ఊయాల అనేశబ్దాలకు 'ఊయేలయూయాలలచాఁపుల నొండొంటికిం గుఱుచ యొండె నగు' అనేసూత్రంచేత హ్రస్వం వికల్పంగా రాగా ఏర్పడిన (ఉయేల) ఊయెల, ఊయేల. (ఉయాల) ఊయల, ఊయాల అనేరూపాలు ఊయేలాదులలో చేరిఉన్నాయి. కాబట్టి 'ఊయేలాదులం దొలియచ్చుమీఁదిహల్లునకు ద్విర్వచనం బొండె నగు' అనేసూత్రంచేత 'ఊ'కారానికి పైని ఉన్నయకారానికి ద్విత్వం వికల్పంగా వస్తుంది. ద్విత్వం వచ్చినపక్షంలో ఊయ్యెల, ఊయ్యల, ఊయ్యేల, ఊయ్యాల అని కాగా, 'ద్విరుక్తం బగుబల్లు పరం బగునపు డాచ్ఛికం బగుదీర్ఘంబునకు హ్రస్వం బగు' అనేసూత్రంచేత ముందరి ఊకారం దీర్ఘానికి హ్రస్వం వచ్చి, ఉయ్యెల, ఉయ్యల, ఉయ్యేల, ఉయ్యాల అనేరూపాలు ఏర్పడతాయి. వికల్పం అనటంచేత ద్విత్వం రానిపక్షంలో హ్రస్వం కూడా రాదు. కాబట్టి ఊయెల, ఊయల, ఊయేల, ఊయాల, అనేరూపాలు ఉంటాయి.

**5. పూనుపొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు.**

(ప్రకీ. 10)

'హాదులయు నీలుగు లోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

తెలుగులో పూను, ఊను, పొదవు, ఒదవు అనుధాతువులు ఉన్నాయి. అప్పకవి 'పూను పొదవు' అనేధాతువులలో మొదటిహల్లు లోపిస్తుం దని చెప్పాడు. అంటే (పూను)ఊను, (పొదవు) ఒదవు అనేధాతువులు పూనుపొదవులనుండి పకారం లోపించగా ఏర్పడ్డా యని అప్పకవిఅభిప్రాయం.

కాని వీటికి అర్థభేదం ఉన్నది. 'పూను' అనేధాతువుకు 'ఉద్యమించు' అని అర్థం. 'ఊను'ధాతువుకు ఆను, కొను మొద లైనవి అర్థాలు. అలాగే 'పొదవు' ధాతువుకు క్రమ్ముకొను మొద లైనవి అర్థాలు. 'ఒదవు' ధాతువుకు 'సంభవించు' మొద లైనవి అర్థాలు. పూనుపొదవులలో మొదటిహల్లు లోపించటంచేతనే ఊను, ఒదవు అనేధాతువులు ఏర్పడి ఉంటే, పూను–ఊను, పొదవు–ఒదవు అనేవి సమానార్థకాలు కావాలి. కాని అర్థంలో భేదాన్నిబట్టి ఊను,ఒదవులు ప్రత్యేకంగ ఉన్న వేరేధాతువులే కాని, పూనుపొదవులనుండి యేర్పడినవి కావు. కాబట్టి అప్పకవి

అర్థాన్ని గురించిన ఈఆలోచన చేయక, శబ్దస్వరూపాన్ని మాత్రం అనుసరించి ఆవిధంగా చెప్పాడు. సరిగా విచారింపక చెప్పినమాట. కాబట్టి పూనుపొదవులలో మొదటి హల్లు లోపిస్తుం దనే అప్పకవిమాట గ్రహింపదగినది కా దని చిన్నయసూరి తాత్పర్యం. అందుచేత పూనుపొదవులు నీలుగు లోనగువానిలో చేరవు. కాబట్టి 'హాదులయు నీలుగు లోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగా నగు' అనేసూత్రంచేత పూనుపొదవులలో తొలిహల్లు లోపించదు.

**6. ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకంబులకుఁ జూపట్టెడు.**
(ప్రకీ. 16)

'పదాంతంబు లయి యసంయుక్తంబు లయిననులురులయుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు' అనేసూత్రం వివరణంలోనిది ఈవాక్యం.

'పదాంతంబు లయి' అనేపైసూత్రం పదంచివర అసంయుక్త మైఉన్న 'నులురు' అనేవర్ణాలలోనిఉకారానికి బహుళంగా లోపం చెప్తున్నది. వీటికి అచ్చు పర మైతే ఉత్వసంధి వస్తుంది. కాబట్టి ప్రస్తుతసూత్రం విధించిన ఉత్వలోపం హల్లు, లేదా అవసానం పరంగా ఉన్నపుడు వస్తుంది. కాని నులురు అనేవాటిలో నురు అనేవర్ణాలు రెంటిలో మాత్రం హల్లు పరంగా ఉన్నపుడు మాత్రమే ఈలోపం తఱచుగా వస్తుంది అని పైవివరణవాక్యానికి అర్థం. మ్రాను+పడు. వత్తురు+వారు. ఇక్కడ హల్లు పరం అయింది. కాబట్టి ఉత్వం లోపించి, మ్రాన్పడు, వత్తు ర్వారు అనేరూపాలు (వికల్పంగా) అవుతాయి. మ్రాను+అది, వత్తురు + ఇపుడు. అనేవిధంగా అచ్చు పర మైతే ఉత్వసంధి జరుగుతుంది. మ్రా నది, వత్తు రిపుడు.

హల్లు పరంగా ఉన్నపుడు ప్రాయికం అనటంచేత అవసానం పరంగా ఉన్నపుడు అరుదు అని అర్థం అవుతున్నది. ద్రుతం కాని నువర్ణంలో అవసానంలో ఉత్వలోప అసలు కనబడదు. రువర్ణం ప్రత్యయ మైతే మాత్రం అరుదుగా ఉత్వలోపం కనబడుతున్నది. పలువుర్ మొ. సూరి వివరించిన ఈఅర్థం సూత్రంలోని బహుళపదం చేత సిద్ధిస్తున్న దని గ్రహించాలి.

'నురులకు' అనటంచేత మిగిలిన లువర్ణంలో మాత్రం అవసానం పర మైపుడు కూడా హల్లు పర మైనప్పటిలాగానే ఉత్వం లోపిస్తుంది. (విలు+పూని = విల్పూని) రాములు–రాముల్ మొద లైనవి.

00000